
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ సప్తగిరి వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సప్తగిరి వెబ్ సైట్: https://www.scribd.com/search?query=sapthagiri
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## సప్తగిరి వారి వెబ్ సైట్

**https://www.scribd.com/search?query=sapthagiri**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నిన్ను నమ్మి విశ్వాసము - నీపై నిలుపుకొని
ఉన్నవాఁడనిఁక వేరే - ఉపాయ మేమిటికి?

గతియై రక్షింతువో - కాక రక్షించవో యని
మతిలోని సంశయము - మఱి విడిచి,
యితరులచే ముందర - నిఁక నెట్టౌదునో యని
వెతతోడఁ దలచేటి - వెఱపెల్లా విడిచి ॥

తిరమైన నీ మహిమ - తెలిసేవాఁడ ననే
గరువముతోడి వుద్యో - గము విడిచి
వెరవున నీరూపు - వెదకి కానలే ననే
గరిమ నలపు నాస్తి - కత్వమును విడిచి ॥

ధ్రువమైన నాచేఁతకు - తోడు దెచ్చుకొనే ననే
అవల నన్యులమీఁది - యాస విడిచి
వివరించలమేల్మంగ - విభుఁడ శ్రీవేంకటేశ
తవిలితి నా పుణ్యమం - తయు నీకు విడిచి ॥

(2-202)



భగవంతునిపై నిండునమ్మకం గలవారికి తక్కిన ఉపాయాలతో పనిలేదని అన్నమయ్య పై సంకీర్తనలో చెప్పాడు. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని భగవానుడు చెప్పినట్లు శ్రద్ధాళువైనవాడే జ్ఞానాన్ని పొందగలడు. శ్రద్ధతో నమ్మకం ముడిపడి ఉంది. విశ్వాసం లోపించిన వాడు సంశయాత్ముడౌతాడు. సంశయాత్మునికి ఇహపరాలు లేవని గీత చెబుతోంది. కాబట్టి స్వప్రయత్నం మీద పూర్ణవిశ్వాసం కలిగి పుణ్యకర్మ ఫలాలను భగవంతునికి సమర్పించి బంధమోక్షానికి ప్రయత్నించాలి.



పాఠకులకు, రచయితలకు, ఏజెంట్లకు,
శ్రేయోభిలాషులకు, అందరికీ
## తెలుగు నూతన సంవత్సర
## ఉగాది శుభాకాంక్షలు

శ్రీనివాసుని కరుణాకటాక్షవీక్షణాలు
అందరిపై ప్రసరించాలని,
అందరికీ ఆ దేవదేవుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు
ప్రసాదించాలని ప్రార్థిస్తూ......

సర్వేజనా స్సుఖినో భవంతు - **సప్తగిరి**

### మే నెల పండుగలు

- 06 - పరశురామ జయంతి
- 16 - తరిగొండ వెంగమాంబ జయంతి
- 17 - శ్రీ కూర్మ జయంతి
  - తిరుపతి గంగ జాతర
  - అన్నమాచార్య జయంతి
- 27 - శ్రీ హనుమజ్జయంతి

# మీ మాట

### ముఖాముఖీ....

సప్తగిరి పత్రికను చదివిన మాకు దేవునితో ముఖాముఖి మాట్లాడినట్లు అన్పిస్తోంది. ఇందులో ప్రచురించే కొన్ని శీర్షికలను ప్రతి సంవత్సరం ఏ శీర్షికకు ఆ శీర్షికను విడిగా బైండు చేయించుకుని భద్రపరచుకుంటున్నాను.

**– సత్యనారాయణమూర్తి, రాజమండ్రి.**

### ప్రతి పేజీ తప్పకుండా....

సప్తగిరి మాసపత్రిక యూనిట్ వారందరికీ మా ధన్యవాదాలు. మీరు ప్రచురించే ఆధ్యాత్మిక ధారావాహికలు, పిల్లలకోసం బాలప్రబోధం, బాలవాక్కు, స్త్రీలకోసం గృహలక్ష్మి, అక్షరామృతం వ్యాసాలు ఒక్క మాటలో చెప్పాలంటే సప్తగిరి ప్రతి పేజీ తప్పకుండా చదవదగ్గ ఈ పత్రిక మాకెంతగానో నచ్చిందనడం అతిశయోక్తి కాదు.

**– ఎస్.కృష్ణమాచార్యులు, ప.గో.జిల్లా.**

### వర్ణచిత్రాలు !

జనవరి 2011 సప్తగిరి మాసపత్రికలో క్యాలెండరు, దేవుని చిత్రాలతో చాలా అందంగా ఉంది. అలాగే చివరి పుటలో శ్రీమత్స్యావతార మూర్తి వర్ణచిత్రం ఇంకా బాగుంది. ఇంత మంచి వర్ణచిత్రాలను, భగవంతునికి సంబంధించిన వ్యాసాలను ప్రచురించి మమ్మల్ని భక్తిభావం వైపు మరలిస్తున్నందుకు మా కృతజ్ఞతలు.

**– జి.సుధాకర్, వరంగల్లు.**

### చిరుజల్లులు కురిసినట్లు...

ప్రాచీన సంప్రదాయ పునరుద్ధరణలో భాగంగా శ్రీవారి కార్తిక వన భోజనమహోత్సవాన్ని సప్తగిరి సంపాదకీయంలో చక్కగా వివరించారు. 'వేదం తెలుసుకుందాం'లో అపురూపమైన స్త్రీ జీవితాన్ని నారీ లోకానికి స్ఫూర్తిదాయకంగా అందిస్తున్నందుకు రచయితకు అభినందనలు. కనులకు ఇంపైన అమ్మవారి కార్తిక బ్రహ్మోత్సవ చిత్రాలు మండువేసవిలో చిరుజల్లులు కురిసినట్లున్నది.

**– లొల్లా రమాదేవి, వేటపాలెం.**


Godhra-389001
02-02-2011

S.E (Telugu) 7.2.11

శ్రీవారి కొలువులో ప్రధాన భూమిక పోషిస్తోన్న
ప్రధాన సంపాదకుల వారికి
నమస్కారములతో !

నూతన వర్షారంభ సమయములో శ్రీవారి మాసపత్రిక అయిన సప్తగిరి - జనవరి సంచిక నుండి ప్రారంభించిన "వేదం - తెలుసుకుందాం" శీర్షిక చాలా ప్రశంసించదగినది. భారతీయులకు మాత్రమే సొంతమైన జ్ఞాన భాండాగారం - వేదం. అట్టి "వేదం" గురించి అవగాహన కల్పించడము చాలా సంతోషదాయకంగా ఉంది. అలాగే మీరు ప్రారంభించిన "మందార మకరందాలు" శీర్షిక కూడా ఆనంద కరంగా ఉంది. [illegible] మరియు వాటి ప్రయోజనం - చాలా బాగుంది.

మీరు, శ్రీ లక్ష్మీ నరసింహ శతకము నుండి ఒకొక్క పద్య పరిచయము ప్రతి మాసంలో చేయగలరని నా మనవి.

K. సత్యనారాయణరావు
గోధ్రా, గుజరాత్

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



జీవితమంటే గడిచిన ఏళ్ళు కాదు,
సాధించిన సత్కార్యాలు

# సప్తగిరి


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 41 ఏప్రిల్, 2011 సంచిక : 11





గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.
ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.
సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ
ముద్రాపకుడు :
ఎం. కార్తీక్, ఎం.ఏ., ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.
డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి
కార్యాలయం, తి.తి.దే., తిరుపతి
వర్ణచిత్రాల లే-అవుట్ : పి. శివప్రసాద్


ముఖ చిత్రం :
చందనాభిషేకంలో శ్రీ భూసమేత మలయప్పస్వామి

చివరి పుట :
శ్రీరాముడు - హనుమంతుడు




*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**
సం॥ చందా -- రూ. 850-00

సంపాదకీయం

# సంపూర్ణ స్వామి దర్శనం

పరమాత్మతో ఆత్మలు లయించే ఆధ్యాత్మిక పవిత్రకేంద్రాలు ఆలయాలు. ఆలయమే భక్తులలో నిద్రాణమైన దైవచింతనను మేల్కొల్పుతుంది. అలాంటి ఆలయం మహత్త్వపూర్ణమైన గిరిశిఖరాల మీద వెలిస్తే, ఆ గిరులు బ్రహ్మాండంలోకెల్లా పరమోత్కృష్టమైనవైతే, ఆ పుణ్యక్షేత్రంలో భూతభవిష్యత్ కాలాల్లో కెల్లా అద్వితీయమైన దివ్యమూర్తి సుప్రతిష్ఠితుడైతే, అలాంటి గిరినిండా పుణ్యతీర్థాలు భక్తుల్ని పునీతుల్ని చేస్తూ ప్రవహిస్తే, ఇక ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని కొనియాడడానికి ఆదిశేషుడికైనా శక్యమౌతుందా? అదే మన శేషాచల పర్వత శ్రేణి, అదే మన పవిత్ర సప్తగిరి! అదే మన తిరుమల!

తిరుమల క్షేత్రమే కలియుగ వైకుంఠమని కీర్తింపబడుతోంది. దీనికి తోడు ఈ ప్రధాన ఆలయానికి అనుబంధంగా ఇంకా తిరుచానూరు, శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం, శ్రీనివాసమంగాపురం; శ్రీ కల్యాణవేంకటేశ్వర స్వామి ఆలయం; తిరుపతి, శ్రీ కోదండరామస్వామి ఆలయం; తిరుపతి, శ్రీ గోవిందరాజస్వామి ఆలయం; కపిలతీర్థం, శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం; తొండవాడ, శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం; అప్పలాయగుంట, శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి ఆలయం; కార్వేటినగరం, శ్రీవేణుగోపాలస్వామి ఆలయం; నారాయణవనం, శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం; నగరి, శ్రీ కరియమాణిక్యస్వామి ఆలయం; బుగ్గ, శ్రీ అన్నపూర్ణాసమేత కాశీవిశ్వేశ్వరస్వామి ఆలయం; నాగులాపురము, శ్రీ వేదనారాయణస్వామి ఆలయం; సురుటుపల్లి, శ్రీ పల్లికొండేశ్వర స్వామి ఆలయం వంటి ప్రదేశాల్లో వివిధ దేవతామూర్తులు నెలకొని భక్తుల్ని తరింపచేస్తున్నారు.

తిరుమల తిరుపతి దేవస్థానములు – అని అనడానికి కారణం, తిరుమల శ్రీవారి ఆలయానికి అనుబంధంగా ఉన్న ఈ ఆలయాలనన్నింటినీ దృష్టిలో పెట్టుకునే! ఇదంతా ఒక ఆలయ సముదాయంగా భావించడం వల్లనే! భక్తులు తమ తిరుమల యాత్రాకాలంలో, వీలైనంతవరకూ తిరుమల ఆనందనిలయుని సందర్శనతో పాటు, తిరుమల తిరుపతి పరిసరాలలోని ఈ అనుబంధ దేవాలయాలను కూడా దర్శించడానికి వెసులుబాటును కల్పించుకోవాలి. భక్తులకు అప్పుడు శ్రీవారి ఆత్మీయవర్గమైన పరివార దేవతలందరినీ దర్శించుకున్నంత ఆనందం లభిస్తుంది. భక్తులయాత్ర కూడా ఒక పరిపూర్ణతను సంతరించుకుంటుంది. ఆయా ఆలయాల ప్రాశస్త్యంతో పాటు, ఆయా స్థలపురాణాలు అవగాహనకు వస్తాయి. ఆయా దేవతామూర్తులతో, అసలైన అవతారతత్త్వానికున్న సంబంధ బాంధవ్యాలు అర్థమౌతాయి. అక్కడక్కడి అర్చనాభిషేక విధానాలు తెలుస్తాయి. దాంతో శ్రీ వేంకటేశ్వరునికి సంబంధించిన చారిత్రక, పౌరాణిక, ఐతిహాసిక అంశాలు బోధపడుతాయి. శ్రీనివాసుని అంశావతార తత్త్వాలు అవగతమౌతాయి. తిరుమల దివ్యదేశానికి పరిసరాల ఆలయాలన్నీ ప్రధాన భాగాలుగా భక్తులు భావించుకున్నప్పుడు, ఉత్తమాంగమైన శిరస్సునే గాకుండా తదంగభూతమైన అనుబంధ ఆలయాలన్నిటినీ, కుటుంబసమేతంగా సందర్శించుకుంటారు. ఆయా దేవతల ఆశిస్సులనందుకుంటారు.

తిరుమల తిరుపతి పర్వతోపకంఠభూముల్లో ఉన్న ఈ ఆలయాలనన్నిటినీ సందర్శించుకుని భక్తులు ఒక సమగ్ర యాత్రానుభూతిని పొందగలుగుతారు. అలమేలుమంగాంబికా సమేత వేంకటగిరివల్లభుని సంపూర్ణ సామ్రాజ్యాన్ని దర్శించుకున్నవారవుతారు.

# ఉగాది

– పి.విజయలక్ష్మి

శ్రీమన్నారాయణుని ఆజ్ఞతో కాలం ప్రవర్తిస్తూంది. స్వామి చేతిలోని చక్రాయుధం కాలచక్రమే! "సృష్టి స్థితి లయ కారణమైన కాలస్వరూపుణ్ణి నేనే"నని గీతలో స్వామి పేర్కొన్నాడు. రూపం లేనిదీ, శాశ్వత మైందీ, సర్వవ్యాపకమైందీ, సర్వశక్తిమంతమైందీ కాలం. మహావిష్ణువూ ఇదే గుణరాశితో ప్రకాశిస్తూ, ఆ కాలాన్ని నియమిస్తూంటాడు. మన వ్యవహారంకోసం–అనంతమైన ఈ కాలాన్ని నామరూపాత్మకంగా విభాగించుకొన్నాం. మన ప్రాచీనులు ఈ ఏర్పాటు చేశారు. ఆంధ్రులు చాంద్ర మానాన్ని పాటిస్తారు. చంద్రుడు పూర్ణిమనాడు ఉండే నక్షత్రాన్ని బట్టి – ఆ మాసాన్ని ఆ నక్షత్రం పేరుతో గణిస్తారు. చాంద్రమానం రీత్యా సంవత్సరాత్మకమైన కాలం వసంతఋతువుతో ప్రారంభమౌతుంది. "ఋతువుల్లో వసంత ఋతువు నేనే"నన్నాడు గీతాచార్య పరబ్రహ్మ. 'ఉగాది'తో వసంత ఋతువు ప్రారంభమౌతుంది. చెట్లన్నీ పూలతో, కాయల్తో, పండ్లతో శోభిస్తూ 'మా జీవితమంతా మానవ, మాధవ సేవకే' అంటూ ఆహ్వానిస్తూంటాయి. కనుకనే వసంతఋతువును కుసుమాకరమనీ, మధుమాసమనీ, మాధవమనీ పెద్దలు పేర్కొన్నారు. మధురానందనిలయమైన మాధవ ఋతువు ఉగాది పర్వదినంగా రూపొంది, తెలుగువారి ఆరాధ్యదైవమైన తిరుమల శ్రీవారి ఆస్థానంతో ఆనందనిలయుడనే పేరును సార్థకం చేస్తుంది.

**ఉగాది పండుగ :**

కాలాన్ని భగవద్రూపంగా భావిస్తే ప్రతిక్షణమూ పండుగే! అమృతస్వరూపమే! ఆనందనిలయమే! పవిత్ర విశాల భావన లేకుండా ఆచరించే పండుగలుదండుగలే అవుతాయి. పిండివంటలూ, మధురపదార్థాలూ తిని, రజస్తమోగుణాలు నింపుకోవడం తప్ప, సాత్త్విక ప్రవృత్తి చేకూరదు. భగవద్భక్తితో కూడినపుడే పరమానురక్తియై భగవత్ కృపా పాత్రమౌతుంది. కనుకనే మనపూర్వులు ప్రతిపండుగకూ ఒక అధిష్ఠాన దైవం, పూజ, నియమాలూ, సముచిత ఆహారవిశేషాలూ ఏర్పాటు చేశారు. పవిత్రభావంతో చేసే ప్రతికార్యమూ ఇహపరానంద దాయకమౌతుంది. ఇతర వ్రతాలూ, పండుగల వలే ఏదో ఒక దేవతను ఉద్దేశించింది కాక – ఉగాది సర్వ దేవతాత్మకమూ, తమ తమ ఇష్టదేవతా స్వరూపమూ అయింది. ఈ పండుగకు వ్రతకథలు ఉండవు. ఒక సంవత్సరకాల భవిష్యత్తును ముందుగా తెలుసుకొని, ఆయా సమయాల్లో దైవానుగ్రహప్రాప్తికై చేయాల్సిన పూజాది సాధనాలను స్థిరపరచుకునే ఒక చక్కని శాస్త్రీయ ప్రణాళికకు పూర్వరంగం ఏర్పరచుకునే పంచాంగ శ్రవణం ఉంటుంది.

వరాహమిహిరాచార్యుని నిర్ణయాన్ని బట్టి మనం చాంద్రమానం రీత్యా చైత్రమాసాన్నే సంవత్సరారంభంగా భావించి, చైత్రశుక్ల ప్రతిపత్తు (పాడ్యమి)నాడు బ్రహ్మదేవుడు సృష్టిని ప్రారంభించాడనే శాస్త్రవాక్కును ప్రమాణీకరించి, దీన్నే "యుగాది"గా గణించి, "ఉగాది" పండుగను ఆచరిస్తున్నాం. అన్ని దేశాలవాళ్లూ ఏదో ఒక కాలగణనంతో ఉగాదిపండుగను జరుపుతూనే ఉన్నారు. ఆచరించే విధానంలో తేడా ఉన్నా – ఆశయంలో, ఆనందంలో మాత్రం తేడాలుండవు.

తెలుగువాళ్లే గాక–కర్ణాటకులూ, మహారాష్ట్రులూ, మాళవీయులూ మున్నగువారు చాంద్రమానాన్ని అను

**ఏప్రిల్ 4 ఉగాది సందర్భంగా ఈ ప్రత్యేక వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం....**

సరించే ఉగాదిని 'చైత్రశుద్ధపాడ్యమి' నాడే ఆచరిస్తున్నారు. ఈ సృష్టి జరిగిన నాటి పండుగను – మనం పుట్టిననాటి పండుగగా భావించి, ఆనందోత్సాహాలతో సంవత్సరంలో తొలిపండుగగా జరుపుకొంటున్నాం. జరుపుకోవాలి కూడా! సూర్యోదయానికి పాడ్యమి ఉన్న రోజే (చైత్రశుద్ధపాడ్యమి) ఈ పండుగను ఆచరించాలి. సృష్టికర్తకు కృతజ్ఞతను తెల్పేందుకు జ్ఞాపకచిహ్నంగా ఈ ఉగాదిపండుగ ఏర్పాటైంది. ఈ పాడ్యమినాడు ఉపవాసం ఉండి, బ్రహ్మను పూజించేవాళ్లు సంవత్సరమంతా సుఖంగా ఉంటారు. ఒకవేళ చైత్రం అధికమాసంగా వస్తే– అధికమాస ప్రారంభం నాడే ఉగాది జరుపుకోవాలి. అంతేకానీ నిజచైత్రారంభంలో కాదు.

## ఆచరణ విధానం :

ఉగాదినాడు ఉదయం తలంటుస్నానం చేసి, కొత్తదుస్తులు ధరించాలి. ఇంటి ముంగిట మామిడి తోరణాలు కట్టాలి. వేపపూత పచ్చడి దేవునికి నివేదించి స్వీకరించాలి. మనపూర్వులు సూచించిన ప్రకారమైతే ఈ పండుగలో పది అంశాలున్నాయి. 1) ప్రతి గృహంలో ధ్వజారోహణం చేయాలి 2) నువ్వుల నూనెతో తలంటు స్నానం చేయాలి 3) నూతన వస్త్రాలు ధరించాలి 4) దవనంతో బ్రహ్మను పూజించాలి 5) అన్ని ఆపదలూ తొలగి శాంతితో, ఆనందంతో జీవించడానికై "మహాశాంతి" పూజా హోమాలు చేయాలి 6) వేపపూత పచ్చడి స్వీకరించాలి 7) పంచాంగ శ్రవణం చేయాలి 8) చలివేంద్రాలు ప్రారంభించాలి 9) పెద్దల్ని దర్శించి, నమస్కరించి వాళ్ల ఆశీస్సులు పొందాలి 10) వసంత నవరాత్రి పూజలు అంటే శ్రీరామ నవరాత్రి పూజలు ప్రారంభించాలి.

వీటిల్లో మనం కొన్నింటినే ఆచరిస్తున్నాం. ఉగాది చైత్రశుద్ధ పాడ్యమి నుండి పూర్ణిమ దాకా – ఆయా దేవతా కృపకై నిర్వహించే పూజలు శాస్త్రాల్లో ఉన్నాయి. జ్యోతిశ్శాస్త్రంరీత్యా వసంత, శరదృతువులు యమదంష్ట్రలు మృత్యువు తాండవం చేసే రోజులు. కనుక అపమృత్యువు ముఖంలో పడకుండా, ఆయురారోగ్యాలతో వర్థిల్లడానికై వసంత ప్రారంభంలో విష్ణువునూ, (రాముణ్ణి), శరత్ ప్రారంభంలో విష్ణు సోదరి దుర్గనూ పూజించాలని పెద్దలు సూచించారు.

వసంత, శరదృతువుల ప్రారంభంలో వాతావరణంలో, ఉష్ణోగ్రతలో, ప్రకృతిలో జరిగే మార్పులే మృత్యువుకు కారణాలు. కనుక దేవతా పూజలనెపంతో ఆరోగ్యం, ధైర్యం, మనశ్శాంతి, ఉత్సాహం, భక్తిశ్రద్ధలూ, భవిష్యత్ కార్యక్రమ నిర్వహణపై పట్టుదల, అడ్డంకులు తొలగించుకావాలనే కోరిక ఏర్పడి, మానవులు జీవితాన్ని తీర్చిదిద్దుకుంటారు. దీనికి తోడు చేసిన పూజాఫలమూ వెన్నంటే ఉంటుంది.

## తైలాభ్యంగనం :

ఉగాదిరోజు నువ్వులనూనెతో తలంటుకొని స్నానం చేయనివాళ్లు నరకానికి పోతారట! తలంటు స్నానం వల్ల ఇంద్రియాలకు పాటవం, చైతన్యం చేకూరుతాయి. సుఖనిద్ర కల్గుతుంది. నువ్వులనూనె ఉష్ణాన్ని వెలికితీస్తుంది. వాతాన్నీ, చర్మదోషాల్ని హరిస్తుంది. జీర్ణశక్తిని పెంచుతుంది. దేహానికి పుష్టినీ, బలాన్నీ కల్గిస్తుంది. కురుపుల్ని మాన్పుతుంది. వ్యాధికారక సూక్ష్మ క్రిముల్ని నాశనం చేస్తుంది. కంటికి చాలా మంచిది. (జ్వరంతో ఉండేవాళ్లూ, మతిస్థిమితం లేనివాళ్లూ, కొన్ని వ్యాధులుండేవాళ్లూ నువ్వులనూనె వాడరాదు) ఏ శుభ కార్యానికైనా తైలాభ్యంగనం విధిగా చేయాలి.

## నూతన వస్త్రాలు :

తమకు ఇష్టమైన సత్త్వగుణప్రవేశకాలైన కొత్త దుస్తులు ధరించాలి. ఇందువల్ల మానసికంగానూ,

శారీరకంగానూ ఉత్సాహం, ఆనందం అతిశయిస్తుంది. దరిద్రులైనా పండుగనాడు తలంటి స్నానం చేసి, కొత్త గుడ్డలు ధరించడంతో – ఆ రోజైనా తన దరిద్రాన్నీ, కష్టాల్నీ మరచి, అందరితో సమానంగా ఆనందాన్ని పొందగల్గుతారు. కనుక అందరూ సమానంగా సుఖంగా ఉండాలనే సమత్వభావానికి సంకేతం – పండుగనాటి నూతనవస్త్రధారణ.

**ఇష్టదేవతాపూజ :**

సంవత్సరాదినాడు తమతమ ఇష్టదేవతల్ని పూజించడంతో ఈ సంవత్సరమంతా దైవానుగ్రహం పుష్కలంగా ఉంటుంది. ఏ కార్యాన్నయినా విజయ వంతంగా నిర్వహించగలమనే ధైర్యం, మనోబలం, ఆత్మ విశ్వాసం ఏర్పడుతాయి.

**వేపపూత పచ్చడి :**

ఉగాదినాడు వేపపూత పచ్చడి (గొజ్జు) తప్పక స్వీకరించాలి. దీన్నే 'నింబకుసుమభక్షణం' అని శాస్త్రాలు పేర్కొన్నాయి. ఇది మంచి ఔషధం! "కొత్త చింతపండు తెచ్చి, నీటితో పిసికి, గింజలు, తొక్కలు లేకుండా తీసి వేసి, చిక్కటి గొజ్జు తయారు చేయాలి. అందులో కాడలూ, పుల్లలూ లేకుండా శుభ్రపరచిన వేపపూలూ, కొద్దిగా బెల్లం, నెయ్యి వేసి కలియబెట్టి, దేవునికి నివే దించి, ఉదయాన్నే – పరగడుపుననే స్వీకరించాలి.

ఈ వేపపూతను స్వీకరించడం వల్ల నూరేండ్ల ఆయుస్సూ, వజ్రసమానమైన దేహం, సర్వసంపదలూ చేకూరి, సంవత్సరమంతా సుఖంగా ఉంటారని మన పెద్దల భావన. ఈ గొజ్జులో మామిడి ముక్కలూ, ఉప్పూ, బెల్లం, చింతపండూ కలిపి సేవించడం, రాగల కాలానికి స్వాగతం చెప్పడమే అవుతుంది. ఇది త్రిగుణాత్మక ప్రకృతికి సంకేతం! ఇందున్న వస్తువులన్నీ ఆరోగ్య పరంగా రక్తాన్ని శుద్ధి చేసి, అనేక వ్యాధుల్ని పోగొట్టి, మనల్ని ఆరోగ్యవంతులుగా చేయగల్గినవే! జ్యోతిశ్శాస్త్రం రీత్యా – ఉగాదినాటికి – చైత్రంలో రవి సంచరించే నక్షత్రాల ప్రభావం మనుషులపై అధికంగా ఉంటుంది. ఈ మాసంలో రవి సాధారణం మేషరాశిలో సంచరి స్తాడు. అశ్విని, భరణి నాల్గేసి పాదాలూ, కృత్తిక ఒకటవ పాదం – మేషరాశి. అశ్విని – కేతునక్షత్రం, భరణి – శుక్రనక్షత్రం, కృత్తిక రవినక్షత్రం. ఈ నక్షత్రాల అధి దేవతల ప్రభావమూ జీవులపై ఉంటుంది. కేతువు కుజుని వంటి వాడు. కుజుడు అగ్నిగ్రహం. కేతువూ అంతే! అగ్నిగ్రహమైన రవి, అదే అగ్నికి సమానమైన అశ్వినీ నక్షత్రంలో సంచరించే కాలంలో అగ్నిప్రభావం (ఎండ వేడి) ఎక్కువగా ఉంటుంది. అట్లే భరణి, కృత్తికల్లో రవి సంచరించే కాలం కూడా మంచిది కాదు. అనేక అనర్థాలకు కారణం అవుతుంది. కనుక ఈ మాసా రంభంలో శ్రీమహావిష్ణువును (శ్రీరాముణ్ణి) పూజించడం, మధుర ఆమ్ల మిశ్రితమైన వేపపూతను స్వీకరించడం వల్ల మానసికంగానూ, భౌతికంగానూ ప్రశాంతత ఏర్పడు తుంది. ఆరోగ్యం బాగుంటుంది. రవి సంచారం వల్ల కలిగే దోషాలు తొలగుతాయి.

ఉగాదినాడు మఱ్ఱి, నేరేడు, మేడి, మామిడి, జువ్వి ఆకుల్ని నీళ్లలో నానబెట్టి ఆ నీళ్లతో అభ్యంగన స్నానం చేయాలనీ చెప్పారు. ఆ నీటిస్నానం కంటికీ, మెదడుకూ చాలా మంచిది. ఉగాది పండుగ దాదాపు 197 కోట్ల సంవత్సరాల ప్రాచీనత కల్గిన పండుగ. భగవద్గీత, ఉగాది – రెండూ సమాన ప్రాచీనత కలవి.

**పంచాంగ శ్రవణం :**

ఉగాది నాటి ముఖ్య ఆచరణాంశాలలో తలంటు స్నానం, ఇష్టదేవతాపూజ, వేపపూత పచ్చడి, పంచాంగ శ్రవణం–ముఖ్యమైనవి. తిథి, వారం, నక్షత్రం, యోగం,

కరణం - అనే ఐదు అంగాలు ఉండేది పంచాంగం. ఉగాది రోజు ఆ సంవత్సర పంచాంగాన్ని మహావిష్ణు స్వరూపంగా భావించి, పూజించాలి. పిదప సాయం కాలం పంచాంగ శ్రవణం చేయాలి. పంచాంగంలోని ఐదింటికీ ఐదు ప్రయోజనాలున్నాయి. 1) సంపదకోరే వారు తిథి విషయంలో 2) దీర్ఘాయువు కోరేవారు వారం విషయంలో 3) పాపవిముక్తి కోరేవారు నక్షత్ర విష యంలో 4) రోగవిముక్తి కోరేవారు యోగ విషయంలో 5) కార్యసిద్ధి కోరేవారు కరణం విషయంలో జాగ్రత్త వహించాలి. అంటే - ఆయా విషయాల్ని బట్టి తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాల్లో - తగిన ప్రాముఖ్యం ఇచ్చి, తదితర లగ్నాది విషయాల్నీ గమనించి, పురోగ మించాలి.

సంవత్సరాదిలో పంచాంగ విశేషాలు తెలుసు కోవడం వల్ల, అన్ని రంగాల్లో తాము ప్రవర్తించాల్సిన విధానాన్ని ఒక సంవత్సరం ముందుగా గ్రహించి, అందుకు తగ్గట్లుగా కార్యక్రమాలు చేపట్టడం, మానడం - అనేది నిర్ణయించుకోవచ్చు. అనంతమైన కాలాన్ని - సంవత్సరమనే ప్రమాణంతో గణించి, గ్రహనక్షత్రాది సంచారాన్నీ, వాటి ఫలాలనూ గుణించీ, గ్రహించీ, మానవునికి కర్తవ్యాకర్తవ్య ప్రబోధం చేసే ముఖ్యసాధనం పంచాంగం!

జీవనప్రయాణంలో మున్ముందుగా వచ్చే సుఖ దుఃఖాలనే ద్వంద్వాల మజిలీలను గూర్చి తెలుసుకొని, మార్గాన్ని సుఖతరమూ, సులభతరమూ చేసుకుని, పురో గమించడానికే పంచాంగశ్రవణం ఉగాదినాడు ఏర్పాట య్యింది. అన్ని వర్గాల వాళ్లకీ, దేశాల వాళ్లకీ, పంచాం గం ఎంతోముందుచూపుతో ప్రవర్తించే విధివిధానాలను చూపుతుంది. ఖగోళ భూగోళాలకు సమన్వయాన్ని సాధిస్తుంది.

'ఉ' అంటే సంతోషం, శివుడు, విష్ణువు - అనీ, 'గ' అంటే గతి, పొందుట అనీ అర్థాలు. కనుక 'ఉగ' అంటే భగవత్కృప వల్ల సంతోషాన్ని ఒక సంవత్సరం పాటు - ప్రణాళికాబద్ధంగా, ధర్మయుక్తంగా పొందే మార్గానికి - 'ఆది' మొదటి రోజు - అని గ్రహించాలి. 'యుగాది' పదం సృష్టి ప్రారంభాన్ని సూచిస్తే - 'ఉగాది' పదం - ఆ సృష్టి తత్త్వాన్నీ, మూలాన్నీ తెలుసుకొని, అందలి ఆనందాన్ని ఆస్వాదించే సంవత్సర ప్రమాణ విధానాన్ని నిరూపించేది అవుతుంది. ఇలా రెండు పదాలూ 'కార్యకారణఫల' త్రివేణీసంగమంగా మన జీవ నాభ్యుదయానికీ, ఆనందానికీ మూలకందాలు! "మూల కందో ముకుందః" కనుక ముకుందారాధన ఉగాదికి ఆత్మ!



# జానపదులలో.... శ్రీరాముడు

- మునుగోటి యాదయ్య

**జా**నపద వాఙ్మయాన్ని పరిశీలిస్తే మనకు రకరకాల గేయా లనేకం లభ్యమౌతాయి. అందులో పౌరాణిక సంబంధిత భక్తి గేయాలు చాలా ఉన్నాయి. పల్లెల్లో పండుగ రోజుల్లో పాడు కొనే పాటలనేకం. గ్రామీణులు జరుపుకునే పండుగల్లో శ్రీరామనవమి చాలా ప్రధానమైనది. శ్రీరాముడు భారతీయు లకు పూజనీయుడు. మన సుఖదుఃఖాలకు రామనామస్మరణం తప్ప వేరే మార్గం లేదు.

రామాయణ సంబంధి గేయాలు జానపదుల్లో చాలా ఉన్నాయి. వాల్మీకిమహర్షి రామాయణంలో ఎన్ని సంఘ టనలు వర్ణించాడో జానపదులు కూడా అన్ని గేయాలను పాడుతారు. జానపదులకు సీతమ్మ కన్నతల్లి, శ్రీరాముడు కన్న తండ్రి. శ్రీరాముని జన్మదినం మొదలు పట్టాభిషేకం వరకు అనేక గేయాలను వినిపిస్తారు.

శ్రీమహావిష్ణువు దశావతారాల్లో శ్రీరామావతారం ఒకటి. చైత్రశుద్ధనవమినాడు శ్రీరామనవమిని జరుపుకుంటారు. జానపదులు రాముని పుట్టుక గురించి జోలపాట పాడే వారు.

**రామ లాలీ మేఘశ్యామ లాలీ**
**తామరసనయనా దశరథతనయా లాలీ**
**ఎంతో ఎత్తూ మరగీ నావూ ఏమీ సేతురా -**
**ఇంతూల కౌగిళ్ళలోనా నిదురా పోవరా**

ఇలాంటిదే, మరోపాటలో తొట్టెలోనున్న రాముణ్ణి లాలిపాటలో వర్ణన చేశారు.

**వసుదేవ పుత్రుడమ్మ, ఈ బిడ్డ వైకుంఠ వాసుడమ్మా,**
**నవనీత చోరుడమ్మా, ఈ బిడ్డ నందగోపాలుడమ్మా,**
**సీతాకళత్రుడమ్మా, ఈ బిడ్డ శ్రీరామచంద్రుడమ్మా!**

పిల్లలను తొట్టెలలో పెట్టడం అనేది మన ప్రాచీన ఆచారం.

జానపదులకు రాముడంత ఇష్టమైన తండ్రి, సీతవంటి చల్లనితల్లి తప్ప మరెవ్వరూలేరు.

ప్రొద్దున లేవగానే తమ తండ్రి రామయ్యకు మేలు కొలుపు పాడుతారు గ్రామీణప్రజలు.

**పుత్రకామేష్ఠియందు పుట్టిన శ్రీరామ**
**పుండరీకాక్షుడ మేలుకో**
**అండజవాహన అభయమివ్వర మాకు**
**అయోధ్యరామ మేలుకో ....**

అంటూ రాముడు పుట్టింది మొదలు సీతను పెళ్ళాడే వరకూ ప్రీతితో తలచుకొంటారు.

**మేలుకో శ్రీరామ! మేలుకో రఘురామ!**
**మేలుకో గుణధామ! మేలుకో స్వామి మేలుకో!**
**దీనుల రక్షింప దీక్షవహించిన,**
**దేవదేవ నిద్ర మేలుకో**
**పూనికతో నిన్ను పూజించువారల**
**పోషింపవలె మేలుకో స్వామి మేలుకో**

ఈ మేలుకొలుపు పాట మానవహృదయంలోని వేదననూ, ఆవేదననూ ప్రతిధ్వనింపజేస్తుంది. శ్రీరాముడి గేయా లలో భజన గేయాలు, భక్తి గేయాలు మొదలైనవి కన్పిస్తాయి. శ్రీరామునిపై జానపద పెండ్లిపాటలనేకం.

**సువ్వి కస్తూరి రంగ - సువ్వి కావేటి రంగ**
**సువ్వి సుగుణాభిరామ సువ్విలాలీ**
**ఆ సువ్వి - ఆ సువ్వి....**
**తుమ్మ కర్ర రోలు దోసి తూము దొడ్లు వాయవేసి**
**దంచుదామా బియ్యం దంచుదామా**
**ఆ సువ్వీ - ఆ సువ్వీ...**

సీతారామకల్యాణం భద్రాచలంలో మహావైభవంగా జరుగుతుంది. భక్తులు భద్రాద్రిరాముని వివాహ వైభవాన్ని ఆనందంగా తిలకిస్తారు. గ్రామగ్రామాల్లో జరిగే శ్రీరామ ఉత్సవాలను, వేడుకలను గ్రామీణులు ఇలా పాడుకుంటారు.

**కల్యాణం చూతామూ రారండీ**
**భద్రాద్రి రాముల పెళ్ళికి, పోదాము రారండీ**

కృష్ణకు పన్నెండామడున్నదట
వింత వింత హరిదాసులుండిరట
వీరవసంతము కొల్లలాడిరట
పొడుగు పొడుగు పందిళ్ళు వేసిరట
పెళ్ళికొడుకు శ్రీరాములవారట
పెళ్ళికూతురు సీతాదేవట
పెళ్ళిపెద్ద వాసిష్ఠ మహామునట
పేరంటాళ్ళు అరుంధతమ్మట
దేవేంద్రాముని దేవతలొచ్చిరి
పూలబుట్టలో సీతనుంచిరీ
పట్టువస్త్రములు తెరలు కప్పిరీ
చిచ్చుబుడ్లు శ్రీబోణాలండీ
చిరచిర చిరచిర లేవంగా
సీతకూను శ్రీరాములవారు
కాలుతొక్కి కంకణము కట్టిరి
ముత్యాలు తాపిన మంగళసూత్రము
ముద్దుగాను సీతకు కట్టిరి

ఇలా సీతారామ కల్యాణం గురించి కళ్లకు కట్టినట్లు పాటలో చూపారు మన గ్రామీణులు.

ఆనందమానంద మాయెను
మనరాముడు పెండ్లికొడుకాయెను
అల జానకీ పెండ్లి కూతురాయెను
కౌసల్య నోచిన నోము సఫలమాయెను

శ్రీరామ నవరాత్రులు కూడా మన గ్రామాల్లో చాలా వేడుకగా జరుపుతారు. సీతాశ్రీరాముల విగ్రహాలను పల్లకీలో ఊరేగిస్తారు. ఆ వేడుకలను వర్ణిస్తూ చూపిన గేయం –

చిన్నారి పాపాయి - శ్రీరామనవమికి
విచ్చేసినది నేడు - వేడుకలు చూడు
సీతా మనోహరుడు - శ్రీరామ విభుడు
సీతమ్మ తల్లికి - శ్రీరామునకును
తలలపై బోశారు - తలబ్రాలు జనులు
బుట్టెడూ వడపప్పు - పెట్టిరందరికి
పానకం బిందెడూ - పంచిరందరికి

పల్లెప్రాంతాల్లో ఉత్సవాలలో జరిగే విధానాన్ని పై విధంగా తెలిపారు. వివాహసందర్భంగా పన్నీరు చల్లడం, అత్తరు పూయడం పరిపాటి.

వెతకీ పన్నీరు జల్లరే శ్రీరాములపై
వెతకీ పన్నీరు జల్లరే
వేణుగోపాలునిపైని మగువలందరు గూడి
మన సీతారాములపై సంపెంగ తైలమంటే
సఖియాలందరు గూడి సరసముతో వెతకి
సఖియ శ్రీరాములుపై కస్తూరి అలంకారము చక్కగా
కాంతలందరు గూడి కరుణతో వెలసినట్టి
కాంతా శ్రీరాములపై ॥ వెతకీ ॥

జానపదులలో ఇప్పటికీ ఈ ఆచార సంప్రదాయాలు ఉన్నాయి. జానపదులకు సీతారాములు ఆరాధ్యదైవమనడానికి ఉదాహరణంగా ఎన్నో గేయాలు కన్పిస్తాయి. ముఖ్యంగా బాల గేయాలు పరిశీలిస్తే ఎన్నో శ్రీరామగాథలు కన్పిస్తాయి.

ఏనుగేనుగు నల్లన,
ఏనుగు కొమ్ములు తెల్లన,
ఏనుగు మీద రాముడు,
ఎంతో చక్కని దేవుడు.

రాముడు ఎంతో చక్కని దేవుడంటారు.

ఉత్తముని పేరేమి? ఊరు పేరేమి?
సత్యపురుషులగన్న సాధ్వి పేరేమి?
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య,
సత్యపురుషులగన్న సాధ్వి కౌసల్య,
జగతిపై రామయ్య జన్మించినాడు
సత్యమ్ము లోకాన స్థాపించినాడు
తల్లిదండ్రుల మాట చెల్లించినాడు
ఇల్లాలితో పాటు హింస పడ్డాడు
సీతామహాదేవి సృష్టిలోపలను
మాతల్లి వెలిసింది మహనీయురాలు
శ్రీరామ జయరామ సీతాభిరామ
కారుణ్యగుణధామ కల్యాణరామ

పిల్లలంతా ఒక చోట గూమిగూడి ఆటలాడుతూ పాడుకునే పాటల్లో, పదాల్లో రామయ్య సుగుణాలు కళ్లకు కట్టి నట్లు కన్పిస్తాయి. జానపదులకు రామనామం మీద భక్తి అమితం. రాముని పేరు తలచుకొంటేనే పులకరించిపోయె భక్త జనులెందరో..

రామనామము, రామనామము,
రమ్యమైనది రామనామము.

# వేదం.. తెలుసుకుందాం!

ధారావాహిక

04

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

## సత్యప్రబోధకాలు :

వేదాలు దివ్యత్వాన్ని ప్రబోధించే గ్రంథాలు. మానవుడు ఇహపరలోకాల్లో సుఖమయ జీవనం పొందడానికి అవసరమైన సూచనలను మానవాళికి అందించే నిక్షేపాలు. భగవంతుని వైభవాన్ని ఆవిష్కరించే సాధనాలు. అనేక శతాబ్దాలుగా మాన వులకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందించే నిధులు.

ఈ దేశ సంస్కృతిని పరిరక్షించడానికి గానీ, భావితరా లకు అందించడానికి గాని, మంచినీ చెడునూ వేరు చేసి చూడ గలిగే భగవంతుడిచ్చిన బుద్ధి ఒక్కటే మానవుడికి సాధనం. ఆ బుద్ధితో ఈ సనాతన వేద సంపదను మానవుడు ఆకళింపు చేసు కుంటే ఆత్మతత్త్వం ఆవిష్కృతమౌతుంది. అప్పుడు మానవునికి సంపూర్ణ సుఖశాంతులు లభిస్తాయి.

వేదసంపద భౌతిక సుఖలాలసత వలన అనాదరించ బడింది. కాని, కొంతకాలం నుండి మరల ప్రజలు ఈ వైదిక సంస్కృతిపట్ల ప్రీతిని, గౌరవాన్ని ప్రకటిస్తున్నారు. ఇన్నాళ్ళు నిర్లక్ష్యం చేసినందుకు పశ్చాత్తాపం చెందుతున్నారు. ఆత్మబలం, ఆత్మైక్యమే వేదసందేశం. మానవుని మాధవునిగా పరిణమింప చేసి సచ్చిదానందాన్ని అనుభవింపజేయడమే జీవితపరమార్థమని వేదం ఉపదేశించింది.

వేదాలలో ఈ విశ్వమంతా విష్ణువుయొక్క శరీరంగా అభివర్ణించబడింది. భారతదేశం భగవంతుని నేత్రంగా చెప్ప బడింది. ఎందుకనగా కాలానుగుణంగా విశ్వాన్ని సరైన దృష్టితో చూడగల శక్తి భారతదేశానికుంది. ఈ దేశంలోని ఋషులు, మునులు ఆవిష్కరించిన ఆధ్యాత్మిక జ్ఞానవిద్యను ప్రతి భార తీయుడు విధిగా అభ్యసించాలి.

ఈ విశ్వం భగవంతుని శరీరం. ఈ శరీరంలో అంత రాత్మ భారతదేశం. 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అని వేదాలు శతాబ్దాల నుంచి ఘోషిస్తున్నాయి. ఇదే భారతదేశం యొక్క గుండె చప్పుడు. యోగులు, మునులు, దివ్యపురుషులు, అవతార మూర్తులు ఇక్కడ జన్మించి మానవాళికి తమ దివ్య సందేశాన్ని అందించారు.

'త్యాగేనైకే అమృతత్వమానశుః' త్యాగం వల్లనే అనన్య శరణాగతి, భగవదర్పణ బుద్ధి మొదలైన అమృతత్వ లక్షణాలు అలవడుతాయని వేదాలు ఘోషిస్తున్నాయి.

వేదాలు సర్వవిజ్ఞానానికి నిలయాలు. ప్రజ్ఞాన భాండా గారాలు. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికమైన సర్వవిజ్ఞానం వేదాల్లో యిమిడి ఉంది. మహర్షులు నియమనిగ్రహంతో తదేక దీక్షతో దీర్ఘకాలం తపస్సు చేసి పరబ్రహ్మ సాక్షాత్కారం పొందిన దివ్యతేజస్సంపన్నులు. వారు పూర్ణజ్ఞానులు. వేదాలు సృష్టి నియ మాలను, జీవుల స్వభావాలను, పరమాత్మ స్వరూపాన్ని విస్పష్టంగా దర్శింపచేస్తాయి. ఇవి సర్వమానవజాతికి మూలాలు. ఇవి చైతన్యప్రదాలు. మానవ హృదయ వికాసానికి పట్టు గొమ్మలు. అఖండ దివ్యజ్యోతిని దర్శింపజేసే దివ్యదీపికలు.

వేదాలలో సత్యం, శివం, సుందరం సదా లీనములై ఉన్నాయి. ఇవి సత్యప్రబోధకాలు. ఆత్మలో అనంతత్వం, దృష్టిలో దివ్యత్వం, భావంలో పవిత్రత, క్రియలో నిర్మలత్వం ఈ విధంగా మనోవాక్కాయములకు త్రికరణశుద్ధినందిస్తూ హృదయాన్ని దివ్యంగా దీపింపజేస్తూ వేదాలు నిత్యసత్యాలను ఆవిష్కరిస్తు న్నాయి. అవి నిత్యజ్యోతులుగా వెలుగొందుతున్నాయి.

## మైత్రీభావన :

భారతీయ సాహిత్యంలో వేదవిజ్ఞానం అతిపవిత్ర మైనది. సర్వమానవ సమానత్వం, మానవనైతిక జీవనవిధానం, ఆధ్యాత్మిక తత్త్వం మూలాధారాలుగా అన్ని రంగాలలో మాన వాభ్యున్నతికి మూలమైన విషయాలిందులో చర్చించబడ్డాయి. ధర్మజిజ్ఞాసకు, సభ్యతా సంస్కారాలకు వేదాలే పునాదిరాళ్ళు. వేదవిజ్ఞానం (ఇహపర) లౌకిక, పారలౌకిక మార్గాలను తెలియ జేసే సాధనం. వేదాలు భౌతిక, ఆధ్యాత్మిక లక్ష్యాలను, వాటిని

సాధించే అనేక మార్గాలను తెలియజేస్తూ జగత్కల్యాణానికి సారథ్యం వహిస్తున్నాయి.

మానవులంతా పరస్పరం ప్రేమతో వ్యవహరించాలని యజుర్వేదం ఉపదేశిస్తున్నది. 'ఓ పరమేశ్వరా! మేము పరస్పరం వైరభావం విడిచి ప్రేమతో వ్యవహరించేటట్టు మమ్మల్ని అనుగ్రహించు. లోకంలోని సమస్త ప్రాణులు నన్ను మిత్రునిగా భావించి బంధువు వలె నాతో ప్రవర్తించు గాక! నేను కూడా ప్రాణులన్నింటిని మిత్రులుగా తలచి సుఖదుఃఖాలలో నాతో సమానంగా భావింతును గాక! మేమంతా మిత్రులవలె జీవింతుము గాక!

**దృతే దృగ్ంహ మా మిత్రస్య మా చక్షుషా భూతాని సమీక్షంతామ్।**
**మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే**
**మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥ (యజుర్వేదం.36-18)**

**సత్యధర్మదీక్ష :**

భారతదేశం వేద ప్రామాణ్యాన్ని అంగీకరించింది. అందుకే ఇతర దేశాలకు ఆదర్శమైంది. వేదాలు అన్ని కాలాల లోను ప్రజల యోగక్షేమాలకు, నైతికాభివృద్ధికి, ఉపాసనలకు, సత్యధర్మాచరణకు మార్గదర్శకాలుగా ఉన్నాయి. అలాగే సత్యాచరణమనే వ్రతాన్నాచరించేవారు దేవతలని, అసత్యాచరణ చేసేవారు మనుష్యులని శతపథబ్రాహ్మణం చెబుతోంది –

**సత్యమేవ దేవా అనృతం మనుష్యాః (శతపథబ్రాహ్మణం 1-1)**

మానవుడు సత్యవ్రతాన్ని పాటించడం వలన కలిగే ప్రయోజనాన్ని గురించి యజుర్వేదం యిలా చెప్పింది – సత్యాన్నాచరించినప్పుడే మానవుడు సత్యాన్ని తెలుసుకుంటాడు. సత్యమందే శ్రద్ధ పెట్టి దృఢచిత్తంతో దాన్ని ఆచరిస్తే దీక్షను పొందుతాడు. దీక్షను స్వీకరించి ఉత్తమ గుణాలతో ఉత్తమాధికారి అయినప్పుడు అతనిని అందరూ గౌరవించి సత్కరిస్తారు.

**తిరుమలలో శ్రీవారి దర్శనానికి ముందు,**
**శ్రీవారి పుష్కరిణి చెంతవున్న**
**శ్రీ వరాహస్వామివారిని దర్శించాలి.**
**ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం.**



సత్యధర్మాచరణ గల జీవితంలో విశ్వాసం, శ్రద్ధ ఏర్పడతాయి. మానవుడు మాధవుడుగా రూపొందుతాడు.

**వ్రతేన దీక్షా మాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్ ।**
**దక్షిణయా శ్రద్ధా మాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే ॥**
**(యజుర్వేదం.19-30)**

మానవుడు అధర్మాచరణంతో ముక్తిని పొందలేడు. కనుక సత్యప్రాప్తి కొరకు నిత్యం శ్రద్ధ, ఉత్సాహంతో పురుషార్థాలను మానవుడు సాధించాలి. మానవులంతా వేదశాస్త్రాల ఆధారంగా సత్యమేదో తెలిసికొని దానినాచరించాలి. 'మానవులారా! అధర్మం ఆచరించడంలో శ్రద్ధను చూపవద్దు. పక్షపాత రహితంగా మీరు న్యాయధర్మాలను ఆచరించడంలో ఎప్పుడూ ప్రీతితో ఉండాలి. ఆత్మ, మనస్సు, ప్రాణములతో పురుషార్థాలను సేవించండి. ఎల్లపుడు సత్యధర్మములలోనే ప్రవృత్తి కలిగి ఉండండి.

**దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యా అనృతే ప్రజాపతిః ।**
**అశ్రద్ధామనృతే అదధాత్ శ్రద్ధాగ్ం సత్యే ప్రజాపతిః ॥**
**(యజుర్వేదం.19-77)**

**సమైక్యతామంత్రం :**

మానవులంతా కలసిమెలసి పరస్పరం ప్రేమతో సహజీవనం చేయాలని, అందరి మనసులు, హృదయాలు, ఆలోచనలు ఒకే విధంగా ఉండాలని, అందరి లక్ష్యం ఒకటిగానే ఉండాలని, ఆ లక్ష్యంకోసం అందరూ కలిసి పని చేయాలని వేదకాలం నాటి ఋషులు ఆకాంక్షించారు.

**సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥**
**సమానో మంత్రః సమితిః సమానీ**
**సమానం మనః సహ చిత్తమేషామ్ ।**
**సమానం మంత్రమభి మంత్రయే వః**
**సమానేన వో హవిషా జుహోమి ॥ (ఋగ్వేదం. 10-191-2,3)**

మనమందరము కలిసి ఒకే లక్ష్యముతో
ముందుకు వెళ్ళుదుము గాక!
మన మందరము కలిసి ఒకటిగ
మాట్లాడుదుము గాక!

మనమంతా నిర్మలమైన మనస్సుతో
కలిసి పనిచేయుదుము గాక!
ప్రాచీన మహర్షుల వలె మనకు ప్రాప్తించిన దానిని
తృప్తిగా సంతోషముతో అనుభవింతుము గాక!
మన ఆలోచనలు, ప్రార్థనలు ఒకే విధముగ నుండు గాక!
మనమంతా ఒకే సంఘముగ నుందుము గాక!
మన మనస్సులు కలిసి పనిచేయు గాక!
మన హృదయాలు ఒకటిగా నుండు గాక!
మన లక్ష్యము, మార్గము ఒకే విధంగా నుండు గాక!
మన ప్రార్థనలు, ఆరాధన ఒకటిగా నుండు గాక!
దేవతలకు మనం సమర్పించు హవిస్సులు
సమంగా ఉండు గాక!
మనమంతా కలిసి అంకిత భావముతో
లోకశ్రేయస్సుకై పాటుపడుదుము గాక!

**మానవజాతికి జీవనాడి :**

ఈ విశ్వమంతా వేదవిజ్ఞానం మీదే ఆధారపడింది. 'వేదమూలమిదం జగత్'. వీటిలో అనేక విజ్ఞాన శాస్త్ర విషయాలు నిక్షిప్తమై ఉన్నాయి. ఈ విశ్వం యొక్క ఆవిర్భావం, ప్రపంచ సృష్టి ఎలా జరిగింది? అనే విషయాలతో పాటు ఈ సృష్టిలోని అనేక రహస్యాలను వేదఋషులు దర్శించి మన కందించారు.

అనాదియైన వేదం మన జీవనానికి, సంస్కృతికి పునాది వంటిది. అది మానవజాతికే జీవనాడి. సృష్టి ప్రారంభం నుండి మానవజాతికి తరతరాలుగా వస్తున్న అఖండము, అద్వితీయము, అపురూపం అయిన వారసత్వసంపద ఇది.

వేద సంస్కృతి సృష్ట్యాది నుండి ఉన్నదని, ఇది ప్రపంచంలోనే ప్రప్రథమ సంస్కృతి అని యజుర్వేదం యిలా చెబుతోంది. 'సా ప్రథమా సంస్కృతిః విశ్వవారా'. వేదధర్మం ప్రపంచమంతటా విలసిల్లింది. వేదకాలంలో ప్రజలంతా భౌతిక, ఆధ్యాత్మిక, విజ్ఞానాలతో విశాల దృక్పథంతో వర్ధిల్లారు.

వైదిక ధర్మం ఒక సంపూర్ణ వైజ్ఞానిక ధర్మం. దీనిలో ధర్మం, విజ్ఞానం కలిసి ఉంటాయి. ఈ ధార్మిక సిద్ధాంతాలకు విజ్ఞానం, తత్త్వశాస్త్రం ఆధారమని పాశ్చాత్య శాస్త్రవేత్త డబ్ల్యు. డి.బ్రౌన్ మన వైదిక సంస్కృతిని ప్రశంసిస్తూ అన్నారు. కేవలం ఆసియానే కాకుండ సమస్త పాశ్చాత్య జగత్తు తమ విద్యను, ధర్మాన్ని భారతదేశాన్నుండే గ్రహించారని ప్రొ.హీరేన్ అన్నారు.

**నిత్యప్రామాణికాలు :**

వేదాలు ఈశ్వరీయాలని, నిత్యమైనవని ఈ క్రింది ఋగ్వేదమంత్రం తెలియజేస్తుంది.

**తస్మై నూనమభిద్యవే వాచా విరూప నిత్యయా ।**
**వృష్ణే చోదస్వ సుష్టుతిమ్ ॥ (ఋ.8-75-6)**

వేదాంత దర్శనంలో 'అథ ఏవ చ నిత్యత్వం' అనే సూత్రం కూడా ఇదే విషయాన్ని సమర్థిస్తున్నది. సృష్ట్యారంభంలో స్వయంభువైన పరమాత్మ నుండి అనాది, నిత్యము, దివ్యమైన వేదరాశి ఆవిర్భవించిందని మహాభారతం పేర్కొంది.

**అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా ।**
**ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః ॥**
**(మహాభారతం 12-233-24)**

వేదాలు భగవంతుని నిశ్వాసరూపాలు. 'తస్య నిశ్వసితం వేదః' అని భగవద్వాణి. అవి భగవంతుని నుండి ఉత్పన్నమైనవి. భగవంతుని శక్తిసామర్థ్యాలు శాశ్వతమైనవి కనుక వేదాలు కూడా శాశ్వతములే. వేదాలు భగవంతుని విద్యారూపాలు. భగవంతుని జ్ఞానం, క్రియలు నిత్యాలు, స్వభావసిద్ధాలు. భగవంతుని వలె వేదం కూడా అనాదియైనది. ప్రళయ కాలంలో కూడా ఈ జ్ఞానం బీజంలో అంకురం వలె నశించకుండా ఉంటుంది. మరల సృష్ట్యాదిలో తిరిగి ఆవిర్భవిస్తుంది. ఈ విషయాన్నే ఋగ్వేదం ఇలా చెప్పింది –

**సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్ ।**
**దివం చ పృథివీం చాన్తరిక్షమథో స్వః ॥**
**(ఋగ్వేదం 10-190-3)**

వేదం అనంతమైన శబ్దరాశి. ఈ శబ్దం స్వరప్రధానమైనది. శబ్దము నిత్యమైనది. అనగా శాశ్వతమైనది. మహర్షులందరూ వేదములు నిత్యములని, ప్రామాణికములని అంగీకరించారు. 'ఆప్తవాక్యం ప్రమాణం'.



# శ్రీచరణ శరణాగతి

లావు నుతింపబూని పదిలక్షల పద్యములైన జెప్పినన్
మీ విధినెన్నగా తరమె మిక్కిలి వెంగలినైన నాకు? లీ
లావధియౌ మహామహిమ రంజిలు సద్గతి వేయిలోనె మీ
దీవెనలిచ్చి తేటపడదెల్పరె పాదములార! సత్కృపన్. 19

నవరత్నోజ్జ్వల హేమ ఘంటల సదా నాదించు పాదత్రసం
భవమై యోంకృతిరేగ నొప్పెడి భవత్పాదార్చనా కీర్తనల్
భవనాశంబుగ వెల్గి, లోకముల సంభావింపగా జేయ శ్రీ
ధవ! పాలింపుము మత్ప్రబంధ మహితాధారక్రమం బొప్పగన్ 20

మీ పాదంబుల జేయు పూజనలు నున్మేషాస్యబింబాళితో
చూపుల్ తుమ్మెదలౌచు మ్రొక్కెడి సురస్తోమంబు శీర్షంబులన్
ప్రాపించున్ విరిజల్లులై యుభయలాభస్ఫూర్తి భాసించి సం
దీపించున్ భవతారకమ్ములయి సంతృప్తుల్ ప్రసాదించుచున్. 21

ఏ చరణారవిందముల నెప్పుడు చిత్తవికార శాత్యమున్
రాచి సమగ్ర నిగ్రహ పరత్వమునంద ననాదిసన్మునుల్
జూచి నిరంతరార్చనము జూపిరొ యెందు విధాయకమ్ముగా
నాచరణారవిందముల నమ్మి నుతించ తరించ నెంచెదన్. 22

ఎంతయు వేదశాస్త్రములనెల్లరు నధ్యయనం బొనర్చి నీ
చింతన దర్శనంబులను జేసెడి పద్ధతిగాదు గాన నా
వంత శ్రమంబులేని తవపాద సమర్చన జెప్పిరార్యులున్
వింతయె! రాతినాతినొదవించు పదమ్మున కామహత్త్వమున్. 23

పాదజయౌట భూమి బరిపాలనజేసి త్రివిష్టపమ్ముగా
సాదరరీతి దీర్చు పదసారసయుగ్మము నిత్యరాగ శో
భాదరమై వెలుంగుటకు- భక్తుల భావపరాగయోగమో?
నీదు మహానురాగమొ? గణింపగ కారణ మేమి? రంగరాట్! 24

- ఆచార్య రావికంటి వసునందన్

వేదాలలో అనేక విషయాలు న్నాయి. వాటిని మూడు భాగాలుగా విభజించవచ్చు. అవి 1) కర్మ 2) ఉపాసన 3) జ్ఞానం. వీటినే మూడు కాండలుగా వ్యవహరిస్తారు. విశేషమైన జ్ఞానం విజ్ఞానం. భగవత్తత్త్వాన్ని ప్రతిపాదించడమే వేదముల ముఖ్యతాత్పర్యం. సచ్చిదానంద స్వరూపుడు, దుఃఖరహితుడు, సుఖస్వరూపుడు అయిన భగవంతుని వర్ణించడమే వేదముల పరమ లక్ష్యం.

పరమాత్మ ఓంకార స్వరూపుడు. అతనిని పొందడానికి ఓంకారమే మార్గం. 'తస్య వాచకః ప్రణవః' అని పతంజలి మహర్షి యోగసూత్రాల్లో చెప్పాడు. వేదాలన్నిటిలోను పరబ్రహ్మమే ప్రతిపాదించబడింది. కొన్నిచోట్ల సాక్షాత్తుగను, మరి కొన్ని చోట్ల ప్రశ్నలు, సమాధానాల రూపంలోను బ్రహ్మమే వర్ణించబడింది.

ఆ పరబ్రహ్మకంటే ఉత్తముడు మరొకడు లేడు. అతడు సర్వలోకాలు వ్యాపించి ఉన్నాడు. ఆయనే జగత్తును పాలించువాడు, లోకాధ్యక్షుడు, సర్వప్రాణులకు సుఖాన్నిచ్చేవాడు. సర్వవ్యాపకుడైన పరమేశ్వరుని సర్వోత్తమము, ఆనంద స్వరూపము అయిన పరమపదాన్ని విద్వాంసులు సర్వకాల సర్వావస్థల యందు దర్శిస్తున్నారని ఋగ్వేదం యిలా వర్ణించింది –

**తద్విష్ణోః పరమం పదం**
**సదా పశ్యన్తి సూరయః ।**
**దివీవ చక్షురాతతమ్ ।**

**(ఋగ్వేదం 1-2-75)**

*(ఇంకా ఉంది)*

# సందేహాలు? సమాధానాలు!!

- 'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**1) కైకేయి మాట విని కానలకు వెళ్ళిన రాముణ్ణి అనుసరించిన లక్ష్మణుడు; అమ్మను తిరస్కరించి పాదుకలకు పట్టాభి షేకం చేసిన భరతులలో ఎవరు గొప్పవారు?**

**2) రావణుడు, విభీషణుడు, కుంభకర్ణులలో ఎవరు ఆ నాటి కాలధర్మాన్ని ఆచరించారు? –వాస్తురామచంద్ర, నెల్లూరు.**

☛ **(1)** కైకేయి మాట విని లక్ష్మణుడు రాముణ్ణి అనుసరించలేదు. అసలు కైక విధించిన షరతులలో, రాముని ఒక్కడినే వనవాసానికి పంపమని అడిగింది. కానీ, లక్ష్మణుడు స్వయంగా అన్నకు శుశ్రూష చేయాలనే మనోభీష్టంతో తల్లియైన సుమిత్రతో చెప్పి వెళ్ళాడు. అది ఆయన సంకల్పమే తప్ప ఇందులో కైక ప్రమేయమేమీ లేదు.

భరతుడు స్థితప్రజ్ఞుడు. తల్లి కోరిన కోరిక ధర్మ విరుద్ధంగా వంశానుచార సూత్రానికి వ్యతిరేకంగా ఉన్నది. పైగా తాను రామునియందు ప్రేమబద్ధుడు. భరతలక్ష్మణులిద్దరూ శరణాగతులే. స్వయంగా అగ్రజసేవకు పూనినవాడొకడైతే; అయాచితంగా వచ్చిన సింహాసనాన్ని వదలినవాడొక్కడు. ఈ ఇద్దరు మహాత్యాగులు. మానవతా పూర్ణులు. ఇక్కడ పోలికనేది లేదు. ఇద్దరూ గొప్పవారే!

**(2)** కుంభకర్ణుడు తమోగుణ భూయిష్ఠుడు. రావణుడు రజోగుణభూయిష్ఠుడు. తమోగుణంపాలు కూడ ఎక్కువే. విభీషణుడు సత్త్వగుణ ప్రధానుడు. సత్త్వం సామాజికపోషణకు సమత్వానికి నిదర్శనం. రాక్షసజాతిని రక్షించిన విభీషణుడే కాలధర్మాన్ని ఆచరించాడు. త్రేతాయుగంలో ధర్మం మూడు పాదాలతో నడిచింది. కనుక ఆ ధర్మాన్ని రక్షించినవాడు విభీషణుడు.

రావణకుంభకర్ణులు, వైకుంఠ ద్వారపాలకులైన జయ విజయులని గుర్తుంచుకోవాలి.

**వేదాలకు అధిష్ఠాన దేవతల గురించి తెలియచేయగలరు. శరీరంలోని షట్చక్రాలను గురించి తెలుపగలరు.**

**- ఏ.పి.రాజయ్య, జగిత్యాల.**

☛ వేదాలకు ప్రత్యేకంగా అధిష్ఠానదేవతలెవ్వరూ లేరు. ఒక్కొక్క సూక్తంలో ఒక్కొక్క అధిదేవత ప్రముఖంగా చెప్పబడింది. భగవంతుని యొక్క అనగా విరాట్పురుషుని యొక్క నిశ్వాసమే వేదమని 'అస్య మహతో భూతస్య నిశ్వసితం యదృగ్వేద' అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పింది. సాయణాచార్యులు కూడా, వేద భాష్య భూమికా ప్రారంభంలో "యస్య నిశ్వసితం వేదాః యోవేదేభ్యోఽ ఖిలం జగత్" అన్నాడు. ఋగ్వేదం ఇంద్రునకెక్కువ ప్రాధాన్యమిచ్చింది. తరువాత అగ్ని. ఋగ్వేదం హౌత్రాన్ని – యజస్సు ఆధ్వర్యవాన్ని – సామం ఔద్గాత్రాన్ని ప్రతిపాదించాయి. ఇందులో బ్రహ్మకర్తవ్య ప్రతిపాదనం లేదు. పరబ్రహ్మ చక్కగా నిష్పన్నం కాలేదు. అధర్వవేదం బ్రహ్మతత్త్వప్రతిపాదనం చేసింది. అందుకే యజ్ఞాలలో అధర్వ వేదజ్ఞుడే బ్రహ్మ స్థానంలో ఉండాలని గోపథబ్రాహ్మణం "ఋగ్విదం ఏవహోతారం వృణీష్వ– యజుర్విదం అధ్వర్యుమ్ – సామవిదం ఉద్గాతారం – అధర్వాంగిరోవిదం బ్రహ్మాణం" అని చెబుతున్నది. శరీరంలో షట్చక్రాలు తాంత్రిక యోగ విద్యకు సంబంధించినవి.

**మూలాధారం గుదస్థానం, స్వాధిష్ఠానం తు మేహనమ్**
**నాభిస్తు మణి పూరాఖ్యం హృదయాబ్జ మనాహతమ్**
**తాలుమూలం విశుద్ధాఖ్యం ఆజ్ఞాఖ్యం నిటలాంబుజమ్**
**సహస్రారం బ్రహ్మరంధ్ర ఇత్యాగమ విదో విదుః.**

– వీటిని ఊర్ధ్వలోక సప్తకమంటారు.

7. సహస్రారం – సత్యలోకం – పరమాత్మస్థానం
6. ఆజ్ఞాచక్రం – తపోలోకం – జీవాత్మస్థానం
5. విశుద్ధ చక్రం – జనలోకం – ఆకాశభూతస్థానం
4. అనాహతం – మహర్లోకం – వాయుభూతస్థానం
3. మణిపూరకం – సువర్లోకం – అగ్నిభూతస్థానం
2. స్వాధిష్ఠానం – భువర్లోకం – జలభూతస్థానం
1. ఆధారము – భూలోకం – పృథ్వీభూతస్థానం

**1. మూలాధారచక్రం :** మలరంధ్రానికి సుమారు రెండంగుళాల పై భాగంలో ఉంటుంది. దీని రంగు ఎఱ్ఱగా (రక్తవర్ణం) ఉంటుంది. నాలుగురేకులుగల తామరపూవాకారంలో ఉంటుంది. దీనికి అధిపతి గణపతి; వాహనం– ఏనుగు. బీజాక్షరాలు వం–శం–షం అనేవి.

**2. స్వాధిష్ఠాన చక్రం :** ఇది జననేంద్రియం వెనుక భాగాన, వెన్నెముకలో ఉంటుంది. అధినేత బ్రహ్మతత్త్వం. జలం - సింధూరవర్ణంలో ఉంటుంది. ఆరురేకుల పద్మాకారంలో ఉంటుంది. దీనికి అక్షరాలు బం-భం-మం-యం-రం-లం. వాహనం మకరం.

**3. మణిపూరక చక్రం :** బొడ్డునకు మూలంలో వెన్నెముక యందుంటుంది. దానికి అధిపతి విష్ణువు. పదిరేకుల పద్మాకారంలో ఉంటుంది. బంగారపు వర్ణంతో ఉంటుంది. అక్షరాలు డం-ఢం-ణం-తం-థం-దం-ధం- నం-పం. వాహనం కప్ప.

**4. అనాహత చక్రం :** ఇది హృదయం వెనుక వెన్నెముకలో ఉంటుంది. దీనికధిదేవత రుద్రుడు. నీలం రంగులో ఉంటుంది. పన్నెండురేకుల తామరపూవువలె ఉంటుంది. అక్షరాలు కం-ఖం-గం-ఘం-ఙం-చం- ఛం-జం-ఝం-ఞం-టం-ఠం. తత్త్వం వాయువు. వాహనం లేడి.

**5. విశుద్ధచక్రం :** ఇది కంఠము యొక్క ముడియందుం టుంది. దీనికధిపతి జీవుడు. నలుపురంగు. అక్షరాలు అం-ఆం-ఇం-ఈం-ఉం-ఊం-ఋం-ౠం-ఏం-ఐం-ఓం-ఔం-అం-అః తత్త్వమాకాశం - వాహనం ఏనుగు.

**6. ఆజ్ఞాచక్రం :** ఇది రెండు కనుబొమ్మల మధ్యలో భ్రుకుటి స్థానంలో ఉంటుంది. దీని కధిపతి ఈశ్వరుడు. తెలుపురంగు. రెండు దళాలు గల పద్మాకారంగా ఉంటుంది. అక్షరాలు హం-క్షం.

**7. సహస్రారం :** ఇది కపాలం పై భాగంలో మనం మాడు అని పిలిచే చోట ఉంటుంది. దీనినే బ్రహ్మరంధ్రమంటాం. దీని కధిపతి పరమేశ్వరుడు. వేయిరేకుల పద్మాకృతితో ఉంటుంది. సుషుమ్నానాడి పై కొనమీద ఈ చక్రం ఉంటుంది. అక్షరాలు- విసర్గలు. దీనికి ఫలం ముక్తి.

**(1) బ్రహ్మ కడిగిన పాదము అంటారు. అది ఎప్పుడు ఏ సందర్భంలో జరిగిందో వివరించండి.**

**(2) క్షీరసాగరమథన సమయంలో చంద్రుడు జన్మించాడు. అంతకు ముందు సూర్యుడు మాత్రమే ఉండేవాడా?**

**- ఆర్.సావిత్రి, నరసారావుపేట.**

☛ **(1)** మహావిష్ణువు వామనావతారంలో, బలిచక్రవర్తిని మూడడుగులు దానమిమ్మని యాచించినాడు. బలిచక్రవర్తి బ్రహ్మప్రీతిగా మూడడుగులు దానం చేశాడు. ఒక అడుగుతో ఆకాశమంతా కప్పివేశాడు. అదే పరమాత్మ విశ్వరూప (విరాట్స్వరూప) ప్రదర్శనం. ఆకాశమంతా ఆక్రమించిన విష్ణుపాదాన్ని బ్రహ్మదేవుడు ప్రక్షాళించి (కడిగి) ఆ జలమంతా తన కమండలములో భద్రపరచుకొన్నాడు. తరువాత కాలంలో భగీరథుని తపస్సునకు మెచ్చి, ఆ జలాన్నే భగీరథుని వెంట వదిలినాడు. అదే గంగానదిగా ప్రసిద్ధి చెందింది. అదియే ఆకాశంలో 'మందాకిని' అనీ; పాతాళంలో భాగీరథి అనీ; భూలోకంలో 'జాహ్నవి' - గంగ అనే పేరులతో ప్రసిద్ధి చెందిన పవిత్ర నది. మూడులోకాలలో ఉన్న కారణంగా దీనికి 'త్రిపథగ' 'ముస్త్రోవ' అనే పేర్లు సార్థకమయ్యాయి.

**(2)** చంద్రుడు మహావిష్ణువు యొక్క వామ (ఎడమ) నేత్రం. కనుక విష్ణువువలే అనాదిగా ఉన్నవాడే. అత్రిమహర్షి భార్యతో కూడియుండగా మదన ప్రేరణ చేత ఆయన వీర్యం పతనమైంది. దానిని వాయుదేవుడు మూడుగా విభజించాడు. ఒకభాగం అత్రిమహర్షి కంటిలో పడింది. అత్రి తపస్సు చేయ పూనుకొన్నాడు. అపుడాయన కంటిలోనుండి తేజస్సు బయలు దేరింది. ఆ తేజస్సును దశదిశలు ధరించాయి. కానీ ఆ భారం భరించలేక ఆ తేజస్సును వెడలగ్రక్కి సముద్రంలో పడవేశాయి. సముద్రంలో పడిన ఆ తేజస్సునకు బ్రహ్మపురుష రూపమిచ్చాడు. దేవదానవులు క్షీరసముద్రం చిలికినపు డా చంద్రుడే అందుండి ఉద్భవించాడు.

రేతస్సులో మరియొక భాగం నుండి చంద్రుడు జన్మించాడు. దుర్వాసోముని శాపకారణంగా స్వర్గసంపదలతో ఆతడు కూడ సముద్రంలో కలిసిపోయి, సముద్రమథనవేళ సముద్రం నుండి మరల జన్మించాడనియు భావించవలసి ఉంటుంది.

చంద్రుడెప్పుడూ ఉంటాడు. చంద్రునిలో ఒక అంశ మాత్రమే సముద్రంలో కలసిందన్నా మరల జన్మించిందన్నా అదే అర్థం. ఒక చంద్రకళ సముద్రం నుండి వచ్చిందని భావించాలి. భౌతికరూపమైన చంద్రుడెప్పుడూ ఉంటాడు. ఇది విజ్ఞాన శాస్త్ర ప్రకారం చెప్పబడింది కాదు. కేవలం పౌరాణికగాథాను సారం చెప్పబడింది.

# త్యాగయ్య ఆత్మనివేదన

**- సుస్వరం నాగేంద్రకుమార్**

కర్ణాటక సంగీత ప్రపంచాన సుప్రసిద్ధులైన సంగీత త్రిమూర్తులలో త్యాగరాజస్వామివారు ప్రప్రథముడు. ఈయన కృతులు సంగీత ప్రపంచానికే పరిమితంగాక సాహిత్య ప్రపంచానికి కూడా ఆదర్శప్రాయమైనవని చెప్పవచ్చు. త్యాగయ్యకృతులు అతిచిన్నవైనా అర్థబహుళత్వాన్ని కల్గినవి. ఈ కృతుల్లో వ్యర్థపదాలు కన్పించవు. కృత్యర్థం వేదశాస్త్ర ఉపనిషత్పురాణాలకు సంబంధించింది. అందులో ముఖ్యంగా శ్రీమద్రామాయణానికి సంబంధించినదై ఉంటుంది.

త్యాగరాజస్వామివారు నవవిధభక్తులలో ఒకటైన కీర్తన భక్తిని అవలంబించారు. త్యాగరాజస్వామి కృతుల్లో "దుడుకు గలనన్నే దొరకొడుకు బ్రోచురా" అనేది ఒక ఆణిముత్యం. ఇది తాత్త్వికదృష్టిని, భక్తిని, ధర్మజాగృతిని పెంపొందించే కృతి.

**పల్లవి : దుడుకు గల నన్నే దొర కొడుకు బ్రోచురా ఎంతో**

**అర్థం :** ఎంతో దుడుకుతనంగల నన్ను ఏ ప్రభువు యొక్క కుమారుడు రక్షిస్తాడు?

**విశేషార్థం :** ఏ చిన్నపిల్లవాడైనా తుంటరిపనులు చేస్తే తల్లిదండ్రులుగానీ, గురువుగానీ ఆ పిల్లవానిని దండిస్తారు. కానీ మహాభక్త శిఖామణియైన శ్రీ త్యాగరాజస్వామివారికి "దుడుకుతనం" ఎక్కడిది? లేదు. అయితే కవి భావమేమిటో తెలుసుకోవడం చాలా అవసరం.

వేదాల్లో, ఉపనిషత్తుల్లో, పురాణాల్లో భగవంతుడు ఆదేశించిన విధంగా, తాత్త్వికదృష్టిని కల్గియుండక భక్తిహీనుడనై స్వేచ్ఛగా, ఇచ్ఛ వచ్చినట్లుగా మెలగినానని ఆర్ద్రతతో పలికిన వాక్యమది. దుడుకుతనం తన మీద ఆపాదించుకొని శ్రీరామచంద్రుని దగ్గర విన్నవించుకొన్న పలుకులవి. మరి శ్రీరామచంద్రుని సాక్షాత్కారానికి కావాల్సిన భక్తి ఎందుకు లేకపోయిందని తమను తామే ప్రశ్నించుకుంటే...

**అనుపల్లవి : కడుదుర్విషయాకృష్టుడై గడియ గడియకు నిండారు**

**అర్థం :** గడియగడియకు దుర్విషయాలతో నిండిఉన్న మనస్సు శ్రీరామపాదారవిందాన్ని చేరడంలేదని, భక్తి కల్గుటలేదని కవి చింతించాడు.

తన హృదయం "క్షణక్షణమునకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులైన విషయాల వైపు ఎక్కువగా మక్కువ చూపుతున్నదని, ఆ మనస్సు ద్వారా బుద్ధి కలుషితమైందని, అలాంటి చెడుబుద్ధిని కల్గిన, దుర్విషయాలతో నిండిన నాకు శ్రీరామపాదారవింద భక్తి, ఎలా కల్గుతుంది? శ్రీరామసాక్షాత్కారం ఏ విధంగా కల్గుతాయంటూ త్యాగయ్య వాపోయాడు.

**చరణాలు : 1. శ్రీవనితాహృత్కుముదాబ్జా వాఙ్మనసాగోచర**

అనే మొదటి చరణంలో శ్రీ లక్ష్మీదేవికి హృదయమనే కలువపువ్వుకు చంద్రుడవు. త్రికరణాలకు అగోచరుడవు. వేదాలకు అగోచరుడవు. నీ మహిమలు బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదులకు కూడా తెలీవు. కానీ దుర్విషయాసక్తుడైయున్న నాకు నీ మహిమలు స్తుతించడానికి, మనస్సుతో కొలవడానికి ఏ విధంగా సాధ్యపడుతుంది" అని తనలో తానే చింతించాడు.

**2. సకల భూతములయందు నీవై యుండగ మదిలేక పోయిన**

"దుర్విషయాల బారినపడిన నా మనసు సకల చరాచర సృష్టియందు, అణురేణుతృణ కాష్ఠాలందు నీవు నిండి ఉన్నావని తెలుసుకోలేకపోయింది" అనే భావం వెల్లడించారు.



**3. చిరుత ప్రాయమునాడే భజనామృత రసవిహీన కుతర్కుడైన -** అనే మరొక చరణంలో – చిన్న వయస్సులోనే భజన అనే అమృత రసవిహీనుడై శుష్కమైన, విపరీతమైన వాదాలను చేసిన నన్ను ఏ ప్రభువు రక్షిస్తాడు.

భాగవతంలో చెప్పినట్లు భక్తి అలవడాలంటే కౌమారా వస్థ నుండే భాగవత ధర్మాలు బుద్ధిమంతులు ఆచరించాలి. తద్వారా మానవుడు భక్తి పరిపక్వం చెంది భగవత్సాయుజ్యాన్ని పొందుతాడు.

కాబట్టి చిన్నవయస్సులో సంస్కారహీనత వల్ల శుష్క తర్కంచే రసశబ్దవాచ్యుణ్ణి తెలుసుకోలేకపోతిని. భజన అనే అమృతసముద్రంలోని రసాన్ని గ్రోలలేక పోయిననన్నే దొర కొడుకు బ్రోచును అని తనలో తానే శ్రీరాముని వేడుకున్నాడు.

**4. పరధనముల కొరకు నొరులమది కరగబలికి కడుపునింప తిరిగి నట్టి-** అనే చరణంలో

'ధనాశతో పరులమది కరిగే విధంగా మాట్లాడుతూ కడుపు నింపుకొని తిరిగిన నన్ను ఏ దొరకొడుకు బ్రోచును'. పరుల ధనాన్ని ఆశించవద్దని ఉపనిషద్వాణి.

సత్యాన్ని పలుకవలెను, కానీ అది ప్రియంగా ఉండాలి. అసత్యమైన ప్రియాన్ని ఎన్నటికీ పలుకకూడదు. కానీ

## గమనిక

**శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య ప్రసాద పథకం 1999 సంవత్సరంలో ప్రారంభించబడింది. కొంతకాలానికి ఈ పథకం శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య అన్నదాన పథకంగా మార్చ బడి 31-3-2009 వరకు కొనసాగింది. తర్వాత ఈ పథకాన్ని ఎస్.వి.నిత్యాన్నదానం ట్రస్టులో కలపడం జరిగింది. ఇప్పుడు ఇదే పథకాన్ని "శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య అన్నదానం ట్రస్టు" గా మార్చడం జరిగింది.**

**ఈ మార్పును భక్తులు గమనించి ఇకపై ఈ ట్రస్టుకు డి.డి.లు పంపగోరు భక్తులు "శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య అన్నదానం ట్రస్టు" పేర పంపగలరు.**

"నేను ధనాశతో ఇతరుల హృదయాన్ని సంతోషపరచే విధంగా మాట్లాడి కుజనుల పక్షం చేరి కడుపునింపుకొని తిరిగేవాడనైతి నని, అటువంటి నన్ను శ్రీరాముడు ఏ విధంగా బ్రోచును?" అని అన్నాడు. పుట్టుకతో మహాభకుడైన త్యాగయ్య వినయానికి తార్కాణ మీ చరణం.

**5. తనమదిని భువిని సౌఖ్యపు జీవనమేయనుచు సదా దినములు గడిపిన**

మనసులో ప్రాపంచిక సుఖమే శాశ్వతమని భావించి నిర్ధారించి రోజులు గడపిన నన్నెవరు కాపాడుతారనే ఈ చరణంలో ఈషణత్రయము అనగా భార్య, బిడ్డలు, సంపద మానవునకు అత్యంత ఆకర్షణీయములైనవి. కాబట్టి వాటిని అనుభవిస్తూ దినములను గడపితినేయని వినయసూచకంగా శ్రీరాముని ముందు ఆవేదన చెందాడు త్యాగరాజు.

సాధనలను చేసుకోవడానికి ఈ పుణ్యభూమికి వచ్చిన నేను అల్పసంతోషాల కోసం ఆయువును వ్యర్థం చేసుకొంటిని కదా! అని శ్రీరాముని చెంత చింతించాడు.

**6. "తెలియని నట విట శూద్రులు వనితలు స్వవశమౌట కుపదేశించి సంతసిల్లి స్వరలయంబులెరుంగకను శిలాత్ముడై సుభక్తులకు సమాన ముగు"** – అనే చరణంలో కఠిన హృదయముచే సుభక్తులకు సమానమని చెప్తూ, అజ్ఞానులను, నట, విటులను, స్త్రీలను వశపరచుకోవడానికి స్వరలయరాహిత్యంతో భగవత్కీర్తనలను పాడుతున్న న న్నే దేవుడు కాపాడుతాడు.

**విశేషార్థం : స్వరలయంబులెరుంగకను**

**స్వరం:** స్వతోరంజయతీతి స్వరం. అనగా స్వయంగా ఏ సహా యం లేకుండా రంజింపజేయునది స్వరం. అది ఓంకారం. ఓంకారమే ప్రప్రథమ స్వరం. ఆ స్వరం నుండే అపౌరుషేయా లైన నాలుగువేదాలు పుట్టాయి. అవి ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం. ఇందులో సామవేదం సంగీతా నికి ఉగమస్థానమై యున్నది. అందుకు సుస్వర రాహిత్యంచే సామ గానలోలుణ్ణి చేరుకోలేకపోవుచుంటిని కదా!

**లయ :** తాళగతి ప్రాధాన్యం గలది లయ. లయకభిమాన దేవత శంకరుడు. కావున శంకరానుగ్రహం మరియు ఓంకార

శబ్దవాచ్యుడగు విష్ణుని అనుగ్రహం లేక మందమతినై అహం కారంతో భక్తులకు అనగా భృంగి, నటేశ, సమీర, ఘటజ, మతంగ, నారద, తుంబుర ప్రభృతులకు సమానమని చెప్తూ అజ్ఞానులను వశపరచుకోవడానికి హితబోధ చేస్తున్నాను. న న్నే దేవుడు కాపాడుతాడని చింతించాడు.

**7. "దృష్టికి సారంబగు లలనా సదనార్భక సేనామిత ధనాదులను దేవాదిదేవ! నెరనమ్మితినిగాకను పదాబ్జ భజనంబు మరచిన "** – అనే చరణంలోనే ఓ దేవాదిదేవ! స్థూలదృష్టికి ఆకర్షణీయంగా కనిపించే వనిత(భార్య) గృహం, సంతానం, సేవకులు, అమిత ధనాన్ని శాశ్వతమని నమ్మి నీ పాద భజనను మరచిన నన్నే స్వామి మన్నించుము అని త్యాగయ్య విచారించాడు.

"మా కురు ధన జనయౌవన గర్వం హరతినిమేషా త్కాల స్సర్వం..." అని ఆదిశంకరాచార్యులు నుడివిన విధంగా ఈ ప్రపంచంలోనివన్నీ నశ్వరాలైనవి. కావున ధనం, జన, యౌవన గర్వాన్ని కల్గియుండవద్దు అని అంటారు.

**8. "చక్కని ముఖకమలంబును సదా నా మదిలో స్మరణలేకనే దుర్మదాంధ జనులకోరి పరితాపములచే తగిలి నొగిలి దుర్విషయ దురాశలను రోయలేక సతతమపరాధియై చపలచిత్తుడయిన"** –

పద్మం వంటి అందమైన ముఖాన్ని నా మనస్సులో చింతింపక దుర్మదాంధ జనులనుచేరి పశ్చాత్తాపం పొందుతూ, దుర్విషయాల్ని దురాశలను వదల్లేక ఎల్లవేళల అపరాధియై, చపలచిత్తుడైయున్న న న్నే దొరకొడుకు కాపాడును?

"చక్కని ముఖకమలము"– "సహస్ర శీర్షా పురుషః" అని వేదవాణి. భగవంతుని ముఖం పరమయోగులకు భావ నిధానం. బ్రహ్మేంద్రాదులకగోచరం. అనంతం, అప్రమేయం. ఆ ముఖం నుండే ఇంద్రుడు, అగ్ని పుట్టారట. ఆ ముఖాన్ని దర్శించడానికి తాపసులు అనేకానేక యుగాలు తపస్సు చేసినా ఆ ముఖదర్శన భాగ్యం దుర్లభమైనది. కోటి సూర్య ప్రకాశమైన ఆ ముఖకమలాన్ని మదిలో స్మరించక, దర్శించక పోతినే అని భక్తకవి హృదయం.

**9. "మానవతను దుర్లభమనుచునెంచి పరమానందమొందలేక మదమత్సరకామలోభమోహాలకు దాసుడై మోసపోతిగాక మొదటి కులజుడగుచు భువిని శూద్రుల పనులు సల్పుచునుంటిని గాక నరాధములను చేరి సారహీన మతములను సాధింప తారుమారు".**

మానవజన్మపొందటం అతికష్టం. అది లభించి నందుకు పరమానందం పొందలేక అరిషడ్వర్గాలకు దాసుడై మోసపోతిని కదా! అజ్ఞానినై నీచమైన పనులు చేస్తున్నాను కదా! అనేక కోట్ల హీనజన్మల తర్వాత మానవజన్మ వచ్చిం దని తెలుసుకోలేక కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్స రాలను పెంచుకొని మోసపోతిని కదా! తద్వారా ముక్తిని దూరం చేసుకొన్నాను. కానీ, మానవజన్మను సార్థకం చేసు కోలేకపోతిని. అజ్ఞానులు చేసేటటువంటి పనులను చేస్తూ, పనికిరాని ఆలోచనలను చేస్తూ వాటినే సాధిస్తున్నాను. ఇలా బతుకును తారుమారు చేసుకొంటినన్న వినయోక్తులచే త్యాగయ్య ఉపాస్యమూర్తి శ్రీరాముని ప్రార్థించుకొన్నాడు.

**10. "సతులకై కొన్నాళ్లాస్తికై సుతులకై కొన్నాళ్లు ధనతతులకై తిరిగి తినయ్య త్యాగరాజాప్త యిటువంటి"** – అనే చివరి చరణంలో

"భార్యా వ్యామోహంతో కొన్నాళ్లు, ఆస్తికై కొన్నాళ్లు, పిల్లలకై కొన్నాళ్లు, ధనార్జనకై కొన్నాళ్లు తిరిగితినయ్యా రామా! నిన్ను నిముషం కూడా తలచని నన్ను ఏ దేవుడు రక్షిస్తాడు?" అని త్యాగయ్య వాపోయాడు.

"ప్రతి ప్రాణికి జననమరణాలు సహజమైనవి. ప్రతి జన్మలోనూ నేను భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు వీటి యందే దృష్టిని కలిగి నిన్ను తలచకపోతిని. ఇలా ఇంకెన్ని జన్మల యందు జ్ఞానరహితుడనై ఉండాలి? నాకు సుజ్ఞానాన్ని ప్రసాదించి నన్ను కాపాడు" అని త్యాగరాజు వినయవిధేయత లతో రామభక్తిని తనలో సుస్థిరం గావించుకొని ఆ స్వామిని ప్రార్థించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ పై కృతియంతా పూజాంతంలో చెప్పే 'అపరాధ సహస్రాణి క్రియంతే అహర్ని శంమయా తాని సర్వాణిమే దేవ క్షమస్వ పురుషోత్తమ" అనే ప్రార్థనా శ్లోకానికి ప్రామాణికమైన అనువాదమని చెప్పవచ్చు.

ఈ విధంగా త్యాగరాజస్వామి భక్తులకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రసాదిస్తూ, పై కృతి ద్వారా మానవాళినంతా భక్తి మార్గంలో నడిపిస్తూ, నవవిధభక్తులలో ఒకటైన ఆత్మనివేదన భక్తితో శ్రీరామచంద్రుణ్ణి ప్రార్థించాడు.

# ఊర్మిళ

– వై.సి.పి. వెంకటరెడ్డి

కవుల ఉపేక్షకు గురియై, కావ్యజగత్తుకు దూరమై మూగవేదన అనుభవిస్తున్న నారీ మణులు విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు హృద యాంబుధిలో భావతరంగాలనుద్దీపింపజేశారు. వారిని గురించి రవీంద్రుడు 'కావ్యేర ఉపేక్షితు' అనే వ్యాసం రాశాడు. అందులో ఆయన 'ఊర్మిళ'ను గురించి రాసిన మాటలు ఇవి – "మహాకావ్య సుమేరు శిఖరం మీద ప్రాతఃకాల తారలా ఉదయిం చావు. తదుపరి అరుణలోకంలో నీ ఉనికి కన్పించ లేదు. నీ ఉదయాద్రి ఎక్కడున్నదో, అస్తాచలమెక్కడు న్నదో ప్రశ్నించడం కూడా జనం మరచిపోయారు".

రవీంద్రనాథఠాగూర్, ఆచార్యద్వివేదిల రచన లతో ప్రేరణపొందిన ప్రఖ్యాత జాతీయకవి మైథిలీ శరణ్‌గుప్త సాధ్వీమణుల పంక్తిలో ఊర్మిళకు ఉచితా సనం వేయపూనుకొని ఉన్నతాసనమే వేశారు.

సాహితీవేత్తలుపేక్షించిన ఊర్మిళకు ప్రాధాన్య మిస్తూ మైథిలీశరణ్‌గుప్త హిందీలో 'సాకేత్' అనే మహాకావ్యం రచించారు. ఆధునిక ప్రఖ్యాతహిందీ కావ్యాల్లో ఒకటిగా పరిగణింపబడుతున్న ఈ కావ్యంలో ఊర్మిళ పాత్ర చిత్రీకరణలో కవి కనబర చిన కౌశలం ప్రశంసనీయం. కొత్తగా అత్తగారింటికి వచ్చిన ఊర్మిళ ఆనందాబ్ధిలో ఓలలాడుతూ పాఠకుల సమక్షంలో ప్రత్యక్షమౌతుంది.

అరుణాంబరం ధరించిన ఊర్మిళ సౌందర్యా నికి సమ్మోహితుడైన లక్ష్మణుడు, "ఎర్రని కోకగట్టి భవనమ్మున నిల్చి దరహాసము చేయుచునున్న దెవ్వరీమె?" అని ప్రశ్నిస్తాడు. నూతన దంపతులు ఊర్మిళ, లక్ష్మణుల సంభాషణ విభిన్న విషయాలపై సాగుతుంది.

నిస్సార జీవితంలో సారం నింపి, పేలవంగానున్న సంసార రేఖాచిత్రంలో రంగులు నింపి, మనోహరంగా మార్చు నేర్పు, ఓర్పు స్త్రీకి మాత్రమే కలదనే సత్యాన్ని తెలియజేస్తూ సమాజంలో స్త్రీకి గల గౌరవ ప్రదమైన స్థానాన్ని గురించి లక్ష్మణుడు ఊర్మిళతో అన్నమాటలు –

**భూబిలములు, గిరిగుహలును శూన్యగగన**<br>
**మంబుధులవని యెవరిజతజేరి**<br>
**స్వర్గసీమలగుచు కానిపించు తెలియ**<br>
**జేయవె పడతి పతిని జేరి**

స్త్రీజాతికి ప్రాతినిధ్యం వహించిన ఊర్మిళ మగవాని గొప్ప తనాన్ని అంగీకరిస్తూ...

**వెదకుచుందుము తగిన ఆశ్రయముకొరకు**<br>
**కోరుకొందుము నీలాంటి పురుషునొకని** – అని అంటుంది.

సంసారసాగరాన్ని దాటనెంచిన ప్రయాణికులెవరైనా జీవిత నౌకను సురక్షితంగా తీరానికి చేర్చేనేర్పుగల నావికుని కోసం తాపత్రయ పడటం సహజం. ఆ విషయాన్నే కవి ఊర్మిళతో పలికించాడు.

మంథర కుట్రకారణంగా శ్రీరామపట్టాభిషేక ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఆమె సృష్టించిన సుడిగుండం సీతా రామలక్ష్మణులను అరణ్యాలపాలు చేయడంతో శాంతించక దశరథుని సైతం పొట్టన బెట్టుకుని, ఊర్మిళ దాంపత్య జీవితంలో నిప్పులు పోసి విరహాగ్నిరగి ల్చింది. మండిన ఆ మంట పదునాలుగేళ్ళ వరకూ ఆరిపోకుండా విభిన్న ప్రకృతిచర్యలతో, గత స్మృతులతో నిరంతరం రగులుతూ ఆమెను మథనపెడుతూనే ఉండేది.

కైక కోరిక మేరకు అరణ్యాలకు వెళ్లడానికి సిద్ధపడిన శ్రీరామచంద్రుని వెంట వెళ్లడానికి ప్రయాణమైన సీతకు శ్రీరామచంద్రుడు



నయానభయాన నచ్చజెప్పి వారించినా, 'పతి లేని నగరంలో ఉండలేనని, భర్త వెంటనున్నచో నిర్జనారణ్యములు కూడా జనపదంబులేనని' తన తర్కబలంతో భర్తను నిరుత్తరుని జేసి కానకేగడానికి అనుమతి పొందుతుంది ఆమె. అయితే ఊర్మిళ పరిస్థితి అలాంటిది కాదు. తను కూడ భర్తవెంట వెళ్లడమా? భ్రాతృసేవార్థం కానలకేగుతున్న తన భర్త మహోన్నతాదర్శా లకు అంతరాయం కలుగకుండా నగరంలోనే ఉండిపోవడమా? అనే మానసిక సంఘర్షణతో సతమతమై చివరకు ప్రియుని మార్గానికి అవరోధం కలిగించడానికి మనస్కరించక పొంగి పొరలే దుఃఖాన్ని దిగమింగి మౌనంగా ఉండిపోతుంది.

లక్ష్మణుడు వియోగాన్ని జయించి, అగ్రజునననుసరించి అరణ్యాలకేగాడు. ఆనందాబ్ధిలో ఓలలాడాల్సిన వయసులో విధివంచితులై ఊర్మిళా లక్ష్మణులు విడిపోయారు. కోమల కుసుమ సదృశ్యమైన సుకుమారి ఊర్మిళ దేహం విరహ తాపంతో తపించి, కృశించి కంకాళంలా మిగిలిపోయింది. ఆమె ముఖాన్ని వర్ణిస్తూ **'వాడి పోయిన వదనమ్ములో కాంతియుం తరించె, కళ్లలో అశాంతి కానిపించె'–** అంటాడు కవి.

చిత్రకూటంలో సీతాదేవి చాలా చాకచక్యంగా ఊర్మిళ లక్ష్మణులు కలుసుకోవడానికి ఏర్పాట్లు చేస్తుంది. కుటీరంలో నున్న ఊర్మిళను కలుసుకున్న లక్ష్మణుడు గుర్తించుటకు వీలు లేనంతగా కృశించిన ఆమెను చూసి విస్మయుడై నోటమాట రాక స్థాణువులా ఉండిపోయాడు. అతని పరిస్థితి గమనించిన ఊర్మిళ ఇలా అంటుంది.

**నా ఉపవనంబున విహరించు లేడి వీవు**
**భయము దేనికి బంధింప నిన్ను నేను**

భర్త మనస్తత్వం పసిగట్టిన ఊర్మిళ, 'మనఃపూర్వకం గానే నిన్ను వదలివేశాను, మళ్లీ ఎందుకు బంధిస్తాన'ని అభయమివ్వగా ఆమె త్యాగనిరతిని వర్ణించడానికి మాటలు చాలక భావావేశంతో–

**పరుగున చని సౌమిత్రి, పడెను పత్ని పాదాలమీద**
**తడిపి వేసెను ప్రియుని పాదాలు ఊర్మిళ కన్నీటి తోడ**

వర్ణింప శక్యంకాని సన్నివేశమది. రెండు ఆవేశాల సమాగమం. రెండు అగాధ హృదయ సాగరాల సంగమం. ఆ సంగమంలో ప్రపంచం లయమైపోయింది. అనేక మనో భావాల సంఘర్షణల మూలంగా మాటలు కరువయ్యాయి. తన్నెడబాసి కానలకేగిన కాంతునితో ఎన్నో సంగతులు చెప్పా లని తాపత్రయపడిన ఊర్మిళ ఏమీ చెప్పలేకపోయింది.

**చెప్పదలచితి యెన్నెన్నో హృదయ మిప్పి**
**చెప్పలేనైతి నా కర్మ ఫలితమేమొ**
**దేనిలో కలుగునో తృప్తి నీకు**
**నాకు కలుగు నానంద మాకార్యమందె**

విస్మయం, కరుణ, ప్రేమ ముప్పిరిగొని హృదయాన్ని ముట్టడించడంతో ఉక్కిరిబిక్కిరై దిక్కుతోచక, చెప్పదలచుకున్న దంతా మరచిపోయి నీకు తృప్తి కలిగించు చర్యయే నాకూ తృప్తి కలిగించగలదంటూ ఒక్క మాటలో తన మనోభావాన్ని వ్యక్తం చేసిన ఊర్మిళ మాటల్లో ఎంత ఆవేదన, ప్రేమ, ఆప్యాయత ఇమిడున్నాయో వేరుగా చెప్పాల్సినవసరం లేదు.

ఆనాటినుండి ఊర్మిళ వియోగం ఎక్కువ కావడంతో ఆమె దేహం నుండి ఉద్భవించిన వియోగాగ్ని తాపంచే మలయానిలం కూడా వడగాడ్పుగా మారిపోయే ప్రమాద ముందని ఊర్మిళ నోటితో పలికించాడు కవి.

**మలయమారుతమా నీవు మరలి పొమ్ము**
**కాల్చుచున్నది శాపమై గడువునన్ను**
**వేడిగాడుపై విరహాగ్ని వేచునేమొ**
**తడవు చేయక తరలుమో దయ తలంచి.**

విరహతాపముపశమింపచేసే ఉద్దేశంతో తాళ పత్రపు వీవనతో వీవగా విరహాగ్ని రగులుకొని భగ్గుమంటుంది.

**తొందరెందుకే సఖియరో తాళు తాళు**
**తాటియాకుల వీవన ధాటికేమొ**
**హృదయముననున్న విరహాగ్ని రగిలి రగిలి**
**చల్లబడుటకు మారుగా చెలగిమండె**

కవియొక్క కల్పనాశక్తి వర్ణనాతీతం. విసనకర్రతో వీవగా నివురుగప్పిన నిప్పు రగిలి మండినట్లు, ఊర్మిళ హృద యాంతరాళంలో నున్న విరహాగ్ని కూడా గాలి తగులగానే రగులుకొని భగ్గుమనటం వల్ల విరహతాపాన్ని ఉపశమింప చేయడానికి చెలికత్తెలు చేసిన ప్రయత్నం విఫలమైంది. ప్రోషిత

పతికగా కాలం గడపడం కష్టమైంది ఊర్మిళకు. క్షణమొక యుగంగా తోచడంతో తనమీద సానుభూతి చూపు ఆత్మీయుల కోసం ఆమె ఆరాటపడసాగింది.

అయోధ్యలో తనలాంటి ప్రోషితపతికలెవరూ తారస పడనందువల్ల చిత్రలేఖనంలోను, శుక,శారికల నాడించడం లోను కాలం గడపసాగింది ఊర్మిళ.

ఎలాగో పగలు గడచిపోయినా రాత్రిగడవడం దుర్భర మైంది. ప్రియుని వదనారవింద దర్శనాభిలాషియైన ఊర్మిళ కనీసం స్వప్నంలోనైనా తన కోరిక నెరవేరుతుందని ఆశించింది కాని, ఆ రాత్రి నిదుర రానేలేదు.

**నిదురయేరాక గడచెను నేటి రాత్రి**
**కాంతునెటుజూతు నిక నేను కలలయందు**
**చుక్కలన్నియు నెచటికో సాగిపోయె**
**ఎటుల గడుపుదు దినమంత చింతతోడ**

ఏ యువతి కూడా తన ప్రియునికి దూరమై ఎంతో కాలం జీవితం గడపజాలదు. చంద్రునికోసం నిరీక్షించే చకోరంలా తన భర్త దర్శనార్థం పరితపిస్తుంది ప్రోషిత పతిక. ఊర్మిళ కూడా ఈ కోరికకు అతీతురాలుగా ఉండలేక పోయింది.

అడవికి వెళ్ళి భర్తతో కలసి మాట్లాడకపోయినా పొదలచాటునుండి చూసి తృప్తి పడదామనుకుంటుంది ఊర్మిళ. ఆ కోరికలో ఎంత అమాయకత్వం, దైన్యం సమ్మిళితమై ఉన్నవో వేరుగా చెప్పనవసరం లేదు. భర్తతో కలసి శారీరక, మానసిక సుఖాల ననుభవించిన యవ్వనవతి ఊర్మిళ. గతస్మృతులు జ్ఞాపకం రాగా మనసులో కలిగిన వికారాన్ని సంబోధించి ఓదారుస్తుంది.

**చపలచిత్తవు యౌవనమా చలమదేల**
**హరముజేసియునను నీవు యహరహంబు**
**బాధపెట్టగ నీవేమిబాముకొందు**
**నిదురబోగదే యెడిలోన చింతలేక**

మన్మథుడు సుమశరాలు సంధించి ఆమెపై దండెత్తగా వివశయై ఇలా వేడుకుంటుంది.

**విరహవేదనబొందిన బాలనేను**
**పుష్పబాణములెందుకు వేతువయ్య**
**పతికిదూరమై విరహాగ్ని వేగుచున్న**
**అబల మీదను దయజూపుమకట నీవు.**

చిలిపి మన్మథుడామె వేడికోలును పెడచెవిని పెట్టి తన కార్యక్రమం కొనసాగింపగా ఊర్మిళకు పితయై –

**కుంకుమ తిలకము నొసటన్ గలదనేమొ**
**వచ్చినాడవిటకు నను భంగపరచ**
**బలముకలదేని తిలకించు భవునికన్ను**
**సాధ్యపడదేని వెడలిపో సిగ్గుతోడ**

ఆమె ఆత్మవిశ్వాసం అవర్ణనీయం. నయంతో వినని మన్మథుని భయపెట్ట ప్రయత్నించిన విధానం ప్రశంసనీయం. ఊర్మిళనొసటనున్న కుంకుమ బొట్టును పరమేశ్వరుని మూడవ కన్నుతో పోల్చిన కవిగారి కల్పన అపూర్వం. ఊర్మిళ పతి వియోగంతో కుములుతూ మూలకూర్చునే అబలకాదనీ, అవ సరం కలిగినప్పుడు వెనుకముందు లాలోచించక యుద్ధానికి కూడా సిద్ధపడే వీరనారియని నిరూపించడానికి కవి ఒక సన్నివేశాన్ని మన ముందుంచాడు.

సీతాదేవి నిర్జనారణ్యాలను కూడా రాజమందిరాలుగా మార్చుకుంటే, అంతఃపురాన్ని కుటీరంగా మార్చుకుంది ఊర్మిళ.

పదునాలుగేళ్ల కఠిన వ్రతానంతరం అయోధ్యకు తిరి గొచ్చిన భర్తను చూసిన ఊర్మిళ నేత్రాలు ఇలా ప్రశ్నించాయి.

**చెలగి యేతెంచె పతినేడు సుఖము తోడ**
**నోలలాడిరి జనమంత నానందమునను**
**వంతజెందితిమేమెంతో పతిని గాంచి**
**ఎటులదెత్తుము యౌవనమ్మంచు నేడు**

భర్తకోసం దాచిన యవ్వన ధనరాసి తరిగిపోగా ఆమెకమితమైన బాధకలిగింది. పదునాలుగేళ్ల గడువు పెద్దబండరాయిలా ఊర్మిళ ఎదమీద భారమై నిల్వగా తన కన్నీటిధారతో క్రమక్రమంగా దాన్ని కరిగిస్తూ పూర్తిగా రూపుమాపగలిగింది. నగరంలో ప్రజల మధ్యమెలగుతూ అరణ్యాల్లోని ఋషిపుంగవుల్లాగా కఠోర జీవితం గడపిన

ఊర్మిళ త్యాగనిరతికి, సహనశక్తికి ముగ్ధుడై రామచంద్రుడామెను ప్రశంసించాడు.

> **భర్తతోడిదే లోకము భార్యకనెడు**
> **సతులకంటెను ఆదర్శసతివి నీవు**
> **కొత్తధర్మము స్థాపించి కీర్తిబొంది**
> **భాగ్యశాలిని వైతివీభూమి మీద**

సకలైశ్వర్యాలూ త్యజించి భర్తతో బాటు భయంకరారణ్యాలకేగిన సీతాదేవి త్యాగం కంటే ఐశ్వర్యాలతో బాటు భర్తకు దూరమై సర్వవిధసౌఖ్యాలకు తిలోదకాచ్చిన ఊర్మిళ త్యాగం ఉదాత్తమైనదనే సత్యాన్ని శ్రీరామచంద్రుని నోటి నుంచి పలికించిన కవి నేర్పు అపూర్వమైనది.

కవిలోకం ఉపేక్షించిన ఊర్మిళకు సాహిత్య జగత్తులో సుస్థిరస్థానం కల్పించాలనే ఉద్దేశ్యంతో 'సాకేత్' మహాకావ్యం రచించి హిందీ సాహిత్యాకాశంలో ఊర్మిళ ధ్రువతారగా నిల్చిపోవడానికి దోహదం చేసిన మైథిలీశరణ్‌గుప్త చిరస్మరణీయులు.

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 04-02-2011

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* **'డయల్ యువర్ ఈ.ఓ.'** *కార్యక్రమంలో భక్తులు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి 04-02-2011న చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాం.)*

**నవంబరులో మేము కుటుంబంతో వచ్చాము. దర్శనానికి టిక్కెట్లు బుక్ చేసుకొన్నాము. అయితే మా కూతుర్ని దర్శనానికి వదలలేదు. నా కూతురేనని ఎంత చెప్పినా వైకుంఠంలోని సిబ్బంది ససేమిరా వదలము అని చెప్పారు.**

– ప్రకాష్, హైదరాబాదు.

**కార్యనిర్వహణాధికారి :** ఈ అంశంలో మా సిబ్బంది సరిగ్గానే మాట్లాడారు. టిక్కెట్లు బుక్ చేసుకొన్నవాళ్ళకే అనుమతిస్తారు. మీరు బుక్ చేసుకొన్నప్పుడు మీరే వెళ్ళాలి. మీ కూతురు బుక్ చేసుకుంటే ఆమే వెళ్ళాలి.

**పద్మావతీ అమ్మవారి ఆలయానికి 10 సం॥ల నుండి వెలుతున్నాను. ప్రస్తుతం అక్కడ ఇచ్చే పులిహోర ప్రసాదం బాగా లేదు. క్వాలిటీ లేదు, క్వాంటిటీ కూడా బాగా తగ్గించారు.**

– రెడ్డెప్ప యాదవ్, తిరుపతి.

**కార్యనిర్వహణాధికారి :** ఇచ్చే ప్రసాదం క్వాంటిటీ తగ్గిస్తే ఫర్వాలేదు. కాని క్వాలిటీ గురించి మీరు చెప్పింది పరిశీలిస్తాం.

**సామూహిక వివాహాలు రాష్ట్రమంతటా ఒకప్పుడు జరిపేవారు. ఆ కార్యక్రమాన్ని ఆపేశారా? నా కూతురి పెళ్ళి అందులో చేయాలని ఉంది. ఎప్పుడు జరిపిస్తారో తెలపండి.**

– రామకృష్ణ, రాజమండ్రి.

**కార్యనిర్వహణాధికారి :** ఏప్రిల్, మే మాసాలలో మంచి ముహూర్తం కోసం ఆలోచిస్తున్నాం. రాష్ట్రమంతటా సామూహిక వివాహాలు జరిపిస్తాం.

**లడ్డు** మినహాయించి మిగిలిన ప్రసాదాల తయారీకి సుమారు **2 కోట్లు సబ్సిడీ దేవస్థానానికి భారం పడుతున్నదని చెప్పారు, మంచిది. ఆ ప్రసాదాలలో మిగిలినవి వి.ఐ.పి. కి, మీ సిబ్బందికి ఇవ్వకుండా భక్తులకు ప్రసాదంగా పంచిపెడితే బాగుంటుంది.** – సతీష్, మిర్యాలగూడ.

**కార్యనిర్వహణాధికారి :** మంచి సలహా. పంచడానికి తగు ఏర్పాట్లు చేస్తాం.

**ఒక కోటిరూపాయలు ఇచ్చినవాళ్ళకు ప్రత్యేక సదుపాయాలు, దర్శనం అన్నారు. సామాన్యులకు విమాన దర్శనానికే పరిమితం చేస్తారా? కాంప్లెక్స్‌లో రూ.50/- టిక్కెట్టు తీసుకొన్న వారిని పట్టించుకోవడం లేదు. ప్రొద్దున 11.00 గం॥లకు వెళితే సా॥6.00 గం॥లకు దర్శనమయ్యింది. మాముందున్న వాళ్ళనడిగితే మేము 2 గం॥లకు వచ్చామన్నారు. దీని గురించి పట్టించుకోండి.** – గీత, తిరుపతి.

**కార్యనిర్వహణాధికారి :** గతంలో విరాళం ఇచ్చినవారికి సదుపాయాలలో ఎటువంటి మార్పు లేదు. ఒక కోటివిరాళం ఇచ్చిన దాతలవల్ల సామాన్య భక్తులకు ఎటువంటి ఇబ్బంది ఉండదు. సామాన్య భక్తుల సౌకర్యాలకే పెద్ద పీఠం వేశాము. దాతల వల్ల సామాన్య భక్తులకు అసౌకర్యం కలుగదు. దర్శనానికి వచ్చేవాళ్ళలో, చాలా రద్దీ సమయంలో దర్శనం చేసుకోవడానికి వీలు కాక, దర్శనం చేసుకోకుండా వెళ్ళి పోవలసిన పరిస్థితి వచ్చినప్పుడు (అది సామాన్య భక్తుడు కాని, వి.ఐ.పి. కాని) వారికి ఈ విమాన దర్శన ఏర్పాటు చేశాము. అట్లని అందరికీ ఈ సదుపాయం ఉండదు. అక్కడ కూడా భద్రతా సిబ్బందితో తనిఖీ చేసి పంపడం జరుగుతుంది. ఇదే మా ఉద్దేశం.

**క్యూ కాంప్లెక్స్‌లో మీరు ఇచ్చే సాంబారు అన్నం పాసిపోయి ఉంటుంది. అటువంటివి ఇవ్వవద్దు. వరుసలో వచ్చే వాళ్ళను ఒక్కొక్కరినే నిదానంగా పంపిస్తే బాగుంటుంది. అన్నదానం కాంప్లెక్స్ దగ్గరున్న వీధి కొళాయిలో నీరు పట్టుకొందామంటే, అక్కడ ఉన్న వ్యాపారస్థులు అడ్డు వస్తారు. మేము పట్టుకొన్న తర్వాతే పట్టుకోండి అంటారు. సామాన్య భక్తుల కష్టాల గురించి ఆలోచించండి.**

– కల్యాణి దేవి, నంద్యాల.

**కార్యనిర్వహణాధికారి :** తప్పకుండా ఆలోచిస్తాం.

# అన్నమయ్య సంకీర్తన రచన కొన్ని వివరణలు



– డా॥ గల్లా చలపతి

హరి సంకీర్తనాచార్యుడైన అన్నమయ్య ముప్పైరెండువేల సంకీర్తనలతో తిరుమలేశుని స్తుతించాడన్నది స్థిర పడిన విషయం. దీనికి ఆధారం ఆయన మనుమడైన చిన్నన్న ఆ విధంగా చెప్పి ఉండడం. చిన్నన్న తాను రచించిన 'అన్నమా చార్య చరిత్ర'లో అన్నమయ్య మూడు రకాలైన సంకీర్తనలు చెప్పినట్లు పేర్కొన్నాడు.

**యోగమార్గంబున నొకకొన్ని బుధులు**
**రాగిల్ల శృంగార రసరీతిఁ గొన్ని**
**వైరాగ్యరచనతో వాసింపఁ గొన్ని**
**సారసనేత్రుపై సంకీర్తనములు**
**సరసత్వమునఁ దాళ సముఖముల్ గాఁగ**
**పరమ తంత్రములు ముప్పది రెండువేలు**

ఈ మూడు ద్విపదలు అన్నమయ్య చేసిన రచనలను గురించి ప్రస్తావించే సందర్భంలో చిన్నన్న రాసినవి. ఈ ద్విపద లను బట్టి ఆయన రచించిన సంకీర్తనలు మూడు రకాలుగా కనిపిస్తున్నాయి. అవి 1)యోగ సంకీర్తనలు, 2)శృంగార సంకీర్తనలు 3)వైరాగ్య సంకీర్తనలు. ఇవన్నీ శ్రీహరి స్తుత్యాత్మ కాలు. సంగీతాత్మకాలై, ఆలోచించేకొలది అంతరార్థాలను స్ఫురింపజేస్తూ, ఆనందం కలిగించేవిగా ఉన్నాయి.

**యోగమార్గంబున :** యోగాన్ని తెలియజేసే విధంగా అన్న మయ్య కొన్ని సంకీర్తనలు రాశాడని చిన్నన్న, 'సమత్వం యోగ ఉచ్యతే' (భ.గీ. 2-48), 'యోగఃకర్మసుకౌశలమ్' (భ.గీ.2-50) అని యోగ శబ్దానికి నిర్వచనాలున్నాయి. యోగః అనే మాటకు కూడిక, కలయిక అని సామాన్యార్థాలు. ప్రాపంచిక జీవితంలో ఉంటూనే పారమార్థిక స్థితిని గురించి ఆలోచించడం యోగ లక్షణం. ప్రాపంచిక అంటే – సాంసారిక వ్యవస్థలో కూరుకు పోయి పరమాత్మ తత్త్వాన్ని ఆలోచించక పోవడం కాకుండా రెంటి మధ్య సమన్వయం సాధించడం యోగంగా చెప్పవచ్చు.

అక్షరామృతం [30]

తామరాకు మీద నీటిబొట్టువలె సంసారంలో ఉంటూనే దానిలో మునిగిపోకుండా ఉండడం కౌశలం. విశిష్టాద్వైత సంప్ర దాయ ప్రవర్తకులలో అనేకులు సంసారవ్యవస్థలో ఉంటూనే పరమాత్మ తత్త్వాన్ని గురించి ఆలోచించారు. అందువల్ల ఈ యోగ సంకీర్తనలు సాంసారిక వ్యవస్థకు సంబంధించినవే కావాలి. సాంసారిక, పారమార్థిక విషయాలను సమన్వయ దృష్టితో చూచిన వాళ్లు సుఖదుఃఖ, జయాపజయ, లాభనష్టాది ద్వంద్వాలను కూడా సమదృష్టితోనే చూడగలరు. ఈ విషయాన్నే అన్నమయ్య–

**సంసారమే మేలు సకల జనులకును**
**కంసాంతకుని భక్తి గలిగితే మేలు** – అని ప్రబోధించాడు.

**శృంగారరసరీతి :** ఈ విభాగంలోనివన్నీ శృంగార సంకీర్త నలు. అన్నమయ్య సమాజంలోని తాను చెప్పాలనుకొన్న శృంగార విషయాలను సంకీర్తనలకెక్కించి సమాజకవి అయి నాడు. శృంగార సంకీర్తన లన్నీ 'మధురభక్తి' సంప్రదాయానికి చెందినవని కొందరు గట్టిగా చెబుతున్నారు. ఇది పూర్తిగా నిజం కాదు. నవరసాలలో మానవుని చిత్తవృత్తిని శృంగారం లోబరుచుకొన్నట్లు మరొక రసం లోబరచుకోలేదు. 'శృంగార ఏవ మధురః పర ప్రహ్లాదనో రసః','శృంగార ఏవ ఏకోరసః' వంటి ఆలంకారికుల అభిప్రాయాలు ఈ రసప్రాధాన్యాన్ని చెపుతున్నాయి. ఈ రస వర్ణనల ద్వారా పఠితలను లేదా శ్రోత లను ఆకర్షించి వారికి ఆధ్యాత్మప్రబోధం చేయడం అన్నమయ్య పద్ధతిగా తోస్తుంది. అలాగని అన్నీ దివ్య శృంగార విలసితాలు కావు. దివ్యశృంగార నెపంతో సమాజ శృంగార పోకడలను ఎత్తి చూపడంలో అన్నమయ్య ఉద్దేశం అందులోని లౌకిక విషయాలను కూడా చెప్పాలనుకోవడమే. శృంగార సంకీర్తన లను నిశితంగా పరిశీలిస్తే ఈ విషయం స్పష్టపడకపోదు.

**వైరాగ్యరచనతో :** విషయసుఖాలపై విరక్తి వైరాగ్యం. ప్రాపంచిక స్థితి 'ఒల్లమి' పుట్టినపుడు చిత్తం శ్రీహరిని గురించి ఆలోచిస్తుంది. మనస్సు అధ్యాత్మ భావప్రణవమవుతుంది. అధ్యాత్మ శబ్దానికి పరమాత్మకు సంబంధించిన జ్ఞానమని అర్థం. ఈ భావాన్ని వివరించేవి కాబట్టి ఈ విభాగంలోనివన్నీ అధ్యాత్మ సంకీర్తనలు. పరమతంత్రములు ముప్పది రెండువేలు - తంత్ర అనే మాటకు విస్తరించుట అని అర్థం. 'తన్యత ఇతి తంత్రః తను విస్తారే' అని వ్యుత్పత్తి. రాజ్యతంత్రం అనడం ఉంది. ఈ మాటకు రాజ్య నిర్వహణ అని అర్థం. నిర్వహించేది ప్రభువు కాబట్టి, నిర్వహింపబడే వాళ్లు ప్రజలు కాబట్టి నిర్వహణ ఎంతో ప్రధానమైంది. ఈ ప్రధానత్వం రాజుకు, ప్రజలకు సంబంధించినదిగా ఉంటుంది. అంటే ఉభయార్థసాధకంగా ఉంటుందని అనుకోవాలి. అన్నమయ్య సంకీర్తనలు పరమతంత్రాలనడంలో అవి మానవ జీవితాల్లోకి వ్యాపించి జీవనగమ్యాలను నిర్దేశిస్తాయని భావించవచ్చు. చిన్నన్న ఈ అర్థాన్నే ఉద్దేశించి ఉంటాడు. ఈ సంకీర్తనలు లౌకిక, అధ్యాత్మ జీవిత దశలకు వారధివంటివి కాబట్టి తంత్రాలని చెప్పబడినాయి.

అన్నమయ్య మూడు రకాల (యోగ, శృంగార, అధ్యాత్మ) సంకీర్తనలు రచించినట్లు చిన్నన్న చెబుతున్నాడు. ఇప్పటికి లభించిన వాటిలో శృంగార, అధ్యాత్మ (వైరాగ్య) సంకీర్తనలే ఉన్నాయి. యోగ సంకీర్తనలంటూ ప్రత్యేకంగా లేవు. శృంగార అధ్యాత్మ దశల సమన్వయాన్ని యోగంగా భావిస్తే యోగ సంకీర్తనలు అధ్యాత్మ సంకీర్తనల్లోనే కలసిపోయినట్లు భావించవచ్చు. అన్నమయ్య ముందు శృంగార సంకీర్తనలు చెప్పి తర్వాత అధ్యాత్మ సంకీర్తనలు చెప్పాడా? లేక ముందు ఇవి చెప్పి తర్వాత అవి చెప్పాడా? అన్నది తేల్చుకోవడం కష్టం. మూడు రకాల సంకీర్తనలు చెప్పినట్లు చిన్నన్న పేర్కొన్నాడే గానీ ఏవి ముందు, ఏవి తర్వాత అన్నది దాన్ని బట్టి తేలదు. అన్నమయ్య మహాభక్తుడు, మహావాగ్గేయకారుడు అయినా సమాజాన్ని బాగా పట్టించుకొన్న మహాకవి కూడా. భక్త్యావేశం అధికమైనపుడు చెప్పిన సంకీర్తనల్లో అధ్యాత్మ భావాలు నిండుగా ప్రవహించి ఉంటాయి. మనస్సులో సామాజిక స్థితి పొటమరించినపుడు సామాజిక శృంగార విషయాలు దొర్లి ఉంటాయి. సమాజాన్ని సంస్కరించాలనుకొని చేసిన బోధలు రెండింటా కనిపిస్తాయి. ఇలా ఆలోచిస్తే అన్నమయ్య ఒక దినంలోనే రెండు రకాల సంకీర్తనలు చెప్పి ఉండడానికి అవకాశం ఉంది. పెద్దతిరుమలాచార్యుల నిర్వహణలో ఈ సంకీర్తనలు రాగిరేకుల మీద చెక్కించబడినపుడు శృంగార, అధ్యాత్మ సంకీర్తనలుగా వేరు చేయబడి ఉంటాయి.

ముప్పైరెండువేల సంకీర్తనలు రచించాడనే విషయం పరిశీలించే ముందు ఈ సంకీర్తనల రాగి రేకులను స్వయంగా పరిశీలించిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారి లెక్కింపును గమనించాలి. ఆయన మాటలివి-"తిరుపతి దేవస్థానమున గల రాగి రేకులలో నన్నమాచార్యుల రచనము లనుకొనఁ దగినవి ఇంచు మించుగా రెండు వేల నాల్గువందలుండును. సంకీర్తనములు పదనాల్గు వేలుండును. అన్నమాచార్యుని సంకీర్తనముల తొలి రేకున నామాంకము గలిగి ఒకటి, రెండు, మూడు, నాలుగు.... ఇత్యాది క్రమసంఖ్యాకములతో రేకుల యద్దము నిడుపుల సమపరిమాణముతో నున్న రేకుల సంఖ్యను, ఇంచుమించుగా రేకున కాఱుపాటల చొప్పున నున్న పాటల సంఖ్యను బరిగణించి యీ మొత్తమును గుర్తింపగలిగితిమి" (అన్నమాచార్య చరిత్ర పీఠిక. 2001 ప్రతి. పుట 64). అవశ్యం నమ్మదగిన మాటలివి. అన్నమయ్య సంకీర్తనలను ఖచ్చితంగా లెక్కిస్తే ఇప్పటికి ప్రచురితమైనవి పదునాలుగువేలకు తక్కువే ఉన్నాయి. వేటూరి వారు చెప్పిన లెక్కను ఇంచుమించుగా అని అర్థం చేసుకోవాలి. తి.తి.దే. 1986లో ప్రథమ ముద్రణగాను, 1998లో ద్వితీయముద్రణగాను ప్రచురించిన తాళ్లపాక పద సాహిత్యం 29 సంపుటాలతో సంకీర్తనలు పూర్తిగా ప్రచురింపబడినట్లే. ఇక ప్రచురింపవలసినవి లేవని తెలుస్తున్నది.

తాళపత్రాల మీద రాయబడిన సంకీర్తనలన్నీ రాగిరేకుల కెక్కినాయో లేదో తెలీదు. ఒకవేళ ఎక్కినా రాగిరేకులన్నీ తాళ్లపాక కొట్టులో ఉంచారో లేదో తెలియదు. రాగిరేకుల మీద రాయించే పని పూర్తి అయిన తర్వాత ఈ సంకీర్తనలలో కొన్నిటిని తిరుమల దేవాలయంలో శ్రీనివాసుని సన్నిధిలో ప్రతిరోజూ నియమిత సమయంలో గానం చేసే ఏర్పాటును తాళ్లపాకవారే చేయించారు. గానం చేసే పండితులకు జీతభత్యాలు కూడా ఏర్పాటు చేయడం జరిగింది. తర్వాత ఇదొక సంప్రదాయంగా

మారింది. ఈ సంప్రదాయానికి 'సంకీర్తన అరుళుప్పాడు' అని పేరేర్పడింది. ఈ సంప్రదాయం ఇతర వైష్ణవ దేవాలయాల్లో కూడా ప్రచారం కావడం వల్ల కొన్ని రేకులు ఆయా ప్రాంతాల వైష్ణవాలయాలకు పంపబడి ఉండడానికి అవకాశముంది. ఇతర కారణాలతో పాటు ఈ కారణం వల్ల కూడా సంకీర్తనల రాగి రేకులు అహోబలం, శ్రీరంగాది ప్రాంతాల దేవాలయప్రాంగణాలకు చేరిఉంటాయి. పెద్ద దేవాలయాలటుంచి చిన్నదేవాలయాలకు కూడా రాగి రేకులు చేరినట్లుంది. సుమారు 50 సంవత్సరాలకు ముందు కడప జిల్లా సంబటూరులోని చెన్నకేశవ దేవాలయ ప్రాంతంలో ఇంటి నిర్మాణం కోసం పునాదులు తవ్వుతుంటే రాగిరేకులు బయట పడినాయట. చూచిన వాళ్లకు ఆ రేకులమీద గల రాత అర్థం కాక వాటి విలువ తెలియలేదట. పునాదులు తవ్విన కూలీలే తలా ఇన్ని పంచుకొని సమీపంలోని కమలాపురంలో చెంబులు, బిందెలు తయారు చేసేవాళ్లకు అమ్మినారట. వాటి విలువ తెలుసుకున్న ఆ ఊరి కరణం తర్వాత వెళ్లి విచారిస్తే అప్పటికే ఆ రేకులను కరిగించి వేశారట. ఆ కరణం స్వయంగా తనకు చెప్పినట్లు మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం (తాళ్లపాకవారి సాహిత్యం కోసం కడపజిల్లా అంతా తిరిగినవారు) గారు ఈ వ్యాసకర్తకు చెప్పారు. ఇలా ఎన్ని రేకులు అదృశ్యమైనాయో తెలీదు. తి.తి.దేవస్థానం వారు ఇతర ప్రాంతాల నుండి రేకులను తెప్పించే ప్రయత్నం చేశారు, కానీ పూర్తిగా దొరికినట్లు లేదు. భవిష్యత్తులో దొరుకుతాయేమో వేచిచూడాలి.

అన్నమయ్య జన్మించింది 1408లో. పదహారు సంవత్సరాల వయస్సులో స్వామి ప్రత్యక్షం కావడం జరిగింది. అప్పటి నుండి అంటే - 1424 నుండి చివరి వరకు అంటే - 1503 వరకు 79 సంవత్సరాలు రోజుకొక సంకీర్తన చొప్పున సంకీర్తనలు రచించాడు. ఆయన పరమధామం చేరింది 95 సంవత్సరాలు జీవించిన తర్వాత (23-2-1503). ఇలా లెక్కిస్తే ఇంచుమించు 23వేల సంకీర్తనలు లెక్కకు వస్తాయని వేటూరివారి అభిప్రాయం. 'పరమతంత్రమ్ము లిర్వదిరెండువేలు' అని ఉండవచ్చునేమోనని కూడా ఊహించారు. అయితే చిన్నన్న 32 వేలని స్పష్టంగా చెప్పి ఉండడం వల్ల ఆ సంఖ్యను నమ్మవలసి వస్తుంది. అన్నమయ్య జన్మ సంవత్సరం 1408 అనీ, 1424 అనీ రెండు

## యాత్రికులకు సూచనలు

**1)** తిరుమలకు వచ్చే యాత్రికులు ఎలాంటి మత్తుపదార్థాలు, మద్యం, మాంసము, సిగరెట్లు వంటి చెడుపదార్థాలు తీసుకోకూడదు. ఇవి పూర్తిగా నిషేధం.

**2)** యాత్రికులు దర్శన టిక్కెట్లు మరియు వసతి సదుపాయాల్ని తి.తి.దే. నియమనిబంధనల ప్రకారమే తీసుకోవాలి. దళారీలను కానీ, మధ్యవర్తులను కానీ ఆశ్రయించకూడదు.

**3)** యాత్రికులు ఉద్యోగులకు ఎలాంటి బహుమతులు, పారితోషికాలు ఇవ్వకూడదు. ఇందువల్ల ఉద్యోగుల నైతిక విలువలకు భంగం కలుగుతుంది మరియు ఉద్యోగులు తమ ఉద్యోగాలను కోల్పోవుటకు సహకరించినవారౌతారు.

**4)** యాత్రికులు గది తీసుకున్న 24 గం॥ల లోపు ఖాళీ చేయాలి.

**5)** తిరుమలకు వచ్చే యాత్రికులు స్వామి దర్శనానికై సరియైన వస్త్రధారణ కలిగి ఉండాలి, ముఖ్యంగా సుప్రభాతం, తోమాల, కళ్యాణోత్సవం మొదలైన ఆర్జిత సేవలకు సంప్రదాయ దుస్తులలో రావాలి. స్త్రీలు చీర మరియు సల్వార్ కమీజ్‌లలో పురుషులు ధోవతి, పైజామాలలో మాత్రమే రావాలి.

**6)** తిరుమలకు వచ్చే యాత్రికులు ముఖ్యంగా ఆర్జిత సేవలు, వి.ఐ.పి. దర్శనానికి వచ్చువారు తప్పనిసరిగా ఐ.డి. ప్రూఫ్ తీసుకురావాలి, లేనిచో వారిని ఆయా సేవలకు అనుమతించరు.

**7)** భక్తులు తమ కానుకలను శ్రీవారి హుండీలోనే సమర్పించాలి.

**8)** స్వామివారి దర్శనానికి వచ్చే యాత్రికులు మొబైల్ ఫోన్లు, కెమెరాలు వంటి ఎలక్ట్రానిక్ పరికరాలను తీసుకొని ఆలయంలోకి రాకూడదు. వాటిని లగేజికౌంటర్లలోనే వదలి రావాలి.

**9)** యాత్రికులు మరిన్ని వివరాలకు, సలహాలకు, సూచనలకు, ఫిర్యాదులకు తి.తి.దే. విచారణ కార్యాలయంలో సంప్రదించగలరు.

**తి.తి.దే. కాల్ సెంటర్ : 0877- 2277777**

**టోల్‌ఫ్రీ నెం. : 18004254141**

## మధురాతి మధురము....

మధురాతి మధురము నీ నామమే..
ఏడుకొండలవాడ! నిండు గుండెల వాడ!
ఓ తిరుమలేశ! ఓ శ్రీనివాస!
ఓ వేంకటేశ! ॥ మధురాతి ॥

మలినములైన మనసులు మావి
పరిణతి చెందని భక్తియె మాది
దయకోరితిమి దరి చేరితిమి.. నీ
దయ కోరితిమి దరి చేరితిమి
కనికరమొసగి కావుము దేవా! ॥ మధురాతి ॥

ముడుపుల బరువుతో, బేరములాడే
మూర్ఖత మాది, మూఢత మాది
స్వార్థము త్రుంచి జ్ఞానము పెంచి... నా
స్వార్థము త్రుంచి జ్ఞానము పెంచి
మనసుకు శాంతిని ఒసగుము దేవా! ॥ మధురాతి ॥

ఊపిరి గీతము ఆగే వేళ,
ఆఖరి పయనము సాగే.. వేళ
అన్నీ మరచి, నిన్నే తలచే..
భావన నాలో కలిగింపుమయా! ॥ మధురాతి ॥

– డా॥ ఎం.లక్ష్మణాచార్యులు,

రకాలుగా కొంతకాలం ప్రచారమైంది. ఈ కారణం వల్ల వేటూరి వారి గణనం కూడా కొంత సబబుగానే కనిపిస్తుంది.

చిన్నన్న 32 వేలని చెప్పడానికి, ఆ సంఖ్యను ఎక్కువ గానీ, తక్కువగానీ చెప్పకపోవడానికి కారణముందని కొందరు చెబుతారు. అన్నమయ్య ఆదివన్ శఠకోపయతి దగ్గర విద్యాభ్యాసం చేయడానికి అహోబలం వెళ్లాడు. నృసింహస్వామిని దర్శించాడు. ఆరాధించాడు. నృసింహమంత్రంలోగల 32 వర్ణాలకు గాను ఒక్కో వర్ణానికి వెయ్యి చొప్పున 32 వర్ణాలకు 32 వేల సంకీర్తనలు చెప్పాలని నిర్ణయించుకొని అలాగే చెప్పి ఉంటాడని ఆ కొందరి అభిప్రాయం. అన్నమయ్య సంకీర్తనలలో నృసింహ స్తుతులు ఎక్కువగా ఉండటం కూడా దీనికి కారణమై ఉంటుంది.

మరో రకంగా అనుకోడానికీ అవకాశముంది. గాయత్రీ మంత్రంలో (గాయతో ముఖాదుద పతదితి గాయత్రీ – అని నిరుక్తం. 7–12) 24 వర్ణాలున్నాయి. 'ఓం భూర్భువ స్వః తత్సవి తుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః' ప్రచోదయాత్ అన్నది గాయత్రీమంత్రం. ప్రచోదయాత్ అన్ని మంత్రాలలో ఉంటుంది. కాబట్టి లెక్కించనవసరం లేదు. దీనికి ప్రకట గాయత్రి అని పేరు. అప్రకటిత గాయత్రి అని మరొకటుంది. ఈ మంత్రానికి పై మంత్రంతో పాటు 'పరోరజసి సావదోమ్' అని మరో పాదం అదనంగా ఉంటుంది. ఈ పాదంతో కూడిన గాయత్రిని ముముక్షువులు జపిస్తారు. ఈ పాదంలో 8 వర్ణాలున్నాయి. మొత్తం కలసి (24+8) 32 వర్ణాలవుతాయి. ప్రకటిత గాయత్రిలోని 24 వర్ణాలను నిక్షేపించి 24 వేల శ్లోకాలతో వాల్మీకిమహర్షి రామాయణం రచించినట్లు పెద్దలు చెబుతారు. ఇలాగే అన్నమయ్య గాయత్రీ మంత్రంలోని 32 వర్ణాలను దృష్టిలో ఉంచుకొని 32 వేల సంకీర్తనలు రచించాడేమోననిపిస్తుంది. 32 వేలని చిన్నన్న నిర్ద్వంద్వంగా చెప్పడం వల్ల ఇలాంటి ఆలోచనలకు అవకాశం ఏర్పడుతూ ఉంది. అన్నమయ్య ఆ రకంగా చేశాడో లేదో తెలియదు. చిన్నన్న 32 సంఖ్యకు ప్రాధాన్యత నిచ్చి అలా చెప్పాడేమో. లేదా 32 సంఖ్యకు మరేదైనా సంకేతార్థముందేమో!

అయితే, అన్నమయ్య 32 వేల సంకీర్తనలు తన జీవిత కాలంలో చెప్పి ఉండడానికి అవకాశం లేకపోలేదు. ఆయన సంకీర్తన రచన 79 సంవత్సరాలు అంటే – ఆయన నిర్యాణం వరకు నిర్విరామంగా జరిగినట్లు "శాలివాహన శకవరుషంబులు 1424 అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ 12 నిరుధానకు తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్ల పాక అన్నమాచార్యులు విన్నపము చేసిన అధ్యాత్మ సంకీర్తనలు/ శృంగార సంకీర్తనలు" అని తిలకప్రాయంగా ప్రతి ముద్రిత సంపుటంలోనూ కనిపించే విషయం చెబుతున్నది. ఈ 79 సంవత్సరాలలో రోజుకొక సంకీర్తన చొప్పున చెప్పి ఉండినా సుమారు 29 వేలవుతాయి. ఒక రోజులో రెండు మూడు సంకీర్తనలు కూడా చెప్పి ఉండవచ్చు. ఈ రకంగా చూస్తే 32 వేలు రచించాడనడంలో అతిశయోక్తి కనిపించదు. ఇది లౌకికమైన విషయం. చిన్నన్న లెక్క కూడా సరైనదేననిపిస్తుంది. మధ్య మధ్యలో అన్నమయ్య సంకీర్తనేతర రచనలు కూడా చేశాడు కదా!



# విష్ణుచిత్తుడు పరతత్త్వ నిర్ణయం

- శ్రీమతి కె. అమ్మాజీ రామ్

శ్రీ మహావిష్ణువు వైకుంఠంలో భక్తసందోహమందు అత్యంతానుగ్రహం ప్రసరించేవేళ, విష్ణ్వాంకిత సేవకుడైన గరుత్మంతుడు, శ్రీమన్నారాయణుని అల్లునిగా పొందాలన్న కోరికను విన్నవించుకొన్నాడు. అందుకు శ్రీమహావిష్ణువు ఆ కోరికను కలియుగంలో సఫలీకృతం చేస్తానన్నాడు. అలాంటిదే మరో సంభవం. హిరణ్యాక్షుడు సముద్రంలో ముంచేసిన భూమిని, శ్రీహరి వరాహరూపుడై సముద్రం నుండి వెలికితీసి, తన కోరలపై, పైకెత్తి యథాస్థానమందుంచగా, శ్రీమహావిష్ణువు దివ్యస్పర్శనొందిన భూదేవి, తనను వివాహం చేసుకోమని కోరింది. గరుత్మంతుని కోరికతో బాటు, ఈ కోరిక కూడా కలియుగంలో సిద్ధింపజేస్తానని శ్రీమన్నారాయణుడు వరమిచ్చాడు. వీరిరువురూ తమ కోర్కెలను తీర్చుకోవడానికి కలియుగంలో విష్ణుచిత్తులుగాను (పెరియాళ్వారు) గోదాదేవి (ఆండాళ్ళు) గాను శ్రీవిల్లిపుత్తూరులో జన్మించారు.

మార్కండేయమహర్షి తపఃఫలంగా శ్రీవిల్లిపుత్తూరులో వటపత్రశాయి ఆలయం వెలసింది. ఆ దేవాలయానికి ముకుందాచార్యులనే బ్రాహ్మణుడు అర్చకుడుగా వ్యవహరించేవాడు. ఆయన ధర్మపత్ని పద్మావతీదేవి. చాలాకాలం వారికి బిడ్డలు కలుగలేదు. సంతాన ప్రాప్తికి వటపత్రశాయిని ప్రార్థించగా క్రీ.శ.725వ సంవత్సరంలో వారి కోరిక ఫలించింది. క్రోధన నామ సంవత్సర, జ్యేష్ఠ మాసం, శుక్లపక్ష ఏకాదశితిథి, స్వాతి నక్షత్రం, ఆదివారం రోజున సాక్షాత్ గరుడాంశలో కుమారుడు జన్మించాడు. ఆ బిడ్డకు తల్లిదండ్రులు విష్ణుచిత్తులనే పేరు పెట్టారు. పేరుకు తగ్గట్టుగా బాల్యం నుండి వీరు శ్రీమన్నారాయణుని పాదపద్మాలపై అనన్యభక్తితో పుష్పకైంకర్యం, తదీయారాధన, హరినామస్మరణం మొదలైన కైంకర్యాలతో వటపత్రశాయిని సేవించేవాడు. ఈయన పెంచిన తులసీ వనంలో గోదాదేవి పసిపాపవలే కనిపించింది. భూదేవి అంశతో, అయోనిజగా అవతరించిన ఆ బిడ్డను కుమార్తెగా స్వీకరించి, విష్ణుచిత్తులు ఆమెను విష్ణుభక్తురాలుగా పెంచి పెద్ద చేశారు.

విష్ణుచిత్తులవారి కాలంలో శ్రీవిల్లిపుత్తూరుకు ఉత్తరాన పదిమైళ్ళ దూరంలోనున్న పాండ్యదేశాన్ని, మధుర రాజధానిగా చేసుకొని వల్లభదేవుడనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయనకు పరతత్త్వము గూర్చి తెలుసుకోవలెనన్న సంకల్పం కలిగింది. సమర్థులైన పండితులు మధురకు వచ్చి, రాజసభలో పరతత్త్వం గురించి చర్చించి, నిర్ధారణ చేయవలసిందనీ, వాదప్రతివాదనలలో గెలుపొందినవారికి గొప్పబహుమానం ఇవ్వబడునని ప్రకటన చేయించాడు. ఈ విషయాన్ని తెలుసుకుని, అనేకమంది పండితులు పరతత్త్వ నిర్ధారణ గోష్ఠిలో పాల్గొనడానికి మధురకు వచ్చారు.

ఒకనాటి రాత్రి శ్రీవిల్లిపుత్తూరులో ఉన్న విష్ణుచిత్తుడికి వటపత్రశాయి, కలలో సాక్షాత్కరించి, మధురలో జరిగే పరతత్త్వ నిర్ధారణ చర్చలో పాల్గొనవలసిందిగా ఆజ్ఞాపించాడు. విష్ణుచిత్తులు భయపడి, తన లాంటి పామరుడు పండితులతో పోటీ చేయుట అసంభవమని, తనకంత చాతుర్యము లేదని విన్నవించగా, స్వామివారు - భయపడనవసరం లేదని, విష్ణుచిత్తులవారి జిహ్వాగ్రమున స్వయంగా తానే ఉండి వాదనను నడిపెదనని, తప్పక బహుమతి గెలువవచ్చునని, కాబట్టి, వెంటనే బయలుదేరమని ఆనతివ్వగా, విష్ణుచిత్తుడు మధురకు ప్రయాణమయ్యాడు. వటపత్రశాయి ఆదేశాన్ని శిరసావహించి మధురకు చేరిన విష్ణుచిత్తుడు, పరతత్త్వ నిర్ధారణకు పండితులతో వాదన ప్రారంభించారు. విశిష్టాద్వైత సంప్రదాయాన్ననుసరించి పరతత్త్వాన్ని ఈ విధంగా ప్రతిపాదించసాగాడు.

సర్వపదార్థాలు వేదంలో ఇమిడి ఉన్నాయి. వేదం అష్టాక్షరీ మంత్రంలో ఉన్నది. అట్టి నారాయణమంత్రం ప్రణవంలో ఇమిడి ఉంది. ప్రణవమనగా 'ఓం'కారం. ఆ ఓంకారానికి 'అ'కారం మూలం. ఎట్లనగా 'అ+ఉ+మ'ల కలయికే ఓంకారం. 'అ' కారమే వేదాంతానికి, బ్రహ్మవిద్యకు మూలం. బ్రహ్మమే పరతత్త్వం. అనగా పరతత్త్వానికి కూడా మూలం 'అ' కారమే. అక్షరాలలో నేను 'అ కారమును అని గీతాచార్యుడు పల్కినాడు కదా! అట్టి 'అ'కారాధ్యుడు అయిన

విష్ణుభగవానుడే పరతత్త్వం. శ్రీమన్నారాయణుడే మోక్ష ప్రదాత. విష్ణువు నుండి ఉద్భవించిన ఈ జగత్తంతా అతనిలోనే ఇమిడి ఉండి, చివరకు అతనిలోనే లయమౌతుంది. కాబట్టి, నారాయ ణుని మించిన పరతత్త్వం 'నభూతో నభవిష్యతి' అని విష్ణుచిత్తుడు చెప్పగానే పరతత్త్వ శుల్కపు మూట తెగి, దానంతటదే విష్ణు చిత్తుడి పాదాల చెంతపడింది. వెంటనే రాజసభలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. వల్లభదేవుడు విష్ణుచిత్తుడిని ఘనంగా సత్కరించి విలువైన బహుమానాలిచ్చాడు. ఆయనను గజారోహ ణము గావించి, సకల వాద్యవిశేషాలతో నగరప్రదక్షిణకు ఊరే గింపుగా బయలుదేరాడు.

ఇంతలో స్వామివారు, తనను పరతత్త్వమని నిరూపించి, బహుమానములనందుకొని, ఊరేగింపుగా వచ్చే తన ప్రియ భక్తుడైన విష్ణుచిత్తుడిని చూచుటకు, మహాలక్ష్మీసమేతుడై, గరుడవాహనంపై ఆకాశవీథిలో వచ్చి నిలువగా– ఆ దృశ్యాన్ని విష్ణుచిత్తులతో పాటు వల్లభదేవుడు, పండితులు, పరివారం,



నగరప్రజలందరూ చూశారు. భక్తవాత్సల్యంతో భగవంతుడు తమకు ప్రసన్నుడైనందుకు విష్ణుచిత్తుడుద్వేగానంద సాగర లహరిలో నోలలాడాడు. కోటిసూర్యులుదయించినట్లు, అనేక దివ్యాభరణాలను ధరించి, పట్టుపీతాంబరాలతో దర్శన మిస్తున్న ఆ భగవంతుని విష్ణుచిత్తుడు చూచి, నమస్కరించి – వేనోళ్ళ పొగడక, ఆ దేవదేవునికి అచ్చటనున్న ప్రాకృత జనుల దృష్టి సోకుతుందని భీతిల్లి, తాను ఎక్కిన ఏనుగుమెడలోని గంటలను తాళంగా వాయిస్తూ, హృద్యంగా, ద్వాదశిగాథాత్మక మగు 'పల్లాండు' పాశురాలనుపాడి రక్షపెట్టాడు. 'తిరు పల్లాండు'గా ప్రసిద్ధికెక్కిన ఆకృతిలోని మొదటిపాశురం.

**పా. పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు పలకోడి నూరాయిరం**
**మల్లాండ తిండోళ్ మణివణ్ణా ఉన్‌శేవడి శెవ్వి తిరుక్కాప్పు.**

విష్ణుచిత్తుడు ఈ పాశురంలో స్వామివారికి దిష్టి తీశాడు. అనేక వేల సంవత్సరాలు, బ్రహ్మకల్పాంతం వరకూ, కాలతత్త్వమున్నంతవరకు – భగవానుని కోమలమైన పాదపద్మా లకు మంగళాశాసనం చేస్తూ రక్ష పెట్టారు.

వేదానికి ఓంకారంవలే పల్లాండు పాశురాలు ముఖ్య త్వము సంతరించుకున్నాయి. దివ్యస్థలంలో, ద్రావిడ వేదాధ్య యనం చేయడానికి ముందు పల్లాండు పాశురాలు పఠించిన తర్వాతే మిగిలిన పాశురాలు అనుసంధానం చేయుట సంప్రదాయమైంది. ఈయన రచించిన మరొక గ్రంథము 'పెరియాళ్వార్ తిరుమొళి'గా పేరుగాంచిన 429 పాశురాలుగల దివ్యప్రబంధం. రచనల్లో వాత్సల్య, భక్తి రసాలు మిళితమై భక్తుల మనసులనాకట్టుకుంటాయి. శ్రీరంగనాథునికి తన ప్రియ పుత్రికనిచ్చి వివాహం జరిపించి, భగవంతునికి మామగారైనారు. స్వామివారి దివ్య మంగళ విగ్రహానికి రక్షపెట్టి 'పెరియాళ్వారన్న' పేరుగడించాడు. సకల శాస్త్రాలు చదివి, వైదిక నిష్ఠా గరిష్ఠుడ గుటచే భట్టనాథుడని ప్రసిద్ధికెక్కాడు. ఈయన మంగళాశాసనం చేసిన దివ్యదేశాలు 19. సదా శ్రీమన్నారాయణుని స్మరించుట చేత విష్ణుచిత్తుడైనాడు. వటపత్రశాయికి పుష్పకైంకర్యం చేయుచూ శేషజీవితాన్ని గడిపి విష్ణు దివ్యధామం చేరిన ధన్యజీవి విష్ణు చిత్తుడు.

## శ్రీపదకేళి - 21 (ఫిబ్రవరి - 2011)
## విజేతలు

**1) కె. సౌదామిని,**
ఇంటి నెం.2/421, 2వ రోడ్డు,
4వ క్రాస్, అనంతపురం-515 004.

**2) తిన్నవెళ్ళి నరసింహసాయినాథ్,**
ఇంటి నెం.10-334/ఎ2,
విజయలక్ష్మి వీధి, మార్కాపురం (పోస్టు)
ప్రకాశం జిల్లా - 523 316.

**3) వేదాన్తం గీతాస్వప్న,**
W/o వి.శ్రీనాథ్, ఇ.నెం.1-23-1, బండివారి వీధి,
నాజరుపేట, తెనాలి, గుంటూరు జిల్లా-522 201.

### సరైన సమాధానాలు రాసినవారు :

కె.ఎస్.ఉమామహేశ్వరి(కుప్పం); డా॥సి.వి.కె.వై.శర్మ (గుంటూరు); ఎస్.పద్మావతి(ఒంగోలు); ముక్కామల సాయిపావని(గుంటూరు); టి.సుజన(తిరుపతి); వంగవీటి వెంకటేశ్వర్లు(బేతవోలు); ఎం.వి. ఎస్.రామశేషు (గుంటూరు); ఎస్.కృష్ణమూర్తి(విజయనగరం); గండ్లూరి బలరామశాస్త్రి (నాచారం); డా॥ఎన్.వెంకటజగన్నాథ రావు (శ్రీకాకుళం); కె.ఆనందపిళ్లై (చిత్తూరు); కె.ఎల్.నరసింహ రావు(విజయవాడ); ఎ.శంకరమ్మ (బళ్ళారి); బి.రాధాకృష్ణమూర్తి (గుంటూరు); విజాపురపు నరసింగరావు(సికింద్రాబాద్); ఎస్.సత్య నారాయణమూర్తి (పిఠాపురం); ఎం.వేంకటచంద్రశేఖరశాస్త్రి (గుంటూరు); గర్నెపూడి వెంకటలక్ష్మీ (మార్టూరు); పి.వెంకటాచార్యులు (కావలి); లీలా బి.డి.ప్రియ (చెన్నై); మునిగోటి చంద్రశేఖరశర్మ (బెంగళూరు);జె.సామ్రాజ్యలక్ష్మి(తిరుపతి);ఎస్.జి.సోమయాజులు (పాలంగి, ప.గో.జిల్లా); ఎస్.పార్వతి (కుప్పం); తిన్నవెల్లి నరసింహారావు (మార్కాపురం); జె.నాగభూషణరావు (అనంతపురం); బొడ్డపాటి రాజేశ్వరమూర్తి (చిలకలపూడి); కె.వి.ఎస్.కేశవ్ (విశాఖ); పి.వాణీసంగీత(నెల్లూరు); ఎన్.సుబ్బారావు(గుంటూరు); అక్షింతల సంజీవశర్మ (అనంతపురం); నల్లపాటి రామకృష్ణ (గుంటూరు); ముత్తారెడ్డి వెంగళరెడ్డి (మార్కాపురం); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); పి.ఎన్.వి.రమణబాబు (తిరుపతి); వల్లభజోస్యుల జలజ(గుంటూరు); జి.అనంతపద్మనాభయ్య (అనంతపురం); వాస్తు రామచంద్ర(నెల్లూరు); సావిత్రిశర్మ(అనంతపురం); ఆర్.నాగేశ్వర రావు (శ్రీకాకుళం); బి.భీమారావు రెడ్డి(పాలకొండ); కె.అమరనాథ్ (చిత్తూరు); డి.రామస్వామి (అరసవల్లి); ఎల్.వెంకట సుబ్బారావు (మార్కాపురం); ఊటుకూరు రామయ్య (మార్కాపురం); దీవిసీతా రామాచార్యులు(తెనాలి); వై.సుబ్రహ్మణ్యం(ప్రొద్దుటూరు);బి.రామ్మోహనరావు (హైదరాబాదు); భావరాజు రాధాకృష్ణ (కొవ్వూరు);




### నిబంధనలు :

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా ఈ శీర్షికలో పాల్గొనవచ్చు.

### బహుమతి వివరాలు :

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాం. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాం.

### పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ■ | 2 | ■ | ■ | 3 | | 4 | |
| | ■ | 5 | | ■ | | ■ | | ■ |
| | ■ | | ■ | 6 | | ■ | | ■ |
| | ■ | ■ | 7 | ■ | | ■ | | ■ |
| ■ | 8 | | | | | ■ | | ■ |
| ■ | | ■ | | ■ | ■ | 9 | ■ | 10 |
| ■ | | ■ | | ■ | ■ | | ■ | |
| ■ | | ■ | ■ | ■ | ■ | ■ | ■ | |
| ■ | | ■ | ■ | 11 | | | | |

# శ్రీపదకేళి - 23

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

.......................................................

.......................................................

.......................................................

.......................................................

.......................................................

**2) మీరు సప్తగిరి చందాదారులైతే?**

అ) చందా నంబరు : ....................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ....................................

.......................................................

.......................................................

.......................................................

.......................................................

.......................................................

## ఆధారాలు

**అడ్డం**

**3)** వేటాడి దస్సిన పరీక్షిన్మహారాజు ఈ ముని దగ్గరకు వచ్చి దాహం తీర్చమని అడిగాడు (4)

**5)** అమృతం (2)

**6)** బుద్ధి (2)

**8)** శ్రీకృష్ణుడు ఇతడు చేసిన నూరు తప్పుల్ని క్షమించిన తర్వాత సంహరించాడు (5)

**11)** ఊర్మిళ తండ్రి (5)

**నిలువు**

**1)** కుబేరుడు తొలి జన్మలో (4)

**2)** ధృతరాష్ట్రుని పూర్వజన్మ (3)

**3)** సత్రాజిత్తును సంహరించినవాడు (5)

**4)** సీతారాముల కుమారులు (5)

**7)** పార్వతి (4)

**8)** శివుడు (5)

**9)** కృపాచార్యుని చెల్లెలు (2)

**10)** శ్రీకృష్ణుని చెలికాడు (4)

## *శ్రీపదకేళి-21* (ఫిబ్రవరి, 2011) సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 అం | గు | ళీ | య | క | 2 ము | ■ | ■ | ■ |
| బి | ■ | ■ | ■ | ■ | చి | ■ | ■ | 3 కే |
| క | ■ | 4 సు | ■ | ■ | 5 కుం | భీ | న | స |
| ■ | ■ | మి | ■ | ■ | దు | ■ | ■ | రి |
| 6 వి | చి | త్ర | 7 వీ | ర్యు | డు | ■ | 8 గా | ■ |
| రూ | ■ | ■ | రు | ■ | ■ | 9 కా | య | ము |
| 10 పా | వ | 11 ను | డు | ■ | 12 సూ | ■ | త్రి | ■ |
| క్షు | ■ | దు | ■ | 13 కో | తు | లు | ■ | 14 కా |
| డు | ■ | రు | ■ | ■ | డు | ■ | 15 కే | శి |

**సరైన సమాధానాలు రాసిన వారి పేర్లు మరికొన్ని :**

వేమవరపు కనకదుర్గ(కవుతరం); బొచ్చా కృష్ణంనాయుడు (రాజాం); గుమ్మాకృష్ణమూర్తి (తెర్లాం); పుత్సా వెంకటసత్యనారాయణశర్మ (జగ్గంపేట); ఎన్.శ్రీనివాసరావు(భీమవరం); జరుగుమిల్లి వీరభద్రారావు (రాజమండ్రి);ఎస్.పి.గంగిరెడ్డి(రాజమండ్రి); కె.ధనలక్ష్మి(హైదరాబాదు); భాగవతం విశ్వనాథరావు(సైదాబాద్); మునిగోటి కృష్ణమూర్తి (తిరుపతి);సి.హెచ్.నందగోపాల్(విశాఖ);ఓ.ఇందిరాదేవి(ఒంగోలు); కె.రామకృష్ణ(రాయదుర్గం);బి.శ్రీహరిరావు(గుంటూరు); పి.సూర్యనారాయణ (గార్ల); ఎస్.సుగుణమ్మ (హోసూర్); సాయిరామానందస్వామి (పొదలగుంటపల్లి); కె.వి.బాలసుబ్రహ్మణ్యం(బద్వేలు); ఎన్.వెంకటరావు (రాజమండ్రి); జల్దంకి వర్ధని(కాకినాడ); టి.ఆర్.బాలకృష్ణారావు(రాజమండ్రి).

# ఏప్రిల్, 2011

# రాశి ఫలాలు

- జె. చంద్రశేఖరశర్మ, నిజామాబాద్



## మేషం

**ఆదాయం : 14 రాజపూజ్యం : 04**
**వ్యయం : 02 అవమానం : 05**

ఈ రాశివాళ్లకు గురువు 12-1, శని 6-7; రాహువు 9-8; కేతువు 3-2 స్థానాల్లో సంచరిస్తారు. గత సంవత్సరం కంటే ఈ మాసం నుండి అనేకానేక విషయాలు, వ్యవహారాల్లో విజయం కలుగుతుంది. ప్రతిపనికి తొందరపాటు తోడవటంతో అసంపూర్తిగా నిలుస్తాయి. చేయు వృత్తి వ్యాపారాల్లో ఆశించిన ఫలితాలు రావు. చికాకు అధికమౌతుంది. తొందరపాటు లేకుండా స్థిరనిర్ణయాలతో ముందుకు సాగాలి. క్షేత్ర దర్శనం మంచి ఫలితాన్నిస్తుంది. కేతుజపం మేలుచేస్తుంది. మొదటివారం ఆందోళన, రెండోవారం మానసికవేదన, మూడోవారం క్షేత్రదర్శనం, నాలుగోవారం వ్యవహారజయం.



## వృషభం

**ఆదాయం : 08 రాజపూజ్యం : 07**
**వ్యయం : 11 అవమానం : 05**

ఈ రాశి వాళ్లకు గురువు 11-12, శని 5-6; రాహువు 8-7; కేతువు 2-1 స్థానాల్లో సంచరిస్తారు. గతంలో చేసిన ఋణం తీరి సంతృప్తికరంగా ఉండును. విద్యా, ఉద్యోగ ప్రయత్నాల్లో విజయం వరిస్తుంది. ఎండతీవ్రత వల్ల స్వల్ప అనారోగ్యం. కోర్టు వ్యవహారాలు, చేయు వృత్తివ్యాపారాలు అనుకూలం. వ్యవసాయదారులకు, మహిళలకు, పసుపు, బెల్లం, వ్యాపారులకు గడ్డుకాలం. విదేశీ ప్రయాణాలు మంచిఫలితాన్నిస్తాయి. విశ్రాంత ఉద్యోగులకు శుభవార్తాశ్రవణం. గురుజపం, శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం మేలు చేస్తుంది. మొదటివారం విజయం, రెండోవారం అనారోగ్యం, మూడోవారం పదవీప్రాప్తి, నాలుగోవారం తీర్థయాత్రా ప్రయాణం.



## మిథునం

**ఆదాయం : 11 రాజపూజ్యం : 03**
**వ్యయం : 08 అవమానం : 01**

ఈ రాశివారికి గురువు 10-11, శని 4-5, రాహువు 7-6, కేతువు 1-2 స్థానాల్లో సంచరిస్తారు. ఈ మాసంలో వృత్తి ఉద్యోగాల్లో అధికశ్రమ, అధిక ధనవ్యయం. గతంలోని నిర్ణయాలు కొన్ని కార్యరూపం దాలుస్తాయి. అధ్యాత్మిక కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటారు. ఆర్థికసమస్యలు అధికం. మొదటివారం ఆనందం, రెండోవారం కార్యానుకూలత, మూడోవారం బంధుమిత్రుల కలయిక, నాలుగోవారం అనారోగ్యం.



## కర్కాటకం

**ఆదాయం : 05 రాజపూజ్యం : 06**
**వ్యయం : 08 అవమానం : 01**

ఈ సంవత్సరంలో ఈ రాశివారికి గురువు 9-10, శని 3-4, రాహువు 6-5, కేతువు 12-11 స్థానాల్లో సంచరిస్తారు. ఈ మాసంలో ఆలోచనలు బాగా ఉన్నా ఆచరణ లోపం వల్ల అనేక కష్టనష్టాలు ఎదుర్కోవాల్సి ఉంటుంది. శని మూల మంత్ర జపం, కనకదుర్గా దర్శనం ఎంతో మేలు చేస్తాయి. మిత్రుల సహకారం వల్ల విద్యా, ఉద్యోగ, వ్యాపార, వివాహ ప్రయత్నాలు ఓ కొలిక్కి వస్తాయి. మొదటివారం మానసిక చింత, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ధనప్రాప్తి, నాలుగోవారం ఆలయ దర్శనం.



## సింహం

**ఆదాయం : 08 రాజపూజ్యం : 02**
**వ్యయం : 02 అవమానం : 04**

[illegible] 9, శని [illegible] స్తారు. ముఖ్యమైన కార్యక్రమాలు వాయిదాపడతాయి. గృహంలో విలువైన వస్తువులు పోయే ఆస్కారం ఉంది. అందరితో కలసి విందు, వినోదాల్లో పాల్గొంటారు. విదేశీ ఉద్యోగ ప్రయత్నాల్లో స్వల్ప మార్పులు. పుణ్యక్షేత్ర దర్శనం వల్ల శుభం కల్గుతుంది. మొదటివారం వ్యాపారం, రెండోవారం అశాంతి, మూడోవారం అధిక వ్యయం, నాలుగోవారం సన్మానం, ప్రశంసలు.



## కన్య

**ఆదాయం : 11 రాజపూజ్యం : 05**
**వ్యయం : 08 అవమానం : 04**

ఈ రాశివారికి గురువు 7-8, శని 1-2, రాహువు 4-3, కేతువు 10-9 స్థానాలలో సంచరిస్తారు. ఈ మాసంలో వాక్చాతుర్యానికి, తెలివితేటలకు మంచి గుర్తింపు వస్తుంది. అధ్యాత్మిక కార్యక్రమాల్లో ఏకాగ్రత లోపిస్తుంది. శని మూల మంత్ర జపం, శ్రీ వేంకటేశ్వరస్వామి సుప్రభాత పఠనం మేలు చేస్తుంది, మానసిక ఆనందాన్ని కల్గిస్తుంది. మొదటివారం

గుర్తింపు, రెండోవారం క్షేత్రపర్యటనలు, మూడోవారం విందు వినోదాలు, నాలుగోవారం ధనయోగం.



**తుల** — **ఆదాయం : 02 రాజపూజ్యం : 01 వ్యయం : 08 అవమానం : 05**

ఈ రాశివారికి గురువు 6-7, శని 12-1, రాహువు 3-2, కేతువు 9-8 స్థానాలందు సంచారం. ఈ నెలలో సోదరీ సోదరులకు పరిపూర్ణ సహకారం అందించి మెప్పు పొందుతారు. గతంలోని పొరపాట్లు గ్రహపాట్లకు, ఇబ్బందులకు దారి తీస్తాయి. మహిళలకు, వెండి, బంగారు వర్తకులకు, వ్యవసాయ దారులకు, బ్యాంకు, రెవెన్యూ ఉద్యోగులకు గడ్డుకాలం. శని మూల మంత్ర జపంతో పాటు ఆంజనేయస్తోత్ర పఠనం మేలు చేస్తుంది. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ఆందోళనలు, మూడోవారం మనోల్లాసం, నాలుగోవారం కార్యానుకూలత.



**వృశ్చికం** — **ఆదాయం : 14 రాజపూజ్యం : 04 వ్యయం : 02 అవమానం : 07**

ఈ రాశివారికి గురువు 5-6, శని 11-12, రాహువు 2-1, కేతువు 8-7 స్థానాలందు సంచరిస్తారు. ఈ నెలలో దీర్ఘకాలిక కోర్టు వ్యవహారాలు, బంగారు వస్తువుల కొనుగోలు, భూమి అమ్మకం, కొనుగోలు తదితర అంశాల్లో పైచేయిగా ఉంటారు. తీర్థయాత్రలు, దూరప్రయాణాలు. ఉద్యోగులకు పదోన్నతులు, ధనాదాయం కలుగుతాయి. కుజ మూల మంత్ర జపంతో పాటు ఇష్టదేవతా పూజలు మేలు చేస్తాయి. మొదటి వారం విజయం, రెండోవారం ఆనందం, మూడోవారం అనా రోగ్యం, నాలుగోవారం ధార్మిక చింతన.



**ధనుస్సు** — **ఆదాయం : 02 రాజపూజ్యం : 07 వ్యయం : 11 అవమానం : 07**

ఈ సంవత్సరం గురువు 4-5, శని 10-11, రాహువు 1-2, కేతువు 7-6 స్థానాల్లో సంచరిస్తారు. ఈ మాసంలో భూ, గృహ కొనుగోళ్లలకు, గృహాలంకరణల పట్ల ఎక్కువ ఆసక్తి చూపుతారు. ఉద్యోగాల్లో పదోన్నతులు, స్థానమార్పు లుంటాయి. దీర్ఘకాలిక ప్రయాణాలు వద్దు. రవిజపంతో పాటూ మహాలక్ష్మి స్తోత్ర పఠనం మేలు చేస్తుంది. మొదటివారం ఉల్లాసం, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ఆనందం, నాలుగోవారం దైవదర్శనాలు.



**మకరం** — **ఆదాయం : 05 రాజపూజ్యం : 03 వ్యయం : 05 అవమానం : 03**

ఈ రాశివారికి గురువు 3-4, శని 9-10, రాహువు 12-11, కేతువు 6-5 స్థానాల్లో సంచరిస్తారు. ఈ నెలలో వీరికి ఆదాయవృద్ధి, భూ, గృహలాభం, వ్యాపారాభివృద్ధి శత్రు జయం వంటి శుభఫలాలు కల్గుతాయి. వృత్తి, ఉద్యోగ వ్యాపారాల్లో చిక్కులు. అవసరానికి డబ్బు అందక మానసిక వేదనకు గురౌతారు. బంధుమిత్రుల రాకపోకలు, ఇంట్లో శుభ కార్యం మానసికానందాన్నిస్తాయి. ఎదుటి వ్యక్తులతో మాట్లాడే టప్పుడు చాలా జాగ్రత్త వహించాల్సి ఉంటుంది. మొదటివారం ధనయోగం, రెండోవారం ఆందోళన, మూడోవారం ధార్మిక చింతన, నాలుగోవారం చిక్కులు.



**కుంభం** — **ఆదాయం : 05 రాజపూజ్యం : 06 వ్యయం : 05 అవమానం : 03**

ఈ సంవత్సరంలో ఈ రాశివారికి గురువు 2-3, శని 8-9, రాహువు 11-10, కేతువు 5-4 స్థానాల్లో సంచరిస్తారు. ఈ మాసంలో ఉద్యోగవ్యాపారాల్లో బాగా రాణిస్తారు. నమ్మిన వ్యక్తుల నుండే పలు సమస్యలు ఏర్పడుతాయి. అనారోగ్యం, ఆందోళనలు, అధికశ్రమ పడాల్సివస్తుంది. క్షేత్ర దర్శనాలు, రాహువు మూలమంత్ర జపం మేలు చేస్తాయి. వెండి, బంగారు వర్తకులకు అదృష్టకాలం. మొదటివారం ఆనందం, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం క్షేత్ర దర్శనం.



**మీనం** — **ఆదాయం : 02 రాజపూజ్యం : 02 వ్యయం : 02 అవమానం : 06**

ఈ సంవత్సరంలో ఈ రాశివారికి గురువు 1-2, శని 7-8, రాహువు 10-9, కేతువు 4-3 స్థానాల్లో సంచరిస్తారు. ఈ నెలలో వీరికి గతంలోని పొరపాట్లు గ్రహపాటుగా మారి పలు విమర్శలకు దారితీస్తుంది. నమ్మిన వ్యక్తుల వల్ల వ్యాపా రంలో, కుటుంబంలో అశాంతి ఆందోళనలుంటాయి. విద్యార్థు లకు, ఉపాధ్యాయులకు, మహిళలకు శుభవార్తా శ్రవణం. దైవచింతనకు డబ్బు ఖర్చుచేస్తారు. మొదటివారం సత్కారాలు, రెండోవారం ధనలాభం, మూడోవారం కార్యజయం, నాలుగో వారం ఆనందం.

# కొంగుబంగారం

- ఎన్. వేంకటరమణయ్య

నేను న్యాయవాదిగా ప్రాక్టీసు చేస్తున్నాను. ఆదిమధ్యాంత రహితుడు, కలియుగ దైవము అయిన 'శ్రీ వేంకటేశ్వరుడు' మా జీవితంలో ఎల్లప్పుడూ అపారప్రేమను చూపిస్తూ, ఆపన్నహస్తం అందిస్తూనే ఉన్నాడు. ఆ దేవదేవుడు మా కుటుంబాన్ని ఎప్పటికప్పుడు, ఆదుకుంటూనే ఉన్నాడు.

నేను మొదటినుండి 'శ్రీ వేంకటేశ్వర స్వామి' భక్తుడను. మొట్టమొదటిసారిగా 1992 సంవత్సరంలో మా అన్నయ్యగారి కుటుంబంతో కలిసి మెట్లదారి గుండా కాలినడకన ఏడుకొండల వేంకటేశ్వర స్వామిని దర్శించుకున్నాను. స్వామివారిని దర్శించు కున్న అనుభూతి, ఆనందం మాటలలో వర్ణించనలవి కాదు. ఆలయం నుండి వెలుపలకు రాగానే మరల ఎప్పుడు స్వామివారిని దర్శించు కుందామా అని అన్పించక మానదు.




తర్వాత వివాహమైన తదుపరి 1994 సంవత్సరంలో పసుపు బట్టలతో సతీసమేతంగా స్వామివారిని దర్శించు కున్నాను. మరల అదే అనుభూతి. మరల 1998 సంవత్సరంలో మా కుటుంబమంతా కలిసి కాలినడకన మెట్లపూజ చేసుకుంటూ స్వామివారి కొండకు చేరాము. తలనీలాలు సమర్పించుకున్నాము. పిల్లలు కూడా అలసట ఎరుగకుండా ఎంతో హుషారుగా నడిచారు. మాకు ఏ ఇబ్బంది లేకుండా అంతా సవ్యంగా జరిగిందంటే అది స్వామి మహిమే. మరల 2000 సంవత్సరంలో నేను మా అన్నయ్య గారి కుటుంబంతో కలసి మెట్లమార్గం ద్వారా కాలినడకన నడిచి మరల తలనీలాలు సమర్పించి, స్వామివారని దర్శించుకున్నాము. మార్గమధ్యంలో కొంత అలసట అనిపించి నప్పటికీ స్వామివారి దర్శన భాగ్యం లభించినంతనే అప్పటివరకు పడిన శ్రమ మటుమాయమవుతుంది. ఇది అక్షర సత్యం. ఇది ఎవరికివారు అనుభవించితే గాని అర్థంకాదు.

ఒక సంవత్సరం క్రితం శరీరంలో తేడాగా ఉంటే ఆ ఏడుకొండల వాడిని తలచుకొని నాకు ఎటువంటి ఆపదా రాకుండా కాపాడమని ప్రార్థించాను. స్వామి వెంటనే అభయ మిచ్చినట్లుగా చేసి నా ఆరోగ్యాన్ని కుదుట పరచాడు. ఆ తర్వాత డాక్టరుగారికి చూపించుకోగా స్వల్పంగా బి.పి. పెరిగింది. భయపడనవసరం లేదని చెప్పారు. స్వామివారి కరుణాకటాక్షా లతో నాకు అప్పటి నుండి ఆరోగ్యపరంగానే కాక ఎటువంటి ఇబ్బందులు కూడా కలగలేదు.

ఓసారి మా బాబుకు తీవ్రజ్వరం వచ్చింది. స్వామి వారిని కాపాడమని వేడుకున్నాను. ఆ ఏడు కొండలవాడు అనేక పర్యాయాలు నన్నే కాక, మా ఇంట్లో వాళ్లని కూడా ఎవరికి ఏ ఆపద వచ్చినా తలచుకోగానే వెంటనే కాపాడే వారు. ఆ శ్రీనివాసుడు నాతో ఉన్నాడనే ధైర్యమే నన్ను ముందుకు నడిపిస్తూ ఉంటుంది.

ఈ మధ్యలో నేను, నా మిత్రుడు కలిసి కోర్టు గేటు దగ్గర ఉన్నాము. ఎంట్రన్స్ గేటు వద్ద వెల్డింగు పనులు చేయుచుండగా నేను ఆ లైటింగ్‌ను చూడడం జరిగింది. కొంచెం సేపటికి కుడికన్ను కొంచెం నొప్పిగా అనిపించింది. ఏదో జరిగిందని నాకు భయం వేసింది. వెంటనే ఆ ఏడుకొండల వాడిని మనసులోనే తలచుకుని నాకు ఎటువంటి ఆపదా రాకుండా చూడమని ప్రార్థించాను. భక్త సులభుడు, ఆపన్న చింతామణి అయిన స్వామివారే నన్ను రక్షించాడు. కొంచెంసేపటికి తేరుకున్నాను. ఆ తర్వాత డాక్టరు గారికి చూపించగా ఏమీ కాలేదని చెప్పారు. ఆ స్వామిని "నమ్మినవారికి కొంగు బంగారము" అనుటలో ఎటువంటి సందేహం లేదు. ఆ స్వామివారి కృపవల్లే నాకు 'నోటరీ' కూడా వచ్చింది.

మనస్ఫూర్తిగా ప్రార్థిస్తే తప్పక కరుణించి మనవెన్నంటి ఉండేది ఆ ఏడుకొండల వేంకటేశ్వరుడే అనేది అక్షర సత్యం. ఆపదమొక్కులవాడు అని ఆ స్వామివారికి అందుకే పేరు వచ్చింది. మన భారం భగవంతునిపై వేసి నిశ్చింతగా ఉండవచ్చు అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.




**14వ అధ్యాయం ప్రారంభం -**

ధారావాహిక - 99

**విజయనగర యుగంలో తిరుమలదేవాలయానికి సంబంధించి ద్రవ్యవినిమయార్థం వ్యవహారంలో ఉన్న నాణాలు, బ్యాంకింగ్, నీటిపారుదల, పన్నులవిధింపు విధానం, ఆహారనైవేద్య సమర్పణలు, ఇతర ఆర్థికపరిస్థితులు :**

**ఉపోద్ఘాతం :**

దక్షిణ భారతదేశమందలి ఆర్థికవ్యవస్థ, ప్రధానంగా సాగుబడిలోఉన్న వ్యవసాయం సువ్యవస్థిత సంస్థ అవడం వల్ల, సంఘంయొక్క ద్రవ్య వినిమయ వ్యవస్థకీ, ఆర్థిక వ్యవహార విధానానికీ దేవాలయమే కేంద్రబిందువుగా పరిఢవిల్లింది. ఆంగ్లేయులు మనదేశానికి రాకముందు, మనదేశ సాంఘిక, ఆర్థిక పరిస్థితుల నేపథ్యంలో మన ఆలయాల ఆర్థిక స్తోమత, ప్రాధాన్యతను గురించి ఇంకా అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత ఉంది. తిరుమల దేవాలయ శాసనాలు ప్రధానంగా విజయనగర యుగంలోని, దేశంలో ఈ ప్రాంతానికి సంబంధించి ఆనాటి కాలంలో అమలులో ఉన్నటువంటి సాంఘిక, ఆర్థిక వ్యవస్థ గురించి అత్యంత విలువైన సమాచారాన్ని తెలుపుతుంది.

ఈ శాసనాలు, ఒకేచోట శ్రేష్ఠమైన విషయసముచ్చయాన్ని అందిస్తున్నాయి. ప్రధానంగా ఈ శాసనాలు దేవాలయానికి వివిధ అధికారులు, దేవాలయ పూజారులు మరియు ఇతర భక్తులు మొదలైన వారు చేసిన దానం, షరతులతో కూడిన ఆధార ద్రవ్యదానంగా ఇచ్చిన భూములు-మొదలైనవాటి గురించి విశదీకరిస్తున్నాయి. అంతేకాక ఇంకా దేవాలయాలు ఈ ధనాన్ని ఏ ప్రయోజనార్థమై ఏ విధంగా ఉపయోగించినదీ వివరంగా ఈ శాసనాలు తెలుపుతున్నందున, భక్తులు విరాళంగా సమకూర్చిన భూములను, ధనాన్ని పొందిన దేవాలయంయొక్క ఆర్థిక వ్యవహార సరళిని విశ్లేషించడానికి వీలుపడుతున్నది. ఈ శాసనాలు దేవాలయంలో అనుసరించే ఆగమశాస్త్రపద్ధతులను గురించిన వివరాలు కూడ తెలుపుతున్నాయి.

ఈ దేవాలయశాసనాలు క్రీ.శ.9వ శతాబ్ది మొదలు 16వ శతాబ్ది వరకు చెందినట్టివి. ఇంత విలువైన విషయ బాహుళ్యం కలిగినవి మరే హిందూదేవాలయంలోనూ కన్పించవు. తిరుమల దేవాలయ శాసనాలు ఆధారద్రవ్య (endowments) దానాలరూపాన ఇవ్వబడిన భూ, ధన దానాలకు సంబంధించినవిగా ఉండడం మరియు అవి మతసంబంధ దానాలు కావడంవల్ల దేవాలయానికి సమర్పించిన భూములు, ధనం ఏ విధంగా, ఎటువంటి ప్రయోజనార్థమై వినియోగింపబడినాయనే విషయాలను విశ్లేషించడానికి ఇవి అత్యంత ప్రయోజనకారిగా ఉన్నాయి. ఆర్థికవిశ్లేషణ చేయడానికి ఈ తిరుమల శాసనాలు చక్కని ఆధారాలనడం తెలిసిన విషయమే! అంతే కాదు, ఈ శాసనాలు ఇంకా దేవాలయ కార్యక్రమ విధివిధానాల్లో, కాలక్రమేణా వివిధ ఆచారవిధులు ప్రవేశపెట్టడం చేత, ఏ విధంగా మార్పులతో రూపుదిద్దుకున్నదనే విషయం నిర్ధారించడానికినీ, మధ్యయుగంలోని దక్షిణభారతదేశ సంస్కృతిలో హిందూదేవాలయాలు ఏ విధంగా కేంద్రబిందువుగా పరిఢవిల్లుతూ ఉండేవన్న విషయాన్ని తెల్పుతాయి.

కనుక పై విషయాలను పరిశీలించి అవలోకనం చేసుకోవడానికి మూలాధారమైన సమాచారానికి దేవాలయ శాసనాలే ముఖ్యాధారం. ఇందులకు, సాధారణంగా ప్రాచీన గ్రంథ నిలయాన్ని(archives)ఆశ్రయించాల్సి ఉంటుంది.

ప్రస్తుత విషయానికి వస్తే శాసనాల విషయంలో తప్ప, కాలానుగుణంగా విజయనగర యుగానికి తరువాత వచ్చిన మహారాష్ట్ర, మొఘలాయి మున్నగు పరిపాలకుల యుగంలో లభ్యమైనంతగా, దురదృష్టవశాత్తు విజయనగరయుగ విషయం లో సమకాలీన సాక్ష్యాధారాలు చాలతక్కువే! అవికూడ ఏ రెండు లేక మూడువందల ఏండ్ల ప్రాచీనతను కలిగియున్నవి. అట్టి వానిని గ్రహించడానికి ముందు ప్రామాణికత్వాన్ని, ప్రయోజ నాన్ని నిర్ణయించడంలో జాగ్రత్తపడాల్సి ఉంటుంది. ఎందు కంటే, రెవిన్యూఅధికారులు కొందరు అనేక కారణాలవలన తమ దగ్గరఉన్న రికార్డులను తారుమారు చేసేవారు. కావున గ్రామం లోని పన్నులకు సంబంధించిన పాత రికార్డులు(archival records) పరిశీలించినపుడు వెంటనే నిశ్చితాభిప్రాయానికి రాకూడదు. తగినంత శ్రద్ధతో సాక్ష్యాధారధ్రువపత్రాలలోని వివ రాలు పరస్పర నిర్దేశిత ఆకరాలతో సరిపోల్చి చూసుకుని విషయ నిర్ధారణకు రావాలి. లేకపోతే అవి మనలను తప్పుదోవ పట్టించ గలవు. మరోవిధంగా చెప్పాలంటే ఒక ప్రాచీన ధ్రువపత్రమై నంత మాత్రాన అది యదార్థమైనట్టిదనిగాని, సత్యమైనట్టిదని గాని నిర్ధారించడం సరికాదు.

దేవాలయశాసనాల విషయంలో ఈ విధమైన అనర్థపు వేటు పడడానికి అవకాశం లేదు. ఎందుకంటే ఈ శాసనాలు ప్రత్యేకించి ఎట్టి రాజకీయప్రయోజనం ఉద్దేశించి రచించినవి కావు. సాధారణంగా రాజకీయ వ్యవహారాలకు సంబంధించిన వాటిలో అక్రమధనార్జనకు అవకాశముండడంచేత తప్పుడు దస్తా వేజులు సృష్టించడానికి అవకాశమున్నది. కాని భక్తులు దైవ కైంకర్యార్థమై దేవాలయానికి షరతులతోకూడిన ఆధారద్రవ్య దానం చేయడం పుణ్యకార్యంగా భావించబడడంచేత, దేవాలయ శాసనాలను లిఖించేటప్పుడు ఎటువంటి తప్పులు దొరలకుండా, సరైన సమాచారం మాత్రమే ఇచ్చేట్లును, మరియు దాత ఉద్దేశం నెరవేర్చడంలో తగిన శ్రద్ధవహించబడుతుంది. సాధారణంగా మానవుడు ప్రభుత్వాన్ని మోసగిస్తాడేమో గాని లేక తన్నుతాను మోసగించుకుంటాడేమోగాని, దైవం విషయంలో అంతటి సాహ సం చేయడు. సాధారణంగా సాధ్యంకాని ఋణాలకు సంబం ధించిన హామీపత్రాలను హుండీలో వేయడం జరుగుతుంది. అట్టి వాటికి సంబంధించి తెలియబరచడం, హెచ్చరికవార్తలను పంపి, వాటితాలూకు ధనాన్ని దేవాలయంచే రాబట్టుకొనడం కూడ ఉన్నది. ఎవరుమాత్రం దైవానికి ఋణపడి ఉండడా నికి ఇష్టపడరు. అంతేకాదు,అణాపైసలతోసహా తమ ఋణాన్ని చెల్లించటానికే సిద్ధపడతారు. అందువలన దేవాలయ శాసనాల ప్రాముఖ్యత ఇందులోనే యున్నది. ఈ దేవాలయశాసనాలు నమ్మదగిన, సరియైన, నిశ్శంసయమైన తీర్మానాలకు రావడానికి వీలవుతుంది.

## 2) 16వ శతాబ్దంనందలి ఆంధ్రదేశమందలి పరిస్థితులు – నేలపన్ను, భూస్వామ్యం, దేవాలయ భూములు :

ఈ శాసనాలు ప్రధానంగా షరతులతోకూడిన ఆధార ద్రవ్యదానాలు (endowment)గా దేవాలయానికి దానం చేసిన గ్రామాలు లేక గ్రామభాగాలు, మరియు వ్యవసాయభూములు, వ్యవసాయంలో లేని బంజరుభూములు మున్నగువాటికి సంబం ధించినట్టివిగా ఉన్నాయి. దేవాలయానికి దానం చేసేటప్పుడు విధించిన షరతుల ప్రకారం, దేవాలయఅధికారులు అందుద్వారా వచ్చే ఆదాయంతో దానకర్త పేరుమీద నిర్ణయించిన సేవా కైంకర్యం లేదా ఉభయాన్ని గాని నిర్వహించేందుకు తగు ఏర్పాటు గావించవలసి యున్నది. కొన్ని సందర్భాలలో నిర్ణ యించిన సేవాకైంకర్యం ఒకమారు జరిపించేందుకు అయ్యే ఖర్చుల నిమిత్తంకూడ దానంచేయడం ఉన్నది. ఇది రెండవ పద్ధతి. కాగా, మొదట చెప్పబడిన పద్ధతి ప్రకారం దేనినైతే పెట్టుబడిగా పెట్టబడుతూ వస్తోందో అద్దాని నుండి ప్రతి సంవ త్సరం వడ్డీరూపాన లభించే ధనాన్ని వినియోగించి నిర్దేశించిన సేవాకైంకర్యం జరిపించడం జరుగుతుంది. శాసనాలలోని అట్టివివరాలను పరిశీలించినపుడు 16వ శతాబ్దం నాటి తిరుపతి దేవాలయం దాని పరిసర ప్రాంతాలలో నివసించుచుండిన జనం యొక్క సాంఘీక, ఆర్థికాభ్యున్నతి గురించి అత్యంత కుతూ హలాన్ని రేకెత్తించగల సమాచారం లభించగలదు.

ఈ కాలంలో సాధారణంగా అమలులో ఉండిన స్థిరాస్తి అనుభవహక్కు వివరాల గురించి ఈ సందర్భంలో ప్రత్యేకంగా గమనించాల్సిన ముఖ్యవిషయమేమంటే విజయనగరయుగంలో నేలపన్నుకు నాలుగుపద్ధతులు అమలులో ఉండేది.

(అ) ఈ కాలంలో **భండరవాడ లేక సర్కారు భూముల** నుండి లభించే వార్షిక రాబడి పరిపాలనావ్యయానికి నిర్దేశింప

ధారావాహిక
04

# మందార మకరందాలు

**భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు**
**శూలికైనఁ దమ్మిచూలి కైన!**
**విబుధజనులవలన విన్నంత కన్నంత**
**తెలియవచ్చినంత తేటపఱుతు.**

రామాయణం, భారతం, భాగవతం – ఈ మూడు గ్రంథాలు భారతీయ సంస్కృతికి మూలబింబాలు. భారతీయుల కట్టూ, బొట్టూ, నడకా, నాణ్యం, ఆవేశం, ఆలోచన అన్నిటిపైన ఈ మూడుకావ్యాల ముద్ర ఉంది. ఈ మూడింటిలో రామాయణ భారతాలకంటే భాగవతం అర్థంచేసుకోవడం కష్టం. కారణం? ఇందులో భక్తిపథంతోపాటు అక్కడక్కడ అతిజటిలమైన వేదాంత ఘట్టాలుండడమే. శ్రీధరపండితుడు విడదీసిన చిక్కులను చూస్తేనే గాని ఒకపట్టాన ఇది అంతుపట్టదు. అందుకే పోతన్న విన్నవించుకున్నాడు --భాగవతాన్ని అర్థం చేసుకోవడం సులభం కాదని. తెలుసుకున్నదాన్ని తెలియ జెప్పడం మాటలు కాదని, ఎవరికి? కవులకు మాత్రమే కాదు. ముగ్గురు మూర్తులలో అటు శివునికీ, ఇటు కమలభవునకూ కూడా. ఇక మధ్యలో మిగిలినవాడు మాధవుడు. భాగవతం ఆ మాధవుని కథే. ఆయన కథ తెలిసి పలకాలంటే ఆయనకే చెల్లుతుందేమో. ఆ భగవత్తత్త్వాన్ని తాను పండితుల వలన తెలుసుకున్నంత, తన దృష్టికి తెలియవచ్చినంత తేటపరుస్తానని పోతన్న చెప్పుకున్నాడు. మిగతా విబుధజనులెవ్వరో తెలియదుగాని వ్యాసభాగవతానికి వ్యాఖ్యానం వ్రాసిన శ్రీధరపండితుణ్ణి మాత్రం పోతన్న ఆసరాగా తీసుకున్నాడు. వేదాంతఘట్టాల వివరణలో శ్రీధరీయవ్యాఖ్య పోతన్న పాలిటి సువర్ణభిక్ష.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి.నారాయణరెడ్డి**

బడింది కావున, ఈ భూములు ప్రభుత్వ శాఖ అధీనంలో ఉంటాయి.

**(ఆ) అమరం** అంటే సైన్యాధికారులకు (నాయకులకు) ఇచ్చిన భూక్షేత్రం. నిర్ణీత సైన్యాన్ని పోషిస్తూ, అవసరమైనపుడు పిలవగనే సైన్య సమేతుడైవచ్చి చక్రవర్తికి బాసటగా నిలుచుట ఇతని బాధ్యత. ఇటువంటి స్థిరాస్థిని అనుభవించు హక్కు భుక్తములో కొన్నిరకాలున్నాయి. భూక్షేత్రంపై వచ్చిన ఆదాయాన్ని పూర్తిగా సైన్య పోషణకై ఉపయోగిస్తాడు. మరికొందరు, వచ్చిన ఆదాయంలో కొంతభాగం రాజభాండారానికి చెల్లించి మిగతా భాగం సైన్యపోషణకై ఉంచుకుంటాడు.

**(ఇ)** మరోరకం నేల అనుభవహక్కు ఉన్నది. ధర్మార్థంగా బ్రాహ్మణులకు, దేవాలయాలకు, మఠాలకు లేక సంప్రదాయ విద్యాపీఠాలకు ఇచ్చిన భూములు. ఈ భూములు స్థిరాస్తి హక్కుల విషయంలో దేవాలయ భూములు ధర్మకర్తే నిర్వహిస్తుండగా, మరికొన్ని సందర్భాలలో మఠాధిపతియే యజమానిగా ఉంటాడు.

**(ఈ)** కర్షక యజమాని విధానం. దీన్ని గురించి అనేక వాగ్వాదాలున్నాయి. ప్రొఫెసర్ టి.వి.మహాలింగం, డా॥ నేలటూరి వెంకటరమణయ్య మొదలైన విజయనగర చారిత్రక పరిశోధకులు కూలంకషంగా చర్చించారు.

### 3) ఆదాయంలో దేవాలయానికి చెందే భాగం:

స్థిరాస్తి అనుభవహక్కు ఏ రూపంలో ఉన్నప్పటికీ అందులకు లోబడిన గ్రామం లేక భూమిమీదవచ్చే వార్షికాదాయాన్ని మేల్వరం, కుడివరం అని రెండు రకాలుగా చేయబడుతుంది. వార్షిక ఆదాయంలో మేల్వరం భాగం భూయజమానికి చెందగా, కుడివరం భాగం భూమిని దున్ని పంటలను పండించు రైతుకు చెందుతుంది. ఈ పద్ధతి బ్రిటీషువారి పరిపాలనా కాలం వచ్చేవరకు ఎట్టిమార్పు లేకుండా వచ్చింది. గ్రామం ఎవరికైతే దానం చేయబడిందో అంటే ఆలయం కావచ్చు లేదా ప్రభుత్వఖజానాకు కావచ్చు లేదా మఠం కావచ్చు, అట్టి వ్యక్తి లేక సంస్థకు మేల్వరం భాగమున్నూ, కుడి

వరం భాగం ఇచ్చి కష్టించి నేలను దున్ని పంటను పండించిన కర్షకుడు ఉంచుకుంటాడు. ఈ విధంగా వార్షికాదాయాన్ని యజ మాని భాగం, కర్షకునిభాగం అని రెండువిభాగాలుగ చేసేపద్ధతి కడుప్రాచీనమైన విధానం. పల్లవుల, చోళుల కాలంలో ఈ విభాగపద్ధతిని **మియట్చి**(Miatchi), మరియు **కనియట్చి** (Kaniatchi) అన్న పేర్లతో పిలువబడుతూ వచ్చింది. రాజు కొంత భూమిని లేక ఒక గ్రామాన్ని దేవాలయానికి దానం చేసినపుడు, ఇంతకు పూర్వం ఈ గ్రామంనుండి లభించే వార్షిక ఆదాయంలో సాధారణంగా ఒక నిర్ణీతభాగంగా ఎంత రాజ భండారానికి చెల్లించేవారో అంత ధనాన్ని ఇపుడు **మేల్‌వరం** రూపాన శ్రీభండారానికి చెల్లించబడుతుంది. ఆదాయంలోని **కుడి వరం** భాగం మాత్రం నేలనుదున్ని పంటలను పండించు కర్షకు నకు లభ్యం కాగలదు.

గ్రామంయొక్క స్థిరాస్తిహక్కు ఏ తరగతికి చెందినదై ఉన్నప్పటికీ మరియు ఏ తరగతికి చెందిన వ్యక్తి లేక సంస్థ ఆ గ్రామం దానంగా పొందియున్నప్పటికీ, అందలి పొలంలో నేలను దున్నిన కృషీవలునికి తన సాంవత్సరికాదాయంలో ఎంత భాగాన్ని **కుడివరంగా** పొందగలిగాడన్న వివరాలు శాసనాలలో ఎక్కడా సూచించలేదు. కానీ, ఆ కాలంనాటి సాంఘిక, ఆర్థిక సంబంధ విషయాలు పరిశోధనా వ్యాసంగ సందర్భంలో పరి గణనలోకి తీసుకోవలసిన ముఖ్య విషయం.

### 4) దేవాలయానికిగల ఆర్థికవనరులు మరియు నీటిపారు దల సౌకర్యాల సామర్థ్యాన్ని పెంపొందించు వ్యవస్థ :

తిరుపతి ప్రాంతంలోని పంటపొలాలకు నీటిపారుదల సౌకర్యాన్ని అభివృద్ధి పరచడం అత్యావశ్యకం. షరతులతోకూడిన ఆధార ద్రవ్యదానం (endowment) రూపంలో దేవాలయానికి లభిస్తున్న ధనాన్ని పెట్టుబడిగా పెట్టడానికి ఇదొక నమ్మకమైన, స్థిరమైన విధానం. తిరుపతిలో పెద్దఎత్తున దైనందిన పూజాకార్య క్రమాలు నిర్వహించబడుతూ రావడానికి కారణం పెట్టుబడిగా పెట్టబడిన షరతులతో కూడిన ఆధారద్రవ్య దానాలనుండి నమ్మ కంగా నిరంతరాయంగా వచ్చే ఆదాయమే. నికరమైన ఆదాయం పొందగల ఈ పెట్టుబడి ప్రణాళిక దానకర్తకు తాను చెల్లించిన ధన విషయమై స్పష్టమైన హామీని, నమ్మకాన్ని కలిగించకపోతే వివిధదైవాల సేవాకైంకర్యార్థం షరతులతోకూడిన ఆధారద్రవ్య దానం ఇంత పెద్దఎత్తున పెద్ద మొత్తంలో లభించడం సందేహాస్ప దమే! కాబట్టి దేవాలయ సంస్థాగత అభివృద్ధి, దేవాలయం నిర్వహించే వ్యవసాయాభివృద్ధి ప్రణాళిక సక్రమనిర్వహణపై ఆధారపడి ఉంది.

దేవాలయ లౌకిక వ్యవహార నిర్వహణాదక్షత అభివృద్ధి అనేది దేవాలయ భూములకు నీటిపారుదల సౌకర్యాలను కలుగ జేయు కార్యక్రమానికీ సన్నిహిత సంబంధమున్నది. దినదిన ప్రవర్ధమాన మౌతున్న సుప్రసిద్ధ దేవాలయంగా ఖ్యాతిని పొందు తున్న ఈ తిరుపతి దేవాలయం, రెండు శతాబ్దాల తరువాత అంటే క్రీ.శ. 1380వ సంవత్సర ప్రాంతాన, కార్యనిర్వాహకులైన 12 మంది సభ్యులున్న ధర్మకర్తలమండలి (స్థానత్తారులు) అధీనం లోనికి వచ్చింది. సుమారు ఒకశతాబ్దం తరువాత అంటే క్రీ.శ. 1450వ సంవత్సర ప్రాంతంలో వేరొక పాలకవర్గం దేవాలయ కార్యనిర్వహణాధికారాన్ని పొందింది. ఇది పంటకాలువల నిర్మాణ ప్రణాళిక విషయంలో ఒక ముఖ్యమైన ఘట్టం. దేవాల యానికి లభిస్తున్న ఆర్థికవనరుల లభ్యతకు దేవాలయ దైనందిన బహు కార్యక్రమాల నిర్వహణదక్షత ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉన్నాయి. 15వ శతాబ్ది ద్వితీయార్థం నుండి 16వ ప్రథమార్థం వరకుగల ఈ మధ్యకాలంలో దేవాలయానికి షరతులతో కూడిన ఆధారద్రవ్యం (endowment), ధనం దానం చేయడానికి గల కారణం సామర్థ్యవంతమైన ఆలయ కార్య నిర్వాహకవర్గం ఉండడమే. ఇందుకుతోడు విజయనగర రాజ్య పరిపాలకుల పోషకత్వం తోడయింది. 16వ శతాబ్దం నాటికి ఈ దానాల ప్రక్రియ పెరగడం అందులకు దేవాలయ అధి కారులు దాతల ఆకాంక్షకనుగుణంగా పనిచేస్తూ అటువంటి దానాలను ప్రోత్సహించేవారు.

### 5) వివిధ దాతలు :

తిరుమల దేవాలయానికి ధనరూపానగాని, గ్రామ రూపాన గాని షరతులతోకూడిన ఆధారద్రవ్యదానాన్ని (endowment) చేసిన దాతలగురించి శాసనాలలో తెలుపబడిన వివ రాల ఆధారంగా దేవాలయ శాసనాలను 28 వర్గాలుగా విభ జింపబడినది. 1) విజయనగర చక్రవర్తి, 2) రాణి, 3) పట్టపు

రాణి, 4) రాజప్రతినిధి, 5) ప్రధానమంత్రి, 6) ప్రధాన మంత్రి కుటుంబం, 7) ప్రధాన సైన్యాధ్యక్షుడు, 8) సైన్యాధిపతులు, 9) రాజప్రాసాద ఉద్యోగస్తుడు, 10) రాజోద్యోగి, 11) రాజ పురోహితుడు,12) క్రింది తరగతి అధికారులు, ప్రముఖ పాళెయ గార్లు, 13) పన్నులు వసూలు చేయు అధికారి, 14) సంస్థాన అధికారి, 15) మరొక అధికారి (ఇతని అధికారం నిర్వచించబడ లేదు), 16) జీయరులు, 17) ఏకాకి శ్రీవైష్ణవులు, 18) ఆచార్య పురుషులు, ఆధ్యాత్మిక గురువులు, 19) సభైయ్యారులు, 20) వైదిక బ్రాహ్మణులు, 21) కవుల కుటుంబం, 22) సంగీత కవులు, 23) పండితులు, 24) నంబిమార్ (దేవాలయ పూజారులు), 25) మధ్వ ఉపాధ్యాయుడు, 26) దేవాలయ గణాంకాధికారులు, 27) పౌరులు మరియు వర్తకులు, 28) భక్త జనులు.

క్రీ.శ.1510వ సంవత్సరం నుండి క్రీ.శ.1570వ సంవత్సరం వరకు గల ఈ 60 సంవత్సరాల కాలంలో అంటే చక్రవర్తులైన కృష్ణదేవరాయల (క్రీ.శ.1508–1530), అచ్యుతరాయలు (క్రీ.శ.1530–1542) మరియు సదాశివరాయలు (క్రీ.శ.1542–1568) – వీరి పరిపాలనాకాలంలో ప్రకటించిన తిరుమల శాసనాలలో ప్రస్తావించిన దానాలను గురించిన వివరాలను విశ్లేషించి ఈ క్రింద తెలుపబడింది. క్రీ.శ.1510 నుండి 1570 సంవత్సరాల మధ్యకాలంలో దేవాలయానికి దాతలు చేసిన మొత్తం దానగ్రామాల సంఖ్యను వర్గీకరించి ఇవ్వబడింది.

**1. దాతల వివరం :** రాజు,రాణి,రాజప్రతినిధి మరియు ఇతర పరిపాలనాధికారులు కృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో రాజసంబంధమైన గ్రామాలు12, అచ్యుతరాయల కాలంలో 10, సదాశివరాయల కాలంలో 40. మొత్తం 62 గ్రామాలు.

**2. దాతల వివరం :** జీయర్, ఆచార్యపురుషులు, పండితులు, సంగీత కళాకారులు, దేవాలయ నాట్యకత్తెలు మొదలైన ఆలయ కార్యనిర్వాహకవర్గం మొదలైనవారు కృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో చేసిన ధర్మార్థమైన గ్రామాల దానం 5, అచ్యుతరాయల కాలంలో 19, సదాశివరాయల కాలంలో 18. మొత్తం 42 గ్రామాలు దానం చేయబడినాయి.

**3. దాతల వివరం :** వర్తకులు, వ్యాపారులు, భక్తులు మొదలైన వారు కృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో కృషీవలుడి, పల్లెటూరివారి అధీనంలో ఉన్నటువంటి గ్రామం 1, అచ్యుత రాయల కాలంలో 6, సదాశివరాయల కాలంలో 3. మొత్తం 10 గ్రామాలు దానం చేయబడినాయి.

కాబట్టి మొత్తంపై కృష్ణదేవరాయల పరిపాలనా కాలంలో దాతలు 18 గ్రామాలు, అచ్యుతరాయలకాలంలో 35, సదాశివరాయలకాలంలో 61, వెరసి 114 గ్రామాలనుదానంగా ఇవ్వబడ్డాయి. అదేవిధంగా ఇదేకాలంలో దేవాలయానికి ధన రూపంలో చేసిన దానాలనుకూడ తెలపడం జరిగింది.

**1. దాతల వివరం :** రాజు,రాణి, రాజప్రతినిధి మరియు ఇతర రాజ్యపరిపాలకులు కృష్ణదేవరాయల పరిపాలనాకాలంలో దానం చేసిన ధనం 51,400 పణాలు అంటే 33%, అచ్యుతరాయల పరిపాలనాకాలంలో 3,08,705 పణాలు అంటే 65%, సదాశివరాయల కాలంలో 38,680 పణాలు అంటే 20.5% దానం వచ్చింది.

**2. దాతల వివరం :** జీయర్, ఆచార్యపురుషులు మొదలైనవారు కృష్ణదేవరాయల పరిపాలనాకాలంలో 40,681 పణాలు అంటే 26%, అచ్యుతరాయల కాలంలో 1,09,898 పణాలు అంటే 24%, సదాశివరాయల కాలంలో 42,371 పణాలు అంటే 23.5% దానంగా వచ్చింది.

**3. దాతల వివరం :** వర్తకులు, భక్తులు తదితరులు కృష్ణదేవరాయల పరిపాలనాకాలంలో చేసిన ధనం 53,185 అంటే 41%, అచ్యుతరాయల కాలంలో 51,988 పణాలు అంటే 11%, సదాశివరాయల కాలంలో 1,08,555 పణాలు అంటే 56% దానంగా వచ్చింది. మొత్తంమీద కృష్ణదేవరాయల పరిపాలనాకాలంలో 1,45,356 పణాలు, అచ్యుతరాయల కాలంలో4,70,591 పణాలు, సదాశివరాయల కాలంలో 1,89,706 పణాలధనం దేవస్థానానికి దానంగా వచ్చింది. ***(ఇంకా ఉంది)***

**తేషా మసౌ విరజో బ్రహ్మలోకో న యేషు జిహ్మ**
**మనృతం న మాయా చేతి. - ప్రశ్నోపనిషత్తు :16**
**ఎవరియందు కుటిల భావము, అసత్యము, కపటము, మొదలైన దోషాలు లేవో అట్టివారికే పవిత్రమగు బ్రహ్మలోకము సిద్ధిస్తుంది.**

# మూడు పువ్వులు కాయలు

– దాసరి చంద్రయ్య

విమలాపురంలో రామయ్య అనే రైతుకు సోమయ్య ఒక్కగానొక్క కొడుకు. సోమయ్య తండ్రితో పాటు పొలంపనులకు వెళ్ళేవాడు కాదు. అతనికి కష్టపడి పని చేయడం ఇష్టముండేది కాదు. కష్టం చేయకనే ఎక్కువ డబ్బు సంపాదించాలనే మనస్తత్వం అతనిది. తండ్రి ఎంతగానో చెప్పి చూశాడు. కానీ, లాభం లేకపోయింది. ఆ దిగులుతోనే రామయ్య కొంతకాలానికి చనిపోయాడు.

ఇరుగూ పొరుగూ వాళ్లు "సోమయ్యా! నువ్వు వ్యవసాయం పనులు చేయలేవు గానీ, ఏదైనా మంచి వ్యాపారం చూసి చేసుకో... కష్టం లేకుండా బ్రతికిపోవచ్చు"ని సలహా ఇవ్వడంతో సోమయ్య మనసులో కూడా ఏదైనా వ్యాపారం చేయాలనే తలంపు వచ్చింది. వచ్చిందే తడవుగా పట్టణానికి వెళ్ళి అక్కడ తనకు తెలిసిన వాళ్ళను కలుసుకొని ఏ వ్యాపారం చేస్తే లాభసాటిగా ఉంటుందో; ఏ వ్యాపారం అయితే కష్టం తక్కువగా ఉంటుందో చెప్పమని సలహా లడిగాడు.

"ఏ వ్యాపారంలో అయినా లాభాలు, నష్టాలు రెండూ ఉంటాయి. పూర్తిగా లాభాలే కావాలంటే కష్టం" అని కొందరన్నారు.

"కష్టం తక్కువగాను, లాభం ఎక్కువగాను ఉండే వ్యాపారం అంటే కుదరదు. తక్కువ కష్టానికి తక్కువ లాభం, ఎక్కువ కష్టానికి ఎక్కువ లాభాలు ఉంటాయ"ని మరికొందరన్నారు.

ఈ సలహాలేవీ సోమయ్యకు నచ్చలేదు. తిరిగి తన ఊరికి వచ్చేశాడు. ఏ వ్యాపారం చేయాలో అర్థంకాక తికమక పడుతున్నాడు. ఓ రోజు సోమయ్య ఊరి రచ్చబండ వద్ద కూర్చుని తను చేయాల్సిన వ్యాపారం గురించి ఆలోచిస్తూ ఉన్నాడు. అప్పుడే అటుగా వచ్చిన ఆ గ్రామంలోని ఓ పెద్దాయన "ఏం సోమయ్యా! ఏంటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్! వ్యాపారం గురించేనా.. ఏ పని అయినా చేసేటప్పుడు ముందు, వెనుక బాగా ఆలోచించి చేయాలి. తప్పటడుగు పడిందో నిలబడటం కష్టం. సరే వస్తా!!" అంటూ రెండడుగులు ముందుకేసి ఏదో గుర్తొచ్చినవాడిలా ఆగి, తిరిగి సోమయ్య దగ్గరికి వచ్చి 'ఆ.. సోమయ్యా ఒక మాట.. మన చెరువు గట్టున ఉండే రావిచెట్టు వద్ద ఎవరో ఒక స్వామీజీ ఉన్నారట. ఆయనకు మన సమస్యలు చెప్పుకుంటే అవి తీరే ఉపాయాలు చెబుతున్నారట. చాలామందికి ఆయన చెప్పిన సలహాలు బాగా పనిచేశాయని చెప్పుకుంటుంటే విన్నాను. నువ్వూ వెళ్ళిరాకూడదా?" అన్నాడు.

"నేనూ ఆ విషయం విన్నానండి. కానీ వ్యాపారవిషయాలు స్వామీజీకి ఏం తెలుసునని" అన్నాడు.

"చూడు సోమయ్యా! ఆ స్వామీజీ.. ఉత్తుత్తి స్వామీజీ కాదంటయ్యా, ఆయన దగ్గర చాలా మహిమలు కూడా ఉన్నాయట! ముందు పోయి కలుసుకో.. తర్వాత ఎలాగైతే అలా అవుతుంది. సరే! నే వస్తా.." అంటూ ఆ పెద్దాయన అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

సోమయ్య స్వామీజీని కలుసుకున్నాడు. తను వచ్చిన విషయాన్ని విన్నవించుకున్నాడు. విషయం విన్న స్వామీజీ కొంతసేపు ఆలోచించి "చూడు సోమయ్యా! మీ గ్రామంలో పప్పుదినుసులు, ఉప్పునూనెలు వంటివి అమ్మే అంగడి లేదు. అవి కావాలంటే దూరంగా ఉన్న బస్తీకెళ్ళి కొనుక్కొని రావాలి. నీవే వాటిని తెచ్చి అమ్మావంటే వ్యాపారం బాగా జరుగుతుందని స్వామీజీ చెప్పడంతో, అది నచ్చిన సోమయ్య "సంతోషం స్వామీ! నా వ్యాపారం మూడుపువ్వులు ఆరుకాయలుగా జరిగేటట్లు ఆశీర్వదించండి!" అన్నాడు. అందుకు స్వామీజీ "మూడు పువ్వులూ – ఆరుకాయలా?" అనుకుంటూ సోమయ్యను ఆశీర్వదించి పంపాడు.



సోమయ్య వ్యాపారం బాగానే జరుగుతూ ఉంది. కానీ వచ్చే ఆదాయం తృప్తి కలిగించలేదు. ఇంకా ఎక్కువ ఆదాయం సంపాదించాలనుకున్నాడు. తను అమ్మే సరుకుల్లో కల్తీ చేసి అమ్మసాగాడు. ఆ కల్తీ కూడా ఎవ్వరూ కనుగొనలేని విధంగా చేయసాగాడు. ఇప్పుడు అతను అనుకున్న విధంగానే అతని వ్యాపారం మూడుపువ్వులూ ఆరుకాయలుగా జరుగుతున్నది.

ఒకరోజు సోమయ్య తన స్నేహితుడి పెళ్ళికి పట్నం వెళ్ళాడు. మర్నాడు తిరిగి ఇంటికి వచ్చేసరికి సోమయ్య గుండెలు గుభేల్లుమన్నాయి. తను పెళ్ళికి వెళ్ళేటప్పుడు గడియపెట్టి వేసిన తాళం ప్రస్తుతం తీసేసి ఉంది. ఆందోళనగా తలుపులు తీసుకొని ఇంట్లోకి వెళ్ళి బీరువాలో చూశాడు. సోమయ్యకు నిలువునా భూమిలోకి కూరుకుపోతున్నట్లనిపించింది. బీరువాలో రెండు అరల్లో మాత్రమే డబ్బులున్నాయి. సోమయ్య లబోదిబో మంటూ స్వామీజీ దగ్గరికెళ్ళాడు. జరిగిందంతా గుండెలు బాదుకుంటూ చెప్పాడు.

స్వామీజీ చిన్నగా నవ్వాడు. ఆ నవ్వు చూసి సోమయ్యకు కాస్త చిరాకేసింది. కానీ ఆ చిరాకును కనిపించనీయకుండా "ఏం స్వామీ! నా పరిస్థితి చూస్తుంటే మీకు నవ్వులాటగా ఉందా?" అని దీనంగా అన్నాడు. "సోమయ్యా! నీకు గుర్తుందా! మొదట నా దగ్గరకు వచ్చినపుడు, నీవేం కోరావో? నా వ్యాపారం మూడుపువ్వులు – ఆరుకాయలుగా సాగాలని ఆశీర్వదించమన్నావు. అది ఎలా సాధ్యమౌతుంది. మూడు పువ్వులు మూడు కాయలే కాస్తాయి. అంతేకాని ఆరుకాయలెలా కాస్తాయి. అంటే నువ్వు ప్రజలను మోసం చేసి సంపాదించేలా ఆశీర్వదించమన్నావు. ఆ విధంగా నేనెలా ఆశీర్వదించగలను? ఇప్పుడు కూడా నీ కష్టార్జితం నీకు మిగిలే ఉంది. మోసంతో సంపాదించిందే పరులపాలయ్యింది. ఇకనైనా జాగ్రత్తగా వ్యాపారం చేసుకో" అని చెప్పి స్వామీజీ ధ్యానంలోనికెళ్ళిపోయాడు. తన కల్తీ విషయం స్వామీజీకి తెలిసినందుకు ఆశ్చర్యపోతూ బుద్ధివచ్చిన వాడిలా లెంపలు వేసుకుంటూ ఇంటిదారి పట్టాడు సోమయ్య.

## తిరుపతిలో దర్శనీయ ఆలయాలు

### శ్రీ గోవిందరాజస్వామి ఆలయం :

ఇతిహాసం ప్రకారం ఈ క్షేత్రాన్ని శ్రీరామానుజులు ప్రతిష్ఠించారని ప్రతీతి. శ్రీ గోవిందరాజస్వామి ఆదిశేషునిపై శయనించిన భంగిమలో దర్శనమిస్తున్నారు. శ్రీ ఆండాళ్, శ్రీ పార్థసారథి మరియు శ్రీ వేంకటేశ్వరస్వామి గుడులు శ్రీ గోవింద రాజస్వామి ఆలయం ప్రాంగణంలో ఉన్నాయి. విజయ నగర రాజుల శిల్పకళాచాతుర్యానికి ప్రసిద్ధి చెందింది ఈ ఆలయం.

### శ్రీ కోదండరామస్వామి ఆలయం :

తిరుపతి రైల్వేస్టేషన్‌కు ఒక కిలోమీటరు దూరంలో ఉన్న ఈ ఆలయంలో శ్రీ కోదండరామస్వామి వెలసి ఉన్నాడు. రావణవధానంతరం సీతాలక్ష్మణులతో శ్రీరాముడు ఈ స్థలంలో కొంతసేపు ఉన్నందుకు గుర్తుగా ఈ ఆలయం నిర్మింపబడింది.

### శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం :

తిరుపతి పట్టణానికి 3 కి.మీ.దూరంలో ప్రసిద్ధ శైవక్షేత్రం వెలసి ఉంది. కపిలమహర్షి పూజించిన శివలింగం కనుక కపిలేశ్వరుడని ఇచటి తీర్థం కపిలతీర్థం అని పిలువబడుతున్నది.

### అలమేలు మంగాపురం (తిరుచానూరు) :

తిరుపతికి 5 కి.మీ. దూరంలో ఉన్న ప్రాచీనమైన క్షేత్రం తిరుచానూరు. దీన్నే అలమేలు మంగాపురం అని కూడా అంటారు. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవేరి శ్రీ పద్మావతి అమ్మవారు ఇచట పూజలందుకొంటున్నది. తిరుమల యాత్రికులు తిరుచానూరు అమ్మవారిని దర్శించినట్లయితే తమ యాత్ర ఫలవంతమౌతుందని ప్రసిద్ధి. అందువల్లే తిరుమల యాత్రికులు, తిరుచానూరుకు వెళ్లి శ్రీ పద్మావతి అమ్మవారిని పూజిస్తారు. తిరుచానూరులో ఉన్న పవిత్ర పుష్కరిణి "పద్మసరోవరం"లో శ్రీ పద్మావతి అమ్మవారు ఆవిర్భవించారని పురాణ ప్రసిద్ధి.

మన దేవాలయాలు

# శ్రీ గంగా పార్వతీ సమేత ఉదయ కళేశ్వర క్షేత్రం, గండవరం

- పి. శ్రీహరి

పూర్వం భగీరథుడు గంగను ఈ భూమి మీదకు రప్పించడం కోసం, తపస్సు చేసి పరమశివుడిని మెప్పించి, స్వామివారి తేజోరూపాన్ని లింగరూపంగా ప్రసాదించమని కోరాడు. అతని కోరిక మేరకు పరమశివుడు తన తేజో రూపమైన లింగాన్ని భగీరథుడికి ప్రసాదించాడు. ఆ దివ్యతేజో లింగాన్ని ఇస్తూ "భగీరథా! గంగ భువికి ధారగా వచ్చినచో, ఈ భూప్రపంచమంతా కల్లోలమౌతుంది. అందుచేత, ఈ తేజో లింగరూపాన్ని భూమియందు ప్రతిష్ఠించి, గంగను ప్రార్థిస్తే, ఆమె నా శిరస్సు మీద ధారగా పడుతుంది. ఆ జలాన్ని నీకు ప్రసాదంగా ఇస్తానని" చెప్పాడు. అలా లింగాన్ని సంపాదించిన భగీరథుడు పరమేశ్వరుడు చెప్పిన విధంగానే లింగాన్ని భూమియందు ప్రతిష్ఠించి గంగను ప్రార్థించాడు. ఆ ప్రార్థనకు మెచ్చిన గంగ భూమికి తరలి వచ్చి శివుని శిరస్సుపై దారగా పడెను.

అలా కొంతకాలం గడిచిన తర్వాత ఈశ్వరుడు ఆగ్రహించి, "భగీరథా! నీవు నా తేజోలింగరూపాన్ని అపవిత్రం చేశావని" చెప్పాడు. భగీరథుడు ఆశ్చర్యపోయి "స్వామీ! నేను చేసిన తప్పు ఏమిటని" అడిగాడు. అప్పుడు శివుడు "గంగ భూమికి వచ్చే సమయంలో వాయువులో జీవించే అనేక జీవరాశులు మరణించి గంగతో కలిసి నా తేజోలింగంపై పడ్డాయి" అని చెప్పాడు. ఆ పాపానికి నిష్కృతిని క్లుప్తంగా వివరించమని భగీరథుడు పరమశివుణ్ణి ప్రార్థించాడు. అంతట శివుడు, కాశీ క్షేత్రం నుండి రామేశ్వర క్షేత్రం వరకు గల లింగరూపాలను దర్శించి, పూజాదికాలు ఆచరిస్తే శాపవిముక్తి కల్గుతుందని చెప్పాడు. భగీరథుడు ఆ విధంగానే, మొదలుపెట్టి కాశీక్షేత్రం నుంచి శైవక్షేత్రాల్ని దర్శించుకుంటూ, రామేశ్వర క్షేత్రం వైపుగా పయనమయ్యాడు.

మార్గమధ్యంలో 'గ్రంథినాపురం' అనే గ్రామానికి వచ్చే సమయానికి సూర్యాస్తమయం కావడంతో సంధ్యాదికాలు నిర్వహించడం కోసం ఆ గ్రామంలో గల వాగునందు స్నానమాచరించి, సంధ్యాదికాలు పూర్తి చేసుకొని పరమశివుని ధ్యానం గావించుకొంటూ ఉండగా సుగంధ పరీమళ పవనం వీచింది. భగీరథుడు ఆ సువాసన ఎక్కడ నుంచి వస్తుందో చూద్దామని పశ్చిమదిశగా పయనించాడు. వాగుకు కొద్దిదూరంలోనే ఒక స్మశానంలో ఉన్న నాగవల్లి వృక్షం నుండి ఆ పరిమళం వస్తున్నట్లుగా గమనించాడు. వృక్షం వెనుక భాగంలో ఒక చితి వెలుగుతుండడం గమనించిన భగీరథుడు అక్కడికి పోరాదని వెనుతిరిగాడు. ఆ రాత్రికి వాగు తీరంలో విశ్రమించాడు.

బ్రాహ్మీముహూర్తంలో భగీరథుడు నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని, సూర్యోదయమయ్యే సమయానికి అర్ఘ్య ప్రదానం గావించాడు. మహర్షుల అర్ఘ్య ప్రదానాన్ని స్వీకరించే సూర్యభగవానుడు,



ఉదయకళేశ్వరుని ఆలయం, గండవరం

భగీరథుడి అర్ఘ్య ప్రదానాన్ని స్వీకరించకుండా ప్రచండ సూర్యకిరణాలను వాగుకు సమీపంలో గల స్మశానమందు చితికి మధ్యభాగంలో వికసింపజేశాడు. అది చూచిన భగీరథుడు తన అర్ఘ్యాన్ని స్వీకరించకుండా ఈ ప్రచండ సూర్యకిరణాలు, ఈ స్మశానమందు ప్రసరిస్తున్నాయి. దీనికి గల కారణం ఏమై ఉంటుందోనని పరీక్షించాలనుకున్నాడు. ఈ చితిని చేతితో తాకితే చేతులు అపవిత్రమౌతాయని భావించి, కుడికాలితో చితిని నెట్టాడు. అందులోని పరమశివుని పానవట్టమునకు భగీరథుడి కుడికాలి బొటనవేలు తగిలి చితికి రక్తం చిందింది. దాంతో ఆగ్రహం చెందిన భగీరథుడు "ఇక్కడ ఎంత శక్తి ఉన్నా నిర్జీవ మగుగాక!" అని శపించాడు. దీనికి ఆగ్రహించిన పరమశివుడు ఆకాశవాణి రూపంలో "భగీరథా! నీవు చేసిన పాపానికి నిష్కృతిగా శివక్షేత్రాలు దర్శించుకుంటున్నావు. మరలా నన్ను నీ కాలితో స్పృశించి అపవిత్రం గావించావు. దీనికి నీ ఆత్మశక్తి అంతా ఇక్కడే నాయందే విడిచిపెట్టాలని" పరమశివుడు భగీరథుణ్ణి శపించాడు.

భగీరథుడు పశ్చాత్తాపపడి తర్వాత ఆత్మశక్తినంతా, ఆ గ్రంథినాపురక్షేత్ర పరమశివునకు అర్పించి, పదకొండు వెదురు చెట్లను స్వామి వారి వృత్తాకారంలో నిర్మించి, స్వామి వారికి ఒక పుట్టను చేసి, ఒక సర్పాన్ని అమర్చి భగీరథుడు ఈ స్వామి వారు ఉదయకిరణాలతో ఆవిర్భవిస్తున్నాడు కాబట్టి ఈ స్వామి శ్రీ ఉదయకళేశ్వరస్వామి అని నామస్మరణ చేసి పూజాదికాలు నిర్వహించి ఆ తర్వాత, రామేశ్వరక్షేత్రానికి పయన మయ్యాడు.

ఇలా ఉండగా కొంతకాలం గడిచిన తర్వాత చోళులు, పల్లవులు ఈ ఆలయనిర్మాణం గావించారు. ఆలయ నిర్మాణంలో భాగంగా గ్రంథినాపుర గ్రామానికి, వెనుక భాగంలో గల మరొక గ్రామానికి మధ్యభాగంలో ఇరుగ్రామాలకు సమాంతర భాగంగా స్వామివారి పుట్ట ఉండేటట్లుగా, పుట్టను విస్తరింపజేశారు. గ్రంథినాపురంలో గల ప్రధాన తహశీల్దార్ ఆ పుట్టను భక్తితో పూజించాలని శాసించాడు. గ్రంథినాపురంలోని భక్తజనమంతా భక్తిశ్రద్ధలతో ఆ పుట్టను పూజించుకోసాగారు. గ్రంథినాపురానికి వెనుకభాగంలో గల మరొక గ్రామ తహశీల్దార్‌కు సంబంధించిన ఒక వేశ్య ఆ పుట్టను పూజించడానికి వచ్చింది. ఆమెను గ్రంథినాపుర భక్తజనులంతా ఆమె చండాల స్త్రీ అనీ, అలాంటి వారు దేవాలయాలకు రాకూడదని అవమానించారు. ఆ బాధతో వెనుతిరిగిన ఆమె తాను పూజ చేయని పుట్ట అక్కడ ఉండరాదని, ఆ పుట్టను కూల్చేసి తనకు ఒక గృహాన్ని నిర్మించమని, తన దగ్గరకొచ్చే తహశీల్దార్‌ను కోరింది. వేశ్యావ్యామోహంలో ఉన్న అతను ఆమె చెప్పిన విధంగానే చేయడానికి సిద్ధపడ్డాడు.



ఉదయకళేశ్వరుని ఆలయ గర్భగుడి, గండవరం

ఆ పుట్టను కూల్చివేయడానికి కూలీలు వెళ్లగానే, పుట్ట దగ్గరకు రానివ్వకుండా, భయంకరమైన గాలులు వీచాయి. ఒక పక్షంరోజులు ఇలా జరగడం గమనించిన తహశీల్దారు, తానే స్వయంగా గునపాన్ని తీసుకు వెళ్ళి పుట్టపై గుచ్చాడు. దానితో ఫెల్లున ఒక మెరుపు వచ్చి ఆ తహశీల్దార్ కళ్ళు రెండూ పోయాయి. పుట్టలోని ఉదయకళేశ్వర స్వామివారి శిరస్సు ఉత్తర భాగంలో గాయమేర్పడి ధారగా రక్తం వచ్చింది.

ఆ రాత్రి చోళ్ళ అనే పల్లవరాజు గారి తాతగారి కలలో కనబడి, రక్తము కార్చుకొంటూ ఒక రాజు నాకు ఉన్న నీడను చెరిపేసి, నా తలకు గాయం చేశాడు. నువ్వు తక్షణమే నా వద్దకు వచ్చి నా గాయానికి ఔషధం రాసి, నాకు ఆలయ నిర్మాణం గావించమని చెప్పి స్వామివారు అదృశ్యమయ్యాడు. రాజుగారు ఉలిక్కిపాటుతో నిద్రలేచి, తక్షణమే స్వామివారిని చూడవలెననే కాంక్షతో గ్రంథినాపుర గ్రామానికి చేరి, ఆ పుట్ట ఎక్కడున్నదో శోధించి, భటులచే నీళ్ళను తెప్పించి ఆ పుట్టపై పోయసాగాడు. అలా పోసిన కొంతసేపటికి పుట్టంతా కరిగి స్వామివారు దివ్య లింగరూపంలో దర్శనమిచ్చాడు. రాజుగారు ఆలయనిర్మాణం చేపట్టాడు.

కొంతకాలం తర్వాత రాజుగారు ఆలయనిర్మాణం పూర్తి గావించి, అక్కడ నిద్రిస్తుండగా, జగన్మాత అయిన పార్వతీ దేవి, తాను కూడా అదే స్థలంలో ఉత్తరదిక్కున ఉన్నానని, తనకు కూడా ఆలయం నిర్మించమని చెప్పి అదృశ్యమయ్యింది. మరుసటి రోజు ఉదయం రాజు పార్వతీదేవి చెప్పిన విధంగానే, స్వామివారి ఉత్తరదిశగా వెతుకుతుండగా, అమ్మవారి దివ్య మంగళ విగ్రహం ఆయనకు కన్పించింది. మిక్కిలి సంతోషపడిన రాజు, ఎక్కడ దొరికిందో అక్కడే ఆలయాన్ని నిర్మించి, దక్షిణ ముఖంగా ప్రతిష్ఠించాడు.

అప్పటినుంచి శ్రీ గంగా పార్వతీ సమేత ఉదయ కళేశ్వరస్వామి వారిని సేవించుకున్నవారు ఎలాంటి బాధలు లేకుండా సంతోషంగా, అష్టైశ్వర్యాలతో తులతూగుతారని భక్త జనుల విశ్వాసం. స్వామివారికి మాఘబహుళనవమి నుండి ఫల్గుణ శుద్ధ తదియ వరకు అత్యంత వైభవంగా బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు.

అంతేకాక కాలక్రమేణా ఈ గ్రంథినాపురగ్రామం 'గ్రంథవరము' అని, తర్వాత 'గండవరము' అని ప్రతీక గాంచింది. ఇది నెల్లూరుకు ఉత్తర భాగాన, కావలికి పోవు మార్గమధ్యంలో నెల్లూరుకు 16 కి.మీ.దూరంలో ఉంది.



# బాలవాక్కు!
## సక్తుప్రస్థుడు

కురుక్షేత్ర సంగ్రామానంతరం ధర్మరాజు పట్టాభిషిక్తుడై రాజ్యపాలన చేస్తూ అశ్వమేథయాగం మహా వైభవంగా చేశాడు. యజ్ఞానికి వచ్చిన వాళ్ళందరూ ధర్మరాజును పలువిధాల స్తుతిస్తూండగా, ఆకస్మికంగా ఒక ముంగిస సభలోకి ప్రవేశించి మానవభాషతో 'ఇది కూడా ఒక పెద్ద కార్యమేనా? పూర్వం సక్తుప్రస్థుడు అనే బ్రాహ్మణుడు చేసిన దానం ముందు ధర్మరాజు చేసిన దానధర్మాలు ఎందుకు పనికి వస్తాయ'ని పరిహసించింది. సభలో ఉన్న వారందరూ నివ్వెరపడి ధర్మతనయుని కంటే ధర్మాత్ముడైన ఆ బ్రాహ్మణుడెవరో చెప్పమని ముంగిసను అడిగారు.




**- వి.యస్.కిరణ్మయి,**
**D/o శ్రీనివాస్,**
**10వ తరగతి, బి-సెక్షన్,**
**విజ్ఞాన భారతి హైస్కూల్, విజయనగరం.**


అప్పు డా ముంగిస సక్తప్రస్థుని వృత్తాంతం ఈ విధంగా చెప్పసాగింది. సక్తుప్రస్థుడు అనే బ్రాహ్మణుడు ఉంఛ వృత్తితో జీవిస్తూ ఉండేవాడు. పొలంలో పడి ఉన్న గింజలు ఏరుకు వచ్చి తనతో పాటు తన భార్య, కొడుకు, కోడలు తింటూ నియమ జీవితం గడిపేవారు. తాము తినగా మిగిలిన వాటిని ఇంటికి వచ్చిన అతిథులకు సమర్పించేవాడు. ఇలా ఉండగా ఆ ప్రాంతంలో భయంకరమైన కరువు వచ్చింది. ఒక గింజ కూడా దొరకలేదు. దీనితో చాలా రోజుల పాటు బ్రాహ్మణ కుటుంబం పస్తులుండాల్సి వచ్చింది. ఇలా ఉండగా ఒకనాడు దొరక్క దొరక్క కొన్ని గింజలు దొరికితే వాటిని జాగ్రత్తగా ఏరుకుని ఇంటికి వచ్చాడు సక్తుప్రస్థుడు. దాన్ని పిండిచేసి నలుగురూ నాలుగు భాగాలు చేసి తినబోతున్నారు. ఇంతలో ఒక వృద్ధుడు నకనకలాడే కడుపుతో వచ్చి ఆకలి తీర్చమని వారిని ప్రార్థించాడు. అతిథినే సాక్షాత్తు విష్ణువుగా భావించే వారందరు తమ పిండి నంతా అతనికి ఆహారంగా ఇచ్చారు. దాంతో సంతృప్తిపడిన వృద్ధుడు ధర్మదేవతగా సాక్షాత్కరించి "విప్రోత్తమా! నీవు చేసిన ఈ త్యాగం ఎంతో గొప్పది. నిన్ను పరీక్షించుటకే నేను ఈ విధంగా వచ్చాను. మీ కొరకు బ్రహ్మరథం వేచి యున్నది పదండి బ్రహ్మలోకానికి" అని చెప్పి వారిని తనతో తీసుకుని వెళ్ళాడు.

ఆ బ్రాహ్మణుడు త్యాగం చేసిన ప్రదేశంలో పడిన కొంత పేలపిండి వాసన చూడగానే నా తలంతా బంగారంగా మారిపోయింది. అక్కడ అటూ ఇటూ దొర్లగానే నా శరీరంలో సగభాగం బంగారమైంది. మిగతాసగం శరీరంకూడా బంగారంగా మార్చే మహానుభావుడెవరా అని తలచుకుంటూండగా ధర్మరాజు అశ్వమేథ యాగం చేస్తున్నాడని తెలిసి ఇక్కడికి వచ్చాను. ధర్మరాజు మీ అందరిని మృష్టాన్నాలతో సంతృప్తిపరిచాడు కదా! విప్రులు చేతులు కడిగిన చోట అటూ ఇటూ దొర్లగానే నా శరీరం బంగారమవలేదు సరికదా ఒళ్ళంతా బురద మయమైందని చెప్పింది.

ఆర్యులారా! ఇప్పుడు చెప్పండి. తాను తినబోవు తిండిని కూడా దానం చేసిన ఆ సక్తుప్రస్థుడు గొప్పవాడా? లేక యుద్ధం చేసి ఎంతో మందిని చంపి ధనం సంపాదించిన ధర్మరాజు గొప్పవాడా? అని ప్రశ్నించింది. సభలోని వారందరూ నివ్వెరపడి ఏమీ మాట్లాడకుండా ఉండిపోయారు. అందరూ సక్తుప్రస్థుని త్యాగాన్ని గురించి పలువిధాల అతన్ని స్తుతించారు. ధర్మ రాజు గర్వం తొలగిపోయింది. అన్ని దానాలలోకి అన్నదానం గొప్పది.

**ఆర్థా గృహే వివర్తన్తే శ్మశానే మిత్ర బాంధవాః ।**
**సుకృతం దుష్కృతం చైవ గచ్ఛన్త మనుగచ్ఛతః ॥**

*సంపదలు గృహంలోనే ఉండిపోతాయి. మిత్రులు, బంధువులు శ్మశానం వరకు వచ్చి తిరిగిపోతారు. చనిపోయిన వారి వెంటనంటి వచ్చేవి వారి పుణ్య పాపములే!*

## వైభవంగా రథసప్తమి

2011, ఫిబ్రవరి 10న రథసప్తమి సందర్భంగా తిరుమలలో శ్రీవారు సప్తవాహనాలపై వైభవంగా విహరించారు. బుధవారం ఉదయం నుంచి సాయంత్రం వరకు తిరుమాడ వీథుల్లో స్వామివారి భక్తుల కోలాహలం కన్పించింది. వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన భక్తజనం వాహన సేవల్లో పాల్గొని స్వామివారిని చూసి తరించారు. సూర్యప్రభ వాహనంతో మొదలైన వేడుక రాత్రి చంద్రప్రభవాహనంతో ముగిసింది. రథసప్తమి నేపథ్యంలో శ్రీవారు సప్తాశ్వములచే నడిచే సూర్యప్రభవాహనంలో బయలుదేరారు. ఆ తర్వాత చిన్నశేష, గరుడ, హనుమంత, కల్పవృక్ష, సర్వభూపాల, చంద్రప్రభ వాహనాల్లో తిరుమాడ వీథుల్లో కనువిందుగా ఊరేగారు. మధ్యాహ్నం రెండు నుంచి మూడుగంటల మధ్య స్వామివారు ఆలయంలోకి ప్రవేశించిన వెంటనే చక్రత్తాళ్వార్‌ను పల్లకిలో వేంచేపు చేసుకొని నాలుగు వీథుల్లో ఊరేగిస్తూ వరాహస్వామి ఆలయం చేరుకొన్నారు. అక్కడ చక్రత్తాళ్వార్‌కు పుష్కరిణిలో చక్రస్నానం నిర్వహించారు. అక్కడి నుంచి సుదర్శనస్వామి ఊరేగుతూ ఆలయంలోకి ప్రవేశించారు. బ్రహ్మోత్సవాలవలే అశేష భక్తజనం శ్రీవారి వైభవాన్ని తిలకించారు.

వార్తాలహరి

## వేటూరి ప్రభాకరశాస్త్రి 123వ జయంతి వేడుకలు

తి.తి.దే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ ప్రాజెక్టు ఆధ్వర్యంలో వేటూరి ప్రభాకరశాస్త్రి 123వ జయంతి వేడుకలు తిరుపతిలో 7-2-2011న ఘనంగా జరిగాయి. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన డా॥ ఎన్.యువరాజ్, ఐ.ఏ.ఎస్., స్థానిక శ్వేత భవనం ఎదురుగా ఉన్న ప్రభాకరశాస్త్రి విగ్రహానికి పుష్పాంజలి ఘటించారు. అనంతరం అన్నమాచార్య కళామందిరంలో జరిగిన సాహితీసదస్సు, "**ప్రజ్ఞాప్రభాకరము-గురుపూజ**" పుస్తకావిష్కరణ కార్యక్రమంలో పాల్గొని పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అన్నమయ్య సంకీర్తనలు వాడ వాడలా వినిపిస్తున్నాయంటే ప్రభాకరశాస్త్రి కృషేనని పేర్కొన్నారు. ఆయన సేవలకు గుర్తుగానే తి.తి.దే. ప్రతిఏటా ప్రభాకరశాస్త్రి జయంతి, వర్ధంతి వేడుకలను నిర్వహిస్తున్నదని తెలిపారు. ఆచార్య వేటూరి ఆనందమూర్తి, శ్రీ సింగరాజు సచ్చిదానందం గార్లు మాట్లాడుతూ కొన్ని సంస్థలు చేయగలిగిన పనిని ప్రభాకరశాస్త్రి ఒక్కరే తి.తి.దే.కి అందించారని కొనియాడారు. ఆయన రచన, శైలి, జీవనవిధానం విషయ పరంపరపై ఆయన ప్రసంగించారు. చివరగా ఆచార్య గల్లా చలపతి ప్రసంగించారు. ఈ కార్యక్రమానికి **'సప్తగిరి'** పత్రిక ప్రధాన సంపాదకుడు శ్రీ సి.శైలకుమార్ సంచాలకులుగా వ్యవహరించారు.

## ఉద్యోగ విరమణ



సప్తగిరి ప్రధాన సంపాదక కార్యాలయంలో రీసెర్చ్ అసిస్టెంటుగా పనిచేస్తున్న డా॥ కలువగుంట రామమూర్తి గారు 28-02-2011న ఉద్యోగ విరమణ చేశారు. విద్వాన్ విశ్వంగారికి అసిస్టెంటుగా 1982లో ఉద్యోగంలో చేరినవీరు సుమారు 30 సం॥లు ప్రధాన సంపాదక కార్యాలయంలో తమ ఉద్యోగ బాధ్యతలు నిర్వహించారు. వీరు నవలా రచయిత కూడా. అగ్నిగర్భ, శిలాయజ్ఞం, ఆరణ్యకం వీరి నవలలు. వీరికి 'భావుక బ్రహ్మ' అనే బిరుదు కూడా ఉంది. వీరి విశ్రాంత జీవితం ప్రశాంతంగా గడవాలని ఆ దేవదేవుని ప్రార్థిస్తూ....

**- సప్తగిరి**

## తీరనిలోటు



ప్రముఖ కథారచయిత, రఘుపతి వెంకయ్య అవార్డు గ్రహీత డా॥ముళ్లపూడి వెంకటరమణ 24-02-2011న చెన్నైలో మృతిచెందారు. సాహితీ, కళారంగాలకు, ప్రత్యేకించి తెలుగు సాహిత్యానికి వీరి మృతి తీరనిలోటు.

వీరికి తిరుమల తిరుపతి దేవస్థానం, ప్రధాన సంపాదక కార్యాలయంతో చిరకాల అనుబంధం ఉంది. తి.తి.దేవస్థానం ప్రచురించిన 'బాలల బొమ్మల రామాయణం', 'బాలల బొమ్మల శ్రీనివాస చరితం' పుస్తకాలను వీరు రచించారు. ఈ రెండు పుస్తకాలు ఇప్పటికీ విశేషంగా పిల్లలను ఆకట్టుకొంటున్నాయి.

వీరి ఆత్మకు శాంతి కలగాలని 'సప్తగిరి' శ్రీనివాసున్ని ప్రార్థిస్తోంది. వీరి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తున్నది.

**- సప్తగిరి**

ఈ కూపను కత్తరించండి

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా : ____________________
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
   ____________________
   ____________________
   ____________________
   (పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐
2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు
3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-
4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :
5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలిసింది.

అలాంటి వారి మాటలకు మోసపోకండి.

సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు.

చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు.

సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపవచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

నేనే పో ఘనుఁడను - నీ కంటెను
దానవారి నీవు నాకు - దైవమవు గాన.

నేరుపున నాకైతే - నీ దిక్కు గలదు గాని
చేరి నీ కావల దిక్కు - చెప్పి చూపఁగలదా,
ఆరయ నీవైతే నాకు - నాధారము గలవు గా
నూరకే నీ కాధారము - వున్నదా యెక్కడను? ।

నిన్నుఁ గొల్చిన సలిగె - నేఁడు నాకుఁ గద్దు గాని
సన్నుతి నీకు నొకరి - సలిగున్నదా,
పెన్నిధి నిన్నుఁ దలఁచే - పేరు నాకుఁ గద్దు గాని
వున్నదా నీకుఁ దలఁచ - నొకరి పేరైనను?



ఈవులెల్ల నాకైతే - నియ్యఁగలవుగాక
ఆవల నీ కీవు లియ్య - నన్ను లున్నారా,
శ్రీవేంకటేశ నాకు - జీవాంతరాత్మవు నీవు
భావించనంతరాత్మ య - ప్పటి నీకు నున్నదా?

(4-57)

రక్కసులకు శత్రువైన ఓ దేవా! నీవు నాకు దైవమైయున్నావు. (నీకు వేరే దైవము లేదు) అందువల్ల నీకంటే నేనే గొప్పవాడను సుమా! అని అన్నమయ్య పై సంకీర్తనలో చెప్పాడు. భగవంతుని కంటే భక్తుడే ఘనుడని పైకి చెబుతూనే భగవంతుని ఘనత సాటిలేనిదని పై సంకీర్తనలో అన్నమయ్య వ్యక్తం చేశాడు.



**జూన్ నెల పండుగలు**

**05 నుంచి 14 వరకు -**
**శ్రీ గోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవాలు, తిరుపతి.**

**10 నుంచి 19 వరకు -**
**శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలు,అప్పలాయగుంట.**

**11 నుంచి 15 వరకు -**
**శ్రీ పద్మావతీదేవి ప్లవోత్సవాలు, తిరుచానూరు.**

**13 నుంచి 15 వరకు -**
**శ్రీవారి జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు, తిరుమల.**

# మీ మాట

## అంతా సంతోషించాం!!

మీరు ప్రచురించిన మన దేవాలయాలు శీర్షికలో 'శ్రీరాజరాజేశ్వర సమేత బ్రహ్మలింగేశ్వర స్వామి' వ్యాసాన్ని చదివి మా గ్రామస్థులంతా సంతోషించాం! మా దేవాలయం గూర్చి సప్తగిరిలో ప్రచురించినందులకు ధన్యవాదాలు.

**– బలిరెడ్డి బ్రహ్మలింగస్వామి; చెల్లూరి విజయబాబు,ఎం.పి.టి.సి.; వీర్ల ప్రకాశం, ఎం.పి.టి.సి.; చేదులూరి సత్య నారాయణ, సర్పంచ్; అప్పికొండ సత్య నారాయణ, దేవాలయట్రస్టీ; బాదం పూడి సుబ్రహ్మణ్యం, పురోహితులు; బాదం పూడి తాతయ్యలు, దేవస్థాన పురోహితులు; చెల్లూరి భాస్కరరావు, బండారు తాతయ్యలు, ఇళ్ల సత్యనారాయణ.**

## ముగ్ధమనోహరం

శ్రీవారి తెప్పోత్సవాల సందర్భంగా మధ్యపేజీలలో ప్రచురించిన శ్రీవారి వర్ణచిత్రాలు, పద్యాలు, శీర్షికలు చాలా ఆనందాన్ని కలిగించాయి. సప్తగిరి భక్తుల మనోభావాలకు అద్దం పడుతూ వెలువడుతున్నందుకు ధన్యవాదాలు.

**– కొవ్వూరి వెంకటసుబ్బయ్య, కొవ్వూరు.**

## కృతజ్ఞతలు

'ప్రణవోపాసన' వ్యాసం ప్రచురించడం వల్ల చాలా అమూల్యమైన వివరణలు అందరికీ తెలిశాయి. రచయితకు అభినందనలు. అతి సాధారాణ 'ఏడు చేపల కథ'ను కొత్తకోణంలో ఏడు వ్యసనాలకు అన్వయించి చెప్పిన తీరు ఎంతో బాగుంది. రచయితలకు, సంపాదక సిబ్బందికి కృతజ్ఞతలు.

**– శ్రీ సూర్యక్షేత్ర అంజన్న, మదనపల్లి.**

## ఎన్నో విషయాలు తెలుస్తున్నాయి!

సప్తగిరి మాసపత్రిక ద్వారా తిరుమల తిరుపతి దేవస్థానాల గురించి, స్వామివారి గురించిన విషయాలు అనేకం తెలుస్తున్నాయి. అలాగే మార్చినెలలో బాలవాక్కు శీర్షికలో ప్రచురించిన 'భీష్మ ప్రతిజ్ఞ' చిన్నారుల మనస్సును హత్తుకొనేవిధంగా ఉంది. అలాగే ఎప్పటిలాగే తిరుమల ఆలయం, బాలప్రబోధం, వేదం తెలుసుకుందాం మొదలైన శీర్షికలు మమ్మల్ని ఆనందింపజేస్తున్నాయి.

**– రాజగిరి రమేష్, జహీరాబాద్.**

## భక్తిభావాన్ని పెంచుతున్నాయి!

పాఠకులను సత్య, ధర్మ మార్గాలతో పాటు భక్తిభావం వైపు కూడా నడిపించే విధంగా మీరు ప్రచురిస్తున్న వ్యాసాలు, శీర్షికలు ఉపయుక్తంగా ఉన్నాయి. వివిధ అలంకారాలతో స్వామివారి దేవేరుల చిత్రాలు నేత్రపర్వంగావిస్తున్నాయి. ఇందులో సంపాదకుల కృషి శ్లాఘనీయం. స్వల్ప మూల్యంతో అపార ఆధ్యాత్మిక విషయాలను నెల నెలా తెలుసుకొనే వీలుకల్పిస్తున్నారు. 'సప్తగిరి' సిబ్బందికి అభినందనలు.

**– కె.వెంకటసుబ్బయ్య, ఒంగోలు.**

'సప్తగిరి మీమాట' అభివందనాలు!

మార్చి నెల సప్తగిరి మాసపత్రిక ఉభయదేవేరులతో శ్రీవారు ముఖచిత్రం ఆకర్షణీయంగా వుంది. 'తిరుమల ఆలయం ధారావాహికలో ఎన్నోతెలియని విషయాలు తెలియజేస్తున్నారు ఆధ్యాత్మికత ప్రతిబింబించే వ్యాసాలు చక్కగా వుంటున్నాయి శ్రీవేంకటేశ్వర లీలలు, మనదేవాలయాలు, బాలవాక్కు శీర్షికలు ఆసక్తికరంగా వుంటున్నాయి. గేయాలు, కవితలు ఎక్కువగా ప్రచురించండి. సప్తగిరిని నెలనెలా అత్యంత సుందరంగా తీర్చిదిద్దుతున్నందుకు మీకు అభివందనాలు!

— ఎస్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం. అనంతపురం జిల్లా 9298309432

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



మానవుడి కళ్లు కప్పినా,
మాధవుడి కళ్లు కప్పలేము .

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 41 మే, 2011 సంచిక : 12



గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.
ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.
సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ
ముద్రాపకుడు :
ఎం. కార్తీక్, ఎం.ఏ., ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.
డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి
వర్ణచిత్రాల లే-అవుట్ : పి. శివప్రసాద్

ముఖ చిత్రం :
**శ్రీపద్మావతి అమ్మవారు**

చివరి పుట :
**తరిగొండ వెంగమాంబ**



***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

| | | |
|---|---|---|
| విడి ప్రతి | -- రూ. | 5-00 |
| సం॥ చందా | -- రూ. | 60-00 |
| జీవిత చందా | -- రూ. | 500-00 |

**విదేశాలకు**

| | | |
|---|---|---|
| సం॥ చందా | -- రూ. | 850-00 |

## సంపాదకీయం

# మార్గదర్శకాలు

సృష్టిలోని జీవరాశులన్నింటిలోకి నరజన్మ దుర్లభం. అలా జన్మించిన నరులలో కొందరు మాత్రమే తమ జన్మకు సార్థకతను సిద్ధింపజేసుకుంటారు. మానవుడు తనకు తాను ఎంత ఉన్నత శిఖరాలను అధిరోహించినా అది తన స్వార్థప్రయోజనానికే పరిమితమైనప్పుడు అది కేవలం వైయక్తిక అభివృద్ధికి మాత్రమే నిదర్శనంగా నిలుస్తుంది. అలా గాకుండా స్వార్థాన్ని ప్రక్కన పెట్టి పరార్థానికి అంటే పరుల మేలు కోరి తమ జీవితాలను చరితార్థం చేసుకున్న త్యాగమూర్తులను మాత్రమే లోకం స్మరించుకుంటుంది. భగవంతుడు తమకు ప్రసాదించిన జన్మను లోకకల్యాణం కోసం, సాటిమానవుల అభ్యుదయం కోసం, సమాజ శ్రేయస్సుకోసం, అనాథల అభివృద్ధికోసం ఎవరైతే తమ జీవితాలను హవిస్సులా అర్పించు కుంటారో వారు మాత్రమే అవతారపురుషులు, పుణ్యమూర్తులు, ధన్యజీవులు. ఇలాంటి మహోన్నతుల జన్మదినాలు మానవాళికి సంస్మరణీయాలు.

వీరు కీర్తిశేషులైన రోజులను కూడా వర్ధంతులంటున్నాం. అంటే ఆ మహనీయులు కాలధర్మం చెందినా లోకంలో వీరి కీర్తి పదికాలాలపాటు వర్ధిల్లుతూనే ఉంటుందని దీని అర్థం. ఇక్కడ మనం సూక్ష్మంగా పరిశీలించినప్పుడు ఆయా వ్యక్తుల జన్మదినాలను కాకుండా వాళ్ళ వ్యక్తిత్వాలనే సంస్మరించు కొంటున్నాం. వాళ్ళు కేవలం వ్యక్తులు మాత్రమేగాదు, సమష్టి శక్తులుగా ఆవిర్భవించిన శక్తులు. ఒక్కొక్క పుణ్యపురుషుడు ఒక్కొక్క ఉత్తమ గుణానికో, మహోన్నత మనస్తత్వానికో, నిరుపమానమైన కారుణ్యానికో అద్వితీయమైన ప్రేమభావనకో, పరమోత్కృష్టమైన అహింసా సిద్ధాంతానికో, ప్రశంసనీయమైన శాంతి తత్త్వానికో ప్రతీకలుగా నిలబడిపోతారు. భావితరాలకు వాళ్ళజీవితమే ఒక సందేశాత్మక కావ్యం. వాళ్ళ నడవడికే అనుసరణీయమైన మార్గం. వారి వాక్కులు శబ్దజ్యోతులు. వాళ్ళ ఆలోచనలు మహోన్నత జీవనపథాలు.

ఈ జయంతులకో, వర్ధంతులకో మనం అనాదికాలం నుండి గీతాచార్యుడైన శ్రీకృష్ణుడు, ధర్మమే స్వరూపమైన శ్రీరామచంద్రుడు, పదకవితాపితామహుడైన అన్నమయ్య ప్రపంచాన్ని తన ఉపన్యాసాలతో జాగృతం చేసిన వివేకానందుడు, జగన్మాతను అమ్మా అని పిలవగలిగిన శ్రీ రామకృష్ణ పరమహంస ఇలా చెప్పుకుంటూపోతే వీరంతా మనదేశ ప్రతిష్ఠకు, ఆర్ష సంస్కృతికి, వైదిక ధర్మానికి మానవత్వ పరా కాష్ఠకు ఒక్కమాటలో భారతీయ సంస్కృతికి ఆదర్శవారసులు. వీరి జయంతులనో, వర్ధంతులనో జరుపు కోవడమంటే ఆయా మహాత్ముల మహోన్నతమైన గుణగుణాలను భావితరాలకు నిరాటంకంగా అందిం చడమే! మానవత్వానికి, ప్రేమతత్త్వానికి ఈ మహనీయులందరూ నిలువెత్తు నిదర్శనాలు! అలాంటి వారి అడుగుజాడల్లో మనం కూడా నడిచి వారి ఆశయాలను, ఆదర్శాలను ఆచరణయోగ్యం చేసినప్పుడు మాత్రమే నిజంగా మనం జరుపుకొనే జయంతులు, వర్ధంతులకు సార్థకత!

# అలిపిరి – నరసింహస్వామి

- బి.ఎన్.శ్రీనివాసన్

అలిపిరి అంటే తిరుపతిలోని కొండ పాదతలం. తిరు వెంగళప్పగుడికి చేరటానికై సోపానపంక్తి ఇక్కడినుండే ఆరంభమౌతుంది. అడిపడి అంటే తొలిమెట్టు అని అర్థం. ప్రాచీన కాలంనుండి తిరుమలను చేరటానికై ఈ మార్గాన్నే వాడేవారని చెప్పడమైనది. కొండమార్గంలో రాళ్ళు, గుండ్ల మధ్య సహజంగా ఏర్పడ్డ త్రోవను మొదట వాడుతూ, చుట్టూ ఉన్న రాళ్ళను కొట్టి మెట్లుగా మలచి వాడుతూ వచ్చారు. విజయనగర సామ్రాజ్య పతనానంతరం మట్లవంశ రాజులలో ఒకరైన మట్లకుమార అనంతరాయలు తిరుపతి నుండి కనబడే కొండకు మెట్లను కట్టించాడని శాసనాధారం ఉంది. దానికి పూర్వంలోనే ఇక్కడ మరికొన్ని నిర్మాణాలు ఏర్పడ్డవి. ఇక్కడ ఒక దిగుడు బావి, ఒక పెద్ద గోపురం, ఒక ఆలయం సాళువ నరసింహునికాలంలో 15వ శతాబ్దంలో నిర్మాణమైన దాఖలాలున్నాయి. వీటి పరివీక్షణ కొంత ఆసక్తికరంగా ఉంటుంది.

అలిపిరిలో మొదట కనబడేది నమస్కారభంగిమలో నిలిచి స్వాగతంపలికే గరుడవిగ్రహం. తరువాత రెండు వాహనాల ద్వారాలున్న స్వాగతతోరణం. ఈ రెంటికీ మధ్యలో తి.తి.దేవస్థాన ధర్మకర్తలమండలి అమృతోత్సవ స్మారకస్తంభం. తోరణం దాటగానే వాహనమార్గం క్రింద పాదచారులు కొండకు నడచి రావడానికై చేసిన సురంగమార్గం. ఆ సురంగంలోంచి బయటికి వస్తే అక్కడ పాదాలమండపం ఉంటుంది. ఇక్కడ ఓం ప్రథమంగా పాదచారుల వస్తువులను కొండకు ఉచితంగా చేరవేసే కేంద్రం. తరువాత రెండువైపుల విశ్రాంతి మండపాలు. ఒక వంద అడుగులు మధ్యమార్గంలో సాష్టాంగ నమస్కారభంగిమలో శిలారూపంలో పరుండడాన్ని చూడవచ్చును. (ఇతని కాళ్ళ వైపు తమిళంలోనూ, శిరస్సువైపు తెలుగులోనూ వ్రాసిన శాలి వాహన శకం 1545లో వ్రాసిన క్రీ.శ.1628) శాసనం- ఇతడు శ్రీ వేంకటేశ్వర అలమేలుమంగలకు నమస్కరిస్తున్న కోళాల కొండయ్య కొడుకు లకుమయ్య అని చెబుతోంది. ఇక్కడ మాత్రం - జనం  పసుపు కుంకుమలతో పూజలు చేస్తూ వచ్చి నపుడు అక్షరాలు కనుమరుగై తి.తి.దే. శాసనసంపుటం-6 పుట-160లోని 33,34 సంఖ్య శాసనాలను పొరపాటుగా చదివి వివరించడం జరిగింది. ఇక్కడ రెండు మెట్లెక్కి ముందుకు వెళ్తే విశాలమైన ప్రాంగణం. ఇపుడిక్కడ స్తంభాలతో నీడను ఏర్పరచారు. ముందుండేది పాదాలమండపం. ఒక చిన్న గర్భ గుడి. అక్కడ స్వామివారి పాదాలున్న శిల. (ఇపుడు శ్రీవారు శ్రీభూదేవి సహితంగా వెలసి ఉన్నారు) ఈ పాదాల మండపం లోపల ఒక ప్రదక్షిణాపథం. ఈ ప్రదక్షిణాపథంలో పశ్చిమపు గోడలో తెలుగు లిపిలో సంస్కృత సీసపద్యంగా ఈ పాదాల మండపాన్ని, కొండపైకి ఎక్కడానికి సోపానమార్గాన్ని, ఆ త్రోవలో కనబడే మధ్యగోపురం మరియు పైన



**2011, మే 16 న శ్రీ నరసింహ జయంతి సందర్భంగా ఈ ప్రత్యేక వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.**

కనబడే అగ్రగోపురాన్ని నిర్మించినవాడు మట్లకుమార అనంత రాజు అని వివరించే శాసనం ఉన్నది. ఇదే సీసపద్యాన్ని తమిళ లిపిలో పూర్వపు గోడపై చెక్కి ఉన్నారు. ఈ సీస పద్యం మట్ల అనంతరాజు చేసిన ధర్మకార్యాలను వివరంగా వక్కాణిస్తుంది.

పాదాలమండపం వెనక ఒక గోపురం, మైసూరు గోపురం అని 19-20 శతాబ్దంలో పిలువబడుతూ వచ్చి, 20వ శతాబ్దం మొదటిదశ కాలంలో పిడుగుబడి నిలువునా చీలిపోయి కుడిభాగం ఎడమభాగంపై నిలిచిన వైనమైంది. దీన్ని క్రీ.శ. 1978 లో జీర్ణోద్ధరణ గావించడమైనది. ఇది పెద్దగోపురం అని శాసనంలో చెప్పబడిన సాళువ నరసింహరాయ నిర్మిత గోపురం. ఈ పెద్ద గోపురానికి దక్షిణభాగంలో పాదాల మండపం పూర్వానికి ఒక ఆలయం ఉన్నది. ఇటీవల ఇక్కడ లక్ష్మీనారాయణ స్వామివారి ప్రతిష్ఠాపన చేసి; నిత్యపూజలు జరుగుతున్నాయి. వస్తుస్థితి అంటే ఇది లక్ష్మీనరసింహస్వామి ఆలయం. మధ్య కాలంలో ఇది శిథిలమైంది. విగ్రహం పోయింది. ఇక్కడ ఉన్న పెరియాళ్వారు గుడిపేరుతోనే దీన్ని గుర్తించసాగారు. దీని వివరాలు ఇలా ఉన్నాయి-

పశ్చిమాభిముఖమైన మహాద్వార గోపురం ఉన్న ఈ ఆలయం లోపల ప్రవేశించగానే ఒక బయటి ప్రదక్షిణా పథం. తరువాత ఆలయ ముఖమండపం. ఈ ముఖమండపానికి వెలుపల, ప్రదక్షిణాపథంలో ఉత్తర దక్షిణ ముఖములై నిలిచిన పెరియాళ్వార్ మరియు గోదాదేవి ఉపాలయాలున్నాయి. ఈ రెండు ఉపాలయాలను దాటి ముందుకు వస్తే ఆలయ ముఖ మండపం. ఆలయ ద్వారానికి కుడివైపు ఆరడుగుల ఎత్తులో కనుమరుగవుతున్న ఒక ఆరు సాలు శాసనం. గ్రంథ లిపిలో వ్రాసిన సంస్కృతంలోని స్రగ్ధరావృత్త శాసనం ఇది-

1. శుభమస్తు దుగ్ధాన్నాశార్థి తుష్టే గతవతి సగణే
2. స్థానభాగ్యే శకాబ్దే స్వాదిత్యే సౌమ్యవా
3. రే గవిగుహ తిథగే సోచ్చ సూర్యే సుపక్షే
4. శ్రీమాన్ శ్రీవీర గుండ క్షితిపతి తనయ స్సార్వభౌమే
5. నృశింహ శ్శేషాద్ర్యారోహ వీథ్యామకృత శుభకరీం
6. శ్రీనృశింహ ప్రతిష్ఠామ్

తి.తి.దే.శాసన సంపుటం-2. సంఖ్య-82 పుట-జి.టి-273. దీన్ని నాలుగు పాదాలలో వ్రాసిన రూపం ఇలా నడుస్తుంది-

**దుగ్ధాన్నాశార్థి తుష్టే గతవతి సగణే స్థాన భాగ్యే శకాబ్దే**
**స్వాదిత్యే సౌమ్యవారే గవి గుహ తిథిగే స్వోచ్ఛ సూర్యే సుపక్షే**
**శ్రీమాన్ శ్రీవీర గుండక్షితిపతి తనయ స్సార్వభౌమే నృసింహ**
**శ్శేషాద్ర్యారోహ వీథ్యామకృత శుభకరీం శ్రీనృసింహ ప్రతిష్ఠామ్**

– అదే స్థాన భాగ్యే అనే అక్షర సంకేతంతో ఇక్కడ శకాబ్దాన్ని అనియూ విశ్వావసు సంవత్సరం అనియూ గుర్తించడమైనది. దీని అర్థం ఇలా – దుగ్ధాన్నమును అపేక్షించువారు సంతృప్తులు కాగా, గణములన్ని చేరియుండగా (పద్యపాదం లోని అక్షర గణములు చేరియుండగా) స్థానఖ్యాతి నార్జించిన శకాబ్దంలోని సౌరమానంలో బుధవారం గుహునికి (సుబ్రహ్మణ్య స్వామికి)ప్రియమైన తిథి-షష్ఠదినంలో-సూర్యుడుపైకి వస్తుండగా, శ్రీవీరగుండ క్షితిపతి తనయుడైన శ్రీమాన్ సార్వభౌముడైన నర సింహుడు శేషాద్రి ఆరోహణ వీథిలో (కొండనెక్కే త్రోవలో) లక్ష్మీనరసింహస్వామిని ప్రతిష్ఠింపించాడు.

కొండను ఎక్కే త్రోవ పొడవు దాదాపు 14 కి.మీ. ఈ పొడవైన త్రోవలో ఈ లక్ష్మీనరసింహస్వామి గుడి ఎక్కడ అనే సందేహం కలగడం సహజం. ఇదే శాసనంలోని అర్థాన్ని వివరించే అధఃపీఠికలో ఆ దినాలలో సైతం అలిపిరిలో కనబడే కొండభాగాన్ని శేషాద్రి అనే గుర్తిస్తూ ఉండేవారు అని ఖచ్చితం చేయడం జరిగింది. అంటే అలిపిరినుండి అగ్రగోపురం వరకు ఉన్న సోపానమార్గంలో (అప్పట్లో మార్గం మాత్రమే – సోపానాలు లేవు) ఈ ఆలయం ఉండి ఉండాలి. ఇంకొక శాసనం ఈ ఆలయం గురించి ఎక్కువ వెలుతురును ప్రసాదిస్తుంది. అది కరవెట్టి పుళియాళ్వార్ మన్నార్ పిళ్ళై శాసనం.

1. శుభమస్తు స్వస్తి శ్రీ శకా
2. బ్దం ఆయరత్తు నానుట్రు
3. ఒరుపత్తు ఒన్రిన్ మేల్
4. సెల్లానిన్ర సౌమ్య స
5. ంవత్సరత్తు మకం నాయట్రు
6. పూర్వ పక్షత్తు పంచమియుం
7. సోమవారముం పెట్ర రేవ

8. తి నాళ్ శ్రీమన్మహా మండలే
9. శ్వర మేదినీ మీసరగండ కటారి సాళు
10. వ నరసింహరాయ మహీరా
11. యర్ ధర్మమాన (ఇ) లక్ష్మీనరసింహ పే
12. పెరుమాళ్ కోయిర్ గోపురత్తుక్కుం
13. పెరియ తిరుగోపురత్తుక్కు
14. ం తెన్పురత్తిల్ నడవావి ఉత్తర
15. మేరూర్ కరవెట్టి పుళి ఆళ్వార్ మన్నర్ పి
16. ళ్ళై సైవిత్త ధర్మం

మంచి కలుగుగాక! శతాబ్దం వేయిన్ని నాలుగు వందల పదకొండు పై చెల్లుబాటైన సౌమ్య సంవత్సరం మకరమాసం శుక్లపక్షం పంచమి సోమవారం రేవతీ నక్షత్ర దినం శ్రీమాన్ మహామండలేశ్వర మేదినీ మీసరగండ కఠారి సాళువ నరసింహ రాయలవారి సేవయైన (నిర్మాణం అయిన) లక్ష్మీ నరసింహ స్వామి ఆలయానికీ, పెద్దతిరుగోపురానికీ దక్షిణభాగంలో (నిర్మాణమైన) ఉండే ఈ నడబావి ఉత్తర మేరూరు కరవెట్టిపుళి ఆళ్వార్ మన్నర్ పిళ్ళై చేసిన ధర్మం.

శాలివాహన శతాబ్దం 1411 (క్రీ.శ. 1490 జనవరి 25) లో ప్రకటమైన ఈ శాసనం ఇపుడు లక్ష్మీనారాయణస్వామి ఆలయం అని పిలువబడుతున్న ఆలయంలోని మహాద్వారం గడపలో దక్షిణభాగంలో చెక్కబడియున్న దానిని గమనించ వచ్చు. ఈ శాసనంలో కరవెట్టి పుళియాళ్వార్ నిర్మాణమని చెప్పబడిన నడబావి అలిపిరి బయట విశ్రాంతి మంటపాల వెనక అంటే ఇపుడున్న లగేజ్ కౌంటర్ వెనక చూడవచ్చు. అంటే ఈ శాసనం ఉండే ఆలయమే సాళువ నరసింహుడు నిర్మించిన లక్ష్మీనరసింహ ఆలయం అనేది నిర్వివాదమైన విషయం. అయితే ఈ ఆలయాన్ని పెరియాళ్వార్ ఆలయమని ఎందుకు పిలిచారు అనేది ప్రశ్న అవుతుంది. ఆలయాన్ని నిర్మిం చిన వారి పేరుకు స్వామి, పెరుమాళ్, ఈశ్వర మున్నగు పదా లను చేర్చి లేక అక్కడ పూజింపబడుతున్న ప్రధాన దైవం పేరు తోనే ఆలయాన్ని గుర్తించడం సంప్రదాయం. అయితే ఇక్కడ ఉపాలయం విగ్రహం పేరుతో పెరియాళ్వార్ గుడి అని పిలవడ మైనది. ఎక్కడో ఏదో పొరపాటు జరిగి ఉండాలి – అని వెదికి నపుడు చుట్టూ ఉన్న ఆలయాల గురించి ఆలోచన మొదలైంది.

తాళ్ళపాకవారి వంశంలోని చినతిరుమలయ్య ఆళ్వార్ తీర్థానికి దగ్గరలో ఉన్న పెద్ద చిమూగులో (ఆళ్వార్ తీర్థం) కుడివైపున అంటే అలిపిరి వైపుకు వచ్చేటపుడు దొరకు పెద్ద జలపాతం నేలకు జారిపడి చిమ్ము స్థలంలో ఒక గుడి కట్టించి అక్కడ పెరియాళ్వారు విగ్రహాన్ని స్థాపన చేశాడన్న మాట ఉన్నది. పుట- 399-404. సం-5 సంఖ్య-153(419 జి.టి.) ఇపుడు ఈ ఆలయం గురుతులేవి కనబడకపోయినా, అప్పటి కేనేమో లేక తరువాతి కాలంలోనో శిథిలమై కేవలం బయటి గోడలు ద్వారగోపురం మాత్రమే మిగిలి ఉన్న లక్ష్మీనరసింహ స్వామి ఆలయాన్నే ఇరవైయ్యవ శతాబ్దంలో రెండు జీర్ణ స్థితి ఆలయాలనూ కలిపి పెరియాళ్వార్ ఆలయం అని పిలిచిన సందర్భమే స్థిరమై ఉండాలి. అందువల్లనే జనప్రథను అను సరించి శాసన పరిణతులు కూడా దీనిని పెరియాళ్వార్ ఆలయం అని గుర్తించి ఉండాలి.

సాళువ నరసింహుని కాలానికి ఇక్కడ పాదాల మండ పం లేదు. సోపానపథం అని చెప్పబడే మెట్లమార్గమూ లేదు. ఇక్కడ మొదట నిర్మింపబడినది పెద్దగోపురం. ఇది మైళ్ళ దూరానికి ఎత్తుగా కనిపిస్తూ యాత్రికులకు కొండపైకి ఎక్కే మార్గాన్ని చూపే చేతికంబం – మార్గదర్శిగా పనిచేసింది. తరు వాత అతనిచే లక్ష్మీనరసింహస్వామి ఆలయం, విశ్రాంతి మంట పాలు నిర్మాణమయ్యాయి. తర్వాత కరవెట్టి పుళిఆళ్వార్ నడబావి నిర్మాణం జరిగింది. దాని తర్వాత మట్లకుమార అనంతరాయుడు పాదాల మండపం గావించి, అలిపిరి సోపాన మార్గ నిర్మాణం గావించాడు. ఇక్కడ అంతకుముందే పెద్ద తిరుగోపురం ఉండి నది గాబట్టి, ఈ మార్గంలో ఇంకా పైకి మధ్య గోపురాన్ని, శిఖరంలో అగ్ర గోపురాన్ని నిర్మించాడు. ఇదంతా నిర్మాణాలను చేపట్టడానికి మట్ల కుమారుడు ఒక మనిషిని ఇక్కడ ఉంచాడు. అనంతమట్లకుమార అనంతరం రాజావారి ధర్మకార్యాలను చూచుటకై కోళాల కొండయ్య నియమితుడయిన శాసనం కూడా ఈ త్రోవలోనే ఉన్నది. ఇతడు శిల్పాచార్యుడు అనే చెప్పవచ్చు. కారణం ఇక్కడ ఉన్న నమస్కార భంగిమలో సదా స్వామిసేవ చేస్తూ కనబడే కోళాలకొండయ్య కొడుకు లకుమయ్య విగ్ర హంలో శిల్పి ఆయుధాలైన ఉలి సుత్తి ఉన్నాయి.



# కిష్కింధకాండలో హనుమంతుని పాత్ర

- డా॥ టి.పద్మజారాణి

శ్రీమద్రామాయణంలో కథానాయకుడైన రాముని సరసన నిలబడగలిగేవాడు హనుమంతుడొక్కడే. బాల, అయోధ్య, అరణ్యకాండలలో కథ అంతా రాముని చుట్టూనే నడుస్తుంది; దశరథుని మరణ సన్నివేశం తప్ప.

కిష్కింధకాండలో హనుమంతుడు ప్రవేశిస్తాడు, అది మొదలు పట్టాభిషేక పర్యంతం కథ హనుమంతుని వెంటే నడుస్తుంది. శ్రీరాముడు ప్రభువు, హనుమంతుడు సేవకుడు. ఆయన సంసారి, ఈయన బ్రహ్మచారి. సింహాసనాన్ని తృణ ప్రాయంగా విడిచి వచ్చిన రాకుమారుడాయన. అన్నగారి ఆగ్రహానికి ఆగలేక కొండలలో తలదాచుకున్న సుగ్రీవుని వెంట వచ్చిన సచివుడీయన. అనంతరం దూతయైనాడు. రామా యణంలో సూక్ష్మంగా ఇదీ రామ హనుమంతుల రూపం.

హనుమంతుని ధీ, ధీరమూర్తిని రామాయణంలో ఇలా దర్శించవచ్చు.

**ఉవాచ హనుమాన్వాక్యం, సుగ్రీవం వాక్యకోవిదః**

వాక్యకోవిదుడైన హనుమంతుడు మాట్లాడుతున్నాడు అనే పాత్రను ప్రవేశపెడుతూ వాక్యకోవిదుడు అనే విశేషణం ప్రయోగించాడు మహర్షి వాల్మీకి. మాట్లాడటం తెలిసిన విద్వాం సుడు అని దాని అర్థం. అంటే ఎప్పుడు, ఎక్కడ, ఎవరితో, ఎలా మాట్లాడాలో బాగా తెలిసినవాడు హనుమంతుడు. ఈ దృష్టితో హనుమంతుని వెంట అవధాన చిత్తంతో నడవాలి.

వాలి తరుమగా ఋశ్యమూక పర్వతం మీద తలదాచు కున్న సుగ్రీవుడు రామలక్ష్మణులను అల్లంత దూరాన చూస్తూనే భయకంపితుడై పరుగు పరుగునపోతూ తన మంత్రుల మధ్య బెదురుతూ నిలబడ్డాడు. హనుమంతుడు "సంభ్రమాన్ని విడిచి పెట్టు. మనం ఉన్న ఈ మలయ పర్వతం మీద వాలి భయం ఈషణ్మాత్రం లేదు. వాలి ఈ పర్వతపరిసరాల్లో కి రాలేదు. మనస్సు భయంతో నిండి ఉండడం వలన అన్నీ అనుమానాలే కలుగుతున్నాయి. అనాలోచితంగా ఏ పనీ చెయ్యరాదు. విజ్ఞానంతో బుద్ధిని నడిపించాలి" అన్నాడు.

హనుమంతుడు సుగ్రీవుని మంత్రిగా వచ్చి మాట్లాడ గానే శ్రీరామచంద్రుడు సంతోషభరిత వదనుడై;

**నానృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః**
**నా సామవేద విదుషః శక్యమేవం విభాషితుమ్**

ఋగ్వేద వినీతుడు, యజుర్వేదధారి, సామవేదవిదుడు అయినవాడు తప్ప, ఇంకెవ్వడూ ఇలా మాట్లాడలేడు - అన్నాడు.

హనుమంతుని మాటలు వినగానే రాముని నోట వెలువడిన మాట అది. మూడు వేదాలూ అధ్యయనం చేసినవాడు - అని ఒక్కమాటలో చెప్పకుండా వినీత, ధారణ, విదుష శబ్దాలు ప్రయోగించడంలో విశేషం ఉన్నది.

మనస్సును అదుపులో ఉంచి, చక్కని శిక్షణతో గురువు దగ్గర అధ్యయనం చేసే వానిని వినీతుడంటారు. ఋగ్వేదానికి ఇది ప్రధానం కనుక వినీతుడు.

సామవేదం గాన ప్రధానం, గానం చేసేటప్పుడు ఎక్కడి కక్కడ మార్పులు చేసుకుంటూ సాగే ఊహాశక్తి కావాలి. ప్రతిభతో ఊహించి రూపొందించుకోవాలంటే వైదుష్యం ఉండి తీరాలి. ఈ వైదుష్యం లేకపోతే సామవేదగానం పట్టుపడదు కనుక సామవేద విదుషః - అని ప్రయోగించాడు. వేదవేత్తయైన ఆదికవి - ఇంతటి సంప్రదాయం తెలిసుండాలి కావ్యరచనకు.

ఈయన మాట్లాడిన మాటల్లో ఒక్క అపశబ్దం లేదు. అంటే వ్యాకరణం సంపూర్ణంగా అధ్యయనం చేశాడని తెలు స్తున్నది. ప్రకృతి ప్రత్యయం, సమాసం, సంధి ఇన్నిటిలో దోషం లేకపోతే అది సలక్షణం అని వ్యాఖ్యానించారు.

**2011, మే 27న**
**శ్రీ హనుమజ్జయంతి**
**సందర్భంగా ఈ ప్రత్యేక వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం....**

సంగీతంలా ఉండరాదు. సాగతీతలు పనికిరావు. తల విసుర్లుండరాదు. వ్రాసిన కాగితాలు చూస్తూ చదువరాదు. అర్థం మారిపోయే రీతిలో ఉండరాదు. కీచుకంఠం పనికిరాదు. వేదపాఠకులకు ఈ ఆరూ దోషాలని శాస్త్రఘోష.

వేదత్రయాన్ని అధ్యయనం చేసినవాడు కనుకనే హనుమంతుడు శిక్షాశాస్త్రానుసారం మాట్లాడాడని రాముని భావం.

వేదపాఠకుడికి శిక్షాశాస్త్రం ప్రకారం ఆరు గుణాలుండాలి. భాష మధురంగా ఉండాలి. అక్షరం స్పష్టంగా వినిపించాలి. పదాలు విస్పష్టంగా ఆగాలి. ఒకదాని వెంట ఒకటి దూసుకురావాలి. గంభీరంగా ఉండాలి. లయాన్వితంగా సాగాలి.

ఈ దృష్టితో చూసినప్పుడు హనుమంతుడు వాక్యజ్ఞుడు, వాక్యవిశారదుడు, వాక్యకోవిదుడు ఎందుకయ్యాడో తెలుస్తుంది.

రామాయణంలో ఏనాడూ ఎవరినీ ప్రశంసించని శ్రీరామచంద్రుడు మొదటి కలయికలో నాలుగు మాటలు మాట్లాడిన హనుమంతుని అంతగా పొగడటం చూస్తే హనుమంతుని మీద ఆయనకు ఎంతటి గౌరవం ఉన్నదో, ఆది కావ్యాన్ని అందించిన వాల్మీకికి ఎంతటి సదభిప్రాయం ఉన్నదో తెలుసుకోగలుగుతాం.

హనుమంతుడు భిక్షువు రూపంలో రామలక్ష్మణులను సమీపించి భక్తిభరిత హృదయంతో "రాజర్షుల వలే, దేవతామూర్తుల వలే, తపస్వుల వలే, నున్న సుందర రూపులు ఈ ప్రాంతానికెందుకు వచ్చారు" అని అన్నాడు.

రాజర్షి, తపస్వి శబ్దాలతో ఆరంభించడంలోనే ఆయన వాక్యకోవిదత్వం కనిపిస్తుంది. అంతసేపు మాట్లాడినా అన్నదమ్ములు పెదవి విప్పలేదు. వస్తూనే హనుమంతుడు వారిని ప్రస్తుతిస్తూ ప్రసంగించినా తాను ఎవరివాడో, ఎందుకు వచ్చాడో చెప్పలేదు.



అందుకే రామలక్ష్మణులు మాట్లాడలేదు. అంటే మనకు తెలియని వారి దగ్గరకు వెళ్ళినపుడు మన పరిచయం మనం చేసుకోకుండా ప్రసంగానికి దిగరాదు, అనే ప్రాథమిక సూత్రం ఇక్కడ బోధించాడు.

అందులోనూ ప్రారంభం ఎలా చేశాడు – 'సుగ్రీవో నామ ధర్మాత్మా' – ధర్మాత్ముడైన సుగ్రీవుడు అంటూనే 'వీరో వినికృతో భ్రాత్రా' అన్నగారి చేత పరాభూతుడు, ఆయన పంపగా వచ్చాను. ఎంతటి గాథను ఈ మూడు వాక్యాలలో నిక్షేపించాడు. అదీ మాట్లాడే పద్ధతి.

అంతసేపు మాట్లాడుతూ వారి ముఖ కవళికలు పరిశీలించి ఇంగితం గ్రహించాడు. వారు కూడా ఏదో ఆపదలో ఉన్నారని అర్థమైంది. అస్త్రశస్త్రవేత్తలని తెలిసింది. అటువంటి వారి స్నేహం తన ప్రభువుకు అవసరం అనుకున్నాడు.

సమయోచితంగా తీసుకోవలసిన నిర్ణయం తీసుకోగలిగినవాడే ఉత్తమ సచివుడు. చక్కని దూత. అదీ హనుమంతుని విశిష్ట లక్షణం.

రామలక్ష్మణులనిద్దరినీ సుగ్రీవుని దగ్గరకు తీసుకువచ్చి "ఈయన రాముడు, మహాప్రాజ్ఞుడు; దృఢవిక్రముడు, సోదరు

డైన లక్ష్మణునితో వచ్చిన ఈ రాముడు సత్యవిక్రముడు" అని ఆరంభించాడు.

ఇక్కడ దృఢవిక్రముడు, సత్యవిక్రముడు అని రెండు విశేషణాలు ప్రయోగించాడు. సుగ్రీవునికి కావలసింది విక్రమ వంతుని స్నేహం. అవన్నీ దృఢంగా సత్యమైనవై ఉండాలి. అందుకే ముందు అది చెప్పి తరువాయి ధర్మ విషయం ప్రస్తా వించాడు. అంతటితో ఆగాడా! భార్యా వియోగ బాధలో ఉన్నాడు అని సుగ్రీవునికి ఆయనతో సఖ్యానికి ఉదితమైన కారణం ప్రస్తావించాడు.

"సమాన శీల వ్యసనేషు సఖ్యం" - శీల వ్యసనాలు సమంగా ఉంటేనే స్నేహం. ఇక్కడ వ్యసనం అంటే దుఃఖము అని అర్థం. ఇంతటి వివేకవంతుడు కనుకనే హనుమంతుడు రాముని సరసన నిలబడగలిగాడు రామకథలో.

సుగ్రీవుడు రాజైన తర్వాత భార్య రుమతో, తారతో హాయిగా మదిరాపానంతో, కామభోగాలలో మునిగి ప్రపం చాన్నే మరచిన సమయంలో ప్రవేశిస్తాడు హనుమంతుడు.

**రాజ్యం ప్రాప్తం యశశ్చైవ**
**కాలే శ్రీరభి వర్ధితా ।**
**మిత్రాణాం సంగ్రహశ్శేషః**
**తం భవాన్ కర్తు మర్హతి ॥**

రాజ్యం లభించింది. అగ్నిసాక్షిగా స్నేహబంధం ఏర్ప రచుకున్నప్పుడు చేసిన వాగ్దానం నెరవేర్చి రాముడు నీకు సింహాసనం సమకూర్చాడు. నీ కర్తవ్యాన్ని విస్మరించి సుఖడోలికల్లో గడుపుతున్నావు. ఇంతటిభావం ఉన్నది; రాజ్యం ప్రాప్తం అనే మాట వెనుక.

రాముడు మనకి మేలు చేశాడు, అందుకు మనం ఋణం తీర్చుకోవాలి. నీకు ఉపకారం చేయని వాడికి కూడా మేలు చేసే స్వభావం నీది. కాలం అతిక్రమించినా కన్ను తెరిచి వానరులను ఆజ్ఞాపించు అని చెప్పాడు.

సముద్ర లంఘనం చేయటానికి వానరులు తమ తమ శక్తి సామర్థ్యాలను వెల్లడించారు. చివరగా జాంబవంతుడు దూరంగా మౌనంగా కూర్చుని ఉన్న హనుమంతుని వద్దకు వెళ్ళి సముద్ర లంఘనం చేయుటకు నీవే తగిన వాడవని అన్నాడు. అపుడు హనుమంతుడు తన శరీరాన్ని పర్వతమంత విశాలం చేసి "లక్ష్మీ సమానురాలైన సీతాదేవిని చూసి రాగలననే ధైర్యం నా మనసులో, బుద్ధిలో, చేష్టలో కలుగుతున్నది. గరుడుని శక్తి, వాయుదేవుని వేగం ఉన్నవాడిని. లంకలో వెదకడం కాదు, లంకను మూలమట్టం పెళ్ళగించి తెచ్చి మీ ముందుంచుతాను. నిర్భయంగా ఉండండి" అన్నాడు.

ఈ సన్నివేశంలోనే హనుమంతుడు ఎక్కువగా మాట్లాడాడు. దానికి కారణం ఆలోచిస్తే వానర యోధులందరూ నిరాశతో ప్రాణాలు వదిలే దశలో ఉన్నారు. వారందరికీ ధైర్యం కలిగించాలి. నిస్పృహలో ఉన్నవారికి ప్రాణాలమీద ఆశ కలిగిం చాలి. అందుకే అంతగా ప్రసంగించాడు.

వానరవీరులను నాలుగు దిక్కులకూ పంపుతూ సుగ్రీ వుడు హనుమంతుని వైపు తిరిగి: "మారుతీ! భూలోకంలో, దేవలోకంలో, సాగరాలలో నీకు తెలియని ప్రదేశమంటూ, ఏదీ లేదు. ధీమంతుడవు, ధీరుడవు, దేశకాలజ్ఞానివి సీతను చూసి రాగల వాడవు నీవే అనగా వినిన రామచంద్రుడు తన అంగుళీ యకం హనుమంతునికిస్తూ "ఈ ఆనవాలు చూపిస్తే జానకి నీ మాటలు నమ్ముతుంది. నీవల్లనే ఈ ప్రయత్నం ఫలిస్తుందని సుగ్రీవుని మాటలను బట్టి గ్రహించాను. హనుమా! విక్రమానికి తోడు స్థిరసంకల్పం ఉన్న నీవల్లనే ఈ కార్యం ఫలించాలి: సీతను చూసి సుఖంగా తిరిగి రా" అని అన్నాడు.

పరిచయ సన్నివేశంలో తప్ప రాముడు హనుమం తునితో మాట్లాడటం సంభవించలేదు. తిరిగి అంగుళీయకాన్ని ఇస్తూ రాముడు హనుమంతునితో మాట్లాడాడు. అంటే ప్రభువైన వాడు తన పరిజనంలో ఎవరితో ఎప్పుడు మాట్లాడాలో, ఎలా ప్రవర్తించాలో రాముడు చూపించాడు. ఇంతకాలం రాముడు తనను పిలిపించలేదని, నాలుగు మాటలు మాట్లాడలేదని బాధ పడలేదు మారుతి. మౌనంగానే కర్తవ్య నిర్వహణకు పూను కున్నాడు. ఇదీ సేవాధర్మం.

# వేదం.. తెలుసుకుందాం!

ధారావాహిక

05

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

## జ్ఞానప్రదీపం :

వేదాలు మానవప్రయత్నం, మానవతా విలువలు, మానవ సంక్షేమం, మానవుల ఆలోచనలు, కార్యకలాపాలు మొదలైన వాటి గురించే ఎక్కువగా చర్చించాయి. ఈ ప్రపంచంలో సర్వార్థ ప్రకాశకమైన, శబ్దప్రధానమైన వేదమనే ప్రదీపమే లేనట్లైతే ముల్లోకాలు అంధకార బంధురములై పోయేవని ఆచార్య దండి మహాకవి ఇలా అన్నాడు –

**ఇదమంధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్ ।**
**యది శబ్దాహ్వయం జ్యోతిరాసంసారం న దీప్యతే ॥**

**(కావ్యాదర్శం. ప్ర.1.శ్లో.4)**

వేదం ప్రత్యక్షంగా కనపడని, మన ఊహకు అందని అనేక కాలాంతర, దేశాంతర, లోకాంతర విషయాలను తెలియజేస్తుంది. 'వేదయతి అలౌకికోపాయం బోధయతీతి వేదః'. లౌకిక విషయ సంబంధమైన మనస్సు, బుద్ధి ద్వారా గ్రహించటానికి సాధ్యము కాని దానిని వేదం తెలియజేస్తుంది. ఇది ఆప్తవాక్యమైన శబ్దం కాబట్టి పరమ ప్రమాణం. 'ఆప్తోపదేశ శ్శబ్దః' ఆప్తుల ఉపదేశమే ప్రమాణం.

## పరమప్రమాణం :

వేదశాస్త్రాలు నా ఆజ్ఞలని భగవంతుడు చెప్పాడు. 'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే'. కావున భగవదాజ్ఞారూపాలు, యోగక్షేమదాయకాలైన వేదశాస్త్రాలు మనకు పరమ ప్రమాణాలు. శాస్త్రవిధినతిక్రమించి తన ఇష్టానుసారం ప్రవర్తించేవాడు సిద్ధిని పొందలేడు. అలాగే సుఖాన్ని గాని, ఉత్తమగతిని గాని పొందలేడు. అందువలననే మంచి, చెడు, చేయదగిన, చేయకూడని పనులను నిర్ణయించుటలో శాస్త్రమే ప్రమాణమని, మానవులు శాస్త్రవిధిని తెలుసుకొని కర్మల నాచరించాలని భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ఇలా చెప్పాడు –

**యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥**

**(భగవద్గీత. అ.16 శ్లో.23, 24)**

లోకంలో గోవులు వాసనను బట్టి, రాజులు చారుల ద్వారాను, పండితులు వేదముల వలనను, సామాన్య జనులు కనులతో చూచుట ద్వారా విషయాలను తెలుసుకుంటారు.

**గావః పశ్యన్తి గంధేన వేదైః పశ్యన్తి పండితాః ।**
**చారైః పశ్యన్తి రాజానః చక్షుర్భ్యామితరే జనాః ॥**

వేదం జ్ఞాననేత్రం వంటిది. విశ్వామిత్ర మహర్షికి సృష్టికి ప్రతిసృష్టి చేయగల శక్తిని ప్రసాదించింది, అలాగే వసిష్ఠ మార్కండేయాది మహర్షులకు చిరంజీవిత్వము, అణిమాది సిద్ధులు, దివ్యదృష్టి, శాపానుగ్రహసామర్థ్యము కలిగించింది వేదోక్తమైన తపశ్చర్యే.

## జ్ఞానానంద నిర్ఝరి :

వేదం సృష్టి రహస్యాన్ని, సృష్టి పూర్వవిషయాన్ని, అనాది, అనంతం అయిన మూలకారణతత్త్వాన్ని తెలియజేసింది. సృష్టి ఇతిహాసాన్ని వైజ్ఞానికంగా ప్రతిపాదించింది. అది అనంతజ్ఞానానంద నిర్ఝరి, సచ్చిదానంద నిధి. వేదం ప్రకృతి–జీవుడు–పరమాత్మల సంబంధం గురించి సూక్ష్మాతిసూక్ష్మంగా తెలియజేసింది. మానవునికి జ్ఞానం, ఆనందం, జన్మరాహిత్యం (మోక్షం), దుఃఖరాహిత్యం పరమలక్ష్యాలుగా ప్రతిపాదించింది. సర్వజీవసంకలనాన్ని, వసుధైవ కుటుంబాన్ని, సమస్త మానవ సమాజన్యాయాన్ని, ధర్మసామ్యాన్ని, అహింస, శాంతి, క్రాంతి మొదలైన అపూర్వ సత్యాలను ప్రబోధించింది. దీనిలో బీజరూపంగా ఉన్న అనంత విజ్ఞానం బ్రహ్మవిద్యగా విలసిల్లింది. వేదఋషులు సార్వకాలిక, సార్వజనీన సత్యాలను చాటిచెప్పారు. వాటి ఆధారంగా అనంతమైన వాఙ్మయం వెల్లివిరిసింది. ఆ ఆదర్శాన్ని అనుష్ఠించి ఎందరో మహాపురుషులైనారు.

వేదం ఏకత్వ సిద్ధిని, పూర్ణత్వ బుద్ధిని ప్రసాదిస్తుంది. వైదిక విజ్ఞానం మానవజాతిని అనేకత్వం నుండి ఏకత్వం వైపు నడిపిస్తుంది. భూత భవిష్యత్ వర్తమానాల్లో తిరుగులేని, త్రికాలాబాధితమైన సత్యాలను తెలియజేస్తుంది.

భారతీయ సంస్కృతి ఎటువంటి ప్రళయానికి, విలయానికి నశించని, కాలంతో మార్పు చెందని శాశ్వత సత్యంతో ముడివడింది. సనాతన ధర్మం దాని అంతరాత్మ. భారతీయ సంస్కృతి సహస్రదళ పద్మం వంటిది. ఆ పద్మదళాలు నిరంతరం జ్ఞానకిరణాలను ప్రసరింపజేస్తూ ఉంటాయి. సనాతన ధర్మానికి నీతి, శీలము పునాది. ఆధ్యాత్మికత దానిలో అంతర్లీనంగా ఉంది. సత్యం దాని శ్వాస. ఈ విధంగా మహర్షులు దానిని భావించారు. అటువంటి మాననీయ మహర్షులు యుగ యుగాలుగా మనకు అనేక విజ్ఞానదీపికలను అందించారు. వారు తమ ఆత్మనే భగవంతునిగా పరిగణించారు.

**ఉజ్జ్వలగీతాలు :**

వేదమంత్రాలు వైదిక ఋషులు సాహసోపేతంగా అంతర్ముఖులై గానం చేసిన ఉజ్జ్వల గీతాలు. జీవితంలో వారి ఏకైక అన్వేషణ సత్య, జ్యోతి, అమరత్వాలను కనుగొని అనుభవించుట కొరకే. ఇదే వారి మహత్తర, ఉదాత్తాశయం. వారీ విధంగా ప్రార్థించారు –

**ఓం అసతో మా సద్గమయ**
**తమసో మా జ్యోతిర్గమయ**
**మృత్యోర్మా అమృతం గమయ**

'ఓ పరమాత్మా! నన్ను అసత్యం నుండి సత్యంవైపుకు, అంధకారం నుండి వెలుగులోకి (అజ్ఞానం నుండి జ్ఞానానికి) మృత్యువు నుండి అమృతత్వానికి నడిపించు' అనే ఈ ఉపనిషన్మంత్రంలో వారి ఉన్నతాశయం మనకు దర్శనమిస్తుంది.

మంత్రమంటే శబ్దశక్తి. ఆ శక్తి మనలో నుండి ఉద్భవిస్తుంది. అది హృదయబద్ధమౌతుంది. వేదం చాలా శక్తివంతమైనది. దాని పట్ల శ్రద్ధాసక్తులు లేనివారి నుండి దానిని రక్షించడం కోసం దానిలోని విషయాలను సంకేతాలలో, ప్రతీకలలో చెప్పారు. వైదికమంత్రాలు రహస్యార్థాలు, నిగూఢార్థాలు కలవి. వేదఋషులు శ్రవణం ద్వారా మంత్రాలను ఆవిష్కరించారు.

వేదాలు ఓంకారాన్ని శబ్దబ్రహ్మము అన్నాయి. ఓంకారాన్ని ప్రణవమంటారు. ఈ సృష్టి అంతా ప్రణవం నుండే వచ్చింది. మంత్రాలన్నీ కూడా ఓంకారం నుండే వచ్చాయి. ప్రణవంలోని అకార, ఉకార, మకారాలు జాగ్రత్స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. దానిలోని బిందువు తురీయావస్థను సూచిస్తుంది. దీనినే నాదబిందు కళ అంటారు. ఈ ఓంకారం విశ్వమంతా అణువణువునా నిండి ఉంది.

**దివ్యతేజోమూర్తులు :**

మానవునికి సమస్తం తెలియపరిచింది వేదం. అది తెలుసుకోవడమే జ్ఞానం. పరమాత్మ అనంతం కావున జ్ఞానం కూడా అనంతం. సత్యస్వరూపుడైన భగవంతుడు అవాఙ్మానస గోచరుడు. ఆయన వాక్కులకు, మనస్సుకు కూడా అందనివాడు. మన వాక్కులు, మనస్సు కూడా ఆ భగవంతుని పొందకనే వెనుకకు మరలి వస్తాయని వేదం చెప్పింది.

**'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ'**

మానవునికి కావలసిన లౌకిక, పారలౌకిక, ఆధ్యాత్మిక విషయాలన్నింటిని వేదం చెప్పింది. వేదమంత్రద్రష్టలైన మహర్షులు నిస్స్వార్థపరులు, నిష్కల్మషులు, దివ్యతేజోమూర్తులు. వారు వేదమంత్రాలను దర్శించారు. మానవ జీవితాన్ని సమున్నతం చేయడానికి కృషి చేశారు. వారు అనేక సంస్థలను, ఆచారాలను, సంప్రదాయాలను ఏర్పరచారు. వారు దివ్య జ్యోతుల వలె తమ జీవితాలను ధారపోసి లోకాలకు దివ్య కాంతులను ప్రసాదించారు.

మానవజీవితం నాగరకత, సంస్కృతి అన్నీ వేదం నుండి అవతరించినవే. మానవ జీవననాదం వేదం నుండే ఆవిర్భవించింది. వేదం మానవజాతికి మహేతిహాసం. ఇది సుదీర్ఘం, అనంతం, అగమ్యగోచరం. మన మహర్షులు మానవత్వం, నాగరికత, సంస్కృతిని అభ్యుదయపథంలో నడిపించి, మానవజాతికి మహోపకారం చేశారు. నాగరికత, సంస్కృతి,

ఆలోచనా విధానం నిరంతరం ప్రవహించే నదుల్లాంటివి. ఇంతటి అక్షయం, అనంతం, అవినాశం, అమృతమయమైన వేద సంపద మనకున్నందులకు భారతీయులమైన మనమంతా గర్వించాలి.

**అనంత శ్రుతిసాగరం :**

వేదం అనాదికాలం నుంచి నిర్మలంగా, నిష్కల్మషంగా ప్రవహిస్తున్నది. ఇది మానవుని మనసులోని మాలిన్యాన్ని దూరం చేసి అతనిలోని దైవత్వాన్ని ఆవిష్కరింపజేస్తుంది. మానవుని దివ్యత్వం అంచులకు తీసుకొనిపోతుంది. వేదం మానవుని కన్నా అతీతమైంది. మానవశక్తికి మించింది. అందుకే వేదాలను అపౌరుషేయాలన్నారు. వేదంలో ప్రతి సూక్తద్రష్ట పేరు చెప్పబడింది. ఆయన వాటికి కర్త కాదు. ద్రష్ట, స్మర్త మాత్రమే. ఆయన సూక్తాన్ని విన్నాడు. కాబట్టి దాన్ని 'శ్రుతి' అన్నారు. శ్రుతి అంటే విన్నదని అర్థం. ఆ విన్నదాన్నే అక్షరబద్ధం చేశారు.

వేదం ఒకనాడు పుట్టి ఒకనాటికి ముగిసిన కావ్యం లాంటిది కాదు. అదొక నిత్యనూతన స్రవంతి. వేదఋషులు తాము దర్శించినదాన్నంతా అక్షరబద్ధం చేశారు. అందుకే వేదం అనంతమైంది. ఈ అనంత శ్రుతిసాగరం సమస్త ప్రాణులకు సహాయపడుతున్నది.

వేదనాదం నిత్యం నిరంతరం తరతరాలుగా వినిపిస్తు న్నది. వేదస్వరం అలలుగా, తరంగాలుగా పయనిస్తూనే ఉంది. ఇంతకాలంగా ఒక నాగరికత, సభ్యత, సంస్కృతి నిలిచి ఉండటం ప్రపంచంలోనే కనీవినీ ఎరుగం. వేదం తొలినుంచి అక్షరబద్ధమైంది. దీనికి భాష లిపి ఉన్నాయి. అక్షరాన్ని, స్వరాన్ని ఇంతకాలంగా భద్రపరచిన ఉదాహరణ సృష్టిలో మరొకటి లేదు. అక్షరం, నాదయుక్తమైన వేదం జరాజీర్ణాలకు అతీతంగా నేటికీ నిలిచి ఉండటం వింతమాత్రమే కాదు, మహత్తు కూడా.

**విశ్వశాంతి కామన :**

వేదఋషుల పరంపరయే భారతీయ సంస్కృతికి మూలాధారం. ఈ విశ్వమంతా వేదమయమే. 'సర్వం వేద మయం విశ్వం'. అది సకల జీవుల శ్రేయస్సు నాకాంక్షించింది. మానవజాతికి వెలుగును ప్రసాదించింది. జీవనసారాన్ని బోధించింది. సర్వ ప్రాణుల హితం కోరింది. సమస్త ప్రకృతి వికాసానికి కారణమైంది. మానవజాతి వికాసానికి తోడ్పడింది. విశ్వశాంతిని ఆకాంక్షించింది.

వేదంలోను, వేదాంతంలోను త్రికానికి (మూడింటికి) చాలా ప్రాధాన్యముంది. అసలు వేదానికే 'త్రయీ' అనే పేరుంది. ఇక త్రిలోకాలు, త్రిగుణాలు, త్రిమూర్తులు, స్థూల సూక్ష్మ కారణ శరీరాలు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, ఈ విధంగా సృష్టి అంతా త్రిపుటిమయం. కావున వేదాలను అధ్యయనం చేసేటప్పుడు మొదలు, చివర మూడు పర్యాయాలు 'ఓం శాంతిః ఓం శాంతిః ఓం శాంతిః' అని శాంతిత్రికాన్ని పఠిస్తారు.

**త్రివిధ శాంతులు :**

వేదం మూడు స్థాయిల్లో శాంతిని బోధించింది. అవి- 1) ఆధిభౌతికం 2) ఆధిదైవికం 3) ఆధ్యాత్మికం. మానవుడు సాత్త్విక, రాజస, తామసిక స్థాయిల నధిగమించి మనస్సు, హృదయముల మధ్య సమన్వయాన్ని సాధించాలి. నైతిక జీవన విధానం ద్వారా దానిని సాధిస్తే లోకంలో శాంతి సౌభాగ్యాలు వెల్లివిరుస్తాయి. ఆ పైన సకల లోకశాంతిని ఆకాంక్షించాలి. మానవులంతా శాంతికోసం అన్వేషిస్తున్నారు. కాని అది బయట దొరికేది కాదు. జీవుడు ఆత్మానుసంధానం చేసేటప్పుడు (మనస్సును ఆత్మలో ఐక్యం చేసేటప్పుడు) కలిగే దివ్యాను భూతియే శాంతి. కోరికలు, ఆందోళనలు, ఆదుర్దాలు మొదలైన వాటి వేగాలన్నీ తగ్గటమే శాంతి.

ప్రతి వ్యక్తి తన చుట్టూ ఉన్న వ్యక్తులతోను, సమాజం తోను, ప్రకృతితోను సంతులనాన్ని సాధించాలి. సర్వత్ర సంతులనమే శాంతి. వేదాలలోని శాంతి మంత్రాలు మనలో మనశ్శాంతిని, సమాజంలో వ్యక్తుల మధ్య శాంతిని, ప్రకృతిలో శాంతిని ఆకాంక్షిస్తాయి. అవి భౌతిక, మానసిక, ఆత్మస్థాయిల్లో శాంతిని కలిగిస్తాయి. ఈ శుభాశంసలు చేసే మనం మన చేతల ద్వారా సంపూర్ణశాంతిని నెలకొల్పడానికి ప్రయత్నించాలి. ఈ శాంతి సకల జీవరాసులకు, సకలలోకాలకు విస్తరించాలి.

**శాంతము లేక సౌఖ్యము లేదు :**

మన సహజస్వభావమే శాంతి. 'సతతం నిర్మలం శాంతం' అన్నట్టు మనమెప్పుడూ నిర్మలంగా, శాంతంగా ఉండాలి.

# శ్రీచరణ శరణాగతి

కూడని మోహజాల శఠకోప మొనర్చి సముద్ధరింపగన్
ఏడుగడల్ త్వదీయ చరణేప్సిత సద్మములో! మునీశులున్
వీడని సత్కృపాపర సువీక్షణ రక్షలొ! చర్చసేయ సై
దోడుగ నుద్యమించు తులతూగెడి నిస్తుల మోక్ష దీక్షలన్. 25

సుధలను దేహపంజరము సుస్థితినందెడి గాని, స్తోత్రవాక్
సుధలను భక్తిరక్తి భవశోషణ యోగములందవచ్చుటన్
బుధజనవర్గమెల్ల, బరిపూర్ణ మనోరథసిద్ధి నాత్మలన్
బధిరత వీడి నీ చరణ బంభరగానమె విందు రెప్పుడున్. 26

పురుషార్థంబులనెల్ల నుత్తమమునై పొల్పొందు మోక్షంబుదా
దొరకున్ పూర్ణముగా నహంకృతి వినిర్ధూతంబునైనప్పుడే!
జరుపన్ త్వత్పదసేవ భాగవతదాస్యంబున్ నిరాటంకమై
కరుణాసాగర! సర్వలోకహిత సంకల్పా! నమస్తే పునః. 27

కడువడి ఛత్రమై యలరి కాంతిశిరోమణిహార హారతుల్
నిడి, నిడుపైన మేను సుఖనిద్రకు పానుపుజేసి శ్రీహరిన్
విడువక కొల్చు శేషునకె విభ్రమగొల్పదె మాప్రవృత్తి! నీ
యడుగులకున్ మడుంగులను నద్దెడి దాస్య మదెంత గొప్పదో! 28

శేషము సర్వలోకము నశేష విభూతుల వెల్గు నీకునై
శేషివి నీవటంచు నుతిజేయు భవత్పద భక్త ఘోషణల్
దోషవినాశముల్ విబుధ తోషణముల్ నిరవద్య వేద స
ద్వేష! విముక్తి భాషణలు, విశ్వజనాళి విశేష భూషణల్ 29

అడుగులు విద్రుమమ్ములు, నవాంబరముల్ వరపుష్యరాగముల్,
నిడుపగు దండ పచ్చలు, వినిర్మలకౌస్తుభమెన్న కెంపులున్,
సుడివడు కేశముల్ కనులు శోభనహాసము లింద్రనీలముల్
విడివడు మౌక్తికమ్ములను, విశ్రుతరత్నవిభూష! కేశవా! 30

- ఆచార్య రావికంటి వసునందన్

మానసిక శాంతి కావాలంటే సహనం, సానుభూతి, సమత్వం అలవరచుకోవాలి. శాంతి మనిషికి వెన్నెముక వంటిది. అది ఆధ్యాత్మిక సాధకునికి శ్వాసలాంటిది. శాంతి లేకపోతే సుఖం లేదు. శాంతి ఆత్మ సహజ లక్షణం. కోరికలున్నవారికి శాంతి ఉండదు. నిర్మల హృదయులకే శాంతి ఉంటుంది. శాంతి ఆంతరంగికమైనది. ఆధ్యాత్మిక జ్ఞానం శాంతిని కలిగిస్తుంది. శాంతి తీరంలేని సముద్రం వంటిది.

సమాజంలోని వ్యక్తులు ఐకమత్యంగా ఉంటేనే సమాజంలో శాంతి నెలకొంటుంది. సమాజశాంతిపై జాతి పురోగతి ఆధారపడి ఉంటుంది. ప్రపంచంలో శాంతి నెలకొనాలంటే మానవజాతి సమైక్యత, ఆధ్యాత్మిక విజ్ఞానం ప్రధానంగా కావాలి.

భారతీయులు శాంతిప్రియులు. వారికి శాంతి విలువ బాగా తెలుసు. ద్యులోకం, అంతరిక్షం, పృథివి, జలము, ఓషధులు, వనస్పతులు, విశ్వేదేవతలు, బ్రహ్మ మాత్రమే కాకుండ విశ్వం సమస్తానికి శాంతి కావాలని వారు ఆకాంక్షించారు. శాంతికి కూడా శాంతిని ప్రసాదించగల పరమ ప్రశాంతి మనలను వర్ధిల్లజేయాలని వారు ఇలా ప్రార్థించారు –

**ఓం ద్యౌః శాంతి రంతరిక్షం శాంతిః**
**పృథివీ శాంతి రాపః శాంతి**
**రోషధయః శాంతిః ।**
**వనస్పతయః శాంతి**
**ర్విశ్వే దేవాః శాంతి ర్బ్రహ్మ శాంతిః**
**సర్వం శాంతిః శాంతిరేవ శాంతిః**
**సా మా శాంతిరేధి ॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

*(ఇంకా ఉంది)*

# సందేహాలు? సమాధానాలు!!

- 'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**ఆంజనేయుడు అస్ఖలిత బ్రహ్మచారా? కొన్నిచోట్ల ఫోటోల లో భార్యతో ఉన్నట్లున్నది. ఎందువలన?**

- పి. విజయకుమారి, తిరువూరు, కృష్ణాజిల్లా.

☛ ఆంజనేయస్వామి బ్రహ్మచారిగా రామాయణం ఎక్కడా చెప్ప లేదు. లక్ష్మణుడు రాముని ఆజ్ఞ మేరకు, సుగ్రీవుని కడకు పోయినపుడు కిష్కింధాపురిలో హనుమంతుని ఇల్లు కూడ చూచినట్లు వాల్మీకి చెప్పాడు. రాముడు ఆరణ్యవాసం పూర్తి చేసి తిరిగి అయోధ్యకు వస్తూ తాను సీతా లక్ష్మణ వానర విభీషణ సహితంగా భరద్వాజాశ్రమంలో ఉండి తనరాకను తెలుపటానికి హనుమంతుని భరతుని కడకు పంపించాడు. మరికొంతసేపటి వరకు రాముడు తిరిగి రాకపోతే తా నగ్నిప్రవేశం చేయటానికి భరతుడు సిద్ధమౌతుండగా హనుమంతుడు వెళ్లి భరతునకు రాముని ఆగమన వార్తను తెలియజేశాడు. పరమానంద భరిత హృదయుడైన భరతుడనేకమైన కానుకలు ఆయనకు చదివిం చాడు. అందులో కొంతమంది కన్యలను కూడా చదివించినట్లు న్నది. ఆయన వివాహ విశేషాలు రామాయణంలో లేవు. కాని, హనుమంతుడు ఆజన్మబ్రహ్మచారియని లోకంలో ఒక విశ్వాసం. కొన్ని పురాణాలలాగే చెప్పాయి కూడా! ఆయన చెమట బిందువును మ్రింగిన చేపకు మత్స్యవల్లభుడు పుట్టినట్లు మైరావణ చరిత్రాదులు చెబుతున్నాయి.

కొద్దికాలం క్రిందట ఏదో ఉపపురాణంలో, సువర్చలాదేవిని ఆయన వివాహమాడినట్లున్నదని, సువర్చలాంజనేయోపాసన ప్రారంభమైంది. దీనిని ఇదమిత్థంగా నిర్ణయించటానికి కొల బద్దలగు రచనలు లేవు.

**శ్రీరాముడు ఆంజనేయుని 'చిరంజీవ' అని దీవించింది ఆ యుగానికేనా? లేక తదుపరి వచ్చే అన్ని యుగాలకూనా?**

- సి.హెచ్.రామకృష్ణ, తిరువూరు, కృష్ణాజిల్లా.

☛ ఎవరైనా 'చిరంజీవ' అని ఆశీర్వదిస్తే అది శాశ్వతత్వానికే గాని, కేవలం నెలరోజులకో, సంవత్సరానికో, వందేళ్ళకో అని కాదు. అన్ని యుగాలలోను చిరంజీవిగా ఉండుమనే అర్థం. ఈ రోజు మనం నిత్యం ఆంజనేయస్మరణ చేస్తున్నాం. ఆలయా లలోను దర్శిస్తున్నాం. పూజలు నిర్వర్తిస్తున్నాం. మ్రొక్కుబడులు తీర్చుకొంటున్నాం. కాబట్టి ఎన్ని యుగాలకైనా ఆయన చిరంజీవి గానే ఉంటాడు.

**సర్వకష్టాలు పడి రామదర్శనం కోసం పరితపించిన రామ దాసుకు దర్శనమివ్వక తానీషా నవాబుకు దర్శనమివ్వట మేమిటి?**

- వాస్తురామచంద్ర, నెల్లూరు.

☛ రామదాసు రామునకాంతరంగిక భక్తుడు. ఆయనకు శాశ్వ తంగా సంసారబంధ విచ్ఛేదనం చేసి తన సన్నిధికి రప్పించుకొంటు న్నాడు. రాముడు ఇక శాశ్వతంగా రామదాసు రామసాయుజ్యం లోనే ఉంటాడు. ఇక తానీషా ఒక భక్తుని బాధిస్తున్నాడు. అందు చేత అతనిలోని అజ్ఞానాన్ని తొలగించి, అతనికి జ్ఞానోదయం కల్పించి, రామదాసుని ఏ నోటితో తిట్టాడో అదే నోటితో స్తుతింపజేయాలి. అందువల్ల ముందతనికి దర్శనమిచ్చాడు.

**సుగ్రీవునకు హనుమంతుడు మేనల్లుడవుతాడని ఒక చోట చూశాను, ఎలాగో తెల్పండి.** - చిట్టూరి సుబ్బలక్ష్మి, తిరువూరు.

☛ కొన్ని పురాణగాథలకు, తలతోక ఉండదు. ఐనా ఆనాటి వావివరుసలు తెలిసికోవటానికి ఆధారాలు లేవు. హనుమంతుడు రామదూతగా లంకకు వెళ్ళినప్పుడు రావణునితో 'నీ సోదరుడు సుగ్రీవుడు నీ సేమమడిగినాడు' అని భాస్కర రామాయణంలో ఉన్నది. దీని కాధారం లభింపదు. వాలి - రావణులు కొంత కాలం స్నేహం చేశారు. అప్పుడా వరసలు పెట్టుకొని పిలుచు కొని ఉండవచ్చు. ఇక మీ ప్రశ్నకు వస్తే 'విచిత్ర పురాణ'మనే ఒక ద్విపద పుస్తకం ఉన్నది. అందు బుక్షవరజుడు బ్రహ్మ ఆవు లింతలోనుండి పుట్టాడని, ఆతడు కిష్కింధను పాలించాడని, ఒక కథ ఉన్నది. సుగ్రీవుడాబుక్షవరజుని కుమారుడే. వాలిసుగ్రీవు లిద్దరు అంజనాదేవిని సోదరిగా మన్నించారట.

విచిత్ర రామాయణంలో మరియొక ప్రసిద్ధగాథ ఉన్నది. ఒకనాడు అహల్యా భర్తయైన గౌతముడు పుత్రులగు వాలి సుగ్రీవుల నిద్దరిని భుజాలపై కెక్కించుకొని, కుమార్తెయైన అంజనాదేవిని నడిపించి తీసుకొనిపోతున్నాడు. ఆ అమ్మాయికి కోపం వచ్చి "నాన్నా! ఈ కొడుకును ఇంద్రునివలన - ఈ

కొడుకుని సూర్యునివల్ల అమ్మ కన్నది. నేను నీకు పుట్టినదాన్ని. నన్ను నడిపిస్తూ వారినెత్తుకొన్నావు. ఇది ధర్మంగా ఉన్నదా?" అని ప్రశ్నించింది. అపుడు గౌతముడు "అంజనా! నీవు చెప్పింది నిజమైతే ఈ ఇద్దరు కోతిముఖాలు కలిగినవారగుదురుగాక" అని ఆ ఇద్దరినీ సముద్రంలోకి విసిరాడు. వారిద్దరు వానర ముఖులయ్యారు. అపుడక్కడకు వచ్చిన ఋక్షవరజుడు వారిని తీసుకొని పోయి పెంచాడు. కనుక వాలి-సుగ్రీవుడు-అంజన ఏకోదరులు కనుక వారి సహోదరి అంజన. ఆమెకు పుట్టినవాడు సుగ్రీవునకు మేనల్లుడే కదా!

**నారద మహర్షి చెప్పకపోతే వాల్మీకి రామాయణం రచన చేయలేడా?**

**- పూర్ణచంద్రరావు, విశాఖ.**

☛ నారదుడు చెప్పింది రామకథను మాత్రమే. రచన చేసినవాడు వాల్మీకి. శ్రీకృష్ణదేవరాయలు మార్కండేయ పురాణంలోని మనువు కథ చెప్పవలసిందన్నాడు. వ్రాసినవాడు పెద్దన. కనుక కథ చెప్పటానికి రచన చేయటానికి సంబంధం లేదు. బ్రహ్మదేవుడు వచ్చి వాల్మీకినాశీర్వదించి, "కురురామకథాం, పుణ్యాం, శ్లోక బద్ధాం, మనోరమామ్" అని, నారదుడు వచ్చి రామకథను చెబుతాడని ఆనతినిచ్చారు. తర్వాత నారదుడు వచ్చాడు. "నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్" నారదుని వాల్మీకి అడిగాడు. ఆయన రామకథను చెప్పాడు. కథను 24 వేల శ్లోకాలలో గాయత్రీ మంత్ర బీజాక్షరాలతో వాల్మీకి వ్రాశాడు.

**'బ్రహ్మశ్రీ' అని ఎవరిని అంటారు? ఎందువలన? స్త్రీ పురుష దేవుళ్ళందరికి 'శ్రీ అని వారి పేర్లకు ముందు చేర్చుతారెందుకు?**

**- సి.హెచ్. విజిత, తిరువూరు, కృష్ణాజిల్లా.**

☛ 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' బ్రహ్మజ్ఞాన సంపన్నుడు బ్రహ్మ సమానుడు. అంతటి జ్ఞానం కలవారిని 'బ్రహ్మశ్రీ' అని పిలుస్తారు. దీనికొక కొలబద్ద లేదు. నాలుగు విషయాలు చదివి, కొంత వెలుగులోనికి వచ్చిన చాలమందికి 'బ్రహ్మశ్రీ' అని తగిలిస్తున్నారు. ఇది సరియైంది కాదు. బ్రహ్మజ్ఞానికి మాత్రమే ఉంచాలి. అలాగే భగవాన్ శబ్దం కూడా వాడబడుతున్నది.

'శ్రీ' అంటే శుభప్రదం, లేక సంపత్ప్రదమని అర్థం. దేవతలందరూ శుభాలు సంపదలు ఇచ్చేవారే గనుక, వారి పేరులకు ముందు శ్రీ ఉంచుతారు. వారికే కాదు మనుష్యులలో మగవారికి 'శ్రీ' - స్త్రీలకు 'శ్రీమతి' ముందు ఉంచుతారు. 'శ్రీమతి' అంటే శుభము కలిగిందని మాత్రమే అర్థం. కన్యలకు కూడా ఆ పదం వాడవచ్చు. కాని లోకంలో పెళ్లి ఐన స్త్రీకి 'శ్రీమతి' అని వివాహం కాని స్త్రీకి 'కుమారి' అని ఉంచటం రూఢిగా మారింది. తమిళదేశంలో 'శ్రీ స్థానంలో తిరు' ఉంచుతారు. 'శ్రీపతి' నే వారు 'తిరుపతి' అంటారు. 'శ్రీ ఊరు' తిరువూరుగా మారింది కదా! ఇది ద్రావిడ సంప్రదాయ ప్రభావం.

**సీతను శీలపరీక్షకు గురిచేసిన రాముడు ప్రజలు నింద వేశారని పరిత్యజించాడు. ఆదర్శదాంపత్యానికి ఇదేనా అర్థం? తన రాజ్యంలోని ప్రజల్లో సీత కూడా ఒకరు కదా! ఆమెకు న్యాయం జరిగిందా? రామరాజ్యమంటే ఇదేనా? ఇంతకూ రాముడు కీర్తికాముకుడా? సీత ప్రేమికుడా?**

**- బందలుప్పి జగన్మోహనరావు - విజయనగరం.**

☛ ఈ ప్రశ్నకు స్థూలదృష్టితో సమాధానం చెప్పటం కష్టం. సూక్ష్మదృష్టితో అర్థం చేసుకోవాలి. సీతాదేవిని గురించి రామాయణంలో రాముడు "మమప్రాణేభ్యోఽపి గరీయసీ" అన్నాడు. నా ప్రాణాలకన్న సీతయే నా దృష్టిలో గొప్పదని అర్థం. రాముడు రాజ్యపాలనకు వచ్చాడు. ఎవడో త్రాగుబోతు సీతా పాతివ్రత్యం గురించి చెడుగా మాట్లాడినాడు. రాముడన్నాడు "సీత నా ప్రాణాలకధీశ్వరి". ఆమె నాకభిన్నం. ఇక ఈ రాజ్యకీర్తి నేను సాధించింది కాదు. వంశపారంపర్యంగా వచ్చింది. దానిని మైలపరచే అర్హత నాకు లేదు. అందువలన నన్ను నేను పరిత్యజించుకొంటున్నానన్నాడు. ఉత్తర రామాయణంలో సీతా పరిత్యాగం తరువాత రాముడు నిజంగా జీవించిలేదు. సుఖాలను భవింపలేదు. ప్రజారక్షణయే విధ్యుక్తధర్మంగా పాటించి పాలించాడు. సీత ప్రజలలో ఒక్కర్తె కాదు. రాముని ప్రాణమామె. కనుక తన్ను తాను పరిత్యజించుకున్నాడు. శిక్షించుకున్నాడు. రామరాజ్యంలో ప్రజలకే గాక, పశుపక్ష్యాదులకు కూడా న్యాయం జరిగిన సంఘటనలున్నాయి. కనుక రాముడు కీర్తి కాముకుడే కాదు; సీతా ఉపాసకుడు. అశ్వమేధయాగానికి కూడా బంగారంతో సీతాప్రతిమనే చేయించుకొని, ప్రక్కన ఉంచుకున్నాడే తప్ప ఇంకొక స్త్రీకి ఆ స్థానమీయలేదు. కనుక ఇక్కడ న్యాయం జరిగిందా? లేదా? అన్న ప్రశ్నకు తావేలేదు.

# భక్తి సాధనాలు

- డా॥ ఆర్. రాజేశ్వరిదేవి

పూజ, జపం, చింతనలనేవి భక్తి సాధనాలని మహాత్ముల అభిప్రాయం. భక్తి అంటే ప్రేమ అని చెప్పుకోవచ్చు. భక్తుడు భగవంతునిపై తనకు గల ప్రేమను వ్యక్తపరిచే సాధనమే భక్తి. భక్తుడు, తనకు భగవంతునికి గల సంబంధం జన్మజన్మలది అని తెలుసుకునే మార్గం భక్తిమార్గం. భక్తుడికి భగవంతుడిపైగల ప్రేమే సాధన సమయంలో కావలసిన ఓర్పు, దీక్షనిచ్చి; భక్తివల్ల కలిగే ఫలితాన్ని దానివల్ల పొందే ఆనందాన్నిస్తుంది.

మన హిందూమతంలో విగ్రహారాధనకి విశిష్టస్థానం ఉంది. విగ్రహారాధనతో మొదలైన సాధన క్రమంగా నామ రూపాలతో ఉన్న విగ్రహ మూలతత్త్వాన్ని తెలుసుకునే జిజ్ఞాసను సాధకుడికి కలిగిస్తుంది. భక్తుడు తన ఇష్టదైవమైన నారాయణుని పూజిస్తున్నప్పుడు (విగ్రహారాధనలో) శరీరంతో పూజిస్తూ, వాక్కుద్వారా మంత్రోచ్చారణ చేస్తాడు. ఈ రెండింటిని అను సరించి మనస్సు ఉంటుంది. కాబట్టి విగ్రహారాధన (పూజ) శరీరం, వాక్కు, మనస్సులనే మూడింటిద్వారా నిర్వహింపబడు తుంది. ఇష్టదేవతారాధనలో 'ఆవాహయామి' అని నారాయణుని ఆహ్వానించి, ఆసనం చూపుతూ 'ఆసనం' అని పలుకుతాం. 'పాద్యం' అని చెప్తూ పాదాలను, 'అర్ఘ్యం' అని చెప్తూ చేతులను తుడుస్తాం. 'ఆచమనం' అని జలాన్ని సమర్పిస్తాం. 'స్నానం' అని స్నానం చేయిస్తున్నట్లు భావిస్తాం. 'వస్త్రం' అని వస్త్రాలను, 'గంధం' అని గంధాన్ని, 'పుష్పం' అని పుష్పాలను సమర్పిస్తాం. 'హారతి' ఇస్తూ దీపాన్ని దర్శింపజేస్తాం. ఈ ఆచరణ విధానాలన్నీ శరీరస్థాయిలో జరుగుతాయి. కాబట్టి ఈ సాధన శరీరపర మైందిగా భావించవచ్చు. మంత్రోచ్చారణ చేస్తున్నప్పుడు ప్రధానంగా వాగింద్రియాల సహకారం ఉంటుంది. కాని ప్రధాన మైనది ఆ సాధకుడి మానసిక భావం. అందుకే మన పెద్దలు "భావగ్రాహి జనార్దన" అన్నారు. అనంతుడైన భగవంతుని ఒక రూపంగా భావించుకొని ఆరాధించడంవల్ల చిత్తశుద్ధి, మనో నైర్మల్యం కలుగుతుంది. తద్వారా భగవంతుని సర్వవ్యాపకతను సాధకుడు గ్రహించగలుగుతాడు. జగత్తులోని ఏ ప్రాణియూ పరమాత్మకన్నా భిన్నం కాదన్న అనుభవం అతని హృదయంలో ప్రేమ, స్నేహం, సేవా భావాలను నింపుతుంది.

భక్తియోగంలో పరమపవిత్రమైందిగా భావింపబడేది 'జపం'. భగవంతుని మంత్రాన్ని గాని, నామాన్ని గాని పదే పదే ఉచ్చరించడమే జపం. జపంలో ఒక మనోవిజ్ఞాన సూత్రం ఇమిడి ఉంటుంది. కొన్ని పదాలను నిరవధికంగా పదే పదే ఉచ్చరిస్తుంటే మనస్సు ఏకాగ్రతను పొందుతుంది. భగవంతుని నామం ఆయన రూపంతో కలసి ఉంటుంది. కావున భగవం తుని నామము ఉచ్చరించినపుడు ఆయన రూపం మన మనస్సులో సాక్షాత్కరిస్తుంది. తద్వార భగవంతుని యందు మనసు ఏకాగ్రమై, పవిత్రమౌతుంది.

జపం చేసే సమయంలో శరీర సహకారం అవసరం లేదు. వాగింద్రియం, మనస్సు ముఖ్యం. జప ఉచ్చారణలో భజనను మొదటిదిగా చెప్పుకోవచ్చు. దీనియందు భగవంతుని నామాన్ని, మహిమల్ని స్తుతిస్తూ గానం చేయడం జరుగుతుంది. మనస్సు ఏకాగ్రతను పొందడానికి, అందులో లీనం కావడానికి నామసంకీర్తన ఎంతగానో ఉపయోగపడుతుంది. భజన, కీర్తన, స్తుతి, సహస్రనామ పఠనం మొదలైనవి ఈ వర్గానికి చెందినవిగా చెప్పుకోవచ్చు. "ఓం నమో వేంకటేశాయ", "ఓం నమో నారాయణాయ" వంటి మంత్రాల్ని పదే పదే బిగ్గరగా పలకడాన్ని "ఉచ్చజపం" అంటారు. కేవలం పెదవుల కదలిక చేస్తూ, శబ్దం బయటకు రాకుండ చేసే జపాన్ని "మౌనజపం" అంటారు. జపాన్ని క్రమంగా పెదవుల కదలిక కూడా లేకుండా చేస్తే దాన్ని "మానస జపం" అంటారు. మౌనజపం ఉచ్చజపం కన్నా ఉత్తమమైందిగా చెప్పుకోవచ్చు. ఇందులో జపం చేస్తున్నవానికి మాత్రమే మంత్రం వినబడుతుంటుంది. ఇది చాలా సూక్ష్మమైనది, కష్టమైనది. ఇది మనసులోనే జరుగుతుంది. ఇందులో స్వరపేటిక కూడా కదలదు. మానసజపాన్నే "ధ్యానం" అని కూడా అనవచ్చు. ఏకాగ్రత, చిత్తశుద్ధి సాధించడానికి శక్తి

వంతమైనది ధ్యానం. ఇది పూర్తిగా మానసికం. ఇందు కాయిక, వాచిక ప్రమేయం ఉండదు. ధ్యానం వల్ల మనసు సూటిగా, శక్తివంతమైందిగా ప్రశాంతతను, నిర్మలతను కలిగి పరమాత్మ తత్త్వమును చింతించుటకు తగిన అర్హతను పొందుతుంది.

జపం చేసేటప్పుడు జపమాలను ఉపయోగించుకునే సంప్రదాయమొకటుంది. జపమాలతో జపించడం వల్ల ఏకాగ్రతను పొందడం సులభం. అంతేకాక మంత్రోచ్చారణ ఒక క్రమపద్ధతిలో జరుగుతుంది. మాలలోని పూసల కదలికతో మంత్రోచ్చారణ జరుగుతుంది. కావున జపానికి అంతరాయం కలిగిన సాధకుడు వెంటనే తెలుసుకునే వీలుంటుంది. జపంలో ఏకాగ్రతతో ఒకే నామం ఉచ్చరించడం జరుగుతుంటుంది. మంత్రం భగవంతుని రూపానికి, గుణానికి ప్రతీకయే తప్ప ఆలోచించడానికి, విచారించడానికి కాదు.

ఆలోచనా ప్రవాహాన్ని ఒకే ఒక విషయంపై మరలించడాన్ని చింతనం అంటారు. ఈ చింతనంలో మనసు చింతించే విషయంనుండి ప్రక్కకు మరలినా దానిని గమనించి తిరిగీ మనసును చింతించే విషయంపై మరలించడం జరుగుతుంది. దీనినే "విరళ చింతనం" అంటారు. ఏ విషయాన్నైనా అంతరాయం లేకుండా, మనసు ఎటువైపుకు పోకుండా ఒకే విషయాన్ని చింతించడాన్ని "సరళ చింతనం" అంటారు. విరళ చింతనం క్రమంగా సరళ చింతనకు దారితీస్తుంది. సరళ చింతనను పై నుంచి క్రిందికి పడుతున్న కరిగిన నేతిధారతో పోలుస్తారు. పరమాత్మ రూపంపైగాని, గుణాలపైగాని, స్వభావంపైగాని సాధకుని మనస్సును కేంద్రీకరించడమే చింతనం లక్ష్యం. తద్వారా భక్తుడు అనంతుడైన పరమాత్మ ప్రేమామృతాన్ని చవిచూడగలుగుతాడు. ఆ అమృతబిందువును చవిచూసిన రామదాసు, అన్నమయ్య, పోతన మొదలగు మహాత్ములకు ఈ లోకంలోని దారిద్ర్యసంపదలు, సుఖదుఃఖాలు రెండూ నిస్సారమైనవిగా అనిపించాయి. తన్మయులై, తమ అనుభూతిని పాటలు, పద్యాల రూపంలో వ్యక్తం చేయటానికి ప్రయత్నించారు.



భక్తియోగసాధనలో ఆరాధన దగ్గర్నుండి సరళచింతనం వరకు పరిశీలించినట్లైతే సరళచింతనయే ఉత్తమమైన సాధనమని అర్థమౌతుంది. పూజలో దేహం, వాగింద్రియం, మనసు కలిసి పనిచేస్తాయి. కనుక ఇది మూడు చక్రాల సైకిలు వంటిది. ఉచ్చజపంలో వాగింద్రియం, మనసు పనిచేస్తాయి. కనుక ఇది రెండు చక్రాల సైకిలు వంటిది. మౌనజపం, మానసిక జపం, చింతనల యందు మనసు మాత్రమే పనిచేస్తుంది. కనుక ఇది సర్కసులో, గారడీలలో ఉపయోగించే ఒకే చక్రమున్న సైకిలు వంటిది. దీనిని తొక్కడానికి కొంత ప్రత్యేకమైన శిక్షణ అవసరం. అలాగని చింతనం ముఖ్యమైందని; పూజ, జపములనేవి అల్పమైనవిగా భావించరాదు. ఈ మూడు సాధనాలు పైపైకి ఎగబ్రాకటానికి ఉపయోగపడే మెట్లవంటివే. ఇందులో ఏ దశలోని సాధనకైన మనస్సు ప్రధానమైంది. కావున సాధకుడు మంచి సంస్కారాలను కలిగిన మనస్సును కలిగి ఉండాలి.

నిర్గుణుడైన పరమాత్మ ప్రేమామృతాన్ని గ్రోలదలచిన భక్తుడు సద్గుణాల్ని పెంపొందించుకోవాలి. అనంతుడు, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు అయిన పరమాత్మ అవ్యాజమైన ప్రేమతో మానవులకోసం పలికిన పలుకులే "భగవద్గీత". ఇది అక్షరసత్యము. ఏ వ్యక్తి జీవితంలోనికి భగవద్గీత ప్రవేశి

స్తుందో ఆ క్షణం నుండే వారి జీవితగమ్యం, తద్వారా సన్మార్గంగా మారుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు. తల్లి తనకు బిడ్డపై ఎంతటి ప్రేమను కలిగి ఉన్నప్పటికి దుమ్ము, ధూళితో కూడిన మలినాలను తొలగించిన తరువాతే ఆ బిడ్డను ఎత్తు కుంటుంది. అదే విధంగా ప్రేమస్వరూపుడైన పరమాత్మ కూడా మనోమాలిన్యాలను తొలగించుకున్న వారినే తనదరికి చేర్చు కుంటాడు. భగవద్గీత 2, 12, 13 అధ్యాయాలలో సాధకుడికి ఉండాల్సిన సుగుణాలు, అత్యంత ఉపయోగకరమైన సాధన పద్ధతులు తెలుపబడ్డాయి. 16వ అధ్యాయం "దైవాసుర సంపద్వి భాగయోగము"లో దైవీగుణాలు, అసురగుణాలను గురించి తెలుపబడ్డాయి. మానవుడు సుగుణ, దుర్గుణ మిశ్రమంతో జన్మిస్తాడు. కానీ సుగుణాల్ని పెంచుకుంటూ, దుర్గుణాల్ని వది లించుకుంటూ పోవడమే మానవజీవిత విధానం కావాలి. అప్పుడే భగవంతుడు మనకిచ్చిన మానవజన్మకు సార్థకత ఏర్పడుతుంది.

## దైవీగుణాలు - అసురీగుణాలు :

భగవద్గీత 16వ అధ్యాయంలోని మొదటి మూడు శ్లోకాల్లో దైవీగుణాలు చర్చింపబడ్డాయి.

**అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞాన యోగవ్యవస్థితిః,**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్.**

**అహింసా సత్యమక్రోధః త్యాగః శాంతిరపైశునమ్,**
**దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్.**

**తేజః క్షమా ధృతిః శౌచం అద్రోహో నాతిమానితా,**
**భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత.**

పై శ్లోకాలలో 26 దైవీగుణాలు వర్ణించబడ్డాయి. అవి-1)అభయం, 2)అంతఃకరణశుద్ధి, 3)జ్ఞానయోగం నందుం డుట, 4)దానం, 5)ఇంద్రియనిగ్రహం, 6)యజ్ఞం, 7)వేదా ధ్యయనం, 8)తపస్సు, 9)ఋజుత్వం, 10)అహింస, 11)సత్యం, 12)క్రోధం లేకుండుట, 13)త్యాగం, 14)శాంతి, 15)ఇత రుల దోషాన్ని లెక్కింపకుండుట, 16) విషయలోలత్వం లేకుం డుట, 17)మృదుస్వభావం, 18)ధర్మవిరుద్ధ కార్యములందు ఆసక్తి లేకుండుట, 19)సర్వభూతదయ, 20)చపలత్వం లేకుం డుట, 21)బ్రహ్మతేజస్సు, 22)ఓర్పు, 23)ధైర్యం, 24)శుచి త్వం, 25)ద్రోహం చేయకుండుట, 26) నిరభిమానం.

పైన తెల్పిన ఇరవైఆరు గుణాలు జీవుని అంతఃకరణాన్ని పునీతమొనర్చుతాయి. వీటికి వ్యతిరేకమైనవి అసురీగుణాలు. అందుకు ఉదాహరణంగా రెండు దైవీగుణాలు అసురీగుణాలుగా ఎలాంటి అర్థాన్నిస్తాయో పరిశీలిద్దాం.

### 1) అభయం :

భయం లేకుండుట అనేది దైవీగుణం. భయపడట మనేది అసురీగుణం. తప్పుచేసినవాడు, తనలో దోషమున్నవాడు మాత్రమే భయపడతాడు. తప్పుచేయుట, దోషములు కలిగి యుండట అనేవి అసురీగుణాలు. కావున భయం అనేది అసురగుణం.

### 2) అంతఃకరణశుద్ధి :

మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనేవాటిని అంతః కరణాలుగా చెప్పుకోవచ్చు.

**అ)** మనస్సు- (సంకల్ప వికల్పములు చేయునది) సత్‌సంక ల్పాలు చేసే మనస్సు దైవీసంపద; దుష్ట సంకల్పాలు చేసే మనస్సు అసురీసంపద.

**ఆ)** బుద్ధి- (నిర్ణయాత్మకమైనది) మంచి నిర్ణయాలు తీసుకోవడం దైవీగుణం; చెడ్డ నిర్ణయాలు తీసుకోవడం అసురీ గుణం.

**ఇ)** చిత్తం- (చింతించునది) భగవత్ సంబంధమైన సరియైన చింతనే దైవీగుణం; విషయసంబంధమైన, వ్యతిరేకమైన చింతనయే అసురీగుణం.

**ఈ)** అహంకారం ('నేను' అన్న భావన) నేను చేస్తున్నాను అన్న భావన బంధకారణమైన అసురీగుణం; పరమాత్మ ఈ పని నాతో చేయిస్తున్నాడన్న భావన దైవీగుణం.

ఈ విధంగా 26 అసురీగుణాలే కాక ఈ అధ్యాయం 4వ శ్లోకంలో మరికొన్ని పేర్కొనబడ్డాయి.

**దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,**
**అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్.**

రూపం, దర్పం, అభిమానం, క్రోధం, పరుషత్వం, అజ్ఞానం అన్న వాటిని అసురీకూటమికి చెందిన ప్రతినిధులుగా చెప్పబడ్డాయి. 21వ శ్లోకమందు కామ, క్రోధ, లోభాలను

# యాత్రికులకు సూచనలు

1) తిరుమలకు వచ్చే యాత్రికులు ఎలాంటి మత్తుపదార్థాలు, మాంసం, సిగరెట్లు వంటి చెడుపదార్థాలు తీసుకోకూడదు. ఇవి పూర్తిగా నిషేధం.
2) యాత్రికులు దర్శన టికెట్లు మరియు వసతి సదుపాయాల్ని తి.తి.దే. నియమనిబంధనల ప్రకారమే తీసుకోవాలి. దళారీలను కానీ, మధ్యవర్తులను కానీ ఆశ్రయించకూడదు.
3) యాత్రికులు ఉద్యోగులకు ఎలాంటి బహుమతులు, పారి తోషికాలు ఇవ్వకూడదు. ఇందువల్ల ఉద్యోగుల నైతిక విలువ లకు భంగం కలుగుతుంది మరియు ఉద్యోగులు తమ ఉద్యోగాలను కోల్పోవుటకు సహకరించినవారౌతారు.
4) యాత్రికులు గది తీసుకున్న 24 గం॥ల లోపు ఖాళీ చేయాలి.
5) తిరుమలకు వచ్చే యాత్రికులు స్వామి దర్శనానికై సరియైన వస్త్రధారణ కలిగి ఉండాలి, ముఖ్యంగా సుప్రభాతం, తోమాల, కళ్యాణోత్సవం మొదలైన ఆర్జిత సేవలకు సంప్ర దాయ దుస్తుల్లో రావాలి. స్త్రీలు చీర మరియు సల్వార్ కమీజ్‌లలో; పురుషులు ధోవతి, పైజామాలలో మాత్రమే రావాలి.
6) తిరుమలకు వచ్చే యాత్రికులు ముఖ్యంగా ఆర్జిత సేవలు, వి.ఐ.పి. దర్శనానికి వచ్చువారు తప్పనిసరిగా ఐ.డి. ప్రూఫ్ తీసుకురావాలి; లేనిచో వారిని ఆయా సేవలకు అనుమతిం చరు.
7) భక్తులు తమ కానుకలను శ్రీవారి హుండీలోనే సమర్పించాలి.
8) స్వామివారి దర్శనానికి వచ్చే యాత్రికులు మొబైల్ ఫోన్లు, కెమెరాలు వంటి ఎలక్ట్రానిక్ పరికరాలను తీసుకొని ఆల యంలోకి రాకూడదు. వాటిని లగేజికౌంటర్లలోనే వదలి రావాలి.
9) యాత్రికులు మరిన్ని వివరాలకు, సలహాలకు, సూచనలకు, ఫిర్యాదులకు తి.తి.దే. విచారణా కార్యాలయంలో సంప్ర దించగలరు.

**తి.తి.దే. కాల్ సెంటర్ : 0877- 2277777**

**టోల్‌ఫ్రీ నెం. : 18004254141**

నరకద్వారాలుగా పేర్కొనబడ్డాయి. ఈ అధ్యాయాన్ని పరిశీలించి నట్లైతే దైవీగుణాల గొప్పతనం కన్న, అసురీగుణాలవల్ల కలిగే కష్టనష్టాలనే ఎక్కువగా చర్చించినట్లు తెలుస్తోంది. సాధకుడు తన మనస్సునందలి అసురీగుణాలు అన్న మలినాల్ని తీసివేస్తూ, సద్గుణాల్ని క్రమక్రమంగా పెంచుకోవాలి, చివరిగా 24వ శ్లోకంలో స్వామి నెపం తనపై వేసుకోకుండా కర్తవ్య, అకర్తవ్యము లను నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణమన్నారు. అట్టి శాస్త్రోక్త కర్మలను గూర్చి బాగా తెలుసుకొని అట్టి కర్మలను ఆచరింపు మన్నారు.

సూక్ష్మంగా పరిశీలిస్తే ప్రతిసాధకుని మనస్సు ఒక యుద్ధరంగమే. ఇందు దైవీ, అసురగుణాల మధ్య సంగ్రామం జరుగుతూ ఉంటుంది. మంచి చెడ్డలకు, ధర్మాధర్మాలకు, న్యాయాన్యాయాలకు, దైవాసుర గుణాలకు పోరు ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. కేవలం జ్ఞాని, అజ్ఞానుల నడుమ మాత్రమే ఈ సంగర ముండకపోవచ్చు; ఉన్నా అంత తీవ్రంగా ఉండకపోవచ్చు. ఎందుకంటే అజ్ఞాని మనస్సులో అసుర పక్షమొక్కటే కాపురముంటుంది. వాడికి తానున్న స్థితి, తాను చేస్తున్నపని తప్పు అనేది స్ఫురణకురాదు. సరికదా దానిని వాడు శతవిధాల వితండవాదంతోనైనా సమర్థించుకుంటాడు. వాడికి రెండవ పక్షమైన దైవత్వమును గూర్చి ఆలోచనే ఉండదు. జ్ఞాని ప్రతిపక్షమగు అసురత్వమును రూపుమాపియుండుటచే ఒకే ఒక దైవపక్షం మాత్రమే అతని యందుంటుంది. ఇక మధ్యగల జిజ్ఞాసువు, ముముక్షువులకు మాత్రమే ఈ యుద్ధప్రసక్తి కలుగు తుంది. కాబట్టి ప్రయత్నపూర్వకంగా అతి జాగరూకుడై ఈ దైవీగుణాలను పెంపొందించుకోవాలి.

పూజ, జపం, చింతనల ద్వారా ఏకాగ్రత, చిత్తశుద్ధి పొందిన మనస్సు దైవీగుణాల వలన ప్రశాంతతను, నిర్మలతను పొందుతుంది. అట్టి మనస్సు మాత్రమే పరమాత్మతత్త్వమును చింతించే అర్హతను, సంసిద్ధతను కలిగి ఉంటుంది. కావున సాధకుడు భక్తియోగాన్ని ఆచరించడమే కాకుండా దుర్గుణాల్ని పూర్తిగా వదలించుకుని, సద్గుణాల్ని పెంపొందించుకోవాలి. అట్టి సాధకుడే భగవంతునికి ప్రియమైన, పరిపూర్ణమైన భక్తుడు.

# తొలి తెలుగు కవయిత్రి

- శ్రీమతి రాజ్యలక్ష్మి

**అవనిలో తాళ్లపాకన్నమయ గారి**
**తరుణి తిమ్మక చెప్పె దాను సుభద్ర**
**కల్యాణమను పాట కడుమంచి తేట**
**పలుకుల నీపాట పాడినా విన్న**
**శ్రీహరి వారికి చేరువైయుండు**

**(సుభద్రాకల్యాణం - పు.54)**

తేట తెలుగు పలుకుల మాధుర్యాన్ని రంగరించి అల్లిన ఈ గేయకావ్యం తాళ్లపాక తిమ్మక్క తొలి తెలుగు కవయిత్రిగా సాహిత్యలోకానికి అందించిన అపూర్వమైన కానుక. 15వ శతాబ్దానికి చెందిన పదకవితాపితామహుడు అన్నమాచార్యుని మొదటి భార్య. తాళ్లపాకవారికే ప్రత్యేక లక్షణమైన దైవభక్తి, సత్సంప్రదాయపు సారెలతోనే ఈమె అన్నమయ్యకు సహచరి అయ్యింది.

ఆనాటి సామాజిక కట్టుబాట్లలో స్త్రీవిద్య మృగ్యమైనా, తిమ్మక్క కవయిత్రిగా చెలామణి కావడం ఆశ్చర్యకర విషయమే. సున్నితమైన ఒక సాంఘిక దురన్యాయాన్ని; కవితాపరంగా తన నిరసన తెలియజేస్తూ, తద్వారా నారీలోకానికి మేలుకొలుపు పాడిన తొలి వైతాళికురాలు తిమ్మక్క.

ఆది నుండి పురుషపక్షపాత సమాజంలో స్త్రీలు ఎదుర్కొనే అసమానత, వత్తిడులు, విధిలేక లొంగిపోయి జీవించడం మొదలైన అంశాలను పరిశీలిస్తూ, చివరకు తనకూ అదే సమస్య ఎదురైనప్పుడు, తన నిస్సహాయతను వెల్లడించే ఆయుధంగా కావ్యరచన చేయడం తిమ్మక్క ప్రత్యేకత.

అన్నమయ్యకు ఇద్దరు భార్యలని చరిత్ర చెబుతోంది. వారే తిమ్మక్క, అక్కలమ్మలు. తిమ్మక్క తన భర్త మరో పెళ్ళి చేసుకున్న వాస్తవాన్ని జీర్ణించుకోలేక, తన మానసిక సంఘర్షణను




మహాభారతంలోని ద్రౌపదికి అన్వయించుకుని, సుభద్రాకల్యాణ మనే పేరుతో కావ్యంలో చెప్పుకుంది.

ఆంధ్రమహాభారతంలోని అర్జునుని తీర్థయాత్రా ఘట్టాన్ని తీసుకుని, తన స్వతంత్ర కల్పనలు జోడించి స్వతంత్ర కావ్యంగా ప్రబంధస్థాయికి తీసుకువెళ్ళింది. ఇందులో శైలి అతిమధురంగా, సులభమైన పదప్రయోగాలతో ద్రాక్షాపాకంలా ఉంటుంది. అవసరమైన చోట వర్ణనలు, ఉపమానాలు, కల్పనలు చేయడం వల్ల సుభద్రాకల్యాణం, కేవలం స్త్రీల గేయకావ్యంగా మాత్రమే కాక ప్రబంధంగా పేరుపొందింది.

ఆనాటి సమాజంలోని ఆచార వ్యవహారాలు ఈ కావ్యంలో ప్రతిబింబిస్తాయి. సొగసైన తెలుగు పలుకుబడులు, జాతీయాలు, సామెతలు, నుడికారపు సొంపులతో అచ్చతెనుగు సంప్రదాయానికి ప్రతీకగా తిమ్మక్క సుభద్రాకల్యాణం భాసించింది. సుభద్రాకల్యాణ రచన శ్రీకృష్ణుని స్తుతించడం కొరకే చేపట్టిందేమోనన్న సందేహమూ రాక తప్పదు.

సుభద్రాకల్యాణం ఆద్యంతం శ్రీకృష్ణుడే దర్శనమిస్తాడు. ఈ కథకు ప్రధాన పాత్రధారి, సూత్రధారి శ్రీకృష్ణుడే. తిమ్మక్క ప్రతిపాదంలోనూ శ్రీకృష్ణస్తుతి చేస్తూ, చేయిస్తూ భక్తిరస ప్రధానంగా కథను నడిపి ఆహ్లాదపరిచింది. చివరకు సుభద్రార్జునుల పడకటిల్లు, శోభనపుముచ్చట్లు చెప్పినపుడు కూడా! సుభద్ర అర్జునుని పాదాలకు మొక్కబోగా వారించిన అర్జునుడు -

**యెల్లలోకము - యేలినయట్టి**
**వల్లభుతోడనే - వనిత పుట్టితివి**
**నీపాదముల సేవ - నే జేయవలెను** **(పు.55)**

చెప్పడం తిమ్మక్క యొక్క కృష్ణభక్తికి నిదర్శనం. ముఖ్యంగా స్త్రీలకు, తిమ్మక్క రుక్మిణి ద్వారా హితబోధ చేస్తూ, అత్తవారింటా, భర్తవద్దా మెలగవలసిన తీరును ఈ క్రింది పద్యంలో చక్కగా వివరించింది.

## చతుర్భుజ డాతని కంజలించెదన్

కన్నులు లేనివాడు భువి కన్నులు కల్గినవాడు తోడ్పడన్
తిన్నగనేగు చందమున దీనదయాళుడ వీ వజస్రమున్
నన్ను కృపామతిం గనుచు నాకు హితం బొనరింప నీడ్చితిన్
మన్ననతోడ నీ బ్రదుకు; మా రమణీ రమణా! కృతజ్ఞుడన్. 1

అడుగని వాని దోషమది; అంతియ; లేదను మాట నోట వె
ల్వడినది లేద; ఆర్తజనబాంధవు డాతడు; కోరకుండ ని
చ్చెడి నెఱదాత యాతడు; కుచేలుడు మేడలు వేడెనే? మహా
త్ముడు నిఖిలం బొసంగడె? చతుర్భుజు డాతని కంజలించెదన్. 2

మావిచివుళ్ళ కంటె సుకుమారములై సుకుమారి యిందిరా
దేవి నిజాంకమం దునిచి తియ్యని పల్కుల నొత్త నొప్పచున్
వావిరి నేవి సుస్థిర శుభమ్ము లొసంగునొ జీవకోటి; కా
పావన శేషశైల విభు పాదములన్ సతతంబు గొల్చెదన్. 3

గోవిందా యనుచున్ ముకుందయనుచున్ గోపాలయంచున్ మహా
దేవస్తుత్య పదాబ్జయంచు నిను భక్తింగొల్తు; నింతే ప్రభూ!
ద్యావా పృథ్వ్యవకాశ పూర్ణములు కల్యాణైకతానమ్ము లౌ
భావాతీత భవద్గుణావళుల నిర్వర్ణింప శక్తుండనే? 4

శరదిందూపమ మైన మోమున సుధా స్వచ్ఛోర్ధ్వపుండ్రమ్ముతో,
శిరమందున్ వెలుగొందు వజ్రమకుట శ్రీభూషతో, నూతనా
భరణాలంకృత మంగళాంగములతో భాసిల్లు శేషాచలే
శ్వర! నా మానస పీఠమం దొక నిమేషంబైన కొల్వుండుమా! 5

విపినమునందు దేహమును వీడిన తత్క్షణమే శిలామయం
బపఘనమున్ ధరించి వృషభాద్రికి జేరిననాటి కృష్ణుడే
అపరిమిత ప్రజానివహ మాదట తన్ను భజింప మక్కువన్
విపులసుఖ ప్రదాతయయి విశ్వము నేలుచునున్నవా డహో! 6

చరమశ్లోకార్థము నిజ
చరణములన్ చేతఁజూపి చాటెడు విశ్వం
భరు నితని శరణుఁ జొచ్చుట
మఱచిన మతి లేదు సుగతి మానవ తతికిన్. 7

– ముదివర్తి కొండమాచార్యులు

చనవిచ్చినాడని - సకియరో నీవు
పలుమాటలకు నెట్లు - పాలుపడవద్దు
పొలతి నమ్మగరాదు - పురుషుల నెపుడు
పలురీతి కృష్ణ స - ర్పమ్ములై యుండ్రు

(పు.44)

వివరించిన ఈ మాటలు తిమ్మక్కలోని పరిశీలనాదృష్టికి తార్కాణం.

ఎంతో గంభీరంగా, సౌశీల్యవతిగా, సహనాల రాశిగా, మనస్తత్త్వశాస్త్ర కోవిదు రాలిగా కనిపించే తిమ్మక్కయొక్క అంత రంగంలోని ఆవేదనా వీచిక ఆఖరు ఘట్టంలో మనకు కనిపిస్తుంది. సుభద్రా ర్జునుల సమాగమానికి అవసరమైన ఏర్పా ట్లన్నీ స్వయంగా, అత్యంత రమణీయంగా చేసిన ద్రౌపది, వధూవరులను పడకటింట వదలివచ్చిన తరువాత,

యేమి వస్తువులనైన - నీయవచ్చుగాని
ప్రాణేశు నిచ్చి మరి - బ్రతుకంగ రాదు

(పు-54)

పలికిన ఈ పలుకుల వెనుక ద్రౌపది గాక తిమ్మక్క మనకు సాక్షాత్కరిస్తుంది. అత్యద్భుతమైన ఘట్టాలతో కూడిన ఈ సుభద్రాకల్యాణం 1,163 పాదాలలో రాశిలో చిన్నదైనా, వాసిలో పెద్దదై తెలుగు సాహిత్య చరిత్రలో ప్రముఖస్థానం సంపా దించుకుంది. ఒక మధ్యతరగతి గృహి ణిగా, సతీత్వ బాధ్యతలు నిర్వహిస్తూ, తన అఖండ పాండిత్యాన్ని సహజమైన శైలిలో, సమాజంలోని సాంఘిక దురన్యాయాన్ని సున్నితంగా ఖండించి, స్త్రీలకు చైతన్యం కలి గించిన తిమ్మక్క మహిళా లోకానికే చిర స్మరణీయురాలు.



# బాలవాక్కు!

## అజామిళుని కథ

కన్యాకుబ్జ నగరంలో అజామిళుడనే బ్రాహ్మణ బాలుడు గురుకుల వాసం చేస్తూ; చతుర్వేదాలు భక్తిశ్రద్ధలతో నేర్చుకుంటూ; గురువులకు సేవ చేసుకుంటూ కాలం గడుపుతుండేవాడు.

అజామిళునకు యౌవనదశ వచ్చింది. బలం, కామ వికారం వంటివి ఉత్పన్నమయ్యాయి. ఒకనాడు అజామిళుడు దర్భలు, సమిధలు, పువ్వులు, పండ్లుతేవడం కోసం సమీపంలో ఉండే వనానికి వెళ్లాడు. యజ్ఞసంభారాలన్నింటినీ సమీకరించుకొని; ఒక పువ్వుల పొద వద్దకు వెళ్ళి పువ్వులు కోస్తున్నాడు. సరిగ్గా అదే సమయంలో ఆ పూపొదలలో ఒక పురుషుడు, యౌవనంలో ఉన్న ఒక స్త్రీ మోహావేశంతో లోకాన్నే మర్చిపోయి ఉండటం చూశాడు. అలా చూచిన అజామిళుని మనసు చలించింది! ఇంకేముంది! విద్య, జ్ఞానం, మానం, మర్యాద, పాపభీతి వీటన్నింటిని విడిచిపెట్టి మదవతియైన ఆ స్త్రీ సాంగత్యంలో చిక్కువడిపోయాడు.


**- యం. ప్రేమ్‌సాగర్,**
**S/o సత్యనారాయణ,**
**ఇ.నెం.1-101, అగాపల్లి (గ్రామం), మంచాల్ (మండలం),**
**ఆర్.ఆర్.జిల్లా - పిన్‌కోడ్ - 501 506.**


తన బ్రాహ్మణత్వాన్ని విడిచి పెట్టి వర్ణ సాంకర్యంలో స్వర్గసుఖాలను అనుభవించడానికి సిద్ధపడి ఆమెతోనే జీవితం అంటూ పతితుడైపోయాడు. అలా ఆమెతో కలిసి సంసారం సాగిస్తూ పదిమంది కొడుకుల్ని కూడా కన్నాడు. సంసారయాత్ర కోసం అనేక రకాల నీచమైన కార్యాలు చేసి చెప్పరానంత పాపాన్ని మూటగట్టుకున్నాడు. కొంతకాలానికి ముసలితనం వచ్చింది; కాని సంసార విషయవాంఛలు మాత్రం వీడలేక; తన కొడుకుల్లో చిన్నవాడైన నారాయణుడిపై అజామిళునికి ప్రేమ ఎక్కువ. ఆ కొడుకు ప్రేమలో పడి మొత్తం లోకాన్నే మర్చిపోయేవాడు. తన వృద్ధాప్య ఆఖరిక్షణాల్లో అజామిళునకు మృత్యుఘడియలు సమీపించాయి. అతని మనోనేత్రానికి యమదూతలు కనిపించారు. క్రూరమైన రూపాలతో ఉన్నవారిని చూశాక తనకు చనిపోయే సమయం ఆసన్నమైందని తెలుసుకొని; అజామిళుడు పుత్రున్ని విడిచి వెళ్లడం తప్పదని తెలిసి దుఃఖిస్తూ దేహం అంతా వణుకు పుట్టి ఏదో తెలియని ఆందోళనతో అతడు తన చిన్నకొడుకుని నోరారా "నారాయణా! నారాయణా!!" అని పిలుస్తూనే ప్రాణం విడిచాడు. యమభటులు అతన్ని యమపాశంతో కట్టి యముని వద్దకు బయలుదేరుతూండగా; అదే సమయానికి విష్ణుదూతలు అక్కడికి వచ్చారు. వారిని చూసి యమభటులు ఆశ్చర్యపోయి "అయ్యలారా! ఈ జీవి జీవితకాలం చాలా పాపాలు చేశాడు. యమధర్మరాజు ఆజ్ఞ ప్రకారం ఇతన్ని యమలోకానికి తీసుకువెళుతున్నాం" అన్నారు. అందుకు జవాబుగా శ్రీవారి సేవకులు చిరునవ్వుతో మీరు యముని భటులైతే వినండి! ఈతడు మరణాసన్న సమయంలో తన కుమారుడైన నారాయణున్ని "నారాయణా! నారాయణా!! అని పిలిచి ఆ దేవదేవుడైన నారాయణుని స్మరించాడు. అతను పిలిచింది తన కుమారుణ్ణే ఐనా; అది శ్రీహరి నామం కాబట్టి; ఆ ప్రాణి చేసిన నానాపాపాలు అంతటితోనే నశించిపోయాయి. కాబట్టి ఎలాంటి కష్టసమయంలోనైనా ఆ శ్రీమన్నారాయణుని నామాన్ని పలికిన వారికి యమబాధలుండవు; అన్న విష్ణుదూతల మాటలకు యమభటులు తెల్లబోయి మరో మాట మాట్లాడక అజామిళుని జీవాన్ని బంధవిముక్తి చేసి అక్కడి నుండి వెళ్ళిపోయారు. అటుపై విష్ణుదూతలు అజామిళుని తమ దివ్యవిమానంలోని కెక్కించుకొని వైకుంఠానికి తీసుకెళ్ళారు.

దీన్ని బట్టి తెలిసిందేమంటే; యవ్వనదశలో తెలిసీ తెలియక చేసిన పాపాల నుండి విముక్తి పొందడానికి, కనీసం వృద్ధాప్యంలోనైనా కొంతవరకు భగవంతుని ధ్యానం చేయడం చాలా ఉత్తమమైందని గ్రహించాలి.

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 04-03-2011

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమం ద్వారా భక్తులు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాం.)*

**1.** **ఈ మధ్య మేము తిరుమలకు వచ్చాము. సీనియర్ సిటిజన్లకు దర్శనం ఆరోజు చాలా ఆలస్యమైంది.**

**2.** **అర్హత ఉన్నవాళ్ళను మాత్రమే ముందుగానే పరిశీలించి కూర్చోబెడితే బాగుంటుంది. వర్షం వస్తే చాలా ఇబ్బందిగా ఉంది.** – *బాలాజి, విజయనగరం.*

**కార్యనిర్వహణాధికారి:** చూసి, ఆలోచించి, సరిచేస్తాం.

**కేశఖండనంలో ఉద్యోగస్తులు షిఫ్ట్ ఛేంజ్ అయ్యేటప్పుడు భక్తులకు చాలా ఆలస్యమవుతున్నది.** – *గుప్త, వైజాగ్.*

**కార్యనిర్వహణాధికారి:** షిఫ్ట్ ఛేంజింగ్ అయ్యేటప్పుడు ఆలస్యం కాకుండా చూడాలని అధికారులను ఆదేశిస్తాం.

**ఇంటర్‌నెట్‌లో కొన్ని కార్డులకు మాత్రమే సౌకర్యం ఉంది. ఎ.టి.ఎమ్. కార్డు, డెబిట్ కార్డులు ఆమోదించడం లేదు.** – *వెంకటేష్ బాబు, తనకల్లు.*

**కార్యనిర్వహణాధికారి :** ఏ బ్యాంకుకు సంబంధించిన క్రెడిట్ కార్డులనైనా ఆమోదిస్తుంది. డెబిట్ కార్డులను కూడా త్వరలో ఉపయోగించుకొనేటట్లు ఏర్పాటు చేస్తాం.

**అదనపు లడ్డూ టోకెన్లు ఒక మనిషికి ఒక టికెట్టు మాత్రమే ఇస్తున్నారు. రెండు టికెట్లు ఇస్తే బాగుంటుంది.** – *విజయ, మహబూబ్‌నగర్.*

**కార్యనిర్వహణాధికారి :** ఒక టికెట్టే ఇస్తారు. ఆ టికెట్టుపై నాల్గు లడ్డూలు వస్తాయి. ఇంకా అదనంగా కావాలంటే తిరిగి వరుసలో రావాలి.

**1.** **ఏదైనా సేవకు డి.డి. పంపించినపుడు ఆ సేవ రద్దు అయితే ఆ చెక్కులను తిరుపతిలో క్లియర్ చేసుకొనేటట్లు పంపుతున్నారు. అ చెక్కులను బ్యాంకులో ఇస్తే వాటిపై కమీషన్ చార్జ్ కట్ చేసుకొని మిగిలిన పైకము బ్యాంకు వాళ్ళు ఇస్తున్నారు.**

**2.** **గుర్తింపుకార్డు చూపినా పంపడంలేదు. చాలా దురుసుగా మాట్లాడుతున్నారు.**

**3.** **మేము చాలా సంవత్సరాలక్రితం చేయించుకున్న సేవలను కాన్సిల్ చేస్తున్నట్లు పంపించారు.**

**4.** **సేవాకార్యక్రమాలన్నీ ప్రసారమాధ్యమంలో ప్రచారం చేయండి?** – *సుకుమార్, బెంగుళూరు.*

**కార్యనిర్వహణాధికారి:** 1)రీఫండ్ డి.డి.లకు బ్యాంకువాళ్ళు కమీషన్ తీసుకోకుండా ఉండేటట్లు పరిశీలిస్తాం. 2) గుర్తింపు కార్డు తప్పనిసరి. గుర్తింపుకార్డు సరిగ్గా ఉన్నా కూడా మా ఉద్యోగులు పంపించని యెడల ఫిర్యాదు చేస్తే తగుచర్యలు తీసుకుంటాం. 3)ఒకే వ్యక్తి రెండు మూడు సేవలకన్నా ఎక్కువసేవలు చేయించుకుని ఉన్నట్లైతే అటువంటివారికి ఈ నిర్ణయం తీసుకోవడమైంది. 4)సేవల గురించి ప్రసారమాధ్యమంలో తెలుపుతున్నాం.

**అభిషేకం టికెట్లు దొరుకుతాయా?** –*సుజాత, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి:** ప్రస్తుతం దొరకవు. అలా అని బాధపడక్కర్లేదు. దర్శనానికి గురువారం రాత్రే గనుక వచ్చినట్లైతే, శుక్రవారం తెల్లవారుజామున అభిషేక సమయంలో సర్వదర్శనంలో సామాన్య భక్తులు ఈ అభిషేక సేవను చూస్తూ వెళ్ళవచ్చు.

**గుడిలోని రెండవ ప్రాకారంలో భక్తులకు ప్రసాదం ఇచ్చు చోట భక్తులు ప్రసాదాన్ని చాలా దుర్వినియోగం చేస్తున్నారు. వాటిని క్రింద పడేసి తొక్కుతూ వెళ్తుంటారు. చాలా అపవిత్రంగా ఉంది. వీటిని సరిదిద్దండి.** – రామశేషు, అత్తిలి

**కార్యనిర్వహణాధికారి :** శ్రీవారి సేవకులను పెట్టి అపవిత్రం కాకుండా చూస్తాం.

**అలిపిరిదగ్గరే పాదరక్షలు భద్రపరచుగదిని ఏర్పాటు చేయమని 6,7 నెలల క్రితమే మిమ్మల్నికోరాం. లగేజి భద్రపరచు గదిఏర్పాటు చేశారు. పెద్దబిల్డింగు కూడా కట్టించారు. కాని చెప్పులకు మాత్రం వసతి లేదు.** – *కృష్ణమోహన్, మదనపల్లి.*

**కార్యనిర్వహణాధికారి:** త్వరలో తప్పకుండా ఏర్పాటు చేస్తాం.

అన్నమయ్య దర్శించిన....

# శ్రీ వేంకటేశ్వర తత్త్వం





- జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

తిరుమల విచిత్రమైన కొండ! అద్భుతమైన కొండ! ఎన్నో మహిమలను పుణికి పుచ్చుకున్న కొండ! ఈ కొండలోని రాళ్లూ, రప్పలు, గండ శిలలు, గుట్టలు నిజంగా అవి కానే కావు. అలా కన్పిస్తాయి. అంతే! అవన్నీ అనంతమహిమలు కలిగివున్న చింతా మణులు! రత్నాలరాసులు! భగవంతునికి ప్రతీకలైన సాలగ్రామశిలలు! అసలు ఆ కొండే సాలగ్రామం. అంతే కాదు. ఆ కొండ మీద శ్రీనివాస భగవానుడు సాక్షాత్తు సాలగ్రామ శిలాస్వరూపంలో ఆవిర్భవించాడని పురా ణాలు చెబుతున్నాయి. అందువల్లే శ్రీనివాసుని నందకఖ డ్గాంశ సంభవుడైన అన్నమయ్య చెప్పులు లేని కాళ్లతో తిరుమల కొండను ఎక్కాడు. అంతకు చాలాకాలం ముందే రామానుజాచార్యులవారు సాలగ్రామ మయమైన ఈ కొండే దేవుడు అంటూ మోకాళ్లతో కొండనెక్కాడు. ఆ తర్వాత వ్యాసరాయలు కూడా మోకాళ్ళతోనే నడి చాడని చరిత్ర ప్రసిద్ధి! దీని మహిమలు ఇన్నున్నాయని చెప్ప లేని ఈ కొండ భూలోకవైకుంఠం! ఈ కొండను ఎక్కితే చాలు ఎన్నో పాపాలుపోతాయి. తాకితే చాలు తెలియక చేసిన ఘోరమైన పాతకాలు నశిస్తాయి. మరి ఈ కొండ మీద వీచే చల్లనిగాలులు సోకితేచాలు, అనేక మైన శారీరక రుగ్మతలు, భయంకరమైన కర్మరోగాలు సులభంగా పోతాయి.

ఇక ఈ కొండ మీద జలజలా పారే సెలఏళ్లు, జలపాతాలు, పుష్కరిణులు, అందులోని తీర్థజలాల మహి మలు ఇంతింతని వర్ణించడానికి సాధ్యం కానే కాదు. ఒకప్పుడు బ్రహ్మాదిదేవతలు, కుమారస్వామి, అంజనా దేవి, సప్తర్షులు, తుంబురుడు, నారదుడు, పాండవులు, ఆళ్వారులు, అన్నమాచార్యులు, కన్నడ హరిదాసులు, తరిగొండ వెంగమాంబ ఇలా ఎందరెందరో యుగ యుగాల్లో ఆయా కాలాల్లో ఈ వేంకటాచల పర్వత సానువుల్లో తిరుగాడినారు. వారివారికి నచ్చిన తీరుల్లో మెచ్చిన రీతిల్లో తపస్సులు చేశారు. పవిత్ర స్నానాలు చేశారు. కొండలరాయణ్ణి కీర్తించారు. పునీతులయ్యారు. తరించారు. తాము తరించడమేగాక ఎందరినో తరింప జేశారు. దీనికి ప్రధానకారణం తిరుమల కొండకు ఉన్న అనంతమైన ప్రశస్తి!

## అక్షరామృతం [31]

**మే 17 అన్నమయ్య జయంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసం**

మరి ఇంతటి ప్రశస్తికి ఆ క్షేత్రవైభవం, ఆ స్వామి వారి నామవైభవం, రూపవైభవం, అర్చనావైభవం, తత్త్వ వైభవం మున్నగునవి ప్రధానమైన కారణాలుగా చెప్పు కోవచ్చు.

### క్షేత్రవైభవం :

వేంకటాచల క్షేత్రం యొక్క సత్యమైన, శాశ్వత మైన ఆధ్యాత్మిక తేజోవైభవాన్ని అన్నమాచార్యులు -

**కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ**
**తెట్టెలాయ మహిమలే తిరుమల కొండ ॥**

**వేదములే శిలలై వెలసిన దీ కొండ**
**యే దెస పుణ్యరాసులే ఏరులైన దీ కొండ**
**గాదిలి బ్రహ్మాది లోకముల కొనల కొండ**
**శ్రీదేవు డుండేటి శేషాద్రి యీ కొండ ॥**

అంటూ ఆవిష్కరించగా, ఆయన కుమారుడు పెదతిరుమలాచార్యులు వేంకటాచలక్షేత్ర దివ్యమహత్త్వ ప్రాభవాన్ని ఇలాగ వర్ణించడం విశేషం!

**కొండా! చూతము రారో! కొండొక తిరుమల కొండా**
**కొండని యడిగిన వరము లొసగు మా కొండల తిమ్మయ కొండా॥**
**యిదియె క్షీరాంబుధి యనుచు మరి యిదియె ద్వారక యనుచు**
**యిదియె నందవ్రజ మనుచును మరి యిది దా నయోధ్య యనుచూ**
**యిదియె వైకుంఠం బనుచును యిది పరతత్త్వంబనుచు**
**యిదియె పరమపదం బనుచు వేదముల యెన్నగ గల మా కొండా ॥**

## నామవైభవం :

శ్రీ వేంకటేశ్వరస్వామికి ఎన్నో! ఎన్నెన్నో! పేర్లున్నాయి. అవన్నీ నిజంగా ఆ స్వామివారి అసలైన పేర్లేనా?అంటే అదీ చెప్పలేం. కాని ఒక్కటి మాత్రం నిజం. భక్తులు ప్రియాతిప్రియంగా,ఎంతో ఇష్టంగా తమకు నచ్చిన పేర్లతో ఆయన్ను పిలుచుకుంటున్నవే! అయితే ఆ పేర్లన్నీ అద్భుతంగానూ, విచిత్రంగానూ ఉంటాయి. ఆశ్చర్యంతో పాటు ఆనందాన్ని కూడా కల్గిస్తాయి.

ఆ స్వామివారు తాను ఉన్న స్థలాన్ని బట్టి 'ఏడు కొండలవాడు' అనీ, 'తిరుమలేశుడు' అనీ, 'సప్తగిరీశుడు'అనీ, ఆయన చేస్తున్నపనిని, కార్యాన్ని (డ్యూటీ) బట్టి, 'వేం- పాపాలను, కటః - దహించడం వల్లా, వేం - ఐశ్వర్యాన్ని, సంపదలను, కటః- కటాక్షిస్తున్నందు వల్ల, అనుగ్రహిస్తున్నందు వల్ల, "వేంకటపతి" అని పిలువబడుతున్నాడు. ఇంతేగాక ఈ స్వామి మరొక విచిత్రమైన, వింత అయిన పేరును కలిగి ఉండటం ఆశ్చర్యం! అదీ, తన పత్ని పేరుతో పిలువబడటం! తన వక్షఃస్థలం మీద వెలసి ఉన్న శ్రీ మహాలక్ష్మిని బట్టి, 'శ్రీ నివాసుడు' అనీ. ఇలాగ అనేకమైన పెట్టుడు పేర్లు గల విభవాల దేవుడు వేంకటేశ్వరుడు. తన అసలు పేరేమిటో తెలియని ఈ స్వామివారిని ఏ పేరుతో పిలిచినా, ఎలా భావించినా పలుకుతాడట!

**ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు**
**అంతరాంతరము లెంచి చూడ బిండంతె నిప్పటి యన్నట్లు ॥**
**కొలుతురు మిము వైష్ణవులు కూరిమితో విష్ణుడని**
**పలుకుదురు మిము వేదాంతులు పరబ్రహ్మం బనుచు**
**తలతురు మిము శైవులు తగిన భక్తులును శివుడనుచు**
**అలరి పొగడుదురు కాపాలికులు ఆదిభైరవుడనుచు ॥**

అంటూ ఈ పాటలో శ్రీనివాసుని నామవైభవాన్ని గూర్చి వర్ణించాడు పరమభక్తుడైన అన్నమయ్య.

## రూపవైభవం :

ఆనందనిలయంలో శ్రీనివాసుడు చతుర్భుజుడుగా, శంఖు, చక్రాలతో, కటి వరదహస్తాలతో, ఒక సొంపైన భంగిమలో నిలచి ఉన్న తీరు, రీతి రమణీయం!

'సంసార సాగర సముత్తరణైక సేతో' అన్నట్లుగా, కుడి హస్తంతో తన పాదాలను చూపుతూ, వీటిని శరణు వేడితే చాలు. మీ సంసార సముద్రాన్ని మోకాళ్ల లోతు మాత్రం చేసి సులభంగా దాటించడమే గాక, ఎడమ చేత్తో మిమ్మల్ని అక్కున చేర్చుకుంటానంటూ సందేశమిస్తున్నట్లుగా ఉన్న శ్రీనివాస పరంధాముని భంగిమ విచిత్రాతి విచిత్రం!

మరో విశేష వైభవం ఏమిటంటే, శ్రీ స్వామివారి విగ్రహమూర్తికి ఆభరణాలు అలంకరిస్తే ఒక అందం! ఏ ఆభరణాలు లేకపోయినా సరే మరో అందం! ఆ స్వామివారు అభిషేకంలో సొంపైన అందంతో కనబడుతాడు. ఇక అర్చనలోను, పూలంగిసేవలోను, తిరుప్పావడలోను, నేత్రదర్శనంలోను, ఇలాగ వివిధవేళల్లో, వివిధ సోయగాల్ని చిందించే అందాలతో దర్శనమిస్తూ, భక్తులను ఆనందింపజేయడం భక్తులందరి అనుభవంలో ఉన్న పరమసత్యం. ఆనందనిలయుని నిలువెత్తు అందచందాలను అన్నమయ్య అభిషేకకీర్తనల్లోను, ఇంకా మణిమయ కిరీటహారాది దివ్యాభరణాలతో మిరుమిట్లుగొలిపే నిలువెత్తు కొండలరాయనిమూర్తిని అనేకవిధాలుగా వర్ణించాడు.

## అర్చనావైభవం :

నిత్యకల్యాణ చక్రవర్తి, నిత్యశోభనమూర్తి అయిన శ్రీనివాస ప్రభువునకు వైఖానసాగమం ప్రకారం జరుగుతున్న అర్చనా విధానం, సేవా వైవిధ్యం కూడా వైభవ ప్రాభవాన్ని సంతరించుకుంది. షట్కాలార్చనలతో, నిత్యోత్సవ, వారోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలతో, ఆ యా వేళల్లో నివేదింపబడే దివ్యాన్నాల ఆరగింపులతో, 'న భూతో న భవిష్యతి', అన్న ప్రఖ్యాతి పొందిన కొండల రాయని కొండంత ఈ అర్చనా వైభవాన్ని తాళ్లపాక అన్నమయ్య కూడా అనేక కీర్తనల్లో వర్ణించాడు.

## తత్త్వవైభవం :

తిరుమల వేంకటేశ్వరస్వామి ఎవరు? అసలు ఆయన తత్త్వమేమిటి? ఆ శ్రీనివాస తత్త్వాన్ని ఎవరైనా దర్శించినారా? దర్శిస్తున్నారా? ఎలా దర్శించాలి? దర్శించడానికి ఏమైన అర్హతలుండాలా? అన్న అనేకమైన సందేహ పరంపరలకు చక్కటి సమాధానమిస్తూ, అన్నమాచార్యులవారు తిరుమల మీది పరబ్రహ్మతత్త్వం ఎలాంటిదో వివరిస్తున్నాడు.

**నిత్యాత్ముడై యుండి నిత్యుడై వెలుగొందు**
**సత్యాత్ముడై యుండి సత్యమై తానుండు**
**ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం -**
**స్తుత్యుడీ తిరువేంకటాద్రి విభుడు ॥**

నిరాకారమై, సర్వవ్యాపకమైన, శాశ్వతమైన, సత్యమైన, పరబ్రహ్మ తత్త్వమే, ఈ వేంకటాచల క్షేత్రంలో, సాకారరూపంతో శ్రీ వేంకటేశ్వరుడనే పేరుతో భక్తరక్షణ అనే ప్రధానమిషగా నిలిచి ఉన్నాడంటాడు అన్నమయ్య.

దివ్యమైన ఈ మూర్తి సమస్త లోకాల్లో వ్యాపించి పాలిస్తున్నప్పటికీ, ఆ స్వామి అంత సులువుగా అందరికీ కనబడడనీ, అందుకే, ఆయన దర్శనం కోసం బ్రహ్మాది దేవతలు అర్రులుచాస్తూ అన్వేషిస్తారనీ, ఉపాసిస్తారనీ, సమస్త లోకాల్లోని రూపాలన్నింటిని ధరిస్తున్నప్పటికీ, ఏ రూపమూ ఆయన నిజమైన రూపం కాదనీ, త్రిమూర్త్యాత్మకుడైన ఆ పరమాత్మే ఈ క్షేత్రంలో సులభాతిసులభంగా దర్శనమిస్తూ శ్రీ వేంకటేశ్వరునిగా భాసిస్తున్నాడని, "అణోరణీయాన్ మహతో మహీయాన్' అన్నట్లు వేదప్రతిపాద్యుడైన పరబ్రహ్మమే వేంకటేశ్వరుడనీ అన్నమయ్య వేదతుల్యములైన పదకవితల్లో అణురేణుపరిపూర్ణుడై వ్యాపించిన శ్రీ వేంకటేశ్వరుని తత్త్వాన్ని లోకానికి ఎరుక పరిచాడు.

ఆ తత్త్వాన్ని అందరూ దర్శించలేరని అంటూ, అయితే కొన్ని విశిష్టగుణాలు కలిగివున్న కొందరు మాత్రమే ఆ శ్రీనివాసపరబ్రహ్మతత్త్వాన్ని దర్శించగలరని ఈ కీర్తనలో స్పష్టం చేస్తున్నాడు తత్త్వదర్శి శ్రీ తాళ్లపాక అన్నమయ్య.

**ఇతరులకు నిను నెఱుగ దరమా**
**సతత సత్యవ్రతులు, సంపూర్ణ మోహ విర -**
**హితు లెఱుంగుదురు నిన్ను ఇందిరా రమణా ॥**

**నారీ కటాక్ష పటు నారాచ భయ రహిత**
**శూరు లెరుగుదురు నిను జూచేటి చూపు**
**ఘోర సంసార సంకుల పరిచ్ఛేదులగు**
**ధీరు లెఱుగుదురు నీ దివ్య విగ్రహము ॥**

నిరంతరం సత్యవ్రతులైనవారు, సంపూర్ణంగా సంసార మోహవిరహితులైనవారు మాత్రమే, వేంకటేశ పర్మబ్రహ్మ తత్త్వాన్ని అనుభవించగలరని అన్నమయ్య అంటూ, ఇంకా, సంసార జంజాటాన్ని తెంచుకుని జితేంద్రియులైనవారు, ఘోరసంసారవిముఖులై, వైరాగ్య సంపన్నులైనవారు, పరమభాగవతుల పాదపద్మ సేవా నిరతులైన భక్తులుమాత్రమే ఆ తత్త్వాన్ని చక్కగా దర్శించ గలరు అంటూ వక్కాణిస్తాడు అన్నమాచార్యులవారు.

సరే బాగుంది! మరి జితేంద్రియులు కానట్టి, వైరాగ్య సంపన్నులు కానట్టి సామాన్య సంసారుల మాటేమిటి? పరిస్థితి ఏమిటి? వాళ్లు భగవంతుణ్ణి దర్శించనేలేరా! వీలుపడదా? అని అంటే, అలాంటిదేమీ లేదు.

భక్తి ఉన్నవాళ్లు ఎవరైనా దర్శించవచ్చని జవాబు చెబుతున్నాడు అన్నమయ్య.

**భక్తి కొలది వాడే పరమాత్ముడు**
**భుక్తి ముక్తి దానె యిచ్చు - భువి పరమాత్ముడు ॥**

**పట్టిన వారి చేతిబిడ్డ పరమాత్ముడు**
**బట్ట బయటి ధనము పరమాత్ముడు**
**పట్ట పగటి వెలుగు పరమాత్ముడు**
**ఎట్ట యెదుటనే ఉన్నా డిదె పరమాత్ముడు ॥**

భక్తి ఉంటే చాలట! భక్తులకు కట్టుబడి ఉండడమే గాక, భుక్తినీ, ముక్తినీ ప్రసాదిస్తాడట వేంకటేశ్వరుడు. భగవంతుడు పట్టుకొన్నవారి చేతిబిడ్డవంటి వాడనీ, బయట ఉన్న ధనంలాంటి వాడనీ, పట్టపగటి వెలుగు లాంటి వాడనీ, ఆయన ఎక్కడో కాదు. ఎట్ట ఎదుటనే, వేంకటాచలంలో ఉన్నాడనీ వివరిస్తూ, అన్నమాచార్యులు ఇంకా ఇలా తెలియజేస్తాడు.

పాలలోని వెన్నవలె, సర్వవ్యాపకుడైన పరమాత్మ భక్తికి మాత్రమే సులువుగా లోబడతాడని వ్యాఖ్యానిస్తాడు అన్నమయ్య.

భగవంతుడు పురుషోత్తముడనీ, రూపెత్తిన అనంత దయా స్వరూపమే ఆ స్వామి అంటూ ఈ క్రింది పాట ద్వారా ప్రబోధిస్తాడు పదకవితాపితామహుడు.

**పురుషోత్తముడ వీవు, పురుషాధముడ నేను**
**ధరలో నాయందు మంచితన మేది?**

**అనంతాపరాధములు అటు నేము సేసేవి**
**అనంతమయిన దయ అది నీది !**
**నిను నెఱుగకుండేటి నీచ గుణము నాది**
**నను నెడయకుండే గుణము నీది !**

అనంతమైన దయను చూపడం, భక్తుని ఎడబాయక ఉండడం, సకల రక్షకత్వం చూపడం, శ్రీ వేంకటేశ్వరుని లక్షణాలనీ, అనంత జ్ఞానమే భగవత్తత్త్వం అని వివరిస్తూ అన్నమాచార్యులు దానికి పూర్తిగా వ్యతిరేకమైన లక్షణాలను మానవుడు కలిగిఉంటాడని పేర్కొన్నాడు.

ఇంకోచోట అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ్వర తత్త్వాన్ని చెప్పక చెబుతూ, స్వామీ! నిన్ను చేరడానికి ఉపాయం ఉందా? ఉంటే అది ఏది? ఎందుకంటావా? నీవు ఆదీ అంత్యమూ లేని అచ్యుతమూర్తివి! మరి నిన్ను ఉపాసించే మార్గం ఏదో! అంటూ ఇలా కీర్తిస్తాడు.

**ఏ దుపాయము యే నిన్ను జేరుటకు**
**ఆది నంత్యము లేని అచ్యుతమూరితి**

**వెలయ నీ గుణములు వినుతించే నంటే**
**తెలియ నీవు గుణాతీతుడవు!**
**చెలరేగి నిన్ను మతి జింతించేనంటే**
**మలసి నీవచింత్య మహిముడవు !!**

స్వామీ! ఘనవేంకటప్రభూ! నీ గుణాలను కీర్తించుదామంటే నీవు గుణాలకన్నింటికీ అతీతుడవు! నా మదిలో నిన్ను గూర్చి చింతించుదాం అనుకుంటే, నీవు చింతించుటకు సాధ్యం గాని అనంతమైన మహిమలు కలవాడివి. మరి నా చేతులతో పూజిద్దామంటే, నీవు సాధ్యం కాని విశ్వకాయుడవు. ఏదైనా నీకు సమర్పించుదామంటే, అన్ని కోరికలు తీరిన వాడివి. నా కన్నులతో చూద్దామంటే, నీవు అగోచరుడవు. అందువల్ల ఓ వేంకటేశా! అన్నింటిలో మేలైనది, నీకు శరణు అనడమే! నిన్ను శరణాగతి పొందడమే! అదే ఉత్తమమైనది.

సాలగ్రామ శిలామూర్తి అయిన శ్రీ వేంకటేశ్వరుని విగ్రహం కేవలం ఒక్కటే! అయినా ఆ విగ్రహ మూర్తిని ఆలంబనం చేసుకొని, ఆధారం చేసుకుని, చెప్పిన రీతిలో చెప్పకుండా, వర్ణించిన తీరులో వర్ణించకుండా, వైవిధ్యభరితమైన దృక్కోణాల్లో పరమభక్తుడైన అన్నమాచార్యులు సుమారు 32 వేల పదకవితల్లో శ్రీ వేంకటేశ్వర తత్త్వ వైభవ ప్రాభవాన్ని ఆవిష్కరించిన తీరు రమణీయం! అద్భుతం! ఆనందకరం!

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

| క్ర.సంఖ్య | పుస్తకం పేరు | రచయిత పేరు | ధర |
|---|---|---|---|
| 1. | అన్నమాచార్య జీవిత చరిత్ర (పీఠిక) | వేటూరి ప్రభాకర శాస్త్రి | 25.00 |
| 2. | అన్నమాచార్య సంకీర్తనామృతం | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | 75.00 |
| 3. | భాగవత సుధాలహరి - సంపుటం-1 | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 95.00 |
| 4. | భాగవత సుధాలహరి - సంపుటం-2 | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 90.00 |
| 5. | భాగవత సుధాలహరి - సంపుటం-3 | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 80.00 |
| 6. | ద్వాదశ సూరి చరిత్ర | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 30.00 |
| 7. | ముక్తికాంతా విలాసము | తరిగొండ వెంగమాంబ | 15.00 |
| 8. | ముత్తుస్వామి దీక్షితుల కృతులు - శివశక్తితత్త్వము | డా॥ వి.లలిత అన్నపూర్ణారావు | 90.00 |
| 9. | విష్ణుపారిజాతం | తరిగొండ వెంగమాంబ | 35.00 |
| 10. | విదుషీమణి వెంగమాంబ | ఆంధ్ర శేషగిరి రావు | 30.00 |
| 11. | తెలుగు మెరుగులు | వేటూరి ప్రభాకర శాస్త్రి | 30.00 |
| 12. | తరిగొండ వెంగమాంబ కృతులు - పరిశీలనము | డా॥ కె.జె.కృష్ణమూర్తి | 70.00 |
| 13. | తరిగొండ వెంగమాంబ విజయము | పరిష్కరణ- డా॥ కె.జె.కృష్ణమూర్తి | 20.00 |
| 14. | తరిగొండ వెంగమాంబ చరిత్రము | పరిష్కరణ- డా॥ కె.జె.కృష్ణమూర్తి | 20.00 |
| 15. | చారుదత్త నాటకం | చిలకమర్తి లక్ష్మీనరసింహము | 5.00 |
| 16. | చెంచునాటకం | తరిగొండ వెంగమాంబ | 10.00 |
| 17. | వసిష్ఠ రామాయణం | తరిగొండ వెంగమాంబ | 65.00 |
| 18. | అక్షరామృతం | తి.తి.దే. ప్రత్యేక సంచిక | 180.00 |
| 19. | ఆదిత్య హృదయము | డా॥ఇలపావులూరి పాండురంగారావు | 5.00 |
| 20. | అమృతసారము | ముదివర్తి కొండమాచార్యులు | 68.00 |
| 21. | ఆనందనిలయం | జూలకంటి బాలసుబ్రహ్మణ్యం | 20.00 |
| 22. | ఆనందనిలయం (పద్యకావ్యం) | ముదివర్తి కొండమాచార్యులు | 48.00 |
| 23. | అన్నమయ్య సంకీర్తనాస్వరమాధురి | జి.నాగేశ్వర నాయుడు | 15.00 |
| 24. | అవిమారకము | చిలకమర్తి లక్ష్మీనరసింహము | 5.00 |
| 25. | ఆండాళ్ వైభవం | కల్లూరి చంద్రమౌళి | 12.00 |

# నాలుగు రకాల జనులు

\- ఈశ్వర్

లోకంలో రకరకాల మనస్తత్త్వాలు గలవారున్నారు. వీరిని 4 రకాలుగా విభజించారు శాస్త్రకారులు.

**1. అత్యుత్తముడు :** తన సుఖంగాని, తన క్షేమంగాని తనకు పట్టదు. తనను తాను మరచి, పరోపకారంలో లీనమై నిరంతరం పరుల సుఖం కోసమే పాటుబడతాడు. ఇతరుల సేవకే జీవితం అర్పిస్తాడు. తన కడుపు కాలుతున్నా ఎదుటివాని కడుపు చల్లబడుటకు సహకరిస్తాడు. ఎదుటివాని సుఖమే తన సుఖంగా భావిస్తాడు.

తనకు నష్టం కలిగినా, కష్టం కలిగినా బాధ పొందదు. కాని ఎదుటివానికి కష్టనష్టాలు కలిగితే సహించలేడు. కొవ్వొత్తి లాగా తాను కరుగుతూ ఇతరులకు సహకరిస్తాడు. ఇది అత్యుత్తమమైన నరుని సద్గుణము. ఇట్టి సద్గుణాలు కలవారు సమాజానికి సదా అవసరం. ఇట్టివారు ఎక్కడో కోటికొకరు మనకు కనిపిస్తారు.

ఎవరైనా తప్పుచేస్తే అది పొరపాటున జరిగిందని అతనికి చక్కటి హితోపదేశం చేసి, తిరిగి ఆ తప్పును అతను చేయకుండునట్లు, అతని మనస్సును మార్చి, మంచి దారిలో పెట్టి, నీతిమంతునిగా చేయుటకు తమ శక్తి - యుక్తుల్ని ఉపయోగిస్తారు. తద్వారా తప్పుచేసిన వ్యక్తిలో సత్పరిణామం కలిగి అతను తిరిగి ఆ తప్పును మరెప్పుడూ చేయుటకు సాహసించడు.

ఈవిధంగా చేయడంతో మనిషి యొక్క మనస్సు శుభపరిణామం పొందగలదు. తద్వారా వ్యక్తి ఏ శిక్షకు లోను కాకుండా ఆత్మపరిశోధనతో సత్ప్రవర్తన గలిగి ఇతరులకు ఆదర్శం కాగలడు. తప్పుచేసిన వ్యక్తిని శిక్షించడానికి ఉపక్రమిస్తే, భయపడి అతడు ఆ తప్పును ఒప్పుగా చూపటంకోసం మరొక తప్పు చేస్తాడు. కనుక అతని మనస్సును ఓదార్చి, బుజ్జగించినచో సత్ఫలితం కలుగుతుంది.



మొదటిరకమైన అత్యుత్తములు చాలాకొద్దిమంది మాత్రమే ఉంటారు. రత్నాలు చాలా ఖరీదు గలవి. కావున, అన్ని చోట్ల దొరకవు. అలాగే రత్నంకంటే విలువైన, పరోపకారం చేస్తూ అత్యుత్తములుగా పేరు పొందినవారు చాలా అరుదుగా కన్పిస్తారు.

**2. ఉత్తముడు :** తన సుఖాన్ని, తన ఉనికిని, కాపాడు కుంటూ ఇతరులకు కూడా సహకరిస్తాడు. తాను తృప్తిగా అన్నం తిని మిగిలిన అన్నంలో కొంత ఇతరులకిస్తాడు. ఉన్నదానిలో సహాయసహకారాలు అందిస్తాడు. ఇతరులను బాధించడు. తాను బాధపడడు. ఇదీ సద్గుణమే. ఇలాంటివారు సమాజంలో కొంతమంది కన్పిస్తారు. అత్యుత్తములు కాకపోయినా ఉత్తము లుగా తయారైనా మంచిదే. ఈ రెండురకాల వారి వల్ల సమాజానికి మేలే జరుగుతుంది.

**3. అధముడు:** తన పొట్టను నింపుకోవడం కోసం ఇతరుల పొట్టకొడతాడు. తనసుఖం కోసం ఇతరుల్ని కష్టపెడ్తాడు. అంతా స్వార్థమే. నరనరానా స్వార్థమే నిండి ఉంటుంది.

స్వార్థమే తప్ప పరమార్థమే ఉండదు. తను, తన ఇల్లు, తన కుటుంబం, 'నాది, నాది' అనే మమకారంతో నలిగి పోతుంటాడు. ఎవరి కుటుంబాలు నాశనం చేస్తే తన కుటుంబం నిండుతుంది, ఎవరికి ద్రోహం చేస్తే తనకు ఉపయోగ ముంటుందనే నిరంతర తపన కలిగి ఉంటాడు. ఇదీ ఒక రకమైన దుర్గణమే.

**4. అధమాధముడు :** అధముడైనా కాస్తమెరుగు. స్వలాభాపేక్షతో ఇతరులకు హానిచేస్తాడు. కానీ అధమాధముడైన వాడు తనకు అవసరం లేకున్నా అనవసరంగా కీడుచేస్తాడు.

ఇలాంటి వాణ్ణి చూచే మన పూర్వీకులు దుష్టునికి దూరంగా ఉండుమన్నారు. తాను చేసే పనియందు తనకు ఉప యోగం ఇసుమంత ఉండకపోగా ఎదుటివానికి చెడు మాత్రం జరుగుతుందని ఖచ్చితంగా చెప్పవచ్చు.

## శ్రీపదకేళి - 22 (మార్చి - 2011)
## విజేతలు

1) **గుర్రం రంగయ్య,**
పద్మాశాలీయ పఠనాలయం,
ఇంటి నెం.4/654, గీతాశ్రమం రోడ్డు,
ప్రొద్దుటూరు - 516 360.

2) **దీవి సీతారామాచార్యులు,**
అర్చకస్వామి,
శ్రీ చిట్టి ఆంజనేయస్వామి గుడి, హనుమాన్ చౌక్,
బోసు రోడ్డు, తెనాలి - 522 201.

3) **డా॥ సి.వి.కె.వై.శర్మ,**
ఇంటి నెం.5-64-75/4,
1 /19, బ్రాడీపేట, గుంటూరు జిల్లా-522 002.

**సరైన సమాధానాలు రాసినవారు :**

వల్లభజోస్యుల జలజ (గుంటూరు); బలివాడ కృష్ణవేణి (చీపురుపల్లి); నల్లపాటి రామకృష్ణ (గుంటూరు); డి.రామస్వామి (అరసవల్లి); వి.వి.మునిరుద్రతేజస్వి (ప్రొద్దుటూరు); కె.ఆనందపిళ్లై (చిత్తూరు); విరి (హిందూపూర్); ముత్తారెడ్డి వెంగళరెడ్డి (మార్కాపురం); రామకూరు లక్ష్మి (శ్రీకాకుళం); వంగవేటి వెంకటేశ్వర్లు (బేతవోలు); వూటుకూరి రామయ్య (మార్కాపురం); ఓ.ఇందిరాదేవి (ఒంగోలు); వేదాన్తం శ్రీనాథ్ (తెనాలి); తిన్నవెల్లి నరసింహరావు (మార్కాపురం); విజాపురపు నరసింగరావు (సికింద్రాబాదు); చెన్నా వెంకట సుబ్బన్న (ప్రొద్దుటూరు); ఎ.చంద్రశేఖర్ (ప్రొద్దుటూరు); టి.బి.సుజన (తిరుపతి); చెన్నా వెంకటేశ్వర్లు (ప్రొద్దుటూరు); గండ్లూరి బలరామశాస్త్రి (నాచారం); అప్పాజి (రాయచోటి); మునిగోటి కృష్ణమూర్తి (తిరుపతి); పి.ఆర్.నాయుడు (తిరుపతి); కె.సౌదామిని (అనంతపురం); బి.విజయలక్ష్మి (చిలకలపూడి); సావిత్రిశర్మ (అనంతపురం); ఎం.పార్థసారథి ఆచార్యులు (వరంగల్); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); జి.అనంతపద్మనాభయ్య (అనంతపురం); కర్రి లలిత (అనకాపల్లి); కే.వీరభద్రయ్య (నంద్యాల); బి.రామమోహన్‌రావు (హైదరాబాదు); విల్లూరి ప్రశాంత్ (అనకాపల్లి); బి.బ్రహ్మ లింగస్వామి (గోవాడ); డి.వి.నరసింహారావు (హైదరాబాదు); బి.వెంకటేశ్వరరావు(విజయనగరం); టి.ధనలక్ష్మి(మధురవాడ).

### నిబంధనలు :

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానెంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా ఈ శీర్షికలో పాల్గొనవచ్చు.

### బహుమతి వివరాలు :

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాం. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాం.

### పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | | 2 | | | |
| | | | 3 | | | | | 4 |
| 5 | | | | | | | 6 | |
| | | | | | | | | |
| | 7 | | 8 | | | | | |
| 9 | | | | | | | | |
| | | | | | 10 | | | |
| 11 | | | | | | | | |
| | | | 12 | | | | 13 | |

# శ్రీపదకేళి - 24

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

.......................................................................

.......................................................................

.......................................................................

.......................................................................

.......................................................................

**2) మీరు సప్తగిరి చందాదారులైతే?**

అ) చందా నంబరు : ....................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ....................................

.......................................................................

.......................................................................

.......................................................................

.......................................................................

.......................................................................

## ఆధారాలు

**అడ్డం**

**1)** శకుంతలను పెంచిన మహర్షి (3)

**2)** ఉజ్జయినీ దేశపు రాజధాని (3)

**5)** శ్రీరామచంద్రుని కుమారుడైన కుశుని భార్య (4)

**6)** ధృతరాష్ట్రుని భార్య, ఈమె యుయుత్సునికి తల్లి (2)

**7)** ద్రోణాచార్యులు ఇతని వేలును గురుదక్షిణగా అడిగాడు (5)

**10)** శ్రీకృష్ణబలరాములకు విద్యనొసగిన గురువు (4)

**11)** లోభికి పర్యాయపదం (3)

**12)** రావణాసురుని ముద్దుల కుమారుణ్ణి హనుమంతుడు సంహరించాడు (3)

**13)** చండముండులను సంహరించిన అమ్మవారు (2)

**నిలువు**

**1)** దుర్యోధనుని మంత్రి (4)

**2)** భరద్వాజుని పుత్రుడు (5)

**3)** దైత్యులతల్లి (2)

**4)** లవంగము (3)

**8)** మద్రదేశపు రాజు కుమార్తె శ్రీకృష్ణుని భార్య (3)

**9)** రావణాసురుని పురోహితుడు (4)

**10)** జాంబవతి యందు శ్రీకృష్ణునికి పుట్టిన కుమారుడు (3)

### —:: *శ్రీపదకేళి–22* (మార్చి, 2011) సమాధానాలు ::—

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 శ్రీ | మ | తి | | 2 మ | 3 తం | గు | డు | |
| వా | | | 4 పి | | బు | | | 5 సో |
| 6 రి | క్క | | నా | | 7 ర | మ | | మ |
| మె | | | క | | | | | శ్ర |
| ట్లు | | 8 స | ము | ద్రి | | 9 క | డు | వ |
| | 10 సుం | | | | | ల | | సు |
| 11 స్కం | దు | డు | | | 12 స్వా | యం | భు | వు |
| | డు | | | | | పి | | |
| | | 13 క | శ్య | పు | డు | | 14 స్వా | హ |




- జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ రాశివారికి అనవసర ఖర్చులు, నమ్మిన వ్యక్తుల వల్ల మోసాలు, వృథాశ్రమ తదితర ఇబ్బందులు ఏర్పడుతాయి. వృత్తి వ్యాపారాల్లో పలు సమస్యలు ఎదురౌతాయి. వివాహ ప్రయత్నాలకు అనుకూలం. పలు అనారోగ్యాలు కలిగే అవకాశం ఉంది. మొదటివారం ఆందోళన, రెండోవారం శుభవార్తాశ్రవణం, మూడోవారం వృథాఖర్చులు, నాలుగోవారం అనారోగ్యం.



## వృషభ రాశి

ఈ రాశివారికి నూతనవస్తువుల కొనుగోలు, గృహంలో మార్పులు చేర్పులకు అనుకూలం. దైవచింతనపై ఆసక్తి. సుదీర్ఘ కాలంగా ఎదురుచూస్తున్న వృత్తి, ఉద్యోగాల్లో రాణింపు. ఆర్థికంగా మంచి ఉన్నతస్థితిలో ఉంటారు. పసుపు, కొబ్బరి బొండం వ్యాపారులకు లాభార్జన. విహారయాత్రలు, దైవదర్శనాలకు అనుకూలం. మొదటివారం కార్యజయం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం ఆనందం, నాలుగోవారం పదవీ యోగం.



## మిథున రాశి

ఈ రాశివారికి అనారోగ్యం కోసం ధనం విపరీతంగా ఖర్చు చేయవలసి వస్తుంది. స్త్రీలకు థైరాయిడ్ లాంటి సమస్యలు అధికమవుతాయి. ఆర్థిక సమస్యలు ఆందోళనకు గురిచేస్తాయి. స్త్రీలకు సౌభాగ్యవ్రతాలు నవగ్రహ శాంతిపూజలు అనుకూలం, మేలు చేస్తాయి. మొదటివారం ఆరోగ్యసమస్యలు, రెండోవారం భర్తతోవిరోధం, మూడోవారం దైవచింతన, నాలుగోవారం ధనాదాయం.



## కర్కాటక రాశి

ఈ రాశివారికి కొత్తవ్యక్తుల పరిచయాలు, నూతన వ్యాపారాలు, క్షేత్రదర్శనాలు అనుకూలం. భూ, గృహనిర్మాణాలు పూర్తి అయి మానసికానందాన్నిస్తాయి. విద్యార్థులు విదేశీచదువులకై చేయు ప్రయత్నాలు పరిపూర్ణం అవుతాయి. బంగారు ఆభరణాలకు, ఇంట్లో శుభకార్యాలకు ధనం ఖర్చు చేస్తారు. ఉద్యోగులకు ఉన్నత పదవీయోగం. రిటైర్డ్ ఉద్యోగులకు ప్రభుత్వాదేశాలు ఆందోళనకు గురిచేస్తాయి. మొదటివారం శుభకార్యం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం ఆనందం, నాలుగోవారం వృథాశ్రమ.



## సింహ రాశి

ఈ రాశివారికి వృత్తివ్యాపారాల్లో ఒత్తిడి, వృథా శ్రమ, వృథాఖర్చు, ప్రమాదాలు తదితర ఇబ్బందులు ఏర్పడుతాయి. వృత్తి, వ్యాపారాల్లో కొత్త వ్యక్తుల రాక, ప్రభుత్వ ఆదేశాలు ఒత్తిడికి గురిచేస్తాయి. శ్రమకు తగ్గ ప్రతిఫలం లేకపోవటం, సుదూర ప్రాంత ప్రయాణాలు చేయటం వల్ల ప్రమాదాలు కల్గుతాయి. మొదటివారం ధనలాభం, రెండోవారం ఒత్తిడి, మూడోవారం వృథాప్రయాణం, నాలుగోవారం వస్తుకొనుగోలు.



## కన్యా రాశి

ఈ రాశివారికి తొందరపాటు నిర్ణయాలు పలు విమర్శలకు గురిచేస్తాయి. భర్త సహకారం, దైవానుకూలత వల్ల కఠిన సమస్యలు సైతం పరిష్కారమౌతాయి. మహిళలు అన్ని రంగాల్లో రాణించి మార్గదర్శకులవుతారు. భూమి, వస్తువులు, ఆభరణాల కొనుగోలు మానసికానందాన్నిస్తాయి. దైవానుగ్రహం కోసం క్షేత్రదర్శనం మేలు చేస్తుంది. వాక్చాతుర్యంతో బంధుమిత్రుల ప్రశంసలు పొందుతారు. లలితాసహస్రనామ పారాయణం వల్ల ఆనందం కల్గుతుంది. మొదటివారం దైవచింతన, రెండోవారం ఆనందం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం ప్రయత్న ఫలం.



## తులా రాశి

ఈ రాశివారికి జన్మనక్షత్రంలో శని సంచారం శుభకరంగా ఉన్నా గతంలో చేసిన పొరపాట్లు గ్రహపాటుగా మారుతాయి. గృహమార్పువల్ల ధనవృద్ధి. వృత్తి ఉద్యోగాల్లో అధికారుల ఒత్తిడి ఇబ్బందులకు గురిచేస్తుంది. ఫైనాన్స్ ఉద్యోగులకు కింది స్థాయి ఉద్యోగుల వల్ల ధననష్టం ఏర్పడే అవకాశం ఉంది. వాహన ప్రమాదం, జాగ్రత్త వహించండి. తల్లిదండ్రులతో విరోధం అశాంతికి గురిచేస్తుంది. మొదటివారం కార్యవిఘ్నం, రెండోవారం నరదృష్టి, మూడోవారం ధననష్టం, నాలుగోవారం పనులలో ఆటంకాలు.



## వృశ్చిక రాశి

ఈ రాశివారికి విలువైన వస్తువుల అపహరణ, అనారోగ్యం, ఆర్థిక ఇబ్బందులు ఏర్పడే అవకాశం ఉంది. అనారోగ్య సమస్యలు. ఉద్యోగులకు బదిలీ ప్రయత్నాలు అనుకూలం. స్టేషనరీ, ప్రింటింగ్ మరియు కళాకారులకు సదవకాశాలు, ధనలాభం. నిరుద్యోగులకు, అవివాహితులకు శుభవార్తాశ్రవణం. మొదటివారం అనారోగ్యం, రెండోవారం ఆనందం, మూడోవారం బదిలీలు, నాలుగోవారం ధనలాభం.



## ధనూ రాశి

ఈ రాశివారికి కొన్ని ప్రతికూల ఫలితాలు ఎదురౌతాయి. దంపతుల మధ్య కలహాలు, కలతలు చోటు చేసుకుంటాయి. ప్రతి విషయంలోను ఆచితూచి వ్యవహరించాల్సి ఉంటుంది. మీ మాటే నెగ్గాలన్న పంతం విడనాడండి. ఖర్చులు అధికమై అప్పులు చేయాల్సి ఉంటుంది. స్త్రీలకు వస్త్రవస్తులాభం. విద్యార్థులకు దూరప్రదేశాల్లో ఉన్నత విద్యావకాశాలు లభిస్తాయి. ఉద్యోగస్తులకు అధికారుల నుంచి ఒత్తిడి పెరుగుతుంది. మొదటివారం కలహాలు, రెండోవారం అధికఖర్చులు, మూడోవారం ధనాభివృద్ధి, నాలుగోవారం స్థానచలనం.



## మకర రాశి

ఈ రాశివారు ఆర్థికంగా పురోగమించటానికి మరింత శ్రమించాల్సి ఉంటుంది. నూతన వ్యాపారాలు, గృహ నిర్మాణాలు చేపడుతారు. స్త్రీలకు ఉన్నత రాజకీయ పదవీయోగం. ఉద్యోగ, వివాహప్రయత్నాలు ఫలిస్తాయి. పెండింగులో ఉన్న కోర్టు వ్యవహారాలు, ఆస్తి పంపకాలు ఒక కొలిక్కివస్తాయి. మొదటివారం అధికశ్రమ, రెండోవారం పదవీప్రాప్తి, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ఆనందం.



## కుంభ రాశి

ఈ రాశివారు తరుచుగా దైవ, శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల రాకపోకలు ఆనందాన్నిస్తాయి. వివాహానికి విపరీతమైన ధనం ఖర్చు చేయవలసి ఉంటుంది. ద్విచక్ర వాహనాలపై దూర ప్రయాణాలు ప్రమాదాలకు కారణం అవుతాయి. స్త్రీలకు ఆరోగ్య విషయంలో తగు జాగ్రత్తలు అవసరం. బ్యాంకు, రెవెన్యూ, పోస్టల్, ఆర్.టి.సి. ఉద్యోగులకు ప్రభుత్వ ఆదేశాలు ఆందోళన కల్గిస్తాయి. పత్రిక, సినీరచయితలకు; వెండి, బంగారం వర్తకులకు; పసుపు వ్యాపారులకు ధనయోగం. మొదటివారం ఆనందం, రెండోవారం వృథాఖర్చు, మూడోవారం ఆందోళన, నాలుగోవారం ధనయోగం.



## మీన రాశి

ఈ రాశివారికి మీ ఓర్పు, నేర్పులకు పరీక్షా సమయం. ప్రతి విషయంలోను ఆచితూచి వ్యవహరించాల్సి ఉంటుంది. కావలసిన ధనం సమయానికి అందకపోవటం వల్ల స్వల్ప ఆటుపోట్లు. ఆకస్మిక ఖర్చులు, ప్రమాదాలు ఆందోళన కల్గిస్తాయి. ఉద్యోగస్తులు అధికారుల తీరును గమనించి మెలగవలసి ఉంటుంది. గృహంలో ఒక శుభకార్యం జరిగే అవకాశం ఉంది. నమ్మిన వ్యక్తుల నుండి విలువైన వస్తువులు, పత్రాలు చేజారిపోయే ఆస్కారం ఉంది. అనారోగ్య సూచనలు. మొదటివారం స్వల్ప ధనాదాయం, రెండోవారం విందువినోదాలు, మూడోవారం ధననష్టం, నాలుగోవారం వ్యవహారజయం.

**మీ కానుకలను శ్రీవారి 'హుండీ'లోనే సమర్పించండి.**
**తిరుమలలో కరెంటు, నీరు వృథా చేయకండి.**
**తిరుమలలో వసతికై దళారీలను ఆశ్రయించకండి.**
**వీధి వర్తకులవద్ద నకిలీ ప్రసాదాలు కొనకండి.**
**ఆలయ పరిసరాలను అపరిశుభ్రం చేయకండి.**

# ఆశ్రితకల్పతరువు

– చిప్పగిరి స్వాతి




**మే**ము ప్రస్తుతం హైదరాబాదులో నివసిస్తున్నాము. మా తల్లిదండ్రులకు నేను ఒక్కటే సంతానం. మా జీవితం ఏదో మామూలుగా సాగిపోయేది. 2005లో నేను, నా డిగ్రీ పూర్తయిన అనంతరం యానిమేషన్ కోర్సు కోసం చిక్కడపల్లిలోని ఒక ఇన్‌స్టిట్యూట్‌లో చేరాను. అది శ్రీ వేంకటేశ్వర ఆలయానికి చాలా దగ్గరలో ఉండేది. నేను ప్రతిరోజూ గుడికి వెళ్ళేదాన్ని. నాలో ఆ దైవం పట్ల ఉన్న అభిమానాన్ని గమనించి నా సహాధ్యాయి ఒకనాడు నాకు శ్రీస్వామి వారి ఏడువారాల వ్రతాన్ని వివరించింది. అది విని నేను కేవలం ఆసక్తితో ఆచరించడం ప్రారంభించాను. నేను ఏడు వారాల వ్రతం ఏ కోరికలను ఆశించి చేయకపోయినా వ్రతం తర్వాత అనుకోని ఫలితాలను పొందటం మొదలైంది. ఆ తర్వాత నా యానిమేషన్ కోర్సు ముగిసింది. ఆ తర్వాత ఎక్కువ శ్రమపడకుండానే మంచి ఉద్యోగం లభించింది. ఐటి మార్కెట్ పడిపోయి ఉద్యోగాలు ఊడిపోతున్న సమయంలో సైతం నాకు ఇంక్రిమెంట్లు రావడం కేవలం స్వామివారి వ్రతాచరణ ఫలాలే! ఇలా 2009లో నా జీవితంలో మెట్టుపై మెట్టు ఎక్కుతూనే వచ్చాను.

2009లో మా తల్లిదండ్రులు నా వివాహప్రయత్నాలను మొదలుపెట్టారు. ఇప్పటి నుంచి వెదకడం మొదలుపెడితే ఎప్పటికయ్యేను అని అనుకున్నాను. కాని, స్వామివారి ఆశీస్సులతో మావాళ్ళు చూసిన రెండవ సంబంధమే నిశ్చయమైంది. మా కన్నా ఎంతో స్థితిమంతులైన వారు నన్ను చూడడం, చూసిన వెంటనే ఒప్పుకోవడం, లాంఛనంగా పెళ్ళి నిశ్చయమైపోవడం కేవలం మూడు రోజుల్లోనే జరిగిపోయింది. ఇదంతా కూడా నేను స్వామివారి ఏడువారాల వ్రతాచార సమయంలోనే జరగడం విశేషం.

పెళ్ళైతే నిశ్చయమైంది. కానీ, ఖర్చుల సంగతికి వచ్చే సరికి మళ్ళీ సమస్య ఎదురైంది. ఐటీ రంగం పడిపోవడంతో రియల్ ఎస్టేట్ రంగం కూడా కూలబడిపోయింది. నా పెళ్ళి కోసం మా తల్లిదండ్రులు ముందు జాగ్రత్తగా కొన్న ప్లాట్ అమ్ముడుపోలేదు. పెళ్ళిఖర్చులకై తల్లడిల్లుతున్నా; స్వామివారిపై ఉన్న విశ్వాసంతో నాతో మరోసారి ఏడువారాలవ్రతాన్ని చేయించింది మా అమ్మ. ఆశ్చర్యంగా ఆ స్వామి మరోసారి తన కరుణని నిరూపించారు. మా ప్లాట్ అమ్ముడయ్యే సమయానికి సరిగ్గా డబ్బు మా చేతికి అందింది.

పెళ్ళి చాలా ఘనంగా జరిగింది. అంతే కాకుండా సరిగ్గా నన్ను పెళ్లికూతుర్ని చేసిన రోజే మా కాబోయే శ్రీవారికి సీనియర్ సిస్టమ్ ఇంజనీర్‌గా పదోన్నతి వచ్చింది. చివరగా పెళ్ళినాటి సాయంకాలం శ్రీవారి కరుణాకటాక్షాలకు ఋజువుగా శ్రీవారి ప్రసాదం కూడా అందింది. ఇంత కన్నా ఆయన లీలలకు ప్రత్యక్ష ప్రమాణం వేరే ఇంకేంకావాలి? ఇలా స్వామివారి ఆశీస్సులను అందుకోవడం కంటే మరింకేం కావాలి?

కలియుగ ప్రత్యక్షదైవం, ఆశ్రితకల్పతరువైన ఆ శ్రీ వేంకటేశ్వరుని ఆశీస్సులు మాపైననే కాకుండా ప్రపంచంలోని అందరిపై కూడా ఉండాలని కోరుకుంటున్నాను.

**ఒక ఎలుక (పాములవాని ఇంట) రాత్రివేళ ఆహారం కోసం అన్వేషిస్తూ ఒక పెట్టెకు కన్నం వేసి అందులో దూరింది. అంతకు ముందే ఆ పెట్టెలో బంధింపబడివున్న పాము ఇక వెలుపలికి వెళ్లే ఆశ లేదనుకొని అక్కడే చుట్టచుట్టుకొని ఇంద్రియ పాటవం కోల్పోయి ఆకలితో అలమటిస్తూ ఉండింది. ఎలుక తనంతతానే పోయి ఆ పాము నోట పడింది. పాము దాన్ని మ్రింగి ఆకలి తీర్చుకొని ఆ కన్నం గుండానే చరచరా వెలుపలికి వెళ్ళింది. వృద్ధి వినాశాలకు దైవమే కారణం. కాబట్టి మీరు కూడా దైవం మీద భారంవేసి నిశ్చింతగా ఉండండి!**




**ధారావాహిక - 100**

**(దేవాలయాల్లో ముఖ్యంగా తిరుమల ఆలయంలో జరిగే పూజలు సక్రమంగా జరగడం కోసం దాతలు చేసిన దానవివరాలు, వాటి ధనవిలువను తెలిపే ప్రయత్నం జరిగింది. ఆలయానికి ఇచ్చిన గ్రామాలు కానీ, భూమి కానీ వాటిపై వచ్చే ఆదాయం విలువ; దేవాలయ గ్రామాలపై గాని; భూమిపై గాని పెట్టుబడి పెట్టినపుడు దాని ద్వారా వచ్చే ఆదాయం; ఆదాయ విలువను తెలిపే ప్రయత్నం ఈ సంచికలో తెలుపబడింది.)**

పై విధంగా, దాతలను వర్గాలుగాను, వారు చేసిన దానాలను భూరూప ధనరూప దానాలుగ వర్గీకరణ చేసినపుడు బహిర్గతమైన కొన్ని సాంఘిక ఆర్థికపరమైన కొన్ని అంశాలు మన ఆలోచనలను రేకెత్తిస్తున్నాయి.

1) షరతులతోకూడిన ఆధారద్రవ్య దేవాలయానికి దానం చేయబడిన సస్యక్షేత్రాలనుండి మొత్తంగా లభించే సాలు సరి రాబడి యెంత? మరియు ఈ ఆదాయం దేవాలయమందు సక్రమంగా ఎట్టికొరత లేకుండే విధంగా పూజాది కార్యక్రమాలను, ఉత్సవాలను జరిపించేందుకు సరిపోతున్నవా?

2) ఒక ప్రత్యేక విశిష్ఠ సంస్థగా దేవాలయం తన ఆర్థిక పరిపుష్ఠిని పెంపొందించుకొనేందుకుగాను వేరే ఏదైన ఆదాయాన్ని సమకూర్చి పెట్టగల ఆర్థికవనరులు ఉన్నాయా?

3) షరతులతోకూడిన ఆధారద్రవ్యంకోసం చేసిన దానభూములను, గ్రామాలను, ధనాన్ని దేవాలయాలకు సంక్రమింపజేసేందుకు దేవాలయ కార్యనిర్వాహకులే అధిక ఉత్సాహం చూపేందుకు వెనుకగల ఆర్థిక హేతువులు ఏమిటి? సాధారణంగా దేవాలయ కార్యనిర్వాహకులు దేవాలయానికి భక్తులు చేసిన ఆధార ద్రవ్య దానాలవలన ప్రయోజనాలు పొందడానికి పూనుకొంటారే కాని తాముగా ఆధారద్రవ్యదానాలను చేసిన వైనం తెలియడం లేదు.

4) దేవాలయానికి ఆదాయరూపాన అచ్యుతదేవ రాయల పరిపాలనాకాలంలో లభించినంత అధికంగా ధనాదాయం, ఇతనికి ముందుండిన కృష్ణదేవరాయల కాలంలో కాని, ఇతనికి తర్వాత వచ్చిన సదాశివరాయల పరిపాలనాకాలంలో గాని లభించి యుండలేదు. కారణమేమై ఉంటుంది?

5) దేవాలయానికి ఆధారద్రవ్యదానంగా ఏ రోజునకు రాబడిగా వచ్చినధనం ఆ రోజునకు లేక ఒక నిర్ణీత దినాన దేవాలయంలో జరిపే పూజాదికార్యక్రమానికై ఒకమారు ఖర్చుగా (one time expenditure) వినియోగింపబడుతుందా? స్పష్టంగా ఫలానావిధంగా వినియోగించవలసినదను షరతుతో చేసిన ఆధార ద్రవ్యదాన ధనం పెట్టుబడిలో పెట్టబడిందా?అటువంటి వయితే అట్టి పెట్టుబడుల తీరు ఏమిటి? లభ్యమగు ఆదాయం యొక్క వివరాలు ఏమిటి?

6) పై ప్రశ్నలకు లభించే ఆర్థిక వివరాలను విశ్లేషించినపుడు, క్రీ.శ.16వ శతాబ్దంలో జనుల ఆర్థికస్థితిగతులను గురించి ఏమి తెలుసుకోగలం?

ఈ కాలపు శాసనాలలోని వివరాలు నిశితంగా పరిశీలించినపుడు పై ప్రశ్నలకు జవాబులు లభించగలవు.

క్రీ.శ.1510 నుండి క్రీ.శ.1570వ సంవత్సరం వరకు గల మధ్యకాలంలో దేవాలయానికి 115 గ్రామాలలోని 62 గ్రామాలు అంటే 54% గ్రామాలు, రాష్ట్రంనందలి దానకర్తల నుండి నేరుగా దేవాలయానికి లభ్యమైనట్లు తెలుస్తోంది. ఆదిని, రాజ్యపరిపాలనాధికారులు, సామంతులు మొదలగువారు దేవా

లయ కార్యనిర్వాహకులకు (పట్టిక 1లో రెండవతరగతి చూడండి.) ధర్మార్థమై కొన్నిభూములు ఇవ్వబడినాయి. వీరిలో అనేకమంది ఈ విధంగా లభించిన గ్రామాల స్థిరాస్థి అనుభవ హక్కును (eleemosynary tenure) దేవాలయానికే దాఖలుపర చారు. (ఈ విషయం స్పష్టంగా నిరూపించి చెప్పడానికి సాధ్యం కాదు. ఎందుకంటే దేవాలయ కార్యనిర్వాహకులు ఎటువంటి సందర్భాలలో ఏ విధంగా పొందిందీ తెలుపగల వివరాలను ఈ శాసనాలు విశదీకరించడం లేదు. కాని 8 సందర్భాలలో మాత్రం దేవాలయ కార్యనిర్వాహకులు దానం చేసిన గ్రామాలను గురించిన వివరాలు లభిస్తున్నాయి. వీటిలో 6 రాష్ట్రానికి సంబంధించిన దాతలచేత, ఒకటి మరొక కార్యకర్తచేతను, వేరొక కార్యకర్త యొక్క స్థానిక ప్రముఖునివద్ద క్రయానికి కొన్న గ్రామం దేవాలయానికి సమర్పించినవి. చూడుము – శాసన సంఖ్యలు 284, 601, 558, 587, 681, 651 టి.టి. మరియు 12,429,347–జి.టి. సామాన్యంగా సర్కారు భూముల తరగతికి, మాన్యపుభూముల తరగతికి సంబంధించిన వారు తప్ప తదితరులకు బ్రహ్మదేయంగా దేవాలయ కార్యనిర్వాహకులకు ఇవ్వబడిన గ్రామాలమీద ఆధిపత్యం, అధికారం లేదు.) ఈ 115గ్రామాల్లో దేవాలయ కార్యనిర్వాహకులు 43 దాకా అంటే 37% ఉన్నారు. దేవాలయానికి నేరుగా దానం చేయబడినవి కొన్ని ఉండగా, మరికొన్ని మధ్యవర్తిత్వం నెరపెడి దేవాలయ కార్యనిర్వాహకులకు సమర్పించబడి, తద్వారా దేవాలయానికి దానంచేసిన గ్రామాలు కొన్ని ఉన్నాయి. మొత్తంమీద ఇటువంటి గ్రామాలు 105 దాకా ఉన్నాయి. కాగా క్రీ.శ. 1509వ సంవత్సరం నుండి క్రీ.శ.1568వ సంవత్సరం వరకూ మధ్యగల 60 సంవత్సరాల కాలంలో మొత్తంగా దేవాలయానికి దానం చేయబడిన 115 గ్రామాలలో ఇవి 91%గా ఉన్నవి.

దేవాలయానికి దాఖలుపరచబడిన గ్రామాలలో 91% గ్రామాలు రాజస్వానికి చెందిన గ్రామాలనీ (crown villages), రైత్వార్వీవిధానం ప్రకారం రైతునకు అనుభవహక్కుగల గ్రామాలు (service tenure)అనీ రెండురకాలుగా ఉన్నాయి. వీటినుండి లభించే వార్షికాదాయం అధికఆదాయం(మేల్‌వరం) (major share) అనీ, తక్కువ ఆదాయం (కుడివారం లేక కీళ్ వరం) (minor share) అనీ రెండు భాగాలుగా చేయబడుతుంది. గ్రామం నుండి లభించే ఆదాయంలో మేల్‌వరం అంటే అధికభాగం రాష్ట్రానికి లేదా సైన్యానికి వినియోగించేందుకు రాజుకు చెందుతుంది. కుడివరం భాగం పంటపండించే రైతునకు చెందుతుంది. వార్షికంగా గ్రామభూములు పంటకోతకు వచ్చినపుడు నిష్పత్తిప్రకారం మేల్‌వరం, కుడివరంగా విభజింపబడుతుంది. [ **మేల్‌వరం, కుడివరం** అనేపదాలు వరుసగా పెద్ద భాగం, చిన్నభాగం అనేఅర్థం కలిగియున్నది. మరియు ఆ యావంతులవారు అనుభవించే హక్కును సూచిస్తోంది. చోళుల కాలంలో వీటికే మైయాట్చి మరియు కానియాట్చి అన్నపేర్లు వాడుకలో ఉండేవి] (10వ శతాబ్దం నుండి 13వ శతాబ్దం) అంతే కాదు ఇంతకుపూర్వం, అంటే 8వ, 9వ శతాబ్దంలో పల్లవుల ప్రాబల్యం ఉచ్చస్థితికి ఎదుగుతున్న కాలంలోకూడ వ్యవహారంలో ఉన్నది. చూడుడు– [K.A. Nilakantha Sastry, the Colas,II, part I (Madras : University of Madras,1937):395 and Kishori Mohan Gupta, the Land System of South India between 800 A.D and 1200 A.D. Punjab Oriental Series no.xx (Dahore: M.Benrsi Das,1933)] రాజస్వానికి(under crown) గాని, లేక రాజసేవా స్వామ్యానికి (service tenure) చెందిన గ్రామం దేవాలయానికి దానం చేసినపుడుకూడ ఆ గ్రామ వార్షికాదాయాన్ని పెద్దభాగం, చిన్నభాగంగా విభజించే పద్ధతి అనుసరింపబడుతోంది. అపుడు కూడ ఆ గ్రామం దేవాలయానికి దాఖలు పరచబడినపుడు గ్రామ వార్షికాదాయంలో పెద్దభాగం దేవాలయానికి చెందగా, చిన్న భాగం ఇంతకుముందులాగే ఆ నేలను దున్నే రైతులకు చెందుతుంది. [ఈ విషయాన్ని దక్షిణహిందూదేశ చరిత్రకారుడైన యస్.కృష్ణస్వామి అయ్యంగారు తన **తిరుపతి దేవాలయం** అన్న గ్రంథంలో గుర్తించారు అధ్యాయం–xx. A History of the Holy Shrine of Sri Venkatesa in Tirupati,II (Madras: Tirumala Tirupati Devasthanam Committee,1941) 403. According to Gupta, this was characteristic in South India.]

దేవాలయంలో దైనందిన పూజాది ఆచారకర్మకాండ సక్రమంగా జరుగుతూ ఉండాలనే ఉద్దేశంతో షరతులతోకూడిన ఆధారద్రవ్యంకోసం భూమి దానంగా ఇవ్వబడుతూ వచ్చింది. దేవాలయానికిచేసే ఈ భూదానాలనుండి స్థిరమైన నికరాదాయం

| ధారావాహిక 05 | # మందార మకరందాలు |
|---|---|

**ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్**
**సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే**
**సమ్మెటవాటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ**
**బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.**

విశ్వశ్రేయం కవితాలక్ష్యం. దానిని డబ్బుకోసమో, డాబు కోసమో, ధనికులకో, అధికులకో అమ్ముకోవడం ఆత్మవంచనం. ఇది ప్రాయికంగా ఆధునిక దృక్పథం. ప్రయోగ గర్భితమైన ఈ దృక్పథాన్ని అలనాడే ఉద్ఘోషించినాడు బమ్మెర పోతరాజు. నరాంకితాన్ని నిరసించడం అప్పటికి అపూర్వమే కాదు. సాహసోపేతం కూడా. ప్రభుస్వామ్య వ్యవస్థలో ప్రజాస్వామ్య దృక్కోణాన్ని ప్రదర్శించడం పోతరాజు స్వచ్ఛంద వ్యక్తిత్వానికి నిదర్శనం. మెత్త మెత్తగా కవిత్వం వ్రాయడానికి పేరుబడ్డ ఈ కవి సుత్తితో కొట్టినట్టు "మనుజేశ్వరాధముల"ను నిరసించినాడు. తాను నమ్మిన పరంధామునికే భాగవత కృతిని సమర్పించినాడు. ఆ సమర్పణంలో స్వార్థం లేదు. జగద్ధితమే – లోకహితమే దాని చరమార్థం.

పోతన్న అనగానే మొట్టమొదట గుర్తుకొచ్చే ఈ పద్యం అతనిది కాదనీ ఎవరో వ్రాసి చేర్చిందనే అభిప్రాయం కూడా లేకపోలేదు. వ్రాసిన దెవరైనా ఇందులో ప్రత్యక్షరంలో పోతన్న వ్యక్తిత్వమే సాక్షాత్కరిస్తున్నది.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

లభిస్తుండడం వలన ఆధారద్రవ్యదాన రూపాన, భూ రూపానకూడ పెట్టుబడిపెట్టే టటువంటి విధానం భక్తులలో ఆదరణ పొందింది. అయినా ఈ కాలానికిచెందిన తిరుమల దేవాలయ శాసనాలనూ, దక్షిణ భారత దేశమందలి దేవాలయ శాసనాలనూ నిశితంగా పరిశీలించినట్లయితే ఈ కాలం ఈ దేవాలయభూములలో చాల వరకు ఏ కొద్దో తప్ప పెట్టుబడిపెట్టి అభివృద్ధిపరచడానికి తగినంత అనుకూలమైనట్టివి లేవన్న విషయం విశదం కాగలదు. దానకర్త దానంచేసిన భూక్షేత్రంమీద కౌలుహక్కు (kaniyatchi)ను కలిగియుండి [see note 8, also Kaniyatchi in Horace H. Wilson, A Glosary of Judicial and Revenue Terms (Culcutta; Eastern Law House,1940) page402], ఒప్పందం ప్రకారం తాను ప్రతియేటా చెల్లించవలసిన ధనాన్ని దేవాలయానికి చెల్లించగలిగియుండాలి. ఇటువంటి ఆధారాలను కలిగినవి మూడు తిరుమల శాసనాలు లభ్యమౌతున్నాయి (శాసనం సంఖ్యలు 347–జి.టి., 648–టి.టి. మరియు 53–A టి.టి.). షరతులతో కూడిన ఆధార ద్రవ్యంగా భూమిని దానం చేసినపుడు అభివృద్ధికి ఆస్కారం కలిగిన భూముల మీద మరొక రకానికి చెందిన భూస్వామ్యపద్ధతి ఉన్నది. ఈ పద్ధతిలో దానంచేయబడిన భూమినుండి లభించు మొత్తం వార్షిక ఆదాయంతో సంబంధం లేకుండా చేసుకున్న ఒప్పందం ప్రకారం స్థిరంగా నిర్ణయించిన రాబడి మొత్తం మాత్రమే ప్రతి సంవత్సరమందునూ దేవాలయానికి చెల్లించబడుతుంది. ఆ గ్రామానికి లభించే వార్షికాదాయంతో గాని ఆ గ్రామమందలి గ్రామస్థులమీదగాని దేవాలయానికి ఎటువంటి అధికారం లేదు. ఇటువంటి పద్ధతిని శ్రోత్రీయ స్వామ్యం అని అంటారు. ఈ శ్రోత్రీయగ్రామాన్ని దాత ఆ రాజ్యానికి తాను చేసిన ఘనమైన సేవాకార్యక్రమానికి మెచ్చి రాజు తనకు బహూకరించిన గ్రామం. తిరుమల శాసన సంచయం ప్రకారం క్రీ.శ.1514లో రెండు శాసనాలు కనిపిస్తాయి. (శాసనం సంఖ్య 284–టి.టి. మరియు 27–టి.టి.) దేవాలయానికి ఆధారద్రవ్యంగా చేసిన భూదానం నుండి వచ్చే కాణియాట్చి, మరియు శ్రోత్రీయం స్వామ్యంగల భూముల మొత్తం వార్షికాదాయంతో దేవాలయానికి ఎట్టిప్రమేయం లేదు. అట్టి

భూములనుండి నిర్ణీత ఆదాయం మాత్రమే వార్షికంగా దేవాలయం పొందుతుంది.

పై తెలిపిన రెండురకాల భూములుతప్ప దేవాలయానికి చెందిన మిగతా ఆధారద్రవ్యంగా ఇచ్చిన భూములను తన బాధ్యతతో తగినచర్యలు తీసుకుని అభివృద్ధిపరచి తద్వారా వచ్చిన అధికఆదాయాన్ని తానే పొందుతుంది. దేవాలయ గ్రామాల నుండి లభించే వార్షికరాబడిలో పెద్దభాగానికి ధర్మకర్త అయినందున దేవాలయ కార్యనిర్వాహకులు ఆ భూములమీద పెట్టుబడులనుపెట్టి అభివృద్ధిపరచినపుడు తద్వారా లభించిన అధిక ఆదాయంలో కుడివరం హక్కును కలిగియున్నవారికి కొంతభాగాన్ని ముట్టజెప్పి మేల్‌వరంభాగాన్ని దేవాలయం గ్రహిస్తుంది.

**6. ఆధారద్రవ్యంగా దేవాలయానికి సమర్పించబడిన ధనదానాన్ని, మూలధనంగా పెట్టుబడి పెట్టడానికి వినియోగించడం :**

దాత దేవాలయానికి షరతులతో కూడిన ఆధారద్రవ్యం దానంగా సమర్పించినదాన్ని ఏ విధంగా పెట్టుబడిపెట్టాలో, మరి అందులకు వచ్చే రాబడిని ఏ విధంగా ఖర్చుపెట్టాలో నిర్దేశిక మార్గాన్నిచూపే శాసనాలు తిరుమలలో చాల ఉన్నాయి.

ఇందులకు ఉదాహరణగా తిరుమల దేవాలయం మూడవప్రాకార కుడ్యంమీద అచ్యుతదేవరాయలకాలం నాటి శాసన సంఖ్య 559-టి.టి. ఉన్నది. శాసనకాలం శా.శ. 1462 లేదా క్రీ.శ.1540. ఇందులో తెలిపినప్రకారం అంగరాజ నాగప్పయ్యర్ అను ఒక వ్యక్తి పేరు మీద ఈ క్రింది విధంగా కర్తవ్యాన్ని జరిపించు బాధ్యతవహిస్తూ తమ ఆమోదాన్ని తెలుపుతూ దేవాలయధర్మకర్తలు ఈ శాసనాన్ని ప్రకటించియున్నట్లు తెలుస్తున్నది. ఈ వ్యక్తి అంగరాజ నాగరిప్పయ్యర్ అను పేరులోని **అంగరాజ** అనే పదాన్నిబట్టి ఇతడు, అచ్యుతరాయల అంగరక్షకుడని విశదమౌతున్నది. ఈ నాగరప్పయ్యరు శ్రీ వేంకటేశ్వరస్వామికి, తదితరదైవాల కైంకర్య నిమిత్తం దేవాలయ శ్రీభండారానికి 15,000 నర్పణాలను (బంగారు నాణేలు) చెల్లించడం చేత ధర్మకర్తలు ఈ ధనాన్ని వినియోగించి దేవాలయానికి చెందిన గ్రామాల్లోని చెరువులను, పొలాలకు నీరందించే పంటకాలువలను మరమ్మతు చేయించారు. తద్వారా లభించే అధికఆదాయాన్ని వినియోగించి 300 అప్పపడి ప్రసాదాన్ని తయారు చేయించి దాతపేరుమీద దైవాలకు నివేదించే ఏర్పాటుకు పూచీపడుతున్నట్లు ఈ శాసనంలో స్పష్టం చేశారు. అప్పపడి నైవేద్యాల విషయమై ఉదాహరణకు పవిత్రోత్సవదినం, రథోత్సవదినం, తెప్పోత్సవ దినంవంటి ఉత్సవాది దినాల్లోనూ, 25 ఏకాదశిదినాలు, ఊంజల్ ఉత్సవాలలోనూ, మొదలైనదినాలలో స్వామికి సమర్పణల విషయం వివరంగా తెలుపబడింది. 15,000 నర్పణాలను పెట్టుబడిగాపెట్టి, వ్యవసాయానికి అనువుగా ఉండేటట్లు చెరువులను, పంటకాలువలను అభివృద్ధి చేసినపుడు, తద్వారా పంటపొలాల నుండి లభించే అధికవార్షికాదాయం విలువ 300 అప్పపడి ప్రసాదం తయారు చేయడానికి సరిపోగలదన్న విషయం రూఢి అవుతోంది. షరతులతో కూడిన ఆదారద్రవ్య దానంగా ఇచ్చిన దానదానాన్ని వ్యవసాయక్షేత్రాలలో పెట్టుబడిపెట్టి, తద్వారా లభించే అధిక వార్షికాదాయంతో స్వామికి ప్రత్యేక సేవాకైంకర్యాన్ని జరిపించవచ్చని ఈ శాసనం ప్రత్యేకంగా నిరూపిస్తోంది.

ఇట్టి విధానాన్ని అనుసరించి ఇటువంటి ఫలితాలను పొందిన వైనాన్ని వివరాన్ని తెలిపే శాసనాలు చాలవున్నాయి. ఉదాహరణకు శాసనంసంఖ్య 639-టి.టి.నే తీసుకొందాం. పడికావలి గోపుర దక్షిణదిక్కు పీఠంవద్ద ఉన్న ఈ శాసనంలో ఉళగప్పన్ ఇచ్చిన 800 నర్పణాలను వెచ్చించి దేవాలయ గ్రామాల పొలాల్లో ఇతోధికంగా పంటలు పండించడానికి అనువుగా అందలి చెరువులను, పంటకాలువలను అభివృద్ధిపరచి, తద్వారా లభించే అధిక ఫలసాయాన్ని వినియోగించి శాసనంలో తెలిపిన విధంగా సేవా కైంకర్యాలను నిర్వహించవలసినదిగా కోరినట్లు తెలుపుతోంది.

శాసన సంఖ్య 411-టి.టి. వంటి మరికొన్ని శాసనాలలో పెట్టుబడిధనం నర్పణాలలో ఉండగా దీనిపై రాగల ఆదాయం తిరుప్పోణకంలో తెలుపడం ఉన్నది. ఇది దైవానికి చేసే మరొక రకం సేవాకైంకర్యం.

దీనిని బట్టి తేలినదేమంటే దేవాలయ గ్రామాల (రాజు చేతగాని, తదితర భక్తులచేత గాని ఇంతకు మునుపే దేవాలయానికి దానంచేసిన గ్రామాలు) వ్యవసాయాభివృద్ధి కార్యక్రమ పథకంలో పెట్టుబడిపెట్టినట్లయితే సుస్థిరమైన వార్షికాదాయం లభిస్తుందన్న నమ్మకం కలిగినందున భక్తులు, షరతులతోకూడిన (endowments)ఆధారద్రవ్యదానంగా దేవాలయానికి సమర్పించిన ధనాన్ని ఇందు పెట్టుబడి పెట్టగా వచ్చే నికరమైన వార్షిక ఆదాయంతో దైవానికి ప్రత్యేకసేవాకైంకర్యం జరిపించడం సాధ్యం కాగలదని తెలుస్తోంది. ఇటువంటి పెట్టుబడులు పెట్టడంలో కార్యదక్షతతో కూడిన నిర్వహణాసామర్థ్యంతో వ్యవహరించాల్సిన ఆవశ్యకత ఉన్నది. 14వ శతాబ్దంనుండీ, దేవాలయ కార్యనిర్వహణ ధర్మకర్తలనబడే స్థానత్తారులు 12 మంది అధీనంలో ఉంటూ వచ్చింది. నాటినుండీ దేవాలయానికి వచ్చే ఆదాయాన్ని వినియోగించి, ఆదాయ వ్యయ నిర్వహణ సామర్థ్యం పెంపొదించబడుతూ ఉండినట్లు భావించవచ్చును.

**7. వ్యవసాయభూముల నీటిపారుదలమీద పెట్టిన పెట్టుబడి మీద వచ్చే రాబడి :**

చాల శాసనాలు తెలుపుతున్న ప్రకారం మూలధనంగా పెట్టబడిన ధనం **పణాలలో** తెలుపుతుండగా, మూలధనంపై వచ్చే రాబడి మాత్రం అందుకు సరితూగునట్టి విలువగలిగి, దైవానికి నైవేద్యంగా పెడుతున్న **అప్పపడి** లేక **తిరుబ్బోనకం** లేక అట్టిదియే అయిన మరో రూపంగా తెలుపబడుతోంది.

కనుకనే పెట్టిన మూలధనానికి తద్వారా లభించిన రాబడికినీమధ్య వచ్చే సొమ్మువిలువ స్థిరపరిస్తేనేతప్ప దేవాలయంవారు పెట్టిన సొమ్ముమీద ఎంతశాతం వడ్డీ వస్తోందన్న విషయాన్ని నిర్ణయించడం సాధ్యంకాదు. కానీ, అదృష్టవశాత్తు గణించడానికి వీలుగా పై దత్తాంశానికి వీలుగా తగినన్ని వివరాలున్న ఒకటి రెండు శాసనాలు లభిస్తున్నాయి.

శాసనంసంఖ్య 421-టి.టి., 2-జి.టి. శాసనాలు, పై విషయానికి సంబంధించిన పూర్తివివరాలు అందిస్తున్నాయి. తిరుమల ఆలయ మూడవప్రాకారం దక్షిణగోడపై సలకయ్య దేవ మహారాజు కుమారుడైన సింగరాజు (శాసనం సంఖ్య 421-టి.టి.) శా.శ.1463 ప్లవనామసంవత్సరం కుంభమాసం అంటే 10-2-1542 నాడు శిలాశాసనం వేయించాడు. వేంకటేశ్వర స్వామివారి ఆలయ ధనాగారానికి తాను15,000 నర్పణాలను ఆనాడు జమచేశాడు. ఆలయధర్మకర్తలు ఈ ధనాన్ని దేవాలయ గ్రామాల్లోని వ్యవసాయాభివృద్ధికై చెరువులను, పంటకాలువలను అభివృద్ధికై వినియోగించి, అందువలన లభించిన అధిక ఆదాయంతో పైన తెలిపిన సేవాకైంకర్యం అంటే దాత నిర్దేశించిన 300 అప్పపడిల నైవేద్యంకోసం వినియోగించవలసిందిగా నిర్దేశించాడు. ఈ శాసనంతోబాటు పైన తెలిపిన ఈ 559-టి.టి. శాసనం కూడ 300 అప్పపడిలు తయారుచేయడానికి అవశ్యమైనధనం వార్షికాదాయంగా పొందడానికి మూలధనాన్ని పెట్టుబడిగా 15,000 నర్పణాలు వ్యవసాయాభివృద్ధి పనులలో పెట్టవలసిన అవసరమున్నదని తెలుస్తోంది.

శాసనం 2-జి.టి. తిరుపతిలో గోవిందరాజస్వామి దేవాలయ మొదటి ప్రాకారంలో పార్థసారథిస్వామిగుడి లోపలి ప్రదక్షిణమార్గంయొక్క దక్షిణపుగోడమీద ఉంది. ఈ శాసనం తెలుపుతున్న విధంగా శా.శ.1463 ప్లవనామసంవత్సరం మకర మాసం పంచమీతిథి అంటే క్రీ.శ.20-1-1542 న శ్రీరామయ్య గారికి దేవాలయధర్మకర్తలు పూచీకత్తుగా ఒకశాసనాన్ని ప్రకటించారు. ఇందులోని వివరాలప్రకారం శ్రీరామయ్య షరతులతో కూడిన ఆధారద్రవ్యదానంగా 56 పొన్నుల బంగారు నాణేలను దానం చేశాడు. దేవాలయ ధర్మకర్తలు ఈ ధనాన్ని దేవాలయ గ్రామాలలోని సస్యక్షేత్రాలను అభివృద్ధిపరచి, తద్వారా లభించే అధిక ఫలసాయంతో దానకర్త శాసనంలో తెలిపినవిధంగా దైవానికి నైవేద్యం దాత ఉభయంగా తయారు చేయించగలవారమని శాసనంలో తెలుపబడింది. ఇంకనూ దైవానికి సమర్పించే నైవేద్యాలను గురించి ఈ శాసనంలో వివరిస్తూ 5 పణాలు ధనాన్ని వినియోగించి ఒక మనోహరప్పడి, 3 పణాలు ధనాన్ని వినియోగించి ఒక దోశప్పడి, 6 పణాలు ధనాన్ని వినియోగించి ఒక అప్పపడి మొదలైనవి తయారు చేయించగలిగేవారు. ఈ పదులన్నియూ పెనుగొండసీమలోని **కుందన్నాలు గ్రామం**లోని కాపురస్తుడునూ యజుశ్శాఖీయుడు ఆపస్తంబసూత్ర కాశ్యపగోత్రీకుడైన (పేరు రాత చెరిగిపోయింది.) దైవానికి సమర్పించాడు. కాబట్టి **ఒక అప్పపడి విలువ 6 పణాలు** అని తెలుస్తోంది.

***(ఇంకా ఉంది)***



బాలప్రబోధం

# చండీ ఉద్దాలకులు

- అవసరాల లక్ష్మీపతిరావు

**భా**ర్యాభర్తలకి సరిపడకపోయినా, భర్త మాట భార్య వినక పోయినా వాళ్లు చండీ ఉద్దాలకులురా అని అనడం పరిపాటి. కాని ఎవరా చండీఉద్దాలకులు? ఏమిటా కథ? అని మనం ఆలోచించం. పిల్లలూ! మరి వారి కథను తెలుసుకుందామా! ఆ కథను వివరంగా చెబుతాను. వినండి!

కురుక్షేత్ర యుద్ధం తర్వాత ధర్మరాజు బంధువులందరూ చనిపోయారని విచారంగాను అశాంతిగాను ఉన్నాడు. అప్పుడు కృష్ణుడు ధర్మరాజుకు ఒక మంచి సలహా చెప్పాడు. రాజ్యం విస్తరింపజేసుకుని; అశాంతిని నిర్మూలించుకోవాలంటే అశ్వమేథ యాగం చెయ్యమన్నాడు. అదివిని ధర్మరాజు ఆ యాగాన్ని చేయడానికి సంకల్పించి; ఒక అశ్వాన్ని శాస్త్రోక్తంగా పూజించి గుఱ్ఱాన్ని వదలిపెట్టారు. అశ్వరక్షకుడుగా సర్వసమర్థుడైన సవ్యసాచిని నియమించారు. భీమార్జునులు, నకుల సహదేవులూ, మిగిలిన సైన్యం అశ్వం వెంట పయనించారు. అశ్వం మెడలో ఒక పలకను వ్రేలాడదీశారు. అందులో ఒక ప్రకటన ఇలా వ్రాసి ఉంది. "ఇది పాండురాజు కుమారుడైన ధర్మరాజు వదలి పెట్టిన అశ్వం. ఈ అశ్వాన్ని బంధించిన వాళ్లు పాండవులతో యుద్ధం చెయ్యవలసి ఉంటుంది. ఈ గుఱ్ఱం సంచరించినంత మేర భూమి పాండవుల అధీనంలో ఉంటుంది. ఆయా రాజ్యాలను పరిపాలించే రాజులందరూ ధర్మరాజుకు సామంతులై, కప్పం చెల్లించవలసి ఉంటుంది. గుఱ్ఱాన్ని బంధించడానికి సాహసించినవారికి ఇదే మా తుది హెచ్చరిక."

ఆ ప్రకటన చదివిన వారందరూ పాండవులతో యుద్ధం సామాన్యం కాదని భయపడి ఊరకున్నారు. రాజులందరు ధర్మరాజుకు సామంతులై కప్పము చెల్లించుటయేగాక విలువైన కానుకలను కూడా సమర్పించుకున్నారు. అలా అలా హిమాలయాల వైపు పయనించిన గుఱ్ఱము ఒక పెద్ద కొండకి అతుక్కుపోయింది. ఆ గుఱ్ఱం ముక్కుకి కళ్లెం వేసి సైనికులు బలవంతంగా లాగారు. కాని ప్రయోజనం లేకపోయింది. అర్జునుడు ఎంతగా ఆలోచించినా గుఱ్ఱము బయటపడే ఉపాయము గోచరించలేదు. అచ్చటనే ఉన్న ఒక మునీశ్వరుని ఆశ్రమానికి పోయి సంగతి వివరించి ఒక తరణోపాయం సెలవివ్వమని ప్రార్థించిన సవ్యసాచిని చూచి ఆ ముని ఈ విధంగా పలికాడు.

ఉద్దాలకుడను ఋషి కౌశికుని శిష్యుడు. విద్యాభ్యాసానంతరం ఉద్దాలకుడు పెళ్లి చేసుకుని గృహస్థుడయ్యాడు. ఒకసారి శిష్యుడి కాపురమెలా ఉందో చూసొద్దామని గురువు కౌశికుడు వచ్చాడు. గురువుగారిని చూడగానే పొర్లిన దుఃఖంతో తన కాపురం సరిగా లేదని, తన భార్య తనకనుకూలవతి కాదని ఎడ్డెమంటే తెడ్డెమంటుందని చెప్పాడు. గురువు కౌశికుడు అతని కొక ఉపాయాన్ని బోధించాడు. తనకేదైనా ఒక పని కావలసి వస్తే వ్యతిరేకంగా చెప్పి చేయించుకోమని చెప్పి అతడు తపస్సుకై హిమాలయాలకు వెళ్లాడు.

అలా ఒక సంవత్సరంలో ఉద్దాలకుడి తండ్రి తద్దినం వచ్చింది. ఆ కార్యాన్ని సాధించుకోవటానికి గురువుగారు చెప్పిన ఉపాయమే తరణోపాయమని గ్రహించాడు.



## విన్నపం !

తిరుమల తిరుపతి దేవస్థానములు, శ్రీ వేంకటే శ్వరస్వామి వారి ఆలయము మరియు దేవస్థానము అను బంధ ఆలయాల నిత్యకైంకర్యాల కొరకు పాడి పశువు లను దానంగా (వితరణ) ఇవ్వగోరు భక్తులకు విన్నపం.

ఏమనగా!

ప్రస్తుతం తిరుపతి నందు ఉన్న శ్రీ వేంకటేశ్వర గో సంరక్షణశాల యందు దానంగా ఇచ్చిన పశువుల సంఖ్య పరిమితికి మించి అధికమైనందున, తగినంత స్థలం లేనం దున మరియు త్రాగునీటి ఎద్దడి వలన, తిరుమల తిరు పతి దేవస్థానము పాలకమండలి నిర్ణయం మేరకు క్రింది కనబరచిన నియమనిబంధనల ప్రకారం భక్తులు గో వితరణ చేయవలసిందిగా కోరుచున్నాం.

**1)** భక్తులు వితరణ ఇవ్వగోరు పాడి పశువులు "దేశవాళి ఆవులు" అనగా గిర్, షాహివాల్, తార్‌పార్కర్, రెడ్ సింధి మరియు ఒంగోలు జాతి ఆవులు మాత్రమే స్వీకరింపబడ తాయి.

**2)** భక్తులు ఇచ్చు ఆవులు రోజుకు 8–10 లీటర్లపాలు ఇచ్చు పాడి ఆవులు (పైన తెల్పిన జాతి) మరియు ఒంగోలు జాతి ఆవులు రోజుకు కనీసం 5 లీటర్ల పాలు ఇచ్చేవి మాత్రమే స్వీకరింపబడతాయి.

**3)** కోడెలు, కోడెదూడలు, ఆవు దూడలు స్వీకరించబడవు.

**4)** పాలు ఇవ్వని, వయస్సు మీరిన, బక్కచిక్కిన ఆవులు స్వీక రింపబడవు.

**5)** ముఖ్యంగా అనారోగ్య పశువులను వితరణ చేయడం వల్ల, గోశాలలోని ఆరోగ్యవంతమైన పశువులన్నింటికి వాటి జబ్బులు సోకే అవకాశం ఉంది. కావున, భక్తులు మరియు వివిధ స్వచ్ఛంద సేవాసంస్థలవారు దీనిని గమనించప్రార్థన.

**తి.తి.దే. కాల్ సెంటర్ : 0877- 2277777**
**టోల్‌ఫ్రీ నెం. : 18004254141**

**- కార్యనిర్వహణాధికారి**

రేపు మా తండ్రిగారి తద్దినం. అది నేను పెట్టను. చాలా డబ్బు ఖర్చు అవుతుందని ఉద్దాలకుడు భార్యతో అన్నాడు. అదేం కుదరదు; తద్దినం పెట్టి తీరాల్సిందేనని చండి ప్రత్యుత్తర మిచ్చింది. ఒకవేళ పెట్టినా బ్రాహ్మణులను పిలవను అని ఉద్దాలకుడన్నాడు. బ్రాహ్మణులను పిలిచి తీరాల్సిందే! ఐనా ఈ తద్దినమనేది సంవత్సరానికి ఒకసారే కదా వస్తుంది. రోజూ వస్తుందా? అని ఆమె భర్తకు వ్యతిరేకంగా పలికింది. నాలుగు పచ్చళ్లు నాలుగు కూరలూ వద్దు. ఒక కూర ఒక పచ్చడితో సరి పెడదాం అన్న ఉద్దాలకుని మాటలను ఆమె అంగీకరించకుండా; అన్నీ శాస్త్రోక్తంగా జరిగి తీరాల్సిందేనని పట్టుబట్టింది.

ఉద్దాలకుడనుకున్న ప్రకారం తద్దినం సక్రమంగా జరిగిపోయింది. ఆ సంతోషంలో మైమరచి ఉద్దాలకుడు ఆ పిండాలు ఆవుకి పెట్టుమన్నాడు. చండి ఆ పిండాలను పెంట మీద పారవేసింది. ఉద్దాలకుడు కోపోద్రిక్తుడై ఆమెను కొట్టి; శిలవుకమ్మని శపించాడు. ఆమె అతని కాళ్లమీద పడి ప్రాధేయ పడగా; అర్జునుడి గుఱ్ఱం శిలకి అతుక్కుపోయినప్పుడు నీకు యథారూపం వస్తుందని చెప్పి తపస్సుకు వెళ్లిపోయాడు. అతడు పెట్టినగడువు సమయం అవకపోవడంవల్ల గుఱ్ఱాన్ని ఎంతమంది పట్టిలాగినా రాలేదు. పార్థా! ఇప్పుడు వెళ్లిలాగుము. సమయమై పోయిందని మునీశ్వరుడు చెప్పాడు. అప్పుడు వెళ్ళి అర్జునుడు ముట్టుకోగానే; గుఱ్ఱం బయటకు రాగానే; ఆమెకు శాపవిమోచన మయ్యింది. ఉద్దాలకుడు హిమాలయాల నుండి వచ్చి ఫల్గు ణుడ్ని అభినందించి గౌరవమర్యాదలు చేశాడు. చండి తన తప్పు తాను తెలుసుకొని భర్త పాదాలను కన్నీటితో కడిగి అప్పటి నుండి భర్త కనుకూలవతిగా మారిపోయింది. అయినా చండీ ఉద్దాలకుల కథ ప్రతికూల దాంపత్యానికి ఉదాహరణగానే నిలిచిపోయింది. అలా ప్రతి సామెత వెనుక ఒక కథ అనేది ఉంటుంది. అది అర్థం చేసుకుంటే అవగాహన తేలికైపోతుంది.

తర్వాత ఆ అశ్వమేధ యాగంతో ధర్మరాజు అపారమైన కానుకలు, ధనాన్ని ఆర్జించి; ముప్పై ఆరు సంవత్సరాలు రాజ్యం ధర్మయుక్తంగా పరిపాలించాడు. ఆ తర్వాత తన రాజ్యాన్ని పరీక్షిత్తుకు, వజ్రుడుకి పంచియిచ్చి; మహాప్రస్థానములోనికి అడుగుపెట్టారు.

మన దేవాలయాలు

# శ్రీ తిరుక్కచ్చినంబి, పెరుమాళ్ ఆలయాలు
## పూనమల్లి (చెన్నై)

- పి. కృష్ణమూర్తి

పూవిరందమల్లికి పర్యాయపదం పూనమల్లి. ఒకప్పుడు ఈ గ్రామం ఆచార్యపురుషులు, ఆళ్వారులు, మునులు, పుణ్యపురుషులకు నిలయం. అందుచేతనే పూనమల్లి పరిసర ప్రాంతాల్లో అనేక ఆలయాలు వెలిశాయి. ఈ క్షేత్రం ఒకనాడు బ్రాహ్మణ అగ్రహారం. నిత్యం అగ్నిహోత్రుని ప్రజ్వలనలతో, వేద, వేదాంగపఠనాలతో మారుమ్రోగుతూ ఉండేది. ఈ పూనమల్లి క్షేత్రాన్ని వాల్మీకి, మార్కండేయ, అగస్త్య, తిరువళ్ళువర్, తిరుక్కచ్చి నంబి, రామానుజాచార్య; వీరందరికంటే ముందు శ్రీ ఆది శంకరాచార్యులు దర్శించి అచ్చటి ఆలయాలను, మఠాలను ఉద్ధ రింపజేశారు. కొన్ని ఆలయాల నిర్మాణ ఐతిహ్యాలు పుణ్య పురు షులతో ముడిపడి ఉన్నాయి. ఈ పూనమల్లి క్షేత్రం, ప్రస్తుతం మహానగరంలో భాగంగా పరిగణింపబడుతోంది. ఎందుకంటే; ప్రక్కనే ఉన్న చెన్నై పట్టణం మహానగరంగా విస్తరించ టంతో ఈ ప్రాచీన పూనమల్లి గ్రామం అందులో కలసి పోయి, ఆ నగర పశ్చిమ సరిహద్దుగా రూపుదిద్దు కొంది.

పూనమల్లిక్షేత్రం చుట్టుప్రక్కల గ్రామాల్లో అనేక శైవ, వైష్ణవ ఆలయాలున్నాయి. ఈ ఆలయాలు మొత్తం ఆనాటి దక్షిణ భారత దేశాన్ని పాలించిన పల్లవ, చోళ, పాండ్య, విజయనగర చక్రవర్తులు, వారి సామం తులు నిర్మించినవే. ఈ ఆలయాలలో పూనమల్లి మధ్యన, చెన్నై - బెంగళూరు జాతీయ రహదారికి ప్రక్కన విలసిల్లుతూ ఉన్న పెరుమాళ్ (విష్ణు) లేక శ్రీ తిరుక్కచ్చినంబి ఆలయం ప్రముఖమైనది. ఈ పరిసర ప్రాంతాల్లో విలసిల్లే ఆలయాల్లో ఈ పెరుమాళ్ ఆలయానికి ఒక ప్రత్యేకత ఉంది. అదేమంటే, ఒక భక్తునిచేత పూజలందు కొన్న మహావిష్ణువు; ఆ భక్తుడు వృద్ధుడై, చరించలేని పరిస్థితు లలో అతడు కొలుస్తున్న శ్రీ కంచి వరదరాజస్వామి, శ్రీరంగం రంగనాథస్వామి, తిరుమల శ్రీనివాసస్వామి రూపాలలో అతడి వద్దకు వచ్చి పూజలందుకొనడమేకాక వారూ అతడిని కొలి చారట!

ఈ క్షేత్ర ఐతిహ్యామేంటంటే; తిరుక్కచ్చినంబి పూనమల్లి క్షేత్రజ్ఞుడు. బాల్యం నుండి విష్ణు భక్తుడు. ఈయన సాక్షాత్తు మహావిష్ణువు అంశతో జన్మించాడు. ఆయనకు కాంచీపురమందలి వరదరాజస్వామి పట్ల ఎనలేని భక్తి. తిరుక్కచ్చినంబి రోజూ పూనమల్లి నుండి కాంచీపురానికి వెళ్లి వరదరాజ స్వామికి అభిషేకము, నైవేద్యం, పూజావిధులు నిర్వర్తించేవాడు. ఈ విష్ణుభక్తునిపై వరదరాజ స్వామికి ఎనలేని ఆప్యాయత. ఆ స్వామి భక్తునితో నేరుగా మాట్లాడి, తనకు ఎటువంటి ఉపచారాలు కావాలో జరిపించుకొనేవాడు. తిరుక్కచ్చినంబికి వరదరాజస్వామితో బాటు శ్రీరంగం శ్రీరంగనాథుడు, తిరు మల వేంకటేశ్వరుడు ఇష్టదైవాలు. ఈ క్షేత్రాలకు అనేక ఐతిహ్యాలు ప్రచార మందున్నాయి. తిరుక్కచ్చినంబి వైష్ణవమత ఆళ్వారులలో ప్రముఖుడిగా పేర్కొన బడుతూవున్న రామానుజాచా ర్యులవారికి గురుతుల్యుడు-



తిరుక్కచ్చినంబి ఆలయ రాజగోపురం

రామానుజులు వీరివద్ద నుండే మంత్రోపదేశాన్ని పొందాడట! రామానుజులు, తనకు జ్ఞానోపదేశం చేసిన తిరుక్కచ్చినంబి సలహాతో దేశంలోని అనేక వైష్ణవ క్షేత్రాలను దర్శిస్తూ, కొన్ని ఆలయాల్లో పూజాదిక, ఉత్సవ ఏర్పాట్లు చేశాడట! ఇతడు ప్రవేశపెట్టిన పూజా విధానమే నేటికీ తిరుమల శ్రీనివాసుని ఆలయంలో కొనసాగుతోంది.

**ఆలయ నిర్మాణం :**

పెరుమాళ్ (విష్ణుమూర్తి) లేక తిరుక్కచ్చినంబి ఆలయం, క్రీ.శ.10వ శతాబ్దినాటిదని చెప్పవచ్చు. ఈ ఆలయంలో ప్రధానమందిరాలైన వరదరాజస్వామి, శ్రీరంగనాథస్వామి, శ్రీ వేంకటేశ్వరస్వామివారి ఆలయాలతో బాటు ఆలయ ప్రథమ స్థానంలో తిరుక్కచ్చినంబి కూడా ప్రతిష్ఠింపబడియున్నారు. ఆలయ ముఖద్వారం పశ్చిమదిశగా ఉంది. ఆలయం చుట్టూ పెద్ద,పెద్ద బండరాళ్ళతో నిర్మించిన ప్రహరీ; పశ్చిమదిశప్రహరీలో విశాలమైన ద్వారం, దానిపై ఐదంతస్తుల రాజగోపురం నిర్మింప బడి ఉంది. రాజగోపురం పూర్తిగా విజయనగర రాజుల కాలం నాటిది. ఆలయ ప్రవేశద్వారం ఇరువైపులా పొడవాటిరాతి స్తంభాలు. వాటిపైన లతాంగుల శిల్పాలు చెక్కబడినాయి. గోపుర ద్వారం మొత్తం ఐదంతస్తులు వైష్ణవ శిల్పాలు, రామాయణ, భారత, భాగవత కథాంశాల శిల్పాలతో నిండిఉన్నాయి. గోపురం పైభాగాన ద్రవిడశిఖరముపైన ఆరు కలశాలు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి.

రాజగోపురానికి ఎదురుగా ప్రధాన ఆలయం ఉంది. ఆలయముఖద్వారం దక్షిణదిశలో ఉంది. ఈ ప్రధాన మందిర మందు మూడు ఉపమందిరాలున్నాయి. అవి శ్రీ వరదరాజ స్వామి, శ్రీరంగం రంగనాథస్వామి, తిరుక్కచ్చినంబి మందిరాలు. వీటిలో వరదరాజస్వామి మందిరం పశ్చిమం వైపుగా, తూర్పు ముఖాన్ని కలిగి ఉంది. ఈ మందిరంలో గర్భాలయం, అంత రాళం, ముఖమండపాలు ఉన్నాయి. గర్భగృహంలో పద్మ పీఠంపై శ్రీమహావిష్ణువు వరదరాజస్వామి పేరున స్థానక ముద్రలో కొలువైయున్నాడు. స్వామి చతుర్భుజుడు. స్వామి ఇరు వైపులా, శ్రీదేవి, భూదేవి నిలుచుని ఉన్నారు. స్వామి ముంగిట, అంతరాళంలో, ఉత్సవర్లు, చక్రత్తాళ్వారు కొలువై యున్నారు. స్వామి ముంగిట ముఖమండప స్తంభాలు, వైష్ణవ శిల్పాలతో అలంకరింపబడి ఉన్నాయి.

వరదరాజస్వామికి ఎదురుగా పశ్చిమదిశను చూస్తూ ఉన్నట్లు మరో మందిరముంది. ఈ మందిరంలో శ్రీ రంగనాథ స్వామి పశ్చిమదిశను చూస్తూ ఉన్నట్లు ఆదిశేషునిపై పవళించి ఉన్నట్లుంది. స్వామి నాభియందు తామరపుష్పంలో బ్రహ్మ, స్వామి పాదాలచెంత శ్రీదేవి, భూదేవి ఆశీనులైయున్నారు. స్వామి పాదాలచెంత మహావిష్ణువు కూర్మావతారంలో ఉన్నట్లు శిల్పం కలదు. స్వామి చెంత అంతరాళంలో, లోహపు ఉత్సవ విగ్రహాలు, మరి కొంతమంది భక్తుల శిల్పాలున్నాయి. వరదరాజ స్వామి, శ్రీరంగనాథ స్వామిమంది రాలు ఎదురెదురుగా ఉండగా, వాటి మధ్యన దక్షిణదిశగా చూస్తూఉన్నట్లు నిర్మితమైన మందిరంలో శ్రీ తిరు క్కచ్చినంబి స్థానకముద్రలో అంజలి ఘటిస్తూ ఉన్నట్లుంటాడు. స్వామి విగ్రహం ఎంతో ఆకర్షణీయంగా ఉండి, భక్తులకు దర్శనమిస్తూ ఉంటుంది. రామానుజ, విష్వక్సేన మొదలైన వైష్ణవభక్తుల శిల్పాలు కూడా ఉన్నాయి. ఈ మందిరాలకు వేరువేరుగా, గర్భగృహాలపై, చిన్న విమానాలు, గుండ్రని శంఖం, కల శాలు ఉన్నాయి.



తిరుక్కచ్చినంబి ఆలయ ధ్వజస్తంభం

ఈ ప్రధాన ఆలయం పశ్చిమదిశలో, శ్రీ వరదరాజ స్వామికి, శ్రీ రంగనాథస్వామికి కలిపి వరదరాజస్వామి వెనుక భాగంలో రెండు ధ్వజస్తంభాలు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి. వీటిలో ఒకటి లోహపు స్తంభం కాగా, రెండవది రాతిస్తంభం. అలాగే బలిపీఠం, గరుడమండపాలు ఉన్నాయి.

**ఉపమందిరాలు :**

ఆలయ రాజగోపురం దాటి ఆలయ ప్రాంగణంలోనికి ప్రవేశించగానే ఎడమవైపు (ఉత్తరదిశలో) తూర్పుముఖాన్ని కలిగి ఉన్న శ్రీనివాసుని ఆలయం నిర్మింపబడి ఉంది. ఈ ఆలయంలో కూడా గర్భ గృహము, సన్నటి అంతరాళం, దాని ముందు నాలుగు స్తంభాల మండపం ఉన్నాయి. గర్భగృహమందు వేంకటే శ్వరుడు శ్రీనివాసుని పేర, నిలుచుని భక్తులకు దర్శనమిస్తూ ఉంటాడు. స్వామి చతుర్భుజుడు, పై రెండు చేతులు శంఖు, చక్రాలను; క్రింది రెండుహస్తాలు అభయ, వరద ముద్రలో ఉంటాయి. స్వామికి ఇరువైపులా శ్రీదేవి, భూదేవి స్థానక ముద్రలో ప్రతిష్ఠింపబడి ఉన్నాయి. ఆలయమందలి స్వామిసాక్షాత్తు తిరుమల శ్రీనివాసుని పోలియుంటాడు. శ్రీనివాసుని మందిరానికి ఉత్తరదిశలో ఆండాల్ సన్నిధి కలదు. గర్భ గృహంలో ప్రసన్న వదనంతో ఆండాల్ స్థానకముద్రలో నిలుచుని దర్శనమిస్తూ ఉంటుంది.



**తిరుక్కచ్చినంబి, పూనమల్లి**

రాజగోపురంలోపల, తూర్పుముఖాన్ని కలిగిన మందిర ముంది. ఈ మందిరం గర్భగృహం ముంగిట స్తంభాల మండ పాన్ని కలిగి ఉంది. గర్భాలయంలో వైష్ణవాచార్యులు, ఆళ వందార్ శిల్పాలున్నాయి. రెండు చేతులు జోడించి అంజలి ముద్రలో ఆసీనుడై ఉంటాడు. ఈ విగ్రహం కూడా ఎంతో ఆక ర్షణీయంగా ఉంటుంది. మోముపై వెడల్పాటి తిరునామా లున్నాయి. ఈ మందిరానికి సమీపంలో, శ్రీకృష్ణునికి మరో చిన్న మండపం కలదు. ఇందులో స్వామి నృత్యమూర్తిగా ఆదిశేషుని శిరస్సుపై నిల్చుని ఉంటాడు. ఈతడిని భక్తులు 'కన్నన్' అని ముద్దుగా పిల్చుకుంటారు.

**దేవీ మందిరం :**

ఉపమందిరాలన్నింటిలోకి అత్యంత ఆకర్షణీయమైనది దేవీమందిరం. ఈ మందిరం అంతరాళం, గర్భగృహాలను కలిగి ఉంది. గర్భాలయంలో దేవి ఆరుళ్ మెగపుష్పవల్లి తాయారు పేరున కొలువై పూజింపబడుతూ ఉంటుంది. దేవిచతుర్భుజ సర్వాలంకార భూషిత. ఈమె సాక్షాత్తు లక్ష్మీదేవి. ఈమె తిరుక్కచ్చినంబికి మల్లెపూవులో దర్శన మిచ్చిందట. గర్భాలయంపైన గుండ్రటి శిఖరంపైన కలశముంటుంది. అంతరాళ మందు దేవి ఉత్సవర్లు కొలువైయు న్నారు. ముఖమండప స్తంభాలు అన్నీ ఆంజనేయ, శ్రీరంగనాథ, లక్ష్మీదేవి, శ్రీచక్ర, శ్రీనివాసశిల్పాలతో అలంకరింప బడి ఉన్నాయి. ఈ మందిర స్తంభాలు, విమానంపైన ఉన్నటువంటి శిల్పాలు మిగతా ఉపమందిరాలందు కానరావు.

రాజగోపురం ముందు, పశ్చిమాన నాలుగు స్తంభాల సాయంతో నిర్మింప బడిన కొలువు లేదా ఆస్థానమండపం ఉంది. ఉత్సవ సమయాల్లో ఊరేగే దేవతామూర్తులు ఇచ్చట కొలువై ఆపై ఊరేగింపబడుతాయి. ఈ మండపానికి ఎడమ వైపున ఆలయ పుష్కరిణి ఉంది.

తిరుక్కచ్చినంబి ఆలయంలో వరదరాజస్వామికి, శ్రీరంగనాథస్వామికి, తిరుమల వేంకటేశ్వరునికి, ఆళవందార్, దేవికి నిర్ణీతకాలంలో ఉత్సవాలు ఎంతో వైభవంగా జరుగు తాయి. ఐతే తిరుక్కచ్చినంబికి ప్రత్యేక ఉత్సవం జరుగుతుంది. ఈ స్వామి జన్మ నక్షత్రం 'మృగశిర'. ఈ నక్షత్రం రోజు నుండి ఆలయంలో దాదాపు 10 రోజుల పాటు ఫిబ్రవరి మాసంలో అంగరంగవైభవంగా బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు. ఈ పుణ్య దినాల్లో భక్తులు తండోపతండాలుగా ఆలయానికి విచ్చేసి తమ ఇష్టదైవాలను కొలచి పునీతులౌతూ ఉంటారు.

గ్రంథ సమీక్ష

# గురురత్నావళి

**రచయిత :** శ్రీ సుబ్రహ్మణ్యానంద; **పుటలు:** 270 పేజీలు; **సైజు:** 1/4 డెమ్మి; **ధర:** రూ. 252/-; **ప్రతులకు:** శ్రీమతి బి.యన్. వసుంధర, డోర్ నెం: 21-14-24/2, శ్రీ చిన్మయి సీతారామనిలయం, తోటవారివీథి - 2, రామలింగేశ్వర పేట, తెనాలి - 522 201.

సాక్షాత్ పరబ్రహ్మతత్త్వం కొన్ని సందర్భాల్లో కొందరికి గురుతత్త్వంగా భాసిస్తూ ఉంటుంది. ఏకం సత్ విప్రా బహుధా వదంతి- అన్నట్లుగా ఒక్కటిగా భాసించే ఆ గురుతత్త్వం ఉపాసకులకు, భక్తులకు ఆయా వేళల్లో వేర్వేరు రూపాల్లో ఒక్కొక్కరికి ఒక్కొక్క తీరుగా దర్శనమిస్తుంది. దత్తాత్రేయస్వామిగా, హయగ్రీవస్వామిగా, దక్షిణామూర్తిగా, శ్రీపాదశ్రీవల్లభునిగా, నరసింహస్వామిగా, ఇలాగ అనేకమైన రూపాల్లో, అనేకమైన పేర్లతో సందర్భాన్ని బట్టి దర్శనమిస్తూ భక్తుల్ని, శిష్యుల్ని సన్మార్గంలో నడిపిస్తుంది ఆ గురుతత్త్వం.

'గురురత్నావళి' ఒక సంకలన గ్రంథం. ఇందులో ఐదు అధ్యాయాలున్నాయి. రచయిత సుబ్రహ్మణ్యానంద ఆయా సందర్భాల్లో తన భక్తులతో, శిష్యులతో సత్సంగంలో తెలియబరచిన విషయాల్ని, విశేషాల్ని క్రోడీకరించి ప్రస్తుతం ఒకే గ్రంథంగా వెలువరించారు. అదే ఈ 'గురురత్నావళి'.

ఇందులో అనంతమైన గురుకృపను అనేకవిధాలుగా తెలియజేస్తున్న వ్యాసాలు - 1) గురుకృపాకౌముది 2) స్మర్తృగామి 3) గురుహృదయం 4) గురుగమ్యం. ఈ గ్రంథం చివర్లో ఉన్న 'గురురత్నావళి' వ్యాసంలో శ్రీ సుబ్రహ్మణ్యానందగారి శిష్యులు, భక్తులు తమ గురువుగారితో తమకు ఉన్న అనుబంధాన్ని, గురుభక్తితో తాము అనుభవిస్తున్న గురుతత్త్వాన్ని వివరించడం జరిగింది.

ముచ్చటైన రంగురంగుల శ్రీ దత్తాత్రేయస్వామి వారి ముఖచిత్రంతో రమణీయంగా ఉన్న పుస్తకం 'గురురత్నావళి'.

**- ధారా సుబ్రహ్మణ్యం.**

# తెలుగు సాహిత్యములో నృత్య కళా ప్రస్తావనలు

**రచన :** డా॥ ముట్నూరు సంగమేశం; **పుటలు:** 134 పేజీలు; **సైజు:** 1/8 డెమ్మి; **ధర:** రూ. 80/-; **ప్రతులకు:** ముట్నూరు అన్నాజీరావు, 18-3-56, కె.టి.రోడ్డు, శాంతినగర్, తిరుపతి-517 507.

ఈ గ్రంథంలో డా॥ ముట్నూరు సంగమేశం నృత్యానికి తెలుగు సాహిత్యకారులు ఇచ్చిన స్థానాన్ని విపులంగా చర్చించారు. ఇందులో పది అధ్యాయాలున్నాయి.

'మార్గదేశి విభేదాలు' అనే అధ్యాయంలో వాల్మీకి చరిత్ర, ప్రహ్లాద విజయం, కుమార సంభవం తదితర గ్రంథాలలోని అంశాలను వివరించారు. లాస్య తాండవాది భేదాలు అనే నాల్గవ అధ్యాయంలో సర్వేశ్వర శతకం, శృంగార నైషధం, అనిరుద్ధ చరిత్రమున్నగు గ్రంథాలలోని అంశాలను ప్రస్తావించారు. రాసలీల అనే ఐదవ అధ్యాయంలో భాగవతం, క్రీడాభిరామం మున్నగు గ్రంథాలలోని అంశాలను చర్చించారు. నృత్త ప్రపంచము అనే ఆరవ అధ్యాయంలో కవికర్ణరసాయనం అనే గ్రంథంలో చెప్పబడిన విషయాలను ఉదహరించారు. 'సభానాట్యాలు-స్పర్ధలు' అనే అధ్యాయంలో వైజయంతీ విలాసము, రాజగోపాల విలాసము, సమీరకుమార విజయము మొదలగు గ్రంథాలలోని అంశాలను ఉదహరించారు. ఉత్సవ నృత్యాలు- ఉల్లాసాలు అనే తొమ్మిదవ అధ్యాయంలో అభినయదర్పణం, కాశీఖండం తదితర గ్రంథాలలో పేర్కొన్న విషయాలను సోదాహరణంగా చర్చించారు. కవిసమయాలు-నృత్యగానాలు అనే పదవ అధ్యాయంలో రామాభ్యుదయం, ఆముక్తమాల్యద, పురూరవ చరిత్ర, ఉత్తరహరివంశం, శుకసప్తతి మున్నగు గ్రంథాలలోని విషయాలను విపులంగా చర్చించి ఉదహరించారు.

నృత్యానికి మన కవులు ఇచ్చిన ప్రాధాన్యం ఎట్టిదో ఈ గ్రంథం చదవినవారికి ఎంతో ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని, చక్కని అనుభూతిని కలిగిస్తుంది. ఇది కేవలం వివరణాత్మకమైనది మాత్రమే కాదు పరిశోధనాత్మకమైనది కూడా. ప్రతి కళాకారుడు, సాహితీప్రియుడు చదివి దాచుకోదగ్గ గ్రంథమని చెప్పవచ్చు.

**- డా॥ కె.రెడ్డెప్ప.**

## వార్తాలహరి

### వైభవంగా తిరుమల తెప్పోత్సవాలు

మార్చి 15 నుంచి 17 వరకు తిరుమల శ్రీవారి పుష్కరిణిలో మూడు రోజులపాటు వేంకటేశ్వరస్వామి, అమ్మవార్లకు తెప్పోత్సవాలు అత్యంత వైభవంగా జరిగాయి.

ఇందులో భాగంగా మూడవరోజు మలయప్పస్వామి తమ దేవేరులతో తెప్పలపై విహరిస్తూ భక్తులకు దర్శనమిచ్చారు. శ్రీదేవి, భూదేవి సమేత మలయప్పస్వామి విశేష అలంకరణలతో నాలుగు మాడవీథులు ఊరేగింపుగా పుష్కరిణి వద్దకు వేంచేశారు. తెప్పలపై ఆశీనులై స్వామివార్లు కోనేటిలో మూడు పర్యాయాలు ప్రదక్షిణలుజేశారు. మంగళవాయిద్యాలు, వేద మంత్రోచ్చారణల నడుమ సంగీత కళాకారులు అన్నమయ్య విన్నపాలను ఆలపిస్తుండగా తెప్పోత్సవం అంగరంగ వైభవంగా జరిగింది. ఉత్సవాన్ని భక్తులు వందలాదిగా తిలకించి పునీతులయ్యారు. ఈ కార్యక్రమంలో తిరుమల సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ కె. భాస్కర్, ఐ.ఏ.ఎస్., గారు తదితర అధికారులు పాల్గొన్నారు.

### తిరునిండ్రవూరు ఆలయానికి శ్రీవారి పట్టువస్త్రాలు

వైష్ణవాలయాల్లో ప్రత్యేక గుర్తింపు ఉన్న తిరునింద్రవూరు ఆలయంలో బ్రహోత్సవాలు మార్చినెలలో వైభవంగా జరిగాయి. తిరుమల పెద్దజీయర్ ధర్మకర్తగా పనిచేస్తున్న తమిళనాడు రాష్ట్రంలోని తిరునింద్రవూరు ఆలయంలో బ్రహోత్సవాల సందర్భంగా గరుడసేవరోజున తిరుమల తిరుపతి దేవస్థానం తరపున తొలిసారిగా పట్టువస్త్రాలను తిరుమల సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ కె.భాస్కర్, ఐ.ఏ.ఎస్.,గారు సమర్పించారు. ఈ కార్యక్రమంలో పెద్దజీయర్, వారి శిష్యబృందం కూడా పాల్గొన్నారు.

### నాగులాపురంలో సూర్యపూజ మహోత్సవాలు

దుష్టశిక్షణ, శిష్టరక్షణకు మహావిష్ణువు దశావతారాలు ఎత్తాడు. అందులోని మత్స్యావతారమే నాగులాపురంలో కొలువైన వేదనారాయణస్వామి. నాగులాపురంలో స్వయంభూమూర్తిగా వెలసిన వేదనారాయణస్వామికి ప్రతి సంవత్సరం సూర్యపూజ మహోత్సవాలను మార్చి 24 నుండి ఐదు రోజులపాటు నిర్వహించడం జరుగుతుంది. ఈ ఆలయం తి.తి.దేకి అనుబంధ ఆలయం. సూర్యకిరణాలు ఆలయంలో తొలి మూడు గోపురాల మధ్య ఖాళీ ప్రదేశాన్ని దాటి సుమారు 630 అడుగుల దూరంలో గర్భాలయంలో కొలువైన స్వామివారిని తాకడమే సూర్యపూజగా ఉత్సవం నిర్వహిస్తారు. సోమకాసురుని సముద్రగర్భంలో శ్రీహరి అనేక సంవత్సరాలపాటు వెదికి సంహరించే సమయంలో స్వామి శరీరం చల్లబడిందని ఆయన శరీరానికి వెచ్చదనాన్ని కల్గించడానికి సూర్యకిరణాలు స్వామిని స్పృశిస్తాయని చరిత్ర. ప్రతి సంవత్సరంలాగే ఈ సంవత్సరం కూడా ఈ మహోత్సవాలు ఘనంగా జరిగాయి.

### మహాసరస్వతీయాగం

తిరుపతిలో తి.తి.దేవస్థానం పరిపాలనా భవనం ఆవరణలో ఉన్న మైదానంలో మార్చి 5న మహాసరస్వతీయాగం రాష్ట్ర దేవాదాయ శాఖ, తి.తి.దేవస్థానం, హిందూ పరిరక్షణ ట్రస్ట్ సంయుక్త ఆధ్వర్యంలో భారీ ఎత్తున నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో తి.తి. దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు,ఐ.ఏ.ఎస్., మాట్లాడుతూ విద్యతోనే మానవ జీవితానికి సంపూర్ణత్వం లభిస్తుందని అన్నారు. ఈ యాగాన్ని ప్రతి సంవత్సరం నిర్వహిస్తామని ఆయన ప్రకటించారు. ఈ యాగం ఉ॥ 9గం॥కు నుండి మ॥12 గం॥ల వరకు జరిగింది. అంతకుముందు గోవిందరాజస్వామి ఆలయం నుంచి విద్యార్థులు గోవింద నామస్మరణలతో బాలభక్తిచైతన్య పాదయాత్ర చేస్తూ యాగశాలకు చేరుకున్నారు. ఈ యాగంలో పెద్దసంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు.

### తి.తి.దే. ఆధ్వర్యంలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం

మార్చి 8న అంతర్జాతీయ మహిళాదినోత్సవం తిరుపతి మహతికళామందిరంలో తి.తి.దే.ఆధ్వర్యంలో ఘనంగా జరిగింది. ఈ కార్యక్రమంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,తో పాటు సాధికారమండలి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణ, ఐ.ఏ.ఎస్.,గారి సతీమణి అపర్ణ, స్విమ్స్ సంచాలకురాలు డా॥ వెంగమ్మ, ప్రముఖ సంగీత విద్వాంసురాలు పద్మశ్రీ శోభారాజ్, సహాయ అకౌంట్ జనరల్ శ్రీమతి అనితా షా ఆకెళ్ళ మరియు తి.తి.దే. ఉద్యోగులు ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు. వివిధశాఖల ఉద్యోగినులకు ఉత్తమ మహిళా అవార్డులను అందజేయడం జరిగింది.

ఈ కూపను కత్తరించండి

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా : ______________________
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
   ______________________
   ______________________
   ______________________
   (పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని,
నమ్మిస్తున్నారని తెలిసింది.
అలాంటి వారి మాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
మరియు
ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి"
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా చందా కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

- ☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- ☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపవచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- ☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- ☛ మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

నేనై విడువ వద్దు - తానై తగుల వద్దు
తానే తానై వుంటేఁ - దగులెల్ల నూడు.

పొద్దు వొద్దు హరిఁ దలఁ - పునఁ దలపోయఁగ
ఒద్దికైన పలు చేత - లున్న వెల్లా మరచును,
నిద్దిరించు వానిచేఁతి - నిమ్మపంటి వలెనే
బుద్ధితోఁ గర్మములు గొ - బ్బున జారిపోవును.

పలుమారు గురుసేవఁ - బరఁగఁగా బరగఁగా
చలి వాసి యాత్మ వి - జ్ఞానము బొడచూపు,
కలగన్న వాఁడు మేలు - కనిన కలవలెనే
పలు సంసారము లెల్ల - భావనలై యుండును.



పక్కన శ్రీ వేంకటేశు - పై భక్తి వొడమగా
అక్కజపు టిహపరా - లరచేతివి యౌను,
చొక్కపు పరుసమంటి - సొంపుగాని లోహము
నిక్కఁ బైఁ డైనటు - నెరు సెల్లఁ దొలఁగును.

(4-414)

సంసారము కర్మమయమైన బంధమై జీవులను పెనవేసికొని యున్నది. ఈ బంధమును త్రెంచుకొనుటే మోక్షము. అనాదిగా జీవు డీ సంసార ప్రవృత్తి కలవడి యున్నాడు గాన తనకు తానుగా దానిని వదలుకొనజాలడు. సంసారముగూడ వీనిని తనకు తానుగా వదలి పెట్టి పోదు. ఏలన కర్మానుగుణముగా జీవుని బంధించుటే దాని స్వభావము.



**జూలై నెల పండుగలు**

17 - శ్రీవారి ఆణివార ఆస్థానం, తిరుమల.

# మీ మాట

## పత్రికకే ఒక హైలెట్

పత్రిక చదువుతుంటే మనస్సు నిర్మలంగా, ప్రశాంతంగా మనస్సు తేలిపోతూ అలౌకికమైన ఆనందాన్ని పొందుతున్నాం. ఈ విధంగా పత్రికను తీర్చి దిద్దుతున్నందుకు ధన్యవాదాలు. పత్రికలోని ప్రతి పేజీ చివరన ఉన్న ఆణిముత్యాల్లాంటి సూక్తులు పత్రికకే ఒక హైలెట్. వాటి యొక్క భావం ప్రతి పాఠకుని హృదయాన్ని హత్తుకునే విధంగా ఉన్నాయి. ఆచరణలో సమాజానికి మంచి చేయడానికి ప్రోత్సహించేలా ఉన్నాయి. మరిన్ని సూక్తులు, మంచి ఆధ్యాత్మిక విషయాలతో మన సప్తగిరి పత్రిక భక్తిపరులైన పాఠకులను అలరించాలని కోరుకుంటున్నాం.

**– గుర్రాల శివకోటేశ్వరరావు, గుంటూరు.**

## అమూల్యం

సప్తగిరి మాసపత్రికలో ప్రచురించే శీర్షికలన్నీ ఉపయుక్తమైనవి, ఆలోచనలు రేకెత్తించేవి. ఎంతో అమూల్యమైనవి అనడంలో సందేహం లేదు. ఆద్యంతం ఆధ్యాత్మికత ఉట్టిపడుతూ ఉంటుంది.

**–మెల్లి వంశీ సాయి వెంకట్, తణుకు.**

## ఎంతగానో ఆకట్టుకుంది

ఏప్రిల్, 2011 సప్తగిరి మాసపత్రిక ముఖచిత్రంలో శ్రీ భూ సమేత మలయప్పస్వామి మమ్మల్ని ఎంతగానో ఆకర్షింపబడుతున్నారు. పత్రికలోని ఆధ్యాత్మిక ధారావాహికలు, బాలవాక్కు, మనదేవాలయాలు, అక్షరామృతం ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. విజయలక్ష్మిగారి ఉగాది శీర్షిక జానపదులలో శ్రీరాముడు, త్యాగయ్యగారి ఆత్మనివేదన మొదలైనవి బాగున్నాయి.

**– నిష్ఠల సత్యనాగేంద్రప్రసాద్, హైదరాబాదు.**

## వినూత్న ఆకర్షణ!!

సప్తగిరి ముఖచిత్రంలోని స్వామివారిని చూసిన తర్వాత మన సప్తగిరికి ప్రతి పేజీలో ఓ వినూత్న ఆకర్షణ శక్తి ఉన్నదని మరోసారి అన్పించింది. మధ్య పేజీ పంచరంగుల మనోహర చిత్రాల్ని చూస్తున్నంతసేపు తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారి దివ్యసన్నిధిలో నిలబడిన భక్తిపూర్వక అనుభూతి కలిగింది. వివిధ శీర్షికలు జ్ఞానదీపాలా అన్నట్లు ప్రకాశించాయి.

**– కె. సోమేశ్వర శర్మ, కోటిపల్లి, తూ.గో.జిల్లా.**

## చింతిస్తున్నాం...!

మేము ఇటీవలే సప్తగిరి చందాదారులుగా చేరాము. మాకు వచ్చిన మొదటి పుస్తకంలోనే వివిధ వ్యాసాలు, వివిధ శీర్షికలు, స్వామివారి వర్ణచిత్రాలు మమ్మల్నెంతో ఆకట్టుకున్నాయి. ఇంకా ఇలాంటి విలువైన, అరుదైన దైవసమాచారాన్ని అందించవలసిందిగా కోరుతున్నాము.

ఇటువంటి మంచి పత్రికకు ముందుగా చందాదారులు కాలేక పోయినందులకు చింతిస్తున్నాం.

**– డి.వి.వి.శివప్రసాద్, తణుకు.**



వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



**కల్లా కపటం లేని మనస్సులో
కమలాక్షుడే కాపురముంటాడు**

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 42 జూన్, 2011 సంచిక : 01

**ప్రత్యేక వ్యాసాలు**



**ధారావాహికలు**



**గృహలక్ష్మి**



**బాలవాక్కు**



**అక్షరామృతం**



**శ్రీ వేంకటేశ్వర లీలలు**



**బాలప్రబోధం**



**మన దేవాలయాలు**



గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.
ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.
సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ
ముద్రాపకుడు :
ఎం. కార్తీక్, ఎం.ఏ., ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.
డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి
వర్ణచిత్రాల లే-అవుట్ : పి. శివప్రసాద్

ముఖ చిత్రం :
**శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే**



***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**
సం॥ చందా -- రూ. 850-00

## సంపాదకీయం

# చూచినవారిదే వైభోగం!!

సాధారణంగా గిరిజన ప్రాంతీయులు సుప్రసిద్ధ దేవాలయాలలో జరిగే కల్యాణాది విశేష కార్య క్రమాలను తిలకించడం సాధ్యం కాని పని. వారి జీవన విధానానికే వారికి కాలం సరిపోతుంది. వాళ్ళలో మంచి మనస్సు, ప్రగాఢమైన భక్తి విశ్వాసాలు ఉన్నప్పటికీ వాటిని కార్యరూపంలో ప్రకాశింపజేసే అవకాశాలు చాలా తక్కువ. అందుకని సామాన్యులకు సైతం తిరుమలలో జరిగే శ్రీవారి కల్యాణోత్సవం లాంటి మహత్తర కార్యక్రమాల్ని తాము స్వయంగా తమ ప్రాంతాల్లో, తాము నివసిస్తున్న చోటనే వీక్షించడం, అందులో పాల్గొనడం ద్వారా వాళ్ళలో బీజప్రాయంగా ఉన్న భక్తి విశ్వాసాలు మొలకెత్తి చిగురించి మహావృక్షాలై ఫలప్రదం కావడానికి తిరుమల తిరుపతి దేవస్థానం ప్రవేశపెట్టిన ఈ 'గోవింద కల్యాణాలు' ఎంతో సహకరిస్తాయి. ప్రజల్లో సనాతన ధార్మిక కార్యక్రమాలపై ఆసక్తి, వేంకటేశ్వరతత్త్వం పై అవగాహన, స్వామి పట్ల అచంచల భక్తి విశ్వాసాలు ఏర్పడడం, వారి ఆచార వ్యవహారాల్లో ధార్మికమైన, ఆరోగ్యప్రదమైన మార్పులు, చేర్పులు ఈ ఉత్సవాల వల్ల చోటు చేసుకుంటాయనడం నిస్సందేహం.

మునుపు పదకవితా పితామహుడు, శ్రీవారి ఆంతరంగిక భక్తుడు అయిన అన్నమయ్య ఈ సదు ద్దేశ్యంతోనే శ్రీవారి ఉత్సవమూర్తులను తీసుకు వెళ్ళి కొన్ని ప్రాంతాల్లో, ఊరూరా కల్యాణోత్సవాలు జరిపించాడని మనకు తెలుసు. ఆనాడు వారు గావించిన కల్యాణోత్సవ అంకురార్పణ ఈనాడు గోవింద కల్యాణాలు, పద్మావతీ శ్రీనివాస కల్యాణాలు... ఇంకా అనేక రూపాలతో కల్పవృక్షంగా అవతరించింది.

గోవింద కల్యాణమనగానే నిరంతర గోవిందనామస్మరణతో ప్రతిధ్వనించే తిరుమల క్షేత్రమూ, నిత్య కల్యాణ చక్రవర్తే అయిన ఆ లక్ష్మీనాథుడే మదిలో సాక్షాత్కరిస్తాడు. కనుక శ్రీదేవి, భూదేవి సహిత శ్రీ వేంకటేశ్వరుడే ఈ గోవింద కల్యాణ అధిష్ఠాన దేవత. గోవిందుడంటే కాంతిని, వేదాన్ని, జ్ఞానాన్ని, ఆనందాన్ని, భూమిని, గోవును పొందేవాడని అర్థం. కనుక గోవింద శబ్దాన్ని వింటేనే భక్తుల్లో అప్రయత్నంగానే ఈ ఫలితాలన్నీ సంక్రమిస్తాయి. కనుక భగవద్భక్తి విశ్వాసాల అభివృద్ధికి, సమాజ అభ్యుదయానికి, అట్టడుగు వారిలో ఆధ్యాత్మిక భావజాల పునరుద్ధరణకు ఈ కార్యక్రమం మహోపకారం చేస్తుంది. భగవంతుడి పాదస్పర్శతో, మహాత్ముల దర్శనంతో ఆయా ప్రాంతాలు పునీతమౌతాయి. ఒక్కసారి ఆ ఉత్సవాన్ని దర్శించిన ఏ భక్తుడైనా ఇక జీవితంలో ప్రతిక్షణమూ ఆ మహదానంద సన్నివేశాన్నే స్మరించుకుంటూ ఉంటాడు. ఆ మారుమూల భక్తుల హృదయక్షేత్రాల్లో భక్తిజ్ఞానానంద బీజాలు ఫలించడానికి తిరుమల తిరుపతి దేవస్థానం కల్పించిన మహత్తర కార్యక్రమమీ 'గోవింద కల్యాణం'.

శ్రీ వేంకటేశ్వరుడు దర్శన స్మరణతోనే సమస్తపాపాలను పరిహరించేవాడు. గనుక ఈ కల్యాణంలో స్వామిని దర్శించడం మరియు గోవిందనామ సంకీర్తనం చేయడంతో భౌతికంగా, మానసికంగా మంచి వాతా వరణం ఏర్పడుతుంది. ఇలాంటి కార్యక్రమాలను ఆయా ప్రాంతీయులు సద్వినియోగం చేసుకొని, శ్రీవారి కృపకు పాత్రులు కావాలని ఆకాంక్ష!!

# శ్రీమన్నారాయణుని శయన విగ్రహాలు - లక్షణాలు

- శ్రీ గోవిందు సురేంద్ర

విష్ణుమూర్తి విగ్రహాల అమరికలో శయనం (పడుకున్నట్లుండే ఆసనం) ఒక అందమైన లక్షణం. భగవంతుడైన లక్ష్మీపతిని శయన, ఆసన, స్థానక, నృత్య రూపాల్లో మనం చూడొచ్చు.

ముఖ్యంగా శయన విగ్రహాలు - యోగం, సృష్టి, భోగం, సంహారం అని నాలుగు విధాలుగానున్నాయి. అవి వరుసగా ముక్తికి, వృద్ధికి, భుక్తికి, అభిచారికాలకు మార్గాలుగా భావించాలి. మోక్షం కోరేవారు యోగశయనాన్ని, పుత్రపౌత్రాభివృద్ధి కోరేవారు సృష్టిశయనాన్ని, భోగవృద్ధి కోరేవారు భోగశయనాన్ని, శత్రువుల నాశనాన్ని కోరేవారు సంహారశయనాన్ని ధ్యానించ వలెనని పురాణాలు చెబుతున్నాయి. అలాగే శిల్ప శాస్త్రాలు కూడా ఈ శయన విగ్రహాలు, గ్రామం మధ్యలో నున్న శయనాలన్నీ కోర్కెలను తీరుస్తాయని, గ్రామానికి దక్షిణాన యోగశయనం, పడమర భోగశయనం, ఉత్తరాన సృష్టిశయనం, తూర్పున సంహార శయనం విగ్రహాలను స్థాపించవలెనని చెబుతున్నాయి. అలా స్థాపించిన విగ్రహాలకు దేవాలయ ద్వారం తూర్పున స్థాపించిన విగ్రహానికి (పడమర) ద్వారం, పడమర స్థాపించిన విగ్రహానికి తూర్పుద్వారం అలాగే ఉత్తరాన స్థాపించిన విగ్రహానికి దక్షిణ ద్వారం, దక్షిణాన స్థాపించిన విగ్రహానికి ఉత్తరద్వారాన్ని నిర్మించాలి.

తూర్పువైపు ద్వారం సర్వ సంపదలు కల్గిస్తుంది. పడమర ద్వారం సర్వసంపదలు తొలగిస్తుంది. ఉత్తరద్వారం జ్ఞానసంపదను పెంపొందిస్తుంది. అలాగే దక్షిణద్వారం వైరాగ్యం పెంపొందిస్తుంది. గ్రామాల్లోనే కాక బయటస్థాపించవలసి వస్తే శయనం ఉత్తర ముఖంగా ఉండటం శ్రేష్ఠం. నదీ తీరాలందు, సరస్సుల ప్రక్కన యోగ శయన విగ్రహాలు ప్రశస్తమైనవిగా చెప్పుకోవచ్చు.

**శయన విగ్రహాల కొలతల నిర్ణయం :**

శయన విగ్రహాలకు ప్రత్యేకమైన, శిల్ప వైలక్షణం గల పద్ధతులు, కొలతలు విధింపబడ్డాయి. శాస్త్రోక్త విధానంగా నిర్మింపబడ్డ గర్భగృహం లోపలి కొలతను పద్దెనిమిది భాగాలు చేసికొని, స్వామియొక్క పాదాల వద్ద ఒక భాగం, తల ప్రక్క ఒక భాగం విడిచి మిగిలిన పదహారుభాగాల్లో స్వామి విగ్రహనిర్మాణాన్ని మొదలుపెట్టాలి. ఈ పదహారుభాగాల్లో ఆదిశేషుని పడగలకు ఒక భాగం, పడగకు స్వామి కిరీటానికి ఒక భాగం, కిరీటానికి ఒక భాగం విడిచి మిగిలిన పదమూడు భాగాల పొడవులో శయనమందున్న మూలమూర్తి యొక్క పొడవుగా నిర్ణయించుకోవాలి.

గర్భగృహం లోపలి వెడల్పును పదహారు భాగాలు చేసుకొని స్వామితలవైపు నాలుగు భాగాలు, పాదాల వద్ద రెండు భాగాలు వదలి మిగిలిన పదిభాగాల్లో విగ్రహ నిర్మాణం చేస్తే దానిని



ఉత్తమమైన కొలతలు గల విగ్రహంగానూ; గర్భగృహం లోపలి వెడల్పును ఎనిమిది భాగాలు చేసుకొని స్వామి తలవైపు రెండు భాగాలు, పాదాల వద్ద ఒక భాగం వదలి మిగిలిన ఐదు భాగాల్లో విగ్రహనిర్మాణం చేస్తే దానిని మధ్యమమైన కొలతలు గల విగ్రహంగానూ; గర్భగృహంలోపలి కొలతను ఏడుభాగాలు చేసి స్వామి తలవైపు రెండు భాగాలు, పాదాలవద్ద ఒక భాగం వదలి మిగిలిన నాల్గుభాగాల్లో విగ్రహ నిర్మాణం చేస్తే అది అధమమైన కొలతలుగల విగ్రహంగానూ ఆగమశాస్త్రాలు పేర్కొంటున్నాయి. ఈ శయనవిగ్రహాల గర్భగృహాలపై విమాన నిర్మాణం దీర్ఘచతురస్రంగాగానీ, దీర్ఘవృత్తంగాగానీ ఉండాలి. విమానం గుండ్రంగానూ, చతురస్రంగానూ నిర్మాణం చేయ రాదు.

## 1. యోగశయనం :

శ్రీమహావిష్ణువు ఎర్రతామర రేకుల వంటి నేత్రాలతో యోగనిద్రాసుఖమునందుంటుంది. రెండు భుజాలు కలిగి ఒక ప్రక్కగా పడుకున్నట్లు అర్ధశయనంలోనుంటుంది. ఐదుపడగలు గల శేషుడు శంఖం వలె, చంద్రునివలె తెల్లగా ఉంటుంది. దీని మీద శయనించిన విష్ణువు గౌరశ్యామ వర్ణంతోగానీ, పీత శ్యామవర్ణంతోగాని ఉంటుంది.

ఈ విధమైన విష్ణుదేవుని పూజాపీఠానికి కుడివైపున భృగువు, ఎడమవైపున మార్కండేయ మహర్షి ఉండాలి (లేదా) కుడివైపున మార్కండేయుడు, ఎడమవైపున భూదేవి ఉండాలి. మధుకైటభులు, బ్రహ్మదేవుడు, పంచాయుధాలు, నమస్కరిస్తున్న మహర్షులు ఉండాలి. ఇట్లున్నచో ఈ శయనం ఉత్తమ యోగ శయనమౌతుంది. భృగు మార్కండేయ మహర్షులు లేనిదిగా విగ్రహ స్థాపన చేసిన అది మధ్యమ యోగశయనమౌవుతుంది. భృగు మార్కండేయ మహర్షులు, మధుకైటభులు లేనిది అధమ యోగ శయనమవుతుంది.

## 2. సృష్టిశయనం :

తొమ్మిది పడగలు గల శేషపాన్పుపై శ్రీహరి, పద్మాల వంటి నయనాలతో, రాజసభావంతో, నల్లని శరీరచ్ఛాయతో, ఎర్రని అరికాళ్ళతో, శాశ్వతుడై సృష్టిశయనరూపంలోనుంటాడు. లక్ష్మి, భూదేవి, బ్రహ్మ, సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, అప్స రసలు, మహర్షులు, రుద్రులు, ఆదిత్యులు, కిన్నరులు, మార్కం డేయ, భృగు, నారద మహర్షులను, మధుకైటభులను వీరం దరితో కలిగిన శయనం ఉత్తమ సృష్టిశయనమౌతుంది. మధు కైటభులు లేని సృష్టి శయనం మధ్యమంగానూ, భృగు మార్కం డేయ, మధుకైటభులు లేనిది అధమ సృష్టిశయనమౌతుంది.

## 3. భోగశయనం :

ఈ శయన రూపంలో శ్రీమన్నారాయణుడు సకల పరివారంతో కూడినవాడై ఏడు పడగలు గల శేషుని యందు పడుకొని ఉంటాడు. ఈ స్వామి నాభి నుండి వికసించిన తామర పూవునందు కూర్చున్న బ్రహ్మ బంగారు రంగుగల వాడై ఉంటాడు. బ్రహ్మకు రెండు ప్రక్కల శంఖము, చక్రము, గద, ఖడ్గము, శార్ఙ్గం అను పంచాయుధాలు; పద్మము, వనమాల, కౌస్తుభం కలిపి అష్టాయుధాలు కలిగియుంటాడు. ఆ ఆయుధాల ముందు గరుత్మంతుడుంటాడు. ఈ స్వామి కుడిచేతి ప్రక్కన లక్ష్మీదేవి, కుడి కాలి ప్రక్కన సరస్వతి, ఎడమచేతి ప్రక్కన శాంతి(శ్రీదేవి), ఎడమపాదం ప్రక్కన భూమి(భూదేవి) ఉంటారు.

అష్టాయుధాలలో ఖడ్గం, పద్మం, వనమాల, శార్ఙ్గ ముల స్త్రీరూపంగానూ, శంఖచక్రాలు పురుష రూపంగానూ, కౌస్తుభం, గద – నపుంసకులుగానూ, అలాగే శంఖం – తెలుపు, చక్రం – ఎరుపు, గద – పసుపు, వనమాల – లేత పసుపు, పద్మం– తెలుపు, కౌస్తుభం – నలుపు, ఖడ్గం – కావిరంగు, ధనుస్సు – నలుపు వర్ణాలతో అమర్చాలి.

సూర్యచంద్రులు, తుంబురనారదులు, సప్తర్షులు, అప్స రసలు, లోకపాలకులు, అశ్వనీదేవతలుంటారు. శ్రీవారి పూజా పీఠం ప్రక్కన నారసింహ, వరాహమూర్తులుంటారు. పాదాల వద్ద మధుకైటభులుంటారు. మధువు – ఎరుపు వర్ణంతోనూ, కైటభుడు–పచ్చని వర్ణంతోను ఉంటారు. విష్ణుమూర్తి సస్య శ్యామల వర్ణంతోనుంటాడు. శ్రీస్వామి అర్ధశయనంతో, యోగ నిద్రా రూపంతో, నాలుగు భుజాలతో, వికసించిన ముఖంతో, శృంగార వేషంతో, తామర రేకులవంటి నేత్రాలతో పూర్ణచంద్రుని వంటి ముఖంతో ఉండాలి.

ఈ విధంగా సపరివారంతో ఉండే శయనాన్ని ఉత్తమ భోగశయనమంటారు. శాంతిదేవి, సరస్వతీదేవి, నారసింహుడు, వరాహమూర్తి లేని శయనాన్ని మధ్యమ భోగశయనమంటారు. శాంతి సరస్వతులు, ఇతర దేవతలు, మధుకైటభులు లేని శయనాన్ని అధమభోగశయనమంటారు. భోగశయనాలందు బ్రహ్మను, అష్టాయుధాలను, శ్రీ భూదేవులను తప్పక ప్రతిష్ఠించాలి.

### 4. సంహారశయనం :

ఈ సంహార శయనమందు ఆ దేవదేవుడు రెండు పడగలు గల శేషుని పాన్పుగా చేసుకుని గాఢనిద్రయందు మూయబడిన కన్నులతో, తామసభావాన్ని వ్యక్తం చేసే మూడు కన్నులతో, వాడిన మొగం మొదలగు సర్వాంగాలతో, నల్లని వస్త్రాలతో, రెండు భుజాలతో, నల్లని శరీర కాంతులతో, రుద్రుడు మొదలగు భయంకర దేవతల రూపంతోనుంటాడు. ఈ విధమైన సంహారశయనమందు మిగతా శయనాలల్లోనుండే బ్రహ్మ మొదలగు వారినెవ్వరినీ ప్రతిష్ఠింపకూడదు.

### గర్భగృహ పద విన్యాసం :

శయన విగ్రహాలను స్థాపించే విధానంలోనూ, వాటి కొలతలు తీసుకొనే విధానంలోనూ కొన్ని ప్రత్యేక పద్ధతులు చెప్పబడి ఉన్నాయి. "దైవికపదాలు", "మానుషపదాలు" కలిసినంత పొడవే శయనబింబం పొడవవుతుంది. ఆ ప్రతిమ వెడల్పు కూడా ఈ రెండు పదాల వెడల్పే అవుతుంది. పైశాచిక పదంలో ముందు సగంలో దేవీ విగ్రహాల్ని అమర్చాలి. శయన విగ్రహం యొక్క పూర్వసూత్రం మానుషపదంలో ముందు సగంలోనే ఉండేలా చూడాలి. క్రిందపైన మధ్యసూత్రాలు బ్రహ్మ సూత్రానికి కుడి ప్రక్కగా ఒక అంగుళం దూరంలో శయన విగ్రహం నాభి నుండునట్లు అమర్చాలి. శయన విగ్రహం యొక్క పొడవు పన్నెండు పదాలు, వెడల్పు నాలుగు పదాలు, శేషుని పాన్పు పదమూడు పదాలుండాలి.

ఈ విధమైన శయన రూపంలో విగ్రహాలను స్థాపించి లోకకల్యాణం కొరకు కృషి చేయు మానవులు పరమ పుణ్య పాత్రులౌతారు.

## విన్నపం !

తిరుమల తిరుపతి దేవస్థానములు, శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయము మరియు దేవస్థానము అనుబంధ ఆలయాల నిత్యకైంకర్యాల కొరకు పాడి పశువులను దానంగా (వితరణ) ఇవ్వగోరు భక్తులకు విన్నపం.

ఏమనగా!

ప్రస్తుతం తిరుపతి నందు ఉన్న శ్రీ వేంకటేశ్వర గోసంరక్షణశాల యందు దానంగా ఇచ్చిన పశువుల సంఖ్య పరిమితికి మించి అధికమైనందున, తగినంత స్థలం లేనందున మరియు త్రాగునీటి ఎద్దడి వలన, తిరుమల తిరుపతి దేవస్థానము పాలకమండలి నిర్ణయం మేరకు క్రింది కనబరచిన నియమనిబంధనల ప్రకారం భక్తులు గోవితరణ చేయవలసిందిగా కోరుచున్నాం.

1) భక్తులు వితరణ ఇవ్వగోరు పాడి పశువులు "దేశవాళి ఆవులు" అనగా గిర్, షాహివాల్, తార్‌పార్కర్, రెడ్ సింధి మరియు ఒంగోలు జాతి ఆవులు మాత్రమే స్వీకరింపబడతాయి.
2) భక్తులు ఇచ్చు ఆవులు రోజుకు 8-10 లీటర్లపాలు ఇచ్చు పాడి ఆవులు (పైన తెల్పిన జాతి) మరియు ఒంగోలు జాతి ఆవులు రోజుకు కనీసం 5 లీటర్ల పాలు ఇచ్చేవి మాత్రమే స్వీకరింపబడతాయి.
3) కోడెలు, కోడెదూడలు, ఆవు దూడలు స్వీకరించబడవు.
4) పాలు ఇవ్వని, వయస్సు మీరిన, బక్కచిక్కిన ఆవులు స్వీకరింపబడవు.
5) ముఖ్యంగా అనారోగ్య పశువులను వితరణ చేయడం వల్ల, గోశాలలోని ఆరోగ్యవంతమైన పశువులన్నింటికి వాటి జబ్బులు సోకే అవకాశం ఉంది. కావున, భక్తులు మరియు వివిధ స్వచ్ఛంద సేవాసంస్థలవారు దీనిని గమనించప్రార్థన.

**తి.తి.దే. కాల్ సెంటర్ : 0877- 2277777**
**టోల్‌ఫ్రీ నెం. : 18004254141**

**- కార్యనిర్వహణాధికారి**



# మారీచుని రామభక్తి

– డా|| షేక్ మౌలాలి

మారీచుడు తాటక కుమారుడు. ఇతడు విశ్వామిత్రుని యాగానికి అనేక పర్యాయాలు తన పరివారంతో వెళ్ళి విఘాతం కల్గించాడు. రామాయణమందలి శ్రీరామతత్త్వమును, శ్రీరాముని సమస్త గుణసంపత్తిని చక్కగా ఆకళింపు చేసుకున్నవాడు మారీచుడు. సిద్ధాశ్రమంలో శ్రీరాముని బాణాఘాతాలకు గురైన తర్వాత, సీతాలక్ష్మణులు పంచవటిలోనున్నపుడు వచ్చి మరల దెబ్బతిన్నాడు. అప్పటినుండి మారీచునకు శ్రీరాముడంటే చాలా భయం; మరియు భక్తి కూడాను!

శ్రీరాముని గూర్చి అతిమానుష మహాలక్షణాన్ని మొట్ట మొదటగా రావణునకుపదేశించింది మారీచుడే! కాబట్టి మారీచుని కేవలం రాక్షస మాత్రునిగానే భావించకూడదు.

ఒకనాడు అకస్మాత్తుగా రావణుడు మారీచుని ఆశ్రమానికి వచ్చాడు. ఎన్నడూ తన ఆశ్రమం వైపుకు రాని రావణుని చూచి మారీచుడు గౌరవాదరాలతో ఎదురేగి అర్ఘ్యపాద్యాదులిచ్చి సుఖాసీనుని గావించి, "మీరొచ్చిన పని ఏమిటి?" అని అడిగాడు. రావణుడు కొన్ని క్షణాలు ఆ కంపనుని వచనాలు మరల మరల గుర్తు చేసుకొని, "ఇప్పుడు పంచవటిలో శ్రీరాముడున్నాడు. అతని భార్య, తమ్ముడు కూడా అతనితో కలిసి ఉన్నారట. ఆ రాముడు మన ఖరదూషణాదులను నిష్కారణంగా సంహరించాడట! నేను అతని భార్య అయిన సీతమ్మ కోసం వెళ్తున్నాను. రాముని సాధించుటకు ఇంతకంటె ఉపాయం లేదు. ఈ విషయంలో నీ సహాయమర్థించి వచ్చాను. నీకు తెలీని మాయామర్మాలు లేవు. నిన్ను శరణు వేడుతున్నాను. కనుక నాతో కూడి రమ్ము!" అన్నాడు.

**తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహారణే ।**

రావణుని వచనాలు విన్నతోడనే మారీచునికి పై ప్రాణాలుపైనే ఎగిరిపోయినట్లనిపించి, పెదవులు తడారిపోయి "రావణా! సీతను తెమ్మని నీకు ఎవరు చెప్పారోగాని, అతను మిత్ర రూపంలో నున్న నీ శత్రువౌతాడు. నీవు క్షేమంగా ఉండటం అతనికి ఇష్టం లేదు కాబోలు!

**ఆఖ్యాతా కేన వా సీతా మిత్ర రూపేణ శత్రుణా!**

శ్రీరాముడు గంధయుక్త గజరాజు, మనుష్యరూపంలో నున్న సింహం, పాతాళం వరకు విస్తరించియున్న మహాసాగరం. రాముని జోలికిపోతే నీకు వంశనాశనం తప్పదు. కనుక లంకకు వెళ్ళి నీ స్వపత్నులతో ఆనందంగా కాలం గడపు!" అని ఉపదేశ వాక్యాలు పలికాడు.

మారీచుని మాటలు విన్న రావణుడు తిరిగి లంకకు వెళ్ళిపోయాడు. కాని శూర్పణఖ లంకకు చేరి రావణుని మాటలతో రెచ్చగొట్టగా, రావణుడు తిరిగి జటామండలధారియై, నియతాహారుడై తాపసిక జీవనం గడుపుతున్న మారీచుని కలుసుకున్నాడు.

**తత్ర కృష్ణాజిన ధరం జటామండల ధారిణమ్ ।**
**దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసమ్ ॥**

"మారీచా! నా చెల్లెల ముక్కుచెవులు కోసిన కారణంగా సీతమ్మను అపహరించాలి. అందుకై నీ సహాయం కావాలి!" అని కోరాడు.

**అస్యభార్యాం జనస్థానాత్ సీతాం సురసుతోమామ్ ।**
**ఆనయిష్యామి విక్రమ్య సహాయస్తత్ర మే భవ ॥**

అందుకు మారీచుడు రాక్షసేంద్రా! శ్రీరాముడు నీవను కొన్నట్లు అసమర్థుడు కాడు. అదియును గాక సీతమ్మ అగ్నిప్రభ వంటిది. ఆమెను అపహరిస్తే నీవు, నీ బలగం సమస్తం శ్రీరాముని చేతిలో హతమౌతారు. అతని తమ్ముడైన లక్ష్మణుడు రాముడంతటి పరాక్రమశాలి! కానిపనికి పోయి ఎందుకు స్వనాశనము కొని తెచ్చుకుంటావు! సతతం ప్రియం పలికేవారు సర్వత్ర లాభపడతారు. ఆ హితవచనాలు వైద్యుని చేదుమందు వలె రుచించవు!

**సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః ।**
**అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః ॥**

శ్రీరాముడు ధర్మస్వరూపుడు. సాధుశీలుడు. సత్యపరాక్రముడు. ఆయన ధర్మపత్ని వైదేహి తన పాతివ్రత్యమహిమ

వలన తనను తాను సంరక్షించుకుంటుంది. అట్టి జనకనందినిని ధర్మపత్నిగా కలిగిన శ్రీరాముని తేజస్సు అప్రమేయమైనది. సీతను రాముని నుండి విడదీయుట సూర్యుని నుండి వెలుగును విడదీసేటటువంటిదే!

**రామో విగ్రహవాన్ ధర్మః సాధుస్సత్య పరాక్రమః ।**
**అప్రమేయం హి తత్తేజో యస్య సా జనకాత్మ జా ॥**

రాముడు ఎవ్వరికీ అపకారం చేసే స్వభావం కలవాడు కాదు. అటువంటి మహాత్ముని మీదకు నీవు అకారణంగా వెళ్ళటం ధర్మం కాదు. ఖరదూషణాదులను శ్రీరాముడు కారణ రహితంగా చంపలేదు. వారే ఆయన మీదకు నిష్కారణంగా వెళ్ళి కాలు దువ్వారు. పరాక్రమశాలి అయిన రాముని చేతిలో వినాశం పొందారు. ఇదంతా చూచి, ఎవరో, నీ వంశనాశము కోరి ఇలాంటి మాటలతో నిన్ను రెచ్చగొట్టారు.

నామాట వినకపోతే త్వరలో నీ లంకానగరమంతా బాణ పరంపరలతో భస్మీపటలమవక తప్పదు. రామచంద్రుడు పన్నెండు సంవత్సరాల ప్రాయంలో నున్నప్పుడు దండకలో విశ్వామిత్రుని యజ్ఞాన్ని విధ్వంసం చేయబోయిన నన్ను శతయోజనాల దూరంలో సముద్రంలో పడేట్లు మానవాస్త్రంతో కొట్టాడు. ఎలాగో నాకు చావు తప్పింది.

మరో విషయం చెబుతా విను! మరో ఇద్దరు రాక్షసులతో కలిసి నేను లేడిరూపాన్ని ధరించి దండకలో విహరిస్తూ తాపసికుల రక్తం త్రాగుతూండేవాడిని. ఇంతలో మునివేషధారులైన సీతారామలక్ష్మణులు అక్కడ నాకంట పడ్డారు. మేము ముప్వరము ఆ ముప్వుర్ని వాడియైన కొమ్ములతో చంపుదామని ముందు కురికాం. రాముడు ఏ మాత్రం తొణక్కుండా మూడు వాడి బాణాలు మా పై ఒక్కసారిగ వదిలాడు. నా అనుచరులిరువురు అక్కడికక్కడే ప్రాణాలు వదిలారు. నేను అంతకు ముందుగానే రామబాణాఘూతాన్ని చవిచూచియున్నాను కనుక ఒక్క ఉదుటున పారిపోయి బ్రతికి పోయాను. అప్పటి నుండి నాకు రాక్షస జీవితం అంటే విరక్తి కలిగి తాపసిక జీవనం గడుపుతున్నాను.

ఈ అరణ్యమెల్ల నాకు రామమయంగా కన్పిస్తూ, రత్నము రథము మొదలైన రకారాది శబ్దాలంటే చాలు నేను భయంతో వణికిపోతున్నాను. ప్రతివృక్షంలో చీరకృష్ణాజినధారియై ధనుర్బాణాలు ధరించిన రాముడు యముని రూపంలో కన్పిస్తున్నాడు.

**వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృ ష్ణాజినాంబరమ్ ।**
**గృహీత ధనుషం రామం పాశహస్త మివాంతకమ్ ॥**

"రాముడు సాధుమూర్తి, అప్రమేయుడు. ఆయనతో విరోధం తగదు. నీవు ఇంటికి తిరిగి వెళ్ళటమే సుఖం. సీతమ్మను నీవు అపహరించలేవు. రాముడు ఏ పొరపాటు చేయలేదు. నీవు నాకు బంధువువి. కనుక ఇంత వివరంగా చెప్పవలసి వచ్చింది. నామాట వినకపోతే నీవు, నీ బలగం రామ శరపరంపరలకు ప్రాణాలు వదలవలసి వస్తుంది!" అని రావణునకు సుదీర్ఘ హిత బోధ చేశాడు.

కాని, రావణుని చెవికి మారీచుని హితవాక్కులు ఏమాత్రం ఎక్కలేదు. "రాముని చేతిలో చస్తాననే భయం నిన్ను పూర్తిగా ఆవహించినట్లుంది. నేను చెప్పినట్లు చెయ్యకపోతే నా చేతిలోనే నీవు ఛస్తావు!" అని బెదిరించాడు.

"పరమ దుర్మార్గుడైన రావణుని చేతిలో మరణించటం కంటె ధర్మతత్పరుడయిన శ్రీరాముని చేతిలో మరణించటమే మేలు!" అని భావించిన మారీచుడు నిర్లిప్తంగ రావణుని రథం మీద కూర్చున్నాడు. రథం పంచవటికి చేరింది. రావణుడు కూడా ఆశ్చర్య పడేట్లు మనోహరమైన లేడి రూపం ధరించి నేలమీదకు దిగాడు మారీచుడు. అతని శక్తి ఎట్టిదంటే; రథం మీద నుండి నేలమీదకు దిగేంతవరకు మారీచుడుగా నేల మీదకు దిగేసరికి మాయలేడిగా రూపం ధరించాడు. అది అతని మాయలేడి మాయలోని నేర్పు.

ఇక్కడ మారీచుడు రావణాసురుని కోరిక తీర్చటం కొరకు తాను తన ప్రాణాలను ఆహుతి చేస్తున్నాడు. సీతాపహరణం తథ్యమని రావణుడు సంబరపడుతుండగా, మాయ లేడి దొరుకుతుందని సీతారాములు ఉబలాటపడ్డారు. ఇరు వైపుల ఆనందానికి కారణం మారీచుడే అయ్యాడు. భౌమ విధానంలో రావణునకు సంతోషకరమైతే, తాత్త్వికంగా ధర్మ సంరక్షణకు దోహదమైనది మారీచుని నటన. చివరకు జరగాల్సింది రావణవధే. దానికి మంథర, కైకేయి, శూర్పణఖ వివిధ

కుంచికలుగా పనిచేశారు. ఇప్పుడు మారీచుడు అంతకుమించిన విధంగ ఉపయోగపడుతున్నాడు. రావణసంహారానికి ఇంత వరకు ఏ పాత్ర ప్రాణత్యాగం చేసియుండలేదు. మారీచవధతో రావణాంతానికి ఒరిపిడి జరుగబోతోంది.

పూలు ఏరుకుంటున్న సీతమ్మ సమీపానికి వచ్చి మాయ లేడి రూపంలో నున్న మారీచుడు మందగమనం చేస్తూ తిరుగాడ సాగాడు. అక్కడ వనంలో తిరుగాడే లేళ్ళు మాయలేడి దగ్గరకు వచ్చి వాసన చూచి భయోత్పాతంతో దశదిశల పారిపోసా గాయి.

**ఉపగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశో దశ ।**

మాయలేడి రూపంలోనున్న మారీచుని గుర్తించిన లక్ష్మణస్వామి శ్రీరామునకు నివేదించాడు. కాని సీతమ్మ, "ఆర్యపుత్రా! ఈ అందాల లేడి నా మనస్సును హరించింది, దానిని తెచ్చి పెట్టు!" అంది రామునితో – "మృగో హరతి మే మనః"

ఒకసారి సీతమ్మను, అటు మాయలేడిని చూచిన శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో "నీవన్నట్లు ఆ లేడి రాక్షసుడే అయ్యుంటే, మహర్షుల సంరక్షణార్థం దానిని చంపాలి కదా!" అని ధర్మరహస్యం పలికాడు.

రావణాసురుని మరణాన్ని, పరతత్త్వంగానే తాను ఉపాసించిన శ్రీరాముని రాజ్యవైభవాన్ని చూడకుండానే మారీ చుడు ప్రాణాలు వదిలాడు. సీతారాముల విరహవ్యథను చూచి మారీచుడు సహించలేదు. కాబట్టి ముందుగానే తనువు చాలించాడు.

మారీచుడు ప్రాణం వదిలే సమయంలో కూడా రామ నామస్మరణం చేయకుండ, తనకు ఏమాత్రం అసత్యదోషం అంట కుండ రావణునకే సహాయం చేశాడు. మారీచునికంటె కూడా "హా సీతా! హా లక్ష్మణా!!" అన్న అతని పల్కులు రాముడి నెంత గానో వ్యథపెట్టాయి.

ఏదో విధంగా శ్రీరామునితో సంబంధమున్నందువలన మారీచుడు అసత్యమాడలేకపోయాడు. రావణునకు సహాయం చేసిన పాత్రల్లో మారీచుని పాత్ర ముఖ్యమైనది.

**తత్త్వానుశీలన :**

రామాయణపాత్రల్లో మారీచుడు చాలా విశిష్టత కలిగిన వాడు. విశ్వామిత్రుని తర్వాత శ్రీరామతత్త్వాన్ని బాగా విశదపరచింది మారీచుడే! రామబాణానికి ఎదురులేదు. పరశురాముడు, సముద్రుడంతటివారు కూడా రామబాణానికి వినమ్రులయ్యారు; కాకాసురుడు నానా గగ్గోలు పడి ముల్లోకాలు తిరిగి ఎక్కడా శరణు లభించక కన్ను లొట్ట చేసుకున్నాడు.

కాని, మారీచునిమీద ఇంతకు మునుపు రెండుసార్లు శ్రీరామబాణప్రయోగం జరిగింది. మరి అతడు ఎందుకు చావ నట్లు! మారీచుని వలన సీతాపహరణం, తద్ద్వారా రాక్షసత్వ నిర్మూలన జరగాలని బహుశః రామబాణానికి తెలుసునేమో! అందుచేతనే రెండుసార్లు వదలబడినా, మూడవసారి రావణత్వ సంహారానికి నాంది పలికింది రామబాణం.

మరో విచిత్రమేమంటే, మారీచుని యోచనా సం విధానం, నటనా కౌశలం చాల గొప్పవి. కనుకనే రావణు దంతటివాడు శరణు వేడాడతనిని. అతని శ్రీరామ కంఠస్వరాను కరణ, ఎన్నడూ రాముని వీడియుండని సీతను సైతం కలవర పెట్టి, ఆ తొందరపాటులో మహాభక్తుడయిన లక్ష్మణుని నిందించే టంతటి అద్భుతంగా ఉంది. రక్షణలేని సీతమ్మను అపహరించ గలిగాడు రావణుడు. మారీచుని 'రామభక్తి' తన వ్యూహాన్ని చక్కగా నడిపించింది.

మారీచుడు రాక్షసుడు కావచ్చు! కాని, ధర్మం అంటే ఏమిటో తెలియజేశాడు. భగవత్తత్త్వం బాగా వివరించాడు. ధర్మానికి భగవత్తత్త్వానికి అభేదం ప్రతిపాదించాడు. ధర్మం ఎంతగా నలిగినప్పటికి, చివరకు భౌమం నశించి ధర్మప్రతి పాదన తప్పక జరుగుతుందని అతనికి తెలుసు. చావు తప్పదని తెలుసుకున్నపుడు కూడా రామబాణాఘాతానికి గురై రావణత్వ నిర్మూలనకు ముఖ్యకారకుడయ్యాడు.

యక్షిణి కడుపున పుట్టి, రాక్షసకృత్యాలతో తాపసులను అనేక రీతుల పీడించి, చివరకు తాను తాపసిక జీవనం గడు పుతూ ధర్మసంస్థాపనకు ప్రాణాలు అర్పించిన మహనీయునిగా మారినవాడు మారీచుడు.

# వేదం.. తెలుసుకుందాం!

ధారావాహిక 06

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

## విజ్ఞాన మణిపేటిక :

వేదమనే అక్షరరాశి భగవంతుడు మానవాళికి అనుగ్రహించిన అక్షయసంపద. అది భరతమాత భవ్యాకృతికి అతిలోక సౌందర్యాన్ని కలిగించే భద్రభూషణం. ప్రపంచంలో భారతీయులు తలెత్తుకు తిరగడానికి, భారతదేశం గురుస్థానంలో ఉండటానికి కారణమిదే. వైదిక వాఙ్మయం అజ్ఞానాంధకారంలో అలమటించే అఖిల మానవులకు అనుసరణీయమైన, అత్యుత్తమమైన పవిత్రమార్గాన్ని దర్శింపజేసిన భవ్యజ్యోతి. ఇది ఐహికాముష్మికమైన వివిధ విషయాలకు సంబంధించిన సదసద్వివేక సౌభాగ్యాన్ని ప్రసాదించే విజ్ఞాన ఘనమణి పేటిక.

ప్రపంచంలోని బహువిధ ప్రాణికోటిలోను మానవునికి మహౌన్నత్యమును సమకూర్చిపెట్టినది వేదమే. తమ తమ అనుభూతులు, పరిశోధన ఫలితములను అక్షరబద్ధం చేసి తమ తరువాతి తరం వారికి అందించే అనన్య సౌభాగ్యం మానవ జాతికి కలిగింది. మన పూర్వీకుల సదుపదేశములతో సమీచీన జీవిత పాఠములను నేర్చుకొనే సువర్ణావకాశం మనకు వేదం వల్లనే సమకూరింది.

అక్షరబద్ధమైన మన ప్రాచీనార్యుల అనుభూతే నేటికీ మన బ్రతుకుబాటను ప్రకాశింపజేస్తున్నది. వేయేల? మానవుడు మానవుడుగా మనగలగడానికి మహోత్కృష్టసాధనం ఈ శబ్ద జ్యోతియే. ఈ జ్యోతియే లేనిచో మానవుడు తన గమ్యాన్ని తాను తెలుసుకోలేక పెనుచీకటిలో అలమటించేవాడు. అందుకే వేదం పవిత్రమైన విద్య అని అథర్వవేదం, శతపథ బ్రాహ్మణం, తైత్తిరీయ బ్రాహ్మణం చెబుతున్నాయి.

## పావనాక్షరరాశి :

ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలను, వాటి సాధనలతో పాటు మనకు తెలియజేసే శక్తి ఈ శబ్దజ్యోతికి దక్క మరి దేనికీ లేదు. అందులోను ఇది అనాదిగా, అవిచ్ఛిన్నంగా, నాశరహితంగా, నిత్యనూతనంగా, సంప్రదాయ పరంపరగా ప్రాప్తించిన నిరవద్యవిద్య. మనకు పరమప్రమాణమై నిత్య సత్యమై, అపౌరుషేయమై విరాజిల్లుతున్న పావనాక్షరరాశి.

**ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే ।**
**ఏనం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా ॥**

ఇది ప్రత్యక్షానుమానములకందని బహువిధోపాయ పురుషార్థములను తెలియజేసే విలక్షణమైన అక్షరరాశి కావున దీనిని 'వేద'మన్నారు. ధాన్య, పశు, పుత్ర, మిత్ర, కళత్రాది రూపంలో, ఇహలోకానికి సంబంధించిన సకల విధ సంపత్తికి, స్వర్గాది పారలౌకికమైన బహువిధభోగసమృద్ధికి సాధనభూతాలైన యాగహోమాదులను గూర్చి తెలియజేసేది వేదమే. అందులోను ఆత్మ, పరమాత్మ, విషయకమైన అతిమనోజ్ఞమైన సూక్ష్మాతి సూక్ష్మమైన, మహానందరూపమైన మోక్షోపాయాన్ని ఉపదేశించే సామర్థ్యం వేదానికి తప్ప ఇతర ప్రమాణాలకు లేదు.

**తస్మాద్యజ్ఞా త్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే ।**
**ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మా ద్యజు స్తస్మా దజాయత ॥**

వేదం పరమపురుషుని వలన జనించినట్లు పురుష సూక్తం చెబుతున్నది. కనుక వేదం అపౌరుషేయం. శబ్దం నిత్యం. ఆత్మ నిత్యం. ఆత్మతత్త్వాన్ని తెలియజేసే వేదం కూడా నిత్యమే. పరమాత్మ ఆద్యంతరహితుడు. అలాగే వేదానికి కూడా ఆది, అంతము లేవు, అవి అనంతాలు. 'అనంతా వై వేదాః'.

## వేదనిర్వచనం :

వేదమనగా జ్ఞానమని అర్థం. 'విద-జ్ఞానే' అనే ధాతువు నుండి వేదశబ్దం ఉత్పన్నమైనది. ధర్మాన్ని తెలియజేసేది వేదం. 'విదంతి అనేన ధర్మం ఇతి వేదః'. మానవులకు ఇష్టప్రాప్తిని కలిగించి, అనిష్టాలను తొలగించుటకు తగిన అలౌకికమైన ఉపాయములను, మార్గములను తెలియజేసేది వేదం. ప్రత్యక్షంగా గాని, ఊహ ద్వారా కాని తెలుసుకోలేని విషయాలను తెలియజేసేది వేదం.

దేని వలన జ్ఞానాన్ని పొందగలమో అదే వేదం. సర్వాన్ని తెలియజేసేది వేదం. వేదానికి ఋషి, బ్రహ్మ, ఆమ్నాయం, సమామ్నాయం, శ్రుతి, స్వాధ్యాయం, అనుశ్రవం, ఛందస్సు, త్రయీ, నిగమాగమాలనే అనేక పేర్లున్నాయి.

వేదభారతి మానవాళికి మహోపకారకమైన అక్షయ నిధి. ఇది సర్వార్థసాధకమైనది. సర్వానర్థనివారకమైనది. అనాది నిధనం, అపౌరుషేయం, స్వతఃప్రమాణం, సర్వజ్ఞకల్పం, పరమ పావనమైన దివ్యశబ్దరాశి. వేదానికి కర్త లేదని స్మృతికారులు స్పష్టంగా చెప్పారు.

**న కశ్చి ద్వేదకర్తా చ వేదం శ్రుత్వా చతుర్ముఖః ।**

**తథైవ ధర్మాన్ స్మరతి మనుః కల్పాంతరేఽంతరే ॥**

**(పరాశర స్మృతి)**

## వేదోత్పత్తి :

వేదవ్యాసుడు వేదవిభాగం చేశాడేకాని, వేదాలను రచించలేదు. బ్రహ్మదేవుడు భగవంతుని నుండి వేదాలు గ్రహించాడు కాబట్టి ఆయన కూడ కర్త కాదు. సర్వజ్ఞుడు, సర్వసాక్షి, సర్వప్రకాశకుడు అయిన భగవంతుని నుండి వేదాలు ఉద్భవించాయి. నిత్యము, అనాది అయిన వేదాన్ని భగవంతుడు అభివ్యక్తం చేయడం వలన ఆయన్ని వేదకర్తగా వ్యవహరిస్తున్నారు.

భగవంతుడు సృష్ట్యారంభంలో బ్రహ్మను సృజించి ఆయన హృదయంలో వేదాలను ప్రకాశింపజేశాడు. జగత్సృష్టి కార్యంలో సహకరించుటకై విజ్ఞానభాండాగారమైన వేదాలను ఆయనకుపదేశించాడు.

**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**

**యో వై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై**

**- శ్వేతాశ్వతరోపనిషత్తు అ.6 మం.18**

ఆద్యంతరహితమై, నిత్యమైన వేదవాఙ్మయం స్వయంభువైన బ్రహ్మదేవుని నిశ్శ్వాసరూపంలో అభివ్యక్తమైంది.

**అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా**

దీనిని బట్టి ఈ ప్రపంచానికి, దాన్ని సృష్టించిన ప్రజాపతియైన బ్రహ్మదేవుని కంటె ముందే వేదాలున్నాయని పై ప్రమాణాల వల్ల మనకు తెలుస్తున్నది.

## ప్రాజాపత్య వేదం :

'ప్రాజాపత్యో వేదః' – వేదాలు ప్రజాపతికి సంబంధించినవి. 'ప్రజాం సృష్ట్వా పాలయిష్యేతి తస్మాత్ ప్రజాపతి రభవత్' (గో.బ్రా.పూ.). ప్రజలను సృష్టించి, పోషించుచున్నాడు కావున ప్రజాపతి అయినాడు. ప్రజాపతి సృష్టిస్తున్నాడు, పోషిస్తున్నాడు. ప్రజాపతే సృష్టికి, స్థితికి కారకుడు. ప్రకృతికి పరమాత్మకు పరిమితి లేదు. ప్రజాపతి సమస్తం. అన్నీ ఆయనే. అందువల్ల దీనిని 'ప్రాజాపత్యవేద'మన్నారు.

నిత్యం వేదాధ్యయనం చేయాలని, వేదం చెప్పిన కర్మలాచరించాలని శంకర భగవత్పాదులు ఇలా చెప్పారు–

**వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతామ్**

'వేద, దేవ' శబ్దాలు పర్యాయపదాలు, వేదవాచకాలు అని వాజసనేయమంత్రం ఇలా తెలియజేస్తున్నది – 'వేదోఽ సి యేన త్వం దేవ వేద.' వేదం దేవతాతత్త్వాన్ని ప్రతిపాదిస్తుంది. మొత్తం వేదాన్ని అధ్యయనం చేయలేనివారు ఒక్క దేవపదాన్నైనా అధ్యయనం చేయాలని వేదమిలా ఆదేశిస్తున్నది – 'అప్యేకం దేవపద మధీయీత' (శతపథబ్రాహ్మణం).

దీర్ఘతపస్సమాధిలో వేదాన్ని దర్శించుట వలన వశిష్ఠుదు మొదలైన వారిని ఋషులన్నారు. 'ఋషిర్దర్శనాత్' వేదాన్ని దర్శించుట చేత వారు ఋషులయ్యారు. ధర్మాన్ని, పరమాత్మను గురించి తెలియచేస్తుంది కాబట్టి వేదానికి 'ఋషి' అనే పేరొచ్చింది. పరబ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించేది కావున వేదాన్ని 'బ్రహ్మ' అన్నారు. అది నిరతిశయ మహత్వ పూర్ణమైనది. 'బృంహయతి–వర్ధయతీతి బ్రహ్మ'.

## బ్రహ్మజ్ఞానవృక్షం :

వేదం మిక్కిలి పవిత్రమైనది. అది అనేక శాఖలతో విరాజిల్లే బ్రహ్మజ్ఞానవృక్షం. నిరంతర అధ్యయన అధ్యాపనాదుల చేత రక్షించుకోవలసిన కల్పవృక్షం. ఆ విధంగా రక్షిస్తే అది మనకు ఇహపరాలకు కావలసిన సంపదను, సుఖాన్ని, ఆనందాన్ని, అమృతత్వాన్ని ప్రసాదిస్తుంది. ఆ కల్పతరువును నిర్లక్ష్యం చేస్తే మనకు మిగిలేది కన్నీళ్ళేనని వేదకల్పవృక్షాన్ని గురించి సాక్షాత్ భగవత్స్వరూపులైన వ్యాసాది మహర్షులు ఎంతో ఆదరంతో ఇలా చెప్పారు–

**బ్రహ్మవృక్షో రక్ష్యమాణో మధు హేమ చ వర్షతి ।**
**అరక్ష్యమాణ స్సతత మశ్రుపాతం చ వర్షతి ॥**

వేదం ధర్మమూలం. వేదం విశ్వశాంతి మహామంత్రం. వేదం విజ్ఞాన మానససరోవరం. ఆ దివ్యసరోవరంలోని హృదయ కమలాలు జ్ఞానభాస్కరుని ప్రకాశానికి సర్వసమగ్రంగా వికసించాలి. ఆ దివ్యపరిమళాలు నలుదెసలా వ్యాపించాలి. మధురాతి మధురమైన మకరంద బిందువులు వర్షించాలి. అదే హృదయపద్మానికి పరిపూర్ణ వికాసం. అలాగే విద్య అంటే కేవలం విషయాలను గ్రహించడం మాత్రమే కాదు. బుద్ధి వికసించాలి. సౌశీల్యం పెంపొందాలి. హృదయం పరిపక్వం కావాలి. అప్పుడే వ్యక్తిత్వం పరిపూర్ణమౌతుంది.

అందుకే పూర్వం గురుకుల పద్ధతిలో విద్యాబోధన జరిగేది. విశేషించి వేదవిద్య స్వరంతో కూడుకొన్నది, మంత్ర రూపమైనది. అది కేవలం గురువు ద్వారానే నేర్చుకోవాలి. ఆచార్యుల ఉచ్చారణ, అనూచ్చారణ పద్ధతిలో వేదాన్ని అధ్యయనం చేయాలని వేదమాదేశిస్తున్నది. అంటే గురువు చెప్పింది విని తిరిగి దానిని అలాగే చెప్పాలి. అందువల్లనే ప్రాచీన వేద విద్యావ్యవస్థలో గురుశిష్యసంబంధం అంత పవిత్రంగా ఉండేది. అలాగే గురుకుల పద్ధతిలో విద్యాబోధనకు అంతటి ప్రాధాన్యముండేది. అటువంటి వేదవిద్యను నిరంతరం గురుముఖంగా అభ్యసించాలి. ఆ విధంగా గురుముఖంగా శ్రవణం చేస్తూ దానిని గ్రహించి నిరంతరం అభ్యసించుట వలన దీనిని 'ఆమ్నాయం', 'సమామ్నాయ'మన్నారు. 'మ్నా–అభ్యాసే'. 'ఆమ్నాయ సమామ్నాయ శబ్దౌ వేదే ఏవ రూఢౌ'. ఇది కేవలం శ్రవణం ద్వారానే పొందదగినది కావున వేదానికి 'శ్రుతి', 'శ్రుతా', 'అనుశ్రవా' అనే పేర్లు ఏర్పడ్డాయి. గురుముఖంగా వినబడేది కాబట్టి దీనిని 'అనుశ్రవ'మన్నారు. 'గురుముఖా దనుశ్రూయతే ఇత్యనుశ్రవో వేదః'. 'శ్రు–శ్రవణే'. ఆమ్నాయం ఒక క్షీర సముద్రం వంటిది. దానిని శ్రవణ మనన అభ్యాసరూపంలో శ్రద్ధగా మథిస్తే దేవతలకు కూడా దుర్లభమైన పరమపురుషార్థమైన అమృతత్వం సిద్ధిస్తుంది. 'స్వం' అధ్యయనం స్వాధ్యాయః'. వేదం ఆత్మతత్త్వాన్ని ప్రతిపాదించుట వలన దీనికి స్వాధ్యాయమనే పేరొచ్చింది. 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' (తై.ఆ. 2. 2. 5) అనే వాక్యము మొత్తం వేదానికి స్వాధ్యాయమనే పేరును తెలియజేస్తుంది. స్వాధ్యాయము ఆత్మవిచారణ రూపమైన తపస్సు. 'తపో హి స్వాధ్యాయః'. నారద వ్యాస వాల్మీకాది మహర్షులందరూ స్వాధ్యాయ తపోనిరతులే. కావున స్వాధ్యాయము (వేదాధ్యయనము) పరమాత్మతత్త్వాన్ని తెలియజేస్తుంది.

## త్రయీవిద్య :

వేదానికి 'త్రయీ' అని మరొక పేరుంది. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదమనే మూడు రూపాలతో ఉంది కాబట్టి దీనిని 'త్రయీ' అన్నారు. త్రయీ అనగా మూడు అవయములు కలది. 'త్రయః అవయవాః యస్యా స్సా త్రయీ' అని ఈ పదానికి నిర్వచనం. ఈ 'త్రయీ' పదం వేదశాఖకు, వేద త్రయానికి, అన్ని వేదాలకు అన్వయిస్తుంది. 'ఋగ్యజుస్సామాని', 'ఋక్సామయజూంషి'. చాలకాలం వరకు ఈ మూడు వేదాల ద్వారానే యజ్ఞాలు నిర్వహింపబడినట్లు తెలుస్తున్నది. "త్రిభిర్వేదై ర్విధీయతే" – సత్యా.సూ. 1. 1

**త్రయో వేదా అజాయన్త. ఋగ్వేద ఏవాగ్నే రజాయత,**
**యజుర్వేదో వాయోః, సామ వేద ఆదిత్యాత్,**
**త్రయ్యా విద్యయేతి బ్రూయాత్. - ఐ.బ్రా.5.32.33**

మొదట ఈ మూడు వేదములు ఆవిర్భవించినట్లు ఐతరేయ బ్రాహ్మణం పేర్కొంది. ఆ తర్వాత అథర్వవేదం ఆవిర్భవించింది. పాదవ్యవస్థ కలిగి పద్యరూపాలైన ఋక్కులతో కూడినది ఋగ్వేదం. గద్య రూపాలైన యజుస్సులతో కూడినది యజుర్వేదం. గీతిమయమైన సామలతో కూడినది సామవేదం. ఈ మూడింటిని కలిపి 'త్రయీ విద్య' అంటారని శతపథ బ్రాహ్మణం ఇలా పేర్కొంది –

**త్రయీ వై విద్యా ఋచో యజూంషి సామాని**

ఇంకను వేదం కర్మకాండ, ఉపాసనకాండ, జ్ఞానకాండ అనే మూడు కాండలతో కూడినది కాబట్టి దానికి 'త్రయీ' అని పేరు. "త్రైవిద్యా మాం సోమపా పూతపాపాః' అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ వేదాన్ని త్రయీవిద్యగా పేర్కొన్నాడు. పాదబద్ధములైన మంత్రాలను 'ఋక్కు'లంటారు. 'ఋక్ పాదబద్ధా'. గానంచేసే మంత్రాలను 'సామలు' అంటారు. 'గీతం తు సామ'. గద్య రూపంలో ఉన్న మంత్రాలను యజుస్సులంటారు. 'గద్యం యజుర్మంత్రః'. అగ్ని నుండి ఋగ్వేదం, వాయువు నుండి యజుర్వేదం, సూర్యుని నుండి సామవేదం, అంగిరసుని నుండి అథర్వవేదం ఆవిర్భవించాయి.

# శ్రీచరణ శరణాగతి

అడుగు రసాతలంబు, చరణాంబుజ శీర్షము భూమి, పిక్కలున్
వడివడు జంఘ లద్రివరపంక్తులు, నూరువులున్ ప్రజాపతుల్,
కడుపు విధాతృసాగరము, కక్ష్యలు దిక్కులు, రొమ్ము లక్ష్మి, చే
పడు భుజముల్ దిశాపతులు, వక్త్రముమి న్నినచంద్రలోచనా! 31

నీ పాదంబులనంటి యెంతయు సమున్మేష స్వభావమ్ముతో
నేపారెన్ గద రావణానుజుడు! మున్నేకైకదర్పంబుతో
శ్రీపాదంబుల నంటముట్టనని దుర్నీతిన్ దశాస్యుండు రూ
పేపారన్ జెడె, తాదృశాంఘ్రులె నిరూపించున్ సదా సద్గతిన్ 32

నీ పదయుగ్మప్రభావమును నెన్నగ వ్రాయగ నెవ్వరైన నే
ప్రాపుననైన నోపరు కృపాపర! నీకయి నీవె చెప్పినన్
ఏపగు నంబుధుల్ సిరగ, నెవ్వనికందని మబ్బు పత్రమై
తోపడ వేలకన్ చెవుల దూగునొ యేమొ! ఫణీంద్రనాథుడున్ 33

చూపులు బుట్టపుట్టువును, సూత సుతాసుతుడైన వ్యాసుడున్
నీ పదదర్శనమ్మునకు నిద్దరు రెండుగ వ్రాసిపెట్టినా
రోపని యర్థకామముల యుద్ధృతి మాన్పుకృతుల్ యుతంబుగన్
మాపని శ్రీపదద్వయి రమారమణా! శరణంబు జొచ్చుటే. 34

పదములు నొక్కటై విరళభావములిచ్చెడి రీతివెల్గి నీ
పదముల బాడె తేనెపెఱ వంటి హృదంతర సీమ మాటికిన్
పొదలెడు భక్తి ముక్తి పరిపూర్ణ తరంగములొప్ప రాఘవా!
సదయత లోకపావనము సల్పెడు పట్టుల బుట్టపుట్టువున్. 35

వేదములెల్ల నుట్టిపడు విశ్రుత కావ్యము నీ చరిత్ర గా
దే! దివినంటుచు న్కరుణ దీప్త రసోత్తము పాదపాదమున్
నాద వినోదరామ! పరిణామముగా జనవేదనాంబుధిన్
వాదున గట్టివేయు నపవాదము దీరిచి ధర్మసాధ్యమై 36

- ఆచార్య రావికంటి వసునందన్

**అగ్నేర్ ఋగ్వేదో, వాయోర్యజుర్వేదః,**
**సూర్యాత్సామవేదః, అథర్వాంగిరసో ముఖమ్.**
**- శతపథ బ్రాహ్మణం. 11-4-2-3**

వేదానికి 'కవి' అని, 'కావ్య'మని పేర్లున్నాయి. కర్మోపాసనాదుల ద్వారా చిత్తానికి సరసత్వాన్ని ఆపాదిస్తూ చమత్కారంగా రమణీయమైన బ్రహ్మరసాన్ని ప్రతిపాదిస్తుంది కాబట్టి దీనికి కవి, కావ్య శబ్దాలు ఏర్పడ్డాయి. 'ఏతే వై కవయః యద్ ఋషయః', 'త్రయీ వై విద్యా కావ్యం ఛందః' మొదలగు వేద వాక్యాలు కవి, కావ్యపదాలను వేదానికి నిర్దేశిస్తున్నాయి. స్వయంభువు, సర్వవ్యాపకుడు, పరిశుద్ధుడు, సనాతనుడు, నిరాకారుడైన భగవంతుడు విశ్వంలోని జీవుల శ్రేయస్సు కొరకై వేదరూపంగా సమస్త విద్యలను ఉపదేశిస్తున్నాడని యజుర్వేదమిలా చెబుతున్నది –

**కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యాథాతథ్య**
**తోఽర్థాన్, వ్యదధా చ్ఛాశ్వతీభ్య స్సమాభ్యః**
**- యజు.అ.40 మం.8**

వేదానికి ఛందస్సని కూడా మరో పేరు. 'ఛాదనాత్ ఛందాంసి' మృత్యువు నుండి ఆచ్ఛాదించి (కప్పిపెట్టి) కాపాడేవి కాబట్టి ఛందస్సులన్నారు. అలాగే లోకోత్తరమైన, ఆహ్లాదకరమైన, రమణీయమైన పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రతిపాదించేవి కాబట్టి వీటిని ఛందస్సులన్నారు. 'చందయంతి ఆహ్లాదయంతీతి ఛందాంసి'. గాయత్రి, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్ మొదలగునవి ఛందస్సులు. అటువంటి వైదిక ఛందస్సులతో కూడినది కావున వేదమునకు 'ఛందస్సు' అని పేరు. ఈ ఛందస్సులు మానవుని మృత్యుముఖం నుండి కాపాడి అతనికి అమృతత్వాన్ని కలిగిస్తాయి. ***(ఇంకా ఉంది)***

# సందేహాలు? సమాధానాలు!! - 'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**యుగాలలోకెల్ల మహత్త్వము గల్గిన యుగమేది? దాని విశిష్టత తెలుపగలరు. కలియుగంలో మానవుని విధ్యుక్త ధర్మాలను తెలుపగలరు. - జి.లక్ష్మీసత్యనారాయణ, వెంగ్యాపేట.**

☛యుగాలలో శ్రేష్ఠమైంది కృతయుగం. కృతయుగంలో ధర్మ దేవత నాలుగు పాదాలతో నడిచింది. ఆ కాలంలో అందరూ తపోధనులు. సత్యం, త్యాగం, అస్తేయం, శౌచంవంటి లక్షణా లన్నీ పాటింపబడినవి. కాలం రీత్యా కూడా అధికమైందే. 17,28,000 సంవత్సరాలు కృతయుగం.

కలియుగంలో ధర్మదేవత ఒకే పాదంతో సంచరిస్తుంది. ధర్మకార్యాలు నశిస్తాయి. స్వార్థానికి పట్టాభిషేకం జరుగుతుంది. 'సత్యం వద - ధర్మం చర' అనే వానిని పాటించి తల్లితండ్రులను ప్రత్యక్ష దైవాలుగా భావించి, పూజించటం-నీతి-త్యాగం మొద లైన ధర్మాలను పాటించటమే కలియుగ మానవుని కర్తవ్యం.

**(అ) వాయుదేవుడు అగ్నిదేవుడు ఏ విధంగా జన్మించారు? వారియొక్క జన్మ వృత్తాంతం తెలుపగలరు.**

**(ఆ) జంతుబలులు కేవలం గ్రామ దేవతలకే ఇస్తారెందుకు?**

**- ఎ.కుశల కుమారి, నడింపల్లి.**

☛**(అ)** పూర్వం పూతాత్ముడనే విప్రుడుండేవాడు. ఆయన కశ్యపు నకు జ్ఞాతి (దాయాది). ఆ పూతాత్ముడు కాశీక్షేత్రంలో ఎన్నో సంవత్సరాలు శివుని గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై ఆతనికి, దిక్పాలకత్వం-ప్రాణం-అపానం-వ్యానం- ఉదానం- సమానమనే పంచమూర్తిత్వం-అన్నిచోట్ల ఉండగల వ్యాపకశక్తి- అన్నింటికన్న అధికబలాన్ని వరంగా ప్రసాదించాడు. ఆతడే వాయుదేవుడు.

విశ్వానరుడనే భూసురుడు పుత్రసంతానంకోసం, కాశీక్షేత్రంలో చాలకాలం తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై నీకు పుత్రుడు దయిస్తాడని వరమిచ్చాడు. ఆ వరప్రసాదంవల్ల ఆయన ధర్మ పత్ని శుచిష్మతి గర్భవతియై కుమారునికన్నది. విశ్వానరుని కుమారుడైన కారణంగా వీనికి వైశ్వానరుడనే పేరు వచ్చింది. ఇతడే అగ్నిహోత్రుడు. వాయువు ఆకాశం నుండి, అగ్ని జలం నుండి జన్మించినట్లు శాస్త్రనిర్ణయం.

**(ఆ)** గ్రామదేవతలు క్షుద్రశక్తులు. తమోగుణంతో ప్రకాశి స్తుంటాయి. ఈ గ్రామదేవతలందరు పార్వతీదేవి యొక్క చిచ్ఛ క్తులు. శ్రీకృష్ణుని జననానికి ముందు యశోదాగర్భం నుండి జనించిన దీ శక్తియే. ఆమెకు విష్ణువే వరమిచ్చాడు. ప్రతి గ్రామంలో గ్రామదేవతగా కొలువబడుతుందనీ, ఆమెకు జంతు బలులిస్తారనీ ఆ వర నిర్ణయం.

బుద్ధుడు అహింసా సిద్ధాంతాన్ని విరివిగా ప్రచారం చేయక ముందు, ఈ దేవతలకు బలులు అధికప్రచారంలోనుండేవి. ఆర్యదైవాలైన త్రిమూర్తులపూజ రాకముందు, గ్రామదేవతల కొలువులే అధికంగానుండేవి. మద్యం, మాంసం మొదలైనవే అక్కడ ప్రధానం. ఒక్కొక్క దేవతకు జాతర చేసేటప్పుడు ఆ దేవతను పచ్చిబూతులు తిట్టే ఆచారాలు కూడా ఉన్నాయి. శ్రోత్రియ కుటుంబాల్లో కూడా మొన్నమొన్నటి వరకు, దసరా ఉత్సవాల్లో జంతుబలులివ్వటం ఆచారంగా ఉండేది. అప్పట్లో మాంసాహారం అన్ని జాతులవారికి నిషిద్ధం కాదు. శంకరా చార్యులనుండి బౌద్ధసిద్ధాంతం క్రమంగా అద్వైత (హిందూ సిద్ధాంతం) సిద్ధాంతంలో కలిసిపోయింది. త్రిమూర్తులు ఆర్య దైవాలు. వారికి సత్త్వపూజ నిర్ణయింపబడిన కారణంగా జంతు బలులు లేవు.

**యజ్ఞం, యాగం, హోమం - ఈ మూడింటికి గల తేడాలు తెలుపగలరు? ఈ కార్యాలు చేయించినవారు - చేసినవారు సమానఫలితాలు పొందుతారా? వివరించగలరు?**

**- పి. విజయ కుమారి, తిరువూరు.**

☛యజ్ఞం-సవం-అధ్వరం-యాగం-సప్తతంతువు-మఖం- క్రతువు అనే పదాలన్నీ యజ్ఞమనే తెలియజేస్తున్నాయి. వీనికి వ్యుత్పత్త్యర్థములు భిన్నంగా ఉంటాయి. 'యజతే యజ్ఞః' దేవత లిందు పూజింపబడతారని భావం. "యజనం యాగః" దీనికీ అదే అర్థం. రెండూ సమానార్థకాలే. హోమమంటే, వైశ్వదేవం- గార్హపత్యం మొదలైనవి. హోమం పంచయజ్ఞాలలో ఒకటిగా చెప్పబడింది. 1)వేదపాఠం 2)హోమం 3)అతిథిపూజా 4)పితృ తర్పణం 5)భూతబలి- ఇవే పంచమహాయజ్ఞాలు.

అశ్వమేధం – రాజసూయం మొదలైనవన్నీ యజ్ఞాలే. ఇవే యాగాలు కూడా! ప్రతి యజ్ఞంలోనూ హోమం ప్రధానకార్యం. అగ్నిని ప్రతిష్ఠించి; సమిధలు–లాజలు–గవ్యం–చరువు–పేలాలు–నవధాన్యాలు మొదలైనవి మంత్రయుక్తంగా హోమాగ్నిలో వ్రేలుస్తారు. గృహస్థు త్రికాలాల్లో హోమంచేయాలి. దేవాలయాల్లోనూ, వివాహాది కార్యాల్లోనూ హోమ కార్యక్రమముంటుంది. హోమాగ్ని ద్వారా మనం వ్రేల్చే ఆహుతులు దేవతలకు చెందుతాయి. చేయించే కర్తకు ప్రధానమైన యజ్ఞఫలం దక్కుతుంది.

**సూర్యునకు సప్తాశ్వాలు ఉన్నట్టు చంద్రునకేదైనా వాహనం ఉన్నదా? – వాసుదేవ మహాదేవ – అవనిగడ్డ.**

☛ చంద్రుడమృతవాహనుడు.

**అ) నవరాత్రుల్లో అవతారాలు రెండు రకాలుగా చెబుతారు ఎందుకు?**

**ఆ) దేవాలయపు ప్రహరీ గోడలకు ఎరుపు చారలు వేస్తారెందుకు? – చిట్టూరి సుబ్బలక్ష్మి, తిరువూరు.**

☛ **(అ)** 'ఏకం సత్ విప్రా బహుధావదంతి' అనేది వేదవాక్యం. దైవం ఒక్కడే. వేదవిదులు దాన్ని భిన్నంగా చెబుతున్నారు. దీనినే ఏకత్వంలో భిన్నత్వం – భిన్నత్వంలో ఏకత్వం అంటారు. లోకంలో వ్యక్తులు సత్త్వ–రజ–స్తమస్సులతో కూడియుంటారు. సత్త్వపూజ తామసుని తృప్తిపరచలేదు. అందరినీ తృప్తిపరచటం కోసమే హిందూమతం వివిధదేవతలు, వివిధ పూజలు, వివిధ నైవేద్యాలను చెప్పింది. ఏ పురాణం చూసినా తత్ప్రతిపాదిత దైవమే గొప్పవాడని చెబుతోంది. మొత్తంమీద ఒకే దైవంగా వ్యక్తం చేస్తోంది.

అలాగే నవరాత్రుల్లో ఒక్కోపూట ఒక్కో ఆకారాన్ని ధరింపజేస్తారు. దుర్గాష్టమినాడు ఆమె అవతారరూపం వేస్తారు. ఒకనాడు శారదారూపాన్ని ధరింపజేస్తారు. అన్ని రూపాలు పరమాత్మ రూపాలేనని చెప్పటమే ఇందులోని అంతరార్థం.

**(ఆ)** మిగిలిన గృహాలకంటె ఆలయం భిన్నంగా ఉండాలి కనుక దేవాలయ ప్రహరీలకు ఎర్రమట్టి చారలు వేస్తారు. వాటికి మధ్య మధ్యల్లో తెల్లనిచారలుంటాయి. ఎరుపు రజోగుణ ప్రతీక. తెలుపు సత్త్వగుణ ప్రతీక. వీటి కలయికే జీవుడు. కేవలం సత్త్వస్వరూపుడు పరమాత్మ. ఇది ఒక సంప్రదాయం.

**పుత్రసంతానంలేని దంపతులకు ఆడపిల్లలు కలిగినపుడు, బంధువర్గాల్లో కూడా ఎలాంటి రక్తసంబంధీకులు లేని వారికి చనిపోయినప్పుడు చేయవలసిన కార్యక్రమాలు ప్రతి సంవత్సరం జరిపే అబ్దీకములు ఎలా జరుగుతాయి? ఎవరి చేత జరిపించాలి? వీటిపై శాస్త్రాల్లో నిర్దుష్ట ప్రామాణికాలు ఏమిటి? బ్రతికుండగానే చేసే (Remedy) కార్యక్రమాలేమైనా ఉన్నాయా?తెలుపగలరు.–బొలిశెట్టి సాంబశివరావు,గుంటూరు.**

☛ 'విదథ్యా దౌరసఃపుత్రో జనన్యా ఔర్ధ్వ దైహికం తదభావేస పత్నీజః' తల్లికైనా, తండ్రికైనా సొంతకొడుకే ఉత్తరక్రియలు నిర్వహించాలి. సొంత కొడుకులేనిచో సవతి కొడుకు చేయవచ్చు.

భర్తకు భార్య సమంత్రముగా ఉత్తరక్రియలు నిర్వర్తింపవచ్చు. ఒకవేళ ఆమె శక్తురాలు కాక రోగిష్ఠిగనో – మిక్కిలి వృద్ధురాలో ఐయున్నచో దహనకార్యక్రమం మాత్రం సమంత్రసహితంగా తాను చేసి తక్కిన దాని నితరులచే చేయింపవచ్చు. కర్మాధికారం (మగపిల్లలు లేనిచో) భార్యకేయున్నదని శాస్త్రాలు స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

భార్య లేక – కుమారులు లేని వ్యక్తికి కన్యగా ఉన్న కుమార్తెయే కర్మను చేయవలెను. వివాహమైన తరువాత పిండదానాధికారం ఉంటుంది. కూతురు కూడ లేక మనుమడున్నచో అతడే కర్మ చేయుట కధికారి. అట్టి మనుమడు కూడ లేనిచో చనిపోయిన వ్యక్తి యొక్క సోదరులు కర్మ చేయవచ్చును. ఆ పుత్రునికి భార్యయు – సోదరుని కుమారుడున్నచో కర్మకాండను నిర్వర్తించు నధికారము భార్యకేయున్నది.

తాను మరణించిన తదుపరి ఉత్తరకర్మలు చేయువారెవ్వరును లేనిచో 'జీవప్రాయశ్చిత్తము' చేసికొనవచ్చు. తాను జీవించుచుండగనే సాంవత్సరీకాదులు శ్రాద్ధాదులు తానే చేసికొనుట. అలా చేసికొనినవాడు గ్రామాలందు ప్రవేశింపకూడదు. ఏ శుభ కార్యాదుల్లోనూ పాల్గొనకూడదు. ఊరి బయట ఒంటరిగా జీవయాత్ర కొనసాగించాలి. ఆతణ్ణి మృతతుల్యునిగా భావిస్తారు. పైన నేను వచించిన విషయాలు 'ధర్మసింధు' ఆధారంగా చెప్పబడినవి.

# అవతారాలందించిన ప్రేమతత్త్వము

– శ్రీమతి కె.యస్. శాంతలక్ష్మి

మనిషి అనుభవించే అనుభూతుల్లో ముఖ్యమైనవి మూడున్నాయి. అవి–

1. సుఖం – ఇది శరీరానికి సంబంధించింది.
2. సంతోషం – ఇది మనసుకు సంబంధించింది.
3. ఆనందం – ఇది ఆత్మకు సంబంధించింది.

"ఆత్మ సాక్షాత్కారం – అందుకై చేయాల్సింది సాధనేనని భగవద్గీత తెలిపే ప్రధానాంశం" అన్నారు పూజ్య బాపూజీ. భగవద్గీత ఒక విజ్ఞాన సర్వస్వం. సత్వరజస్ తమోగుణాలను అధిగమించి రాగద్వేషాలకు అతీతమైన స్థితికి మనల్ని చేర్చేందుకు భగవద్గీత సహకరిస్తుంది. మనదేశంలో ఉన్నంత ఆధ్యాత్మిక సంపత్తి ప్రపంచంలో ఏ ఇతర దేశాల్లోనూ లేదు. వేదాలు, ఇతిహాసాలు, పురాణాల సారాంశాన్ని గ్రహించి వాటిని మన జీవితాలకు అన్వయించుకోవాలి. భగవంతుని సన్నిధిలో ఉంటూ ప్రార్థనలు చేసి ఆత్మశక్తిని పొందుతారు. ఆత్మ ఆచూకి మొదట్లో తెలియదు. ఆత్మజ్ఞానం అంటే సముద్రంలో ఉన్న చేప సముద్రం కోసం వెతుక్కోవడం వంటిదే! మనిషికి, మనసుకు ఆత్మ అనేది గొప్ప శరణాలయం. అదే మహిమాలయం.

ఆత్మ గురించి తెలుసుకోవాలంటే ప్రేమ విలువ తెలియాలి. భగవంతునికున్న ఒకే లక్షణం ప్రేమతత్త్వం. ఆయనకు ప్రేమించడమే తెలుసు. ఆ ప్రేమ నిస్వార్థమైనది. భగవంతుడు ఏమైనా చెయ్యగల శక్తివంతుడు. కనుకనే శ్రీకృష్ణావతారంలో గురువైన సాందీపని మహాముని పుత్రుని సమవర్తి (యమధర్మ రాజు) బారినుండి కాపాడి గురుభక్తిని చాటుకోవడమేకాక తాను తలుచుకుంటే జనన మరణాల తలరాతలను సైతం మార్చగలిగే శక్తివంతుణ్ణని ఋజువు చేసుకున్నాడు. మానవుడు భగవంతుని శక్తిని సంపూర్ణంగా నమ్ముకున్నప్పుడు ఆయన తన శక్తిని చూపిస్తూ తన ఆశీర్వాదాన్ని సంపూర్తిగా అందజేస్తాడు. నరసింహావతారంలో శ్రీమహావిష్ణువు హిరణ్యకశిపుని వధించిన తర్వాత, అతడు రాజుగా (నృపుడుగా) కూచుంటున్న ఆసనాన్ని అధిష్టించి ఆ రాజ్యాన్ని పాలించవలసిందిగా ప్రహ్లాదుడు ఆయనను వేడుకుంటాడు. అన్ని రోజులూ ఒక క్రూరుడైన అసురుని చేత పరిపాలింపబడ్డ రాజ్యం, పరంధాముడు అధిరోహించి పాలించడం వల్ల తన ప్రజలూ, తానూ పునీతుల మౌతామని బాలప్రహ్లాదుడు ప్రార్థిస్తాడు. కాని స్వామి తన అవతారలక్ష్యం కష్టాల్లో ఉన్న ప్రహ్లాదుని కాపాడ్డమేనని, హిరణ్యకశిపుని సంహారానంతరం, ఆ అవతారం సమాప్తమైందని తెలిపి నిరాకరిస్తాడు. అప్పుడు భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు కనీసం కొద్ది నిముషాలైనా స్వామి దానిపై కూర్చుంటే, అది ఆశీర్వదించబడుతుందని కోరగా, భక్తవత్సలుడైన నరసింహస్వామి అందుల కంగీకరించి ఆ "నృపాసనం" పై కూర్చుంటాడు. సింహరూపుడైన ప్రహ్లాదవరదుడు అధిష్ఠించిన కారణంగా నాటినుండి రాజులు కూర్చునే ఆసనం సింహాసనంగా పిలువబడుతోంది. తర్వాతి కాలంలో రాజులు, ప్రభువులు, చక్రవర్తులు అధిష్ఠించే ఆసనాలన్నీ ప్రహ్లాదుని మూలంగా భక్తవరదుని ప్రేమవాత్సల్యాలకు తార్కాణంగా "సింహాసనాలు"గా పిలువబడ్డాయి.

ఇక రామభక్తుడైన తులసీదాసు రామచరితమానస్ అనే రామాయణ కావ్యాన్ని వ్రాసినట్టు మనందరికీ తెలిసిందే! దీనితో పాటు ఆయన "వినయపత్రిక" అనే గ్రంథాన్ని కూడా వ్రాశాడు. అందులో రెండు భావాలను ఆయన ఎక్కువగా వివరించాడు. మొదటిది "రాముడు ప్రేమను నిర్వహించే విధానం సంపూర్ణంగా ఎరిగినవాడు. వ్యక్తిగత సంబంధ బాంధవ్యాలకంటె భక్తులకూ వారు తనపట్ల చూపే భక్తి ప్రపత్తులకే ప్రాధాన్యత నిస్తూ తన మహోదాత్తమైన ప్రేమను ప్రకటించాడు. పుత్ర ప్రేమతో ప్రాణత్యాగం చేసిన దశరథునికంటె జటాయువుకు ప్రాముఖ్యత నిచ్చి అతనికి దహన సంస్కారాలు చేశాడు. పత్నీ వియోగంతో కుమిలిపోతున్న సుగ్రీవుని చూచి తన విరహాన్ని మరచిపోయాడు. యుద్ధభూమిలో లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు, విభీషణునికిచ్చిన మాట నిలబెట్టుకోలేమోనని దుఃఖించాడు. తన రాజమందిరంలోనూ, గురుగృహంలోనూ, అత్తమామల ఇంట్లోనూ లభించిన ఆతిథ్యం కంటె శబరి పండ్ల రుచినే

ఎక్కువగా మెచ్చుకున్నాడు. మహర్షులు చేసిన సహజ గుణగానా నికి వినమ్రుడై తలవంచిన వాడు. గుహుని దాస్యభక్తికి, సోదర భావానికి పరవశించిపోయాడు. వానరుల మిత్రభావానికి కరిగి పోయాడు. ఇటువంటి ప్రేమమూర్తియైన శ్రీరాముని పట్ల ఎవరికైనా భక్తి కలుగలేదంటే, అలాంటివాని కన్నతల్లి యవ్వనం వృథా అయ్యిందని". ఈసడించు కుంటాడు తులసీదాసు.

ఇక ఆయన తెలియజేసిన రెండవ భావన – సీతా రాములను ఇష్టంగా ప్రేమించలేనివారు ఎంతటి సన్నిహిత బంధువులైనా శత్రుకోటిగా భావించి పరిత్యజించవలసిందేనని చెబుతూ, తండ్రిని వదలిన ప్రహ్లాదుని, అన్నను వదలిన విభీ షణుని, తల్లిని తూలనాడిన భరతుని, గురువును ఎదిరించిన బలిచక్రవర్తిని, భర్తలను కాదన్న వ్రజకాంతలను ఉదాహరణగా పేర్కొన్నాడు. సమస్త లౌకిక బంధాలు శ్రీరాముని ఆదర్శాలను ఆధారం చేసుకున్నవై ఉండాలని కళ్ళకు గ్రుడ్డితనం కలిగించే కాటుకతో ప్రయోజనం లేనట్లుగా రామభక్తిని ప్రోత్సహించేవారు మాత్రమే తనకు పూజ్యులూ, ప్రాణసమానులనీ; ఇదే తన సిద్ధాంతమనీ నొక్కి చెప్పాడు తులసీదాసు.

శ్రీకృష్ణావతారంలో కూడ భగవంతుడు ఆయన నిరాడం బర భక్తులపట్ల చూపిన వాత్సల్యం, ప్రేమ అసామాన్యమైనవి. తాను అవతార పురుషుడై ఉండి కూడా; పాండునందనునికి రథ సారథిగా ఉండడమేకాక యుద్ధభూమిలో అక్రూరుడు ఆయన కోసం వెదకుతూ ఉండగా అశ్వాలకు స్నానం చేయిస్తూ కనిపి స్తాడు. రాయబార సమయంలో దుర్యోధనాదులు విడిదిలో విందు ఏర్పాటు చేసినా కాదని తిరస్కరించి; నిరాడంబరుడూ, పరమభక్తుడైన విదురుని ఇంటపెట్టిన ప్రసాదాన్ని ఇష్టంగా స్వీకరించాడు. పాండవులు రాజసూయయాగం చేసేటప్పుడు తనకు ఏవైనా పనులు చెప్పుమని అడిగి చివరికి వచ్చిన అతిథుల పాదప్రక్షాళన చేసి తలపై నీళ్ళు చల్లుకునే పనిని స్వీకరించాడు. గోవులే తనకు మిత్రులని తోడునీడని గోపాలుడన్న నామాన్ని స్వీకరించడానికి గల కారణాలను ఈ విధంగా వివ రించాడు. "మనుష్యులు తాము తిన్న ధాన్యాల పొట్టును ఆవు లకు ఆహారంగా పెడుతున్నారు. మంచి కూరలను పళ్ళను తాము తీసుకుని గడ్డిని వాటికి పెడుతున్నారు. ఐనా అవి అమృతధారలైన పాలనే ఇస్తున్నాయి. అందుకే అవి నాకు అత్యంత ప్రియమైనవి." ఇవన్నీ ఆయన నిరాడంబరత్వాన్ని, భక్త సులభుడన్న ఆయన బిరుదుకు సార్థకనామధేయుడిని చేశాయి. భక్తులపట్ల ఆయనకున్న దయ, ప్రేమ అపారం, అనిర్వచనీయం. భక్తులు భక్తితో తనకిచ్చినదానికి ఎన్నోరెట్లు దయను, కరుణను ప్రసాదించే చల్లటి తండ్రి. కుచేలుడిచ్చిన పిడికెడు అటుకులతో అతడు సంవత్సరాల తరబడి అనుభవిస్తున్న దారిద్ర్యాన్ని పటా పంచలు చేసిన పుణ్యమూర్తి.

ఒకసారి పళ్ళను అమ్ముతున్న ఒక వనిత యశోద ఇంటికి వచ్చింది. బాలకృష్ణుడైన పరంధాముడు ఆ పళ్ళమ్మే స్త్రీని కనికరించాలనుకున్నాడు. యశోదమాత ఇంటి పనుల్లో ఉండగా, అప్పుడు చిన్నికృష్ణుడు తన చిన్నారి చేతులతో ధాన్యాన్ని తీసుకుని వచ్చి ఆస్త్రీకి ఇచ్చి పళ్ళను తీసుకోవాలనుకుంటాడు. ఆయన పళ్ళగంప దగ్గరికి వచ్చేలోపల చేతిలోని ధాన్యం ఆయన వేళ్ళసందుల్లోంచి జారిపోయి దాదాపు రిక్తహస్తాలు ఆ పళ్ళ మనిషి ముందుంచుతాడు. ఉన్న కొన్ని గింజలను తీసుకుని పళ్ళను ఇవ్వుమని అడుగుతాడు. ఆయన చాచిన హస్తాల్లో ఆ వనిత శంఖు, చక్రాల ముద్రలను గమనించి తాను పళ్ళను అమ్మవలసిన స్థానం కాదనీ; ఆ పరంధాముడి పాదాలవద్ద తన ఆత్మార్పణ చేసుకోవాల్సిన ప్రదేశమనీ గుర్తిస్తుంది. ఆ మైమ రపులో ఆమె ఒకటి తర్వాత ఒకటిగా పళ్ళను ఆ చిట్టి చేతుల్లో ఉంచుతూ పోతుంది. వాటినన్నింటిని ఆ చిలిపిస్వామి తన చేతులనుండి జారవిడుస్తూ ఉంటాడు. చివరికి గంపలోని పళ్ళన్నీ ఐపోతాయి. కాని గంప మాత్రం స్వామి ధరించే కౌస్తుభంలోని మణులతో నింపబడి ఉంది. ఈ విధంగా ప్రేమతో ఇచ్చేది కొంచెమైనా, దానికెన్నో రెట్లు అధికంగా వారికి ప్రతి ఫలంగా ఇవ్వడమే ఆయన భగవ ద్గుణం. ఇంకొకసారి ఒక గోపిక యశోదమాత వద్దకు వచ్చి బాలకృష్ణుడు తన కూతురి చేతుల్లోని రెండు గాజులను పళ్ళను కొనడానికి తీసుకెళ్ళి అమ్ముకున్నాడని చెబుతుంది. దానికి ఋజువుగా తన కుమార్తెను తనవెంట తీసుకు వస్తుంది. యశోదాదేవి బాలకృష్ణుని పిలిపించి అడగ్గా ఆయన యథాప్రకారం అమాయకంగా తనకేమీ తెలీదని చెబు తాడు. గోపిక తన కూతురిని చేతులు చూపించుమని చెబు తుంది. వెనక్కు పెట్టుకుని ఉన్న చేతులను ముందుకు చాచగానే

ఆ రెండు చేతులకు రెండు గాజులకు బదులుగా 20 (ఇరవై) గాజులుండడం అందరినీ ఆశ్చర్యపరుస్తుంది. ఆ అమ్మాయి భక్తితో ఇచ్చినదానికి పదిరెట్లు భగవంతుడామెకు ప్రసాదించాడు.

పైన తెలిపిన అంశాలద్వారా మానవుడు సాటి మానవులపట్ల ప్రేమను పంచుకోవాలన్న విషయం విశదమవుతోంది. ప్రేమతో పెరిగినవారే మంచివారుగా, ప్రయోజకులుగా తయారౌతారు. యోగ్యులౌతారు. పదిమందికి తమ ప్రేమను పంచగల్గుతారు. ప్రేమించగల్గినవారికి లోకమంతా ప్రేమమయంగానే కనిపిస్తుంది. ప్రేమను పంచుకున్నవారు స్వేచ్ఛగా, తృప్తిగా, ఆనందంగా జీవించగల్గుతారు. "ఆధ్యాత్మిక ప్రబోధనల ద్వారా మంచిని పెంచుకుని ఎదుటివారితో పంచుకోగలిగే మనస్తత్వం రూపుదిద్దుకుంటుంది." అని చిన్నజియ్యర్‌స్వామి ఒక సందర్భంలో అన్నారు. మన జీవితం నుండి మతాన్ని వేరు చేయలేం. మతం మనిషిని క్రమశిక్షణతో నడిపిస్తుంది. విశృంఖలతకు తావివ్వకుండ సరిహద్దుల్లో ఉంచగలిగేదే మతం. జియ్యర్ స్వామీజీ చెప్పినట్టు మంచితనంతో ఎదుటివారితో సంతోషాన్ని పంచుకోవడం, ఉన్నదాంట్లో ఇతరులకు ఇవ్వడం అన్నది ఒక వరం. దీనికి ఒక ఉదాహరణ. ఒక సన్యాసి అసత్యం పలికే వారింట భుజించకూడదన్న నియమం కలిగి ఉంటాడు. ఒక నాడు ఆయన ఒక ధనవంతుడి ఇంట భుజించాల్సి వచ్చినప్పుడు అతనిని తనకున్న సంపదను గురించి తెలియజేయుమంటాడు. ఆ ధనవంతుడు తనకున్నదానికంటె చాలా తక్కువ చేసి అదే తన సంపద అని చెప్తాడు. ఆ సన్యాసి ఆయనకు కుమారులెంత మంది అని ప్రశ్నించగా, ఆయనకున్నది ముగ్గురు కుమారులైనా, ఒకడే కుమారుడని చెబుతాడు. చివరగా ఆ సన్యాసి ఆ ధనికుడి వయసు గురించి ప్రశ్నించగా, తన వయసు మూడు సంవత్సరాలేనని చెబుతాడు. ఈ సమాధానాలన్నీ విన్న సన్యాసి ఆ ధనికుని ఇంట భోజనం చేయడానికి నిరాకరిస్తాడు. అందులకా ధనికుడు తొందరపడొద్దని ప్రార్థిస్తూ, తన సమాధానాలకు గల కారణాలను ఈ విధంగా వివరిస్తాడు. తన సంపద గురించి చెప్పింది తాను ఇతరులకు చేసిన దానధర్మాల పరంగా చెప్పానని, అది తన సంపదతో పోలిస్తే చాలా తక్కువనీ అన్నాడు. తనకున్న ముగ్గురు కుమారుల్లో మొదటి ఇద్దరూ తన సత్కార్యాలను వ్యతిరేకించేవారని, మూడవ కుమారుడు మాత్రమే తనతో దానధర్మాలు చేయడంలో పాలు పంచుకుంటాడని, అందుకే తనతో మంచి పనుల్లో సహకరించని వారు తనకు పుత్రులుగా ఉండజాలరని అటువంటి వారివల్ల ఎటువంటి ఉపయోగమూ ఉండదంటాడు. ఇక తన వయసు గురించి చెప్పిందానికి కారణం. తన జీవితంలో చాలాభాగం బ్రతుకుతెరువుకోసం ప్రయత్నాలు, తినడం, నిద్రపోవడం, వివాహం, సంతానాన్ని పొందడం, వాళ్ళ భవిష్యత్తుకోసం ధనం సంపాదించడంలాంటి పనుల్లోనే గడిచి పోయిందని, ఆకాలంతో పోలిస్తే, తాను భగవత్ చింతనలో, ధ్యానంలో గడిపింది కేవలం మూడు సంవత్సరాలేననీ, మిగతా చర్యలన్నీ ఏమాత్రం ప్రాధాన్యతలేనివనీ వివరిస్తాడు.



ఇతరులకివ్వడం ద్వారా వచ్చే పుణ్యఫలం చాల గొప్పది. ఆ గుణం లేనివారు పొందేది ఏదీ ఉండదు. కనుకనే ఈ మధ్య "Joy of giving week" అని సంవత్సరంలో సెప్టెంబరు 27 నుండి అక్టోబరు 3 వ తేది వరకు ఒక వారాన్ని ఒక ఉత్సవంలాగా జరుపుకుని ప్రతి ఒక్కరూ తమకున్న దాంట్లో

ఇతరులకు ఇవ్వాలన్న అంశాన్ని ప్రచారం చేస్తున్నారు. అందువల్ల ఇస్తున్న వారికి తృప్తి, పుచ్చుకున్న వారికి ఆనందం, సంతోషం కలుగుతాయి. వీటిని పెద్దలు ఆచరిస్తూ; పిల్లలకు అలవాటు చేయాల్సిన ఒక మంచి గుణం. ఇది పిల్లల్లో సమతాభావాన్ని, సామరస్యాన్ని పెంచుతుంది.

మహారాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న శ్రీ మహాదేవ గోవింద రానడే జీవితంలో జరిగిన చిన్ననాటి సంఘటన. ఒకసారి ఆయన తన స్నేహితుడ్ని ఇంటికి తీసుకు వచ్చినప్పుడు ఆయన తల్లి రెండు కలకండ ముక్కలను కొడుకు చేతికిచ్చి "అందులో చిన్నముక్క నీ స్నేహితుడికిచ్చి పెద్దముక్కను నీవు తీసుకో" అని చెప్పిందట. కాని ఎంతో పెద్ద మనసున్న ఆ పసివాడు దానికి వ్యతిరేకంగా చిన్నది తాను తీసుకుని పెద్దముక్క తన స్నేహితునికి ఇచ్చాడట! అది చూచిన అతని తల్లి ఎందుకిలా చేశావని అడిగితే "నీతోటి వారందరూ నీకు సోదర సమానులని నీవే కదా చెప్పావు. పెద్దముక్క నేను తిన్నా నా సోదరుడు తిన్నా ఒకటే కదా!" అని సమాధానం చెప్పాడట. కనుక ఈ సమతాభావాన్ని, ఉన్నదాన్ని నలుగురితో పంచు కోవాలన్న భావాలకు గల బీజాన్ని ప్రథమ గురువైన తల్లే చేయాల్సి ఉంటుంది. ఇతరులకిచ్చేటప్పుడు ఏమిస్తున్నాం? ఎంతిస్తున్నా మన్నది ముఖ్యం కాదు. ఎంతటి ప్రేమతో, హృదయపూర్వకంగా ఇస్తున్నామన్నదే ముఖ్యం.

నేటి వర్తమాన సమాజంలో సగటు మనిషి వివిధ కారణాలవల్ల తీవ్రమైన ఒత్తిళ్ళను ఎదుర్కొంటున్నాడు. దీన్ని అధిగమించే ఏకైకమార్గం ఆధ్యాత్మిక మార్గం. ఆధ్యాత్మిక మార్గం భారతదేశంలోని యువతరానికి చాలా అవసరం. మొత్తం నేనే చేస్తానని, చేస్తున్నానని అనుకోవడం వల్ల ఒత్తిడి ప్రారంభమౌ తుంది. ఆధ్యాత్మిక చింతన పెరగడంతో చేసేవాడిని నేను కాదు, నేనొక సాధనం (Instrument) మాత్రమే అనే భావన కలుగు తుంది. ఈ భావన ద్వారానే ప్రతివారు తమ భారాన్ని దైవం మీద మోపి కర్తవ్య దీక్ష చేస్తారు. అందువల్ల ఒత్తిడి ఉండదు. విద్యనభ్యసించే స్థాయిలోనే ఆధ్యాత్మిక భావాలు పెంపొందే విధంగా తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు కృషి చేయాలి. అప్పుడే సమాజం చైతన్యవంతమౌతుంది. వర్తమానంలో సంపూర్ణంగా, సజీవంగా జీవించడమే నిజమైన ఆధ్యాత్మికత. ఆ విధంగా జీవించగల మానసికస్థాయి ఒకటే మనిషికి నిండు వ్యక్తిత్వాన్ని స్తుంది. జీవితంలోని అన్ని దశల్లోనూ ధీరత్వంతో ముందుకు సాగే శక్తిని ప్రసాదిస్తుంది. గత అనుభవాల సారాన్ని గ్రహించి వర్తమానంలోకి అడుగులు వేస్తూ ముందుకు సాగాలి. అసలైన మానసికశక్తి వర్తమానం గురించి ఆలోచించడంతోనే మొదలౌ తుంది. నిజమైన జీవచైతన్యానికి అదే కొలబద్ద. పూర్తిగా వర్త మానం మీద మనసుపెట్టినట్లైతే మనిషి నిజంగా సమర్థుడౌతాడు. అతని శక్తి బహుముఖాలుగా విస్తరిస్తుంది. వర్తమానంమీద మనసు పూర్తిగా లగ్నం కావడమే అసలైన ఆధ్యాత్మికత. అవ తార పురుషుడైన భగవంతుడు చూపి, ఆచరించిన ప్రేమ మార్గాన్ని అనుసరిస్తూ మానవుడు చతుర్విధ పురుషార్థాలను సక్రమంగా పాటిస్తూ జీవనాన్ని సుఖమయం చేసుకోవాలి. సాటి మనిషిపట్ల అదే ప్రేమభావాన్ని విస్తరింపజేస్తూ సాత్వికాహారం ద్వారా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆరు శత్రువుల్ని దరి చేరనీయకుండ జీవించినవానికి మోక్ష సామ్రాజ్య ద్వారాలు వాటంతటవే తెరుచుకుని స్వాగత మిస్తాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

# గాయత్రీమంత్రం- శాస్త్రీయ పరిశీలన

- దేసు వేంకట సుబ్బారావు

**ఓం భూర్ భువ స్సువః**
**తత్ సవితుర్ వరేణ్యం**
**భర్గో దేవస్య ధీమహి**
**ధియో యో నః ప్రచోదయాత్ ॥**

వేదధర్మాల్లో, వేదమంత్రాల్లో అతి ముఖ్యమైనది గాయత్రిమంత్రం. "ఓ దేవా! సర్వశక్తిమంతుడవూ, సర్వైశ్వర్య మంతుడవూ, కాంతి స్వరూపుడవూ, జ్ఞానప్రదాతవూ, భయా పహరుండవూ, సృష్టికర్తవూ, సర్వోత్కృష్టుండవూ, తేజోమయుం డవూ అయిన నీకు నమస్కారములు. మేము సన్మార్గంలో నడవటానికి మంచి దారిచూపు"మని పైన వివరించిన గాయత్రి మంత్రానికి అర్థం! పరమార్థం!! మహాశక్తివంతమైన ఈ గాయత్రి మంత్రానికి ఉన్న ప్రాముఖ్యాన్ని శాస్త్రీయకోణంలో పరిశీలిస్తే అనేక విషయాలు మనకు గోచరిస్తాయి. గాయత్రిమంత్రానికి గల శాస్త్రీయభావం తెలుసుకుందాం.

**ఓం భూర్ భువ స్సువః :**

భూర్ (భూమి), భువ (సూర్యమండలం), స్సువః (పాలపుంత) అని వీటి అర్థం. ఫ్యాన్ (పంకా) నిమిషానికి 900 సార్లు భ్రమణం చేస్తుంది. అలా తిరిగేటప్పుడు ఒక రకమైన శబ్దం మనకు వినిపిస్తుంది. అలాగే అప్పుడు అనంతమైన పాలపుంతలు, వాటిలో గల అనేక నక్షత్రాలు, ఖగోళ మండ లాలు ఒక్కసారిగా సెకనుకు 20,000 సార్లు భ్రమణం చేస్తుంటే ఇంకెంతటి శబ్దం వినిపిస్తుందో ఊహించుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది. అలా అత్యంత వేగంతో తిరిగే పాలపుంతలు, నక్షత్రాలు, ఖగోళమండలాల ద్వారా ఉత్పన్నమౌతున్న శబ్దమే **"ఓం"**.

ఈ శబ్దాన్నే విశ్వామిత్ర మహర్షి తన తపశ్శక్తితో విని; తన సహచరులకు కూడా వినిపించాడు. అంతట మహామును




లందరూ అలా వచ్చిన ఓంకార నాదమే భగవంతుని ప్రతీకగా భావించారు. నిరంతరంగా వెలువడుతున్నందున ఈ నాదాన్ని ముమ్మారు జపించటం ప్రారంభించారు. నిరాకారుడైన భగవంతుడిని ఓంకార స్వరూపుడిగా కూడ పిలవడం ప్రారంభిం చారు. భగవద్గీతలో కూడా "ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ" అని పిలుస్తూ భగవానుడిని ఏకాక్షర స్వరూపుడిగా కూడా కొలువ సాగారు.

ఈ ఓంకార నాదాన్నే మునులు సిద్ధసమాధి యోగంలో కూడ పఠిస్తూంటారు. దీన్నే యోగులు ఉద్గతినాదం అని కూడ పిలుస్తారు. అలా దీనిని అనంతమైన వస్తు సముదాయాలు చేసే శబ్దంగా భావించి, అంటే లెక్కలేనన్ని పాలపుంతలు సెకనుకు 20,000 మైళ్ళ వేగంతో తిరుగుతూ ఉత్పన్నం చేసే అనంత శక్తిని ప్రణవనాదంగా పిలువసాగారు. అంటే ఓం భూర్ భువ స్సువః అంటే భూర్ (భూమి), భువ (సూర్యమండలం), స్సువః అంటే పాలపుంతలు అత్యంత వేగంతో ప్రయాణం చేస్తున్నప్పుడు వెలువడే అతి శక్తివంతమైన (శబ్దం) నాదాన్నే ప్రణవనాదం అని అంటున్నారు.

**తత్ సవితుర్ వరేణ్యం :**

తత్ (భగవంతుడు), సవితుర్ (సూర్యుడు అని పిలువబడే నక్షత్రం), వరేణ్యం (నమస్కరిస్తున్నాము). అంటే అనంత శక్తి (ఓంకార) స్వరూపుడు, తేజోమయుడు అయిన భగవంతునికి నమస్కరిస్తున్నాము. ఒక వ్యక్తిని ఆతని పేరు లేక రూప విశేషణాలచేత గుర్తించవచ్చు. కాని అటువంటి విశేషా లకు అతీతుడైన భగవంతుడిని ఎలా గుర్తించడం? అందుచేత విశ్వామిత్ర మహర్షి భగవంతుడిని గుర్తించేటందుకు నిర్దుష్టమైన లక్షణాలను తెలియజేశాడు. అవి అనంత తేజోమయమైన నక్షత్రాల కాంతివలె, అనంత శక్తివంతమైన ఓంకారనాదం వలె భగవంతుడుంటాడని పేర్కొన్నాడు. ఒక సంఖ్యా శాస్త్రజ్ఞుడు

ఎలాగైతే x2+y2=4; x=2 విలువను కనుగొంటాడో, నది ఒడ్డున నిలబడి ఒక ఇంజనీరు నది వెడల్పు ఎలా కొలువగలడో, అలాగే భగవంతుడిని కను గొనటానికి సాంకేతికపరమైన విధానాన్ని విశ్వా మిత్రుడు ఈ క్రింది విధంగా కను గొన్నాడు.

**భర్గో దేవస్య ధీమహి :**

భర్గో(కాంతి), దేవస్య (భగవంతుని), ధీమహి (ధ్యానం చేయాలి). అంటే (అనేక కోట్ల నక్షత్రాల కాంతి ఒకచోట కలిస్తే ఏర్పడే కాంతి) అనంత మైన తేజస్సును భగవంతునిగా భావించి, ఓంకార మంత్రోచ్చారణతో జపించాలి. అంటే అనంతతేజోమయుడైన భగవంతుడిని, అనంత శక్తివంతమైన ఓంకార నాదంతో జపిస్తే గుర్తించవచ్చు. దీన్నే విశ్వామిత్ర మహర్షి ఈ క్రింది విధంగా వివరించాడు.



**అమృతం కోసమై పాలసముద్రం**
**చిలకడానికి పూనుకొన్న దేవతలు**
**మధ్యలో రత్నాలు దొరికాయని**
**సంతోషించి ఊరకుండలేదు.**

**భయంకరమైన కాలకూట విషం పుట్టుకొస్తే**
**భయపడి పరుగెత్తలేదు.**

**అమృతం లభించేవరకు**
**తమ ప్రయత్నం విరమించలేదు.**

**ధీరులు అనుకొన్న పని**
**పూర్తి అయ్యేదాకా విశ్రమించరు.**

**ధియో యోనః ప్రచోదయాత్ :**

ధియో (జ్ఞానాన్ని), యో (ఎవరైతే) నః (మనకు) ప్రచోదయాత్ (సరియైన దారిలో); అంటే ఎవరైతే మనకు జ్ఞానాన్ని తెల్సుకోవ డానికి సరియైన దారిని చూపు తాడో ఆతడే భగవంతుడు అని అర్థం.

సవివరంగా తెలియజేయాలంటే భూమి, గ్రహాలు, నక్ష త్రాలు అంతరిక్షంలో అత్యంత వేగంతో చరించడం వలన ఉత్పన్నమవుతోన్న ఓంకారమని పిలువబడే భగవం తుడికి, అలాగే అనేక కోట్ల నక్షత్రాల వెలుగు ఒక్కటై ప్రకాశించే కాంతి స్వరూ పుడైన భగవంతుడికి, జ్ఞానాన్ని ప్రసా దించి, సరైన రీతిలో దారిచూపే తేజో మయుడైన భగవంతుడికి మేము నమస్కరిస్తున్నాము, అని విశ్వామిత్ర మహర్షి భగవానుని రూపాన్ని ఎలా భావిం చాలో మానవాళికి తెలియజేశాడు.

ఈ విధంగా నిరంతరం అనంతకోటి పాలపుంతల చల నం వల్ల ఉత్పన్నమైన శక్తి విశ్వమంతా కప్పబడి ఉంది. దీన్నే ప్రణవస్వరూపం అని అంటారు. ఇది 1/2 mv2 (mass of galaxies X velocity 2) కి సమానం. ఇంతటి తేజోమయ శక్తి సంపన్నమైన **'ఓం'** అనే మంత్రాక్షరాన్ని అనేక మతాల వారు కూడ కొద్దిపాటి మార్పులు చేసి తమ మతాలకు కూడా అన్వయింపజేసుకున్నారు.

**ఎవ్వనిచే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;**
**యెవ్వని యందు డిందుఁ; బరమేశ్వరుఁ డెవ్వఁడు; మూల కారణం**
**బెవ్వఁ; డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు; సర్వముఁ దానయైన వాఁ**
**డెవ్వఁడు; వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.**




# బాలవాక్కు!

## నారాయణతే నమో నమో

"నారాయణ! నారాయణ!!" అనే శబ్దాలు ప్రతి ఒక్కరి నోట్లో పలికేవే! అలాంటి "నారాయణ" అనే శబ్దానికి ఉన్న విశిష్టత అంతా, ఇంతాకాదు. అది మన నమ్మకంతో ముడిపడి ఉంటుంది. ఈ నామము విశిష్టత ఈ క్రింది దృష్టాంతాలనుండి మనం తెలుసు కోవచ్చు.

"నారము" అంటే నీరు, "ఆయిణ" అంటే ఉద్భవించిన వాడు. జలంనుండి ఉద్భవించినవాడు కాబట్టి "నారాయణు"డనబడుతున్నాడు. దేవఋషి అయిన నారదుడు ఈ నామాన్నే నిరంతరం జపిస్తూ ఉంటాడు. "నారదుడు విష్ణు ద్వేషి అయిన హిరణ్యకశిపుని భార్యయైన లీలావతి కడుపులో నున్న శిశువుకి ఆమె నిద్రపోతున్నపుడు **"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షరి మంత్రాన్నుపదేశించి, శిశువైన ప్రహ్లాదుడ్ని, విష్ణుభక్తుని చేశాడు. లోకకంటకుడైన హిరణ్యకశిపుడు, తన కుమారుడైన; భక్త ప్రహ్లాదుడ్నే చంపుమన్నపుడు, నీరు వల్ల, నిప్పువల్ల, కొండమీది నుండి తోసేసినపుడు, ఏనుగులచే తొక్కించినపుడు, పాములచేత కరిపించినప్పుడు, ఆఖరికి విషాన్నిచ్చినప్పుడు కూడా ప్రహ్లాదుడు ఏ మాత్రం తొణక్కుండా "నారాయణ" మంత్రాన్నే జపించసాగాడు. ఆఖరికి నీ శ్రీహరి ఎక్కడున్నాడని అడిగినపుడు, ఈ జగమంతా శ్రీహరిమయమే కాబట్టి ఈ స్తంభంలో కూడా ఉంటాడని చెప్పగానే; అతని తండ్రి ఆగ్రహించి స్తంభాన్ని పగులగొట్టగా అందునుండి శ్రీహరి నరసింహావతారంలో వచ్చి, హిరణ్యకశిపుడ్ని చంపి ప్రహ్లాదుడి భక్తికి మెచ్చి మోక్షాన్నిచ్చాడు.



– వి. సాయిశ్రీరామ నారాయణ్
S/o వి.వి.రమణమూర్తి,
శ్రీరామమూర్తి వీథి, శారదానగర్, బలిఘట్టం,
నర్సీపట్నం(మ)-531 116, విశాఖ జిల్లా.

మరియు ఉత్తానపాదమహారాజు కొడుకైన ధృవుడు; తన పినతల్లి తండ్రి తొడ మీద తనను కూర్చోనీకుండా తోసేసిందనే కోపంతో కారడవిలో దిక్కుతోచక తిరుగుతూండగా; నారదుడు ప్రత్యక్షమై **"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షరి మంత్రాన్ని ఉపదేశించగా; దానినే జపిస్తూ, దృఢమైన తపస్సు చేసి, ఆ శ్రీ మన్నారాయణుని కృపకు పాత్రుడై; ధృవనక్షత్రంగా ఆకాశంలో చిరస్థాయిగా నిలిచిపోయేట్లు వరం పొందాడు.

మరియు ఒక సద్బ్రాహ్మణ కుటుంబంలో 'అజామిళుడు పుట్టాడు. అతడు చెడు అలవాట్లకు బానిసై తన తల్లిదండ్రులను, కట్టుకున్న భార్యను ఇంటినుంచి తరిమేశాడు. ఒక నీచ స్త్రీకి నలుగురు పిల్లల్నికన్నాడు. అందులో ఒక కొడుకు పేరు "నారాయణ". ఆ కొడుకు మీద ప్రేమతో ఎక్కువగా 'నారాయణ! నారాయణ!! అంటూ మాటిమాటికి పిలుస్తుండేవాడు. కాల క్రమేణా అతను మంచంపట్టాడు. అతని భార్యగానీ, పిల్లలుగానీ, ఎవ్వరూ పట్టించుకోలేదు. చివరికి అవసానదశలో కొడుకుని 'నారాయణ! నారాయణ!!' అని పిలుస్తూనే ప్రాణాలు వదిలాడు. అప్పుడు యమదూతలు, విష్ణుదూతలు వచ్చారు. విష్ణుదూతలు ఇతను **'నారాయణ!, నారాయణ!!'** అంటూ ప్రాణాలు వదిలాడు. కాబట్టి ఇతనికి వైకుంఠప్రాప్తి కల్గింది అని అతణ్ణి వైకుంఠానికి తీసుకుపోయారు.

శ్రీమన్నారాయణుని రూపంగా సత్యదేవుని సత్యనారాయణస్వామిగాను, సూర్యదేవుని ప్రత్యక్ష సూర్యనారాయణస్వామిగాను మనం పూజిస్తున్నాం. అందుకే మనకు సూర్యుడు ప్రత్యక్ష నారాయణుడై అన్ని విధాల భూమిమీదనున్న మనకు అన్ని విధాలా సహాయపడుతున్నాడు.

**ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః।**
**సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం విముక్తదుఃఖాస్సుఖినో భవంతి॥**

అలా ఆర్తితోనున్నవారు, దీనహృదయంతో భయంతో నున్నవారు, భయంకరమైన రోగాలతోనున్నవారు, **'నారాయణ! నారాయణ!!'** అని పలుమార్లు జపించినట్లైతే అన్ని రకాల దుఃఖాలనుండి విముక్తులౌతారు. కాబట్టి బాలలూ "నారాయణ" అనే మంత్రానికి ఎంతటి విలువుందో ఇపుడు మనకు తెలిసింది కదూ! అందుకే మనమందరం నమ్మకంతో పరిపూర్ణమైన భక్తితో **"నారాయణ! నారాయణ!!"** అనే నామాన్ని నిరంతరం జపిస్తూ సమస్త దుఃఖాలనుండి, పాపాలనుండి విముక్తులౌదాం!

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 01-04-2011

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమం ద్వారా భక్తులు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాం.)*

**1. అంగవైకల్యం ఉన్నవాళ్ళు ఏదైనా సేవచేయించాలను కొంటే టిక్కెట్ల కొరకు సి.ఆర్.ఓ. కార్యాలయం వరకు వెళ్ళాలి. చాలా కష్టమవుతుంది. గుడికి దగ్గర్లో వీరికి ప్రత్యేకంగా సేవాకౌంటరు ఏర్పాటు చేస్తే బాగుంటుంది.**

**2. టోల్‌గేట్‌లో భద్రతా సిబ్బందికి రూ.10/- ఇస్తే చాలు ఎటువంటి తనిఖీ చేయకుండా వదిలిపెట్టారు. ప్రస్తుత పరిస్థితిలో ఈ విధంగా చేయడం చాలా ప్రమాదం.**

**3. సేవాకౌంటర్స్‌లో పనిచేసే ఉద్యోగులు డ్యూటీలో పని చేసేటప్పుడు భక్తులు క్యూలైన్లో వేచియున్నా సెల్‌ఫోన్లో మాట్లాడుతూనే ఉంటారు. ఇందువల్ల భక్తులకు ఎంత సమయం వృథా అవుతుందో ఆలోచించరు. ఈ విషయమై ఒక నిర్ణయం తీసుకోవలసిందిగా కోరుతున్నాను.**

*- మాధవి, పాలకొల్లు.*

**కార్యనిర్వహణాధికారి :** 1) ఆలోచిస్తాం; 2) తగుచర్య తీసుకొంటాం; 3) భక్తుల సౌకర్యార్థం పనిచేసే కార్యాలయాల్లో ఉద్యోగులు డ్యూటీలో నున్నప్పుడు సెల్‌ఫోన్లో మాట్లాడకూడదని కార్యాలయాధికారుల నుండి ఉత్తర్వులు పంపుతాం.

**తి.తి.దే. ధార్మిక పుస్తకాలను తక్కువ రేటుకు అందిస్తే బాగుంటుంది.** *- వెంకటేశ్వర్లు, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి:** తి.తి.దే. పుస్తకాలపై 40% డిస్కౌంట్ ఇప్పటికే ఇస్తున్నాం. అధికారులతో చర్చించి ఇంకా తక్కువరేటుకు ఇవ్వడానికి ప్రయత్నిస్తాం.

**ఇటీవల కొండకు వచ్చాం. ఆన్‌లైన్లో దర్శనటిక్కెట్లు బుక్ చేసుకొన్నాం. అయితే ప్రింటింగ్‌లోపం వల్ల మా ఐడెంటిటీ ఫోటోలు ప్రింటు కాలేదు. ఐడెంటిటీ ఫోటోలు లేవని దర్శనానికి వదల్లేదు. కనీసం అక్కడ మా గోడు చెప్పుకోదానికి సంబంధిత అధికారి కూడా లేరు. ఏ అధికారితో మాట్లాడాలో చెప్పేవాళ్ళూ లేరు.** *- భద్రిష్, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి:** వైకుంఠం క్యూ కాంప్లెక్స్‌లో డ్యూటీలో ఉండే పర్యవేక్షకుల పేర్లను డిస్‌ప్లే చేస్తాం.

**ఎస్.వి.బి.సి.లో "నిత్య పూజలివిగో" అనే కార్యక్రమంలో స్వామివారి మూలరూపాన్ని ఆపాదమస్తకం చూపించండి. 80 సం॥ల ముసలివాడిని కొండకురాలేను. కనీసం ఇక్కడి నుండే భక్తి ఛానల్‌లో చూసుకొంటాను.** *- శర్మ, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** ఆలయంలో వెండివాకిలి తరువాత ఎటువంటి ఫోటోలు చిత్రించడం కాని, తీయడం కాని ఆగమశాస్త్రం ఒప్పుకోదు. మూలరూపాన్ని చూపలేం. ఎస్.వి.బి.సి.లో చూపించే మూర్తి మూలరూపం కాదు. కాబట్టి ఎస్.వి.బి.సి.వాళ్ళు స్వామిని చూపించేటప్పుడు ఇది మూలరూపం కాదు సెట్‌లోని స్వామి అనే క్యాప్షన్ వెయ్యమని చెప్తాం.

**సహస్రదీపాలంకరణ, కల్యాణోత్సవం మొదలగు ప్రత్యక్ష ప్రసారాల్లో దేవుడికి హారతి ఇచ్చేటప్పుడు పాదాలను ఎక్కువ సేపు చూపించండి.** *- శారద, బెంగుళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** అలాగే! (ఆగమాలకు విరుద్ధంగా లేకపోతే అలాగే చూపిస్తాం).

**ఈ మధ్య తిరుమలలో ఏర్పాట్లు చాలా బాగున్నాయి. అయితే ఒక్క విషయం! నాద నీరాజనం దగ్గర ఉండే లాకర్ల భవనానికి సూచిక బోర్డులు ఏర్పాటు చెయ్యండి. భక్తులకుపయోగపడుతుంది. "లాకర్లకు దారి" అని పెట్టండి.**

*- అనురాధ, వరంగల్.*

**కార్యనిర్వహణాధికారి:** అలాగే! తిరుమలలో ప్రతికూడలిలోనూ తి.తి.దే. సమాచార కేంద్రం ఏర్పాటు చేశాం. వాళ్ళను అడిగితే కూడా సమాచారమందిస్తారు.

**భక్తులను కంపార్ట్‌మెంట్‌లలో కూర్చోపెట్టినప్పుడు ఎవ్వరూ ఉందరు? అత్యవసర పరిస్థితి వస్తే పిలవడానికి ఒక బెల్ అయినా ఏర్పాటు చెయ్యండి.** *- మహాలక్ష్మి, తిరుపతి.*

**కార్యనిర్వహణాధికారి :** చూద్దాం.

## అక్షరామృతం [32]

# రామానుజులు

- ఎమ్.టి.ఆళ్వార్

వేంకటాచలపతి సంకల్పములు అత్యాశ్చర్య జనకములు. తన దాసుల విషయంలో దేశకాల భాషా వర్ణభేదము లేకుండా తన సేవాభాగ్యాన్ని ప్రసాదిస్తూనే ఉంటాడు. 'కలౌ వేంకటనాయకః' అని అన్నట్లు స్వామి దృష్టిలో తరతమ భేదాలుండవు. అందరికి శ్రీహరే అంతరాత్మ. యోగి! భోగి! ఇరువురు స్వామి అనుగ్రహానికి పాత్రులే! కాబట్టి తమతమ శక్త్యానుసారం వివిధరూపాల్లో స్వామివారికి కానుకలను ప్రేమమీర ఎందరెందరో ఎన్ని విధాలుగానో కైంకర్యాలుగా సమర్పించారు. ఆ విధంగా స్వామికి స్థిరచరాస్తులు చాలానే చేకూరాయి. చరాస్తులు ధన కనక వస్తువాహనాది రూపాల్లో ఉంటాయి. స్థిరాస్తులు ఆచంద్ర తారార్కం నిలిచిపోయే కవితా సామగ్రి, సాహిత్య సంపదలు.

ప్రస్తుత లేఖనంలో వేంకటేశ్వరుని స్థిరాస్తులు అనాదిగా ఉండేవి రెండు. ఒకటి సంస్కృత భాషయందు, మరొకటి ఆంధ్ర భాషలో నున్నాయి. వీటిని సమర్పించినవారు యతీశ్వరులొకరైతే; మరొకరు రాజేశ్వరులు. వీరిద్దరూ తమతమ పరిధులలో అనన్య సామాన్యులే! మక్కువమీర వేంకటాచలపతికి శాశ్వతకానుకలు సమర్పించినవారు. ఇద్దరినీ వేంకటాచలపతి గౌరవించాడు. ఒకరికి శ్రీభాష్యకారుల సన్నిధి అని తన కోవెలలోనే నిత్యపూజాదులు జరిపించుచుండగా, మరొకరు తన ఇరువురు దేవేరులతో శ్రీవారి ప్రధానగోపురం లోపలిభాగాన దర్శనమిస్తున్నారు. ఒకరు యోగి! మరొకరు భోగి! ఒకరు సంస్కృతభాష నాశ్రయించగా మరొకరు తెలుగుభాష నాధారం చేసికొని శ్రీ వైష్ణవభావ కుసుమాలతో తిరువేంగళనాథుని అర్చించి తరించినవారు. వీరిద్దరూ శ్రీ మహావిష్ణుపారమ్యాన్ని తెలిపే విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని సమర్థించి శరణాగతతత్త్వాన్ని, భక్తిసామ్రాజ్యాన్ని విస్తరింపజేసిన వారే! ఇద్దరి రచనలు ప్రౌఢములు. భగవద్రామానుజులు పూర్వాచార్యులచే రక్షింపబడిన శ్రీ వైష్ణవసిద్ధాంతము వెలుగులోకి తెచ్చి 108 దివ్యతిరుపతులలో కైంకర్యాన్ని సమర్పించినప్పటికినీ, వేంకటాచలపతిపై పరమప్రీతితో శ్రీ భాష్య మహాగ్రంథాన్ని అంకితం చేశాడు. తన భాష్యారంభమున

**అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే**
**వినత వివిధభూత వ్రాతరక్షైకదీక్షే ।**
**శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే**
**భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా ॥**

అని శ్రీనివాసునే పరంబ్రహ్మగా స్థాపన చేశాడు. వీరి శ్రీ భాష్యవ్యాఖ్యానానికి ఆళ్వారాచార్యుల శ్రీసూక్తులు, వేదోపనిషత్పురాణేతిహాసములు పరమప్రామాణ్యములు. రామానుజుల రచన సంస్కృతభాషకు వన్నెతెచ్చింది. విశిష్టాద్వైత సిద్ధాంతానికే నివాళులెత్తింది. తరువాత ఆచార్యులకు మార్గదర్శకమై శతాధిక గ్రంథాల సిద్ధాంతానికి మూలరాయైనది.

శ్రీ వేంకటేశ్వరుని సుందరమగు దివ్యమంగళ విగ్రహాన్ని పరమ సాత్త్వికమూర్తిగా శంఖచక్రాద్యాయుధ విశేషాలతో లక్ష్మీపతిగా ప్రస్తుతమున్న రూపును అందించింది రామానుజులే! నాడు వేంకటాచలపతిని తామసారాధనల నుండి తప్పించినాడు. శ్రీనివాసుడు వైకుంఠం వీడివచ్చిన దయామూర్తి; పరమసాత్త్వికతేజమని వాదోపవాదములతో స్థిరీకరించినవాడు. నాటినుండి అవిచ్ఛిన్నంగా వైఖానస శాస్త్రాగమ రీతిలో స్వామికి అర్చనలు జరుగుతున్నాయి. అక్కడే జీయరులను నియమించాడు. వారు శ్రీవారికి తులసి పరిచారక కైంకర్యాలు చేసేటట్లు నిర్ణయం చేశాడు. వారి మతపరంపర నేటికి స్వామివారి కోవెలలో జీయంగారులుగను, ఏకాంగులుగను పరిచర్యలు చేయుట గమనించవచ్చు. ఇంతటి మహోపకారి రామానుజులని భావించిన శ్రీనివాసుని ఆస్థానంలో ఆతనికి ప్రత్యేక గౌరవ మర్యాదలున్నాయి. ఈ శ్రీభాష్యకారుల సన్నిధి, కాలినడక

త్రోవలో చివరి పర్వతంమీద ఉన్నది. దానికై తాత్కాలిక దీపా రాధనకు, నైవేద్యానికిగాను కావలసిన సంభారాలు దేవస్థానం నుండి పంపబడుతున్నాయి. ఈ విధంగా భగవద్రామానుజుల వారు తన గ్రంథాన్ని శ్రీనివాసుని చరాస్తిగా సమర్పించి ధన్యుడై నాడు.

ఇక రెండవవారు ఆంధ్రదేశాన్ని మూడుపూవులు ఆరుకాయలుగా ఏలి సాహితీసమరాంగణ సార్వభౌమునిగా పేరెన్నికగన్న శ్రీకృష్ణదేవరాయలు. ఈతడు కళింగదేశాన్ని జయించాలనే కోరికతో విజయవాడలో నున్న సమయంలో కృష్ణానదీతీరంనందున్న శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు సన్నిధిలో ఏకాదశీ వ్రతమాచరించగా; ఆనాటి రాత్రి నాలుగవ జాము నందు శ్రీహరి సాక్షాత్కరించి "శ్రీ విష్ణుచిత్తుల కుమార్తెయగు గోదాదేవి కథను తెలుగుభాషలో విమలహృద్ధ్యాన వద్య గద్య పద్య మిళితంగా రచించి నాకు ఆనందము చేకూర్చు"మని యానతిచ్చుటయేగాక –

**అంకితమోయన నీకల**
**వేంకటపతి యిష్టమైన వేల్పగుటఁ దదీ**
**యాంకితము సేయు మొక్కొక**
**సంకేతముగా కతఁడ రసన్నేగానే?**

అని ఎవరికి అంకితమీయవలెనో కూడా నుడివినాడు. శ్రీమహావిష్ణువు పారమ్యాన్ని తెలుపు ప్రబంధాలు నాటికి తెలుగుభాషలో చెప్పుకోదగ్గవి లేవు. కావున మహాభక్తుడు కవితాసామ్రాజ్య చక్రవర్తియగు రాయలు "దివ్యసూరిచరిత" నాధారంగా చేసుకుని రసమయంగా ప్రౌఢరచనాదీక్షతో "ఆముక్త మాల్యద" అనే కావ్యాన్ని వెలయించినాడు. ఇది ఆంధ్ర విష్ణువుకు ప్రియమైన కథ. "ఆముక్త" అనగా తాను అలం కరించుకున్న "మాల్య"; తులసిమాలలను ఇచ్చునది (గోదాదేవి) అని అర్థం. ఈమెకు తమిళంలో "చూడికొడుత్త నాచ్చియార్" అనే వ్యవహారం కూడా ఉంది. ఈమె విష్ణుచిత్తునకు ముద్దుల పట్టి. తులసివనంలో దొరికినది. చిన్నతనం నుండి శ్రీహరి కథాశ్రవణం చేసినది. తండ్రిగారు నిష్కామ కైంకర్యపరులు. తులసిమాలలను గ్రుచ్చి వటపత్రశాయికి ప్రతిదినం అర్పణ చేసేవాడు. ఆ విధంగా విష్ణుచిత్తుడు ప్రతిదినమూ స్వామికై గ్రుచ్చిన దండలను అతనికి తెలీకుండా; మహాభక్తురాలగు గోదాదేవి తానొకపర్యాయం వాటిని ధరించి తన అందాన్ని బావిలో తొంగిచూచుకొని సంతోషించి తిరిగి యథాప్రకారం ఆ బుట్టలోనే ఉంచేది. ఈ విషయం తెలీని విష్ణుచిత్తుడు మన్నారు స్వామికి మరుసటిదినం ప్రాతఃకాలమున అలాగే సమర్పిస్తూండే వాడు. గోదాదేవికి తాను చేసేపని అపచారమని తెలీదు. విష్ణుచిత్తునకు వాస్తవం తెలీదు. కాని ఒకరోజు మన్నారురంగని అర్చకులు తులసిమాలికలలో వెంట్రుకలు ఉండటం జూచి విష్ణుచిత్తుని దుర్భాషలాడారు. విష్ణుచిత్తుడు పశ్చాత్తప్తుడగు చుండగా స్వామి గోదాదేవి ముడిచి ఇచ్చిన మాలికలే నాకు

ప్రియములని పలికి ఆమెను వివాహమాడాడు. అలా గోద మానవశరీరంతో అర్చాస్వరూపుడైన రంగనాథుని వివాహ మాడింది. వివాహానికి పూర్వం తాను గోపికల వేషాన్ని దాల్చి భాగవతమున గోపికలు శ్రీకృష్ణుని పొందుటకై ఏ విధంగా వ్రతమాచరించారో ఆ విధంగానే తానూ ముప్పది దినాలు మార్గశీర్షమాసాన వ్రతమాచరించింది. దీనినే తిరుప్పావై నోము అంటారు. ముప్పదిదినాలు రోజుకొక గోపికను మేలుకొలుపులు పాడి లేపింది. ఆ పాటలనే తిరుప్పావై అంటారు. ఇవి సకల వేదపురాణేతిహాస స్మృతివచో విలసితములు. ఈ ముప్పది పాటల్లో రెండింటిని నేటికీ తిరుమల దేవాలయంలో "శాత్తు మొఱ" సమయాన పాడుతారు. ధనుర్మాసంలో నెల పూర్తి సుప్రభాతం బదులు తిరుప్పావైని పాడుతారు. ఇది నిజమైన కథ. కాని శ్రీకృష్ణదేవరాయలు గోదాకల్యాణాన్ని మాత్రమేగాక ఖాండిక్య కేశిధ్వజ కథలను, యామునాచార్యుని కథను, మాలదాసరి కథను సుదూరంగా నాలోచించి తన కావ్యమున చొప్పించి తన ప్రబంధానికొక విశిష్టస్థానాన్ని కల్పించాడు.

తాను కన్నడిగుడు (తుళువవంశము). తీసుకొన్న విషయం తమిళము. వ్రాసిన గ్రంథము తెలుగులో! ఇది ఆశ్చర్యకర విషయమే! (ఆయన తల్లి నాగులాంబ తెలుగుబిడ్డ. అందువలన రాయలవారి మాతృభాష తెలుగే కాని వేరు కాదు.)

**రామానుజుడు దేనిని నమ్మి ఏ పరాత్పరునకు తన విశిష్టగ్రంథాన్ని అంకితం చేశాడో; రాయలు కూడా అదే విధంగా తన గ్రంథాన్ని శ్రీనివాసునకే అంకితం చేశాడు.**

రామానుజులు ఏ విధంగ తన భాష్యారంభమున శ్లోకం వేంకటభర్తపై వ్రాసాడో; అదే విధంగా రాయలు కూడా తన "ఆముక్తమాల్యద" ప్రబంధంలో ప్రార్థనతో ఆరంభించాడు.

అనంత, గరుడ, విష్వక్సేన పంచాయుధ స్తవములతో పాటు రామానుజాచార్యుని విశిష్టాద్వైత సిద్ధాంతానికి మూల పురుషులగు పన్నిద్దరాళ్వారులను కూడా;

> **అల పన్నిద్దరు సూరులందును సముద్యల్లీలఁగా వున్నెవె**
> **గ్గలపుందాపముఁబాపనా, నిజమనః కంజాత, సంజాతన్ పు**
> **ష్కలమాధ్వీకఝరిన్మురారి సొగియంగాఁ జొక్కిధన్యాత్ములౌ**
> **నిలపన్నిద్దఱు సూరులం దలతుఁమోక్షేచ్ఛా మతిందివ్యులన్**

అని స్తుతించాడు. రామానుజుని కవిత్వ మెంతటి ప్రౌఢమో ఆతని గద్యత్రయాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

రామానుజుడు పన్నిద్దఱాళ్వారులలో ఒకతె యగు గోదాదేవినెంత అభిమానించాడో చెప్పనలవి కాదు. గోదాదేవి వివాహసమయాన మ్రొక్కిన మ్రొక్కును శ్రీరంగనికి చెల్లించి గోదాగ్రజుడని పేరు పొందాడు. గోదాదేవి రచించిన తిరుప్పావై పాశురాలను (30) నిరంతరం అనుసంధించుటచే రామానుజునకు తిరుప్పావై జీయర్ అనే పేరుకూడా కలదు. అట్టి భాగవత శిఖామణి గోదా. ఈమెయూ వేంకటాచలపతినే ప్రార్థించింది. ఈమె చరితాన్ని వేంకటాచలపతికి అంకితం చేయుటయే సబబైనది.

రామానుజుడు కేవలం మతప్రచారకుడే కాదు; సంఘసంస్కర్తయని చెప్పక తప్పదు. రామానుజుడు చాతుర్వర్ణ్యముల వారినేగాక నిమ్న జాతులవారిని కూడా తరించుటకై అష్టాక్షర మహామంత్రాన్ని గోపురమెక్కి చాటాడు. వైశ్య, శూద్ర కులాల్లోని భాగవతుల సహపంక్తిన భుజించాడు. అందరికిని వైష్ణవమతము తప్తచక్రాంకనములు పంచసంస్కారములు అనుగ్రహించి తనవారిగా చేసుకొన్న ఉదార పురుషుడు.

రాయలు ఈ సునిశితాభిప్రాయము నెఱిగిన వైష్ణవుడు కాబట్టి 'ఆముక్తమాల్యద' ప్రధాన కథకు సంబంధములేకున్నను మాలదాసరి చరిత్రను పాఠకలోకము వేనోళ్ళ కొనియాడేటట్లు రచించాడు. దాసరికులంలోని వైష్ణవమతానికి మాలదాసరికథ ఉదాహరణ మాత్రమే. మాలదాసరి కథ మంగళకైశికరాగం, దాని మహిమ, ఎట్టివాడు వైష్ణవుడు?, భాగవతోత్తముల పాద ధూళి మహిమ, వారి స్పర్శమహిమ వీటన్నింటిని తప్పక నిరూపింపవలెననే తలపుతో మాలదాసరి చరిత్రను చక్కగా రచించాడు. తద్వారా వైష్ణవమతస్థాపన చేశాడు.

ఈ విధంగా రామానుజులు, రాయలు విశిష్టాద్వైత సిద్ధాంతాలను నాథముని, యామునాది భాగవతులచే పరిరక్షితము; ఉభయభాషల్లో అద్వితీయ గ్రంథాలను రచించి; విభిన్నకాలాల్లో నున్నప్పటికిని ఇరువురును శ్రీ వేంకటాచలపతికి తమ కవితాసొత్తులను చరాస్తులుగా ప్రకటించినారని చెప్పక తప్పదు.

## వ్యాసకృత అధ్యాత్మ రామాయణం

**(తెలుగుసేత : శ్రీ గోటేటి శ్రీరామారావు; ప్రథమ ముద్రణ: జూలై, 2010; పుటలు: 301 పేజీలు; ధర: రూ.120/-; ప్రాప్తిస్థానం : రామరాజ్ పబ్లికేషన్స్, 64(16) తంబయ్య రెడ్డి స్ట్రీట్, వెస్టుమాంబళం, చెన్నై - 600 033.)**

శ్రీరామనామ ప్రాశస్త్యాన్ని వివరించే దివ్యమంత్రాన్ని శివుడు పార్వతికి ఉపదేశించాడు. శివుడు పార్వతికి చెప్పిన బ్రహ్మాండ పురాణంలో 4200 శ్లోకాల్లో విస్తరింపబడిన రామ కథ అధ్యాత్మ రామాయణంగా ప్రసిద్ధి పొందింది. అధ్యాత్మ రామాయణం వాల్మీకి రామాయణకథనే వివరిస్తూ శ్రీరాముని శ్రీమహావిష్ణువుగా, సీతను యోగమాయగా, మిగిలిన పాత్రల న్నిటిని ప్రత్యేక కార్యార్థం ప్రభవించినవిగా చూపింది. కౌసల్యా దశరథులు గత జన్మలో అదితీ కశ్యపులు. వారు విష్ణుపూజాతత్పరులై తపస్సు చేయగా విష్ణువు ప్రత్యక్షమై నాడు. వారు తనను తమకు పుత్రుడుగా పుట్టుమని కోరారు. ఆ పరంధాముడే రాముడుగా పుట్టాడు. వాల్మీకి రామాయ ణంలో రాముడు సామాన్య మానవుడుగా ప్రవర్తిస్తూ; తానే పరమాత్మనని, తనను శరణు పొందితే సంసార సాగరంనుండి ఉద్ధరిస్తానని అభయ ప్రదానం చేశాడు. రామ నామ మహిమవల్లే తాను మహర్షి అయినట్లు చెబుతాడు వాల్మీకి. రామా! మీ జ్ఞానాగ్ని రూపమైన ఖడ్గంతో నాకున్న పుత్రధనాది స్నేహబంధాలను ఖండించమంటుంది కైకేయి.

రామాయణ కథా మూలంగా భగవత్తత్త్వాన్ని, ఆత్మ తత్త్వాన్ని అర్థం చేసుకోవడానికి శ్రీ గోటేటి శ్రీరామారావు గారి ఈ గ్రంథం ఎంతగానో ఉపకరిస్తుంది. గోటేటివారు వ్యాస కృతమైన అధ్యాత్మ రామాయణాన్ని యథాతథంగా తెలుగు వచనంగా వెలయించారు. వారి భాష సరళంగాను, విషయం స్పష్టంగాను ఉంది. చదివిన వారికి రామాయణ రహస్యాలతో పాటు ఆత్మతత్త్వం బాగా బోధపడుతుంది. రచయిత మూల గ్రంథంలోని ప్రతి విషయాన్ని జారిపోనీ కుండా తెలుగులోనికి తెచ్చి పాఠకులకు మూలగ్రంథం చదివినంత అనుభూతిని కలిగించారు. ముముక్షువులైన చదు వరులు వారి కృషిని తప్పక అభినందిస్తారు. అందరూ తప్పక చదవాల్సిన గ్రంథమిది.

**- డా॥ గల్లా చలపతి.**

### గ్రంథసమీక్ష

## చతుశ్శతక సమీక్ష

**(సైజు-1/8 డెమ్మీ; వెల-రూ.15/- ప్రతులకు- భరణి పబ్లికేషన్స్, ఇ.నెం.28-20-17/4, జానీవీధి, ఆరండల్‌పేట, విజయవాడ - 520 002.)**

భావితరాలను నీతిమార్గంలో నడిపించడానికి శత కాలు- కవులు వేసుకున్న పథకాలు! వందపద్యాలకు తగ్గకుండా ఉంటాయి. కాబట్టి వీటిని "శతకాలు" అన్నారు. ఈ శతక పద్యాలకు "ముక్తకాలు" అని కూడా పేరు. భావ వ్యక్తీకరణలో ఏ పద్యానికి ఆ పద్యం సమగ్రంగా ఉంటూ కవి నిర్దేశించుకున్న భావాన్ని వ్యక్తపరుస్తూ ఉంటుంది.

ఒక ప్రబంధమో, ఒక కావ్యమో, ఒక ఇతిహాసమో లేకపోతే ఒక కథా కథనమో చాటి చెప్పే సందేశాన్ని, శతకంలోని ఒక పద్యం సౌష్ఠవంగా ఆ పనిని సునా యాసంగా చేయగలుగుతుంది. పిల్లలకు పసివయసులోనే ఎన్నో నీతులు, భక్తి భావాలు, ధర్మసూక్ష్మాలు కరతలామల కంగా మారాయి అంటే - దానికి కారణం శతక పద్యాలే. ఈ శతకాల ప్రాచుర్యాన్ని గుర్తించారు. కాబట్టే విజయ వాడకు చెందిన భరణీ పబ్లికేషన్స్ వారు వేమన శతకాన్ని, సుమతి శతకాన్ని, దాశరథీ శతకాన్ని, భాస్కర శతకాన్నీ - పండిత పరిష్కృతంగా చక్కగా ముద్రించి వెలువరించారు.

నైతిక విలువలు దిగజారిపోతున్న ఈ ఆధునిక కాలంలో, పిల్లల లేతమనసులలో శతక పద్యాలు మానవతా దివ్వెలుగా వెలిగి సన్మార్గాన్ని చూపుతాయనడంలో సందేహం లేదు!

**- డా॥ కలువగుంట రామమూర్తి.**

# హరిభజన - పాపహరం

- కొమాండూరు మారుతీకుమారి

హరిని భజించటమంటే భగవంతుని సేవించటం, పూజించటం, ఆరాధించటమని అర్థం. నామస్మరణ చేయడమే భజన. నవవిధ భాగవతోత్తమ సేవల్లో భజనను ప్రశస్తమైందిగా చెప్పుకోవచ్చు.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్.**

సేవాభావనకు ఆద్యుడు ఆంజనేయుడు. శ్రీరాముని పాద సేవనమే జీవనంగా, శ్రీరాముని నామమే ప్రాణంగా "రామబాణంకన్నా, రామనామమే మిన్న"యని లోకానికి చాటి చెప్పిన పరమభాగవతోత్తముడు.

**"యత్రయత్ర రఘునాథకీర్తనమ్ తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్"** ఎక్కడ రాముని భజన జరుగుతుందో అక్కడ హనుమకు స్థానముంటుందని చెప్పారు మన పెద్దలు.

భజన సంప్రదాయం భారతదేశంలో ప్రాచీనకాలం నుండి అనుసరించబడుతోంది. ప్రతి పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ హరిభజన, రామభజన పేరుతో సామూహిక భజనలు విరివిగా జరుగుతూంటాయి. శ్రీ విష్ణుసహస్రనామ పారాయణలు, ముఖ్యంగా స్త్రీలతో శ్రీ లలితాసహస్రనామ పారాయణలు కూడా జరుగుతూంటాయి. ఏ విధంగానైనా అది భజన సంప్రదాయమే ఔతుంది. దేశంలో ఏవైనా అరిష్టాలు, ప్రకృతి వైపరీత్యాలు వంటివి జరిగినా వాటినివారణ కోసం, వర్షాల కోసం, ప్రజల సుఖశాంతులకోసం భజనలు నిర్వహిస్తూ ఉంటారు. ఇంకనూ శివరాత్రి, వైకుంఠ ఏకాదశి, శ్రీరామనవమి వంటి పండుగ సమయాల్లో కూడా జాగరణ చేయడానికి భజనలు చక్కగా తోడ్పడుతాయి.

సాధారణంగా ఒక్కరే దైవధ్యానం చేస్తే దాన్ని పూజ లేక ధ్యానమంటారు. సామూహికంగా కొంతమంది కలిసిచేస్తే అది భజనగా పిలువబడుతుంది. ఒకరు ముఖ్య గాయకుడుగా గానం చేస్తే తక్కినవారు చేతులతో తాళం వేస్తూ మనస్సును కేంద్రీకరించి దాన్ని అలాగే పలుకుతూ గానం చేస్తారు. అంటే మనస్సు, వాక్కు, చేతులు దాన్ని అలాగే పలుకుతూ త్రికరణ శుద్ధిగా భగవంతుని కొలవడమే భజన. వ్యక్తిగతమైన పూజ కంటె సామూహికంగా చేసే భజనకే ఫలితమెక్కువ. సంస్కృత శ్లోకాలు, మంత్రాలు మననం చేయలేనివారు, చదువలేనివారు, పామరులు కూడా ఈ భజనలో పాల్గొని జీవితాన్ని సఫలం చేసుకోవచ్చు. ఈ భజన సంప్రదాయం కేవలం హిందూమతానికే పరిమితం కాలేదు. ఇతర మతాలవారు కూడా సామూహిక ప్రార్థనలు చేయడం మనం చూస్తూనే ఉన్నాం.

భజన వ్యక్తిగతమైన ప్రయోజనం కోసం కాదు. లోక కల్యాణం కోసం, సంఘంలో సుఖశాంతులకోసం, ప్రజాక్షేమం కోసం. పూర్వం మహారాజులు దేశప్రజల శాంతిసౌఖ్యాల కోసం యజ్ఞయాగాదులు, దానధర్మాలను విరివిగా చేసేవారు. అనంతర కాలంలో పెద్ద పెద్ద దేవాలయ సంస్థల్లో ఊరిపెద్దలు భజన కార్యక్రమాలు నిర్వహించేవారు. ఇప్పుడు కూడా అటువంటి సంస్థలున్నప్పటికీ ప్రజలే ఒక సంస్థగానో, సంఘంగానో ఏర్పడి కొనసాగిస్తున్నారు.

ఇంట్లో ఒక్కరే కూర్చుని చేసే పూజలో ఏకాగ్రత కుదర వచ్చు, కుదరకపోవచ్చు. భజన కార్యక్రమంలో పాల్గొంటే తప్పక ఏకాగ్రత కుదిరే అవకాశముంటుంది. ఎందుకంటే ఒకరు పాడుతూ ఉంటే మిగతావారు అనుకరించి పాడడం, చప్పట్లు చరుస్తూ శరీరాన్ని, మనస్సునూ ఉత్తేజింపచేసుకోవడం జరుగుతుంది. ఇందులో ఆరోగ్య రహస్యం కూడా ఇమిడి ఉంటుంది. మానవుని శరీరంలో అరచేతుల నుండి మిగిలిన అన్ని శరీర భాగాలకు కేంద్రమైన నాడీవ్యవస్థ ఉన్నదని ఆక్యుపంచర్ వైద్యవిధానం చెబుతోంది. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలపై పరిశోధనలు చేసిన పాశ్చాత్యులు ఈ విషయాన్ని బలపరిచారు. భజన చేసేటప్పుడు రెండు చేతులతో చప్పట్లుకొడుతూ లయబద్ధంగా కదలుతూ ఉంటాయి. ఆ సమయంలో అతి ముఖ్యమైన శరీర భాగాలైన ప్లీహము అంటే స్ప్లీన్, మూత్ర

## బదరీనారాయణా పాహిమామ్

తనదు కమండలూదకపుధారల నే పరమాత్ము లోకపా
వన చరణమ్ములం గడుగ వారిజ గర్భుఁడు తజ్జలంబు పా
యనిదృఢభక్తి మస్తకమునందు ధరించె శశాంకశేఖరుం;
డనిశము నావృషాద్రిపతి నర్మిలి గొల్చెద నిష్టసిద్ధికై. 1

తిరుమలవంటి క్షేత్రమును తిర్మల సామినిబోలు వేలుపున్
ధరణిని చూడబోమనుట దబ్బర గాదని తైర్థికాళి సా
గర చలదూర్మికా పటలి కైవడి సాగుచు సల్పు వేంకటే
శ్వర గుణకర్మ సంస్తవన శబ్దము దిక్కుల పిక్కటిల్లెడున్. 2

తిరుమల జేరి పుష్కరిణి దివ్యజలమ్ముల స్నానమాడి భూ
వరుని వరాహమూర్తి గని బ్రహ్మముఖామరవంద్యు వేంకటే
శ్వరు నినుజూచి కాన్కలిడు భక్తుల పాదపయోజధూళిలో
పొరలెడు భాగ్యమీగదవె పుణ్యవృషాచల హేమ మందిరా! 3

ఉపలమువంటి నా హృదయ ముత్పల సూనమటుల్ భవత్పద
ప్రపదన సౌరభమ్మునకు భక్తి మధూళికి తానకమ్మునై
యెపుడు రహింప కేల్మోగిచి యెంతయు వేడుచునుంటి దేవరా!
జపము తపమ్ము లేని పశుజాతికి చెందినవాడ బ్రోవరా! 4

నీకు నచ్చిన గుణములు నీవు మెచ్చు
గుణము లొక్కటియున్ లేని కూళ నేను;
నీవు శరణాగత త్రాణ నియమ శీలి
వందులకె వ్రాలినాడ నీ యంఘ్రియుగళి. 5

శ్రీరంగమ్మున రంగనాయకులుగా, సింహాద్రి అప్పన్నగా
శ్రీరాముండుగ భద్రశైలమున, కంచిన్ దేవరాణ్మూర్తిగా
స్ఫారోదారత వెల్గు వేంకటపతీ! స్వామీ జగన్నాథ! బృం
దారణ్యాంత విహారలోల! బదరీనారాయణా! పాహి మామ్. 6

– ముదివర్తి కొండమాచార్యులు

పిండాలు, కాలేయం, గర్భకోశం మొదలైన వాటికి ప్రకంపనలు కలిగి అవి అంతకు మునుపుకంటె ఎక్కువ ఉత్సాహంతో పని చేస్తాయి. ఆరోగ్యం మెరుగవుతుంది. అందువల్లే కొంతమంది భజనకు వెళ్లి వచ్చాక ఆరోగ్యం బాగుపడిందని చెప్పడం మనం గమనించవచ్చు.

భారతదేశంలో ఆధ్యాత్మిక కేంద్రాలుగా దేవాలయాలదే ప్రముఖస్థానం. పల్లె టూళ్ళు మొదలుకొని పట్టణాలవరకూ ప్రతి దేవాలయంలో ఏదో ఒకవారం అంటే గురువారమో, శనివారమో భజన కార్యక్రమాలు జరుగుతూంటాయి. భక్త రామదాసువంటి వాగ్గేయకారులు కూడా తమ కీర్తనలను భజనల కనుకూలంగానే పాడారు. అందుకే ఆ కీర్తనలు చిర స్థాయిగా ప్రజల మనస్సుల్లో నిలిచి పోయాయి. పేరు ఏదైనప్పటికీ భగవద్భక్తి ఒక్కటే. మనం ఏ పేరుతో పిలిచినా, ఏ రూపంగా తలచి గానం చేసినా, ఎలా స్మరించినా భగవంతుడు తృప్తి చెందు తాడు. భజనలో పాల్గొనడం వల్ల నిస్వార్థ మైన భగవచ్చింతన చేసినట్లవుతుంది. అందువల్ల మనపై దైవానికి కూడా ఇంకా ఎక్కువ అనుగ్రహం కలుగుతుంది. కనుక అటువంటి హరి భజనలో పాల్గొనడానికి మానవులు ప్రయత్నించాలి. కనుక హరి భజన ఆరోగ్యదాయకం! శుభదాయకం! శాంతి ప్రదాయకం! పాపహరం!

కాబట్టి మనమందరం కూడా ఎక్కడ ఏ భజనకార్యక్రమాలు జరిగినా అందులో పాల్గొని హరికృపకు పాత్రులౌదాం!

## శ్రీపదకేళి - 23 (ఏప్రిల్ - 2011)
## విజేతలు

**1) రామకూరు లక్ష్మి,**
నాగేశ్వరరావు,
ఇంటి నెం.16-2-111,
తోటవీథి,
గుజరాతీపేట (పోస్టు)
శ్రీకాకుళం - 532 005.

**2) జి.వి.భారతి,**
కె.వి.జగన్నాధరావు,
బాలాజినగర్, చోడవరం (పోస్టు)
విశాఖ జిల్లా.

**3) వెల్లాల సీతాలక్ష్మి,**
ఇంటి నెం.16-110,
ఎ.వి.రావు వీధి, పుంగనూరు (పోస్టు)
చిత్తూరు (జిల్లా) - 517 247.

**సరైన సమాధానాలు రాసినవారు :**

పి.ఎన్.వి.రమణబాబు (తిరుపతి); కాలువ రమాదేవి (మణుగూరు); నల్లపాటి రామకృష్ణ (గుంటూరు); తిరునగరి కేశవదాసు (గుంటూరు); డి.రామస్వామి (శిమ్మాపేట, అరసవల్లి); వై.సుబ్రహ్మణ్యం (ప్రొద్దుటూరు); పి.మల్లిఖార్జునమూర్తి (హైదరాబాదు); రామకూరు నాగేశ్వరరావు (శ్రీకాకుళం); డా॥సి.వి.కె.వై.ఎన్.శర్మ (గుంటూరు); టి.కృష్ణభగవాన్ (భీమవరం); టి.ఆర్.బాలకృష్ణారావు (రాజమండ్రి); డి.ముక్తేశ్వర్ (మోపిదేవి, కృష్ణా జిల్లా); జి.అనంతపద్మనాభయ్య (అనంతపురం); డా॥ కె.రంగదామ (ఆదోని); ముక్కామల వెంకట దుర్గాపవన్ (ఒంగోలు); ఆర్.వి.సిహెచ్. నాగేశ్వర్‌రావు (శ్రీకాకుళం); ఎం.పార్థసారథి ఆచార్యులు (వరంగల్); చదలవాడ కామేశ్వరి (ఒంగోలు); పి.ఆర్.నాయుడు (తిరుపతి); వలభజోస్యుల జలజ (గుంటూరు); కొరుపోలు పద్మజారాయ్ (హనుమకొండ); వంగవీటి వెంకటేశ్వర్లు (బేతవోలు); సావిత్రిశర్మ (అనంతపురం); ఓ.వి.హెచ్.కె. చైతన్య (గద్దలగుంటపాలెం); నేమాన సుభాష్ చంద్రబోస్ (శ్రీకాకుళం); బి.జి.కె.రెడ్డి (తిరుపతి); ఎం.ఎస్.రాజు (సంబేపల్లి).




**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానెంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా ఈ శీర్షికలో పాల్గొనవచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాం. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాం.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| 1 | | | 2 | | | | 3 | 4 |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | 5 | | |
| | | | | | 6 | | | |
| 7 | | 8 | | | | 9 | | |
| | | | | | 10 | | | |
| | | 11 | 12 | | | | 13 | |
| | 14 | | | | 15 | | | |
| 16 | | | | | | | | |
| | | | | 17 | | | | |

# శ్రీపదకేళి - 25

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

**2)** మీరు సప్తగిరి చందాదారులైతే?

**అ)** చందా నెంబరు : ..............................

**ఆ)** మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..............................

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

## ఆధారాలు

### అడ్డం

**1)** అర్జునునికి 'చాక్షుషి' విద్యను ఇచ్చినవాడు (6)

**3)** భూమి (2)

**6)** యుద్ధము (2)

**7)** కొబ్బరికాయ (5)

**9)** గృహము మరియు ధ్వజము అనే అర్థాలనిచ్చేపదం (3)

**11)** శివుని వాహనం (2)

**15)** నర్తనశాల్లో భీముడు చంపినవాడు (4)

**16)** నాగులతల్లి (3)

**17)** పాండుమహారాజు రెండవ భార్య (2)

### నిలువు

**1)** విష్ణుమూర్తి (6)

**2)** నవరత్నాల్లో ఒకటి (2)

**4)** ఈ కొండపైన అన్నవరం సత్యనారాయణస్వామి కొలువై యున్నాడు (5)

**5)** ఎల్లప్పుడు (3)

**8)** వడ్రంగి చేతిలోనున్న ఉలి (3)

**10)** ఈ కొండపైన కనకదుర్గ కొలువైయుంది (5)

**12)** దైత్యులతల్లి (2)

**13)** ధైర్యము (3)

**14)** శివుడు (3)

### ***శ్రీపదకేళి-23 (ఏప్రిల్, 2011) సమాధానాలు***

| 1 గు | | 2 హం | | | 3 శ | మీ | 4 కు | డు |
|---|---|---|---|---|---|---|---|---|
| ణ | | 5 సు | థ | | త | | శ | |
| ని | | డు | | 6 మే | ధ | | ల | |
| ధి | | | 7 క | | న్యు | | వు | |
| | 8 శి | శు | పా | లు | డు | | లు | |
| | తి | | లి | | | 9 కృ | | 10 కు |
| | కం | | ని | | | పి | | చే |
| | రు | | | | | | | లు |
| | డు | | | 11 కు | శ | ధ్వ | జు | డు |




– జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ రాశివారికి పనుల ఆలస్యం వల్ల మానసిక వేదన, వృథాఖర్చు. అధికకోపం వల్ల సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. ఇంట్లో విలువైన వస్తువుల అపహరణ. అవివాహితులకు వివాహ ప్రయత్నాలు అనుకూలం. వృత్తివ్యాపారాల్లో నరఘోషవల్ల కష్టనష్టాలు. మొదటివారం వృథాశ్రమ, రెండోవారం ధన వ్యయం, మూడోవారం ఆనందం, నాలుగోవారం ఆందోళన.



## వృషభ రాశి

ఈ రాశివారికి అన్నివిధాలా అనుకూలమైన మాసం. కొన్ని సంవత్సరాలుగా ఎదురుచూస్తున్న పనులన్ని పరిపూర్ణమౌతాయి. విదేశీ, విహార యాత్రలకనుకూలం. సంఘంలో గుర్తింపు పెరుగుతుంది. స్థిరాస్థి, నూతన వ్యాపార, భూ, గృహ పూజల కనుకూలం. మొదటివారం ధనలాభం, రెండోవారం శుభవార్తా శ్రవణం, మూడోవారం ఆనందం, నాలుగోవారం సన్మానం.



## మిథున రాశి

ఈ రాశివారికి కొంత అశాంతి, మనస్పర్థలు ఏర్పడే అవకాశముంది. సంకష్టచతుర్థశినాడు గణపతిని గరికతో ఆరాధిస్తే మేలు జరుగుతుంది. వృత్తి వ్యాపారాల్లో స్థానమార్పులు. నమ్మిన వ్యక్తుల వల్లే కొంత అశాంతి కల్గుతుంది. థైరాయిడ్ సమస్య నుండి కొంత ఉపశమనం. రాజకీయ వ్యక్తులకు పదవీప్రాప్తి. మొదటివారం ఆందోళన, రెండోవారం దైవచింతన, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం కార్యజయం.



## కర్కాటక రాశి

ఈ రాశివారికి వృత్తి వ్యాపారాల్లో స్వల్పఆటంకాలు. అధికకోపం సన్నిహితులను దూరం చేస్తుంది. పలు ఆకస్మిక ప్రమాదాల దృష్ట్యా ఒంటరి ప్రయాణం వద్దు. ఆలయ దర్శనం మేలు చేస్తుంది. అతి ఆలోచనలొద్దు. మొదటివారం అధికకోపం, రెండోవారం ఆందోళన, మూడోవారం ఆలయ దర్శనం, నాలుగోవారం ఆనందం.



## సింహ రాశి

ఈ రాశివారికి ఆశించిన ఫలితాలు కొంత ఆలస్యమైనా పరిపూర్ణమౌతాయి. బంధుమిత్రుల సహకారంతో అవివాహితులకు వివాహాలు కుదురుతాయి. పుస్తకావిష్కరణ, పలు సాహిత్య కార్యక్రమాలు మానసికానందాన్నిస్తాయి. మీ పై అపనిందలు వేసేవారి పట్ల తగు జాగ్రత్త వహించగలరు. మొదటివారం కార్యజయం, రెండోవారం ఆనందం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం మనస్పర్థలు.



## కన్యా రాశి

ఈ రాశివారికి గత కొంతకాలంగా ఎదురుచూస్తున్న భూక్రయవిక్రయాలకు మంచి ధర పలుకుతుంది. గ్రహస్థితుల ప్రభావం దృష్ట్యా శత్రువులు మిత్రులవుతారు. దైవచింతనకై చేయుయాత్రలు మంచి ఫలితాల్ని మరియు ఆనందాన్నిస్తాయి. భర్త సహకారంతో బంగారం, విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. విద్యార్థులకు అదృష్టకాలం. అందరి మెప్పును పొందుతారు. మొదటివారం ఆనందం, రెండోవారం దైవచింతన, మూడోవారం ధనప్రాప్తి, నాలుగోవారం కార్యానుకూలత.



## తులా రాశి

ఈ రాశివారికి ప్రతికూల ఫలాలు అధికం. భార్య ఆరోగ్యం కోసమై చేసేపూజలకు, శస్త్ర చికిత్సలకు విపరీతంగా అప్పులు చేస్తారు. మాటలు పొదుపు చేస్తే మంచిది. అవివాహితులకు వివాహప్రయత్నాలు అనుకూలం. ఇంట్లో ఒకరి అనారోగ్యంతో మానసికాందోళన. జాగ్రత్త వహించగలరు. మొదటివారం వృథాఖర్చులు, రెండోవారం ప్రమాదం, మూడో వారం ఒత్తిడి, నాలుగోవారం అనారోగ్యం.

## వృశ్చిక రాశి

ఈ రాశివారికి ఆకస్మిక ధనలాభం. నూతనపథకాలు, ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. మహిళలకు రాజ యోగం. చంద్రగ్రహణం దోషనివారణ కోసం దానధర్మాలు, గ్రహశాంతి పూజలు మేలు చేస్తాయి. పెద్దలతో మాట్లాడేట ప్పుడు సమన్వయం పాటించండి. మొదటివారం ధనప్రాప్తి, రెండోవారం ఒత్తిడి, మూడోవారం గ్రహపూజలు, నాలుగోవారం కార్యవిఘ్నం.

## ధనూ రాశి

ఈ రాశివారికి తొందరపాటు నిర్ణయాల వల్ల చేయు వృత్తివ్యాపారాల్లో కష్టనష్టాలు కల్గుతాయి. గ్రహాలు వక్రస్థితిలో పరిభ్రమించటం వల్ల చంద్రగ్రహణం దోషం కల్గుతుంది. గ్రహణం దోషనివారణ కోసం పుణ్యనదీ తీరాల్లో నవగ్రహ శాంతి పూజలు, దానధర్మాలు చేస్తే మేలు కల్గుతుంది. మొదటి వారం కార్యవిఘ్నం, రెండోవారం దైవ, గ్రహణ పూజలు, మూడో వారం శుభవార్త, నాలుగోవారం ధనప్రాప్తి.

## మకర రాశి

ఈ రాశివారికి నమ్మినవ్యక్తుల వల్ల మోసాలు జరిగి, ఆందోళన చెందుతారు. వివాహప్రయత్నాల్లో మధ్యవర్తుల ఆధి పత్యం ఎక్కువై ఇరువర్గాల వారిని ఆందోళనకు గురి చేస్తుంది. రైతులకు, విత్తన వ్యాపారులకు అదృష్టకాలం. వాహనాలు నడిపే టప్పుడు జాగ్రత్త వహించండి. మొదటివారం ధనలాభం, రెండో వారం ఆనందం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం ఆందోళన.

## కుంభ రాశి

ఈ రాశివారికి వృథాశ్రమ, సుదూర ప్రయాణాలు, వృథాఖర్చులు ఏర్పడుతాయి. బంధుమిత్రుల సహకారం సైతం అత్యంత దయనీయంగా ఉంటుంది. ఆధ్యాత్మిక, ధార్మిక కార్య క్రమాల వల్ల మానసికానందం కల్గుతుంది. నమ్మిన వ్యక్తుల వల్ల మోసానికి గురై ఆందోళన చెందుతారు. మొదటివారం వృథాశ్రమ, రెండోవారం దైవచింతన, మూడోవారం ఆందోళన, నాలుగోవారం ధనాదాయం.

## మీన రాశి

ఈ రాశివారికి ధనాదాయాన్ని పెంచేక్రమంలో బంధు మిత్రులతో విరోధమెక్కువై మానసికాందోళన కల్గుతుంది. భూమి, బంగారు ఆభరణాల క్రయవిక్రయాల పట్ల ఆసక్తి కన బరుస్తారు. క్షేత్రదర్శనంకై చేయుప్రయత్నాలు అనుకూలం. మహిళలకు ఉన్నత పదవీయోగం. నిరుద్యోగులకు, అవివాహితు లకు ఉద్యోగ, వివాహ ప్రయత్నాలకనుకూలం. మొదటివారం క్షేత్రదర్శనం, రెండోవారం ఆందోళన, మూడోవారం ధనప్రాప్తి, నాలుగోవారం సంతోషం.

# కల్యాణకారకుడు

- నాగశ్రీ

తిరుమల తిరుపతి దేవస్థానంవారు శ్రీనివాసునికి "నిత్య కల్యాణం" సేవ ద్వారా భక్తులు ఆ స్వామి వారికి మరింత చేరువయ్యే అవకాశం కల్పిస్తున్నారు. శ్రీ వేంక టేశ్వర స్వామివారు తమకు కల్యాణోత్సవ సేవ చేసిన భక్తుల కోర్కెలు తప్పక తీరుతాయన్నదాంట్లో ఎటువంటి అతిశయోక్తి లేదు. శ్రీవారి మహత్తుతో మా ఇంట్లో జరిగిన శుభకార్యాల గురించి పాఠకులకు తెలియజేయాలని ఈ సంఘటనల్ని రాస్తు న్నాను.

అది 1996వ సంవత్సరం. మాది అనంతపురం జిల్లా. గుత్తిలో నాన్నగారు ఏ.పి.ఎస్.ఆర్.టి.సి.లో పని చేస్తుండేవారు. అప్పుడే చిత్తూరు జిల్లాలోని పుత్తూరుకు నాన్నగారిని బదిలీచేశారు. పుత్తూరు, తిరుపతికి దగ్గర కావడం వల్ల, తరచూ మేమంతా శ్రీవారిని దర్శించుకునే వాళ్ళం.




ఒకసారి మాకు పుత్తూరు పక్కనే ఉన్న నారాయణవనం గురించి తెలిసింది. అది శ్రీనివాసుడు, పద్మావతి అమ్మవారిని మను వాడిన స్థలం. స్వామివారు, అమ్మవారు ఇద్దరూ ఆ గుడిలో కొలువైయున్నారు. అక్కడ ఆనాడు పెళ్ళికోసం అమ్మ వారికి పసుపు దంచిన రోకలి ఇప్పుడు కూడా ఉంది. మరియు శ్రీకృష్ణుడు, సత్యభామ కోసం తెచ్చిన పారిజాతం చెట్టు కూడా ఉంది. మాకు అక్కడ కొలువై యున్న పద్మావతీ, గోదా సమేత శ్రీనివాసుని చూచి చాలా ఆనందం వేసింది. అప్పటి నుంచి ప్రతి శనివారం నారాయణవనం గుడికి వెళ్ళి, మా చేతనైన సేవను మేము చేసుకునేవాళ్ళం. మా ఇంటికి మా స్నేహితు లొచ్చినా, బంధువులొచ్చినా ఆ గుడికి తీసుకెళ్ళేవాళ్ళం.

తరచూ బెంగళూరు నుంచి మా ఇంటికి మా పెద్దమ్మ కూతురు వచ్చేది. మేమంతా కలిసి తిరుమలకు వెళ్ళేవాళ్ళం. మా అక్క బాగా చదువుకుంది. బ్యాంకులో ఉద్యోగం చేసేది. అక్కకు ఇంక పెళ్ళికావల్సి ఉంది. అయితే, మా పెద్దనాన్న మా అక్క చిన్నతనంలోనే ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు. దాంతో, వచ్చిన సంబంధాలన్నీ తప్పిపోయేవి. అదే అప్పుడు పెద్ద సమస్యగా మారింది.

మాకు తెలిసినవారు నారాయణవనంలో నున్న అమ్మ వారి కంకణం కట్టించుకుంటే త్వరగా పెళ్ళవుతుందని చెప్పగా, ఒక మంచిరోజు చూసుకొని, మేమందరమూ నారాయణవనా నికి వెళ్ళాం. అక్కడ అర్చక స్వాములవారు, అమ్మవారి చేతిలో నున్న కంకణం తీసి అక్కచేతికి కట్టారు. పెళ్ళికాగానే తన భర్తతో వచ్చి స్వామివారికి కల్యాణం చేయిస్తానని మొక్కుకో మన్నారు. అక్క అలానే చేసింది. ఇది జరిగిన ఒక్క నెలలోనే తెలిసిన వాళ్ళద్వారా మంచి సంబంధం వచ్చి అక్క నిశ్చితార్థం జరిగింది. 1997, మే నెలలో అక్క పెళ్ళి ఘనంగా జరిగిపోయింది. తన అత్త గారింట్లో అందరూ మంచివాళ్లవటంతో చాలా సంతోషంగా ఉంది. అంతేగాక, ఇప్పుడు అక్కకు పాప, బాబు పుట్టి అంతా సవ్యంగా సాగుతోంది.

మా అమ్మ, నాన్న, అక్క పెళ్ళి కాగానే తిరుమలలో, నారాయణవనంలో, తిరుచానూరులో, శ్రీనివాసమంగాపురంలో కల్యాణోత్సవసేవ చేయించారు. అప్పటి నుంచి, ఇప్పటి వరకు పెళ్ళికాని అమ్మాయిలకు, అబ్బాయిలకు నాన్నగారు నారాయణ వనం వెళ్ళిరండి! వీలైతే స్వామివారికి కల్యాణోత్సవం కూడా చేయించండి అని చెబుతూంటారు. అలా వెళ్ళిన ప్రతి ఒక్కరికీ కల్యాణమయ్యింది.

అంతేకాకుండా, నాకు కూడా మా నాన్నగారు ఒక మంచిరోజు చూసుకుని 2009, జనవరిలో నారాయణవనం తీసుకెళ్ళి స్వామివారిని, అమ్మవారిని దర్శనం చేయించి, తర్వాత అమ్మవారి కంకణం కట్టించారు. దాంతో నాకు 2009, నవం బరులోనే పెళ్ళికుదిరింది. ఇప్పుడు మేమెంతో సంతోషంగా ఉన్నాం. ఆ స్వామివారి ఆశీస్సులతో అంతా మంచే జరిగింది. తనను నమ్మినవారిని స్వామి ఎప్పుడూ రక్షిస్తాడు. ఆ స్వామి వారికి మా కుటుంబం ఎల్లప్పుడూ కృతజ్ఞులమే....




**ధారావాహిక - 101**

**(తిరుమల తిరుపతి దేవాలయాల్లోని ఒకటి, రెండు శాసనాల ద్వారా ఆలయం వ్యవసాయ భూములు, నీటిపారుదల మీద పెట్టిన పెట్టుబడి వాటి మీద వచ్చే రాబడి, దేవాలయంవారు పెట్టిన సొమ్ము మీద ఎంత శాతం వడ్డీ వచ్చేది అనే విషయాలు ఈ సంచికలో తెలుపబడినవి.)**

పై రెండు శాసనాల్లోని వివరాలను సరిపోల్చి చూసినట్లైయితే తిరుపతి(తిరుమల) దేవాలయం పెట్టిన పెట్టుబడుల మీద లభించే వార్షికాదాయం **ఇంతని మదింపు** వేయడానికి సాధ్యమౌతుంది. ఈ రెండు శాసనాలు సమకాలీనములు. ఒక నెలవ్యవధిలో అంటే క్రీ.శ.1542సం॥ జనవరినెలలో ఒక శాసనం; ఫిబ్రవరిలో మరొక శాసనం ప్రకటించటంచేత నాటి వస్తువుల విలువల సరళిని తెలుసుకోవచ్చు. **ఒక అప్పపడి 6 పణాలు** ఐనందున ఒక సం॥లో 300 అప్పపడిల వెల 1800 పణాలౌతోంది. మరియు 15,000 నర్పణాలను పెట్టుబడిగా పెట్టియున్నందున దీనిపై లభించే వార్షికవడ్డీ రాబడి 300 అప్పపడిల విలువకు సరిపోతోంది. కాబట్టి 15,000 నర్పణాల మూలధనంమీద ధనరూపాన లభించే వడ్డీ 1,800 పణాలౌతోంది. లెక్కకట్టితే ఇది12% వడ్డీ అని తేలుతోంది.

ఈ సందర్భంలో గమనించాల్సిన విషయమేంటంటే స్థిరమైన ప్రయోజనాలను కలిగించే వ్యవసాయాభివృద్ధి కోసం పొలాలు, పంట కాలువలు మొదలైనవాటి మరమ్మతులపనులు జరపడంవలన లభించే అధికాదాయమంతా దేవాలయానికే దాఖలు పడటంలేదు. **ఇందులో దేవాలయానికివచ్చే భాగం ఎల్లప్పుడూ మేల్‌వరి భాగం మాత్రమే.** కాబట్టి వ్యవసాయాభివృద్ధికోసం శాశ్వతంగానుండే పనులు మరియు పంటపొలాలకు నీరందించే కాలువల అభివృద్ధికి ఏ విధమైన పెట్టుబడి పెట్టినా ఫలితం మాత్రం వ్యవసాయదారుడికి అధికరాబడిలో ఆనాడు అమలులోనున్న స్వామ్యనిష్పత్తిలో దాయభాగం కూడ లభిస్తుంది. కాబట్టి దేవాలయగ్రామాల్లో వ్యవసాయదారుడి కుడివరం భాగ ఆదాయం రావడమేకాకుండా, పంటకాలువలు మొదలైనవాటి మరమ్మతులు చేయడంద్వారా కూడా అభివృద్ధి జరుగుతుంది. అంతే కాకుండా అభివృద్ధికార్యాలు ప్రారంభించిన ప్రథమదశలో అధికంగానుండే తవ్వకపుపనులలో శ్రామికులైన కూలీల అవసరముంటుంది. ఈ కార్యక్రమాల్లో యాంత్రిక పరికరాల ఆవశ్యకత అతి తక్కువగా ఉండటంవలన అభివృద్ధి కోసం పెట్టే పెట్టుబడిలో అధికశాతం స్థానిక గ్రామప్రజలు ఎవరైతే ఈ కార్యక్రమాల్లో పాల్గొంటారో వారే ఎక్కువగా లాభపడతారు.

శాసనాలు తెలిపే విషయాలను లెక్క వేసినపుడు దానకర్తల ధనం పెట్టుబడిగా పెట్టి కృషి చేస్తే ఐదునుండి పదిహేను భాగం ఎక్కువ ఆదాయం కలుగుతుందని తేలుతుంది. ఇక్కడ ఆదాయం హెచ్చు తగ్గుదలకు కారణం అంటే ఆయా గ్రామాల భౌగోళిక ప్రత్యేక లక్షణాల ఆధారంగా పంటల పరిమాణం నిర్ధారమవ్వడమే. వాస్తవ ప్రతిఫలం ఎంతనేది రెండు అంశాల ఆధారంతో తీర్మానమవుతుంది.

అ) భూమిసారాన్ననుసరించే పంట పెరుగుదల.

ఆ) మేల్‌వరం మరియు కుడివరంలలోని అంతరాంతరములు. ఇవి గ్రామగ్రామానికి వేరు వేరుగానుండేవి. శాసనాలు చెప్పడాన్ని బట్టి చూస్తే ఇది 40 శాతం నుండి 75 శాతం వరకూ వ్యత్యాసం పొందేవిగానుండేవి.

హెచ్చు అయ్యే పంట ప్రమాణం ఎనిమిది శాతం అని సామాన్య లెక్క పెట్టవచ్చు. పై చెప్పినట్టు ఇది 'మేల్‌వరి' భాగాన్ని మాత్రమే చెబుతుంది. మొత్తం పంటలోని 'మేల్‌వరి' భాగం 50 శాతం అంటే మేల్‌వరి, కుడివరి రెండూ సమంగా నున్నపుడు పెట్టుబడిపై ఎక్కువ అయ్యే ఆదాయం 16 భాగాలని చెప్పవచ్చు. ఇక్కడ ఒక అంశాన్ని గమనించాలి. పై పేర్కొన్న మేల్‌వరి అనేది ఆలయానికి దొరికే ఆదాయం. వెనక చెప్పినట్టు ఆలయానికి రాబడి అయ్యే ఆదాయాన్ని - అర్వాచీన కాలంలో కూడా - పూర్తిగా చెల్లించడమే సంప్రదాయం. ఇక్కడ అప్పుగానీ, అపవ్యయం గానీ ఉండదు. కాన ఎనిమిది శాతానికి మించిన ఆదాయాన్ని పూర్ణాంకంగానే గుర్తించవచ్చు.

మేల్‌వరి అనేది సామాన్యంగా రాజకోశాగారానికి చెందే ఆదాయమైన సందర్భంలో రాజపరివారంచే ఆలయాలకు దానంగా వచ్చినవిగా ఉన్నాయి. అందువల్ల రాజ భండారం పూర్తిగా వసూలు చేసే పరిస్థితిలో ఎక్కువైన ఆదాయం ఎనిమిది శాతం అని చెప్పాలి. రాజభండారం శిస్తులు సామాన్యంగా ఎపుడూ 40 శాతానికి మించదు. (1950-1960 వరకూ ఇదే పరిస్థితి) మిగులు పలు లెక్కల్లో, ఫైళ్ళలో నమోదైనా, కనబడక పోతుంది. అందువల్ల 16వ శతాబ్దంలో ప్రభుత్వం నీటిపారుదల కోసం వెచ్చించిన ధనంపై దాని ఎనిమిది శాతంలో నలభైశాతం లేక పెట్టుబడిలోని 3.2 శాతం ఆదాయం ఎక్కువయ్యేది అని చెప్పడానికి ఆస్కారమున్నది.

ఇక ఆసక్తికరమైన విషయమేంటంటే అర్వాచీన అంచనా వర్గీకరణం రీతిగా నీటిపారుదల విభాగంలో పెట్టుబడి పై 1.5 శాతం అధిక ఉత్పాదన వస్తే దానిని లాభసాటి పెట్టుబడి అనియూ, ఏ ఒక్క పెట్టుబడి కూడా నీటిపారుదల రంగంలో 3 శాతం కంటే ఎక్కువ రాబడినివ్వదని చెప్పబడింది. పై పరిశీలనతో 16వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో భూమిశిస్తు వసూలు మరియు నీటిపారుదల పారుపత్యం సమర్థవంతంగా పని చేస్తూ ఉండేవని తెలుస్తోంది.

ఒక దాన ధనాన్ని పెట్టుబడి చేసే పద్ధతిచే ఆలయానికి వచ్చే ఆదాయం మరియు కృషి అభివృద్ధికై వెచ్చించిన డబ్బుపై వచ్చు అధికరాబడి మధ్య కనబడే అంతరం ముఖ్యమైంది. ఆలయం చేబట్టిన నీటిపారుదల యోజనతో సాధికమయ్యే సమాజాభివృద్ధికి ఈ అంతరం సమంగా ఉంటుంది. కారణం దేవ దాన గ్రామాల్లో ఆలయం పెట్టిన పెట్టుబడిలోని అధిక ఉత్పాదనా సంపదలోని ఒక భాగం గ్రామంలోనే మిగిలేది. వందకు మిక్కిలి అయిన దేవాలయ గ్రామ భూముల వైవిధ్య మయమైన అధికోత్పాదనలతో ఆయా గ్రామాల వ్యవసాయ దారుల జీవనస్థాయి ఉన్నతంగానే ఉండి ఉండవచ్చు.

## ప్రసాదాల తయారీ ఖర్చులు :

శాసనాల మూలంగా ఒక అప్పపడి - ప్రసాదరూప మైన అప్పంలోని తీపి ప్రమాణాన్ని కూడ తెలియవచ్చును. తిరు మల ఆలయం పశ్చిమం వైపు గోడలోని 513 వ శాసనం- విజయనగర సామ్రాజ్యంలోని ఒకానొక పాళయపట్టు అయిన వేమంపట్టు పాళయం అత్తిలంగు నాయకుడు క్రీ.శ. 1544 జూన్ 5వ తేది ఒక దానం చేశాడు. ఈ దానంలో దాత ఇచ్చిన 550 నర్పణాలను స్వీకరించిన స్థానత్తారులు దానికి ప్రతిగా చేయ తలబెట్టిన ఉభయం వివరం (నివేదన వివరం) ఉన్నది. దాని ప్రకారం 'విట్టవన్ విళక్కాడు' (దాతకు చెందు నివేదన భాగం) భాగమైన 13 అప్పం'లను దాతకు తిరుమలకు చెందిన పుష్పవాటికను చూసే కృషీవలుడు సింగయ్యకు ఇవ్వ వలెను. నివేదనలోని కాలుభాగం దాత భాగానికి వస్తుందనే టపుడు అది 13 అప్పములు అనే విషయం ఇక్కడ ప్రకటమైనది. అంటే ఒక అప్పపడి అంటే అది 52 అప్పములతో కూడినదన్న మాట. ఆసక్తికరమైన అంశమేంటంటే కొన్ని సంవత్సరాల వెనుక ప్రసాద పడి అంటే 52 అప్పములనే చెప్పబడేది. ఇంకొక్క శాసనం మూలంగా ఒక అప్పపడి తయారు చేయడానికి కావల సిన ముడిసరుకుల వివరం దొరుకుతుంది.

తిరుపతి విస్తరణల్లో ఒకడైన నరసింగాపురం వర్తకుల్లో నొకడైన పప్పుసెట్టి అయ్య మరియు ఆలయ స్థానత్తారుల మధ్య క్రీ.శ.1512 సెప్టెంబర్ 15 తేది నాడు కుదిరిన ఒప్పందం ప్రకారం దాత ఇచ్చిన 2500నర్పణాలకు ప్రతిగా నివేదన చేయ డానికి క్రింద చెప్పబడ్డ ముడిసరుకులను సమకూర్చాలి. (ఈ శాసనం తిరుమల ఆలయం రెండవ ప్రాకారంలో దక్షిణం వైపు నున్న తిరుమల రాయమండపంలోని పిండిగది గోడపైనున్నది.)

| ధారావాహిక 06 | మందార మకరందాలు |
|---|---|

**కొందఱికిఁ దెనుఁగు గుణ మగుఁ**
**గొందఱికిని సంస్కృతంబు గుణ మగు రెండున్**
**గొందఱికి గుణము లగు నే**
**నందఱి మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.**

నన్నయ మొదలుకొని ప్రాచీనాంధ్రకవులందరూ సంజాయిషీ ఇచ్చుకున్నారు. తాము తెలుగు–సంస్కృతం ఈ రెండు భాషల్లో సమర్థంగా కవిత లల్లగలుగుతామని! ఎందుకంటే – అప్పటికి కావ్యమంటే సంస్కృత కావ్యమే! పాండిత్యమంటే సంస్కృత పాండిత్యమే!

ఐనా, తెలుగులో కవిత్వాన్ని వెలయించాలని రాజరాజులాంటి పోషకులకూ, నన్నయలాంటి సాధకులకూ అపారమైన కోరిక. నన్నయ అన్నాడు – తాను "ఉభయభాషాకావ్యరచనాభిశోభితుడ" నని; తిక్కన చాటుకున్నాడు – తన "ఉభయకావ్యప్రౌఢి"వని; మరి ఈ పోతన్నకూడా విన్నవించుకొన్నాడు. "ఉభయకావ్యకరణదక్షుడ"నని.

అయితే కొందరికి తెలుగంటే ఇష్టం. మరికొందరికి సంస్కృతమంటే ఇష్టం. "నేను అందరినీ మెప్పిస్తాను" అని సమర్థించుకోవడమెందుకు? అప్పటికే పాలకురికి సోమనాథుడు "నావి తెలుగు మాటలు కావు వేదాలు" అని తాండవిస్తున్నాడు. "సంస్కృత భూయిష్ఠరచన" అందరికి అందుబాటులో ఉండదని హుంకరిస్తున్నాడు. ఇంకొకవైపు శ్రీనాథుడు తెలుగూ కాదు; సంస్కృతమూ కాదు. "నా కవిత్వంబు నిజము కర్ణాటభాష" అని తన దారిని తాను నడుస్తున్నాడు. ఇంతకూ శ్రీనాథుడన్నది నిజమే. ఐతే అతని భాష కర్ణాటభాషా? కాదు. తన కవిత్వం కర్నాటభాష అన్నాడు. అంటే కన్నడం లోని కవితారీతులనూ -- సంస్కృత సమాసధోరణులనూ -- దేశిపదప్రయోగ వైఖరులనూ తనలో ఇమిడించుకున్న కవిత్వం అని అతని అభిప్రాయమేమో!

ఎవ్వరేమనుకున్నా నాకేమి కొరత–అని ఈసడించే మనస్తత్త్వం కాదు పోతన్నది. లోకంలో భిన్నరుచులున్నాయి. కవితాలోకంలో ఎన్నెన్నో తీరుతెన్నులున్నాయి. నన్నయ మార్గరీతి ఉంది. సోమన్న దేశిరీతి ఉంది. ఈ రెంటికి అనుయాయులున్నారు. ఆ రెండు గుణాలను తనలో మేళవించుకున్న కావ్యశిల్పి పోతన్న. ఈ పద్యంలో పోతన్న వినయమే కాదు; ఆత్మవిశ్వాసమూ ధ్వనిస్తున్నది.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

"శ్రీ గోవిందరాజస్వామివారికి రెండు అప్పపడులు మరియు శ్రీరంగనాథస్వామి వారికి ఒకటి–మొత్తం మూడు అప్పపడులు. వీటికై సమకూర్చాల్సిన సాహిత్యం–బియ్యం ఆరు మరక్కాలు, ఆరు నాళి నెయ్యి, బెల్లం 600 ఫలం, మిరియాలు 1 ఉళక్కు మరియు 1 ఆళక్కు. ఈ లెక్కన ఒక అప్పపడి చేయటానికి 2 మరక్కాలు బియ్యం, 2 నాళి నెయ్యి, బెల్లం 200 ఫలం, 1/3 ఉళక్కు మరియు 1/3 ఆళక్కు మిరియాలు కావలెను. ఈ తూకం కొలతలు ప్రసిద్ధమైన తమిళ కొలతలైనందున సులభంగా ఆధునిక సమాన కొలతల లెక్క వేయవచ్చు.

ఒక అప్పపడి తయారీ చేసేందుకు ఆరు పణములు అగత్యం. దాని సాహిత్య వివరాలు (ముడిసరుకు వివరం) తెలిసినందున వెలల్ని పణంలలో లెక్కవేయడం సులభం.

పణంను ఆధునిక రూపాయి మూల్యంలో లెక్కకట్టవచ్చు. అంచేత 16వ శతాబ్దంలో తిరుమల తిరుపతి దేవాలయాల నివేదనలను తయారుచేయడానికి కావలసిన ధనం లెక్క ఖచ్చితంగా చెప్పవచ్చు.

15000 పణంలు వార్షికంగా 1800 పణంల ప్రతిఫలం తెచ్చిపెట్టేది. సగటు ఆదాయంగా వచ్చే 8 శాతం అంటెనూ 1200 పణంల వార్షిక ప్రతిఫలం అనుకుని ఇతర ప్రసాదాల ఉత్పాదనా వెచ్చాల్ని శాసనాలాధారంగా లెక్కగట్టవచ్చు.

ఉదాహరణకు తి.తి.192 (క్రీ.శ.1514 జూలై 10) శాసనం స్వామి నైవేద్యానికై ఎనిమిది తిరుబ్బోనకంలకు (ఇప్పటి వెణ్‌పొంగల్) 10000 నర్పణాలను సమర్పించిన దానాన్ని దాఖలు చేస్తుంది. ఎనిమిది శాతం ఉత్పత్తిచే ప్రతి దినం ఎనిమిది తిరుబ్బోనకంలకు 800 పణములు అగత్యం. సంవత్సరానికి 350 తిరుబ్బోనకాలనుకుంటే ఒక తిరు బ్బోనకానికి ఇంచు మించు 1/3 పణం అగత్యం. ఇదే రీతి తి.తి.247 (క్రీ.శ.1506 మార్చి 5) శాసనం 27 అతిరస పడులకై 840 నర్పణంల సమర్పణను చెబుతుంది. 8 శాతం ప్రకారం 27 అతిరసపడులు 51.3 పణం లేక ఒక అతి రస పడి ఇంచుమించు 2 పణంల వెల అవుతుంది. జి.టి.186వ శాసనం 10 దోసె పడుల కొరకు 600 పణంల పెట్టుబడిని చెబుతుంది. 8 శాతం రాబడితో 10 దోసపడుల వెల 48 పణంలు లేకా ఒక దోసపడి వెల సరి సుమారు 5 పణంలు. ఇదే రీతిగా ఆలయంలోని అన్ని నివేదనల వెలల్ని కూడా లెక్క గట్టవచ్చు. ముందు చెప్పబడ్డ కృష్ణదేవరాయని కాలంనాటి శాసనం (తి.తి.267) దాఖలు చేసినట్టు వేర్వేరు ప్రసాదాల తయారీలో కావలసిన వస్తువుల వివరాల నిచ్చింది కాబట్టి ఆలయంలోని ప్రసాదాల ఖర్చులను తెలియవచ్చును.

**ఆలయ సేవాకర్తల దానములు :** క్రీ.శ.1510 నుండి క్రీ.శ.1570 వరకు తిరుమల ఆలయానికి ధనాన్ని సమర్పించిన కానుకల పరిశీలన చేసినపుడు ఈ క్రింది పట్టిక తయారైంది.

**పట్టిక - 3**

| దాతలు | 1509 - 1530 | | 1530 - 1542 | | 1542 - 1568 | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తం (పణం) | సగటులోని శాతం | మొత్తం (పణం) | సగటులోని శాతం | మొత్తం (పణం) | సగటులోని శాతం |
| అ) రాజపురుషులు | | 33.0 | | 65.0 | | 20.5 |
| రాజ్యపాలురు | -- | -- | 30675 | 6.5 | -- | -- |
| ప్రధానమంత్రి | 1200 | 1.0 | -- | -- | -- | -- |
| సేనాధిపతి | -- | -- | 15000 | 3.0 | -- | -- |
| దళపతులు | 18980 | 12.0 | 145200 | 30.5 | 4260 | 2.5 |
| రాజప్రతినిధులు | 19990 | 13.0 | 11010 | 2.0 | 1580 | 0.1 |
| అధికారులు, సామంతులు | 11320 | 7.0 | 106820 | 23.0 | 32840 | 17.0 |
| ఆ) ఆలయసేవాదారులు | -- | 26.0 | -- | 24.0 | -- | 23.5 |
| అర్చకులు | 28215 | 18.0 | 66963 | 15.0 | 22482 | 12.0 |
| సంగీతకార్లు, నర్తకులు, కవులు | 2520 | 1.5 | 30480 | 6.0 | 6340 | 4.0 |
| విద్వాంసులు | 2500 | 1.5 | 4185 | 1.0 | 5747 | 3.0 |
| ఆలయ గణకులు | 7446 | 5.0 | 8270 | 2.0 | 7802 | 4.5 |
| ఇ) స్థానికులు, వర్తకులు | -- | 41.0 | -- | 11.0 | -- | 56.0 |
| ప్రజలు, తిరుపతి వర్తకులు | 25625 | 23.0 | 41695 | 9.0 | 54405 | 28.0 |
| ఇతర భక్తులు | 27560 | 18.0 | 10293 | 2.0 | 54150 | 28.0 |
| మొత్తం | **155606** | **100.0** | **469901** | **100.0** | **186606** | **100.0** |

*(ఇంకా ఉంది)*



## తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి వారి బ్రహ్మోత్సవాలు

2011, జూన్ 5 నుండి జూన్ 14 వరకు

| తేదీలు | వారం | పగలు ఉత్సవాలు | రాత్రి ఉత్సవాలు |
|---|---|---|---|
| **05-6-11** | ఆది | -- | అంకురార్పణం |
| **06-6-11** | సోమ | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| **07-6-11** | మంగళ | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| **08-6-11** | బుధ | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| **09-6-11** | గురు | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| **10-6-11** | శుక్ర | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| **11-6-11** | శని | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| **12-6-11** | ఆది | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| **13-6-11** | సోమ | రథోత్సవం | అశ్వ (గుఱ్ఱము) వాహనం |
| **14-6-11** | మంగళ | చక్రస్నానం | ధ్వజావరోహణోత్సవం |



## శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలు, అప్పలాయిగుంట

2011, జూన్ 10 నుండి 19 వరకు

| తేదీలు | వారము | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| **10-6-2011** | శుక్ర | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం |
| **11-6-2011** | శని | తిరుచ్చి ఉత్సవం, ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| **12-6-2011** | ఆది | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| **13-6-2011** | సోమ | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| **14-6-2011** | మంగళ | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| **15-6-2011** | బుధ | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం |
| **16-6-2011** | గురు | హనుమద్వాహనం, సా॥ వసంతోత్సవం | గజవాహనం |
| **17-6-2011** | శుక్ర | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం |
| **18-6-2011** | శని | రథోత్సవం | అశ్వ(గుఱ్ఱము)వాహనం |
| **19-6-2011** | ఆది | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం ద్వాదశారాధనము, ఏకాంత ఉత్సవం | తిరుచ్చిలో ధ్వజావరోహణోత్సవం |

బాలప్రబోధం



# భూతదయ

- పైడికొండల వేంకటేశ్వరరావు

భగవంతుడు ఈ సృష్టిని కేవలం మానవుల కోసం మాత్రమే సృష్టించలేదు. కోట్లాది జీవరాశుల్లో ఒక భాగంగా మాత్రమే మానవుడిని సృష్టించాడు. అయితే మానవుడు తన తెలివితేటల్తో సృష్టిలోని ఒక భాగమైన భూమిని తన అధీనంలోకి తెచ్చుకుని, ఆధిపత్యం చలాయిస్తున్నాడు. ఆ క్రమంలో భగవంతుడి సృష్టి అయిన ఎన్నో ఇతర జీవరాశుల్ని సమూలంగా నాశనం చేస్తున్నాడు కూడా.

ఎన్నో రకాలైన పక్షిజాతులు, జంతుజాతులు అంతరించి పోతున్నాయి. చిన్నారి పిచ్చుక కనిపించి ఎన్నేళ్ళయింది? రాబందులు ఎక్కడైనా కనిపిస్తున్నాయా? పులులు, సింహాలు, పావురాలు..... ఇలా ఎంత దారుణంగా తగ్గిపోయాయో వాటి సంతతి! మరి బ్రతికి బట్టకట్టిన జంతువుల కష్టాలు మరో రకం. ఎన్నో ఆవులు ఎవరి సంరక్షణ లేక రహదారుల మీద తిరుగుతూ, కాగితాలు తింటూ బ్రతుకుతున్నాయి. ఎన్నో కుక్కలు ఆహారం లేక అలమటిస్తున్నాయి. మాంసం కోసం కోళ్ళనీ, మేకల్నీ, ఆవుల్నీ, ఎద్దుల్నీ; చర్మం కోసం ఆవుల్నీ, పాముల్నీ; ఔషధాల కోసం మరికొన్ని జంతువుల్నీ; దంతాల కోసం ఏనుగుల్నీ నిత్యం బలితీసుకుంటూనే ఉన్నాడు మానవుడు.

ప్రపంచం మొత్తం మీద ఏ మతమైనా భూతదయను కలిగి ఉండుమనే చెప్తోంది. మహోన్నతమైన హైందవమతమైతే మరీను!

సకల జీవరాశుల్లోనూ తానే నిండి ఉన్నానన్నాడు కృష్ణ భగవానుడు. నందిని వాహనంగా చేసుకొన్నవాడు శివుడు. అలాగే వినాయకుడు ఎలుకనీ, సరస్వతి హంసనీ, కుమారస్వామి నెమలినీ, కనకదుర్గ పులినీ, విష్ణువు ఆదిశేషుణ్ణీ; ఇలా దేవతలందరూ కూడా పక్షి, జంతు వర్గాల్లో నున్నవాటినే తమ తమ వాహనాలుగా చేసుకొన్నారు.

కలియుగ ప్రత్యక్షదైవం శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాల్లోని వాహనాలను గమనించినట్లైతే; శేషవాహనం, హంస వాహనం, సింహవాహనం, గరుడవాహనం, గజవాహనం, అశ్వ వాహనం మొదలైన వాహనాల మీద ఊరేగడం ద్వారా ఆ స్వామి, ఒకరకంగా మానవుని కన్నా పశుపక్ష్యాదులే నాకు చాలా ప్రియమైనవనే సందేశాన్నిస్తున్నట్లుంటుంది.

అలిపిరి దగ్గర ఠీవిగా నిలబడి సప్తగిరులకి మనల్ని ఆహ్వానించేది పక్షిరాజు గరుడుడే కదా! ఆ సప్తగిరులన్నియూ సర్పరాజు ఆదిశేషుని రూపమే కదా!

ఇక తిరుమలేశుడు కొలువైయున్న తిరుమల కొండల్లో ఎన్నెన్నో పక్షులు, జంతువులు, పాములు... ఎన్నెన్నో జీవ రాశులు... అలా ఆ జీవరాశుల మధ్యే ఎంతో ఇష్టంగా శ్రీనివాసుడు అక్కడే కొలువైయున్నాడు.

ఆ వేంకటరమణుడి భక్తులుగా మనమంతా ఆయన ఇష్టాన్ని గౌరవిస్తూ; ఆయన హృదయాన్ని అర్థం చేసుకుంటూ; భూతదయను అలవరచుకోవాలి. అలాగే, మన శాస్త్రాలు కూడా మాంసాహారాన్ని తామసాహారంగా, రాక్షసాహారంగా పేర్కొంటున్నాయి. శాఖాహారాన్ని సాత్త్వికాహారంగా చెప్తూ; అదే ఆచరణీయ మంటున్నాయి. కనుక మనమంతా మాంసాహారాన్ని విడనాడాలి. జంతు సంబంధ వస్తువుల వినియోగం మానుకోవాలి. సాటి జీవరాశులకి నష్టం కలిగించే పనులు చేయకూడదు.

తద్వారా అన్ని జీవరాశుల్లోనూ నిండి ఉన్న ఆ శ్రీహరిని గౌరవించినవారమౌతాం. ఆయన ప్రియభక్తులమౌతాం. మన బ్రతుకు ఎట్టి పాపపంకిలం కాకుండా పుణ్యంతో కూడి ఉన్నట్లైతే; పరలోకంలో మనం ఉత్తమగతులు పొందుతాం. వీటన్నింటినీ మించి ఇహలోకంలో కూడా ఆ ఏడుకొండలవాడి కృపకి పాత్రులమవుతాం.

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

| క్ర.సంఖ్య | పుస్తకం పేరు | రచయిత పేరు | ధర |
|---|---|---|---|
| 1. | అన్నమాచార్య జీవిత చరిత్ర (పీఠిక) | వేటూరి ప్రభాకర శాస్త్రి | 25.00 |
| 2. | అన్నమాచార్య సంకీర్తనామృతం | డా॥ సముద్రాల లక్ష్మణయ్య | 75.00 |
| 3. | భాగవత సుధాలహరి - సంపుటం-1 | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 95.00 |
| 4. | భాగవత సుధాలహరి - సంపుటం-2 | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 90.00 |
| 5. | భాగవత సుధాలహరి - సంపుటం-3 | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 80.00 |
| 6. | ద్వాదశ సూరి చరిత్ర | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 30.00 |
| 7. | ముక్తికాంతా విలాసము | తరిగొండ వెంగమాంబ | 15.00 |
| 8. | ముత్తుస్వామి దీక్షితుల కృతులు - శివశక్తితత్త్వము | డా॥ వి.లలిత అన్నపూర్ణారావు | 90.00 |
| 9. | విష్ణుపారిజాతం | తరిగొండ వెంగమాంబ | 35.00 |
| 10. | విదుషీమణి వెంగమాంబ | ఆంధ్ర శేషగిరి రావు | 30.00 |
| 11. | తెలుగు మెరుగులు | వేటూరి ప్రభాకర శాస్త్రి | 30.00 |
| 12. | తరిగొండ వెంగమాంబ కృతులు - పరిశీలనము | డా॥ కె.జె.కృష్ణమూర్తి | 70.00 |
| 13. | తరిగొండ వెంగమాంబ విజయము | పరిష్కరణ- డా॥ కె.జె.కృష్ణమూర్తి | 20.00 |
| 14. | తరిగొండ వెంగమాంబ చరిత్రము | పరిష్కరణ- డా॥ కె.జె.కృష్ణమూర్తి | 20.00 |
| 15. | చారుదత్త నాటకం | చిలకమర్తి లక్ష్మీనరసింహము | 5.00 |
| 16. | చెంచునాటకం | తరిగొండ వెంగమాంబ | 10.00 |
| 17. | వసిష్ఠ రామాయణం | తరిగొండ వెంగమాంబ | 65.00 |
| 18. | అక్షరామృతం | తి.తి.దే. ప్రత్యేక సంచిక | 180.00 |
| 19. | ఆదిత్య హృదయము | డా॥ఇలపావులూరి పాండురంగారావు | 5.00 |
| 20. | అమృతసారము | ముదివర్తి కొండమాచార్యులు | 68.00 |
| 21. | ఆనందనిలయం (శ్రీ వేంకటేశ్వరుని కథ-వచనం) | జూలకంటి బాలసుబ్రహ్మణ్యం | 20.00 |
| 22. | ఆనందనిలయం (పద్యకావ్యం) | ముదివర్తి కొండమాచార్యులు | 48.00 |
| 23. | అన్నమయ్య సంకీర్తనాస్వరమాధురి | జి.నాగేశ్వర నాయుడు | 15.00 |
| 24. | అవిమారకము | చిలకమర్తి లక్ష్మీనరసింహము | 5.00 |
| 25. | ఆండాళ్ వైభవం | కల్లూరి చంద్రమౌళి | 12.00 |

**పౌరసంబంధాధికారి, పుస్తక విక్రయశాల, తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ప్రెస్ కాంపౌండు, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 083**
**ఇతర వివరాలకు - 0877-2264294 ఫోన్ నంబరును సంప్రదించగలరు.**

☛ పోస్టుద్వారా పొందగోరువారికి పోస్టల్ చార్జీలు అదనం

# మహేంద్రగిరిపై పాండవుల ఆలయాలు

- బద్రి కూర్మారావు

తూర్పు కనుమల్లో ఎత్తైన శిఖరం మహేంద్రగిరి. పాండవులు అజ్ఞాతవాసంలోనున్నపుడు ఇచ్చట గుడులు నిర్మించుకొని శివుని గూర్చి తపస్సు చేశారు కాబట్టి ఇది మహేంద్రగిరిగా మారిందని చెప్పవచ్చు. ఇచ్చట స్వయంగా పాండవులచే నిర్మింపబడినవిగా చెప్పబడుతున్న కుంతి, ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుల గుడులున్నాయి. అన్ని గుడుల్లోను మనకు కనిపించేవి శివలింగాలే! పరశురాముని తపోస్థలం కూడా ఇదేనని చెప్పడానికి కూడా పురాణాధారాలున్నాయి. మహేంద్రగిరులు ఒకప్పుడు కళింగ రాజ్యాల్లో (కళింగాంధ్ర) భాగంగా యుండేవి. ఒరిస్సారాష్ట్రంలో ఒకప్పుడు గంజాం, ప్రస్తుతం గజపతి జిల్లా పర్లాకిమిడికి సుమారు 75 కి.మీ. దూరంలో ఎత్తైన కొండలపై ఈ గుడులున్నాయి. ఆశ్చర్యకరమైన విషయమేంటంటే అంత ఎత్తైన కొండలపైకి ఏ శాస్త్రవిజ్ఞానం అందుబాటులోలేని రోజుల్లోనే అంతంత పెద్దరాళ్ళను ఎలా తెచ్చారు? ఎలా చెక్కారు? ఎలా పేర్చారనే విషయం ఈనాటికీ అర్థం కాకపోవడం విశేషం. ఇక భీముని ఆలయనిర్మాణమైతే మరీ గొప్ప విశేషంగా తోస్తుంది.

ఈ గుడులన్నీ ఏకకాలంలో నిర్మించినట్టివి కానట్టు తెలుస్తోంది. సున్నం, ఇటుకలు లేకుండా కేవలం రాళ్ళను చెక్కి మోపు చేసినట్లు తెలుస్తోంది. అయితే, సంవత్సరానికొకసారి శివరాత్రినాడు జరిగే మహేంద్రగిరి యాత్ర చాలా సాహసంతో మరియు అద్భుతంతో కూడుకున్నది.



ధర్మరాజు గుడి

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం (ఉత్తరాంధ్రవాసులు) జిల్లాలవాసులు ఒకవైపు; మరోవైపు ఒరిస్సారాష్ట్రంలోని గంజాం, గజపతి, రాయగడ జిల్లాల్లోని వేలాదిమంది భక్తులతో శివరాత్రి రెండు రోజులు శబరిమలై వలె మహేంద్రగిరులు మారుమ్రోగిపోతుంది. అలాంటి ఈ మహేంద్రగిరియాత్రకు కొన్ని వందల సంవత్సరాల చరిత్ర ఉంది. శబరిమలై చేరుకోవడం సులభమేమోగాని మహేంద్రగిరిని చేరుకోవడం చాలా దుర్లభమనే చెప్పవచ్చు. ఆంధ్రా ప్రాంతంనుండి శ్రీకాకుళం జిల్లా మందస మండలం సోబకోట గ్రామం వరకు మాత్రమే బస్సులు వెళ్తాయి. అచ్చటినుండి సుమారు ఆరుగంటలు కాలినడకన కొండలపై నడచి ఎత్తైన కొండలు, లోయలు దాటి రాత్రిపూట ప్రయాణించవలసి ఉంటుంది. అటు ఒరిస్సావైపు పర్లాకిమిడి నుండి బర్కత్‌పూర్ వరకు బస్సులో వెళ్తే అచటినుండి రెండున్నర గంటలు నడవాల్సి ఉంటుంది. ఐతే, వయస్సుతో నిమిత్తం లేకుండా అందరూ ఈ యాత్రలో పాల్గొనడం విశేషం. ఒరిస్సా రాష్ట్రం వైపు మాత్రం ప్రయాణం కొద్దిగా సులభతరంగా ఉంటుంది.

ఇక ఇక్కడ సంవత్సరానికొకసారి మాత్రమే యాత్ర జరుగుతుంది. మిగతా రోజుల్లో నిర్మానుష్యంగా ఉంటుంది. 'భీమ్ సవర' తెగకు చెందిన గిరిజన పూజార్లే ఆ రెండురోజులు పూజలు నిర్వహిస్తారు. భయంకరమైన కొండల్లో ప్రయాణం చేసి మహేంద్రగిరులు చేరుకోవడం ఒకింత ఆశ్చర్యకరం మరియు ఆధ్యాత్మిక తృప్తినిస్తుంది. మహేంద్రగిరిచరిత్ర ద్వాపర

యుగం నాటిది. దేశంలో ఎక్కడాలేని విధంగా పాండవుల గుడులిక్కడున్నాయి.

ఇక ఇచ్చటి దేవాలయాల విషయానికొస్తే కుంతి, ధర్మ రాజు (ఒరియా భాషలో దుధిష్టర) భీముడు, అర్జునుడు, నకులసహదేవుల గుడులుంటాయి. ఎక్కువమంది సందర్శించేవి మాత్రం కుంతి, ధర్మరాజు, భీముని గుడులే! ఈ గుడులన్నీ ఏకకాలంలో నిర్మించినవి కావని చరిత్రకారుల అభిప్రాయం. చాళుక్యుల కాలం (క్రీ.శ.577)లో కొన్ని, కటకం పాలించిన గజపతుల (క్రీ.శ.1455) కాలంలో కొన్ని కట్టారనడానికి చారిత్ర కాధారాలున్నాయి. అలాగే, కళింగరాజ్యాన్ని పాలించిన గంగ రాజులకాలంలో కొన్ని నిర్మాణం జరిగినట్లుగా చారిత్రకాధారా లున్నాయి. సున్నం కాకుండా మూడేసి రాళ్ళుచెక్కి మోపు చేసి నట్టు నిర్మాణశైలి క్రీ.శ.పదవశతాబ్దం నుంచి పన్నెండవ శతాబ్దం వరకు తూర్పు చాళుక్యులకాలంలో వెలుగొందింది. మహేంద్ర గిరిపై ఉన్న భీమాలయం, చాళుక్యులు నిర్మించిన బిక్కవోలు ఆలయాన్ని పోలి ఉండటం చేత భీమాలయం చాళుక్యులే నిర్మించి ఉంటారని కూడా భావించవచ్చు.

ఆంధ్రాప్రాంతం నుండి వెళ్ళేవారు ముందుగా దర్శించు కోవలసినది కుంతీ కోవెల. ఇది ఒక మాదిరి గుడి. దీనిలో శివలింగముంటుంది. ప్రక్కనే ఒక చిన్నపాటి నుయ్యి కూడా ఉంది. ఇక్కడే స్నానాలు చేసి కుంతి గుడిని దర్శించుకుంటారు.



**శ్రీ పద్మావతీ అమ్మవారి (తెప్ప) ప్లవోత్సవాలు,**

**తిరుచానూరు**

| | | | |
|---|---|---|---|
| 11-6-11 | శని | శ్రీ కృష్ణస్వామివారికి | జ్యేష్ఠ |
| 12-6-11 | ఆది | శ్రీ సుందరరాజస్వామివారికి | |
| 13-6-11 | సోమ | శ్రీ పద్మావతీ అమ్మవార్లకు | పూర్ణిమకు |
| 14-6-11 | మంగళ | " | జరుగును |
| 15-6-11 | బుధ | " | |

ఇచ్చట వంటలు కూడా చేసుకుంటారు. అక్కడి నుండి ధర్మరాజు గుడికి చేరుకుంటారు. ధర్మరాజు గుడి భూమిలోకి కొద్దిగా దిగినట్లుంటుంది. ఈ ప్రక్కనే పరశురాముని తపోస్థలముంది. ధర్మరాజు గుడిని దర్శించుకొన్నాక అన్నింటికంటె ముఖ్యమైనది భీముని కొండ ఎక్కి భీముని గుడికి చేరుకోవడం. ధర్మరాజు గుడి నుండి అరగంట పాటు ఎత్తైన పర్వతం అతికష్టంగా ఎక్క గల్గితే భీముని కోవెల వస్తుంది. ఐతే, అందరూ తప్పనిసరిగా భీమున్ని స్మరించుకొంటూ భీముని కోవెల దర్శించుకోవడం ఇక్కడి ఆనవాయితీగా చెప్పుకోవచ్చు.

ఇక్కడి భీముని గుడి ఆధునిక శాస్త్రవిజ్ఞానానికే ఒక సవాలువంటిదని చెప్పవచ్చు. కేవలం ఐదారు రాళ్ళతో మాత్రమే ఈ గుడిని నిర్మించారు. టన్నులకొద్దీ బరువు గల ఈ రాళ్ళను ఎక్కడినుండి ఎలా తీసుకువచ్చారు? వాటిని ఒకదానిపై నొకటి ఎలా పెట్టారనేది ఆశ్చర్యం కలిగించే విషయం. ఈ గుడిలోకి వెళ్ళాలంటే ఒక రాయిని దొలచిన చిన్న మార్గం మాత్రమే యుంటుంది. బయటకు వెళ్ళాలంటే అవతలివైపు కూడా అంతే మార్గముంటుంది.

ఆ తర్వాత బారువ గ్రామంలోని కోటిలింగేశ్వర స్వామిని, పొత్తంగిలోని పొట్టేశ్వరుని దర్శించుకుంటారు. అర్జు నుడు ఒకరాత్రి వేటకు వెళ్ళి కపిలేంద్ర అనే ఆవును, ఖడ్గ మృగంగా భావించి బాణంతో కొట్టాడు. ఆ ఆవు శిరస్సు మహేంద్రగిరిపైన, దాని పొట్ట (ఉదరభాగం) పొత్తంగి (మంద సదరి) అనే చోట పడి పోట్టీశ్వరస్వామి వెలిశాడని పురాణాలు చెబుతున్నాయి. పొత్తంగిలోని పొట్టీశ్వరాలయం క్రీ.శ.11, 12 శతాబ్దాల మధ్యన కళింగ గజపతుల కాలంలో నిర్మించినట్లు చరిత్ర చెబుతోంది. ఇంతటి ప్రసిద్ధి చెందిన యాత్రకు వందల సంవత్సరాల ఘనచరిత్ర ఉన్నప్పటికీ ఈ యాత్రకు పెద్దగా ప్రచారం లేదు. కాబట్టి ఆంధ్ర, ఒరిస్సా ప్రభుత్వాలు, ధార్మిక సంస్థలు స్పందించి మహేంద్రగిరిని చేరుకోవడానికి సదు పాయాలు కల్పించినట్లైతే ఇది కూడా మరో శబరిమలై కాగలదు. అలాగే సంవత్సరానికొక్కసారే కాకుండా సంవత్సరమంతా వాటిని చేరుకొనే మార్గాలుంటే గొప్ప ప్రసిద్ధి చెందిన పవిత్ర యాత్రాస్థలం కూడా కాగలదని చెప్పవచ్చు.

## స్వరరాగ సుధారసమయభక్తి మూర్తి

# నాదబ్రహ్మ త్యాగయ్య

- డా॥ బి.దామోదరరావు

"ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు" అని వందన సమర్పణ చేయని సభలు సమావేశాలు తెలుగునాట అరుదు. త్యాగయ్య కీర్తనల్లోని ఆణిముత్యాలపలుకులు ఇవి! మన తెలుగుఖ్యాతికి వారసుడు. కాకర్ల త్యాగరాజు కీర్తనల్లోని చాలా వాక్యాలు స్వాగత గీతాలుగా, సందేశ సూక్తులుగా - శాంతి నినాదాలుగా, భక్తి ప్రచారసాధనాలుగా మారి తెలుగు లోగిళ్ళను చరితార్థం కావించాయి. మరోవైపు కర్ణాటక సంగీతానికి దేశాంతర ఖ్యాతిని తెచ్చిపెట్టాయి.

త్యాగయ్య పూర్వీకులు తెలుగు ప్రాంతంలో నివసించి, తదనంతరకాలంలో, తంజావూరు వలసవెళ్ళి స్థిరపడ్డారు, వీరంతా కూడా నాదోపాసకులే! సంగీత సాహిత్య ప్రవీణులే.

త్యాగయ్య సర్వజిత్ నామ సంవత్సరం వైశాఖ శుద్ధ షష్ఠి, సోమవారం (క్రీ.శ.1767 సం॥, మే నెల 4వ తేది) నాడు జన్మించాడు. తల్లిదండ్రులు సీతమ్మ, రామబ్రహ్మం. ఆ దంపతుల ముద్దులపట్టియే ఈ నాదబ్రహ్మ. త్యాగయ్య జన్మించిన 'తిరువారూరు' పవిత్రక్షేత్రం. ఇక్కడ వెలసిన శివుని పేరు త్యాగరాజస్వామి. ఆయన వరపుత్రుడిగా ఆ స్వామి పేరున 'త్యాగరాజు'గా కర్ణాటక సంగీతానికి రాజయ్యాడు.

ఆయన చిన్ననాడే, ఉత్తమ సాహిత్య సంపద, వాల్మీకి రామాయణం ఆయనపై ప్రభావం చూపింది రాముడే! ఆ రాముణ్ణే తన ఆరాధ్య దైవమనుకున్నాడు. తల్లి సీతమ్మ, వందలాది కీర్తనలు పాడేది. ఇటు రామభక్తి అటు సంగీతానురక్తి కలగలసి, త్యాగయ్య గొప్ప వాగ్గేయకారుడయ్యాడు. భక్తి, ముక్తి ఈ నాదోపాసకుడి కర్తవ్య దీక్షలుగా మారిపోయాయి. వేదవిద్యతో పాటు కవిత్వం, సంగీతం పట్టువడ్డాయి. తండ్రి రామబ్రహ్మం త్యాగయ్య అభిరుచి గమనించి, నాడు ప్రముఖ సంగీత విద్వాంసుడు శొంఠి వెంకటరమణయ్యను త్యాగయ్యకు సంగీతం నేర్పడాని కొప్పించాడు. ఆ మూహూర్త బలమేమిటో గాని, అతిత్వరలోనే గురువును మించిన శిష్యుడైన త్యాగయ్య సంగీతం విని,



వెంకటరమణయ్య తన చేతి కంకణాన్ని త్యాగయ్య చేతికి తొడిగి ఆశీర్వదించాడు.

అంతేకాదు! కాంచీపురం నుండి విచ్చేసిన రామకృష్ణ యతీంద్రులు, త్యాగరాజు పాండిత్య గరిమ కళ్ళార చూచి తొంభైయారుకోట్లమార్లు రామనామ జపం చేయుమనీ, తద్వారా ప్రపంచ ప్రసిద్ధి పొందిన వాగ్గేయకారుడవవుతావనీ ఆశీస్సులందించాడు. ఈ సంఘటన తన సంగీతానికి; తన జీవనసాఫల్యానికి, ఏడుగడ ఎవరో తెలియచెప్పినట్టయింది. ఇక ఇరవైనాలుగు సంవత్సరాల్లో ఈ లక్ష్యం నెరవేర్చి, ఆనంద సాగరంలో మునిగిపోయి....

"ఆనందసాగర మీదని శేషము భూమి భారము" అని ప్రబోధించాడు.

త్యాగయ్య కీర్తనల గొప్పదనమే ఇది. ఇవి ఒకవైపు బోధన, మరోవైపు దైవశోధన, భక్తి, రక్తి, కలగలసి తెలుగు సంగీత ప్రపంచంలో విశిష్టతను సాధించాయి.

జీవుడు ఉత్తమ గతులు పొందాలంటే ఉత్తమ జీవితాన్ని కూడ గడపాలంటాడు. అందుకు ప్రతిబంధకంగా ఉన్న ధన వ్యామోహం వదలాలంటాడు. ఇదే ఓ కృతిగా మలచి, నాదోపాసన లక్ష్యం వివరించాడు. సందేశాలిచ్చాడు.

"నిధి చాలా సుఖమా! రాముని సన్నిధి సేవ సుఖమా" నిజం చెప్పుమని మనసునే ప్రశ్నించుకుంటాడు. దైవానికి భక్తునికి మధ్య నున్న అనుబంధాన్ని

కృతులలో చక్కగా వర్ణించిన వాగ్గేయకారులలో త్యాగయ్య విశిష్ట యోగ్యతలు కలవాడు.

"మరుగేలరా? ఓ రాఘవా" అంటూ, ఆర్తితో పిలిచి; "కనుగొంటి శ్రీరాముని నేడు" అని తృప్తి చెందాడు. "రారా మా ఇంటి దాకా" అని స్వాగతించాడు.

సంగీతం నరుల స్తుతించడానికా, లేక దైవాన్ని అర్చించ డానికా! అంటూ ప్రశ్నించాడు.

"మమత బంధనమున నరస్తుతి సుఖమా!, సుమతీ త్యాగరాజనుయని కీర్తన సుఖమా!" తేల్చుకొమ్మంటాడు. దైవబలం ముందు గ్రహబలం బలాదూర్ అని మనలో నమ్మ కాన్ని పెంచాడు.

## కలియుగ దైవం



**సంకట వినాశ! శ్రీ వేంకటేశ!**
**సప్తగిరీశ! ఓ శ్రీనివాస!**

**బ్రోవర మము గావర**
**చలమేలర కరుణాకర!**

**అతులిత మతిసుందరము - వదనారవిందము**
**పొరిపొరి జూచినను - తరుగదు తమకము**

**దివ్యమౌ నీదు కరము - కరము శుభంకరము**
**ఒసగు నెప్ప డభయము - పొసగజేయు విభవము**

**మెండుగ ఆభరణాలతొ - నిండుగ కొలువుండెదవు**
**మృదుల చేలములను దాల్చి - సతుల నురమునను జేర్చి**

**నీదు పాదపద్మములు - బహు మహిమాన్వితములు**
**కొలుచు భక్తవరులకు - కొంగుబంగారములు**

**అందరకును పెన్నిధివని - అఖిలము నీ సన్నిధియని**
**నెరనమ్మియుంటిని - శరణు శరణంటిని**

**- వల్లూరు వేంకట కృష్ణదాస్**



## శ్రీవారి జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు,
### తిరుమల

| | | | |
|---|---|---|---|
| 13-6-11 | సోమ | వజ్రకవచ సమర్పణ | జ్యేష్ఠ మాసమున జ్యేష్ఠా నక్షత్రమున జరుగును |
| 14-6-11 | మంగళ | ముత్తంగికవచ సమర్పణ | |
| 15-6-11 | బుధ | సువర్ణకవచ సమర్పణ | |

"తేజోమయ విగ్రహమును ధ్యానించేవారికి నవగ్రహ బలమేమి"టంటాడు.

రాముడు, రాముడు; రామనామ జపం ముక్తికి త్రోవ నిచ్చేది. ఇది అడుగడుగునా త్యాగయ్య కీర్తనల్లోని ప్రధా నాంశం.

"మరుగేలరా? ఓ రాఘవా"
"తవ దాసోహం తవ దాసోహం"
"శ్రీరామజయరామ శృంగార రామ"
"కొలువైయున్నాడే కోదండ పాణి"
"చల్లరే రామచంద్రుని పై పూలు"
"వందనం రఘునందన"

– ఇలా ఎన్నో వందల కొద్దీ అమృతధారలు కురిపించే మధుర భక్తి, త్యాగనిరతి రంగరించి, పాడినవెన్నో – రాముని పైనే గాక, సంగీత గొప్పదనాన్ని వివరించే కృతులు కూడ రచించాడు. "సంగీత జ్ఞానము భక్తి వినా" వంటివి ఉదహరించ వచ్చు. త్యాగయ్య దృష్టిలో సంగీతం ముక్తికి సాధనం.

దేశమంతా త్యాగయ్య ప్రతిభను గుర్తించింది. అందుకు తార్కాణం, నేటికీ, వందలాదిగా ఉన్న నాదబ్రహ్మ శిష్యులే సాక్ష్యం.

భగవద్గీత ప్రవచించిన జ్ఞాన, ధ్యాన, భక్తి, కర్మ యోగాలను నాదయోగంలో రంగరించి, ప్రపంచానికి ఆధ్యాత్మిక ముక్తిమార్గం చూపిన గొప్ప వాగ్గేయకారుడు. ప్రతి ఏటా పుష్య బహుళ పంచమి నాడు త్యాగరాజ ఆరాధనోత్సవాలు జరుపు కుంటూ ఆయన సంగీత ప్రపంచానికి చేసిన సేవలు స్మరించు కుంటాం.

వార్తాలహరి

## తిరుమలకు కొత్త జె.ఇ.వో

తిరుమల తిరుపతి దేవస్థానం తిరుమల సంయుక్త కార్యనిర్వహణాధికారిగా శ్రీ కె.భాస్కర్ స్థానంలో శ్రీ కె.యస్. శ్రీనివాసరాజు ఏప్రిల్ 20, 2011న బాధ్యతలు స్వీకరించారు. శ్రీవారి భక్తులకు మెరుగైన సేవలు అందించడమే తమ ప్రథమలక్ష్యమని, శ్రీవేంకటేశ్వరస్వామి ప్రసాదించిన ఈ అరుదైన అవకాశాన్ని వినియోగించి భక్తులకు సేవలందించడానికి పూర్తి స్థాయిలో సమయాన్ని కేటాయిస్తానని నూతన జె.ఇ.ఓ.అన్నారు.

తిరుమల జె.ఇ.వోగా శ్రీవారిసేవ చేయడం చాలా సంతృప్తినిచ్చిందని శ్రీ కె.భాస్కర్ అన్నారు. ఏప్రిల్19, 2011 తేదిన బాధ్యతలనుంచి తప్పుకున్నారు. శ్రీవారిని దర్శించుకోవడానికి ఏడుక్షణాలుకూడా దొరకని సందర్భంలో ఏడునెలలపాటు పనిచేసే అవకాశం రావడం చాలా సంతోషంగా ఉందని తెలిపారు.

## ఘనంగా శ్రీరామనవమి ఉత్సవాలు

శ్రీరామనవమి సందర్భంగా తిరుపతి కోదండరామ స్వామి ఆలయంలో నవమి ఉత్సవాలను అత్యంత వైభవంగా నిర్వహించారు. ఉదయంనుంచి రాత్రి ఏకాంతసేవ వరకు భక్తులతో ఆలయం కిటకిటలాడింది. ఆలయంలో ఉత్సవరులకు తిరుమంజనకార్యక్రమం నిర్వహించారు. సాయంత్రం ఆలయ ప్రాంగణంలో ఊంజలసేవ జరిగింది. రాత్రి 8గం॥ నుంచి 10గం॥ వరకు సీతా సమేత శ్రీకోదండరామస్వామి గరుడ వాహనంపై ఊరేగుతూ భక్తులకు దర్శనమిచ్చారు.

శ్రీరామనవమి సందర్భంగా తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీరామనవమి ఆస్థానం జరిగింది. సుప్రభాతసేవ అనంతరం భోగశ్రీనివాసమూర్తికి శ్రీవారి బంగారు పాదపద్మాలకు అభిషేకం నిర్వహించారు.

తి.తి.దే నిర్వహణలోనున్న వాల్మీకిపురం శ్రీపట్టాభిరామాలయంలో కూడ శ్రీరామనవమి ఉత్సవాలను అత్యంత వైభవంగా నిర్వహించారు. నవమి సందర్భంగా ఈ ఆలయంలో మోహిని ఉత్సవాన్ని నిర్వహించారు. తెల్లవారుజామున శ్రీరామునికి సుగంధపరిమళతైలం, శీకాయ, చిగురుపొడి, పసుపు, చందనం, వట్టివేర్లు మిశ్రమాన్నితలకు అంటించి తైలాభ్యంగన స్నానం చేయించారు. ఆ రాత్రి మోహిని అవతారంలో శ్రీరాముడు భక్తులకు దర్శనమిచ్చాడు.

## శ్రీవారి వార్షిక వసంతోత్సవాలు

తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి వార్షిక వసంతోత్సవాలు ఏప్రిల్ 15, 2011, శుక్రవారం నుండి మూడు రోజుల పాటు వైభవంగా జరిగాయి. చైత్రశుద్ధ త్రయోదశిరోజు అయిన శుక్రవారం శ్రీదేవి, భూదేవి సమేతంగా మలయప్పస్వామి వసంతోత్సవ మండపానికి వేంచేశారు. అభిషేక నివేదనలు, ఆస్థానాలు అయిన తరువాత ఆలయానికి చేరుకున్నారు. 16వ తేదీ ఉభయ దేవేరులతో కలిసి స్వర్ణరథాన్ని అధిరోహించి తిరుమాడ వీధులలో ఊరేగిన తరువాత వసంత మండపం చేరుకొని వసంతోత్సవంలో పాల్గొన్నారు. చివరిరోజైన 17న మలయప్ప స్వామితో పాటు సీతారామలక్ష్మణ ఆంజనేయస్వామి, రుక్మిణీ సమేతశ్రీకృష్ణస్వామి వసంత మండపానికి వేంచేశారు. కొత్తగా రాతిశిలా సౌందర్యంతో నిర్మించిన వసంతమండపాన్ని కనువిందుగా అలంకరించారు. సహజసిద్ధంగా పలుశిలలను ప్రదర్శించారు. అనేక రకాల పుష్పాలతో అలంకరించారు.

## దేశవ్యాప్తంగా ధార్మిక ప్రచురణల విక్రయం

తిరుపతిలోని తి.తి.దే. ప్రచురణాలయంలో కొత్తగా నిర్మించిన పుస్తకవిక్రయ ప్రదర్శనశాలను 18-4-2011వ తేదీన కార్యనిర్వహణాధికారి ప్రారంభించి మాట్లాడుతూ రాబోయే ఆరు నెలలలోపు తి.తి.దే ముద్రాణాలయం పూర్తిస్థాయి సాంకేతిక సామర్థ్యముతో ప్రచురణలు ప్రారంభమౌతాయన్నారు. తెలుగులోనే కాకుండా తమిళ, కన్నడ, హిందీ, ఆంగ్లభాషలలో కూడా ప్రధాన ధార్మిక పుస్తకాలను శ్రీవారి భక్తులకు అందుబాటులోకి తెస్తామని అన్నారు.

## వెంగమాంబ నాటకానికి సాహితీ పురస్కారం

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థికసహాయంతో ముద్రింపబడిన మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ నాటకానికి తెలుగువిశ్వవిద్యాలయం వారి సాహితీ పురస్కారం లభించింది. ఈ నాటకాన్ని ప్రముఖ రచయిత డా॥వి.ఆర్.రాసాని రచించారు. రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో ఈ నాటకం ప్రదర్శింపబడింది.

ఈ కూపను కత్తిరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా : ______________________
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
______________________
______________________
______________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
 (అ) చందా నెంబరు :
 (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
 డి.డి.నెం. : తేది :
 (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని,
నమ్మిస్తున్నారని తెలిసింది.
అలాంటి వారి మాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
మరియు
ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి"
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా చందా కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపవచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.

☛ మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

ఈ పాదమే కదా యిల యెల్లఁగొలిచినది
యీ పాదమే కదా యిందిరా హస్తముల కితవైనది

ఈ పాదమే కదా యిందఱును మ్రొక్కెడిది
యీ పాదమే కదా యీ గగన గంగ పుట్టినది
యీ పాదమే కదా యెలమిఁ బెంపొందినది
యీ పాదమే కదా యిన్నిటికి నెక్కుడైనది



ఈ పాదమే కదా యిభరాజు దలఁచినది
యీ పాదమే కదా యింద్రాదు లెల్ల వెదకినది
యీ పాదమే కదా యీబ్రహ్మ గడిగినది
యీ పాదమే కదా యెగసి బ్రహ్మాండ మంటినది

ఈ పాదమే కదా యిహపరము లొసగెడిది
యీ పాదమే కదా యిల నహల్యకుఁగోరికైనది
యీ పాదమే కదా యీక్షింప దుర్లభము
యీ పాదమే కదా యీ వేంకటాద్రిపై నిరవైనది

(1-66)



వేంకటేశ్వరుని దివ్యపాదమును ఉల్లేఖించడం ఇందలి వస్తువు. ప్రణయంతో, భక్తితో, ఆర్తితో, ఎందరో మహాభక్తులు భగవంతుని శ్రీపాదములను స్పృశించినవారే. ఇది బ్రహ్మ కడిగిన పాదము, గంగ పుట్టిన పాదము, గజేంద్రుని కాపాడిన పాదము, అహల్య పాపమును కడిగిన పాదము, వేంకటాద్రిపై నిలిచిన ఈ పాదము ఇహపరములను ప్రసాదించేది.

# మీ మాట

**ఆగష్టు నెల ముఖ్య పండుగలు**

04 - గరుడ పంచమి
   - కల్కి జయంతి
07 - తరిగొండ వెంగమాంబ వర్ధంతి
12 - వరలక్ష్మీ వ్రతం
13 - హయగ్రీవ జయంతి
14 - గాయత్రీ జపం
15 - స్వాతంత్ర్య దినోత్సవం
22 - గోకులాష్టమి
30 - బలరామ జయంతి
31 - వరాహ జయంతి

## భారతదేశంలోనే లేదు!

సప్తగిరి ఆధ్యాత్మిక మాసపత్రిక లాంటి పత్రిక భారతదేశంలోనే లేదనడం అతిశయోక్తి కాదు. ఇందులో ముఖ్యంగా వేదం తెలుసుకుందాం శీర్షికలో ఎన్నో తెలియని విషయాలు ఉపయోగపడే విషయాలు కూడా అందిస్తున్నందుకు సంతోషం.

**- యు.నాకరాజు, నిర్సీపట్నం.**

## మంచి వ్యక్తిగా మార్చే వాక్యాలు

సప్తగిరి మాసపత్రికలో మీరు ప్రతిపుట చివరన ప్రచురించే మంచి వాక్యాలు చాలా బాగుంటున్నాయి. చెడ్డవారిని కూడా మార్చగలిగే వాక్యాలను ప్రచురిస్తున్నందుకు మీకు మా ధన్యవాదాలు.

**- ఆర్.శ్రీప్రసాద్, నారాయణఖేడ్.**

## కనువిందు

శ్రీ'సప్తగిరి' నాథుడు ప్రతి నెల వినూత్న చిత్ర చిత్రాలంకృతులతో మాకు కనువిందు చేయుచున్నందుకు ధన్యవాదాలు.

**- టి.వి.పార్థసారథి అయ్యంగార్, హైదరాబాదు.**

## బాగున్నాయి

శ్రీ పద్మావతీ అమ్మవారు, వెంగమాంబచిత్రాలు సమున్నతంగా ఉన్నాయి. మారుతీ మౌనకర్తవ్యనిర్వహణ అద్భుతం. ప్రియమైన పరిపూర్ణభక్తుడు భక్తియోగంతో పాటు, దుర్గుణాలను వదలమనడం బాగుంది. తిమ్మక్క సంస్కరణ వాదం, తిరుమలస్వామి ఆధ్వర్యమున జరిపించబడిన కార్యక్రమాల చిత్రాలు బాగున్నాయి.

**- వాస్తు రామచంద్ర, నెల్లూరు.**

## ధన్యవాదాలు

సప్తగిరి మాసపత్రిక సంపాదక వర్గానికి మా ధన్యవాదాలు. మీరు మే నెల సప్తగిరిలో అందించిన ప్రతి వ్యాసం చాలా చక్కగా ఉన్నది. భక్తి సాధనాలు శీర్షిక చాలా బాగుంది.

**- జె.సతీష్‌కుమార్ శర్మ, బైరమంగలం.**

## భక్తి పారవశ్యాన్ని....

సాక్షాత్తు తిరుమలస్వామిని చూసినపుడు ఎలాంటి అనుభూతి కలుగుతుందో అంతటి భక్తిపారవశ్యాన్ని సప్తగిరి మాసపత్రిక పాఠకులకు కలిగిస్తోంది. వర్ణచిత్రాలన్నీ బాగున్నాయి. ఈ పవిత్ర యజ్ఞాన్ని వివిధ భాషలలో భక్తజన కోటికి అక్షర రూపంలో అందిస్తున్న శ్రీపాదరేణువు లందరికీ కృతజ్ఞతలు.

**- భట్టారం విజయకుమార్, నెల్లూరు.**

## మా మనవి

వేము ప్రతినెలా సప్తగిరి చదువుతాము. మే నెల పత్రికలో ప్రచురించిన శ్రీ హనుమజ్జయంతి వ్యాసం చాలా బాగుంది. సప్తగిరి మధ్యపేజీల్లో ఒక్కొక్కనెల వర్ణచిత్రాన్ని ఫ్రేం కట్టించుకునేలా ప్రచురిస్తే వాటిని మేము పూజగదిలో ఉంచి పూజించుకుంటామని మా మనవి.

**- ఎస్.పుష్పాలక్ష్మణన్, తిరుపతి.**

---

"సప్తగిరి మీ మాట" అభినందనలు

ప్రధాన సంపాదకుని కార్యాలయము

మే నెల సప్తగిరి మాస పత్రిక ...

వారి ముఖచిత్రం, చివరి పేజీ తరిగొండ వెంగమాంబ జాయింట్ చిత్రాలు చాలా ఆకర్షణీయంగా ఉంది. 'అలిపిరి నరసింహ స్వామి' 'హనుమంతుని పాత్ర' బాలవాక్కు మధ్యపేజీలోని వర్ణచిత్రాలు ముగ్ధ మనోహరంగా ఉన్నాయి. రాశిఫలాలు మనశ్శాంతిని కలిగించాయి. సప్తగిరి నెలనెలా అత్యంత సుందరంగా తీర్చి దిద్దుతున్నందుకు మీకు మా కుటుంబ అభినందనలు.

శ్రీల.మనోహర్.కామినాయనపల్లి.
చిత్తూరు జిల్లా. 9440264325.

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 42 జూలై, 2011 సంచిక : 02






తక్షణ కర్తవ్యం నెరవేరిస్తే,
తదుపరి కర్తవ్యం ఏమిటో సులువుగా తెలుస్తుంది


గౌరవ సంపాదకుడు :
ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

సంపాదకుడు :
డా|| కె. రాధారమణ

ముద్రాపకుడు :
ఎం. కార్తీక్, ఎం.ఏ., ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి. శివప్రసాద్


ముఖ చిత్రం :
**శ్రీ మలయప్ప స్వామి**

చివరి పుట :
**శ్రీ పద్మావతీ అమ్మవారు**




***వివరాలకు :***
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359



విడి ప్రతి -- రూ. 5-00
సం|| చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**
సం|| చందా -- రూ. 850-00

## సంపాదకీయం

# వ్యాసపూర్ణిమ

వ్యాసుడు సాక్షాత్ విష్ణుస్వరూపుడు. 'మునీనామప్యహం వ్యాసః' అని భగవద్గీతలో ఈ విషయం స్పష్టం చేయబడింది. భగవంతుని అవతారాల్లో ప్రతిద్వాపరంలోనూ విష్ణువు వ్యాసుడై అవతరించి కర్మ, భక్తి, జ్ఞానాలను ప్రబోధం చేసి సమాజాన్ని ధార్మిక నిష్ఠలో నడిపిస్తాడని విష్ణుపురాణాది గ్రంథాలు పేర్కొన్నాయి. వ్యాసుడనేది వ్యక్తి నామం కాదు. అది ఆ వ్యక్తి చేసిన పనుల్ని బట్టి ఏర్పడిన దివ్యనామం. ఆ పదవిలో ఏ ముని ఉన్నా అతణ్ణి వ్యాసుడనే అంటారు. కనుక ఇప్పటికి గడచిన అన్ని ద్వాపర యుగాల్లో విష్ణువు వ్యాసరూప జ్ఞానావతారుడై అవతరించి సమాజసేవ చేశాడు. అంచేత వ్యాసుడు అవతరించిన ఆషాఢ శుద్ధపూర్ణిమను 'గురుపూర్ణిమ'గా పెద్దలు నిర్ణయించారు. ఇంటి గుమ్మంలో పెట్టిన దీపం అటు బయటకు, ఇటు ఇంటిలోపలికి కూడా వెలుతురిచ్చినట్లే వ్యాసుడు తన పూర్వమున్న గురువులకు, తన కాలంలోని గురువులకు, తన తర్వాతి కాలంలోని గురువులకు కూడా తనలోని భగవత్ శక్తి వల్ల స్ఫూర్తినిచ్చినవాడు. దీనివల్ల ఆ మహాత్ముని జయంతిని 'గురుజయంతి'గా, 'వ్యాస పూర్ణిమ'గా భారతీయులందరూ జ్ఞానవిజ్ఞాన సంపన్నతకై నిర్వహించి ఆ మహాత్ముణ్ణి స్మరించుకొని తమ జీవిత రూపురేఖలు ధార్మిక, ఆధ్యాత్మిక మార్గంలో పయనించేటట్లుగా చేసుకుంటున్నారు.

శ్రీ వేంకటేశ్వరుడు సాక్షాత్ విష్ణువు గనుక ఆయనే జగద్గురువు. ఆయనే వ్యాసుడు. ఆయనే శ్రీవారు. **'వ్యాసాయ విష్ణురూపాయ-వ్యాసరూపాయ విష్ణవే, నమో వై బ్రహ్మ నిధయే-వాసిష్ఠాయ నమో నమః'** అన్న ప్రసిద్ధ శ్లోకం ఈ అర్థాన్నే నిరూపిస్తోంది. కలియుగ మానవులకు వ్యాసుడు బోధించిన ధర్మభక్తి జ్ఞానసంపదలతో ధన్యజీవుల్ని చేయడం కోసమే శ్రీనివాసుడు శ్రీ వేంకటేశ్వరుడై అవతరించి మానవజాతిని సంరక్షిస్తున్నాడు, కనుక వేంకటేశ్వర తత్త్వం వ్యాసతత్త్వం-ఆధ్యాత్మిక దృష్ట్యా ఒకే మార్గానికి చెందినవి. కనుక మనమందరం ఈ వ్యాసపూర్ణిమనాడు మన గురుపరంపరను, వ్యాసభగవానుణ్ణి, గురువులకు గురువైన శ్రీనివాసుణ్ణి మనసా, వాచా, కర్మణా స్మరించి వ్యాసవాఙ్మయాన్ని ఒక్కమారు సింహావలోకనం చేసుకొని సమాజ ధార్మిక సేవలో ధర్మిష్ఠులము, కర్మిష్ఠులము, జ్ఞాననిష్ఠులము కావాలి.

ఉత్కృష్ట పర్వదినమైన వ్యాసపూర్ణిమ రోజు పురాతనమూ, ప్రవిమలమూ అయిన భారతీయ గురుశిష్య సంప్రదాయాన్ని జ్ఞాపకం చేసుకొని ప్రతిహైందవుడూ గురువులందరికీ పరమగురువైన శ్రీని వాసుని కృపకు పాత్రులు కాగలరు గాక! ఈ సంప్రదాయ స్మరణంతో ఉత్తమస్ఫూర్తిని పొంది ఉత్తేజితుల గుదురు గాక! "ధర్మో రక్షతి రక్షితః" అన్న గురూపదేశం ప్రకారం గురుపూర్ణిమరోజు ధర్మాచరణకు పున రంకితమౌతూ సర్వజనాళి సర్వశుభాలు పొందాలని ఆకాంక్ష.

**అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహురపరోహరిః,**

**అఫాలలోచన శ్శంభు, ర్భగవాన్ బాదరాయణః.**

# అన్నమయ్య సంకీర్తనల్లో శ్రీకృష్ణుడు

- డా॥ మండ్యం చంద్రశేఖర్ రెడ్డి

అన్నమయ్య ఆరాధించిన మూర్తి శ్రీ వేంకటేశ్వరుడే అయినా అన్నమయ్య తీర్థయాత్రలు చేస్తూ అనేక పుణ్యక్షేత్రాలను దర్శించాడు. తాను దర్శించిన వివిధ దేవతా మూర్తుల్ని శ్రీ వేంకటేశ్వరాత్మకంగా సమన్వయించి కీర్తనలు రాశాడు. విష్ణుమూర్తి దశావతారాల్లోని దేవతామూర్తుల్ని దర్శించి పాడిన పాటల్లో కృష్ణావతార కథనమే ఎక్కువ. విశేషించి బాల కృష్ణుని లీలావర్ణనం ప్రముఖంగా కనిపిస్తుంది. పోతన తర్వాత అంతగొప్పగా బాలకృష్ణుని వర్ణించినవాడు అన్నమయ్య మాత్రమే!

యశోదానందనుల ముద్దుల తనయుడైన శ్రీకృష్ణుడు రేపల్లె వాసులకంతా సంతోషాన్ని కలిగిస్తున్నాడు. రేపల్లెవాసులు కృష్ణుని సౌందర్యానికి ముగ్ధులై అతని అందచందాలను ఇలా వర్ణించుకుంటున్నారు.

**చిన్ని శిశువూ చిన్ని శిశువూ**
**యెన్నఁడూ జూడ మమ్మా యిటువంటి శిశువూ**

**తోయపుం గురులతోడఁ దూగేటి శిరసు, చింత**
**కాయవంటి జడగముల తోడ**
**మ్రోయుచున్న కనకంపు మువ్వల పాదాలతోడ**
**పాయక యశోద వెంటఁ బాఱాడు శిశువూ**

**ముద్దుల వ్రేళతోడ మొరవంక యుంగరాల**
**నిద్దపుం జేతుల పైడి బొద్దుల తోడ**
**అద్దపుం జెక్కుల తోడ నప్పలప్పలని నంత**
**గద్దించి యశోద మేను గౌగలించు శిశువూ**
**(6-1)**



కంసుని ఆదేశం మేరకు పూతన అనే రాక్షసి వ్రేపల్లెకు చేరుకుంటుంది. కృష్ణునికి నామ కరణోత్సవాన్ని యశోదానందులు ఉత్సవంగా జరిపే ప్రదేశానికి చేరుకొని మానవ రూపాన్ని ధరించి ముద్దులు మూటగట్టే చిన్నికృష్ణుని ఎత్తుకొని లాలిస్తూ విషం నిండినపాలను చిన్నికృష్ణునికి అందించగా; చిన్నికృష్ణుడు పాలుతాగుతూ పూతనను సంహరిస్తాడు. ఈ విషయాన్ని అన్నమయ్య ఇలా వివరించాడు.

**చిమ్మెడి విషములు చేపిన రొమ్ములు**
**కొమ్మని యిచ్చిన గుడిచేని**
**బొమ్మర పోవఁడు పూతకిఁ బొరిగొని**
**అమ్మరో గయ్యాళి శిశువూ (4-149)**

శ్రీకృష్ణుడు చేసే చిలిపి దొంగతనాలను, అల్లరిని భరించలేని గోపికలు యశోదకు ఈ విధంగా విన్నవించు కుంటున్నారు.

**ఇదివో మాయింట నేఁడు యింత సేసెఁ గృష్ణుడు**
**అదివో మాయింటాను అంత సేసెఁ గృష్ణుడు**

**గంట వాఁగకుండా నిండఁ గసవు దురిగి మా**
**యింటివారు నిద్దిరించ నిల్లుచొచ్చెను**
**అంటివచ్చి వొకదూడ ఆపూరిమేసితేను**
**గంట గణ గణ వాఁగె గక్కన మేల్కంటిమి (2-166)**

అంటూ ఇంకా శ్రీకృష్ణుని అల్లరిని గోపికలు ఇలా చెబుతున్నారు.

**మీరు సాక్షి మీరు సాక్షి మే మేమి ననలేము**
**చేరి చూడరమ్మ వీని చెల్లుబడి యమ్మా**

**పిన్నవాఁడు నిద్ర వోఁగ పెనచి కూఁకట తోడ**
**పన్ని లేఁగతోఁకఁ గూడ బంధించి కట్టె**
**వున్నతిఁ దొంగ వాని వొళ్ళెల్లా దోఁగిపోయె**
**కన్నెలార యీ కృష్ణుఁ గంటిరీలురమ్మా**

**...............................**
**(2-165)**



## కరెంట్ బుకింగ్

ప్రస్తుతం వీటిని క్రమబద్ధీకరించి, కొన్ని మార్పులు, చేర్పులు చేయడం జరిగింది. కరెంటు బుకింగ్‌లో సుప్రభాతం, తోమాల, అర్చన, కల్యాణోత్సవం, నిజపాదదర్శనం, ఆర్జితసేవలకు 05-03- 2010 నుండి కరెంటు బుకింగ్ లేదు. మిగిలిన సేవలు అనగా ఆర్జిత బ్రహ్మోత్సవం, ఊంజల్‌సేవ, వసంతోత్సవం, సహస్రదీపాలంకార సేవ, విశేషపూజ, ప్రస్తుత విధానం లోనే కొనసాగించడం జరుగుతుంది. ఈ సేవల టిక్కెట్లను తిరుమలలో విజయాబాంక్ ద్వారా పొందవచ్చు.

| సేవ/ఉత్సవం పేరు | రుసుం | కోటా | ప్రవేశం | రోజు |
|---|---|---|---|---|
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 1000/- | 15 | 5 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 3000/- | 15 | 10 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకార సేవ | 1000/- | 50 | 5 | ప్రతి రోజు |
| విశేషపూజ | 3000/- | 25 | 5 | సోమవారం |

## అడ్వాన్స్ బుకింగ్

అడ్వాన్స్ బుకింగ్ మూడు నెలల కాలపరిమితి వరకే స్వీకరించబడుతుంది. డిమాండ్ డ్రాఫ్ట్ ఆర్జిత సేవా కార్యాలయానికి 20 రోజులు ముందస్తుగానే చేరాలి. అలా చేరనివి తిరస్కరించబడును.

| సేవ/ఉత్సవం పేరు | రుసుం | కోటా | ప్రవేశం | రోజు |
|---|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 95 | 1 | ప్రతి రోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 150 | 2 | ప్రతి రోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 1000/- | 13 | 5 | ప్రతి రోజు |
| ఊంజల్ సేవ | 1000/- | 10 | 5 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 3000/- | 13 | 10 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకార సేవ | 1000/- | 25 | 5 | ప్రతి రోజు |
| విశేషపూజ | 3000/- | 25 | 5 | సోమవారం |
| నిజపాదదర్శనం | 200/- | 200 | 1 | శుక్రవారం |

వ్యక్తిగతంగా డి.డి.లు స్వీకరించబడవు. పోస్టు/కొరియర్ ద్వారా పంపినవి మాత్రమే స్వీకరించబడతాయి. డి.డి.లు. "కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు" పేరుమీద తిరుమల/ తిరుపతిలలో చెల్లుబాటయ్యే విధంగా తీసి పంపాలి.

పోస్టు/ కొరియర్ సేవల ద్వారా పంపే డి.డిలతో పాటు దరఖాస్తుకు భక్తుల గుర్తింపు వివరాలు తప్పనిసరి. పాన్‌కార్డు, రేషన్ కార్డు, ఓటరు గుర్తింపు కార్డు, పాస్‌పోర్టు, డ్రైవింగ్ లైసెన్స్ తదితరాలలో ఏ ఒక్కదానినైనా జతపరచి అడ్వాన్స్ బుకింగ్ ద్వారా ఆర్జిత సేవా టిక్కెట్లు పొందవచ్చును.

చిన్నికృష్ణుని అల్లరికి గోపికలందరు సాక్షులని, చిన్ని కృష్ణుని తామేమనలేమని, తమ మాట చెల్లుబడి కాదని యశోదకు తెల్పుతారు. తమ పిల్లవాడు అలసి నిద్రపోతుంటే వాడి జుట్టును లేగతోకకు కట్టి వీథులందు తరిమితరిమి వినోదించాడు. వాడి ఒళ్లంతా హూనం అయిందని యశోదకు తెల్పుతుంది. దూడలను ఆవుల దగ్గరకు తరిమి పాలు లేకుండా చేశాడని... ఇలా అనేక విధాలుగా చిన్నికృష్ణుని వల్ల జరిగిన బాధలను యశోదకు విన్నవించుకుంటారు.

గోపికల మాటలు విన్న యశోద వారితో ఈ విధంగా అంటుంది.

**కానరటె పెంచరటె కటకటా బిడ్డలను**
**నేను మీ వలెనే కంటి నెయ్యమైన బిడ్డని**

**బాయిటఁ బారవేసిన పాలువెన్నలును**
**చేయివెట్ట కుందరా చిన్నబిడ్డలు**
**మీ యిండ్లు జతనాలు మీరు సేసికొనక**
**పాయక దూరేరేమే ప్రతిలేని బిడ్డని**

.................................................

**చొక్కమైన కొప్పెరల జున్నులు జిన్నులును**
**చిక్కిన విడుతురా చిన్నిబిడ్డలు**
**మిక్కిలి పూజలు సేసి మెచ్చించఁ దగదా**
**యెక్కువైన తిరువేంకటేశుఁడైన బిడ్డని** **(12-253)**

యశోద కృష్ణుని వెనకేసుకొచ్చి గోపికలను నిందిస్తూ, పిల్లల్ని కనడం, పెంచడం మీకు తెలీదా? మీలాగే నేనూ బిడ్డను కన్నాను. ఇంటి బయట పారబోసిన పాలను, వెన్నను పిల్లలు తాగకుండా ఉంటారా? ముంగిట మూసిన కాగులుంచడం, బొక్కమైన కొప్పెరల్లో జున్నులుంచితే వాటిని పిల్లలు పాడు చేయడం సహజమే కాబట్టి వారిని నిందించడం తగదని గోపికలను సముదాయించి పంపించేస్తుంది యశోద.

ఈ విధంగా అన్నమయ్య తన సంకీర్తనల్లో అనేక చోట్ల అనేకవిధాలుగా శ్రీకృష్ణుని బాల్యక్రీడలను సహజసిద్ధంగా, రమణీయంగా, భక్తిభావంతో స్మరిస్తూ, స్తుతిస్తూ రసరమ్యంగా వర్ణించాడు.

# నదుల ప్రాశస్త్యము

- చివుకుల ఆంజనేయ శర్మ

భారతదేశం ఎన్నో పుణ్యనదులు, తీర్థాలకు నిలయం. ఇవన్నీ భక్తి శ్రద్ధలతో, విశ్వాసంతో స్నానమాచరిస్తే అనంత పుణ్యాన్ని, ఆత్మతత్త్వాన్ని ప్రసాదింపజేసి పునర్జన్మరాహిత్యాన్ని కలిగిస్తాయి.

భారతదేశం ఖండాంతరాల్లో పేరుగడించడానికి మూల కారణం ఈ దేశం యొక్క నగ-నన-నదీ-తీర్థ కలయికతో గూడిన ప్రకృతి.

ఋగ్వేదంలో నదుల మహిమల గురించి ఇలా చెప్పారు. "గంగానదీ తీరమున దానం చేయటంవల్ల మానవుడు పరితాత్ముడౌతాడు. సరస్వతీ మొదలగు ప్రఖ్యాతాలైన పుణ్యనదీతీరముల యందు యజ్ఞాది వైదికకర్మలను ఆచరించుట చాలా మంచిది. సరస్వతీనది శ్రేష్ఠమైన తల్లిగా సంబోధింపబడింది".

నదిలో కొన్ని పవిత్ర స్థలాలున్నాయి. తైత్తిరీయ సంహిత ఇలా చెప్పింది-

**తీర్థే, స్నాయి తీర్థమేవ సమానానాంభవతి**

నదులన్నీ దైవతాలుగా ప్రస్తావింపబడ్డాయి. సరస్వతీ నది సర్వోత్తమమైన నదీదేవత.

మన దైనందినజీవితంలో శ్రౌత, స్మార్తాది కర్మలలోని కలశారాధనలో నదులపేర్లను ఈ విధంగా స్మరిస్తాం.



**గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి ।**
**నర్మదే సింధు కావేరి, జలేఽ స్మిన్ సన్నిధిం కురు ॥**

"దివ్యములైన ఈ జలాలు మంగళకరాలైన మా అభీష్టమును తీర్చుగాక! మాకు త్రాగుటకు అనువైన నీటిని ఇచ్చుగాక! మావైపు ప్రవహించు గాక!" ఇవి జలవైశిష్ట్యాన్ని సంపూర్ణంగా అర్థంచేసుకున్న వేదఋషులు త్రికరణశుద్ధిగా జలదేవతను ప్రార్థించిన మంత్రం యొక్క భావం.

ఇంటిలో స్నానం చేస్తున్నా కూడా "గంగేచ యమునే కృష్ణేగోదావరి సరస్వతి" అంటూ ఆ నదులను స్మరిస్తూ చేసే స్నానం వల్ల వచ్చే ఫలాలను ఆర్షులు ఇలా చెప్పారు.

1) నదీస్నానం చేస్తే శారీరకంగా కనబడే మాలిన్యం పోతుంది.

2) నిండు ప్రవాహమున్ననదిలో స్నానం చేయడంవల్ల శరీరమంతటికీ సుఖస్పర్శ కలిగి శరీరంలో ఉష్ణాధిక్యత తగ్గుతుంది.

3) నదీనీటిలోని చల్లదనం ఇంద్రియతాపాలను తగ్గించి మనస్సుకూ, వాక్కుకూ శుచిత్వాన్ని కలిగిస్తుంది. కర్మానుష్ఠాన యోగ్యత సిద్ధిస్తుంది.

4) పుణ్యనదీతీర్థాల్లో చేసే స్నానం మనసుకు ఏకాగ్రతనిస్తుంది.

5) తీర్థమందు స్నానం చేసినవాడు తనకు సంబంధించిన వారిలో చాల శ్రేష్ఠమైన వాడవుతాడు.

6) మహర్షుల యొక్క దీక్షా, తపస్సుల విశేషాలు, శక్తి నదీ జలాల్లో ఉన్నవని వేదం నిర్దేశించింది. కావున నదీ స్నానంచే వాటిని మనము స్వీకరించి పవిత్రులమౌతాం.

అందుచేతే నదీజల స్నానం సర్వథా, సర్వదా యోగ్య మని ఆర్షుల వాక్కు.

భారతదేశంలో పుణ్యనదులకు కొరతేలేదు. పుట్టింది మొదలు మానవులు చేసే పాపాలు విశిష్టదినాల్లో అనగా – పుష్కర సమయంలో, గ్రహణ సమయాల్లోను, మకర సం క్రమణ సమయంలో, కార్తీక, మాఘమాసాల్లో నదీ స్నాన మాచరిస్తే త్రికరణశుద్ధిగా పాపాలు నశిస్తాయని శాస్త్రాలు చెప్తున్నాయి.

❖ గంగానదీ స్నానం అరవైయోజనాల పవిత్ర ప్రదేశం. అరవై పాపాలు హరించే పుణ్యమూర్తి. గంగాద్వార స్నానఫలం దీనికి రెట్టింపు.

❖ యమునానదీ తీరం ఇరువది యోజనాలు విస్తరించి, ఇరవై రకాల పాపాలను పరిహరిస్తుంది.

❖ సరస్వతి అంతర్వాహినిగా ప్రవహించి ఇరవైనాలుగు యోజ నాలు విస్తరించిన ఈ నది ఇరవై పాపాలు పోగొడుతుంది.

❖ వరుణ, కుశావర్త; శతద్రువు; విపాశక; శరావతి; వితస్త; అశిక్ని; మధుమతి; ఘృతవతి; మొదలైన నదీతీరాల సందర్శనం శుభప్రదం. దేవనదిగా ప్రఖ్యాతమైన ఆ నదీ పరీవాహక ప్రాంతం పదియోజనాలు విస్తరించి; పదిహేను రకాల పాపాలను పోగొడుతుంది. రేవానదీ స్నానం బ్రహ్మ హత్యాపాతకాన్ని నాశనం చేస్తుంది. చంద్రభాగ, రేవతి, సరయు, గోమతి, కౌశిక, మందాకినీ, సహస్రవక్త్ర, పూర్ణ, పుణ్య, బాహుదాలనే నదులు పదహారు యోజనాలు విస్త రించాయి. నదీ సంగమ ప్రదేశాల్లో చేసే స్నానం, సంధ్యా దికాలు అనంత పుణ్యఫలాలనిస్తాయి.

❖ గోదావరీతీరం ఆరు యోజనాలు విస్తరించి ఉంది. ఒక్కసారి గోదావరి తీరం చుట్టి వచ్చినవారికి "వాజపేయ" యాగ ఫలం లభిస్తుంది.

❖ భీమేశ్వరం, వంజర సంగమస్థానాలు ప్రయాగతో సమానం. ద్వాదశ యోజనాలు విస్తరించిన కుశస్థలీనది ముప్పై ఆరు పాపాలను, పూర్ణానది యాత్ర ముప్పై పాపాలను, కృష్ణవేణి పదిహేను పాపాలను, తుంగభద్ర ఇరవైపాపాలను ప్రక్షా లనం చేస్తాయి.

❖ పంపాసరోవర శక్తి అనంతం. పాండురంగ మాతులింగ, గంధర్వ నగరాలు పలు తీర్థాలతో విలసిల్లుతున్నాయి. రామే శ్వరంలో 108 తీర్థాలు, ఆదివరాహక్షేత్రమైన తిరుమలలో దాదాపు 18 తీర్థాలు ఉన్నాయి. ఈ తీర్థాలలో స్నాన మాచరిస్తే పాపాలు తొలగి పుణ్యఫలం కలుగుతుంది.

❖ మహానది, తామ్రపర్ణి నదుల పుణ్యం వర్ణశక్యముగాదు. కుంభకోణంలో స్నానం సమస్త తీర్థాల సమానం.

కొన్ని సమయాల్లో నదులు, తీర్థాలలో స్నానమాచరిం చటం నిషేధించటం జరిగింది. రవి కర్కాటకంలో ఉన్న సంక్ర మణ సమయం రెండుమాసాలు నదీ రజస్వల సమయం. ఆ సమయంలో నదీస్నానం దోషం. నదీ తీరప్రాంత వాసులకు ఈ దోషముండదు.

నదీ రజస్వల అంటే, కొత్తనీరు రావటమన్న మాట. అప్పుడు స్నానం చేయడం, మహాదోషం. తీర్థసేవన విషయంలో ఇది సాధారణ విషయమైనా, ఈ సమయంలో తీర్థ దర్శనం చేయవలసివస్తే స్నాన, క్షౌర, ఉపవాసాదులు ఆచరించాలి. కాబట్టి "జాగ్రత్త" అని హెచ్చరించారు.

ప్రతి నదీ పాపహారిణే, పుణ్యమూర్తే. నది స్త్రీ రూపం. అందుకే స్త్రీలు పసుపు, కుంకుమ, పువ్వులతో విశేషంగా నదిని పూజిస్తారు.

ప్రతి జీవనదికి 12 సంవత్సరాలకు ఒకసారి పుష్క రాలు వస్తాయి. జీవన ప్రదాతలైన నదులకు కృతజ్ఞత చెప్పటం పుష్కరాల ప్రధానోద్దేశం. పెద్దలకు పిండ ప్రదానం చేసి పితృ ఋణం తీర్చుకోవటం ఒక ధార్మిక, సాంస్కృతిక ప్రయోజనం.

మేషం మొదలైన పన్నెండు రాశులలో బృహస్పతి ఒక్కొక్క రాశిలో ఒక్కో సంవత్సరం ఉంటాడు. బృహస్పతి సింహ రాశిలో ప్రవేశించినపుడు గోదావరి నది పుష్కరాలు వస్తాయి. అలాగే కన్యారాశిలో బృహస్పతి ప్రవేశించినపుడు కృష్ణానదికీ పుష్కరాలు వస్తాయి. పుష్కరాల సమయంలో నదీస్నానం చేస్తే వెయ్యి గోదానాలు చేసిన పుణ్యం లభిస్తుంది.




పవిత్రతకు చిహ్నంగా చెప్పుకునే 'తులసి' కలియుగ దైవం శ్రీ వేంకటేశ్వరస్వామివారి అలంకరణలో ప్రముఖ స్థానాన్ని ఏర్పరచుకుంది. స్వామివారికి కూడా తులసి అంటే చాలా అభిమానం. కృష్ణావతారంలో తులాభార సమయంలో తులసిది ప్రముఖపాత్ర. భక్తి నిదర్శనంగా నిలచిన తులసి కథను తెలుసుకుందాం.

తులసి చిన్నప్పటి నుంచి పెరుమాళ్ళుకు మహాభక్తు రాలు. స్వామిపై ఈమెకున్న భక్తి అపారమైనది, ఆ భక్తి ప్రపత్తుల చేతనే భగవంతుని గురించి తపస్సు చేసి సర్వేశ్వరుని సాక్షాత్కారం పొందింది. స్వామి ప్రత్యక్షమై "నీకేమి కావాలో కోరుకొమ్మని" అడుగగా "ఎల్లప్పుడూ నీ సేవ చేసుకుంటూ ఉండాలన్నదే నా కోరిక" అని కోరింది. అంతట పెరుమాళ్ళు "నిన్ను భూలోకంలో మొక్కగ అవతరింపజేసి నిన్ను తరింపజేస్తాను" అని అన్నారు. తులసి భగవత్కటాక్షము చేత శ్రీవిల్లిపుత్తూరనే దివ్యప్రాంతంలో భాగవతోత్తముల ఇండ్ల పెరట్లో 'తులసిమొక్క'గా అవతరించింది.

అప్పుడు పెరుమాళ్ళు భాగవతోత్తములందరికి స్వప్నంలో సాక్షాత్కరించి "మీ పెరటిలో తులసిమొక్క ఉన్నది. అది చల్లదనం, మార్దవం, పరిమళం అనే గుణాలతో నిండి ఉంటుంది. మీరందరూ ప్రతిరోజూ వాటి దళాలతో నాకు పాదపూజ చేయండని" ఆజ్ఞ ఇచ్చారు. అప్పుడు భాగవతోత్తములందరు శ్రీవిల్లిపుత్తూరు నందు కలసి అందరికి ఒకే మాదిరిగా కలిగిన స్వప్న వృత్తాంతాన్ని చెప్పుకుంటూ; భాగవతోత్తముల పెరటిలో చూడగా పెరుమాళ్ళు ఆజ్ఞ ఇచ్చిన విధంగా చల్లదనం, మార్దవం, పరిమళం అనే మూడు గుణాలతో ప్రకాశిస్తున్న తులసిని చూచి ఆశ్చర్యచకితులై భగవంతుడు ఆజ్ఞ ఇచ్చిన విధంగా రోజూ తులసీదళాలతో పూజించ సాగారు.

భక్తురాలైన తులసి తన కోరిక నెరవేరినందుకు చాలా ఆనందంతో, నిత్యయవ్వనంతో పెరుమాళ్ళ పాదాలను ఆశ్రయించింది. ఇలా కొంతకాలం గడచిన తర్వాత సర్వేశ్వరుని వక్షఃస్థలమునందున్న లక్ష్మీదేవి తనకంటె దిగువనున్న తులసిని పరిహసించింది. ఆ అవమానభారంతో తులసి వాడిపోయి, నిత్యయవ్వనం పోయి ఎండిపోయినట్లు తయారైంది. పరాత్పరుడైన సర్వేశ్వరుడు తులసి పరిస్థితికి కారణమేమిటని విచారించి, లక్ష్మీదేవి వలన తులసికి జరిగిన పరాభవాన్ని గ్రహించారు.

స్వామివారికి భక్తురాలియందు గల వాత్సల్యం చేత మరలా తమ ప్రియభక్తులైన భాగవతోత్తము లందరికి స్వామికి పాదాలయందు దళాలను సమర్పించవలదని తులసిని మాలలుగా కట్టి తమ కిరీటమందు అలంకరించండని ఆజ్ఞయిచ్చారు.

స్వామివారి ఆజ్ఞానుసారం భాగవతోత్తము లందరు తులసి దళాలను మాలలుగా కట్టి, కిరీటమందు అలంకరించారు. ఇలా జరుగుతుండగా కొంతకాలం తర్వాత తులసి లక్ష్మీదేవితో "ఓ లక్ష్మీ!

నీవు వక్షఃస్థలమునందున్నావు. నేను శిరోభాగమందున్నాను. కనుక నేను నీకన్నా అధికురాలను అని లక్ష్మీదేవిని పరిహసించింది. లక్ష్మీదేవి తను చేసిన పనికి సిగ్గుపడి సర్వేశ్వరుడు ఏకాంతంగా నున్న సమయంలో స్వామివారిని "మీకు ఎటువంటి సేవ చేస్తే ఈ దాసురాలి యందు ప్రేమ కలుగుతుందో ఆ కైంకర్యం గురించి చెప్పి నన్ను కటాక్షించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను" అని అడుగగా, పెరుమాళ్ళు మందహాసం చేస్తూ, "భూలోకంలో పుష్పకైంకర్యం చేస్తున్న వారంటే నాకు చాలా ప్రియం. నా భక్తుడైన విష్ణుచిత్తునితో గూడి నీవునూ నాకు పుష్పకైంకర్యం చేసినట్లైతే నాకు చాలా ప్రియము" అని స్వామి చెప్పారు.

దీని వల్ల పెరుమాళ్ళుకు భక్తులపై గల అభిమానాన్ని మనం తెలుసుకోవచ్చు. అందువల్లే తన భక్తురాలైన తులసిని కటాక్షించి శిరసుపై ధరించాడు. లక్ష్మియందు గల ప్రేమతో ఆమెను భూలోకంలో తులసివనంలో చిన్న పాపగా అవతరింపజేశాడు. విష్ణుచిత్తుడు స్వామివారి పూజకు తులసిని కోయటానికి వనానికి వచ్చి, ఈ పసి పాపను చూచి వటపత్రశాయి సన్నిధికి తీసుకొనిపోయి ఈ సంగతివారితో విన్నవించగా, వటపత్రశాయి ఆమెకు 'గోదాదేవి' అని నామకరణం చేసి విష్ణుచిత్తుణ్ణి పెంచుకొమ్మని ఆజ్ఞ ఇచ్చారు. వారామెను పెంచుకుంటూ; ఆమెతో కూడా స్వామి వారి కైంకర్యాలు చేయించేవారు.

చూశారా! ఏ తులసిని లక్ష్మీదేవి పరిహసించిందో ఆ తులసినే చేతులారా పెరుమాళ్లుకు సమర్పించింది. తులసిని పెరుమాళ్ళుకు సమర్పించడం వల్లే స్వామివారి కటాక్షాన్ని పొందింది. అంతేకాక లక్ష్మిగర్వం కూడా తులసి వల్లే పూర్తిగా పోయింది. అంతేకాకుండా సత్యభామా గర్వ భంగం కూడా ఈ తులసీదళం వల్లే అయింది. కాబట్టి ఈ తులసీదళ మహిమ అద్భుతమైనది, పరమపవిత్రమైనదని చెప్పబడింది.

## శేషాద్రివాస! శతకోటి నమస్సులయ్యా!

**దేవాది దేవ! ధరణీధవ! దివ్యతేజ!**
**వేదాంతవేద్య! విభవోజ్జ్వల! విశ్వరూప!**
**భక్తానురక్త! నిఖిలేశ్వర! భక్తపోష!**
**శేషాద్రి వాస! మముగావుము శ్రీనివాస!**

**బ్రహ్మాది సేవ్య! సురపాలక! పద్మనేత్ర!**
**శ్రీవేంకటేశ్వర! దయామయ! శేషతల్ప!**
**శ్రీమంగనాథ! శ్రితరక్షణశీల! స్వామి!**
**మమ్మేలుమయ్యా! శతకోటి నమస్సులయ్యా!**

– బొండా రత్నావతీ నూకరాజు

| **శ్రీ గోవిందరాజస్వామివారి జ్యేష్ఠాభిషేకమహోత్సవం, తిరుపతి** | | | |
|---|---|---|---|
| 10-7-11 | ఆది | జ్యేష్ఠాభిషేక ప్రారంభం | ఆషాఢ మాసమున జ్యేష్ఠానక్షత్రమున జరుగును |
| 11-7-11 | సోమ | కవచ ప్రతిష్ఠ | |
| 12-7-11 | మంగళ | కవచ సమర్పణ | |

| **శ్రీ కపిలేశ్వరస్వామివారి పవిత్రోత్సవాలు, కపిలతీర్థం, తిరుపతి** | | | |
|---|---|---|---|
| 11-7-11 | సోమ | అంకురార్పణ (రాత్రి) | ఆషాఢ మాసమున జరుగును |
| 12-7-11 | మంగళ | అంకురార్పణ | |
| 13-7-11 | బుధ | అంకురార్పణ | |
| 14-7-11 | గురు | పవిత్రోత్సవ సమాప్తిః | |

| **శ్రీ కోదండరామస్వామివారి పవిత్రోత్సవాలు తిరుపతి** | | | |
|---|---|---|---|
| 25-7-11 | సోమ | అంకురార్పణ (రాత్రి) | ఆషాఢ మాసమున జరుగును |
| 26-7-11 | మంగళ | పవిత్ర ప్రతిష్ఠ | |
| 27-7-11 | బుధ | పవిత్ర సమర్పణ | |
| 28-7-11 | గురు | పవిత్రోత్సవ సమాప్తిః | |

# వేదం.. తెలుసుకుందాం!

ధారావాహిక

07

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

## క్షీరసాగరం :

వేదం ఋషిప్రోక్తం. అది పరంపరాగతమైన తరగని నిధి. భక్తిశ్రద్ధలతో దానిని నిరంతరం పఠించిన కొద్దీ, అను సంధానం చేసిన కొద్దీ మొదట అక్షర రాశిగాను, ఆపైన వాఙ్మయ మహోదధిగాను దర్శనమిచ్చే వేదవాఙ్మయం బ్రహ్మ విద్యగా భాసిస్తూ తనను ఆరాధించే వారికి కల్పవృక్షంగా, కామధేనువుగా, చింతామణిగా సర్వాభీష్టాలను ప్రసాదిస్తుంది. నిరంతరం అభ్యసించడం వలన, మథనం చేయడం వలన జ్ఞానామృతాన్ని ఆవిర్భవింపజేసే క్షీరసాగరం వేదవాఙ్మయం.

పూర్వం దేవతలు క్షీరసాగరాన్ని మథించి చంద్రుడు, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మొదలగు అపూర్వ మైన వాటిని పొందారు. అలాగే బుద్ధిమంతులు, విజ్ఞులు, జ్ఞానులు, శాస్త్రార్థవిజ్ఞానం కలవారై మనస్సనే కవ్వాన్ని, దృఢ మైన భక్తి శ్రద్ధలనే తాడుతో బిగించి, వేదమనే క్షీరసాగరాన్ని ప్రీతితో మథించాలి. అప్పుడు వారు భక్తులపాలిటి కల్ప వృక్షము, కామధేనువు, చింతామణి, సచ్చిదానందమూర్తి, అమృతస్వరూపుడు, నిత్యనిరంతర నిరతిశయానంద రూపమైన మోక్షసామ్రాజ్య సౌభాగ్యప్రదాత అయిన పరమాత్మ సాయు జ్యాన్ని పొందుతారు.

**ఆమ్నాయాంబుధి మాదరేణ సుమన**
**స్సంఘాస్సముద్యన్మనో**
**మంథానం దృఢభక్తి రజ్జు సహితం**
**కృత్వా మథిత్వా తతః।**
**సోమం కల్పతరుం సుపర్వ సురభిం**
**చింతామణిం ధీమతాం**
**నిత్యానంద సుధాం నిరంతర రమా**
**సౌభాగ్య మాతన్వతే ॥**

## అనాదినిధనం :

ప్రళయకాలంలో భగవంతునిలో అంతర్హితాలైన వేదాలు మరల ప్రళయాంతంలో ఆయన అనుగ్రహంతో తిరిగి మనకు లభించాయని మహాభారతమిలా చెబుతున్నది –

**యుగాంతేఽ ంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః।**
**లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా ॥**

**(మ.భా.వనపర్వం)**

వేదం ఒక ప్రత్యేక కాలంలో లేదా సమయంలో అవతరించింది కాదు. అందువల్లనే ఇది సనాతనమైనది. వేదం శాశ్వతమైనది. ఈ జగత్సృష్టికి, జగత్స్రష్ట కంటె కూడ ముందే వేదం ఉంది. అది అనంతమైన దివ్యశబ్దరాశి. పరమపావన మైనది. కేవలం జ్ఞప్తిమాత్ర స్వరూపుడైన పరమాత్మ యొక్క శబ్దస్వరూపం. వేదరాశి శబ్ద తరంగరూపంలో అనాదిగా ఉన్నది. అది భగవంతుని నిశ్వాసరూపంలో అభివ్యక్తమైంది. అపౌరుషేయం, స్వయంజాతం, నిత్యమైంది. "పరమార్థ తస్తు వేదః అనాదిః ఆదిరహితః నిత్యః. శివస్తు తస్యాభివ్యం జకః" అని వేదాలకు వ్యాఖ్యానం వ్రాసిన సాయణాచార్యులవారు పేర్కొన్నారు.

## అపాంతరతముడు :

వేదధర్మాలను మానవులకు అందజేయడానికి విష్ణు మూర్తి తన మనస్సు నుండి అపాంతరతముని సృష్టించాడు. అపాంతరతముడనగా అజ్ఞానమనే లోపలిచీకటిని పోగొట్టే వాడు. జ్ఞానస్వరూపుడైన ఆయన శ్రీహరి బుద్ధి విశేషానికి ప్రతినిధి. శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవునికి అందించిన ధార్మిక విజ్ఞానాన్ని, వేదాలను బ్రహ్మదేవుడు అపాంతరతమునికి అందజేయాలని, ఆయన తన ప్రతిభ ద్వారా మానవాళికి ఈ విజ్ఞానాన్ని అందించాలని, శ్రీమన్నారాయణుని దివ్యసంకల్పం. బ్రహ్మదేవునికి ఏకమొత్తంగా అందజేసిన వేదరాశిని సావ ధానంగా విని, దానిని విభజించి మానవాళికి పంచిపెట్టాలని, అందుకోసం ఆయన ప్రతి మన్వంతరంలోను జన్మిస్తూ, ధర్మా లను ప్రబోధిస్తూ, ధర్మసందేహాలను నివృత్తి చేస్తూ, లోకం ధర్మబద్ధంగా నడిచేటట్లుగా మార్గదర్శనం, దిశానిర్దేశం చేయా లని అపాంతరతముని ఆదినారాయణుడాదేశించాడు.

భగవంతుని ఆజ్ఞమేరకు ఆ అపాంతరతముడు ప్రతి ద్వాపరాంతంలోను, ఆయాసమయాల్లో ఆవిర్భవిస్తూనే ఉన్నాడు. ఆ మహనీయుణ్ణే మనం 'వ్యాసు'డంటున్నాం. ఆయన సాక్షాత్తు విష్ణుస్వరూపుడే.

**వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।**
**నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥**

సాక్షాత్తు విష్ణుస్వరూపుడు, జ్ఞాననిధి, వసిష్ఠవంశోద్భవుడైన వేదవ్యాసునికి నమస్కారము.

**బాదరాయణుడు :**

వ్యాసభగవానుడు కారణజన్ముడు. లోకహితం కోసం ధర్మాన్ని వివరించే మహత్కార్య బాధ్యతతో, ఈశ్వర లీలా విశేషంగా లోకంలో ఆవిర్భవించాడు. యోగ్యమైన మాతా పితరుల ద్వారా సద్యోగర్భంలో జన్మించిన అపాంతరతముడాయన. నల్లనివాడగుట వలన, యమునానదీ మధ్యంలో ద్వీపంలో ఆవిర్భవించడం వలన ఆయన కృష్ణద్వైపాయనునిగా ప్రసిద్ధిపొందాడు. సత్యవతీ పరాశరుల పుత్రుడగుట వలన సాత్యవతేయుడు, పారాశర్యుడు అయ్యాడు.

సత్యవతీ పరాశరుల పుత్రుడైన కృష్ణద్వైపాయనుడు హిమాలయాల్లోని బదరికాశ్రమంలో సుదీర్ఘకాలం గొప్ప తపస్సుచేశాడు. అందువల్ల ఆయన్ని బాదరాయణుడన్నారు.

**అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహు రపరో హరిః ।**
**అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః ॥**

ఆయన త్రిమూర్తి స్వరూపుడు. నాలుగు ముఖములు లేని బ్రహ్మదేవుడు. రెండు చేతులు మాత్రమే కల శ్రీహరి. మూడవ నేత్రంలేని శివుడు.

ఆ మహర్షి తన తపశ్శక్తి వల్ల ఒకటిగా ఉన్న వేద రాశిని నాలుగుగా విభజించాడు. వేదాలను విభజించడం వల్ల ఆయనను 'వేదవ్యాసుడు' అన్నారు. వేదాలలో నిగూఢంగా ఉన్న విషయాలను జనులందరికి వివరంగా తెలియజేయడానికి అష్టాదశ మహాపురాణాలను, ఉపపురాణాలను, పంచమవేదమైన మహాభారతాన్ని, భక్తి ప్రతిపాదకమైన భాగవతాన్ని, బ్రహ్మసూత్రాలను ఆయన రచించాడు. ఆ మహర్షికి మనం ఎంతో ఋణపడి ఉన్నాం.

**దీర్ఘంకాలమయం తపశ్చ బదరీకాంతార పుణ్యాశ్రమే**
**తప్త్వా తేన బలేన వేదవితతేర్భాగం చతుర్ధాకరోత్ ।**
**తం చాష్టాదశ సత్పురాణనిచయం శ్రీమన్మహాభారతం**
**తచ్ఛారీరక సూత్రజాతమకరోత్ తం వ్యాసమౌనిం భజే ॥**

**అక్షయసంపత్ప్రదాత :**

వ్యాసభగవానుడు ఒక మహత్తర కార్యాన్ని చేశాడు. మానవ కల్యాణం కోసం అనంతమైన వేదరాశిని విభజించాడు. తన శిష్యులకు ప్రబోధించాడు. ఇంతటి మహత్కార్యాన్ని సాధించిన వ్యాసభగవానుడు సాక్షాత్తు నారాయణుడే. "వ్యాసో నారాయణో హరిః". వ్యాసభగవానుడు మానవజాతికి మహోపకారం చేశాడు. భరతవంశం అంతరించకుండా రక్షించాడు. సంఘసంస్కర్త అయ్యాడు. ఆయన మనకు అక్షయ సంపదను ప్రసాదించాడు. ఆ మహర్షికి మనం ఏమి ఇవ్వగలం? నమస్కరిద్దాం!

**వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

వసిష్ఠమహర్షికి మునిమనుమడు, శక్తికి మనుమడు, పరాశరమహర్షికి పుత్రుడు, శుకమహర్షికి తండ్రి, నిర్మలుడు, తపోనిధియైన వ్యాసమహర్షికి నమస్కారం.

వ్యాస భగవానుడు మనపై కృపావాత్సల్యములు కలవాడు. తీరికలేని అజ్ఞానసంతతి రానున్నదని గ్రహించాడు. వేదరాశిని నాలుగుగా విభజించాడు. 1)ఋగ్వేదసంహిత 2) వాజసనేయి మాధ్యందిన శుక్ల యజుర్వేద సంహిత, కృష్ణ యజుర్వేదీయ తైత్తిరీయ సంహిత 3) సామవేద సంహిత 4) అథర్వవేద సంహిత. ఒకే వేదం నాలుగుగా విభజింపబడిందని భాగవతం పేర్కొంది -

**ఏవం చకార భగవాన్ వ్యాసః కృపణవత్సలః ।**
**వ్యవధాత్యజ్ఞసంతత్యై వేదమేకం చతుర్విధమ్॥**

**సకలవిజ్ఞాన ప్రదాత :**

ఈ విధంగా భగవంతుని సంకల్పంచే ప్రభవించిన అపాంతరతముడు బ్రహ్మదేవుని ద్వారా వేదాలను గ్రహించి, కృష్ణద్వైపాయనునిగా అవతరించి, జగత్తునుద్ధరించుటకై

వేదాలను విభజించి, వేదవ్యాసుడై, ఆ వేదాలను తన శిష్యుల ద్వారా విశ్వవ్యాప్తం చేసి, లోకంలో ధర్మవ్యవస్థ నిలబడటానికి సుస్థిరమైన పునాదులు వేశాడు. ఆ మహనీయుడు మనకు సకల విజ్ఞానాన్ని ప్రసాదించాడు. మన ప్రాచీన విజ్ఞానమంతా ఆయన నోటి నుండి వెలువడినదే. అందుకే 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం' అన్నారు. ఆయన కేవలం భారతీయులకే కాక, ఉత్తమధార్మిక సత్యాలను, ఉన్నత విలువలను తెలుసుకోవాలను కున్న మానవులందరికీ సర్వధర్మాలను ప్రబోధించిన జగద్గురువు.

కనుకనే లోకమంతా వేదవ్యాసుని జగద్గురువుగా ఆరాధిస్తున్నది. ఆ మహామహితాత్ముడు ఈ లోకంలో ఆషాఢ పూర్ణిమ నాడవతరించాడు. ఆ శుభదినాన్ని వ్యాసపూర్ణిమగా, గురుపూర్ణిమగా జరుపుకుంటున్నాం. ఆ పర్వదినాన ఆ మహా మనీషిని, అసమాన ప్రజ్ఞానిధిని, అనంత విజ్ఞాన విశారదుని స్మరించి, ఆరాధించి, ఆయన దివ్యపాదారవిందములకు ప్రణమిల్లి ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం. ఆయన ఋణమెలా తీర్చుకోగలం? లోకంలో విజ్ఞాన వీచికలను ప్రసరింపజేసి అజ్ఞానాంధకారాన్ని పోగొట్టిన ఆ జ్ఞానభాస్కరునికి ఈ లోకం సదా ఋణపడి ఉంది.

**జయతి పరాశరసూనుః సత్యవతీనందనో వ్యాసః ।**
**యస్యాస్య కమలగలితం వాఙ్మయమమృతం జగత్పిబతి ॥**

వేదవ్యాసుని ముఖకమలము నుండి జాలువారిన విజ్ఞానామృతాన్ని జగత్తంతా ఆనందంతో ఆస్వాదిస్తున్నది.

అనాది నిధనము, అపౌరుషేయము, నిత్యమునైన వేదరాశిని విభజించిన వేదవ్యాసమహర్షికి, వాటిని లోకానికందించిన పరమర్షులకు, వాటిని అవిచ్ఛిన్నంగా ఇప్పటివరకు తరతరాలుగా మనకు అందిస్తూ వస్తున్న ఆచార్య పరంపరకు మనమెంతో ఋణపడి ఉన్నాము. కేవలం శ్రవణం ద్వారానే నేర్చుకోదగిన 'శ్రుతి'కి అక్షరరూపాన్ని కల్పించి, మానవులకు మహోపకారమొనర్చిన ప్రాచీనార్యులకు మనం సదా కృతజ్ఞులమై ఉండాలి.

**యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం**
**యో వై వేదాగ్ంశ్చ ప్రహిణోతి తస్మై ।**
**తగ్ం హ దేవ మాత్మబుద్ధి ప్రకాశం**
**ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥ - శ్వే.ఉ.అ.6. మం.18.**

ఏ భగవంతుడు సృష్టి ఆరంభంలో బ్రహ్మదేవుని సృష్టించి ఆయనకు వేదాలను ఉపదేశించాడో, ఏ భగవంతుడు తన బుద్ధియందు ప్రకాశిస్తాడో, అట్టి భగవంతుని మోక్షాన్ని కోరే నేను శరణు వేడుతున్నాను.

## ఏకాయనం :

సృష్ట్యారంభంలో భగవంతుడు అనంతమైన వేదరాశిని ప్రపంచానికి ప్రసాదించాడు. ఒక్కటిగా ఉన్న ఆ వేదరాశిని 'ఏకాయనం' అనేవారు. ఆదికాలంలో వేదం ఒకేరాశిగా అనేక శాఖలతో విరాజిల్లుతూ ఉండేది. ఒకే వేదసంహితగా అధ్యయన అధ్యాపన కార్యక్రమాలు జరుగుతుండేవి.

**ఏక ఏవ యజుర్వేదో పురాకాలే న కించన ।**
**తత ఏకాయనం నామ శాఖాంతర మథోద్ధృతమ్ ॥**
**- బ్రహ్మవైవర్తపురాణం**

ద్వాపరయుగంలో కృష్ణద్వైపాయనుడు 1131 శాఖలతో నున్న ఆ వేదరాశిని ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదాలనే పేరుతో నాలుగు వేదాలుగా విభజించాడు. వాటిలో శ్లోకరూపంలో ఋక్కులుగా ఉన్న మంత్రములతో కూడిన 21 శాఖలను ఋగ్వేదంగాను, గద్య, పద్యాలతో కూడిన యజుస్సులతో కూడిన 101 శాఖలను యజుర్వేదం గాను, గేయ రూపంలో ఉన్న సామలతో కూడిన 1000 శాఖలను సామవేదంగాను, వివిధ రూపాలైన మంత్రాలతో కూడిన తొమ్మిదిశాఖలను అథర్వవేదంగాను రూపొందించాడు.

దేవతలను ప్రశంసించేది, ఆరాధించేది ఋక్కు - "అర్చ్యతే ప్రశస్యతే అనేన దేవ విశేషః ఇతి ఋక్". విశిష్టమైన దేవతలను స్తుతించేవి మంత్రములు. 'మన్యతే సత్క్రియతే దేవతా విశేషః అనేన ఇతి మంత్రః". ఋగ్వేదానికి 21 శాఖలు, యజుర్వేదానికి 101 శాఖలు, సామవేదానికి 1000 శాఖలు, అథర్వవేదానికి 9 శాఖలు ఉన్నట్లు పస్పశాహ్నికం చెబుతున్నది.

# శ్రీచరణ శరణాగతి

పుడమి సుతన్ వరించి, పరిపూర్ణ మనుష్యమనీషనొప్పి, కా
రడవుల ధర్మరక్షణ పరాయణుడై చరియించువాని, న
ల్గడల ప్రశస్తుడైన ఘనకార్ముకవేది పదప్రభావమున్
కడలుకొనంగ బ్రాహ్మికృప గానమొనర్చె కవీశుడొప్పగన్. **37**

శమదమముల్ ధనంబులుగ సాగిలి నిత్యము నీకు మ్రొక్కు టు
త్తమమని యాత్మనెంచి మను తావక భక్తుల నగ్రగణ్యుడై
విమల వరాంగ గాంగఝరి విశ్రుత రీతిని నీదుపాద కం
జములనె తిర్గి కడ్గు పురశాసను డెంతయు సంభ్రమమ్ముగన్. **38**

నేనని ముందు నేననుచు నెట్టి పదంపడి పాదపద్మముల్
శ్రీనిలయా! మహోత్సవపు సేవల మ్రొక్కెడి లోకపాల సే
నానివహ ప్రకారముల నాదటదీర్చుచు నాత్మ మెచ్చుచున్
తానములిచ్చి నిల్చుకొను దండపతిన్ దయజూతువెప్పుడున్. **39**

రాతిని నాతిజేసి, రథరాక్షసునంతము జూచి, పాద ని
ర్యాత పవిత్ర గాంగఝరి నన్ని జగమ్ములగాచి, గర్భ సం
జాత పరీక్షితావనిపు చావును మానిపి, రాయబార వి
ఖ్యాత వినీత శాంతి విధి గాలము దీర్చిన మాధవా! నతుల్. **40**

నిలిచి యనుగ్రహమ్మును, వినిగ్రహరీతుల నీ పదాబ్జముల్
సలుపును ధర్మపాలనము, జాత విరోధి వినాశమున్ కటా
క్షలవ విశేషపోషిత జగత్పరివారక! నిన్నె నమ్ము జీ
వులకు నిరంతరాయములు నొప్పులకుప్పలు సౌఖ్యసంపదల్. **41**

చంద్రికలీను పున్నమల చల్లని వెల్గుల గోటి పాదముల్
చంద్ర సహోదరీ మృదుల చారుకరాంబుజ సేవితమ్ములై
సాంద్ర యశో మహావిభవ సంపద లిమ్మడి గాగనిచ్చు ని
స్తంద్రత నింద్రముఖ్య సురసంఘము భక్తిని మ్రొక్క వచ్చినన్. **42**

- ఆచార్య రావికంటి వసునందన్

**ఏకశతమధ్వర్యుశాఖాః**
**సహస్రవర్మా సామవేదః ।**
**ఏకవింశతిధా బాహ్వృచమ్**
**నవధాऽథర్వణో వేదః ॥**

**వేదవ్యాసుడు :**

కలియుగంలో మానవుల బుద్ధిశక్తిని, ఆయుష్షును గుర్తించిన వ్యాసమహర్షి వారి సౌలభ్యం కొరకై బ్రహ్మపరంపరా గతమైన వేదరాశిని నాలుగు భాగాలు చేశాడు.

ఆయన యజ్ఞాలలో హోతకు సంబంధించిన మంత్రాలన్నిటిని ఒకచోట చేర్చి ఋగ్వేదంగా రూపొందించాడు. అధ్వర్యుడు చేసే క్రియల నిమిత్తం ప్రయోగించే మంత్రాలన్నిటిని యజుర్వేదంగా ఏర్పరచాడు. ఉద్గాతకు సంబంధించిన మంత్రాలను సామవేదంగా తీర్చిదిద్దాడు. ఇష్టఫలప్రాప్తి కొరకు నిర్వహించే శాంతి పౌష్టికాది క్రియాకలాపనిమిత్తమైన మంత్రాలనన్నిటిని అథర్వవేదంగా సమకూర్చాడు. ఈ విధంగా ఈ వైవస్వత మన్వంతరంలో ద్వాపరయుగాంతంలో సత్యవతీ పరాశరుల పుత్రుడైన కృష్ణద్వైపాయనుడు వేదవిభజన చేసి వేదవ్యాసునిగా ప్రసిద్ధి చెందాడు.

**వేదాన్ వివ్యాస యస్మాత్స**
**వేదవ్యాస ఇతి స్మృతః**

**- మహాభారతం.**

వేదాలను విభజించుట వలన ఆయనను వేదవ్యాసుడంటారని మహాభారతం పేర్కొంది. ఆ మహర్షి మానవుల ప్రయోజన నిమిత్తం నాలుగు వేదాలనందించి వేదవ్యాసుడయ్యాడు. **(ఇంకా ఉంది)**

# సందేహాలు? సమాధానాలు!!

- 'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**తిరుమల కొండపై శ్రీనివాసుడు వెలసిన యుగం, సుమారు సంవత్సరాల్లో తెలపండి? శ్రీవారి స్వయంభు విగ్రహానికి శంఖచక్రాలు లేవంటారు నిజమేనా?**

-మారేటి శంకరరావు, సాలూరు.

☛ ద్వాపరయుగంలో మణికంఠుడు, నారదశిష్యుడు మొదలైన వారు తిరుమల శ్రీనివాసుని దర్శించినట్లు కళాపూర్ణోదయం చెబుతోంది. కవి పింగళిసూరన 'కలౌవేంకటనాయకః' కలి యుగంలో వేంకటేశ్వరుడే ప్రత్యక్ష దైవమని పేర్కొనబడింది. పైగా కలియుగ ప్రారంభంలో చింతచెట్టు తొఱ్ఱలోనున్న నమ్మా ళ్వారుతో విభిన్న నామములతో మంగళాశాసనం చేయించు కొన్నందువల్ల వేంకటేశ్వరున కింతటి ప్రాచుర్యం వచ్చిందని వైష్ణవుల విశ్వాసం. ఏదేమైనా ఈయన కలియుగారంభం నుండి ప్రఖ్యాతిలోకి వచ్చాడని భావించటం సమంజసం.

వేంకటనాథుని ఆంతరంగిక భక్తుడైన తొండైమాన్ (తొండ మాన్) చక్రవర్తిపై బలవంతులైన శత్రువులు దండెత్తి రాగా; ఆయన, వారి ధాటికి తట్టుకోలేక వచ్చి శ్రీవారి నాశ్రయించగా; ఆ శత్రువులను జయించుట కొరకై శ్రీనివాసుడు తన శంఖ చక్రములను ఆయనకిచ్చేశాడు. అప్పటినుండి ఆయన దగ్గర శంఖచక్రములు లేవు. లక్ష్మీదేవి అంతకు ముందే ఆయన వక్షః స్థలాన్ని విడిచి దూరానుంటున్నది. కనుక ఆయన భైరవుడని శైవులు భావించారు. తొలుత కొండమీద ఆరుమాసాలు ఆ విగ్రహానికి భైరవపూజ మిగిలిన ఆరుమాసాలు విష్ణుపూజ నిర్వ ర్తింపబడేది. భగవద్రామానుజులు వచ్చి ఆ సమస్యను పరిష్క రించి ఆయన విష్ణుస్వరూపుడని నిర్ధారించి; శంఖచక్రాలనిచ్చి; హృదయంలో లక్ష్మిని చెక్కించి, శ్రీనివాసునకు మామయైనాడు.

**62 కళలు అంటారు. అవి ఏవో తెలుపగలరు?**

- కుక్కడపు కాత్యాయని, తిరువూరు.

62 కాదు. చతుష్షష్టి కళలు అంటారు. అనగా 64. వీటినే విద్యలని కూడ అంటారు. ఈ లెక్కలో కూడ కొన్ని మత భేదాలున్నాయి. కొందరు వేదాలనన్నింటిని ఒక్కటిగా లెక్కిం చారు. కొందరు వాటిని నాలుగుగా చూపారు.

1)వేదం 2)శాస్త్రం 3)ధర్మశాస్త్రం (స్మృతి) 4)వ్యాకరణం 5)జ్యోతిశ్శాస్త్రం 6)ఆయుర్వేదం 7) సంగీతశాస్త్రం (గాంధర్వం) 8)కవిత్వం 9) స్వరశాస్త్రం 10)సాముద్రికశాస్త్రం 11)కొక్కోకం (కామశాస్త్రం) 12)శకునశాస్త్రం 13)మల్లయుద్ధవిద్య 14)గారుడం 15)వాక్చమత్కృతి 16)అర్థవేదం 17)దేశభాషా పాండిత్యం 18)వివిధలిపిజ్ఞానం 19)లేఖనం 20) రథగమనం 21)రత్నపరీక్ష 22)అస్త్రవిద్య 23)పాకశాస్త్రజ్ఞానం 24)శిక్ష 25)వృక్షదోహదాలు 26)ఆగమశాస్త్రం (పాంచాహ్నికం - నవాహ్నికం మొదలైనవి) 27)ఐంద్రజాలికం(గారడీ) 28)కల్పం 29)కుట్టుపని 30)శిల్పశాస్త్రనైపుణ్యం 31)రసవిద్య (బంగారం చేయటం-రసవాదం) 32)నృపాలవిధి (రాజనీతిశాస్త్రం) 33)అంజనవిశేషాలు(కాటుకలు) 34)వాయుజలస్తంభన 35)ధ్వనివిశేషం 36)ఘటికాశుద్ధి 37)పశురక్షణ 38)విహంగ భేదగమన విద్య 39)చిత్రలేఖనం 40)అభినయశాస్త్రవిద్య 41)దొంగతనం 42)వాస్తుశాస్త్రం 43)మణిమంత్రౌషధసిద్ధి 44)లోహకారక విద్య 45)స్వప్నశాస్త్రం 46)అష్టసిద్ధులు 47)వడ్రంగం 48)మూలికౌషధసిద్ధి 49)చర్మకారకవిద్య 50)గణితశాస్త్రం 51) సూతికాకృత్యం 52)కార్యకరణవిద్య 53)చరాచరాన్యధాకరణం 54)తంతువిద్య 55)యోగవిద్య 56)వ్యవసాయం 57)ప్రశ్నశాస్త్రం 58)వ్యాపారం 59)మిత్రభేదం 60)వేట 61)తురగారోహణవిద్య 62)అలంకారాలు 63)ఉచ్చా టనం 64)నృత్యం. వీనిలో కొన్నింటిని తీసివేసి కొందరు; అదృశ్యవిద్య, ధాతుపరీక్ష, శాంతి, నాటకం, పురాణం, సుషిర, అనర్ఘ, ఘనా అనేవాటిని చేర్చారు.

**సమీరణః-సహస్రమూర్ధః-విశ్వాత్మా-సహస్రపాత్ అని వల్లీ నాథున్ని ప్రార్థిస్తారు. అలాగే విష్ణుసహస్రనామస్తోత్రంలోనూ ప్రార్థిస్తాం. ఈ నామాలను గురించి తెలపండి?**

- ఎ.పూర్ణచంద్ర, విశాఖ.

☛ 'ఏకంసత్ విప్రాబహుధావదంతి' అని వేదవాక్యం. పరమాత్మ ఒక్కడే. వేదవిధులు వివిధంగా చెబుతున్నారు. అంటే ఏకత్వంలో భిన్నత్వం-భిన్నత్వంలో ఏకత్వం. వల్లీనాథునకు, విష్ణువునకే కాదు ఈ పదాలు; దైవస్వరూపులైన శివ-విఘ్నేశ్వర-రామ-కృష్ణాదుల

కందరకు వాడబడతాయి. వాటి అర్థం కూడా అందరికి అన్వయిస్తుంది.

**'సమీరణః'–** అంటే వాయుదేవుడనే అర్థం ఉన్నది. "ఈరగతౌ కంపనేచ" అంతటను వ్యాపించువాడు. అనగా భక్తాభీష్టములగు కార్యములందన్నింటను ప్రవర్తించువాడు. ఈ అర్థము దైవత ములకెల్ల సమానమే కదా! **'సమ్యక్ గచ్ఛతీతి సమీరణః'–** అనగా లెస్సగా సంచరించువాడని అర్థం. విశ్వవ్యాపనాత్ విశ్వాత్మా– ఇది పురుషసూక్త నామం. జ్ఞానశక్తి గుణములచే అంతటను వ్యాపించిన కారణాన పరమాత్మ విశ్వాత్మ అనబడుచున్నాడు. అనగా అనంత ప్రపంచం యొక్క ఆత్మస్వరూపుడు విష్ణువునకు, వల్లీశ్వరునకు ఈ గుణం వర్తిస్తుంది. సహస్రమూర్థా–మూర్ధ– అక్షి–పాదాః–జ్ఞానకర్మోపకరణోపలక్షణార్థాః. మూర్థశబ్దము జ్ఞానానికి, అక్షిపాదములు కర్మలకు సాధనములై పరమాత్మ శక్త్యాదులను తెలుపును. ఇక్కడ సహస్ర శబ్ద ముపలక్షకం. వేయి అని అర్థం కాదు. అసంఖ్యాకమైన అని అర్థం. ప్రపంచం లోని శీర్షములన్నీ పరమాత్మ శీర్షములే గనుక ఆయన సహస్రమూర్థా అని చెప్పబడుచున్నాడు. ప్రపంచ ప్రాణులన్నీ పరమాత్మ స్వరూపములే కదా! 'సహస్రపాత్' 'సహస్రశీర్షా పురుషః సహస్రాక్షస్స హస్రపాత్' అని పురుషసూక్తం. సహస్ర శబ్దం అసంఖ్యాకాన్ని తెలుపు ఉపలక్షకం. ఈ కన్పించే విశ్వ మంతా పరమాత్మ విరాట్స్వరూపం. ఇందులోని ప్రాణులపాదా లన్నీ పరమాత్మ పాదములే! ఇది పరమాత్మకు విశేషణం.

**మొగలిపూవు పూజకు అర్హత లేని పువ్వని అంటారు. నిజ మేనా? అలాగే ఏ ఏ పూలు పూజకనర్హాలో తెలుపగలరు?**

**– చిట్టూరి ఈశ్వరరావు, తిరువూరు, కృష్ణాజిల్లా.**

☛ పూర్వం బ్రహ్మవిష్ణువులు నేను గొప్పంటే నేను గొప్పని కల హించుకుంటూండగా, అపుడు వారి మధ్య ఒక శివలింగం పుట్టి బ్రహ్మను, నా శిరస్సెక్కడుందో కనుక్కోవలసిందని; విష్ణువును నా పాదాలెక్కడున్నాయో కనుక్కోవలసిందని ఆదే శించింది. హంసరూపంలో బ్రహ్మ పైకి; ఆదివరాహరూపంలో విష్ణువు క్రిందికెళ్ళారు. బ్రహ్మకు లింగంశిరస్సు, వెన్నునకు లింగపాదాలు కన్పించలేదు. మన్వంతరాలు తిరిగిపోయాయి. ఇద్దరూ తిరిగి పోరాడుకున్న స్థలానికే వచ్చారు. విష్ణువు నాకు లింగంపాదాలు కన్పించలేదన్నాడు. బ్రహ్మ తాను లింగం శిరస్సు చూచానని; మొగిలిపూవును, కామధేనువును వెంటబెట్టుకొని వచ్చి మొగిలిపూవుచేత చూచినట్లు సాక్ష్యం చెప్పించాడు. కామ ధేనువు నడగ్గా అది తన తోకను అడ్డంగా ఊపి ఇది అబద్ధమని తెలియజేసింది, అప్పుడు విష్ణువు మొగలిపూవు అబద్ధం చెప్పింది కనుక అది పూజకర్హం కాదనీ, కామధేనువు పృష్ఠభాగంతో సత్యం తెలిపింది కనుక ఆవుకు వెనుకభాగం పూజార్హమగుగాక యనిన్నీ, శాపం పెట్టాడు. అందువల్ల మొగలి పూవు పూజకర్హం కాకుండా పోయింది. ఆవు వెనుకభాగమే పూజింపబడుతోంది. మల్లె, గులాబీ మొదలైన పూవులు కూడా పూజకనర్హాలే! మల్లె కేవలం అలంకారానికి మాత్రమే! కానీ తి.తి.దే.లో మల్లెలతో పూజించడం వల్ల; ఇప్పుడందరు మల్లెపూలను పూజకు వాడు తున్నారు.

**తిరుచానూరులోని పద్మావతీఅమ్మవారు, అలివేలుమంగమ్మ ఒక్కరేనా? బీబీనాంచారమ్మను గూర్చి తెలియజేయండి.**

**– కొత్తపర్తి శ్రీరాములు-నరసరావుపేట.**

☛ ఇద్దరూ ఒక్కరే! తిరు అనగా శ్రీ–చాన అనగా స్త్రీ; అంటే లక్ష్మీదేవి అని అర్థం. లక్ష్మీదేవియే పద్మావతి. ఆమె పద్మంలో పద్మావతిగా; ఆకాశరాజు కుమార్తెగా జన్మించింది. ఆమెయే అలర్‌మేన్‌మంగ. అలర్ అంటే పూవువలె ప్రకాశించు, మేన్ అంటే శరీరము కలది అని అర్థం. అలర్మేన్‌మంగయే అలమేలు మంగ. ఈమెనే పల్లెల్లో అలివేలుమంగ అని పిలుస్తారు.

బీబీనాంచారు ఢిల్లీని పరిపాలించే, మహ్మదీయ చక్రవర్తి కుమార్తె. ఆమెకు శ్రీనివాసుని దర్శనం కలలో కనిపించగా ఆయననే ప్రేమించింది. శ్రీనివాసుడు కూడ ఆమెయందు బద్ధా నురాగుడైనాడు. ఆమె తిరుమలకు తల్లిదండ్రులతో వచ్చి శ్రీని వాసుని వివాహమాడి; భౌతికరూపంతోనే అదృశ్యురాలైందట. నాకిక్కడ బంధువులెవ్వరులేరని ఆమె బాధపడుతుంటే–స్వామి, తలనీలాలిచ్చి బోడిగుండు కొట్టించుకొన్న వారందరు నీకు బంధు వులే నన్నాడట! అప్పటినుండి తిరుమల కొండమీద తలనీలా లిచ్చే ఆచారం మొదలైందంటారు. కాని ఈ ఆచారం ఎప్పటి నుంచో ఉంది. తలనీలాలివ్వటమంటే; నాకు దేహాభిమాన, సౌందర్యాభిమానాలేవీలేవని స్వామికి నివేదించుకోవటమే దీని యొక్క పరమార్థం.

# శ్రీమద్రామాయణ రామణీయకం

- డా|| పి.నాగమల్లేశ్వరరావు

ఆ నాడు వాల్మీకి కోకిల కవితాశాఖ పైకెక్కి 'రామ! రామ!' అంటూ, ఏ శుభ ముహూర్తాన గానాన్ని ఆరంభించాడో, ఆనాటి వాల్మీకి నుంచి, ఈనాటి విశ్వనాథ వరకు ఎందరో కవికోకిలలు ఆ గానాన్నే కొనసాగిస్తున్నారు; ఉంటారు కూడా. అదే రామాయణ కథలోని రామణీయకం. అందులోని నిత్యనూతనత్వం. సీతారామ కల్యాణం - నిత్య కల్యాణం; పచ్చతోరణం కదా!

వాల్మీకి రామాయణానికి కాలానుగుణంగా - కావ్య లక్షణాల్లో, ఆధ్యాత్మిక ప్రమాణాల్లో ఇనుమడింపజేస్తూ తెలుగులో ఎన్నో రామాయణాలు - అటు శ్రవ్యకావ్యాలుగానో, ఇటు దృశ్యకావ్యాలుగానో వచ్చాయి. అయితే, ఆ లక్షణాల్ని మరింత రసానుగుణంగా అందించిన వాటిలో రామాయణ కల్పవృక్షం అగ్రతాంబూలం అందుకొంటుంది. కల్పవృక్షం విశ్వనాథ శిల్పవృక్షం!

ఆదర్శ దాంపత్యానికి నిదర్శనంగా నిలిచేవారు సీతా రాములు. ఆ ఆదర్శదంపతుల కల్యాణాన్ని విశ్వనాథ వారు తెలుగింటి పెళ్లిగా ఎలా జరిపించారో పరిశీలిద్దాం.

పరాక్రమమే శుల్కంగా శివధనువును ఎక్కుపెడితే సీత నిచ్చి వివాహం చేస్తానన్నాడు జనకుడు. విశ్వామిత్రుని అనుమతితో రాముడు శివధనువును ఎక్కుపెట్టి విరి చాడు. జనకుడు ఈ వృత్తాంతం తెలియజేసి దశరథుని, పరివారాన్ని వివాహానికై మిథిలకు రమ్మనుమని ఆహ్వా నించాడు. వారు వచ్చారు. సంప్రదింపులు జరిగాయి. పరస్పరం వంశవృక్షాలు చెప్పుకొన్నారు. జనకుడు తన కుమార్తె సీతను, జనకుని సోదరుడు కుశధ్వజుని కుమార్తె లైన ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులను; రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు వివాహ నిశ్చయాలు జరిగాయి.

అప్పుడు వసిష్ఠ విశ్వామిత్రుల మాటలు విని జనకుడు వారితో అంటాడు -

**అపుడు గిరిజ నడుగ నరుదెంచినారు బ్ర**
**హ్మర్షు లస్మదీయులైన సుతుల**
**నడుగ నిపుడు గూడ నరుదెంచినారు బ్ర**
**హ్మర్షు లింక నేమి యసదు నాకు**

అన్నాడు. ఆనాడు పార్వతీదేవిని శివునికి అడగడానికై బ్రహ్మర్షులు వచ్చారు. అలాగే నా కుమార్తెలను అడగడానికి నేడు కూడా బ్రహ్మర్షులు వచ్చారు. ఇక నాకు 'అసదు' ఏముంది? అంటాడు. అదో తెలుగు నుడికారం. అలా అంటూ మరో మాట అన్నాడు - 'విచ్చేయుడు బ్రహ్మర్షులు పచ్చాకును వక్క గొనుడు.....' అన్నాడు.

'తాంబూలం' అనే మాటకు 'ఆకు వక్క' అనడం తెనుగుదనం. ఇలా ఆకువక్క - (అంటే తాంబూలం) అందు కోవడం ఆంధ్రుల ఆచారం. 'తాంబూలాలు పుచ్చుకొన్నారు' అనే జాతీయమూ మనకుంది. తాంబూలాలు పుచ్చుకోవడం అంటేనే వివాహాన్ని నిశ్చయం చేయడం కదా!



ఇక ఆ తర్వాత జనకుడు మరోమాట అన్నాడు. '....ఋషివరుల మాట కాదన గలమే? అని. ఇంకా – 'అయోధ్యకు మిథిలకున్ మరి మీరె ప్రభుల్ కుమార్తెలన్ గొనుటయు నిచ్చుటీ యుభయకోటికి మీరె ప్రమాణమెచ్చటన్' అన్నాడు. ఈ మాటల్లో అంతట తెనుగుదనం ఉట్టిపడుతోంది.

'ఆపటి శుభలగ్నంబు నందె నాల్గు ముళ్ళు పడ' నిండన్నాడు. నాలుగు ముళ్లేమిటి? పెళ్లి అంటే మూడు ముళ్లే కదా! అంటూ నాలుగు జంటలకు ముళ్లుపడనిమ్మని అన్నాడు.

ఇక నలుగురినీ పెళ్లికొడుకుల్ని చేశారు. అదంతా తెలుగు తంతే! ఆ మర్నాడు గోదానం ఆచరించారు. 16వ ఏట కానీ, పెళ్లి సమయంలో కానీ, గోదానం ఆచరించాలని ధర్మశాస్త్రం. ఈ సందర్భంగా గోదానం చేస్తారు కనుక 'గోదాన వ్రత' మనీ పేరు. ఆ గోవులు ఎలాంటివో విశ్వనాథవారు చక్కగా వర్ణించారు. ఈ వర్ణన మూలంలో లేదు.

**చనుచున్న తల్లి వెన్కను ముట్టెలాడించు**
**కొనుచు వచ్చెడు దూడలను గలట్టి**
**వర్ధచంద్రాకృతి నలరు కొమ్ముల యందు**
**బంగారు తొడుగుల వఱలు నట్టి**
**వల కంటి నదురు త్రోపులు వెట్ట వెండ్రుక**
**ల్తాళ్లు కాళ్ల నడుములంగలట్టి**
**వఱ్ఱులన్ వ్రేలాడ నగు హెన్ను గంటల**
**తో కల్పి కట్టిన దోహనార్థ**
**కాంస్యపాత్రల తళతళల్ గలిగినట్టి**
**మొదటి ఈతావులను .....**

ఇక జనకుని కనకమయ సౌధాల్లో వియ్యాల వారం దరూ కలిశారట. వారి కలయిక గంగా సరయూ సంగమంగా ఉందట.

దశరథ మహారాజుతో జనకమహారాజు – ఓ రాజా! 'చిలికిన పాలవెల్లి వడిచిందిన లోపలి నిప్పుతీవగా' వెలిగే సీత– వివాహానికి సిద్ధంగా ఉంది. ఉత్తర నక్షత్రం వచ్చింది. వివాహానికి తరలిరండని ఆహ్వానించాడు.

27 నక్షత్రాల్లోను – రోహిణి, మృగశిర, ఉత్తర, స్వాతి– అనే నాలుగింటికి కల్యాణ నక్షత్రాలని పేరు. ఆ నక్షత్రాల్లో

కల్యాణం శుభకరం అంటారు. ఆ ప్రకారం, ఆ నక్షత్ర సుమూర్తంలో వసిష్ఠుడు - విశ్వామిత్ర శతానందులతో కలిసి వేదిక నేర్పరచి మంత్రపూర్వకంగా హోమం చేశారు. అప్పుడు మేనమామలు పెళ్ళికూతుళ్లను తెచ్చారు. ఎలాగంటే -

**తుమ్మెదలు పైని గ్రమ్మిన తమ్మిపూలు**
**నాల్గు తట్టలలో దెచ్చినారు మేన**
**మామ లంతలో జూడగా మధుర లజ్జ**
**లుదయమైన రాకన్నెల వదనములుగ**

పెళ్ళికూతుళ్ళను మేనమామలు తట్టల్లో పెట్టుకొని, వివాహ వేదిక దగ్గరకు తీసుకు రావడం తెలుగింటి పెళ్లితంతులో ఒక భాగం. తుమ్మెదలు కమ్ముకొన్న తమ్మిపూల్లా వారి ముఖాలున్నాయట. ఎంత చక్కని భావన. ఇక తెర తీసిన క్షణంలో వాని పరస్పర వీక్షణం ఎలా ఉందో విశ్వనాథవారు ఇలా వర్ణించారు.

**ఎదురు బళ్లైన లజ్జచే నెత్తరాని**
**తెప్పలవి యెత్త బడకుండ గ్రేవ లందు**
**బ్రక్క కూర్చున్న యప్పటి ప్రసరణంబు**
**బ్రసవబాణుండు నేర్పిన ప్రథమ విద్య**

వధూవరుల ఓరగంటి చూపుల్ని విశ్వనాథ ఇందులో వర్ణించారు. అది 'ప్రసవబాణుడు నేర్పిన ప్రథమ విద్య' అన్నాడు కవి. ప్రసవబాణుడు అంటే మన్మథుడు. అదెంత చక్కని భావనో గమనించండి.

ఇక తర్వాతి తంతు సూత్రబంధం - మాంగల్యం తంతు నానేన - అటుపై ముఖ్యాంశం తలంబ్రాలు. సీతారాములు తలంబ్రాలు పోసుకోగా వారి తలపైన, ఒంటిపైన - రెండు మూడు ముత్యాలు నిలిచి ఉన్నాయట. సీతమ్మకు చిరుచెమట పోయగా, పాపిట్లో నిలిచిన స్వేద బిందువుల్లా, రామయ్య శరీరంపై నక్షత్రాల్లా మెరుస్తూ ఉన్నాయి. రాముడు నీలమేఘ శ్యాముడు. మేఘం వంటివాడు. ఆ మేఘంలో నుంచి కనబడే నక్షత్రాల్లా ముత్యాలున్నాయి.

**చంద్రరేఖపైని సన్నని తెలి మొయి**
**ళ్లాడి నట్లు ముత్తియమ్ము లాడె**
**తల్లి మేని పైని నల్లని యాకాశ**
**మట్లు రామచంద్రు డందె యుండ**

తలంబ్రాల తర్వాత ఆడపడుచులు హారతి పట్టడం ఉంటుంది. అందులో అంతోఇంతో సొమ్ము చేసుకోవడం ఆ డబ్బు ఆడుపడుచులంతా పంచుకోవడం - ఒక సరదా ఇక్కడ రాముని సోదరి శాంత హారతిపట్టిందట. అదంతా తెనుగు దనమే!

ఇక అందరూ ఆనందించేది పెండ్లి విందు. విందుకు ముందు ఉండాలంటారు అందరూ! ఎందుకంటే ఆలస్యం అయితే పదార్థాలన్నీ అందకపోవచ్చు. అన్నీ అందాలంటే, విందుకు ముందుండడమే మందు!

విందు తర్వాత రాత్రికి స్థాలీపాకం. అనంతరం వసిష్ఠుడు అరుంధతీ దర్శనం చేయించడం - ఈ తంతు అంతా ఆంధ్రుల పెళ్లితంతు! కానీ వాల్మీకి ఏం చెప్పాడంటే - హోమానంతరం జనకుడు - సర్వాలంకార భూషిత అయిన సీతను అగ్ని సమక్షంలో రాముని దగ్గరకు తెచ్చి ఎదురుగా నిలబెట్టి రామునితో -

**ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ**
**ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా**
**పతివ్రతా మహాభాగా ఛాయేవానుగతా సదా**

"ఓ రామా! ఇదిగో నా కుమార్తె సీత. ఈమె నీకు సహధర్మచారిణి కాగలదు. ఈమెను స్వీకరించి నీ చేతితో ఈమె చేతిని పట్టుకో! నీకు మంగళమగుగాక! మహాభాగ్యశాలి అయిన ఈమె పతివ్రతగా ఎల్లప్పుడూ నీడలా నిన్ననుసరించగలదు" - అన్నాడు.

అంటే పాణిగ్రహణం చేయించడం అనేది మాత్రమే ఆనాటి ముఖ్యమైన వివాహవిధానం అనుకోవచ్చు. అది అలా ఉన్నా విశ్వనాథవారు ప్రాంతీయాచారాలు పాటించి తెలుగు పెళ్లి చేయించారు. అలా తెలుగుదనం తొణికిసలాడించారు.

అదంతా అమూలకాంశం. ఆ తెలుగుదనం కల్ప వృక్షంలో కనబడే శిల్పవృక్షం! వెరసి - రామాయణం ఓ రమణీయ ఆదర్శకుటుంబ వృత్తం. అది వాల్మీకం కావచ్చు, విశ్వనాథం కావచ్చు, అది శాశ్వతం - అనేది యథార్థం!

# భక్తి

- జి. బిందుప్రసాద్

సంసార వృక్షానికి ఫలం భక్తి. పంచభూత నిర్మిత విశ్వంలో పలు రకాల జీవరాశి ఉంది. వాటిలో ఆత్మదర్శనానికి అత్యంత అనుకూలంగా ఉన్నది మానవదేహం. ఈ దేహంలో ఆత్మదర్శనం అద్దంలో ముఖం చూచుకొన్నంత స్పష్టంగా ఉంటుందని 'కఠోపనిషత్తు' చెబుతుంది. నరవర్గం, నారాయణ వర్గం అని మానవులు రెండు రకాలు. 'ఈశ్వర కోట్లు జీవకోట్లు అని మానవులు విభజించబడివున్నారు' అని శ్రీరామకృష్ణులు చెప్పి ఉన్నారు. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునుడితో "నాకు, నీకు, ఇరువురకు చాలా జన్మలు గడచినాయి, అవి నాకు తెలుసు, నీకు తెలియదు" అని చెప్పటంలో ఉన్న అంతరార్థం కూడా అదే, లేకుంటే శ్రీకృష్ణభగ వానుడికి ఎన్నో జన్మలు ఏమిటి?

అటువంటి జీవకోట్లు తరించాలంటే భక్తి ఒక్కటే మార్గం. అది సంసార వృక్షానికి మాత్రం ఫలం ఎందుకైంది అంటే, ఒక సంసారి, గృహస్థుడు ఫలానాది పొందాలని ప్రయత్న శీలుడై ఉంటాడు. సహజంగానే అతడికి అరిషడ్వర్గాలుంటాయి. అంటే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలు. కామం పోతే అన్నీ పోతాయి. 'కామం' (స్త్రీవాంఛ) గురించి శ్రీరామ కృష్ణులు "ఏదో కావాలనే కోరికే కదా కామం అంటే" అని చెప్పి ఉన్నారు. పిల్లలే కామానికి తుది ఫలం అయితే ఆ తర్వాత ఆ వాంఛ ఎందుకున్నట్లు? 'ఏదో కావాలి' అనే లక్ష్యం లేని తీరని కోరిక ప్రప్రథమ దుఃఖ కారణం. అది తీరదు. ముగిసిపోదు. అదే దుఃఖం. 'భగవంతుని పొందాలి' అనే లక్ష్యాన్ని అక్కడ జోడించడం ద్వారా భక్తికి మార్గం ఏర్పడుతుంది.



కామం రూపాంతరం చెందుతుంది. అరిషడ్వర్గ రూపం మారి భగవంతుడి పరం అవుతుంది. ఎంత సులువో చూడండి.

మానవజన్మ తిరిగి రావాలంటే ఎన్నో మార్గాలు. కొన్ని కఠినం సుదీర్ఘం, కొన్ని సులభం. మానవుడు మరణించిన తర్వాత వెంటనే మానవజన్మ వస్తుందా? అని అడిగిన వారికి భగవాన్ రమణమహర్షి "పాపపుణ్యాలు సమానంగా ఉంటే వెంటనే మానవజన్మ వస్తుంద"ని చెప్పారు. అలా లేకపోతే సుదీర్ఘ ప్రయాణం తప్పదుకదా! గర్భశోకం, జన్మ, సుఖదుఃఖాలు, వృద్ధాప్యం, మధ్యలో రోగాలు, మరణం, మళ్ళీ అదే చక్రంలో తిరగటం. పాపపుణ్యాల సమతుల్యం సాధించటం మనవల్ల కాదు, అది మనచేతుల్లో లేదు. అందువల్ల తర్వాత ఏమవు తామో మనకు తెలియదు. కాబట్టి శ్రీరామకృష్ణులు గృహస్థులకు "ఒక చేతితో భగవంతుని పట్టుకో, రెండవ చేతితో సంసారాన్ని పట్టుకో, అవకాశం చిక్కిన వెంటనే సంసారం వదలి వేయాలన్న తపన కలిగి ఉండు" అని సలహాయిచ్చారు. "గృహస్థ కోటలో ఉండి యుద్ధం చేసే సైనికుడితో సమానం" అని కూడా అన్నారు. సంసారికి భక్తి అత్యంత అనుకూలంగా ఉంది. భగవంతుని పట్టుకోవడం అంటే మనస్సును పూర్తిగా ఆయన మీద లగ్నం చేయటం. అంటే 'అమృత స్వరూపాచ' భగవంతుడు అమృత స్వరూపుడు, నిర్వికారి అని తెలుసుకుని ఆ తత్త్వాన్ని మనస్సులో ఆవిష్కరించుకొని ఉండటం భక్తి.

ప్రపంచంలో ఏ వస్తువువల్లా మానవుడికి తృప్తి లభించదు. సంతృప్తి నియ్యకుండటమే ప్రకృతి స్వభావం. 'సంసారంలో తృప్తి లేదు, రాదు. పొందలేము' అని సంసారికే తెలుస్తుంది. తెలిసిన వెంటనే అతడు సంసారాన్ని విడచిపెట్టి "ఆత్మారామోభవతి" అవుతున్నారు. సంతృప్తిని సంపూర్ణంగా అనుభవిస్తున్నాడు. తృప్తి అంటే సాధించవలసినది సాధించిన తర్వాత, కార్యం (రజోగుణం) పూర్తి అయిన తర్వాత ఉన్న స్థితి. అదే 'సిద్ధోభవతి'. సంసారం ప్రారంభంలో తీయగా ఉన్నట్లు ఉండి తర్వాత పుల్లగా, ఆ తర్వాత వగరుగా మారి రుచి నశించి నిజమైన అమృతఫలం భగవంతుడు అని తెలియ వస్తుంది. కాబట్టి, సంసారమే గురువు, బాగా పరిశీలిస్తే భక్తి మార్గంలో తరించిన వారంతా గృహస్థులే. ప్రవృత్తిని సంపూర్ణంగా భగవంతుడి వైపు త్రిప్పటమే 'భక్తి' కాబట్టి సంసార వృక్షానికి ఫలం 'భక్తి'.

శ్రీరాముని అరణ్యవాసానికి, కష్టాలకు కైకయే కారణమని గాని, మందరయని గాని, శూర్పణఖ కారణమనిగాని అనుకోరాదు. వారిని ద్వేషించడం, కించపరచడం చేయ రాదు. వారు కారణజన్ములు. వారి వారి పాత్రలలో జీవించారు. దుష్టశిక్షణ శిష్టరక్షణకు కారణమయ్యారు.




కోసలదేశపు రాజు దశరథ మహారాజు. ఆతని రాణులలో పెద్ద భార్య కౌసల్య, రెండవ భార్య సుమిత్ర. చిన్న భార్య ముద్దుల భార్య కైకేయి. ఈమె కేకయ దేశపు రాజ కుమార్తె. కైకేయిని తన కిచ్చి వివాహం చేయుమని దశరథుడు యధుజిత్తును అడిగాడు. ఆమెకు జన్మించిన కుమారుడ్నే రాజును చేసినట్టయితే తన కుమార్తెనిస్తానని యధుజిత్తు షరత్తు పెట్టాడు.

**కౌసల్య :** కౌసల్య పరంధామునికి జన్మనిచ్చిన మాత. రాముడు అరణ్యానికి వెళ్లునప్పుడు చిన్నపిల్లలవలె రోదించింది.

**సుమిత్ర :** సుమిత్ర జ్ఞాని. రాముని వియోగమునకు విలపిస్తున్న కౌసల్యను ఓదార్చింది. దుష్టశిక్షణ శిష్టరక్షణకు రాముడవతరించాడు, అయోధ్యలో కూర్చోడానికి కాదన్న సత్యాన్ని చెప్పింది.

లక్ష్మణుడు తనకు నమస్కరించడానికి వచ్చినప్పుడు రాముణ్ణి దశరథుడుగా చూచుకో. వదిన సీతమ్మను నన్ను చూపినట్టు చూడు. రాముడు ఎక్కడ ఉంటే అదే అయోధ్య, రాముడులేని అయోధ్య అరణ్యమేనని ఉద్బోధించింది.

**కైక :** దేవాసుర సంగ్రామంలో దశరథుని రథపు శీల ఊడిపోయినపుడు వేలు పెట్టి విజయకారకు రాలైంది. అప్పుడు దశరథుడు ఆమెకు రెండు వరములు ఇచ్చాడు.

**మందర:** ఈమె కైక పుట్టింటి దాసి. కైకకు దుర్బోధ గావించి ఆ రెండు వరములు కోరుకునేట్లు ప్రేరేపించింది. వరములు కైక కోరుకున్న తర్వాత ఈమె పాత్ర ముగిసింది.

**తాటక :** ఈమె సుకేతుడను యక్షుడి పుత్రిక. బ్రహ్మవర ప్రసాది. వేయి ఏనుగుల బలము కలది. సుందుణ్ణి వివాహమాడి మారీచ, సుబాహుడికి తల్లియైంది. రాముడు సంధించిన శబ్దవేది అస్త్రంతో అసువులు బాసింది.

**అహల్య :** గౌతముని భార్య. దేవేంద్రుడు చేసిన మోసానికి భర్త శాపానికి గురై శిలగా మారి తిరిగి రాముని పాదస్పర్శతో నాతిగా మారింది.

**సీత :** జనకమహారాజు చేసే యాగంలో నాగలి చాలుకు దొరికినది జానకి. ఈమె అయోనిజ. దశరథ తనయుడు రాముడు శివధనుస్సు విరిచి ఆమెను చేబట్టాడు. లక్ష్మణుడు ఊర్మిళను, భరత శత్రుఘ్నులు మాండవీ శృతకీర్తులను వివాహమాడారు.

**శూర్పణఖ :** ఈమె రావణుని చెల్లెలు. మాయా తంత్రవేత్త. విద్యుజ్జిహ్వుడి భార్య. లక్ష్మణుడు ముక్కూ చెవులూ కత్తిరించినప్పుడు గోరంతలు కొండంతలు చేసి చెప్పి, సీత అందచందాలు వర్ణించి మోహం కల్పించి రాక్షసకులనాశనానికి కారకురాలైంది.



**శబరి :** ఈమె మాతంగ మహర్షి శిష్యురాలు. రామ భక్తురాలు. ఈమె రామలక్ష్మణులకు అర్ఘ్యపాద్యములొసగి భక్తి ప్రపత్తులతో సేవించింది. ఈమె తన గురువుగారి గొప్పతనం చెప్పి పుణ్య లోకాలను చేరుకొన్నది. జాతి ఏదైనా, కులం ఏదైనా భక్తి ప్రధానమని నిరూపించిన వనిత.

**స్వయంప్రభ :** శ్రీరామాయణ కిష్కింధకాండలో స్వయంప్రభ వృత్తాంతం వస్తుంది. ఈమె మేరు సావర్ణి పుత్రిక. అతిలోక సుందరి మరియు హేమచెలికత్తె. ఈమె హేమతో సహ మయుడు నిర్మించిన ఋక్షబిలాల్లో ఉంటోంది. కిష్కింధ పాలకుడు సుగ్రీవుడు సీతాన్వేషణకై హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు మొదలగు వానర ప్రముఖులను దక్షణదిక్కుగా పంపినప్పుడు సీతను వెతుకుతూ అలసిపోయి దాహంవేసి నీటికోసం ఒక బిలంలోకి వెళ్ళారు. అక్కడ స్వయంప్రభను చూచి ఆమె వృత్తాంతం అడిగి తెలుసుకొని వారి కథ చెప్పారు. అప్పుడు ఆమె వారిని సముద్రతీరంలో పడవేసి కర్తవ్యబోధ చేసింది.

**సురస :** గంధర్వ, సిద్ధ, దేవగణాలు నాగమాత సురసను ప్రార్థించి హనుమంతుని కార్యదీక్షను పరీక్షించుమని కోరారు. విశాలదేహంతో అతనిని గగన మార్గమున అడ్డు తగిలి నిరోధించింది. ఆమె పరీక్షలో హనుమంతుడు విజయం సాధించాడు.

**సింహిక :** హనుమంతుడు సముద్రం లంఘిస్తున్నప్పుడు అతని నీడను బట్టి ఆతనిని ఆహారంగా గైకొనవలెనని అభిలషించింది. హనుమంతుడు సింహిక నోటిలో ప్రవేశించి ఆమె శరీరాన్ని ఛేదించి బయటకు వచ్చాడు.

**ఎందుకు తలనీలాలు సమర్పించడం?**

**తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా ।**
**శిరోగతాని పాపాని యాన్తి ముండనతో యతః ॥**

**(పద్మపురాణం 237.45)**

తీర్థక్షేత్రంలో ఉపవాసం చెయ్యాలి. తల నీలాలు తీయించుకోవాలి. అలా తలనీలాలు తీయించుకుంటే శిరస్సులో ఉన్న పాపాలు నశించిపోతాయి. అహంకారం తగ్గిపోయి, అశాశ్వతమైన శరీరంపైన మమకారం తగ్గిపోతుంది.

**లంకిణి :** లంకానగరం అందమైన నగరం. ఆ నగరాన్ని విశ్వకర్మ నిర్మించాడు. కుబేరుడు ఆ నగరాధిపతి. కుబేరుని పరాజితుని గావించి రావణుని లంకానగరమునాక్రమించెను. ఆ నగరాన్ని వేయి కన్నులతో కాపలా కాస్తున్న స్త్రీ యే లంకిణి. హనుమంతుణ్ణి అడ్డుకుంది. లంకిణి హనుమంతుడి ముష్టి ఘాతాలకు రక్తం కక్కుకుని నేలకూలింది. ఒక వానరుని చేతిలో నువ్వు ఓడిపోయినప్పుడు లంకనాశనమౌతుందని బ్రహ్మ వాక్కులు జ్ఞప్తి తెచ్చుకుంది. ఆమెకు శాపవిమోచనం కల్గింది.

**త్రిజట :** ఈమె విభీషణుని కుమార్తె. శ్రీరాముని విజయాన్ని రావణుని నాశనాన్ని కలగన్నది. రావణుడు తైలదేహంతో, ఎర్రటి బట్టలు కట్టుకుని మద్యం సేవించి పుష్పక విమానం నుండి క్రిందికి పడినట్లు, లంక సముద్రంలో కలిసిపోయినట్లు, సీతారామ లక్ష్మణులు భద్రగజముల మీద ఊరేగుతున్నట్లు కలగన్నది. తన కలను మిగిలిన రాక్షసులకు వివరించి వారిని భయకంపితులను చేసింది.

**మండోదరి :** ఈమె మయుడి కుమార్తె. రావణుని పట్ట మహిషి. వివాహ సందర్భంలో మయుడు అల్లుడికి శక్త్యాయుధమును కానుకగా ఇచ్చాడు. రావణుడు ఆ ఆయుధమును లక్ష్మణునిపై ప్రయోగించాడు.

**సరస :** ఈమె విభీషణుడి భార్య. ఈమె ధర్మస్వరూపిణి జానకికి అన్ని విధాలా అండగా ఉండి భయాన్ని నివారించింది.

రామాయణంలో ఇంకా ఎన్నో పాత్రలు ఉన్నాయి. కాని ఇక్కడ కొన్ని ముఖ్యమైనవి మాత్రమే ప్రస్తావించడం జరిగింది.

పావనమైన శ్రీరామచరిత్ర చదవడం, వినడం, ధ్యానించడం వల్ల వేలకొలది అశ్వమేధ యజ్ఞాలు, వాజపేలు చేసిన ఉత్తమ ఫలితం పొందుతారు. పుణ్యనదీ జలాలలో స్నానం చేసిన పుణ్యం పొందుతారు. శ్రీరామాయణ పఠనం సౌభాగ్యాన్ని, ఆయుష్షును వృద్ధి చేస్తుంది. గాయత్రీ రూపమైన రామాయణంలో ఒక వాక్యమైనా, ఒక పదమైనా పఠించేవారు అష్టైశ్వర్యాలతో సుఖిస్తారు.

**- ఎ.సూర్యకుమారి.**



# బాలవాక్కు!

## భక్త ధ్రువుడు

భగవంతుని ఆరాధించి తరించిన వారిలో ఎందరో బాలభక్తులున్నారు. వారిలో ధ్రువుడు ఒక్కడు. పూర్వ కాలంలో ఉత్తానపాదుడనే మహారాజు ఉండేవాడు. ఆయనకు సురుచి, సునీతి అనే ఇద్దరు భార్యలున్నారు. వారిలో సునీతికి ధ్రువుడు, సురుచికి ఉత్తముడు అనే కుమారులు కలిగారు. రాజుకు చిన్న భార్య సురుచి అంటే ఎక్కువ ప్రేమ.

ఒకనాడు ధ్రువుడు సురుచి అంతఃపురంలోకి వెళ్ళగా ఉత్తముడు తండ్రి ఒడిలో కూర్చుని ఉండటం చూశాడు. తాను కూడా తండ్రి ఒడిలో కూర్చోవాలనే కోరిక కలిగింది. వెంటనే వెళ్ళి ఒడిలో కూర్చోబోతుండగా సురుచి వచ్చి కిందకి తోసి 'నీవు నా కడుపున పుట్టలేదు. కనుక నీకు తండ్రి ఒడిలో కూర్చునే అర్హత లేదు. నీవు తండ్రి ఒడిలో కూర్చోవాలంటే మరో జన్మలో నా కడుపున పుట్టాలని శ్రీమన్నారాయణుని వేడుకో!' అన్నది.




- ఎల్.వి.వి.వరుణ్,
5వ తరగతి,
పి.సి.ఆర్.(ఇం.మీ.) హై స్కూల్,
పి.కె.లే-అవుట్, తిరుపతి.


ధ్రువుడు తనతల్లి సునీతి వద్దకు వెళ్ళి జరిగింది చెప్పి బాధపడ్డాడు. సునీతి కూడా బాధపడుతూ ఆ శ్రీమన్నారాయణుడి గురించి తపము చేయుమని చెప్పగా; ధ్రువుడు తపము కొరకై వెళ్ళుచుండగా దారిలో నారదుడు కనబడి, 'ఓ ధ్రువా! ఇప్పుడు నీవు చిన్నపిల్లవాడివి, కనుక కొంతకాలముండి పెద్దవాడైన తర్వాత తపము చేయు'మని చెప్పాడు. కాని ధ్రువుడు వినలేదు.

అప్పుడు నారదుడు ధ్రువుని దృఢభక్తికి మెచ్చి 'ఓం నమో నారాయణాయ' అనే మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రాన్నే జపిస్తూ ధ్రువుడు దృఢభక్తి, విశ్వాసాలతో తపస్సు చేయసాగాడు. ఈ తపస్సుకి ముల్లోకాలన్నీ కంపించాయి. అప్పుడు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమైనాడు. అప్పుడు ధ్రువుడు అందరిపైన కరుణ చూపించాలనీ, అందరినీ కాపాడుమనీ ప్రార్థించాడు. ధ్రువుని భక్తికి సంతసించి ధ్రువుని కోరికను మన్నించి 'నక్షత్ర వలయంలో ఉండే గోళాన్ని ధ్రువలోకం అంటారని, అక్కడ ధ్రువుడు నక్షత్రమై ప్రకాశిస్తాడని వరమిచ్చాడు'.

తర్వాత ధ్రువుడు రాజ్యానికి తిరిగి వచ్చి అందరి ప్రశంసలు పొంది తండ్రి తర్వాత అనేక సంవత్సరాలు రాజ్యపాలన చేసి చివరకు ధ్రువలోకాన్ని చేరి నక్షత్రమై ప్రకాశించాడు.

# డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 06-05-2011

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమం ద్వారా భక్తులు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాం.)*

**సెక్యూరిటీ వాళ్ళు లగేజి తనిఖీ చేసేటప్పుడు సమయం ఎక్కువగా తీసుకొంటున్నారు మరియు మాకూ కాలం వృధా అవుతున్నది.** – *దామోదర రెడ్డి, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** సెక్యూరిటీ పెంచేంత వరకు మరియు తనిఖీ చేయుటకు క్రొత్త యంత్రాలు వచ్చేంత వరకు భక్తులు మాతో సహకరించవలసిందిగా కోరు తున్నాము. అవి ఏర్పాటు అయితే మీరు అనుకొన్నట్లు సమయము వృధా అవదు.

**ఉదయాస్తమాన సేవలో గతంలో 6 మందికి అవకాశ ముండేది. అయితే అందులో పేర్కొన్న వాళ్ళలో కొంతమంది చనిపోయి ఉంటారు. కొంతమందికి పెళ్ళి అయ్యి పిల్లలు కలిగి ఉంటారు. మరి వారి గతి ఏమి. చనిపోయిన వారి బదులు వేరేవారిని తీసుకొనివస్తే అనుమతించరు. దీని గురించి వివరణ ఇవ్వండి.** – *రమణారావు, గుడివాడ.*

**కార్యనిర్వహణాధికారి :** ఉదయాస్తమాన సేవ వంశపారం పర్యం కాదు. అందులో పేర్కొన్న వాళ్ళనే పంపిస్తాం. ఇటువంటి ఇబ్బంది చాలామందికి ఉండటం చేత ఒక్క మారు మాత్రమే సడలింపు ఇచ్చాం. ఒక్కమారు 6 మంది పేర్లను మార్పు చేసుకోవచ్చు.

**1. ఉచితగదులు దొరుకుతాయి గాని సౌకర్యాలేవీ ఉండవు. గదులలో పరిశుభ్రత గురించి గమనం పెట్టండి.**

**2. వసతి 24 గంటలు మాత్రమే అని నిబంధన పెట్టడం వల్ల ఆర్జితసేవలు చేసుకొన్న వారికి, కొండపైకి కాలి నడకన వచ్చేవారికి చాలా ఇబ్బందిగా ఉంది. ఏదైనా మార్పు చెయ్యగలరా?** – *శ్రీనివాసులు, బద్వేలు.*

**కార్యనిర్వహణాధికారి : 1.** అలాగే! సంబంధిత వారికి తెలిపి త్వరలో దానిపై ఒక నిర్ణయం తీసుకొంటాం. **2.** సేవా టిక్కెట్లు చూపించిన ఎడల మరొక రోజు వసతి పొడిగించే ఏర్పాటు చేయడమైనది.

**ఆన్‌లైన్‌లో తోమాలసేవ, అర్చన, సుప్రభాతం ఎంత ప్రయ త్నించినా దొరకడంలేదు. రాత్రి 11.45 నుండి 12.15 లోపల రిలీజ్ చేస్తారు. చాలా కష్టంగా ఉంది. Login, Logout సమస్య ఎక్కువగా ఉంది. ఒక మనిషికి ఒక టిక్కెట్టు అంటారు. భార్య, కొడుకు టిక్కెట్లు బుక్ చెయ్యా లంటే అసలే దొరకవు. రూములు, కల్యాణోత్సవములు కూడా ఆన్‌లైన్‌లో దొరకడంలేదు.** – *జయకృష్ణ, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** ఆన్‌లైన్‌లో తక్కువగా కోటా పెట్టడంవల్ల అంతర్జాతీయంగా ఎక్కువమంది ప్రయత్నిం చడంచేత దొరక్కపోవచ్చు. **Login, Logout** విషయంగా ఆలోచిస్తాం. వసతి సౌకర్యాన్ని ఆన్‌లైన్‌లో పెట్టలేదు.

**సుప్రభాతం, తోమాల సేవలకు వెళ్ళునప్పుడు వరుసలో ఉన్నా మమ్ములను అతిక్రమించి, తి.తి.దే. ఉద్యోగులు చాలామందిని తీసుకొని వచ్చి మాముందు నిలబెడతారు. రెండు మూడు గంటలు సక్రమంగా వచ్చి, క్యూలో నిలబడ్డ మాకు చాలా బాధ కలుగుతుంది.** – *విద్య, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** ప్రోటోకాల్‌కు సంబంధించిన వాళ్ళను మా ఉద్యోగులు తీసుకొని వచ్చినప్పుడు మాత్రమే ఈ విధంగా జరగడానికి ఆస్కారం ఉంది.

**ఇటీవల 12 గం॥లకు క్యూలో నిలబడితే 2 గం॥లకు రూ.300/- ల ప్రత్యేక ప్రవేశం టిక్కెట్టు దొరికింది. అయితే సా॥6 గం॥లకు దర్శనం అయ్యింది. దర్శనం ఆలస్యమైనం దుకు చింతించడం లేదు. కనీసం టిక్కెట్టు తీసుకొన్న తర్వాత వీరిని కంపార్టుమెంట్‌లో కూర్చోబెడితే వృద్ధులకు, పిల్లలకు కొంత ఊరట కలుగుతుంది.** – *శంకరం, హైదారాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** ప్రత్యేక ప్రవేశంలో సుమారుగా 2 గం॥ల లోపు దర్శనం అవ్వాలి. అలా జరగడానికి వీలు లేదు. అయినా పరిశీలిస్తాం.

# సంగకాలం - వైష్ణవత్వం

- రాళ్లబండి శ్రీనివాసన్

భగవద్ రామానుజాచార్యుల కాలంలో శ్రీవైష్ణవత్వం బహుళ ప్రజాదరణ పొందింది అని - నాలాయిర దివ్యప్రబంధం విశేషప్రచారం సంతరించుకుంది అని అంటారు పెద్దలు. అది వాస్తవమే. కాని అంతకు పూర్వం కూడా శ్రీవైష్ణవ త్వానికి ఆదరణ విశేషంగా ఉండేదని చరిత్ర చాటుతోంది.

ఒకసారి చరిత్ర పుటల్ని నిశితంగా పరిశీలిస్తే మనం ఆశ్చర్యపోతాం. తమిళనాడులో రాజులు కవిపండితుల్ని ప్రోత్సహించారు, ఆదరించారు, పోషించారు. ఆనాటి రాజులు సాహిత్యాభిమానులని చెప్పటానికి వెలసినదే సాహిత్య పరిషత్తు. దాని పేరు 'సంగం'. క్రీ.పూ. 5వ శతాబ్ది నుంచి క్రీ.శ. 2వ శతాబ్ది వరకు సంగకాలం అని వ్యవహరింపబడింది. ఆ తర్వాత మూడు వందల సంవత్సరాలు జైనబౌద్ధకాలంగా నిర్ణయించారు.

దక్షిణాపథంలో తమిళభాషకు రూపురేఖలుదిద్దిన మహా నుభావుడు అగస్త్యమహర్షి. ఆ భాషలో ఆ కాలంలోనే ఒక వ్యాకరణ గ్రంథం రాశాడట ఆ మహాముని. అది ఇపుడు అల భ్యం. అయితే, 'తొలుకాప్పియం' తమిళ సాహిత్యంలో ప్రప్రథమ గ్రంథంగా చారిత్రక పరిశోధకులు పేర్కొన్నారు. అందులో అద్భుతమైన ప్రకృతి వర్ణనలున్నాయి. పర్వతసానువుల సోయ గాలు ఆకాశంలోని మబ్బుల అందాలు - పంటపొలాల వయ్యారపు కులుకులు ఎంతో విపులంగా వర్ణింపబడ్డాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఆనాటి కవులు ప్రకృతి ఆరాధకులు, సౌందర్యోపాసకులు. అంతేకాదు. భక్తి తత్పరులు కూడ. చరాచరా లన్నింటిలో పరమాత్మని దర్శించి పరవశించిపోయే భక్త శిఖామణులు.

సంగకాలం నాటి కవులు - పొలాలకు, అరణ్య ప్రాంతాలకు, నదీతీర ప్రదేశాలకు - అలా ఒక్కో ప్రాంతానికి ఒక్కో అధిదేవత ఉంటారని భావించారు. పంటపొలాలకు సుబ్ర హ్మణ్యస్వామి (మురుగన్), అరణ్యప్రాంతాలకు నారాయణుడు (తిరుమాలై) అధిదేవతలుగా పేర్కొనబడ్డారు. అలా ఇంద్రుడు వరుణుడు ఎంతోమంది దేవతలున్నా అందరిలో నారాయణుడు విష్ణుమూర్తి గొప్పవాడని ఆ స్వామికి అగ్రస్థానం ఇచ్చారు.

సంగకవులు నారాయణుని 'తిరుమాలై' అని, లక్ష్మీ దేవిని 'పెరియపిరాట్టి' అని పిలిచేవారు. స్వామివారి కన్నా అమ్మవారి అనుగ్రహం చాలా ముఖ్యం అని తలచేవారు. ఆ ఆచారమే శ్రీ సంప్రదాయం! అదే వైష్ణవధర్మం! అని సంగ కాలంలోని సాహిత్యం వల్ల మనకు తెలుస్తోంది. ఆ వైష్ణవ ధర్మాన్ని పన్నిద్దరాళ్వార్లు తమ దివ్యప్రబంధాల్లో విపులంగా విశదీకరించారు.

వేదవేద్యుడు అయిన శ్రీమన్నారాయణుడు, తిరుమాలై లేదా తిరుమాల సృష్టిస్థితిలయాలు తన అధీనంలో ఉంచుకున్న వాడు. నీలమేఘశ్యాముడు, పుండరీకాక్షుడు, పీతకౌశేయ వాసుడు, కౌస్తుభాలంకార భాసితుడు, శంఖచక్రగదా కిరీట కుండల శోభితుడు అని విష్ణుమూర్తిని 'తిరుమాల'ను కీర్తిస్తూ సంగకవులు దశావతారాల్ని కూడా చక్కగా వర్ణించారు. అందులో ముఖ్యంగా త్రివిక్రమరూపాన్ని వేనోళ్ళ కొనియా డారు. ఆ అవతారంలోని విశేషం-ఎలాంటి రక్తపాతం జరుగ లేదు. హింసాకాండకు ఆస్కారం లేదు. శ్రీకృష్ణుడు 'కణ్ణన్' సాక్షాత్తు పరబ్రహ్మ అన్నారు. దశావతారాల్లో ఆ కణ్ణన్‌ను చేర్చ లేదు. ఆనాటి సాహిత్యంలో వైష్ణవధర్మం బహుళ ప్రజాదరణ పొందిందని చెప్పటానికి ఆనాడు వెలసిన విష్ణ్వాలయాలే అందుకు నిదర్శనం.

ప్రళయకాలంలో విష్ణుభగవానుడు వటపత్రశాయియై ఉంటాడని కొందరు కవులు వర్ణించారు. ఆ పరమేశ్వరుని, పర బ్రహ్మని శరణువేడితే కర్మజన్మచక్రబంధం నుంచి విముక్తి పొందవచ్చని వివరించారు. పెరియాళ్వార్లు సాయించిన తిరుప్ప

అక్షరామృతం [33]

ల్లాండు ప్రబంధంలో 11వ పాశురంలో 'తిరుమాలె నానుం వునక్కు పళవడియేన్' (నారాయణా నేను నీ పురాతనదాసుణ్ణి) అన్నాడు. ఆ ఆళ్వార్లు శ్రీవిల్లిపుత్తూరులోని వటపత్రశాయిని సేవించితరించారు. గొల్లకులం వాళ్లని 'ఆయర్' అంటారు. వారి ఇష్టదైవం తిరుమాల స్వామి–మాయోన్–మాయన్ అని కూడా అంటారు. ఆయర్ కులత్తినిల్ తోంద్రం మణి విళక్కై (గొల్ల వంశంలో ప్రకాశించే మణి దీపమైనవాడు తిరుమాల. అంటే నారాయణుడు లేదా కృష్ణుడు) అంటుంది గోదాదేవి తన 'తిరుప్పావై' ప్రబంధంలో.

తిరువనంతపురంలో అనంతపద్మనాభస్వామి కోవెల చాలా ప్రసిద్ధి చెందిన శ్రీ వైష్ణవఆలయం. ఆ స్వామిని మూడు ద్వారాల నుంచి దర్శించి సేవించుకోవాలి. సంఘకాలం నాటి ప్రజలు ఆ స్వామిని కీర్తిస్తూ భక్త్యావేశంతో నృత్యం చేసేవారట. ఆ నృత్యం పేరు 'కురువై'. భాగవతంలోని రాసక్రీడతో సరిపోల్చ దగిన నృత్యం అది. కృష్ణుడు కూడా నప్పిన్న (నీళాదేవి)తో కలిసి నృత్యం చేసేవాడని 'శిలప్పదిగారం' అనే తమిళ గ్రంథం వివరిస్తోంది. 'తిరుక్కురళ్' అని మరొక గ్రంథం. అందులో నారాయణుని కృష్ణునిగా భావించినట్లు విశదమౌతూంది. ఆ కృష్ణుడు 'తామరై కణ్ణన్' కమలదళాయతాక్షుడు అంటారు. బలరాముడు ధవళవర్ణ దేహుడు. కణ్ణన్ మణివణ్ణన్ – నీలమణి కాంతిలాంటి శరీరచ్ఛాయ కలవాడని ఆ స్వామిని తిరుమాలగా ఆరాధించే వారని తిరుక్కురళ్ తెలియజేస్తోంది.

**పిసినారితన ముంటే .. మరొక దుర్గుణం అక్కరలేదు.**

**చాడీకోరుతనముంటే .. వేరే పాపాలతో పని లేదు.**

**సత్యముంటే .. తపస్సు చేయవలసిన అవసరం లేదు.**

**నిర్మలమైన మనస్సుంటే .. తీర్థసేవ లెందుకు?**

**మంచితన ముంటే .. వేరే పరివార మెందుకు?**

**తనలో గొప్పతనముంటే.. మళ్ళీ అలంకారాలెందుకు?**

**మంచి చదువుంటే .. ధన మెందుకు?**

**అపకీర్తి కలిగితే .. ఇంక మరణ మెందుకు?**

తొండరడిప్పొడి ఆళ్వార్లు విప్రనారాయణుడు 'తిరుప్పళి ఎళుచ్చి'తో పాటు 'తిరుమాలై' అనే చిరుప్రబంధం రచించారు. ఆ తిరుమాలైలో 45 పాశురాలు ఉన్నాయి. జీవుడు దేవునికి శేషభూతుడని ఆళ్వార్లు వివరించారు. అలా పన్నిద్దరాళ్వార్లు 'తిరుమాల'ను (విష్ణువును) అద్భుతంగా గానం చేశారు. వారు పాడిన పాశురాలన్నీ నాలాయిర దివ్యప్రబంధంగా ప్రసిద్ధి పొందాయి. ఆ నాలుగు వేల పాశురాలను బహుళ ప్రచారం చేసిన, చేయించిన ఘనకీర్తి భగవత్ రామానుజాచార్యులవారికే దక్కుతుంది.

సంగకాలంలోనే ఆర్యద్రావిడ సంస్కృతి సంప్రదాయాలు బాగా కలిసిపోయాయని చరిత్రకారుల అభిప్రాయం. తొలుకాప్పియం తర్వాత సాహిత్యంలో వైదిక దేవతల ప్రస్తావన అధికంగా ఉంది. సంగోత్తర కాలంలో కూడా ఆర్యద్రావిడ దేవతల వర్ణనలు ఇంచుమించు ఒకే పోలికలో ఉన్నాయని పండితాభిప్రాయం.

వైష్ణవధర్మంలో అకించనత్వానికి విశేషప్రాధాన్యం ఇచ్చారు. 'అమర్యాదః క్షుద్రః చలమతిః....' అంటూ తన అకించనత్వాన్ని యామునాచార్యులవారు స్తోత్రరత్నమనే తన మహోత్తమగ్రంథంలో సవినయంగా వివరించారు. 'తిరుమాలను అకించనుడనైన నేనెలా వర్ణించగలను. ఏదైనా వర్ణించివుంటే ఆ పెరుమాళ్ల కరుణాకటాక్షవీక్షణాలు నీ మీద ప్రసరించి ఉండాలని' సంగకాలం నాటి ఓ కవి తెలియజేశాడు. అది ఆ మహాకవి తాత్వికుని వినయవిధేయతలకు చిహ్నాలు. పన్నెండు మంది ఆళ్వారులలో ప్రధానంగా ఆరాధించే నమ్మాళ్వార్లు కూడా తన అకించనత్వాన్ని ప్రపత్తిని 'తిరువాయ్‌మొళి' ప్రబంధంలో పేర్కొన్నాడు.

ఏతావాతా సంగకాలం నుంచి నేటివరకు వైష్ణవధర్మం ప్రజాదరణ పొందుతోంది. అనేక వైష్ణవాలయాల్లో ఆళ్వార్ల దివ్యప్రబంధాలు ఆయా సముచిత విశేషపర్వదినాల్లో గానం చేయబడుతూ ఉన్నాయి. అందరిలోనే కాకుండా సకల జీవ రాశిలో ఆ పరమాత్ముని చూడగలవాడు వైష్ణవుడని పిలువబడతాడు. ఇష్టదైవాన్ని ఆరాధిస్తూ ఇతర దేవతలను ఆదరించే వాడు వైష్ణవుడని చెప్పబడతాడు.

# స్తోత్ర రత్నం - నిత్యసూరుల నిత్యసేవలు

- రేబల్లి వేంకటేశ్వర్లు

యా మునాచార్యులు శ్రీ వైష్ణవమతానికి మూలపురుషులైన శ్రీనాథమునుల మనుమడు. శ్రీ భగవద్రామానుజులకు పరోక్ష గురువులు. తాతగారి ఆదేశాన్ననుసరించి తనకు లభించిన రాజ్యభోగాలను త్యజించి శ్రీరంగనాథుని పాదములే మహానిధియని తలచి సన్యసించి, శ్రీ వైష్ణవ సిద్ధాంత స్థాపకులై, ప్రవర్తకులై కాలం గడిపారు. వీరు సిద్ధాంతత్రయం, మహాపురుషనిర్ణయం, ఆగమప్రామాణ్యం, గీతార్థ సంగ్రహరక్ష, స్తోత్రరత్నం, చతుశ్శ్లోకి అనే గ్రంథాల్ని ప్రసాదించారు.

అరవై అయిదు శ్లోకాలుగల సంస్కృత గ్రంథం స్తోత్ర రత్నం. ఇందు ఆచార్యప్రాధాన్యాన్ని, భగవద్గుణానుభవాన్ని వివరించారు. భగవంతుణ్ణి స్తుతించి ప్రసన్నుణ్ణి చేసుకోవాలని యామున మునీంద్రుల ఆర్తి ఇందులో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. పరమపదమున నిత్యసూరులు శ్రియఃపతిని సేవించిన తీరుకు వీరు ఆకర్షితులై తాను వారివలె స్వామిని సేవించి సంతోషపెట్టాలనుకున్న ఆచార్యుల ఆకాంక్షను స్తోత్రరత్నంలో పరిశీలించవచ్చు.

## నిత్యసూరులు (43 శ్లో)

**శ్లో॥ హతాఖిల క్లేశమలైః స్వభావతః**
**సదాऽऽనుకూల్యైకరసైస్తవోచితైః ।**
**గృహీతతత్తత్పరిచారసాధనైః**
**నిషేవ్యమాణం సచివై ర్యథోచితమ్ ॥**

స్వతస్సిద్ధంగా అహంకార, అనురాగ ద్వేషాదులన్నీ నశించినవారు, స్వామికైంకర్యములే పరమభోగంగా గలవారు, కైంకర్య సాధనాలైన ఛత్రచామరాదులను హస్తాలందు ధరించిన వారు, మంత్రులవలె సమయానుకూలంగా స్వామి అభీష్టానికి తగినట్లు పరమపదమున దాస్యం చేయువారు నిత్యసూరులని పై శ్లోకం తెలుపుతున్నది.

శ్రియఃపతి (అంతరంగ) దాస్యం భక్తునకు మనః ప్రశాంతత కలిగిస్తుందనడానికి నిత్యసూరులు మనకు ఆదర్శమని ఆచార్యులు ప్రబోధిస్తున్నారు.

## ఆదిశేషుడు (39-40 శ్లోకాలు)

**శ్లో॥ తయా సహాసీన మనంత భోగిని**
**ప్రకృష్ట విజ్ఞాన బలైకధామని ।**
**ఫణామణివ్రాత మయూఖ మండల -**
**ప్రకాశమానోదర దివ్యధామని ॥**

**శ్లో॥ నివాసశయ్యాసనపాదుకాంశుకో -**
**పధానవర్షాతపవారణాదిభిః ।**
**శరీర భేదైస్తవ శేషతాం గతైః**
**యథోచితం శేష ఇతీరితో జనైః ॥**

కశ్యప ప్రజాపతి కద్రువుల సంతానంలో ఆదిశేషుడు పెద్దవాడు. ఇతడినే అనంతుడని కూడ అంటారు. పినతల్లి వినతకు, తల్లి తలపెట్టిన అక్రమానికి ఇతడు సహకరించనందున సర్పయాగంలో మరణింపుమని శపింపబడ్డాడు. ఈ శాప నివృత్తికై గంధమాదన, బదరి, గోకర్ణాది క్షేత్రాలలో బ్రహ్మానుగ్రహం కోసం ఇతడు తపమాచరించాడు. బ్రహ్మ ఆతని తపస్సుకు మెచ్చి పరమపదమున శ్రీమహావిష్ణువుకు నిరంతర దాస్యం చేసేటట్లు వరమొసంగాడు. లక్ష్మణుడుగా, బలరాముడుగా లీలావిభూతులలో అనంతుడు దాస్యం చేసినట్లు రామాయణ, భారతాలు తెలుపుతున్నాయి.

ఉభయవిభూతుల్లో ఆదిశేషుని నిత్యకైంకర్యాలను పూర్వాచార్యులు హృద్యముగ తెలిపిన వివరాలు పై శ్లోకాలలో గమనించవచ్చు. లక్ష్మీదేవితో కూడి నారాయణుడు ఆసీనుడగు మహావైభవము కలవాడు, తన పడగల యందలి మణులచే ప్రకాశించు శరీర మధ్యభాగాన్ని భగవంతునకు యోగ్యమైన కోవెలగ మలచినవాడు, స్వామి నివాసానికి గృహంగా, శయనించే పడకగా, పాదాలకు పాదుకలుగ, ధరించే వస్త్రంగా, కూచొను సింహాసనంగా, తలకు దిండుగా, ఎండవానలకుపయో

గపడు ఛత్రంగా శేషుడు ఆయా సమయాలకు తగిన శరీర ఆకారాలతో శేషవృత్తుల్ని చేస్తూ అన్వర్థ నామధేయుడైనాడు.

## విష్వక్సేనుడు (42 శ్లో)

నిత్యసూరులలో విశిష్టకైంకర్యపరుడైన విష్వక్సేనుడు వైకుంఠ సేనానాయకుడు. విష్వక్సేనుడనగా రక్షకుడని అర్థం. ఉభయవిభూతుల రక్షణ బాధ్యత కలవాడగుటచే ఇతడు విష్వక్సేనుడనే పేరుతో వ్యవహరింపబడుతున్నాడు. విష్వక్సేనుల సేవలకు సంతోషించి పరమాత్మ "ప్రియేణ" అని సంబోధించిన తీరు ఆచార్యుల మాటలలో విందాం.

**శ్లో॥ త్వదీయభుక్తోజ్ఝిత శేషభోజినా**
**త్వయా నిసృష్టాత్మ భరేణ యద్యథా ।**
**ప్రియేణ సేనాపతినా న్యవేది త**
**త్తథాఽనుజానంత ముదారవీక్షణైః ॥**

పరమపదంలో శ్రీమహావిష్ణువు శేషభోజనాన్ని భుజించు యోగ్యత కలవాడు విష్వక్సేనుడు. కావున, ఆయనకు శేషభోజనుడనే తిరునామమున్నట్లు శ్లోకం మొదటి పాదంలో తెలిపారు. భగవానుడు ఉభయవిభూతుల రక్షణ బాధ్యత విష్వక్సేనుల యందుంచి తాను నిర్విచారంగా తన దేవేరులతో ఉన్నట్లు రెండవ పాదంలో విష్వక్సేనుని ప్రశంసించారు.

## గరుత్మంతుడు (41 శ్లో)

గరుత్మంతుడు పక్షిరాజు. ఇతడు కశ్యపప్రజాపతి వినతల పుత్రుడు. వినత కొడుకు కాబట్టి ఇతడు వైనతేయుడని కూడ పిలువబడ్డాడు. ఇతని రెక్కల గట్టితనం వల్ల సువర్ణపక్షుడని కూడ వ్యవహరింపబడ్డాడు. ఇంద్రుణ్ణి ఓడించి అమృతం తెచ్చి తల్లిని దాస్యవిముక్తురాల్ని చేసిన మాతృభక్తుడితడు. పరమపదమున గరుత్మంతుడు తన శరీరాన్ని సమయానుకూలంగా వినియోగించి వాహనాది సేవలతో శ్రీమన్నారాయణుని ప్రసన్నం చేసుకొన్న విశిష్టతను ఆచార్యుల శ్లోకంలో పరిశీలిద్దాం.

**శ్లో॥ దాస స్సఖా వాహన మాసనం ధ్వజః**
**యస్తే వితానం వ్యజనం త్రయీమయః ।**
**ఉపస్థితం తేన పురో గరుత్మతా**
**త్వదంఘ్రిసమ్మర్ద కిణాంకశోభినా ॥**

దాసుడై, స్నేహితుడై, వాహనమై, ఆసనమై, ధ్వజమై, విసనకఱ్ఱగా అనేక ఆకారాలుగా తన శరీరాన్ని మలచి శ్రియఃపతికి సమయానుకూల నిత్యదాస్యం చేసే "పెరియతిరువడి" గరుడుని వేదమూర్తి అని మొదటి రెండు పాదాలలో వర్ణించారు. భక్తులైన గజేంద్రాదులను రక్షించుటకు వెళ్ళేటప్పుడు వాహనమైన గరుడుని స్వామి తన పాదములతో పలుసార్లు తాకగా దేహముపై ఏర్పడిన కాయలు దాస్యమునకు గుర్తుగా అతనికి శోభనిచ్చుచున్నవని తర్వాతి రెండు పాదాలలో తెలిపారు.

శయ్య, ఆసన, చామర, ఛత్రాది పరికరాలుగా; దాస, సఖ, సేనాన్యాది నియమిత కర్మలందు కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానాలు లేని సేవలందించడం, స్వామి ఉదార వీక్షణకు, ప్రియమైన సంబోధనకు నోచుకున్న ధన్యాత్ములు నిత్యసూరులు. నిత్యసూరుల నిత్యసేవలను ఇంత వివరంగా అందించినవారు యామునాచార్యులొకరే ననుట అతిశయోక్తి కాదు.

## శరణాగతి (46 శ్లో)

**శ్లో॥ భవన్త మేవానుచరన్నిరంతరం,**
**ప్రశాంత నిశ్శేషమనోరథాంతరః ।**
**కదాహమైకాంతిక నిత్యకింకరః,**
**ప్రహర్షయిష్యామి సనాథజీవితః ॥**

"పరమాత్మయే కైంకర్యము చేయించుకొనును. దానిని అనుభవించువాడు అతడే. ఆయన ప్రీతి కొరకే నా చేత కైంకర్యము చేయించుకొనును. తన (భక్తుని) ఆనందము కొరకు గాదు" అను శేషత్వభావనతో యామునాచార్యులు స్తోత్రరత్నాన్ని సాయించి, తన ప్రపన్నత్వము ప్రకటించుకొన్నారు.

నిత్యసూరుల భగవద్గుణానుభవము, కైంకర్యనిష్ఠ, శరణాగతతత్త్వమును పలు స్తోత్రాలతో సాయించి గ్రంథాన్ని స్తోత్రరత్నంగా మలచారు. శ్రీవైష్ణవ సిద్ధాంతస్థాపకులై, పలు గ్రంథాలద్వారా శ్రీవైష్ణవ సమాజానికి మార్గదర్శకులైన యామునాచార్యులు ప్రాతఃస్మరణీయులు.

# వ్యాసపౌర్ణమి

\- డి.వి.రామచంద్రరావు

**వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమకల్మషం**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం**

వసిష్ఠుని మునిమనుమడు, శక్తి మనుమడు, పరాశరుని కుమారుడు, శుకుని తండ్రి, తపోనిధి అయిన వ్యాసునికి నమస్కారం అని పై శ్లోక భావం. వ్యాసుని తండ్రి తాత ముత్తాతలతో పాటు ఆయన కుమారుడు శుకుని కూడా స్మరించుట గమనార్హం. వేదవిభజనతో మొదలుపెట్టి శ్రీ మహావిష్ణుమూర్తిపై భక్తి ప్రధానంగా ముగించిన భాగవత రచన ధర్మాధర్మ వివేచనకు ప్రాధాన్యమొసగి అంత మొందింది. నిశ్చల తపోధనుడైన శుకుని పుత్రునిగా పొందటంతో వ్యాసుని ఆధ్యాత్మిక వ్యక్తిత్వం సంపూర్ణత సంతరించు కొంది. అంతిమలక్ష్యం మోక్షంగా కలవానికి ధర్మం ఉపకరించే సాధనమే గాని వేరుగాదు.

ద్వాపరయుగంలో పరాశర సత్యవతులకు జన్మించిన పుత్రుడు వ్యాసుడు. నారాయణునికి జన్మించిన మానస పుత్రుడు. అతని అసలు పేరు అపాంతరతముడనగా లోపల నున్న చీకటిని (అజ్ఞానాన్ని) పోగొట్టుకొనినవాడు అని



అర్థం. బ్రహ్మముఖం నుండి వెలువడిన వేదాలను శ్రద్ధగా విని విభజించుమని నారాయణుని ఆదేశం. ఎంతో నేర్పుగా బాగుగా నెరవేర్చిన వేదవిభజనకు మెచ్చి ఆతనికి వేదవ్యాసుడనే బిరుదును బహూకరించాడు. బిరుదులోనే పదవీ గౌరవం సూచితమైంది. ప్రతి ద్వాపరయుగంలోనూ వేదవిభజన జరుగుతూనే ఉంటుంది. ప్రథమ ద్వాపరంలో స్వయంభువు; ద్వితీయ ద్వాపరంలో ప్రజాపతి; తృతీయ ద్వాపరంలో శుక్రుడు; ఆ తర్వాత బృహస్పతి; వసిష్ఠుడు, త్రివర్ముడు మొదలగువారు వ్యాస పదవిని అలంకరించారు. చివరి ద్వాపరంలో కృష్ణద్వైపాయనుడు తన శిష్యులైన పైలుడు, జైమిని, సుమంతుడు, వైశంపాయనుల ద్వారా వేదాలను ప్రపంచంలోని వారికందరికీ అందించాడు. బ్రహ్మాండపురాణంలో వ్యాసపూర్ణిమ ప్రాముఖ్యతను తెలియచేసే కథను నారదుడు వైశంపాయనునికి చెప్పాడు.

పూర్వం కాశీపట్టణంలో వేదనిధి, వేదవతియను నిరుపేద దంపతులుండేవారు. ఎంతకాలానికీ వాళ్ళకు సంతానం కలగక పోవడం వల్ల వాళ్ళు వ్యాసమహర్షి స్నానం నిమిత్తమై గంగానదికి వచ్చినప్పుడు, ఆ మహర్షిని దర్శించుకొని, పాదాక్రాంతులైనారు. వ్యాసమహర్షి ఎండ కోర్వలేని వారిని నిర్లక్ష్యంగా పొమ్మన్నా కూడా, పట్టుదలగా అచ్చటనేనున్న వారిని చూచి మెచ్చుకొని 'ఏమి కావాలి' అని అడిగారు. అందుకు వారు రేపటిరోజు తన తండ్రి శ్రాద్ధకర్మ అనీ, అందుకు బ్రాహ్మణునిగా వ్యాసమహర్షిని రమ్మనీ వేదనిధి కోరగా, తాను వ్యాసుడనని ఎవరికీ తెలియనివ్వక రహస్యంగా నుంచు మనే అంగీకారంపై వస్తానని తెలిపాడు. వేదనిధి దంపతులు, శుచిగా రుచిగా చేసిన వంటకాలన్నీ ఆరగించి, భిక్షుక వేషంలోనున్న వ్యాసుడు వారి భక్తికి మెచ్చి, వారికి సకల సద్గుణసంపన్నులు, ఐశ్వర్యవంతులు అయిన పదిమంది కుమారులు కలుగుతారని దీవించాడు. అలాగే ఆషాఢశుద్ధపౌర్ణమి రోజు వ్యాసపూజ జరిపే పురోహితులందరూ తన ప్రతిరూపాలేనంటూ; యథాశక్తి వారిని గౌరవించిన తనయనుగ్రహము తప్పక లభిస్తుందని వ్యాసుల వారు వేదనిధికి చెప్పారు.

గ్రంథసమీక్ష

## ఆచార్య హృదయ చంద్రిక

(**రచన :** 'ఆదర్శాచార్య' చిత్రకవి ఆత్రేయ; **పుటలు:** 150 పేజీలు; **వెల :** అమూల్యం/–; **సైజు :** 1/8 డెమ్మి సైజు; **ప్రాప్తిస్థానం:**సత్ సంప్రదాయ పరిషత్, 555, గీత్ శ్రీ, 9 మెయిన్, 12 క్రాస్, జె.పి.నగర్–2, బెంగళూరు–560 078.)

పరమహంస పరివ్రాజకాచార్యులు, శ్రీ రామానుజుల ప్రతినిధులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయరు స్వామివారు స్థాపించిన 'శరణ్య' పత్రికలో పదునాలుగు సంవత్సరాల పాటు సంపాదకీయ వ్యాసాలుగా, ప్రతినెల వరుసగా ఆళ్వాచార్యుల కథలు, వకుళాభరణ నాయకి, సత్‌సంప్రదాయ సంగతులు శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారి కటాక్షముతో వెలుగు చూశాయి. సరళభాషలో, వ్యావహారిక శైలిలో, సామాన్యులకు కూడా అర్థమయ్యే రీతిలో ఈ ఆచార్య హృదయచంద్రిక రాయబడింది. శ్రీమణవాళ మహాముని, వేదాంతవాచస్పతి కందాడై శేషాచార్యుల తోడ్పాటుతో, చిత్రకవి ఆత్రేయ ఆంధ్రీకరించారు.

ఈ గ్రంథంలో పద్దెనిమిది అధ్యాయాలున్నాయి. ఆచార్య హృదయం, ఐతిహ్యాలు, పరకారుణ్యమూర్తి, శ్రియఃపతి, అష్టాక్షరీ మంత్రవైభవం, ఆళ్వారుల భక్తి స్వరూపం, శ్రీ నమ్మాళ్వారుల వైలక్షణ్యం, దివ్యప్రబంధాలలో స్వాపదేశార్థాలు, దివ్యదేశాలలో స్వామిగుణాలు, భగవద్గీత–తిరువాయ్‌మొళి, ఆళ్వార్ల ప్రబంధాలు–రహస్యత్రయైక్యము, పది పత్తులు– పది అవతారాలు, తిరువాయ్‌మొళి మొదటి నుండి పదవపత్తు వరకు సారాంశాలు, ఆచార్య హృదయచంద్రిక–విశిష్ట అనుబంధం అనునవి ఇందులో గుదిగుచ్చబడిన అధ్యాయాలు. ఈ గ్రంథంలో ప్రస్తావించబడ్డ అంశాలు అన్నీ రసఘనాలు. వ్యాఖ్యాన సాపేక్షాలు, సదాచార్యుల సన్నిధిలో మాత్రమే గ్రహించడానికి సాధ్యాలు. వీటిలో దివ్యదేశాల అర్చామూర్తులలో ప్రకాశించే గుణాన్ని గూర్చిన విషయంలోని ఏకదేశాన్ని మాత్రం ఇందులో చిత్రకవి ఆత్రేయ చిత్రించారు. తమిళభాషలో ఎక్కువ పరిచయం లేని, ఆచార్య హృదయాన్ని కాలక్షేపం చేయాలనే ఆశ కలిగినవారికి ఈ గ్రంథం తప్పక ఒక కరదీపిక అనడంలో సందేహం లేదు. **– డి.సరళ**

## కదంబమాల

### (నిత్యము పఠింపదగిన స్తోత్రములు)

(**సేకరణ–ప్రచురణ–సమర్పణ:** శ్రీమతి పేర్వాల శాంత; **పుటలు:** 64; **సైజు:** 1/8 డెమ్మి సైజు; **ప్రాప్తిస్థానం:** శ్రీమతి పేర్వాల శాంత, శాంతినిలయం, 3–3–839/1, కుత్బిగూడ, హైదరాబాదు – 500 027.)

దైవప్రేరణతోనే సమస్త జీవరాశులన్నీ మనుగడ సాగిస్తున్నాయన్నది మన ప్రగాఢ విశ్వాసము. శివునాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదంటారు పెద్దలు. సృష్టి స్థితి లయలకు భగవంతుని విభూతులే కారణమని అందరి నమ్మకం. మనము ఉదయం నిద్రలేచింది మొదలు తిరిగి నిద్రపోయేంత వరకు దినచర్యలో భాగంగా ఏవేవో కార్యకలాపాలు నిర్వహిస్తుంటాము. ఆ కారణంగా ఏవేవో విఘ్నాలు కలగవచ్చు, ఎన్నో ఆటుపోటులు ఎదురుకావచ్చు. వాటి నుండి మనలను తప్పించి హాయిగా ఉండుటకు దైవసహాయము అవసరం. రోజులో 24 గంటల కాలంలో మనం ఎన్నో పనులు చేస్తుంటాము. అందులో మనకు జన్మను ప్రసాదించిన దైవాన్ని స్మరించుటకు, ప్రార్థించుటకు కొంత సమయం కేటాయించుకోవాలి. ఆ సమయంలో మన ఇష్టదైవాన్ని ప్రార్థించాలి. ప్రతి దేవతను ప్రార్థించుటకు మన పెద్దలు కొన్ని స్తోత్రాలు రాశారు. వాటిని అత్యంత నిష్ఠతో పఠించాలి. ఇటువంటి స్తోత్రాలను శ్రీమతి పేర్వాల శాంత గారు సేకరించి చిన్న గ్రంథంగా మనకందించారు. ఇందులో గురుస్తుతి, వినాయక స్తోత్రము, లింగాష్టకము, ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము, శివస్తోత్రము, రామస్తోత్రము, కృష్ణ స్తోత్రము, నారాయణ స్తుతి, ఆంజనేయ స్తోత్రము, మృత్యుంజయ మంత్రము, మాతృవందనము, పితృవందనము, నిద్రపోవునపుడు లేచునపుడు చదువు మంత్రాలు, తులసి మంత్రము వంటివి నలభై స్తోత్రాలున్నాయి.

దళసరి కాగితంపైన ముద్రారాక్షసాలు లేకుండా స్పష్టమైన అక్షరాలతో చక్కగా ముద్రించారు. ఈ స్తోత్ర కదంబమాల ప్రతి ఇంట పూజామందిరంలో ఉండదగినది. ఇన్ని స్తోత్రాలు సేకరించి సమర్పించిన రచయిత్రి కృషి బహుధా ప్రశంసనీయము. **– డా॥ కె.రెడ్డెప్ప**

## శ్రీపదకేళి - 24 (మే - 2011)
## విజేతలు

1) **ఎం.పార్థసారధి ఆచార్యులు,**
ఇంటి నెం.14-3-134,
మట్టెవాడ,
వరంగల్ - 506 002.

2) **మేరువ శ్రీదేవి,**
W/o సుబ్రహ్మణ్యం,
ఇంటి నెం.10-466 ఎ,
మహాత్మాగాంధీరోడ్డు,
రైల్వేకోడూరు, కడప జిల్లా.

3) **ఆర్.వి.సిహెచ్.నాగేశ్వరరావు,**
ప్రైవేట్ మెడికల్ ప్రాక్టీషనర్,
O/o చౌదరి మెడికల్స్, జి.టి.రోడ్డు,
శ్రీకాకుళం - 532 001.

**సరైన సమాధానాలు రాసినవారు :**

తిరునగరి కేశవదాసు(గుంటూరు); జే.సామ్రాజ్యలక్ష్మి(తిరుపతి); ఈమని గృహలక్ష్మి(తెనాలి); పి.భానులక్ష్మికుమారి(తెనాలి); వల్లభజోస్యుల జలజ (గుంటూరు); జి.కృష్ణమూర్తి(తెర్లాం); పూటుకూరి రామయ్య (మార్కాపురం); నేమానసుభాష్‌చంద్ర (శ్రీకాకుళం); నేమాన వి.సత్యనారాయణ(శ్రీకాకుళం); నేమానకమల (శ్రీకాకుళం); బందారమా శ్రీనివాస్(ఒంగోలు); తిన్నవెళ్ళి నరసింహారావు (మార్కాపురం); ముత్తారెడ్డి వెంగళరెడ్డి(మార్కాపురం); వనమాల రామలింగాచారి(యాదగిరిగుట్ట); భాగవతం విశ్వనాథరావు(హైదరాబాదు); వి.వి.మునిరుద్ర తేజస్వి (ప్రొద్దుటూరు); కే.విఘ్నేష్ బాబు (ఒంగోలు); వంగవేటి వెంకటేశ్వర్లు (బేతవోలు); లక్ష్మీరామకూరు(శ్రీకాకుళం); నల్లపాటి రామకృష్ణ (గుంటూరు); కె.తిరుమలాచార్యులు(ఒంగోలు); అక్షింతల సంజీవశర్మ(అనంతపురం); నారాయణం మోహనలక్ష్మి (సంగం జాగార్ల మూడి); మునిగోటి జయశ్రీ (తిరుపతి); వేదాన్తం శ్రీనాథ్ (తెనాలి); జి.అనంత పద్మనాభయ్య (అనంతపురం); జె.వి.నాగభూషణరావు (అనంతపురం); ఎస్.శ్రీరామమూర్తి (అనంతపురం); దీవి సీతారామాచార్యులు (తెనాలి); కే.శివనాగేంద్రమ్మ (ఒంగోలు); కె.ఆనందపిళ్ళై (చిత్తూరు); కె.రామ సుబ్బయ్య (ప్రొద్దుటూరు); ఎ.సుబ్బారావు (గుంటూరు);



### నిబంధనలు :

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానెంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా ఈ శీర్షికలో పాల్గొనవచ్చు.

### బహుమతి వివరాలు :

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాం. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాం.

### పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| 1 | ■ | 2 | ■ | 3 | | 4 | | ■ |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | | | | ■ | ■ | | ■ | 6 |
| | ■ | | ■ | 7 | ■ | | ■ | |
| | ■ | ■ | ■ | | ■ | | ■ | |
| ■ | 8 | ■ | ■ | | ■ | | ■ | |
| 9 | | | | | ■ | | ■ | |
| ■ | | ■ | ■ | | ■ | | ■ | |
| ■ | | ■ | 10 | ■ | 11 | | | |
| ■ | | ■ | | ■ | | ■ | ■ | ■ |

# శ్రీపదకేళి - 26

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................

..................................................

..................................................

..................................................

..................................................

**2) మీరు సప్తగిరి చందాదారులైతే?**

అ) చందా నెంబరు : ..................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ..................................

..................................................

..................................................

..................................................

..................................................

**ఆధారాలు**

**అడ్డం**

**3)** పాండవులు అరణ్యవాసం చేస్తుండగా సుయోధనుడు తన మిత్రులతో జరిపిన యాత్ర (4)

**5)** విక్రమాదిత్యుని ఆస్థానంలోనున్న నవరత్నాల్లో ఒకడు (4)

**9)** గణపతిదేవ చక్రవర్తి కుమార్తె (5)

**11)** సుఖాన్ని కలిగించేవాడు శివుడు (4)

**నిలువు**

**1)** పాలసముద్రాన్ని మథించినపుడు దేవతలకు సహకరించిన వారు (4)

**2)** ఇతణ్ణి సంహరించుట వల్ల ఇంద్రునికి పాకశాసనుడను పేరు కల్గింది (3)

**4)** మదనాభి రాముడను రాజు కుమార్తె, బిల్హణుని భార్య (8)

**6)** జనమేజయుని మనుమడు. శతానీకుని కుమారుడు (7)

**7)** యమధర్మరాజుని జయించి తన భర్తను దక్కించుకున్న స్త్రీ (5)

**8)** నందుని దాసీపుత్రుడైన మౌర్యుని పుత్రుడు (5)

**10)** శర్మిష్ఠ యందు యయాతికి పుట్టిన కుమారుడు (2)

**11)** మెఋపు (2)

## —:: *శ్రీపదకేళి-24 (మే, 2011) సమాధానాలు* ::—

| 1 క | ణ్వు | డు | ■ | ■ | 2 అ | వం | తి | ■ |
|---|---|---|---|---|---|---|---|---|
| ణి | ■ | ■ | 3 ది | ■ | వ | ■ | ■ | 4 వ |
| 5 కు | ము | ద్వ | తి | ■ | క్రీ | ■ | 6 వై | శ్య |
| డు | ■ | ■ | ■ | ■ | తు | ■ | ■ | ము |
| ■ | 7 ఏ | క | 8 ల | వ్యు | డు | ■ | ■ | ■ |
| 9 శౌ | ■ | ■ | క్ష | ■ | ■ | ■ | ■ | ■ |
| ష్క | ■ | ■ | ణ | ■ | 10 సాం | దీ | పు | డు |
| 11 లు | బ్ధ | డు | ■ | ■ | ఋ | ■ | ■ | ■ |
| డు | ■ | ■ | 12 అ | క్షు | డు | ■ | 13 కా | ళి |

**—— సరైన సమాధానాలు రాసిన వారి పేర్లు మరికొన్ని ——**

చెన్నా వేంకటేశ్వర్లు(ప్రొద్దుటూరు); డా॥సి.వి.కే.వై.శర్మ(గుంటూరు); ఇ.శ్యామసుందర్ రాజ్యలక్ష్మి (హైదరాబాదు); దేవరాజు వెంకట నరసింహారావు (హైదరాబాదు); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); గుర్రం విశ్వం (ప్రొద్దుటూరు).



# జూలై 2011
# రాశి ఫలాలు



– జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ మాసంలో వీరికి అనారోగ్య సమస్యలు ఏర్పడవచ్చు. చిన్నపిల్లల ఆరోగ్యం కోసం ధనం ఖర్చు చేయటం వల్ల ఆర్థిక ఇబ్బందులు కల్గుతాయి. సుదీర్ఘకాలంగా ఉన్న కోర్టు పనులు పూర్తవుతాయి. సినీతారలకు, దర్శకులకు, రచయితలకు, వ్యవ సాయదారులకు గడ్డుకాలం. రాజకీయ నాయకులకు పదవీ యోగం. మొదటివారం అనారోగ్యం, రెండోవారం క్షేత్రదర్శనం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం వృథాశ్రమ.



## వృషభ రాశి

స్థిరాస్తులు, ఆభరణాలను కొనుగోలు చేస్తారు. తల్లి దండ్రుల ఆదరణ వల్ల వివాహ, ఉద్యోగ ప్రయత్నాలు విజయం. పత్రికా రచయితలకు, వెండి, బంగారు వర్తకులకు, వృత్తి ఉద్యో గులకు అదృష్టకాలం. మహిళా రాజకీయ నాయకులకు పదవీ యోగం. దైవచింతనకు చేయు ప్రయాణాలు మానసికానం దాన్నిస్తాయి. మొదటివారం ధనయోగం, రెండోవారం ఆనందం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం విజయం.



## మిథున రాశి

ఉన్నత విద్యలు, విదేశీయానం, వస్తుసేకరణ, దూరపు బంధువుల కలయిక వల్ల మానసికానందం. చేతి వృత్తుల వారికి, మహిళలకు, ఉద్యోగులకు, ఆందోళనలు ఎక్కువ. శ్రమకు తగ్గ ఫలితం, గుర్తింపు లభించినా పరిపూర్ణత ఉండదు. రైతులు అధికంగా శ్రమించాలి. ఇంట్లో విలువైన వస్తువులు పోయే ఆస్కారం ఉంది. జాగ్రత్త వహించగలరు. మొదటివారం దైవదర్శనం, రెండోవారం ధనాదాయం, మూడోవారం జయం, నాలుగోవారం వృథాశ్రమ.



## కర్కాటక రాశి

వృత్తివ్యాపారాల్లో అధికశ్రమ. వ్యవసాయాభివృద్ధికి, ఫలాసాయానికి చేయు ప్రయత్నాలు మధ్యలో నిలిచిపోతాయి. దీర్ఘకాలికంగా ఉన్న వివాహ, ఉద్యోగ ప్రయత్నాలు ఓ కొలిక్కి వస్తాయి. చిట్‌ఫండ్, భీమారంగం, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు గడ్డుకాలం. సంగీతం, నృత్యం, జానపదం, టి.వి. చిత్రకళాకారు లకు ఆకస్మిక ధనప్రాప్తి, సన్మానాలు. రాజకీయ ప్రముఖులకు, మహిళలకు ఉన్నత పదవీయోగం. విద్యార్థులకు శుభవార్తా శ్రవణం. మొదటివారం ఆనందం, రెండోవారం సన్మానాలు, మూడోవారం పదవీప్రాప్తి, నాలుగోవారం కార్యజయం.



## సింహ రాశి

ఈ రాశివారికి ప్రతిపనికీ ఆటంకాలు ఎదురై పూర్తవు తాయి. మాట పట్టింపుల వల్ల సోదరీసోదరులకు గొడవలు. నూతన వస్తు, భూ, ఆభరణాల కొనుగోలుకు విపరీతంగా ధనం ఖర్చు చేస్తారు. ఉద్యోగులు ఎంతో శ్రమించాల్సి వస్తుంది. నమ్మిన వ్యక్తుల వల్ల చేయు వ్యాపారాల్లో కష్టనష్టాలు ఏర్పడుతాయి. ఇంట్లో తల్లిదండ్రుల అనారోగ్యంకై ధనం ఖర్చు చేయవలసి వస్తుంది. అప్పులు చేయక తప్పదు. జాగ్రత్తగా వ్యవహరిం చండి. మొదటివారం ధనం ఖర్చు, రెండోవారం అనారోగ్యం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం కార్యజయం.



## కన్యా రాశి

ఈ మాసంలో ఈ రాశివారికి నూతన వ్యక్తుల పరి చయం. వస్తువుల కొనుగోలు అనుకూలం. గృహంలో జరిగే శుభకార్యం వల్ల మానసికానందం కల్గుతుంది. చిన్ననాటి మిత్రుల రాక సంతోషాన్నిస్తుంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు స్థానచలనం, ప్రమోషన్లు. మహిళా రాజకీయ నాయకులకు అనుకూలం. క్షేత్రదర్శనంకై చేయు ప్రయత్నాలు

మేలుచేస్తాయి. మొదటివారం ఆనందం, రెండోవారం సంతోషం, మూడోవారం ఆందోళన, నాలుగోవారం అనారోగ్యం.



## తులా రాశి

గతంలో చేసిన పొరపాట్లు ఇప్పుడు గ్రహపాటుగా మారి ఇబ్బందులు కలుగుతాయి. అత్తమామలతో పలు కొత్త సమస్యలు ఏర్పడతాయి. భార్య ఆరోగ్యం కోసం ధనం ఖర్చు చేస్తారు. అతిగా మాట్లాడి ఉన్నతాధికారుల ఆగ్రహానికి గురవుతారు. వాగ్దానాలు చేసి కష్టనష్టాలు కొని తెచ్చుకోకండి. విశ్రాంత ఉద్యోగులకు, సినీ, టి.వి. కళాకారులకు ప్రభుత్వ ఆదేశాలు సంతోషాన్నిస్తాయి. మొదటివారం దాంపత్య సమస్యలు, రెండోవారం వృథాశ్రమ, మూడోవారం ఆనందం, నాలుగోవారం శుభవార్తలు.



## వృశ్చిక రాశి

ఈ రాశివారికి శ్రమకు తగిన గుర్తింపు వచ్చినా అసంతృప్తిగా ఉంటారు. బంధుమిత్రుల వల్ల, క్రయవిక్రయాల వల్ల ఆదాయం వచ్చినా తృప్తి ఉండదు. పత్రికారచయితలకు, సినీ నిర్మాతలకు, దర్శకులకు, తారలకు అదృష్టకాలం. దీర్ఘాలోచనల వల్ల తలనొప్పి, క్షేత్రదర్శనంకై, విద్యార్థుల ఉన్నత చదువులకై ధనం బాగా ఖర్చు చేస్తారు. రాజకీయ నాయకులకు, మహిళలకు ఉన్నత పదవీయోగం. మొదటివారం ధనాదాయం, రెండోవారం దీర్ఘాలోచనలు, మూడోవారం ఆనందం, నాలుగోవారం బదిలీలు, ప్రమోషన్లు.



## ధనూ రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో తొందరపాటు నిర్ణయాలు, దీర్ఘాలోచనలు ఆందోళన కల్గిస్తాయి. క్షేత్రదర్శనాల వల్ల మేలు కల్గుతుంది. వాతావరణ మార్పుల వల్ల గొంతు సంబంధిత బాధలు అధికమౌతాయి. పిల్లల చదువులకై ధనం ఖర్చు చేయవలసి ఉంటుంది. చేయు వృత్తి వ్యాపారాల్లో అధిక శ్రమ, వృథాఖర్చులుంటాయి. కోర్టు వ్యవహారాలు, వివాహప్రయత్నాలు ఓ కొలిక్కి వచ్చి ఆనందాన్నిస్తాయి. మొదటివారం ఆందోళన, రెండోవారం సంతోషం, మూడోవారం ఆనందం, నాలుగోవారం వ్యవహారజయం.



## మకర రాశి

కొంతకాలంగా ఉన్న భూ, కోర్టు, వివాదాలు అనుకూలంగా ఏర్పడతాయి. నూతన పరిచయాలు, వెండి, బంగారం కొనుగోలుపై ఆసక్తి కనబరుస్తారు. ప్రేమ వ్యవహారాలు ఫలిస్తాయి. వివాహ, ఉద్యోగ ప్రయత్నాలు నెరవేరుతాయి. పత్రికారచయితలకు పాఠకుల స్పందన సంతృప్తినిస్తుంది. సినీతారలకు, టి.వి, జానపద కళాకారులకు అదృష్టకాలం. వ్యవసాయదారులకు ఆశించిన ఫలితాలు రాక ఆందోళనకు గురిచేస్తుంది. మొదటివారం వ్యవహార విజయం, రెండోవారం ఆనందం, మూడోవారం శుభవార్త, నాలుగోవారం వృథాశ్రమ, ఆందోళన.



## కుంభ రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో దీర్ఘకాలిక ఋణాలు తీరి, కుటుంబ కలహాలు తొలగటంతో సంతోషంగా ఉంటారు. కొత్త వస్తువుల క్రయవిక్రయాల పట్ల ఆసక్తి చూపుతారు. గృహంలో చిన్న చిన్న నిర్మాణాలు, శుభకార్యాల వల్ల మానసికానందం కల్గుతుంది. స్థిరాస్తి విషయంలో సోదరవైరం పెరుగుతుంది. మొదటివారం ప్రమాదం, రెండోవారం సోదర విరోధం, మూడోవారం వ్యవహారజయం, నాలుగోవారం ఆనందం.



## మీన రాశి

కీర్తి, ధనాదాయం, ఆరోగ్యం ఈ రాశివాళ్ళకు ఈ మాసంలో శుభసూచనలు. తొలకరి వర్షాల వల్ల చేయు వృత్తి వ్యాపారాల్లో ఆటంకాలు. గతంలో కుదుర్చుకున్న ఒప్పందాల వల్ల మానసికాందోళనలు ఏర్పడుతాయి. బ్యాంకు, రెవెన్యూ, రైల్వే, తపాల తదితర ఉద్యోగులకు ఆకస్మిక బదిలీలు, అధికార్ల ఒత్తిడి. రాజకీయ నాయకులకు, మహిళలకు పదవీయోగం. పిల్లల అనారోగ్యం, ఆందోళన కల్గిస్తుంది. మొదటివారం ఆటంకాలు, రెండోవారం ఆందోళన, మూడోవారం బదిలీలు, నాలుగోవారం ఆనందం.

# అపరిచితుడు

– అల్లాడి వెంకటరావు, విశాఖపట్నం

**మా**ది విశాఖపట్నం. మా ఇలవేల్పు శ్రీ వేంకటేశ్వరుడు. నాకు ప్రతి సంవత్సరం నా జన్మదినానికి శ్రీనివాసుని దర్శించుకొనడం ఆనవాయితీ. అదేవిధంగా 2010, ఏప్రిల్ 4వ తారీకు కూడా రైలుమార్గం ద్వారా తిరుపతికి బయలుదేరాను. దానికి ముందుగా విశాఖపట్నంలో శ్రీవారి దర్శనానికి ఈ-దర్శన్ (సుదర్శనం) ద్వారా టిక్కెట్టు పొందాను.

నేను రైలులో తాడేపల్లిగూడెంలో ఉండగా మా ఇంటి వద్ద నుండి మా కుమారుడు ఫోనులో అమ్మకు బాగోలేదు అనీ, నన్ను వచ్చే స్టేషనులో ఏలూరులో దిగి ఇంటికి రమ్మని చెప్పాడు. నేను మనస్తాపంతో అలాగే ఏలూరులో దిగిపోదామని నా సామాన్లు తీసుకొని కంపార్టుమెంటుగేటు వద్దకు వచ్చేసరికి రైలు బయలుదేరిపోయినందున దిగలేక అక్కడనే నిల్చుండి తర్వాత స్టేషను విజయవాడలో దిగుదామనే ఆలోచనలోనున్నాను.




ఇంతలో ఎవరో అపరిచితుడు నా వద్దకు వచ్చి ఏమండీ మీరు తిరుపతి రిజర్వు చేయించుకున్నారు కదా, మరిక్కడ దిగుతున్నారెందుకు అని అడుగగా, నేను మా అబ్బాయి ఫోను చేసిన విషయం, నా భార్యకు బాగాలేని సంగతీ, తర్వాత రైలు బయలుదేరేసిన విషయమూ చెప్పాను. అందుకాయన అలా కాదండీ! ఇంటికి మరొక్కమారు ఫోను చేయండి. ఈ సరికి అంతా సర్దుకొనే ఉంటుందని చెప్పాడు. నేను ఇప్పుడే పది నిమిషాల ముందు మాట్లాడానని చెప్పాను. అయినా ఆయన మరల ఫోను చేయుమని ఒత్తిడి చేశాడు. ఆయన ఎదుటే ఆయన సంతృప్తి కొరకు అన్నట్లు మా ఇంటికి ఫోను చేయగా, మా అబ్బాయి, నా భార్య కూడా మాట్లాడి అంతా బాగానే ఉంది, ఏ సమస్యా లేదు అని చెప్పి నన్ను శ్రీవారి దర్శనం చేసుకు రమ్మని చెప్పారు. నాకు చాలా ఆశ్చర్యమేసింది! అంతా ఒక వింతగా, భ్రమగా తోచింది.

ఇక ఏ ఆటంకమూ రాకూడదని ఆ శ్రీనివాసుణ్ణి తలచుకుని, తిరిగి నా ప్రయాణాన్ని సాగించాను. తర్వాత తిరుమలకు చేరి ఏ ఇబ్బందీ లేకుండా శ్రీవారి దర్శనాన్ని అతి కొద్ది సమయంలోనే పూర్తిచేసుకొన్నాను. ఆ తర్వాత తిరుపతిలో ఉన్న శ్రీ గోవిందరాజస్వామి వారిని మరియు తిరుచానూరులో ఉన్న శ్రీ అలిమేలుమంగను దర్శించుకొనే సరికి సాయంత్రం ఏడు గంటలయ్యింది. ఇంకా చుట్టుప్రక్కల సమీప ఆలయాలు చూసి ఇంటికి వస్తామనుకుని నా తిరుగు ప్రయాణానికి 2010, ఏప్రిల్ 9వ తారీకుకు ముందుగా రిజర్వేషను చేయించుకొన్నాను.

అయితే, ఇంటి వద్ద పరిస్థితిని బట్టి ఇంటికి వెళ్ళిపోదామని నిశ్చయించుకుని 5వ తారీకునే రైల్వేస్టేషన్‌కి వెళ్ళి విశాఖపట్నంకు రిజర్వేషను అడుగగా లేదని చెప్పారు. పోనీ తత్కాల్‌లో అయినా ఇవ్వండని నేను అడుగగా అది కూడా లేదని చెప్పారు.

నాకేమి చేయాలో తోచక 'ఆపద్బాంధవా! ఎలాగైనా నన్ను మా ఊరు చేర్చు స్వామీ!' అని రిజర్వేషను కౌంటరు వద్దే నిల్చొని ఆలోచిస్తుండగా, ఎవరో విశాఖపట్నానికి 5వ తారీకున చేయించుకున్న రిజర్వేషన్ని అప్పుడే రద్దు చేసుకున్నారు. నేను సీనియర్ సిటిజన్ అయినందువల్ల రైల్వే రిజర్వేషన్ కౌంటరు క్లర్కు ఆ సీటును నాకు కేటాయించారు. నేను ఇంటికి చేరేసరికి నా భార్య ఆరోగ్యంతో కనబడగానే, నాకెంతో సంతోషమేసింది.

ఇది జరిగినప్పటి నుండి రైలులో ఏలూరు వద్ద కనిపించిన ఆ అపరిచితుడు ఎవరై ఉంటారని ఆలోచనలో పడగా, మరెవరో కాదు ఆ శ్రీనివాసుడే అపరిచితుని రూపంలో కనిపించి, నాచే నా యాత్రకు ఏ విధమైన ఆటంకం లేకుండా పూర్తి చేయించాడనే మాట యదార్థం. అందుకే మాకు ఏ కష్టం వచ్చినా మా ఇలవేల్పైన శ్రీ వేంకటేశ్వరస్వామిని మ్రొక్కుకోవడం ఆనవాయితి. ఆ ఏడుకొండలస్వామిని కలియుగ దైవమనడానికి ఇంతకంటె నిదర్శనం ఏం కావాలి?




**ధారావాహిక - 102**

**(తిరుమల ఆలయంలో దాన స్వరూపస్వభావాలను వివరించడం ఈ సంపుటిలో జరిగింది. దానాలు ఒక క్రమపద్ధతిలో వచ్చేవిధానం అవలంబించడం జరిగింది. ధనరూపేణా లేక భూ, గ్రామాలను దానం చేయడం ద్వారా దేవాలయానికి ఆదాయం వచ్చేది. ధనరూపేణా చేసిన ధనాన్ని స్వామివారి గ్రామాలలో పంటపొలాలపై నీటివనరులను పెంచడం తదితర కార్యక్రమాలద్వారా రాబడిని పెంచడం, ఆ ఆదాయంతో దాతకు నాల్గవవంతు ప్రసాద భాగం ఇవ్వడం జరిగేది. ఆ ప్రసాద భాగాల విక్రయం ద్వారా దాతకు నికర ఆదాయం లభ్యమయ్యేది.)**

## 10) దేవాలయ సేవకు కార్యనిర్వాహకులైన దాతల ఆధార ద్రవ్యదానాలు:

క్రిందటి సంచికలో ఇచ్చిన శాసనాల పట్టికలోని వివిధ అంశాలను పరిశీలించినపుడు ఒక గమనార్హమైన విషయం ద్యోతకమౌతోంది. పరిశీలనానికి తీసుకొనిన 60 సంవత్సరాల కాలంలోని వివరాలను గమనించగా దేవాలయానికి చెందిన 114 గ్రామాలలో 42 గ్రామాలు దేవాలయ కార్యనిర్వాహకుల చేత దానం చేయబడినదన్న విషయం విశదమౌతోంది. అదేవిధంగా వీరు చేసిన ఆధారద్రవ్యదానాలు గణించినట్లయితే అందులో 25% ఆధారద్రవ్యదానాలు ధనరూపాన చేసినట్లుగా తెలుస్తోంది. ఇది విచిత్రంగా ఉంది, ఎందుకంటే సాధారణంగా భక్తులుగాని లేక రాజపోషకులు గాని ఆధారద్రవ్యదానాలను చేయడం పరిపాటి. కాని చిత్రంగా దేవాలయానికి ఆధారద్రవ్య దానం చేయబడిన 114 గ్రామాలలో 42 గ్రామాలను ఈ దానాలను గ్రామాలను గ్రహించవలసిన కార్యనిర్వాహకులే దేవాలయానికి దానం చేసినట్లు తెలుస్తున్నది.

కాని, వీరు ఈ విధంగా దానం చేయడానికి ఆర్థిక సంబంధ కారణం ఏదో ఉన్నట్లు తెలుస్తోంది. దీనికి జవాబు ఈ శాసనాలలోనే ఉన్నది.

ఆర్థికవ్యవహారాలదృష్ట్యా గమనించినపుడు దేవాలయ కార్యనిర్వాహకులలో సంస్కృత మరియు తమిళ వేదపారాయణదారులు, కవులు, పండితులు, నృత్యంచేయువారు మొదలైన వారు తమ జీవనాధారం ప్రధానంగా దేవాలయప్రసాదంలో తమవంతు భాగాన్ని గ్రహిస్తూ జీవించారు. శ్రీ గోవిందరాజ స్వామి దేవాలయంలో క్రీ.శ.1467 సంవత్సరం నాటి శాసనం సంఖ్య 81-జి.టి. ప్రకారం, దేవాలయ కార్యనిర్వాహకులు తిరుమలలో అనుసరిస్తున్న విధంగా, దైవానికి నైవేద్యంగా పెట్టిన తరువాత ఆ ప్రసాదాన్ని తమను పోషించుకోవడానికి వీలుగా తమలో తామే పంచుకోవడానికి అనుమతినివ్వవలసిందిగా ప్రార్థిస్తూ అర్జీపెట్టుకొన్నారు. దీనినిబట్టి దేవాలయ కార్యనిర్వాహకులకు ప్రధాన ఆదాయమార్గం దేవాలయాల నుండి లభించే ప్రసాదమే అనడం స్పష్టం. కాబట్టి, ఎంత అధికంగా నైవేద్యం పెట్టబడుతుందో అంత అధికంగా దేవాలయ కార్యనిర్వాహకులకు రాబడి పెరుగుదల అధికంగా ఉంటుంది. దేవాలయం వలన వీరికి వేరే ఇతర రాబడులకు అవకాశం లేదు.

వీరు దేవాలయానికి ఆధారద్రవ్యదానంగా గ్రామాలను, ధనాన్ని దేవాలయానికి దానం చేయగలంతటి సామర్థ్యాన్ని, సాధనాసంపత్తిని కూడగట్టుకుని, దేవాలయానికి ఆధార ద్రవ్యదానంగా దానం చేసిన 114 గ్రామాల్లో సుమారు 42 గ్రామాలను, సుమారు 25% వరకు ధనాన్ని దానం చేయగలిగారనే ప్రశ్న ఈ సందర్భంగా తలెత్తుతుంది.

ప్రసాదవితరణ విషయంలో, దేవాలయ కార్యనిర్వాహక ఉద్యోగికిని, ఆధారద్రవ్యదానాన్ని చేసిన వ్యక్తికిని మధ్య చాల వ్యత్యాసం చూపబడుతోందనే విషయం చాలా శాసనాలు తెలుపుతున్నాయి. బహుశః దేవాలయ కార్యనిర్వాహక అధికారికి, తనకూ, తన కుటుంబానికి సుమారుగా సరిపోయేంతటి ప్రసాదాన్ని మాత్రమే ఇవ్వబడుతూ ఉంటుంది. కాని, దేవాలయానికి ఆధారద్రవ్యదానాన్నిచేసిన దాతకు సంబంధించినంత వరకు దేవాలయం పాటించే పద్ధతిప్రకారం దైవానికి పెట్టబడిన మొత్తం ప్రసాదంలో నాల్గవవంతుభాగాన్ని తీసుకునే ఆచారం ఉన్నది. శాసనంలో **విట్టవన్ విళుక్కడు** అనే పదం ఈ అర్థాన్నే సూచిస్తోంది. ఈ పదం దైవానికి సమర్పించిన ఏ భాగం ప్రసాదం ఉన్నదో అది దానకర్తకు ఇవ్వబడుతోందని అర్థం. తిరుమల దేవాలయంలో వరదరాజస్వామి దేవాలయ ఉత్తరకుడ్యం మీద ఉన్న శాసనం సంఖ్య 102-టి.టి. ఈ ఆచారం పాటింపబడుతున్న విషయాన్ని మొట్టమొదటిసారిగా తెలియజేసింది. ఈ శాసనం త్రిభువన చక్రవర్తి నాయనన్ శ్రీరంగనాథయాదవరాయలు తన పరిపాలనాకాలంనందలి 19వ సంవత్సరం అంటే క్రీ.శ.1354 సంవత్సరంలో వేయబడింది. ఇందులో దైవానికి సమర్పించిన ప్రసాదభాగంలో దాత నాల్గవ వంతు భాగం తీసుకోవచ్చనే విషయం స్పష్టం చేస్తోంది.

ఆధారద్రవ్యదానాన్ని చేసిన దాతకు **విట్టవన్ విళుక్కడు** లభించే ప్రసాదభాగాన్ని దేవాలయంలో అమలులో ఉన్న అలవాటుగా దేవాలయ కార్యనిర్వాహకులకు వేతనంగా చెల్లించు ప్రసాదభాగం మీద ఆధారపడలేదు. దాతకు సాధారణంగా మొత్తం ప్రసాదంలో నాల్గవవంతుభాగం ఇవ్వబడుతుంది. దాత 100 అప్పపడుల ప్రసాదాన్ని తయారు చేయడానికి దానం చేసినట్లయితే ఆ వ్యక్తికి 25 అప్పపడుల ప్రసాదం లభిస్తుంది.

దైవదర్శనార్థమై వచ్చు భక్తులు, యాత్రికులు అత్యంత పవిత్రంగా భావించే ప్రసాదాలకు గిరాకీ ఉన్నది. దేవాలయానికి ఆధారద్రవ్య దానాన్ని చేసిన దాతకు ఇస్తున్న 25% ప్రసాద భాగం అమ్ముకోవడంవలన ఆదాయం బాగానే వస్తోంది. మిగతా 75% ప్రసాదభాగం వలన దేవాలయానికి తగినంత లబ్దిని చేకూరుస్తోంది.

దేవాలయ ప్రసాదాల అమ్మకవ్యాపారం పకడ్బందీగా కట్టుదిట్టమైన వ్యాపారసరళిలో సాగుతుండినట్లు దేవాలయ శాసనాల వలన స్పష్టంగా తెలుస్తోంది. దాతలనుండి మరియు కార్యనిర్వాహకుల నుండి ప్రసాదాలను సంపాదించి అమ్మకపు హక్కులను పొందిన 11 మంది కౌలుదారుల గురించి ఒక శాసనం స్పష్టం చేస్తోంది. వీరు **ప్రసాదక్కరార్**లుగా గుర్తింపు పొందారు. ఇందుకు ఉదాహరణగా తిరుమల దేవాలయం రెండవ ప్రాకారం పడమటి గోడమీదఉన్న సంఖ్య 278-టి.టి. శాసనాన్ని పేర్కో వచ్చును. ఈ శాసనంలో- శా.శ.1457 అంటే క్రీ.శ.1535వ సం॥లో ఒకానొక తిరుమలయ్యంగారు (తాళ్లపాక తిరుమలయ్యంగారు)తో కుదుర్చుకొన్న ఒప్పందాన్ని నమోదు చేయబడింది. దీని ప్రకారం దాతభాగానికి వచ్చిన నాలుగవ వంతు ప్రసాదభాగాన్ని క్రయికునకు (కొనువానికి) విక్రయించ వలసినదని ఉన్నది. సాళువ గోవిందరాజు తనకు ఉన్న నాల్గవ వంతు ప్రసాదభాగం అమ్మకపు విషయమై, తిరుమలయ్యంగారు కుదుర్చుకొనిన ఒప్పందం. ఈ శాసనాన్నిబట్టి ప్రసాదవిక్రయాలు నిబంధనలను అనుసరించి జరుగుచుండెడిది మరియు క్రయ విక్రయాదులకు సంబంధించిన వివరాలను దేవాలయ అధికారులు ధ్రువీకరిస్తూ నమోదు చేస్తున్నట్లు తెలుస్తోంది. ప్రసాదం అమ్మకానికి సంబంధించిన ఇటువంటి శాసనాలు చాల ఉన్నాయి.

ప్రసాదక్కరార్‌లు తమకు ప్రసాదాలను అందజేసిన వ్యక్తులకు ప్రతిసంవత్సరం ప్రారంభంలో కొంతసొమ్మును అందజేసి ఆ ప్రసాదాలను సేకరించి కొంతలాభసాటి బేరంమీద తాము మాత్రమే యాత్రికులకు అమ్ముకొనే హక్కుపొందినట్లు కనబడుతోంది. దాతలు తనవంతునకు వచ్చే ప్రసాదాలను కొంత ధనాన్ని పుచ్చుకుని, గుత్తదారునకు విక్రయించడానికి అధికారం ఉన్నట్లు తెలియజేసే శాసనాలనేకం ఉన్నాయి. చాలమంది గుత్తేదారులు ఈ లాభసాటి వ్యాపారాన్ని చేపట్టినట్లు తెలుస్తోంది. ఈ నాటికీ (ఈ పుస్తకాన్ని 1980వ సంవత్సరానికి ప్రచురించునాటికి) చాలమంది ఈ వృత్తిలోఉన్నారు. (ఈనాడు (2011) అటువంటి మధ్యవర్తులు లేకుండా తిరుమల తిరుపతి దేవ స్థానం చూస్తోంది.)

పైన తెలిపిన విధంగా దేవాలయ కార్యనిర్వాహకులచే గుర్తించతగినంతటి అధికశాతంలో దేవాలయానికి చేసిన ఆధార ద్రవ్యదానం కాని గ్రామదానంకాని చేసిన దాతల ప్రాముఖ్యాన్ని

| ధారావాహిక 07 | మందార మకరందాలు |
|---|---|

**మందారమకరందమాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే? మదనములకు**
**నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు రాయంచ సనునె? తరంగిణులకు**
**లలితరసాలపల్లవఖాదియై చొక్కు కోయిల సేరునే? కుటజములకుఁ**
**బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక మరుగునే? సాంద్రనీహారములకు**
**అంబుజోదరదివ్యపాదారవింద చింతనామృతపానవిశేషమత్త**
**చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు? వినుతగుణశీల! మాటలు వేయునేల?**

సంస్కారాన్ని బట్టి మనసు, మనసునుబట్టి మార్గం, ఆ మనోగతిని మళ్ళించడం ఎవరికి సాధ్యం? భగవంతుని పాదాలను భజించడంలో మత్తెక్కిన చిత్తానికి మరో చింత ఉంటుందా? ఉండదు. ఆ ఉండదనే సత్యాన్ని నాలుగు రకాలుగా బహుముఖాలుగా చెప్పితేనేగాని పోతన్న మనసు నిండదు.

ఒక విషయాన్ని తీసుకుని అలంకారబలంతో వాక్యనిర్మాణ కౌశలంతో నొక్కి నొక్కి చెప్పడం పోతన్నకు ఒంటబట్టిన గుణం. ఇది పాలకురికి సోమన్నలో ఉంది. ఆ పరిసరాలలో పుట్టిన బమ్మెర పోతనలోనూ ఉంది. ఇది వక్తృత్వశైలి *(Rhetoric Style)*. ఒక వక్త వేదికపై నిలిచి ఉద్ఘాటించే ధోరణి. మందార మకరందాల తీపి మరిగిన తుమ్మెద ఉమ్మెత్తపూలను చేరుకుంటుందా? ఆకాశగంగాతరంగాలలో ఉయ్యాలలూగే రాజహంస వాగులకూ వంకలకూ వెళుతుందా? తీయని మామిడి లేత చిగుళ్ళను తిని పరవశించే కోయిల కొండమల్లెలను కోరుకుంటుందా? పండు వెన్నెల బయళ్ళలో విహరించే చకోరం మంచుపొగలవైపు పోతుందా? లేదు, లేదు. వీలు కాదు. వేయి మాట లెందుకు? పరమాత్ముని వలచిన మనసు మరో వైపు చేరుకోదు.

ఈ పద్యం భక్తికి పట్టుగొమ్మగా నిలిచింది. పోతన్న రచనాశక్తికి నిలువుటద్దంగా నిలిచింది. నిజాని కిది -- **"క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస, గోరునే పడియల నీరు ద్రావంగ"** అనే పాలకురికి సోమన్న పద్య ప్రభావంతో పుట్టిందే. అయినా ఈ పద్యం పొందిన ప్రచారం అపారం. ఈ పద్యంలో కనీసం మొదటిపాదం రాని తెలుగువాడు దాదాపుగా లేనేలేడు. ఒకవేళ ఉంటే వాడు తెలుగువాడు కానేకాడు. ఇంతటి వశీకరణశక్తికి మూలకారణం మధురాక్షర సమ్మేళనం --"మందార". "మధుప" "మదనములు", ఒక్క పాదంలోనే ఇన్ని మకారాల గుబాళింపు. అందుకే ఈ పద్యం తెలుగువారి నోటి కెక్కింది. ఈ ఒరవడిలో పోతన్న ఎన్నెన్నో పద్యాలను తీర్చిదిద్దుకున్నాడు.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

ఈ సందర్భంలో గుర్తించవచ్చును. దేవాలయంలో అనుసరించు ఆచారం ప్రకారం ఆధారద్రవ్య దానాన్ని చేసిన దాతకు నాల్గవ వంతు ప్రసాదం పొందే అర్హత ఉన్నది. ప్రసాదం అనేది ఒక స్థలంనుండి వేరొకస్థలానికి, వేరొక వ్యక్తికి మార్చదగిన సరకు. అమ్మకపుహక్కులను పొందిన కౌలుదారుల ద్వారా అమ్మించి సులభంగా ధనరూపానికి మార్చుకోవచ్చును. అందు చేతనే దేవాలయ నిర్వాహకులు తమవద్ద అధిక ధనాన్ని స్వామివారికి ఆధార ద్రవ్య దానరూపాన పెట్టుబడిపెట్టగలిగారు. వీరు చేసిన అధార ద్రవ్యదానానికి లభించే నాల్గవవంతు ప్రసాదభాగం ధనరూపం లోకి మార్చుకొనినపుడు తగినంత రాబడి వస్తోంది. మరో మాటలో చెప్పాలంటే దైవానికి సమర్పించిన అధారద్రవ్య దానం వలన లభించగల నాల్గవవంతు ప్రసాద భాగానికి ధనరూపం లోనికి మార్చుకొన్నపుడు వీరికి అధారద్రవ్యదానమైన మూల ధనంపై వడ్డీరూపాన తగినంత రాబడి వస్తోంది. మరో మాటలో చెప్పాలంటే దైవానికి సమర్పించిన ఆధార ద్రవ్యదానం, ఒక మూలధనం (వడ్డీవ్యాపారస్థుడు కాని వ్యక్తికి క్షేమంకరమైన ఆధునిక బ్యాంకింగ్ వ్యవస్థలేనటువంటి ఆ రోజులలో ఈ పద్ధతి ఒక మూలధన పెట్టుబడిగా ఆనాడు వీరిచే ఆదరింపబడింది) ద్వారా లభించిన అమ్మకానికి పెట్టి ధనాన్ని పొందారు. ఈ విధంగా ఆధార ద్రవ్య దానం వలన వార్షికాదాయం రావడం చేత ఇంకా ఆధార ద్రవ్యదానం చేయడానికి పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వచ్చారు. ***(ఇంకా ఉంది)***

# సుధాకలశం
# సుందరకాండ

- సి.వి.నారాయణ

హైందవుల ఆరాధ్య ఇతిహాస పారాయణ గ్రంథం "శ్రీమద్రామాయణం"- బహువిశిష్ఠమైనది. ఇది ఆదికవి వాల్మీకిచే సుందర కావ్యంగా మలచబడి మానవతాధర్మాన్ని ప్రతిష్ఠించిన మహత్తర గ్రంథం. రామాయణం వంటి మహాకావ్యం ప్రపంచ సాహిత్యమంతా వెదకినా మనకు కనిపించదు. యుగాలు మారినా శ్రీరాముడు హైందవుల ఆరాధ్యదైవమై విలసిల్లుచున్నాడు. రామాయణంలో ఏడుకాండ లున్నవి. ఇందులో ఐదవదైన "సుందరకాండ"లో జానకీదేవి జాడ తెలుసుకొని, శ్రీరామచంద్రునికి తెలిపిన ఘట్టాన్నే సుందర కాండ అంటారు. ఇది శ్రీమద్రామాయణానికి మకుటం వంటిది. ఇందులో ఆంజనేయుని పాత్ర అత్యంత అద్వితీయమైనది.

శ్రీమద్రామాయణంలో సుందరకాండకు విశేషమైన ప్రాధాన్యత ఉన్నది. సుందరకాండలాంటి సుమధుర రచనలు ఒక్కసారి చదివితే చాలదు. పలుమార్లు చదవాలి. మన జీవితానుభవం పెరిగిన కొద్దీ మనలోని బుద్ధివికాసం పెరుగు తుంది. మనబుద్ధి వికాస పరిణతిని బట్టి ఆ యా గ్రంథాల లోని భావాలు, అర్థాలు బాగా అవగతమౌతాయి. మానవుడు పరమాత్మను పొందడానికి పారాయణ ఒక సోపానం. రామా యణమంతా చదువలేనివారు ఒక్క సుందరకాండనైనా పఠిం చినచో సర్వరామాయణ ఫలమును పొందగలరు.

మహాభక్తుడైన హనుమంతుడు కారణ జన్ముడు. ఆంజనేయుడు వానరసేనలోని యోధు లలో అగ్రగణ్యుడు. ఈయన గొప్ప పండితుడు, ధైర్యశాలి, మధురభాషి, గుణవంతుడు, మీదు మిక్కిలి వినయవిధేయతలు కలవాడుగా త్రిలోక పూజ్యుడు. అలాంటి మహనీయుడైన హనుమం తుని పుణ్యగాథ సుందరకాండ వినడం మోక్ష ప్రదం.

రావణుడు అపహరించిన సీతను వెతు కుతూ శ్రీరామచంద్రుడు ఇచ్చిన ఉంగరం తీసుకొని శ్రీరామకార్యధురంధరుడై హనుమం తుడు బయలుదేరాడు. లంకకు చేరటానికి సముద్రం దాటదలచి మహేంద్రగిరిపై కాలు పెట్టి తన శరీరాన్ని అనూహ్యంగా పెంచి పాదా లతో ఆ పర్వతాన్ని గట్టిగా నొక్కి ఊర్ధ్వంగా తన దృష్టిని సారించి, హృదయస్థానం ప్రాణవాయువు నిరోధించి రివ్వున ఆకాశంలోకి ఎగిరాడు. ఆకాశంలో పయనిస్తున్న హనుమంతుని కన్నులు సూర్యచంద్రులుగా ప్రకాశించాయి. ఆ సమయంలో దేవతలు పుష్పవర్షం కురిపించారు. కొంతదూరం వెళ్ళగా దారిలో మైనాకుడు అడ్డగించాడు. ఆయన ఆతిథ్యాన్ని నిరాకరించి ప్రయా ణం సాగించాడు. దేవతలు జితేంద్రియుడైన ఆంజనేయుని శక్తి సామర్థ్యాలు తెలుసుకోగోరి క్షణకాలం పరీక్షించాల్సిందిగా నాగమాత అయిన సురసాదేవిని కోరారు. వెంటనే సురసాదేవి హనుమంతుని భుజించడానికి భయంకరంగా నోరు తెరచుకొని నిలబడగా హనుమంతుడు అతి సూక్ష్మరూపం ధరించి తటాలున ఆమె నోటిలో ప్రవేశించి వెంటనే బయటకు వచ్చాడు. అప్పుడు దేవతలు హనుమంతుణ్ణి ఎంతో కీర్తించారు.

మహాబలసంపన్నుడైన కపిశ్రేష్ఠుడు లంకకు కావలి కాసే లంకిణిని జయించి లంకానగరంలో ప్రవేశించాడు. అతి



# సంప్రదాయ దుస్తులను ధరించండి!

**1.** తిరుమల శ్రీవారి  దర్శనానికి విచ్చేయు భక్తులు తప్పనిసరిగా సరియైన వస్త్రధారణ కలిగి రావలెను.

**2.** సరియైన వస్త్రధారణ అనగా **పురుషులు ఫ్యాంటు, షర్టు గాని, లాల్చీ పైజామా కాని, పంచ, కండువ** గాని ధరించవలెను. **స్త్రీలు చీరలలో గాని, సల్వార్ కమీజ్‌లలో**గాని రావలెను.

**3. అలాకాక ఎవరైనా నిక్కర్లతోగాని, టీ షర్టులతో గాని, బర్ముడాలతో గాని దర్శనానికై వచ్చిన యెడల అనుమతించబడరు. వీరిని 'క్యూకాంప్లెక్స్' మొదటిలోనే దుస్తులు మార్చుకొనిరావల్సిందిగా కోరడం జరుగుతుంది.**

**4. ఈ నియమం 2010, జూన్ 7వ తేదీ నుండి అమల్లోకి వచ్చింది.**

**5.** భక్తులు దేవస్థానం అధికారులతో సహకరించ వలసిందిగా కోరుతున్నాము.

**– కార్యనిర్వహణాధికారి**

సుందరం, శోభాయమానం అయిన లంకా పట్టణాన్ని అన్ని వైపులా పరిశీలించి చూశాడు. ఆకాశన్నంటే అందమైన భవంతులు, సువిశాల సుందరవనాలు, ప్రాకారాలను చూసి సంభ్రమాశ్చర్యాలతో లోనికి వెళ్ళి లంకాపుర ఉద్యానవనంలో ప్రవేశించాడు. అల్లంతదూరంలో అశోకవనంలో శింశుపావృక్షం క్రింద సీతామాతను చూశాడు. విలపిస్తున్న ఆ మహాసాధ్విని చూసి, ఆంజనేయుడు అక్కడకు వెళ్ళి శ్రీరాముని ఉంగరం చూపించాడు. ఆమెను ఓదార్చి, ఆమె వద్ద ఆనవాలుగా చూడామణిని తీసుకొని బయలుదేరాడు. అమిత ఆనందంతో వాయునందనుడు అశోకవనాన్ని ధ్వంసం చేసి అడ్డం వచ్చిన రాక్షసులను సంహరించాడు. ఈ వార్త తెలుసుకున్న దశ కంఠుడు తన కుమారుడు ఇంద్రజిత్తును పవనకుమారుని పైకి పంపాడు.

ఇంద్రజిత్తు హనుమంతుని సమీపించి బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. తనకు తానుగా బ్రహ్మాస్త్రానికి బందీయై రావణుని కొలువుకూటానికి వెళ్ళాడు. అక్కడ రావణునికి నీతి వాక్యాలు చెప్పి, సీతను రాముడికి అప్పగించి క్షమాభిక్ష కోరాల్సిందంటూ హితవు పలికాడు. అందులకు కోపించిన రావణాసురుడు ఆంజనేయుని తోకకు నిప్పంటించుమని ఆజ్ఞాపించాడు. హనుమంతుడు తన తోకకు పెట్టిన నిప్పుతో లంకాదహనం చేసి, తిరుగు ప్రయాణమయ్యాడు. ఆకాశమార్గంలో పయనించి మహేంద్రాద్రిపై దిగి, వానరశ్రేణికి సీతామాత వృత్తాంతం తెలియజేశాడు. వానరులందరూ ఈ సంతోషవార్తకు ఆనందించి గంతులు వేశారు.



హనుమంతుడు శ్రీరామచంద్రుని చెంత చేరి "కంటిని జానకి పూర్ణచంద్రవదన కల్యాణి నాలంకలో" – అని చెప్పి రాముని కల్లోలిత హృదయానికి ఊరట కలిగించాడు. సీత వృత్తాంతము తెలుసుకొన్న శ్రీరామచంద్రుడు అమితానందంతో ఆంజనేయుణ్ణి ఆలింగనం చేసుకొన్నాడు. ఇటువంటి భక్తి ప్రపత్తులే హనుమంతుణ్ణి చిరంజీవిని చేశాయి. ఆయన ఇప్పటికీ మనందరి నీరాజనాలు అందుకొంటున్నాడు. సుందరకాండ పారాయణ చేసేవారు సర్వసుఖాలు, సుఖసంతోషాలు పొందుతారని శాస్త్రవచనం.

# అపకారికి ఉపకారము

- మేడిశెట్టి శంకరయ్య

పూర్వం ఒక గురువు ఉండేవారు. వారు స్వర్ణ ముఖీనదీ తీరాన ఒక ఆశ్రమం స్థాపించుకుని శిష్యబృందానికి ధర్మబోధ చేస్తూ జీవనం చేస్తూ ఉండేవారు. ఆయన ప్రేమ స్వరూపులు. వారికి మానవుల పట్లేగాక జంతువుల పట్ల కూడా దయ, ప్రేమ కలిగి ఉండేవారు. వారి ఆశ్రమ ప్రాంగణంలో క్రూరజంతువులు కూడా సాధు జంతువుల వలె సంచరిస్తూ ఉంటాయి. ఒకరోజు ఉదయాన శిష్యబృందంతో కలిసి నదిలో స్నానం చేయడానికి వెళ్ళారు. గురువుస్నానం చేస్తున్న సమయంలో ఒక వృశ్చికము (తేలు) నీళ్ళలో కొట్టుకొని వస్తుండటం గమనించాడు. అయ్యో పాపం! ఆ తేలును ఎలాగైనా రక్షించాలనే ఉద్దేశ్యంతో మెల్లిగా దానిని చేత పట్టుకొని నదిగట్టుపైన వదలిపెట్టారు గురువు. కాని, అది ఊరుకుంటుందా! ఆయన చేతినే కుట్టింది. కానీ గురువుకు ఎటువంటి కోపమూ రాలేదు. కొద్దిసేపు స్నానంలో నిమగ్నులయ్యారు. ఆ తేలు మళ్ళీ నీళ్ల లోనికి వచ్చి కొట్టుకపోవడం గమనించాడు. అయ్యో! ఇది మళ్ళీ ప్రమాదంలో పడిందని తలచి మళ్ళీ దాన్ని తీసుకొని గట్టు మీద ఉంచాడు. అది మళ్ళీకుట్టింది. ఇలా మూడవసారి, నాల్గవసారి కూడా జరిగింది. చివరి కా తేలు భూమి మీదకు ప్రాకి ఎటో వెళ్ళిపోయింది. శిష్యులంతా ఇది గమనిస్తూ ఆశ్చర్యపోయారు. చివరకు ఒక శిష్యుడు గురువుతో ఇలా అన్నాడు. తేలు మిమ్మల్ని కుడుతూనే ఉన్నది కదా! ఎందుకు దాన్ని రక్షించాలని ప్రయత్నించారు కారణమేమిటి? అందుకు గురువు నాయనా తేలుకు కుట్టడమనేది సహజ స్వభావం. అది దాని పని చేస్తూనే ఉంటుంది. ఇతరులు ఆపదలో ఉన్నప్పుడు సహాయపడడం మానవ స్వభావంగా ఉండాలి. దాని స్వభావం వల్ల అది కుట్టింది. నా స్వభావం వల్ల నేను రక్షించాను. మీరు తెలుసుకోవలసింది ఇంకా ఉంది. మనం ప్రకృతి నుండి ఎన్నో సుగుణాలను గ్రహించవలసి ఉంది. చెట్టును రాళ్ళతో కొడితే అది పండ్లనిస్తుంది. ఆవు నుండి బిడ్డను వేరు చేసినా అది పాలిస్తున్నది. మనం మేఘాలకు ఎటువంటి సహాయం చేయకపోయినా వర్షాన్నిస్తున్నాయి. మనం భగవంతుని పట్ల తెలిసోతెలియకో ఎన్నో అపరాధాలు చేసినా, కరుణాహృదయుడైన పరమేశ్వరుడు మనకు తగినట్లుగా సుఖమైన జీవితాన్ని ప్రసాదిస్తున్నాడు గదా! కాబట్టి ఎదుటివారు మనకు కీడు చేసినా మనం వారికి మంచి చేయటంలో మానవ జన్మ సార్థకమౌతుందని ముగించారు.

# అభ్యాసము కూసు విద్య

ప్రపంచంలో ఏ విషయమైన సరియైన రీతిలో అభ్యసిస్తే మనకు చేతగానిదంటూ ఉండదు. స్వామి రామానంద తీర్థ పేరు వినే ఉంటారు. ఒకప్పుడు కాశీక్షేత్రంలో ఉంటూ అనునిత్య కార్యక్రమంలో భాగంగా సూర్యోదయాత్పూర్వమే నిద్ర లేచి గంగానదీ తీరానికి వెళ్ళేవారు. అచట యోగాభ్యాసం ఆచరించి, నదిలో స్నానం చేసి పిదమ కాశీవిశ్వేశ్వరుని దర్శించి ఆశ్రమానికి బయలుదేరేవారు.

ఒకరోజు ఉదయం గంగాతీరానికి చేరి ఒడ్డున ఇటు అటూ తిరుగుతూ వ్యాయామం చేస్తుండిపోయారు. అది శీతాకాలం. భరింపరాని చలి. ఆయన శరీరంపై కౌపీనం తప్ప ఏ వస్త్రమూ లేదు. ఇంతలో అచటికి ఒక ఆంగ్లేయుడు ఆ ప్రదేశానికి పాదచారియై వచ్చాడు. అతడు ముఖం తప్ప పూర్తి శరీరాన్ని కప్పి ఉండే ఉన్ని సూటు ధరించి ఉన్నాడు. కాళ్ళకు సైతం తగిన ఏర్పాటు చేసుకున్నాడు. అయినా చలికి కొద్దిగా వణకుతున్నాడు. ఆయన స్వామిని చూచి ఆశ్చర్యపోయాడు. స్వామీ! ఇంత చలిలో కూడా శరీరంపై వస్త్రాలు లేకుండా ఎలా ఉండ గలుగుతున్నారని ప్రశ్నించాడు. అందుకు స్వామీజీ చిరునవ్వుతో ఇలా అన్నారు. “నేను ప్రతిరోజు అలవాటుగా చేసేదే”, స్వామీ! ఇదెలా సాధ్యమని ఆ అగంతకుడు తిరిగి ప్రశ్నించాడు. అందుకు స్వామీజీ ఇలా వివరించాడు. మీరు శరీరమంతా వస్త్రాలతో కప్పుకున్నారు కదా! మరి ముఖానికి కప్పుకోలేదే? దానికి అతను స్వామీ ఇలా ఉంచుకోవడం మామూలే గదా! అన్నాడు. ఇది ఇలా అలవాటైపోయిందన్నాడు. మీ ప్రశ్నకు మీరే జవాబు చెప్పారు. నేనూ ఇలా పరుగెత్తడం అలవాటు చేసుకున్నాను. ఇది నాకు మామూలైందన్నాడు. ఆంగ్లేయుడప్పుడు అర్థం చేసుకున్నాడు.

మనం భగవంతుని పట్ల మనస్సులగ్నం చేయాలన్నా, శ్రద్ధతో ధ్యానం చేయాలన్నా అభ్యాసము చేయక తప్పదు. మొదట కొన్ని అవాంతరాలు వచ్చినా, అవి రాను రాను కనుమరుగవుతాయి. మనలక్ష్యం నెరవేరుతుంది. అందుకే ‘అభ్యాసము కూసు విద్య’ అన్నారు పెద్దలు.

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

| క్ర.సంఖ్య | పుస్తకం పేరు | రచయిత పేరు | ధర |
|---|---|---|---|
| 1. | బ్రహ్మజిజ్ఞాస - సంపుటం-2 | మర్రిబోయన రామసుబ్బయ్య | 40.00 |
| 2. | బ్రహ్మజిజ్ఞాస - సంపుటం-4 | మర్రిబోయన రామసుబ్బయ్య | 45.00 |
| 3. | భక్తిసారము - సంపుటం-2 | తిరువాయిపాటి రాఘవయ్య | 25.00 |
| 4. | భాగవత సుధాలహరి - సంపుటం-3(1) | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 95.00 |
| 5. | భాగవత సుధాలహరి - సంపుటం-3(2) | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 90.00 |
| 6. | భాగవత సుధాలహరి - సంపుటం-3(3) | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 85.00 |
| 7. | భాసుని భారత నాటకం | చిలకమర్తి లక్ష్మీనరసింహము | 25.00 |
| 8. | బాలకృష్ణనాటకము | డా॥ కె.జె.కృష్ణమూర్తి | 15.00 |
| 9. | బాపు బొమ్మల రామాయణం | ముళ్ళపూడి వెంకటరమణ | 25.00 |
| 10. | బ్రహ్మ గాంధర్వము | ముదివర్తి కొండమాచార్యులు | 62.00 |
| 11. | భక్త కవయిత్రి తరిగొండ వెంగమాంబ (బుర్రకథ) | తరిగొండ వెంగమాంబ ప్రాజెక్టు | 27.00 |
| 12. | ధర్మమంజరి | జటావల్లభుల పురుషోత్తం | 12.00 |
| 13. | ధర్మ దీపికలు | కాట్రపాటి సుబ్బారావు | 15.00 |
| 14. | దయావీరులు | చల్లా రాధాకృష్ణ శర్మ | 10.00 |
| 15. | ద్వాదశసూరి చరిత్ర | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 30.00 |
| 16. | గీతగోవింద కావ్యము | సి.మురళీకృష్ణారావు | 50.00 |
| 17. | గీతామృతము | డా॥ ఇ.పాండురంగారావు | 30.00 |
| 18. | యజ్ఞోపవీత తత్త్వదర్శనం | అవ్వరి శ్రీరామమూర్తి శాస్త్రి | 10.00 |
| 19. | జలక్రీడా విలాసము | పరిష్కరణ- డా॥ కె.జె.కృష్ణమూర్తి | 45.00 |
| 20. | కృష్ణవేణి తరంగాలు | కృష్ణాపుష్కరాల ప్రత్యేక సంచిక | 150.00 |
| 21. | కృష్ణయజుర్వేదం - సంపుటం-3 | తెలుగుసేత మరియు పరిష్కర్త - రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి | 75.00 |
| 22. | ముకుందమాల | ముదివర్తి కొండమాచార్యులు | 35.00 |
| 23. | కవితా శారద | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 5.00 |
| 24. | మహారాజా స్వాతి తిరునాళ్ | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 15.00 |
| 25. | మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు | ఆచార్య ఎస్.బి.రఘునాథాచార్య | 7.00 |

మన దేవాలయాలు

# చింతరేవుల ఆంజనేయస్వామి చరిత్ర

- డా॥ వగ్గు నాగరాజు

మహబూబ్‌నగర్ జిల్లా గద్వాల పట్టణానికి 18 కిలో మీటర్ల దూరంలో వెలసిన చింతరేవుల ఆంజనేయ స్వామి చరిత్ర మహిమాన్వితమైనది. ప్రతి అమావాస్యనాడు వేలాదిగా తరలి వచ్చే భక్తులతో ఈ ఆలయం కిటకిటలాడు తూంటుంది. స్వామివారి సన్నిధిలో కొత్త వాహనాలకు పూజ చేయించడం ఆ ప్రాంతవాసుల ఆనవాయితీగా చెప్పుకోవచ్చు. కోరిన కోర్కెలు తీర్చే ఈ ఆంజనేయస్వామిని భక్తులు దర్శించి తరిస్తుంటారు. భక్తుల చందాలతో ఎన్నో ఏళ్ళుగా అన్నదాన కార్యక్రమాన్ని ఘనంగా నిర్వహిస్తూండటం ఇక్కడి విశేషం.

సుమారు 200 ఏళ్ల క్రిందట ఈ ప్రాంతం దట్టమైన అటవీప్రాంతంగా ఉండేది. గద్వాల సంస్థానరాజుల కాలంలో శేషగిరి అను వ్యక్తి ధరూర్ అనే గ్రామానికి పట్వారీగా బాధ్యతలు నిర్వర్తిస్తూండేవాడు. దయార్ద్ర హృదయం గల శేషగిరి పేదప్రజలనుండి పన్నులు సరిగ్గా వసూలు చేయనందున గద్వాల సంస్థానాధీశుడు నల్లసోమనాద్రి నలభైగ్రామాల్లోనున్న కరణాలందరికన్నా తక్కువగా పన్ను వసూలు చేశావంటూ ఆయన రుమాలును క్రింద పెట్టుమన్నాడు. ఈ అవమానాన్ని సహించలేక శేషగిరి చింతరేవుల అటవీప్రాంతానికి రాగా; అక్కడొక పుట్టలో ఆంజనేయస్వామి విగ్రహం కన్పించగా; ఆ స్వామికి నిత్యం పూజలు చేస్తూ, అక్కడి చింతమానులోని చింతాకునే ఆహారంగా తీసుకుంటూండే వారు. అందుకే ఈ ప్రాంతానికి చింతరేవులనే పేరొచ్చింది.

అనంతరం పాండురంగస్వామి ప్రత్యక్షమై శేషగిరికి కన్పించగా; తన జన్మ ధన్యమైందంటూ, పాండురంగస్వామికి దాసుడుగా మారిపోయాడు. అందువల్లే శేషగిరికి శేషదాసులనే పేరొచ్చింది. తదనంతరకాలంలో గద్వాల రాజులు శేషదాసుల వారిని గౌరవించి, చింతరేవులలో ఆంజనేయస్వామివారికి ఆల యాన్ని నిర్మించి, మాన్యాలు కూడా రాసిచ్చారు.

చింతరేవుల ఆంజనేయస్వామి ఆలయానికి సమీపం లోనే కృష్ణానది ప్రవహిస్తోంది. ఇక్కడ పన్నెండేళ్ళకొకసారి జరిగే



ఆలయ ముందు భాగం



చింతరేవుల ఆలయానికి స్వాగత తోరణ దృశ్యం



కృష్ణాపుష్కరాలు ఘనంగా జరుగుతాయి. పవిత్ర కృష్ణానదిలో స్నానంచేసిన భక్తులు, ఆంజనేయస్వామిని దర్శించుకుని, ప్రత్యేక పూజలు జరుపుతారు. ఈ పన్నెండురోజులు భక్తులకు ఆలయ సిబ్బంది అన్నదానం కూడా చేస్తారు.

ప్రతి సంవత్సరం మాఘమాసంలో ఆంజనేయస్వామి బ్రహ్మోత్సవాలు కూడా ఘనంగా జరుగుతాయి. ఏడురోజుల పాటు స్వామివారికి విశేషపూజాది కార్యక్రమాలు నిర్వహిస్తారు. మాఘశుద్ధ తదియనాడు ధ్వజారోహణం, చవితిరోజు ఉప నయనం, అదే రోజు రాత్రి తెప్పోత్సవాన్ని నిర్వహిస్తారు.

పంచమినాడు కన్నులపండుగగా రథోత్సవం జరుగు తుంది. షష్ఠిరోజున ప్రభ, అశ్వవాహనం, సప్తమినాడు అవభృత స్నానం, అష్టమిని భీమాష్టమిగా నవమిని మధ్వానవమిగా వ్యవ హరిస్తారు.

ఆంజనేయస్వామే మధ్వాచార్యులవతారమని ప్రచా రంలో ఉంది. శేషదాసుల వంశీయులే తరతరాలుగా ఇక్కడ పూజాది కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

## శ్రీహరి లీలలు

**సంకటములెన్ని వచ్చిన**
**అంకిత భావము విడువని ఆత్మబలునికిన్**
**వేంకటనాథుడు తోడై**
**సంకల్పమును నెరవేర్చు సాంత్వన గూర్చున్!**

**తప్తమనస్కుల, ఆర్తుల**
**సప్తగిరులనెక్కి నీదు చరణము వ్రాలన్**
**ఆప్తత మీరగ వారిని**
**తృప్తి పరచెద వసహాయ! తిరుమలరాయా!**

**ఎన్నెన్ని మెట్లునెక్కిన**
**అన్నన్ని యిడుముల బాపు ఆర్త త్రాణా!**
**ఎన్నని పొగుడుదు నిన్నిక**
**నిన్నెన్నడు మరువనట్టి నెనరు నొసగుమా!**

**మా పాతక జీవితమున**
**పాప తమోరాశులెల్ల భగ్నముచేయన్ !**
**దీపంబై నీదుకృపా**
**కైపాణి యెపుడును మమ్ము కాపాడు నహో!**

**భవసాగరమును దాటగ**
**భవ భావంబు నినుచేరి భయమున్ వీడన్**
**స్తవ పూజామార్గములను**
**అవధారణ చేతు నిన్ను ఆత్మానందా!**

**మొదవుల క్షీరము కన్నను**
**కదళీ ఖర్జూరఫలము కన్న నమితమౌ**
**ముదమును గూర్చెడు, నీ నా**
**మ దుగ్ధ పానమ్ము చేయ మాయ తొలగదే!**

**ధనదార పుత్రమోహము**
**కననీదు కలియుగ మాయ! కల్ల కలయ నీ**
**మనుజుడు నిజమని నమ్మును**
**అనఘా! యీమాయబాపు ఆశలుడుగగన్!**

**– కుంతి ( కె.కౌండిన్య తిలక్)**

# శ్రీ వేంకటేశ్వరుని భక్తుడైన, శ్రీకృష్ణదేవరాయల వారి నాణెములు




- డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

విద్యారణ్యుల సంకల్పబలంతో హరిహర, బుక్క రాయలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. ఈ సామ్రాజ్యాన్ని పరిపాలించిన సంగమ, సాళువ, తుళువ వంశీయులలో శ్రీకృష్ణదేవరాయలు ప్రముఖంగా విశ్వవిఖ్యాతి గాంచినవాడని చెప్పవచ్చు.

క్రీ.శ.1509లో రాయలు సింహాసన మధిరోహించాడు. "నిలిచినన్నాళ్ళు నౌక తీరువెలిగినదియు, వెలిగినన్నాళ్ళు మిరుమిట్లు గొలిపినదియుగా", రాయలకాలంలో మహావైభవం సంతరించుకొని "మాణిక్యసంపదలన్, రాసులు వోసి వీథులను నమ్మన్నాగిరీమాడలందు దివారాత్రముల్" అన్నారు చరిత్ర కారులు.

బంగారు నాణెములు విలువను బట్టి వివిధములుగ చలామణిలోనుండేవి. పెద్దవరహ (సుమారు 7.58 గ్రాములు) వరహ (3.4 గ్రాములు) ప్రతాప లేదా అర్ధవరహ (1.7 గ్రా) అర్ధ ప్రతాప 1 కాలు వరహ (0.8 గ్రా) ఫణ (వరహలో పదింట ఒక భాగం 0.340గ్రా) అని వ్యవహరించేవారు.

కృష్ణదేవరాయల పట్టాభిషేక సమయంలో, బంగారు వరహనాణెంలో, చేతవెన్నముద్దగల బాలకృష్ణుని బొమ్మ ఉండేది. ఈ 'వరహ' ను 'వెన్నముద్ద నాణెమని' పిలిచేవారు. ఇది సుమారు 7.68 గ్రాముల తూకం ఉండేది. దీన్ని 'పెద్దవరహ' అనేవారు.

ఉదయగిరి (ఒరిస్సా)ని జయించి తన దేవేరులైన తిరుమలదేవి, చిన్నాదేవిగార్లతో తిరుపతిలో తన ఆరాధ్య దైవమైన శ్రీ వేంకటేశ్వరునికి, వజ్రవైఢూర్యఖచితములైన, అమూల్యమైన కానుకలను సమర్పించారు రాయలు. ఆ దిగ్వి జయ సంస్మరణార్థంగా, తిరుమలేశునికి ముప్పదివేల బంగారు నాణెములతో కనకాభిషేకం జరిపించారు. కనకాభిషేక సమయంలో, రాయలవారికి ఆయన రాణులకు, అపూర్వమైన అనుభవం కలిగిందట! తైలదీపాల వెలుగులో, మెరిసే నాణె ములు తిమ్మప్ప ముడినుండి అడుగులపైపడుతూ, సహస్ర సూర్యకిరణములు, తిరుమలేశుని అర్చించినట్లు కనిపించిందట! పులకాంకితులైన రాయలకు, తన సామ్రాజ్యం, రాజప్రాసాదం, అష్టైశ్వర్యాలు తృణప్రాయంగా అనిపించి, స్వామి సన్నిధిలో అవనత శిరస్కుడై నిల్చుండవలెననే అభిలాష కలిగిందట!

ఆ అభిలాష మేరకు రాయలవారు తన, తన దేవేరుల రాగి విగ్రహాలను తయారు చేయించి, తిరుమలేశుని పాద సన్నిధిలో నెలకొల్పారు. ఈనాటికీ ఆ విగ్రహాలు భక్తుల ప్రశం సలందుకొంటున్నాయి.

శ్రీ వేంకటేశ్వరునికి కనకాభిషేకంలో సమర్పించిన పెద్ద వరహాలను, తిరుపతి వరహాలంటారు. ఈ నాణేల ముందు వైపున పొడుగాటి కిరీటాన్ని ధరించిన వేంకటేశ్వరస్వామి కమ లాసనంపై నిల్చున్నట్లుంటాడు. వెనుకనున్న కుడిచేత చక్రం, ఎడమచేత శంఖం, ఎదుటనున్న కుడిచేయి అభయముద్రలో నుంటాయి. ఎడమచేయి తొడపైనుంటుంది. ఎత్తైన మకరతోరణ



వరహా / గద్యాణ






ప్రభావళి చక్కగా అలంకృతమై ఉంటుంది. నాణెం వెనుకవైపున 'శ్రీకృష్ణరాయ' అన్నపేరు మలచబడి ఉంటుంది.

సాధారణంగా, రాయల ఇతర నాణాలలో 'శ్రీ ప్రతాప కృష్ణరాయలు' అన్న బిరుదంతో నుంటుంది. కాని, ఈ నాణెంలో 'ప్రతాప' బిరుదం లేదు. శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో తన 'బిరుదు' ఉండటం సముచితం కాదని రాయలవారు భావించి ఉండవచ్చు.

వరహా / గద్యాణముల తూకం 3.4 గ్రాములు. ముందువైపున వెన్నముద్ద చేత ధరించిన బాలకృష్ణుని బొమ్మ ఉంటుంది. వెనుకవైపున శ్రీ ప్రతాపకృష్ణరాయ అన్న పేరు నాగరిలిపిలో ఉంటుంది. సింహాసనంపై కూర్చున్న బాలకృష్ణుని నాణెం వెనుకవైపున శంఖ, చక్రాలుంటాయి. కొన్ని నాణెములలో బాలకృష్ణుడు వివిధ భంగిమల్లో కూర్చున్నట్లుం




టాయి. కొన్నింటిలో, నెమలి పింఛములు ధరించిన బాల కృష్ణుని బొమ్మలుంటాయి. కొన్నిటిలో యజ్ఞోపవీతం, భుజ కీర్తులు, మొలత్రాడు, కంఠాభరణాలుంటాయి.




కొన్ని శతాబ్దాలుగ అట్టి నాణెములే చలామణిలో ఉండేవి. చిత్రదుర్గం పాళెగాడు, ఆ విధమైన నాణెములనే తయారు చేయించాడు. ప్రతాప లేదా అర్ధవరహా 1.3 గ్రాము తూకంలో ఉండేది.

**ఫణ / హణ :**

ఈ బంగారు నాణెం తూకం 0.34 గ్రాములు. ఇవి చాల అపురూపమైనవి. ముందువైపున 'కాళియ' గుర్తు, వెనుక భాగంలో 'కృష్ణరాయ' అన్న పేరు నాగరిలిపిలో ఉంటుంది.




రాగి నాణెములు, ఒక గ్రాము మొదలు, పదిహేడు గ్రాముల తూకం లోనున్నాయి. చాల నాణెములపై 'గరుత్మంతుని' బొమ్మ ఉంటుంది. వెనుకవైపున 'శ్రీ ప్రతాపకృష్ణరాయ' అన్న పేరుంటుంది. కొన్ని నాణెములపై 'నంది'; కొన్నింటిపై 'ఏనుగు' బొమ్మలు, వెనుకవైపున 'శ్రీకృష్ణరాయ' అన్న పేరుంటుంది. ఇవియే శ్రీకృష్ణదేవరాయల కాలపు ప్రశస్తమైన నాణాలుగా మనం చెప్పుకోవచ్చు.

*('తరంగ' కన్నడ వారపత్రిక సౌజన్యంతో..)*

## వార్తాలహరి

### 6వ విడత కల్యాణమస్తు.....

రాష్ట్రవ్యాప్తంగా 6వ విడత కల్యాణమస్తు కార్య క్రమాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం మే నెల 20వ తేదీన సమర్థవంతంగా నిర్వహించింది. ఈ విడత కల్యాణమస్తులో సుమారు 12 వేల జంటలు ఒక్కటైయ్యారు.

హైదరాబాదులో జరిగిన కార్య క్రమానికి రాష్ట్ర ముఖ్యమంత్రి గౌరవనీ యులు శ్రీ నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డి, తిరు మల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఐ.వై.ఆర్. కృష్ణారావు, ఐ.ఏ.ఎస్., పాల్గొని నూతన వధూవరులను ఆశీర్వ దించారు. అన్ని జిల్లాల్లో కలెక్టర్ల ఆధ్వర్యంలో జరిగిన కల్యాణ మస్తు కార్యక్రమంలో ఆయా ప్రాంతాల మంత్రులు, ఎం.పి.లు, ఎం.ఎల్.ఏ.లు, వివిధ అధికారులు హాజరై నూతన వధూవరు లకు తిరుమల తిరుపతి దేవస్థానం వారిచే పంపిణీ చేయబడిన తాళిబొట్లు, మెట్టెలతో పాటు వివాహ వస్తుసామగ్రిని అంద జేశారు. తిరుపతి మున్సిపల్ కార్పొరేషన్ కార్యాలయం ఆవరణ లోని నెహ్రూ లలిత కళాప్రాంగణంలో జరిగిన కల్యాణమస్తు కార్యక్రమం అప్పటి తిరుమల సంయుక్త కార్యనిర్వహణాధికారి శ్రీ భాస్కర్, ఐ.ఏ.ఎస్., ఆధ్వర్యంలో 31 జంటలకు వివాహం జరిగింది.

### హృషీకేష్‌లో ఘనంగా జరిగిన శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు

తి.తి.దేవస్థానాల ఆధీనంలోనున్న హృషీకేష్‌లోని శ్రీ వేంకటేశ్వరస్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలను ప్రతి సంవ త్సరంలాగే ఈ సంవత్సరం కూడా ఎంతో ఘనంగా నిర్వహిం చారు. మే, 14 శనివారం అంకురార్పణతో మొదలైన ఈ బ్రహ్మో త్సవాలు మే, 23 చక్రస్నానం మరియు ధ్వజావరోహణంతో రమణీయంగా ముగిశాయి. 19వ తేది ఉదయం పల్లకీఉత్స వంతోపాటు సాయంకాలం ఊంజల్‌సేవ మరియు రాత్రి స్వామి వారికెంతో ఇష్టమైన గరుడోత్సవం కనులవిందుగా జరిగింది.

ఈ తేదీలలోనే తిరుమల తిరుపతి దేవస్థాన అనుబంధ ఆలయమైన నారాయణవనంలో కూడా శ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలు శాస్త్రోక్తంగా జరిగాయి. భక్తులు విశేషసంఖ్యలో పాల్గొన్నారు.

### మహోత్సవంగా పద్మావతీ పరిణయం

మే, 11 బుధవారం శ్రీ పద్మావతీ పరిణయోత్సవాలు వైభవంగా జరిగాయి. ఈ సందర్భంగా తిరుమలలోని నారా యణగిరి ఉద్యానవనాన్ని రంగురంగుల పుష్పాలతో శోభాయ మానంగా అలంకరించారు. శ్రీదేవి, భూదేవి సమేత శ్రీ మల యప్పస్వామి గజవాహనంపై ఊరేగుతూ నారాయణగిరి ఉద్యానవనాన్ని చేరారు. అక్కడ శ్రీవారికి ఆస్థానం జరిగింది. ఈ కార్యక్రమంలో తి.తి.దేవస్థానం అధికారులతో పాటు, భక్తులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు.

### అన్నమాచార్య జయంత్యుత్సవాలు

పదకవితా పితామహుడు శ్రీమాన్ తాళ్లపాక అన్నమా చార్యుల 603 వ జయంత్యుత్సవాలు మే నెల 17 నుంచి 19వ తేది వరకు తిరుమల తిరుపతి దేవస్థానాల ఆధ్వర్యంలో అత్యంత వైభవంగా జరిగాయి. ఈ జయంత్యుత్సవాలను ఈ దఫా తిరుపతి, తిరుమలతో పాటు తిరుచానూరు, తాళ్లపాకలలో కూడ ఏకకాలంలో నిర్వహించారు. అలాగే రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో కూడా ఉత్సవాలు జరిగాయి.

తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో ఉదయం 10 గం॥ల నుండి మధ్యాహ్నం 1 గం॥ల వరకు అన్నమయ్య సాహితీ కార్యక్రమాలు, సాయంత్రం 6 గం॥ల నుంచి సంగీత, నృత్య కార్యక్రమాలను ఈ మూడు రోజులు నిర్వహించారు.

### వెంగమాంబ జయంత్యుత్సవాలు

భక్త కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ 281వ జయంత్యుత్సవాలను తిరుమల తిరుపతి దేవస్థానముల ఆధ్వ ర్యంలో మే 15, 16 తేదీలలో జరిగాయి. 15వ తేది ఉదయం 7 గం॥లకు తరిగొండలోని లక్ష్మీనారాయణస్వామి ఆలయంలో ఉత్సవమూర్తులకు స్నపన తిరుమంజనం, సాయంత్రం సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. అదేరోజు తిరుపతి అన్నమాచార్యుల కళామందిరంలో, తిరుమల నారాయణగిరిలో సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. 16వ తేది సాయంత్రం తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో వెంగమాంబ జీవిత చరిత్ర తోలుబొమ్మలాటను ప్రదర్శించారు. ఈ కార్యక్రమాల్లో విరివిగా భక్తులు పాల్గొన్నారు.

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
(పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలిసింది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
0877 - 2264359
0877 - 2264543

☛ సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపవచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.

☛ మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.

శ్రీపతి యీతఁ డుండఁగాఁ - జిక్కినవారి నమ్ముట
తీపని మీసాలమీది - తేనె నాకుట సుండి

తలచి నంతటిలోనె - దైవ మెదుటఁ గలఁడు
కొలువనేరని యట్టి - కొరతే కాని,
యిల నరుల గొలుచు - టెందో కోకలు వేసి
బలుకొక్కెరలవెంటఁ - బారాడుట సుండి



శరణన్న మాత్రమున - సకలవరము లిచ్చు
నిరతి మరచినట్టి - నేరమే కాని,
పోరి నితరోపాయానఁ - బొరలుట గాజుఁబూస
గరిమ మాణికమంటా - గట్టుకొంట సుండి

చేత మొక్కితే జాలు - శ్రీ వేంకటేశుఁడు గాచు
కాతరాన సేవించని - కడమే కాని,
యీతల నిది మాని మ - రెన్ని పుణ్యాలు సేసినా
రీతి నడవిఁ గాసిన - రిత్త వెన్నెల సుండి

(3-169)



శ్రీ లక్ష్మీపతి నమ్మినవారిని కాపాడుటకు సిద్ధముగా నున్నాడు. ఇత డుండగా తక్కినవా రెవరో తమ్ము రక్షింతురని నమ్ముట వలసి నంత తేనె చెంతనుండగా దాని నాస్వాదింపక మీసాలపై తేనె తీపని నాకుటవంటిది సుమా!

**సెప్టెంబరు నెల ముఖ్య పండుగలు**

**01 - వినాయక చవితి**
**09 - వామన జయంతి**
**11 - అనంతపద్మనాభ వ్రతం**
**27 - మహాలయ అమావాస్య**

## ఎంతగానో ఆకర్షించాయి

జూన్ మాసపత్రిక ముఖచిత్రంలో వచ్చిన 'శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే' వాక్యం మా కుటుంబ సభ్యులందరినీ ఎంతగానో ఆకర్షించింది. అంతేకాక శ్రీమన్నారాయణుని శయన విగ్రహాలు, మారీచుని రామ భక్తి, అవతారాలందించిన ప్రేమతత్త్వం మొదలైన వ్యాసాలు, శీర్షికలు కూడా ఆకర్షించాయి.

**- పూల మనోహర్, కామినాయన పల్లె, చిత్తూరు జిల్లా.**

## మా ముంగిటికి వచ్చినట్లుంది

జూన్ నెల సప్తగిరి మాస పత్రికను చూస్తే, వేంకటేశ్వరుడే మా ముంగిటకు వచ్చినట్లు అనుభూతి కలిగింది. రామానుజుల గురించి 'రాయలు-రామానుజులు'లో విపులంగా వివరించినందుకు రచయితకు అభినందనలు.

**- తిరుమల శెట్టి వేంకటేశ్వర రావు, ఆర్.అగ్రహారం, గుంటూరు.**

## సందర్భోచిత వ్యాసాలు

అన్నమయ్య జయంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసంగా ప్రచురించిన 'శ్రీ వేంకటేశ్వర తత్త్వం' చాలా చక్కగా ఉంది. వేంకటాచల క్షేత్ర తేజోవైభవాన్ని, భక్తితత్త్వాన్ని దశదిశలా వ్యాప్తి చేసిన అన్నమాచార్యులు, వారి కుటుంబసభ్యుల గురించి వ్యాసంలో ప్రచురించినందుకు అభినందనలు. ఇదే కాక ప్రతి నెలా మీరిలా సందర్భోచిత వ్యాసాలు ప్రచురిస్తున్నందుకు కృతజ్ఞతలు.

**- శ్రీపాద వెంకటరమణ, విశాఖపట్నం.**

## దేవాలయాలు...

మన దేవాలయాలు శీర్షికలో ఆయా ప్రాంతాల్లో స్థానికంగా ఉన్న దేవాలయాల గురించి చక్కగా ప్రచురిస్తున్నందుకు ధన్యవాదాలు. దేవాలయ వివరాలు చాలా బాగున్నాయి. అలాగే తిరుపతి పరిసరప్రాంతాల దేవాలయాలను గురించి తెలుపగలరు.

**- యు.శ్రీహరి, హైదరాబాదు.**

# మీ మాట

## ఛాయాచిత్రాలు

జూన్ సంచికలో ముఖచిత్రం, కాప్షన్ ఆనందాన్నిచ్చాయి. శ్రీవారి జ్యేష్ఠాభిషేకం, శ్రీ గోవిందరాజ స్వామివారి బ్రహ్మోత్సవాలు, అప్పలాయిగుంట ప్రసన్న వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాల ఛాయా చిత్రాలు మమ్మల్నెంతో ఆకట్టుకున్నాయి. సంపాదకీయం, వేదం తెలుసుకుందాం మొదలైనవి కూడా బాగున్నాయి.

**- పి.మనోహర్ శెట్టి, ఐరాల.**

## చాలా తెలుసుకున్నాం!!

సప్తగిరి మాసపత్రికలో షేక్ మౌలాలి గారు రచించిన 'మారీచుని రామభక్తి'లో ఇంతకు మునుపు రామాయణంలో తెలియని విషయాలు చాలా తెలుసుకున్నాం!!

**- గుండా పంతుల కామేశ్వరరావు, రామాంతపూర్, హైదరాబాదు.**

## సంతోషం...

అందరికీ నచ్చిన, అందరూ మెచ్చిన పత్రిక సప్తగిరి. ఈ కాలంలోని పిల్లలకు, పెద్దలకు పురాణ విజ్ఞానం, మన సంస్కృతిని గురించి తెలియజేస్తున్నందుకు సంతోషం.

**- దరిశి సత్యవతి, నాగపూర్.**

శ్రీ ఓం నమో వేంకటేశాయ

"శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే"

శ్లోక సూక్తితో ఆనందనిలయాన్ని ఒక వైపు శ్రీవారి దివ్య మూర్తిని మరోవైపు ప్రచురించిన ఈ జూన్ "సప్తగిరి" ముఖచిత్రం అత్యద్భుతంగా క్షేమము కల్గిస్తామనేలా వుంది. తొలి పేజీలో ప్రచురించే అన్నమయ్య పదకవితలు అద్భుతం. అలాగే శ్రీవారి ముత్తంగి కవచ చిత్రాలు కనులపండువైనాయి. ప్రతి పేజీలో దిగువన ప్రచురిస్తున్న "సూక్తులు" నిత్య సత్యాలు. "సప్తగిరి" ని నిత్యనూతనంగా తీర్చిదిద్దుతున్న పత్రిక సిబ్బందికి కృతజ్ఞతలతో.... ఎమ్. వీర మహేంద్ర,

సెల్: 8121238884 తాడిపత్రి - అనంతపురం(జిల్లా).

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.



బుద్ధిహీనుడైన స్నేహితుని కన్నా,
బుద్ధిమంతుడైన శత్రువు మేలు.

# సప్తగిరి


తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 42 ఆగస్టు, 2011 సంచిక : 03





గౌరవ సంపాదకుడు :
ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త - ప్రధాన సంపాదకుడు :
సి. శైలకుమార్, ఎం.ఏ.

సంపాదకుడు :
డా॥ కె. రాధారమణ

ముద్రాపకుడు :
ఎం. కార్తీక్, ఎం.ఏ., ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి. శివప్రసాద్


ముఖ చిత్రం :
**నవనీతకృష్ణుడు**

చివరి పుట :
**గోపాలకృష్ణుడు**




***వివరాలకు :***

ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

**విదేశాలకు**

సం॥ చందా -- రూ. 850-00

# గౌరవ సంపాదకులకు స్వాగతం



శ్రీవారిసేవే జీవితాశయంగా గల శ్రీ వేంకటేశ్వర స్వామివారి భక్తులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా 2011, జూన్ 18న పదవీబాధ్యతలు స్వీకరించారు. గతంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థికశాఖ కార్యదర్శిగా, మహబూబ్‌నగర్ జిల్లా కలెక్టరుగా అనుభవజ్ఞులైన వీరు పారదర్శక పరిపాలకులుగా, క్రమశిక్షణ కల్గిన అధికారిగా పేరు పొందారు. తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా విచ్చేసిన తాను శ్రీ వేంకటేశ్వర స్వామివారి సేవకు, భక్తుల సేవకు అత్యంత ప్రాధాన్యత ఇస్తానని పూర్వపు అధికారుల సంప్రదాయాలను, పద్ధతులను మున్ముందు కూడా కొనసాగిస్తానన్నారు.

పదవీ స్వీకరణ అనంతరం మాట్లాడుతూ ఆలయ మర్యాద ఎలా కాపాడాలి, భక్తుల సౌకర్యాలు ఎలా అభివృద్ధి చేయాలి, ఉన్న సౌకర్యాలు ఎలా కాపాడాలి అనే అంశాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తానన్నారు. అన్ని స్థాయిల ఉద్యోగులను కలుపుకొని తమ బాధ్యతలను నిర్వర్తిస్తానన్నారు. అలాగే బాధ్యతలను విస్మరిస్తే ఎంతటివారినైనా ఉపేక్షించనని వెల్లడించారు. వ్యక్తిగతంగా తాను శ్రీవారి సేవను మనసా వాచా నిర్వర్తించడమే కాకుండా ఇతర అధికారులతో కూడా వారి వారి బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించే విధంగా చేస్తామన్నారు. ఏ రకమైన తప్పులు, దోషాలకు తావివ్వకుండా శ్రీ వేంకటేశ్వరుని సేవ చేయడమే తమ ఉద్దేశ్యమని దాని కోసం ఉద్యోగులందరిని, భక్తుల సహకారాన్ని కోరుతున్నామని అన్నారు.

కార్యనిర్వహణాధికారిగానే కాక వీరు సప్తగిరి మాసపత్రిక గౌరవసంపాదకులుగా వ్యవహరిస్తారు. భక్తులందరితో పాటు సప్తగిరి కార్యనిర్వాహక సిబ్బంది కూడా శ్రీ ఎల్.వి. సుబ్రహ్మణ్యం గారికి హార్దిక స్వాగతాన్ని అందజేస్తోంది. అలాగే, వీరికి, వీరి కుటుంబ సభ్యులకు శ్రీవారి ఆశీస్సులు లభించాలని **సప్తగిరి** ప్రార్థిస్తోంది.

# వీడ్కోలు



తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా రెండు సంవత్సరాలుగా బాధ్యతలు నిర్వహించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు ఐ.ఏ.ఎస్., కార్మిక శాఖకు బదిలీ అయ్యారు. తిరుమలలో సాధారణ భక్తుల సౌకర్యాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి, వాటిని సాధించడం కోసం అనేక కార్యక్రమాలు చేపట్టి పరిపాలనలో అనేక మార్పులు, చేర్పులు చేసి విజయబాటన నడిచారు. వీరికి, వీరి కుటుంబ సభ్యులకు శ్రీవారి ఆశీస్సులు ఎల్లవేళలా ఉండాలని **సప్తగిరి** ప్రార్థిస్తోంది.

# లీలామానుష విగ్రహుడు

– కె. సుబ్రహ్మణ్యం

శ్రీమన్నారాయణుడు ధరించిన దశావతారాల్లో శ్రీరామ, శ్రీకృష్ణావతారాలకే ప్రాచుర్యమెక్కువ. ఏ భారతీయుడైనా కొలిచేది రాముడినో! కృష్ణుడినో! ఒకవేళ ఆంజనేయస్వామిని కొలిచినా రాముణ్ణి కొలిచి నట్లే! ఒకే ఒక్క తేడా మనకు వీరిలో ప్రస్ఫుటంగా కన్పి స్తుంది. రాముడెప్పుడూ 'నేనూ మానవమాత్రుడినే' నంటూ మానవుడిగానే వ్యవహరించాడు. సీతావియోగ విషయంలో మన కీ విషయ మవగత మౌతుంది.

ఇకపోతే కృష్ణుడలాకాదు. ప్రతి నిమిషం నేను "మానవుణ్ణి కాను, భగవంతుడ" ననే భావం ప్రత్యక్షంగా ప్రతి పలుకులో మనకు కనబడుతుంది. అసలు ఆయన జననమే ఒక అద్భుతం.

సాధారణంగా మానవశిశువు జననం నాలుగు భుజాలతో, శంఖచక్రగదాదులతో జరగదు. శ్రీరామ చంద్రుని జననం సాధారణ మానవరూప ఆవిర్భావం. కానీ, శ్రీకృష్ణోదయం షోడశకళలతో నిండిన చంద్రో దయంలాంటిది. దీన్ని బట్టే శ్రీకృష్ణుడు మానవాతీతుడని, మాయాతీతుడని సుస్పష్టమవుతున్నది. దేవకీవసుదేవులు కూడా ఇదే మాటంటారు.

"ఈ చతుర్థభువనాలను కుక్షిలో నింపుకొన్న నీవు మా ఈ కుక్షి నుండి ఆవిర్భవించడం అసాధ్యం. అసలు నీకు పుట్టుకే లేదు గదా! లోకంలో దుష్టశిక్షణ, శిష్టరక్ష ణార్థం ఈ రూపం ధరించావు కానీ నీవు పుట్టడమనేది అవివేకం".

మహాకవి పోతన కూడా "జననము లేక కర్మ ముల జాడలపోక, ఎందుజూచిన మరిలేవు దేవునికి, జీవుని కైవడి జన్మకర్మముల్" అని స్వామిని బహుధా స్తుతించాడు. శ్రీకృష్ణావతారం మొదటినుండి చివరి వరకు ఒక అద్భుత పరంపరా విశేషం. తన రాకముందే తన మాయను లోకానికి రప్పించడం; పుట్టినట్లుగా కనబడిన పిమ్మట కారాగారద్వారాలు వాటంతటవే తెరుచుకోవడం; యమునానది రెండుపాయలుగా చీలి వసుదేవునికి దారివ్వడం; తనకు ఆడపిల్ల పుట్టిన విషయంగానీ, బిడ్డను తీసుకొనిపోయి మగపిల్లవాడిని



**ఆగష్టు 22న గోకులాష్టమి సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

పడుకోబెట్టిన విషయంగానీ యశోదకు తెలియక పోవడం అన్నీ పరమాద్భుతాలే.

మన్ను తిన్నావని అమ్మ అంటే "అమ్మా! నేనే మైనా వెర్రివాడనా?" అన్న ప్రశ్నలో "సత్యాసత్యాలు తెలిసిన సర్వజ్ఞుడను నేను" అనే సమాధానం మనకు స్ఫురిస్తుంది.

'కృష్ణుడే ప్రపంచం సృష్టి స్థితి లయలకు మూలం. ఈ చరాచర విశ్వమంతా ఆయన విలాసమే' నని కురుపితామహు దన్న మాటలు ప్రత్యక్షర సత్యాలు.

కృష్ణుని మాహాత్మ్యం గురించి చెబుతూ –

**ఏకోఽపి కృష్ణస్య కృత ప్రణామో,**
**దశాశ్వమేధావభృథైః నతుల్యః,**
**దశాశ్వమేధీ పునరేతి జన్మ,**
**కృష్ణప్రణామీ న పునర్భవాయ.**

– అన్న మాటలు ప్రాతఃస్మరణీయాలు. శ్రీకృష్ణునికి చేసిన ఒక నమస్కారం పది అశ్వమేధాలకు సమానం. దశాశ్వమేధికి కూడా పునర్జన్మ ఉన్నది. కానీ కృష్ణునికి ప్రణామం చేసిన వానికి 'నపునర్భవాయ' అంటే మళ్ళీ జన్మమనేదుండదు. కేవలం ప్రణామం చేస్తేనే ఇంతటి మహత్తరమైన సుగతిని కల్పించగల శక్తి ఒక కృష్ణునికి మాత్రమే ఉన్నది. యజ్ఞయాగా లక్కర్లేదు. దేహాన్ని శుష్కింపజేసి ఉపవాసాది ప్రక్రియల జోలికి పోనక్కర్లేదంటూ ఇంత సులభమైన 'ప్రణామ' మంత్రాన్ని మనకు అందజేసిన స్వామి అందరికీ సులభసాధ్యుడై నాడు.

అవతారమనేది 'అవతరణ' మన్న దానికి పర్యాయపదం. ఇక్కడ స్వామి దిగివచ్చారని భావించాలి. దివి నుండి భువికి ఆయన దిగి వచ్చారన్నదే దాని అంతరార్థం. ఆయన జననమే మహాద్భుతం. విష స్తన్యాన్నిచ్చిన పూతనకు అమృతతుల్యమైన సాయుజ్యాన్ని స్వామి ఇవ్వలేదా? ఏతావాతా ఎక్కడ చూచినా స్వామివి అద్భుత రూపాలే! మహాద్భుతకార్యాలే!

అందుకే గీతలో ఆయనే స్వయంగా –

**అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్**

'భగవంతుడనైన నన్ను మానవుడిగా భావించు వారు మూర్ఖుల'ని కరాఖండిగా చెప్పాడంటే ఇంకా వివరణ అనవసరం. అందుకే రాముడి నడతను, వ్యవహారాన్ని మన మనుసరించాలి. కానీ కృష్ణుడి విషయంలో ఆయనచర్యలకు బదులు బోధనలు మాత్రమే మనం పాటించాలి. ఎందుకంటే రాముడు మర్యాదా పురుషోత్తముడు! కృష్ణుడు లీలామానుష విగ్రహుడు!

# పంచమవేదంలోని పంచకథారత్నాలు

– డా॥ కె.వి.సత్యనారాయణ

మానవ ధర్మాల పట్ల, మానవీయ విలువల పట్ల దిశా నిర్దేశం చేసే గ్రంథమే మహాభారతం. భారతీయ జీవన మార్గంలో మంచి–చెడుల సంఘర్షణలను చిత్రీకరిస్తూ అధర్మం మీద ధర్మం, అవినీతిమీద నీతి, చెడుమీద మంచీ సాధించిన విజయాలను విశ్లేషించిన గ్రంథమిది. విద్యాభ్యాసం చేసే నేటి యువతీయువకులకు భారతంలోని నీతులు, ధర్మాలు వారికి వివేకాన్నీ, వివేచననూ అందిస్తాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

గురువు చెప్పింది వింటూ, చేస్తూ, ఎన్నో కష్టాలను ఓర్పుతో సహిస్తూ నేర్చుకున్న విద్యయే ఆ విద్యార్థికీ, సమాజానికీ ఎంతో ఉపయోగకరమని భారతం ఆరణ్య పర్వంలోని యవ క్రీతుని కథ చెప్తోంది.

పూర్వం భరద్వాజుడు, రైభ్యుడనే ఇద్దరు మహర్షులు ఎంతో స్నేహంగా ఉండేవారు. భరద్వాజునికి యవక్రీతుడు; రైభ్యునికి అర్వావసువు, పరావసువు అనే కుమారులున్నారు. భరద్వాజుడు తపస్సులో మునిగిపోయి యవక్రీతుని పట్టించు కోలేదు. రైభ్యుడు మాత్రం బిడ్డల్ని చక్కగా చదివించి విద్వాం సుల్ని చేశాడు.

యవక్రీతుడు విద్వాంసుడు కావడం కోసం తపస్సుకు పూనుకున్నాడు. దేవేంద్రుడు ప్రత్యక్షమై "నాయనా! విద్య గురు ముఖతః నేర్చుకోవాలి. ఉత్తమ గురువునాశ్రయించు"మని సలహా నిచ్చాడు. అది నచ్చక యవక్రీతుడు తపస్సును తీవ్రతరం చేశాడు. ఇంద్రుడు ముసలి బ్రాహ్మణుడి వేషంలో వచ్చి యవ క్రీతుడు చూసేటట్లుగా గుప్పిటతో ఇసుక తీసుకొని నదిలో పోయసాగాడు. యవక్రీతుడు "ఏమిటీ పని?" అని ప్రశ్నించగా; "నదికి అడ్డంగా గోడ కడుతున్నా"నన్నాడు బ్రాహ్మణుడు. అప్పుడు యవక్రీతుడు నవ్వి "ఇంతటి మహానదికి గుప్పెడు ఇసుకతో గోడకట్టడం సాధ్యమా?" అన్నాడు. అందుకు బ్రాహ్మ ణుడు "నాయనా! గురుశుశ్రూష లేకుండా వేదవిద్యనంతా నేర్చుకోవాలననుకోవడం కంటె నేను చేసేది అవివేకమేం కాదు కదా"యని పలికాడు. యవక్రీతుడు ఆ వృద్ధ బ్రహ్మణుడిని ఇంద్రుడిగా గుర్తించి ప్రార్థించాడు. ఎంత చెప్పినా ప్రయోజనం లేదని భావించిన దేవేంద్రుడు అతనికి వేదవిద్యననుగ్రహించి వెళ్ళాడు.

యవక్రీతుడు తండ్రి కీ విషయాన్ని తెలుపగా "నాయనా! ఈ విధంగా విద్యసాధించడం అహంకారానికి కారణమౌతుంది. అయినా నువ్వెప్పుడూ రైభ్యుని కుమారు లతో మాత్రం వైరం తెచ్చుకోకు"మని సలహానిచ్చాడు. ఒక రోజు యవక్రీతుడు రైభ్యుని కోడల్ని చూసి మోహంతో బలాత్క రించాడు. ఆశ్రమానికొచ్చిన ఆ మహాముని తీవ్రక్రోధంతో ఒక సుందరాంగినీ, ఒక రాక్షసునీ సృష్టించాడు. ఆ సుందరాంగి యవక్రీతుని ఆకర్షించి కమండలాన్ని తీసుకుపోగా, రాక్షసుడ తణ్ణి సంహరించాడు. భరద్వాజుడు రైభ్యుని శపించి, తానూ ఆత్మత్యాగం చేసుకున్నాడు. చివరికి రైభ్యుడూ చనిపోయాడు. ఆ తర్వాత రైభ్యుని కుమారుడు అర్వావసువు సూర్యునుపాసించి అందర్నీ పునర్జీవితుల్ని చేశాడు.

పునర్జీవితుడైన యవక్రీతుడు దేవతలను కారణమడు గగా, వారు నాయనా! "అతడు గురుశుశ్రూషతో, అనేక కష్ట నష్టాలతో వేదవిద్యను నేర్చుకున్నాడు. అందుకే అంతటి శక్తివంతుడయ్యా"డని చెప్పి అంతర్ధానమయ్యాడు.

జీవితంలో ఎంతటి ఉన్నతశిఖరాలనధిరోహించినా అహంకారమనేది లేకుండా యువత జాగ్రత్తపడాలి. అహం కారం కలిగితే ప్రతి మనిషీ దంభోద్భవుడిలాగే పతనమైపోతారని హెచ్చరిస్తోందీ భారతం.

పూర్వం దంభోద్భవుడనే రాజుండేవాడు. భుజ బలంలో, పరాక్రమంలో అతనికి సాటి ఎవరూ లేరు. వంది మాగధులు ఆయన్ని కీర్తిస్తుంటే "ఈ భూలోకంలో నాతో యుద్ధం చేయగల మహావీరుడెవరైనా ఉన్నాడా?" యని అహంకారంతో విర్రవీగేవాడు. ఇలా ఉండగా ఒకనాడు కొంత మంది విప్రులు ఆ రాజుగారి సభకు విచ్చేసి "గంధమాదన పర్వతం మీద తపస్సు చేసుకుంటున్న నరనారాయణులను ఈ మూడు లోకాల్లో ఎవరూ జయించలేరని విన్నాం" అన్నారు. దంభోద్భవుడు ఆగ్రహంతో ఆ పర్వతం చేరి తపస్సు చేసు కుంటున్న వారిని చూచి తొడగొట్టి యుద్ధానికి పిలిచాడు. నరనారాయణులు మహారాజుకి అతిథి సత్కారాలు చేయబోగా వాటినీ తిరస్కరించి యుద్ధానికే కాలుదువ్వాడు.



మహారాజు బాణాన్ని సంధిస్తుండగా నరుడు నవ్వుతూ ఒక గడ్డిపరకను తీసుకుని "ఇది నీ సేనను నిలబెడుతుంది" అంటూ వదిలాడు. ఆ గడ్డిపరక రాజుగారి అపారమైన బాణా లను ముక్కలు ముక్కలు చేసింది. ఆ మహాసేనలోని వారందరికీ ముక్కులూ, చెవులూడిపోయి పలాయనం చిత్తగించారు. రాజుకి జ్ఞానోదయమై ఆ మహర్షుల కాళ్లపై పడ్డాడు. అప్పుడు వారు మహారాజా! అహంకారం, బలగర్వం ఎవరికుంటాయో అవి వారినే నాశనం చేస్తాయి" అంటూ హితబోధ చేశారు.

జీవితంలో మంచివారినీ, భగవద్భక్తులను గౌరవిం చాలి. అలాకాక వారిపట్ల అసూయతో ప్రవర్తిస్తే దుర్యోధనునికి పట్టిన గతే పడ్తుందని, వారికి సహకరించిన దుర్వాసుని వంటి గొప్పవారికి సైతం పరాభవం తప్పలేదనీ భారతం ఆరణ్య పర్వంలోని ఈ కథ బోధిస్తోంది.

పాండవులు జూదంలో ఓడిపోయి అడవులకు బయలు దేరారు. వారితో పాటు ఎందరో పురజనులు, వేదవిదులు కూడా అనుసరించారు. వీరందరినీ ఎలా పోషించాలా?యని ధర్మరాజు బాధపడ్తుండగా ధౌమ్యుడు ధర్మరాజుకు సూర్యోపాసన చేయు మని సలహానిచ్చాడు. ధర్మరాజు సూర్యుణ్ణుపాసించగా సూర్యు డొక పాత్రనిచ్చి; ధర్మనందనా! "ఇది అక్షయపాత్ర. ఎంత మందికైనా అన్నపానాలు సమకూర్చగలదు. అయితే మీ భార్య పాంచాలి భోజనం చేసి, ఈ పాత్రను పరిశుభ్రం చేశాక ఇక ఆ పూటకు భోజనం రాదు" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

ఆనాటి నుండి ధర్మరాజు అందరికీ అన్నదానం చేయ సాగాడు. అది విన్న దుర్యోధనుడు అసూయతో రగిలిపోయాడు. దుర్వాసమహర్షి అనుగ్రహం సంపాదించి, పాండవులపై లేనిపోనివి చెప్పి ఆయన్ను పాండవుల వద్దకు పంపాడు. పాండవులూ, ద్రౌపదీ అందరూ భోజనాలు చేశాక దుర్వాసుడు వాళ్లను చేరి, కుశలప్రశ్నలు వేసి ధర్మరాజా! "నేనూ, నా శిష్యులూ నదీస్నానం చేసి వస్తాం. మాకు భోజనాలు ఏర్పాటు చేయండి" అని చెప్పి వెళ్లాడు. చేసేదిలేక ద్రౌపది రెండు చేతులూ జోడించి శ్రీకృష్ణుని మనస్సులో వేడుకొంది. శ్రీకృష్ణుడు ప్రత్య క్షమై "ఈనాటి శాకపాకాలలో లేశమైనా యుంటే నా చేతిలో వెయ్యి" మన్నాడు. ద్రౌపదికి అక్షయపాత్రలో అంచున ఒక

అవిశాకు దొరుకుతుంది. దానిని శ్రీకృష్ణుని చేతిలో ఉంచగా ఆయన దానిని ఆరగించి "ముల్లోకాలకు తృప్తి" కల్గుగాక అంటూ వెళ్లిపోయాడు. ఎప్పుడైతే శ్రీకృష్ణుడలా అన్నాడో దుర్వాసునికీ, ఆయన శిష్యులకూ కడుపునిండుగా భుజించినంత ఆయాసం కలిగి అటు నుండి అటే వెళ్లిపోయారు.

నవీన నాగరికత యని నేటి యువతీయువకులు పెద్దలకు తెలీకుండా తొందరపడితే ముఖ్యంగా యువతులు శకుంతలలాగా బాధపడాల్సి వస్తుందనీ, మోసగించాలని ప్రయత్నించిన యువకులు దుష్యంతునిలాగా తరతరాలకు నిందను మోయాల్సి ఉంటుందనీ మహాభారతంలోని దుష్యంతోపాఖ్యానం హితం పలుకుతుంది.

మేనకా విశ్వామిత్రులకు కలిగిన బిడ్డకు కణ్వమహర్షి శకుంతల అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచేవాడు. దినదిన ప్రవర్ధమానమైన శకుంతల పదహారేళ్ళప్రాయంతో యౌవనంలోకి అడుగుపెట్టింది.

ఒకనాడు వేటకై వచ్చిన దుష్యంత మహారాజు అటుగా వచ్చి శకుంతల ముగ్ధమోహన సౌందర్యం చూసి ఆమెను మోహించి; తనను అంతగా ఆకర్షించిన ఆమె పుట్టు పూర్వోత్తరాలను కనుక్కుని; "నిన్ను నా భార్యగా గ్రహించి రాజ్యానికి తీసుకువెళ్ళి పట్టమహిషిని చేయాలనుంది" అంటూ శకుంతలకు తన ప్రేమను తెలియజేశాడు. ఆర్యా! "కణ్వమహర్షి నాకు గురువు. ఆయన అనుమతిలేనిదే నేను స్వతంత్రించి ఏ పనీ చెయ్యను" అన్నది శకుంతల. అందులకు దుష్యంతుడు "నీవు విశ్వామిత్రుని పుత్రికవు గనుక రాజపుత్ర కన్యవు. రాజులకు గాంధర్వవివాహం ధర్మమే"నంటూ ఆమెను ఒప్పించి గాంధర్వ వివాహం చేసుకున్నాడు.

పిదప దుష్యంతుడు కొంతకాలం శకుంతలతో సుఖించి మహారాణిగా హస్తినాపురానికి పిలిపించుకుంటానని చెప్పి రాజధాని చేరుకున్నాడు. ఆశ్రమానికొచ్చిన కణ్వమహర్షి విషయం తెలుసుకుని ఆమెను ఆశీర్వదించాడు. నెలలు గడుస్తున్నా దుష్యంతుని జాడలేదు. శకుంతల ఒక శుభ ముహూర్తంలో పండంటి మగబిడ్డను ప్రసవించింది. ఆ బిడ్డ దినదిన ప్రవర్ధమానమై



పెరుగుతుండగా ఒకనాడు కణ్వమహర్షి తల్లీ బిడ్డలను ఆశీర్వదించి, శిష్యులనిచ్చి హస్తినాపురానికి పంపాడు.

కొలువుతీరిన దుష్యంతునితో శకుంతల "మహారాజా! వీడు మీ కుమారుడు, స్వీకరించండి" అనగా దుష్యంతుడు 'ఓ మూర్ఖురాలా! నీవెవ్వరివి? నిన్ను నేనెప్పుడూ చూడలేదు. ఇటువంటి అసందర్భ ప్రలాపాలు కట్టిపెట్టి బైటకు నడు" మంటూ పరుషంగా మాట్లాడాడు. అదివిన్న శకుంతల రాజా! "కణ్వమహర్షి ఆశ్రమం దగ్గర మీరాడిన మాటలు మరువకండి. పంచభూతాలూ, సూర్యచంద్రులూ, అంతరాత్మ వీటిని కన్నుగప్పి ఎవరూ ఏమీ చెయ్యలేరు" అనంటూ ఎన్నెన్నో ధర్మసూక్ష్మాల నేకరువు పెట్టింది. ఆ మాటలు విన్నప్పటికీ దుష్యంతుడు "శకుంతలా! అబద్ధాలాడటం ఆడవారికి సహజగుణం. విశ్వామిత్ర సంతాన మని చెప్పుకుంటున్న నీవు కులటలా ప్రవర్తిస్తున్నావు. నిన్ను నమ్మలేను" అన్నాడు. సరిగ్గా అదే సమయానికి ఆకాశవాణి "మహారాజా! ఈమె నీ భార్య. వీడు నీ కుమారుడు. స్వీకరించు"మని పలికింది. ఆ మాటలు విన్న దుష్యంతుడు వారిరువురినీ తన భార్యాబిడ్డలుగా అంగీకరించాడు.

## గమనిక

శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య ప్రసాద పథకం 1999 సంవత్సరంలో ప్రారంభించబడింది. కొంతకాలానికి ఈ పథకం శ్రీ పద్మావతి అమ్మవారి నిత్య అన్నదాన పథకంగా మార్చబడి 31-3-2009 వరకు కొనసాగింది. తర్వాత ఈ పథకాన్ని ఎస్.వి.నిత్యాన్నదానం ట్రస్టులో కలపడం జరిగింది.

ఇప్పుడు ఇదే పథకాన్ని
**"శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య అన్నదానం ట్రస్టు"**గా
మార్చడం జరిగింది.

ఈ మార్పును భక్తులు గమనించి ఇకపై ఈ ట్రస్టుకు డి.డి.లు పంపగోరు భక్తులు "శ్రీ పద్మావతీ అమ్మవారి నిత్య అన్నదానం ట్రస్టు" పేర పంపగలరు.

ప్రస్తుతం దేశంలో, సమాజంలో కులాలమధ్య కురుక్షేత్రం సాగుతోంది. ప్రతికులం వాళ్లు తమదే గొప్పకులమని భావిస్తూ ఆధిక్యతాభావాన్ని ప్రదర్శిస్తున్నారు. దీనితో సమాజంలో మనస్పర్థలు పెరిగి అశాంతి వాతావరణం చోటు చేసుకుంటోంది. నిజానికి మహాభారతకాలం నాడు కులవ్యవస్థ ఉన్నా, అది మానవ మనుగడకు ఎలాంటి ఇబ్బందీ కల్గించలేదు. మంచి ఎక్కడున్నా స్వీకరించేతత్త్వం ఆనాడు అందరిలోనూ ఉండేది. కులం కంటే గుణం ప్రధానమని భావించారు. కసాయికులంలో పుట్టిన ధర్మవ్యాధుడు బ్రాహ్మణుడైన మునీశ్వరునికి జ్ఞానబోధ చేయగలిగాడని ఈ ధర్మవ్యాధోపాఖ్యానం దిశానిర్దేశం చేస్తోంది.

పూర్వం ఒక విప్రుడు అరణ్యంలో ఒక చెట్టుక్రింద కూర్చొని తీవ్రమైన తపస్సు చేసుకుంటుండగా ఆ చెట్టుపై నున్న కొంగరెట్ట తనపై పడిందని ఆగ్రహించి చూడగా; ఆ కొంగ మాడిమసైపోయింది. ఆ తర్వాత అతడు భిక్షాటనకెళ్ళి ఒక ఇంటి గుమ్మం ముందు నిలబడి "భవతీ! భిక్షాందేహి" అని పిలిచాడు. ఆ ఇంటి ఇల్లాలు భిక్ష తీసుకుని రాబోగా, అప్పుడే ఆమె భర్త ప్రయాణం చేసి అలసి ఇంటికొచ్చాడు. ముందుగా తన భర్తకు సేవలు చేసి, ఆ తర్వాత భిక్ష తీసుకుని వీథిలోకి వచ్చింది. వీథిలో వేచి ఉన్న ఆ విప్రుడు ఆమెను కోపంగా చూశాడు. అప్పుడామె "స్వామీ! మీ కోపానికి మాడిపోయే కొంగనుకాను నేను. పతిసేవను మించిన పరమార్థం లేదు నాకు" అన్నది. అప్పు డా విప్రుడు తెల్లబోయి అమ్మా! ఎక్కడో అడవిలో జరిగిన నా కథ నీకెలా తెలిసింది? నాకు జ్ఞానబోధ చెయ్యమ్మా" అని ప్రాధేయపడ్డాడు. అప్పుడా పతివ్రత "మునీశ్వరా! మిథిలా నగరంలో ధర్మవ్యాధుడనే అతను నీకు జ్ఞానబోధ చేస్తాడు. అక్కడి కెళ్లు"మన్నది.

ఆ ముని మిథిలానగరం చేరుకున్నాడు. మునిని చూచిన ధర్మవ్యాధుడు ఎదురొచ్చి సాదరంగా నమస్కరించి "ఆర్యా! మిమ్మల్ని నా వద్దకు పంపిన ఆ పతివ్రతాశిరోమణి క్షేమమా?" యని ప్రశ్నించాడు. ఆ మునికి మతిపోయినంత పనైంది. మాంసం అమ్ముకునే ఈ కసాయివానికి ఇంతటి శక్తి ఎలా వచ్చింది? అనే ఆలోచనలో పడ్డాడు. అతని ఆలోచనలను గ్రహించిన ధర్మవ్యాధుడు స్వామీ! " ఎవరో పశువుల్ని చంపి తెచ్చిన మాంసాన్ని నా వృత్తిధర్మంగా అమ్ముకుని జీవిస్తున్నానంతే! నా తల్లిదండ్రులను సేవించుకోవడం కంటే నేను చేసే ప్రత్యేక సాధనేమీ లేదు. వారిని సేవించుకుంటున్నందువల్లే నాకీ జ్ఞానం కలిగింది" అని ఎంతో వినమ్రంగా చెప్పాడు. అతని బోధను విన్న ఆ మునీశ్వరునికి "కులం కాదు గుణం ప్రధానం" అని జ్ఞానోదయమై తిరిగి తపస్సు చేసుకోవడానికై వెళ్ళిపోయాడు.

ఇలాంటి అనేక నీతికథలకు నిలయం మహాభారతం. ఇవన్నీ మన జ్ఞాననేత్రాన్ని తెరిపించి మనల్ని సన్మార్గులుగా చేస్తాయి. అందుకే భారతాన్ని ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంగాను, అధ్యాత్మవిదులు వేదాంతం గాను, నీతివిచక్షణులు నీతిశాస్త్రం గాను, పౌరాణికులు బహుపురాణ సముచ్చయంగాను భావించారు. ఒక్క మాటలో చెప్పాలంటే భారతంలో లేనిదెక్కడా లేదు. ఎక్కడ లేనిదైనా భారతంలో నుంటుందనడం అక్షరసత్యం. కనుక నేటి యువతీయువకులందరూ కూడా మహాభారతాన్ని చదువుతూ, ఇతరుల చేత చదివిస్తూ మన జీవితాల్ని సుసంపన్నం చేసుకోడాని కుపక్రమిద్దాం! ఉద్యుక్తులౌదాం! ఉద్యమిద్దాం!

**పారాశర్యం పరమ పురుషం విశ్వవేదైకయోనిం**
**విశ్వాధారం విబుధ వినుతం వేదవేదాంతవేద్యమ్ ।**
**శశ్వచ్ఛాంతం శమిత విషయం శుద్ధబుద్ధిం విశాలం**
**వేదవ్యాసం విమల మతిదం సర్వదాఽహం నమామి ॥**

పరాశరుని కుమారుడు, పరమపురుషుడు, వేదములను విశ్వవ్యాప్తం చేసినవాడు, జగత్తుకు ఆధారమైనవాడు, జ్ఞానులచే స్తుతించబడేవాడు, వేదవేదాంత వేద్యుడు, సదా శాంతమూర్తి, విషయాసక్తి లేనివాడు, నిర్మలమైన బుద్ధికలవాడు, విశాల స్వభావం కలవాడు, విమలమైన బుద్ధిని ప్రసాదించే వేదవ్యాసునికి నేను ఎల్లప్పుడు నమస్కరిస్తున్నాను.

### వ్యాసుని జననం :

మహర్షిసత్తముడు, శకకర్త, యుగపురుషుడు, సకల పురాణేతిహాస వాఙ్మయస్రష్ట, అతీంద్రియజ్ఞాని, విష్ణ్వంశ సంభూతుడు అయిన వ్యాసమహర్షి సత్యవతీ గర్భాన జన్మించిన వృత్తాంతాన్ని దేవీభాగవతం ఇలా చెప్పింది –

**సుషువే యమునాద్వీపే పుత్రం కామమివాపరమ్ ।**
**సాఽపి సత్యవతీ మాతా సద్యో గర్భవతీ సతీ ॥**

యమునాద్వీపంలో సత్యవతి సద్యోగర్భంలో అపర మన్మథుని వలె నున్న మహాతేజస్సంపన్నుడైన వ్యాసమహర్షి జన్మించాడు. ఆ ద్వీపంలోనే జన్మించి ఆ ద్వీపంలోనే ఉంచబడిన బాలుడు కాబట్టి అతనికి 'ద్వైపాయనుడు' అనే పేరు వచ్చింది. ఆయన పుట్టిన వెంటనే తల్లికి నమస్కరించి తపస్సు చేయడానికి ఆమె అనుమతిని పొంది నిష్క్రమించాడు.

**ద్వీపే న్యస్తతయా బాలః తస్మాద్ద్వైపాయనోఽభవత్**
**జాతమాత్రస్తు తేజస్వీ తామువాచ స మాతరమ్ ॥ -దేవీభాగవతం**

### వ్యాసుని ఆశ్రమం – తపస్సు :

వ్యాసమహర్షి ఆశ్రమం బదరికి వెళ్లే దోవలో అలకనందా సరస్వతీ నదుల సంగమస్థానంలోని 'శమ్యాప్రాస' తీర్థానికి సమీపంలో ఉంది. ఆయన వేద ప్రచారం ఇక్కడ నుండే ప్రారంభమైందని, పైలుడు, వైశంపాయనుడు, జైమిని, సుమంతుడు మొదలైన మహర్షులు ఆయనకు శిష్యులై ఇక్కడే వేదశాస్త్రాలలో శిక్షణ పొందారని పురాణాలు చెబుతున్నాయి. కాని వ్యాసమహర్షి మధురవద్దనున్న సోమతీర్థం, వైకుంఠ తీర్థముల మధ్యనున్న విష్ణుగంగాతీరంలో తపస్సు చేసినట్లు వరాహ పురాణం చెబుతున్నది –

**సోమవైకుంఠయోర్మధ్యే విష్ణుగంగేతి కథ్యతే ।**
**తత్రాఽతప్యత్తపో వ్యాసో మధురాయాం స్థితోఽమలః ॥**
**- వరాహపురాణం - 175**

వ్యాసమహర్షి సర్వమానవాళికి మేలు చేయాలనే పవిత్ర సంకల్పంతో తపస్సుకుపక్రమించాడు. ఈ విశ్వసృష్టి రహస్యాన్ని ఛేదించడమే ఆయన తపస్సు లక్ష్యం. వ్యాసమహర్షి ఆత్మ సాక్షాత్కార సాధనమైన తన తపస్సులో తనకు కలిగిన దివ్యానుభూతిని, తనకు గోచరించిన విశ్వరహస్యాన్ని గురించి మహాభారతం ఆదిపర్వంలో ఇలా పేర్కొన్నాడు –

**పుణ్యే హిమవతః పాదే పూజ్యే గిరి గుహాలయే ।**
**విశోధ్య దేహం ధర్మాత్మా ..... (హిమాలయాల్లో తపస్సు వర్ణన)**
**మహదండ మభూదేకం ప్రజానాం బీజమవ్యయమ్ ।**

పూజ్యము, పవిత్రమునైన హిమవత్పర్వతగుహలో వ్యాసమహర్షి తన దేహాన్ని శోధిస్తూ తపస్సు చేస్తుండగా ఆయనకు సకలచరాచర ప్రాణికోటితో కూడిన విశ్వమంతా ఒక్కటై దర్శనమిచ్చింది. ఆ దివ్యానుభూతిలో సర్వమూ తానే అయి విశ్వాత్మలో తాను తాదాత్మ్యం పొందాడు. అటువంటి అపూర్వమైన అమృతానుభవం ఆయనకు కలిగింది.

ప్రతి యుగంలోను తాను వ్యాసరూపుడై జన్మించి శ్రుతిస్మృతి పురాణాదులను సంగ్రహించి వేదవ్యాప్తి చేస్తానని వ్యాసభగవానుడే మత్స్యపురాణంలో ఇలా చెప్పాడు –

**వ్యాస రూపమహం కృత్వా సంగృహ్ణామి యుగే యుగే.**

వ్యాసభగవానుడు లోకోపకారం కోసం ఒకే రాశిగా ఉన్న వేదాలను విభజించి వాటి శాఖలను విడివిడిగా నిర్దేశించాడని భట్టభాస్కరుడు తన తైత్తిరీయ సంహితాభాష్యంలో స్పష్టం చేశాడు. అనేక శాఖలతో కూడి ఉన్న వేదరాశి ఒకటిగా ఉండేదనీ, దానిని అధ్యయనం చేయడం కష్టసాధ్యంగా ఉండేదనీ, దానిని సులభతరం చేయడానికి వ్యాసులవారు నాలుగుగా విభజించారనీ నిరుక్తానికి వృత్తి వ్రాసిన దుర్గాచార్యుడు పేర్కొన్నాడు.

### వ్యాసులనేకులు :

ఈ వేదవిభజన విశేషించి కలియుగంలోని మానవుల కొరకే జరుగుతుంది. కలియుగాంతంలో వేదమేకమవుతుంది. ప్రతి మన్వంతరంలోను ఇలా జరుగుతూనే ఉంటుంది. ఇప్పుడు ఏడవదైన వైవస్వత మన్వంతరం జరుగుతున్నది. ఈ మన్వంతరంలో ఇది 28వ కలియుగం. ఇంతకు ముందు గడిచిన 27 మహాయుగాలలో అనేక పేర్లుగల 'వ్యాసులు' ఆవిర్భవించి 27 సార్లు వేదవిభజన చేశారు. కృష్ణద్వైపాయనుడు చేసిన వేదవిభజన ఇరవైఎనిమిదవది. ఈ విధంగా సత్యవతీ పరాశరుల కుమారుడైన కృష్ణద్వైపాయనుడు 'వ్యాస'పదవినలంకరించి తన అనంత విజ్ఞాన తేజస్సును ప్రపంచానికి వ్యాపింపచేశాడు. దీనిని బట్టి 'వ్యాస' నామము ఒక పదవికి సంబంధించినదని, వ్యాసులనేకమంది ఉన్నారని తెలుస్తున్నది.

గతంలోని వ్యాసుల పేర్లను విష్ణుపురాణం చెప్పింది. వారు – 1) స్వయంభువు 2) ప్రజాపతి 3) ఉశనుడు (శుక్రాచార్యులు) 4) బృహస్పతి 5) సూర్యుడు 6) యముడు 7) ఇంద్రుడు 8) వశిష్ఠుడు 9) సారస్వతుడు 10) త్రిధాముడు 11) త్రివృషుడు (వృషభుడు) 12) భరద్వాజుడు 13) అంతరిక్షుడు 14) ధర్ముడు 15) త్రయారుణి 16) ధనుంజయుడు 17) కృతంజయుడు 18) సంజయుడు 19) అత్రి 20) గౌతముడు 21) హార్యాత్మకుడు 22) వేణుడు (వాజిశ్రవుడు) 23) సోముడు 24) తృణబిందుడు 25) భార్గవుడు 26) శక్తి మహర్షి 27) జాతుకర్ణుడు 28) కృష్ణద్వైపాయనుడు.

**జాతుకర్ణోఽ భవన్మత్తః కృష్ణద్వైపాయనస్తతః ।**
**అష్టావింశతిరిత్యేతే వేదవ్యాసాః పురాతనాః ॥**
**ఏకో వేదశ్చతుర్ధా తు యైః కృతో ద్వాపరాదిషు ॥**

**- విష్ణుపురాణం 3-3-19, 20.**

ఈ విధంగా ప్రతి ద్వాపరయుగంలోను ఒక మహనీయుడు వ్యాసపీఠాన్నలంకరిస్తాడు. ప్రతి ద్వాపర యుగాంతంలోను మహర్షులు వేదాన్ని విభజించేవారని మహాభారతం మనకు ఇలా తెలియజేస్తున్నది –

**చతుర్యుగేష్వథ వ్యస్తా ద్వాపరాంతే మహర్షిభిః ।**
**వేదాన్ బ్రహ్మర్షయో వ్యస్యన్ హృదిస్థాచ్యుతచోదితాః ॥**

**- మహాభారతం.**

ఈ విషయాన్నే మత్స్యపురాణం కూడా బలపరుస్తున్నది.

**వేదశ్చైకశ్చతుర్ధా తు వ్యస్యతే ద్వాపరాదిషు**

**- మత్స్య పురాణం - 144-11.**

### జగద్గురువు :

వ్యాసభగవానుడు వేదమూర్తి. నారాయణాంశతో నరుని రూపంలో అవతరించిన సనాతన ఋషి. ఆయన చిరంజీవి. ఆయన మూర్తీభవించిన సనాతన ధర్మం. హిమాలయ శిఖరాలే ఆయన సముత్తుంగశిరస్సు. కన్యాకుమారి ఆయన పాదద్వంద్వం. శ్రీలంక పాదపీఠం. యుగయుగాల వేదఘోషలోని ప్రణవనాదమే ఆయన హృదయ స్పందన. గంగాది సర్వనదీనదాలు రక్తనాళాలు. భారతీయ సంస్కృతే వాటిల్లో ప్రవహించే రక్తం. మంజుల కలనిస్వనాలతో వెలువడే మాటలే పురాణాలు, బ్రహ్మసూత్రాలు, భారత భాగవతాది పుణ్యశ్లోకాలు. ఆయన నేర్పిన నడవడే ధర్మం. ఆయన అడుగుజాడలే భారతదేశాన్ని ప్రపంచ దేశాలకు గురువుగా నిలిపాయి. ఆయనే జగద్గురువైన వేద వ్యాసులవారు.

సనాతన ధర్మాన్ని సుప్రతిష్ఠితం చేయటంలో వ్యాసభగవానుడు స్పృశించని తాత్త్వికాంశమే లేదంటే అతిశయోక్తి కాదేమో! అమూల్యమైన, అనంతమైన వైదికసాహిత్యాన్ని ఆయన మానవజాతికి ప్రసాదించాడు. ఆయన రచనలన్నీ జ్ఞానప్రదాలు,

ఆణిముత్యాలు. వేదతత్త్వాన్ని పురాణేతిహాసాల్లో జొప్పించి అందరికీ సులభంగా అర్థమయ్యేటట్లు అనేక గ్రంథాలు రచించాడు.

వ్యాసమహర్షి వేదాలు, ఉపనిషత్తులలోని దురవగాహమైన విషయాలను మహాభారతం, అష్టాదశపురాణాల ద్వారా సామాన్యులకు సులభంగా బోధపడేటట్లు చేశాడు. అంతేకాకుండా సమస్త ఉపనిషత్తుల సారాంశాన్ని సంక్షిప్తంగా సూత్ర రూపంలో బ్రహ్మసూత్రాలుగా రచించాడు. ఇంకా వ్యాస సంహితను కూడా రచించాడు. దానిలో సనాతన ఆచార వ్యవహారాలు వివరించబడినై. ఆయన ఏర్పరచిన విద్యావ్యవస్థ వేల సంవత్సరాలు గతించినా చెక్కు చెదరలేదు. అందువల్లనే ఆయన జగద్గురువుగా ఆరాధించబడుతున్నాడు.

**అనంత వాఙ్మయ మహాస్రష్ట :**

వ్యాసమహర్షి సజీవమైన వేదధర్మం. వేదధర్మాన్ని మనకందించిన ఋషిబ్రహ్మ వ్యాసమహర్షే. వేదాత్మను బ్రహ్మ సూత్రాల ద్వారా మనకందించిందాయనే. భగవంతుని గురించి తెలియజేస్తూ, భగవదనుభూతిని కలిగించే భాగవతాన్ని మనకందించిన నారాయణావతారమే వ్యాసమహర్షి. తపస్సే ఆయన వృత్తి. వేదసాక్షాత్కారమే ఆయన నిరంతర పరిశ్రమ. పురాణేతిహాస బ్రహ్మసూత్ర రచనయే ఆయన జీవితచరిత్ర. ఆయన లేకపోతే మనకీనాడు వేదాలు లేవు. సనాతన ధర్మము లేదు. పురాణేతిహాసాదులు లేవు. వ్యాసభగవానుడు లేనిచో లోకంలో ధర్మశాస్త్ర వాఙ్మయమే లేదు. ఆయన వేదశాస్త్ర పురాణేతిహాసాది అనంత వాఙ్మయ మహాస్రష్ట.

**సర్వజ్ఞ పీఠాధిపతి :**

ఈ ప్రపంచ వాఙ్మయంలో ప్రతిదీ లోతుగా పరిశోధిస్తే చివరికి వాటి మూలంలో వ్యాసమహర్షే సాక్షాత్కరిస్తాడు. అందుకే 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వమ్' అన్నారు. ఆయన కరుదుగట్టిన విజ్ఞానరాశి. వేదవిజ్ఞాన సర్వజ్ఞ పీఠాధిపతి. అందుకే ఆయన జన్మదినమైన ఆషాఢపూర్ణిమను భారతదేశమంతా వ్యాస పౌర్ణమిగా, గురుపౌర్ణమిగా జరుపుకుంటున్నారు. భారతదేశానికి వ్యాసమహర్షి తలమానికంవంటి వజ్రకిరీటం. అందుకే మహాయోగి అరవిందులు వ్యాసమహర్షిని జాతీయ కవిగాను, మహాభారతాన్ని జాతీయ కావ్యంగాను అభివర్ణించారు. ఆయన మన జాతీయ ఋషి. వ్యాసమహర్షి 'భారతాత్మ'. భారత జాతి పితామహుడు.

వేదం అమృతస్వరూపిణి. దానిని విభజించి మనకందించిన వ్యాసభగవానుడు సామాన్యుడు కాదు. ఆయన మహాయోగి. పరమగురువు. ఋషి మండలానికి గురుమూర్తి. ఆయన తన నలుగురు శిష్యుల ద్వారా నాలుగు వేదాలను, సూతమహర్షి ద్వారా సకల పురాణ సంపదను, వైశంపాయనుని ద్వారా మహాభారతాన్ని, శుకయోగి ద్వారా భాగవతాన్ని మానవజాతి కందించాడు. తాను వ్రాసిన గ్రంథాల్లో తానే పాత్రగా ఉంటూ గ్రంథకర్తగా, వక్తగా, ప్రవక్తగా, అనేక భూమికలను నిర్వహించాడు. ఇదే పరమగురువైన వ్యాసమహర్షి ప్రదర్శించిన దివ్యలీల.

**అఖండ విజ్ఞాన జ్యోతి :**

వ్యాసభగవానుడు ద్వాపరాంతంలో సర్వధర్మ శాస్త్ర పరిరక్షణ కోసం నిర్వహించిన మహాజ్ఞానయజ్ఞంలో ఈ పరమ ఋషులే ఋత్విక్కులు. ఆ జ్ఞానయజ్ఞానికి వ్యాసభగవానుడే అధ్యక్షుడు. ఆ యజ్ఞంలోని జ్ఞానాగ్నియే వేదవిజ్ఞానం. ద్వాపర యుగం చివర కలియుగ ప్రారంభంలోని యుగసంధికాలంలో జరిగిన మహర్షుల సదస్సు ద్వారా 8,800 మంది మహర్షులు ఒక చోట చేరి, 12 సంవత్సరాల పాటు తమ మనస్సులను ఏకాగ్రం చేసి, తమ తపశ్శక్తిని ధారపోశారు. వారి మనస్సులన్నీ ఏకమై ఒక విజ్ఞాన జ్యోతిగా ప్రకాశించింది. ఆ ఆధ్యాత్మిక జ్యోతియే ఈనాటికీ, లోకాలను వెలిగించే అఖండజ్యోతి. అదే మనకు వెలుగుబాట, మార్గదర్శి. వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత, యోగశాస్త్రం మొదలైన ప్రాచీన విజ్ఞానమంతా వ్యాసమహర్షి వెలిగించిన ఆ అఖండజ్యోతి నుండి వెలువడిన వెలుగు కిరణాలే. ఆయన విచిత్రరచనా విధాన సంధానం ఒక ఆధ్యాత్మిక యోగప్రక్రియ. వ్యాసభగవానుడు వేదపదార్థ జాలవిజ్ఞాత, భారతస్మృతి విధాత.

వ్యాసభగవానుడు మానవులలో సత్యధర్మాలను ప్రతిష్ఠించడానికి మన మధ్య అవతరించాడు. అనేకానేక ధర్మాలను



# శ్రీచరణ శరణాగతి

పర్వు త్రివిక్రమ ప్రముఖ పాదమువెంట సుధాప్రవాహమై
శర్వుని నిత్యశోభన విశాల వికాసితుజేసి, వేద గాం
ధర్వమహాభిషేక పరితర్పితమస్తు నొనర్చుచుండి, సౌ
పర్వయభంగగంగ జనిపావనతావిధి సృష్టినేలదే! **43**

నీ యవతార మీనములు, నిన్నె భజించు కపీశశేఖరుల్
పాయక నీవె పృష్ఠమున బట్టిన కవ్వపు కొండగాని, ఏ
తోయధి దైర్ఘ్యమున్ విరివి, దోచని లోతును జూడలేదనన్
శ్రీయుత పాదవైభవ సరిత్పతినెన్నుటయెట్లు కేశవా! **44**

వేదాంత ప్రతిపాద్యమైన చరణప్రీతిన్ భవద్భక్తు లా
మోదాంతః కరణమ్ములన్ జగతి సంపూర్ణమ్ముగా విస్మృతిన్
వాదాంతస్థితినందజాలుదురుసూ! బ్రహ్మాది సర్వజ్ఞ దే
వోదంతుల్ తదభిజ్ఞునుత్తగొను సత్త్వోద్రిక్తతల్ గందురే! **45**

నిరత ధ్యానము, నీ పదార్చనల నిర్ణిద్ర ప్రభావంబు చే
కుర నే చేతను డెంతయున్ బ్రతుకు చిక్కుల్ దీర్చుకొంచేగి వే
మరు నారాయణ యంచు నోంకృతిని సమ్మానంబుగావించు వా
విరి వానిన్ విరివోలె మోక్షపదవీ విశ్రాంతు గావింతువే! **46**

అంటరు ముట్టరెప్పుడును నర్యమసూనుడు వాని బంటులే
సొంటును లేక ముక్త పురుషుండు భవత్పదరీతినేగ కా
ల్బంటిగ జన్మకర్మలతివాహక మార్గము వైదొలంగ సై
దంటగ నర్చిరాదులును దారు జరింప మనోహరాకృతిన్ **47**

ఎన్నగరాని నీ మహిమనే గతినెన్నుటొ, చూడరాని ని
న్నెన్ని విధాల యత్నముల నే గతి జూచుటొ పట్టశక్యమున్
పన్నుగగాని నీ నిరత వైభవమెట్టులొ తోచకున్న మా
కన్నుల దీప్తి ద్వచ్చరణ కాంతుల దివ్య పథమ్ము జూపవే **48**

- ఆచార్య రావికంటి వసునందన్

మనకు ప్రబోధించాడు. వేదాలలో తాను అనేక రహస్య విద్యలను, ఆత్మతత్త్వాన్ని, వైదిక కర్మకాండలను, భూతభవిష్యద్వర్త మాన కాలవిజ్ఞానాన్ని, మానవ జీవితం లోని వివిధ దశలను, వర్ణాశ్రమ వ్యవ స్థను, సూర్యచంద్రాదిగ్రహగతులను, వాటి ప్రభావాలను, వైద్యవిజ్ఞానాన్ని, వేదాం తాన్ని, దేవతలు, మానవుల జీవన విధా నాన్ని గురించి వివరించినట్లు వ్యాస మహర్షి మహాభారతంలో పేర్కొన్నాడు.

వేదాలలోని అద్భుత విషయాలు, ధర్మవిశేషాలు అందరికీ అందుబాటులోకి రావాలి. ప్రజలంతా వాటిని అవగాహన చేసుకొని తమ తమ స్థాయిల్లో ఆచ రించాలి. వేదవిహితమైన మార్గంలో అందరూ జీవించాలి. దాని వల్ల వ్యక్తికి, సమాజానికి సుఖశాంతులు లభిస్తాయి. లేకపోతే జీవితం ధర్మవిరుద్ధమై అశాంతికి, అల్లకల్లోలానికి హేతువవుతుంది. అందు వల్ల ఇప్పుడు ఆ ధర్మాలు మరీ ఎక్కువ అవసరం.

కావుననే రథచక్రమధ్యంలో ఆకులుకూడి ఉండునట్లు మన మనస్సుల్లో ఋగ్యజుస్సామాథర్వణములనే నాలుగు వేదాలు సుప్రతిష్ఠితాలై, మన అజ్ఞానం నశించి సదా శుభ సంకల్పాలు కలగాలని మన మహర్షులు ఇలా ప్రార్థించారు –

**యస్మిన్ ఋచః సామ యజూగ్ంషి యస్మిన్**
**ప్రతిష్ఠితా రథనాభావివారాః ।**
**యస్మింశ్చిత్తగ్ం సర్వమేతం ప్రజానామ్**
**తన్మే మనః శివసంకల్పమస్తు ॥**

**- యజుర్వేదం**

*(ఇంకా ఉంది)*

# సందేహాలు? సమాధానాలు!!

– 'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుని పేరుకు, కృష్ణుని మనుమడు అనిరుద్ధుని పేరుకు అర్థం తెలుపగలరు.**

**– పెరుగు జాలయ్య, హైదరాబాదు.**

☛ ప్రద్యుమ్నుడు అని శ్రీకృష్ణుని కుమారునకు పేరున్నది. అదియే శ్రీకృష్ణుని పేరు కూడ. "ఆత్మావైపుత్రనామాసి" తండ్రియే పుత్ర రూపమును పొందుతున్నాడు. "ప్రకృష్టం ద్యుమ్నం బలమస్య ప్రద్యుమ్నః" అనేది వ్యుత్పత్త్యర్థం. అనగా ప్రకృష్టమైన బలం కలవాడని అర్థం. 'ద్యుమ్నం' అంటే కాంతి – బలం – ఐశ్వర్యం అనే అర్థాలున్నాయి. ఇవి శ్రేష్ఠమైనస్థితిలో కలవాడు ప్రద్యుమ్నుడు.

ఇక అది విష్ణుసంబంధమైనపుడు "ఆత్మ ప్రద్యోతనాత్ ప్రద్యుమ్నః" "ప్రద్యోతయితా" ఇతి మౌలాః ప్రద్యుమ్నః పురుషోత్తమః. అధిష్ఠాయ స్థితస్సాక్షాద్భక్తానాం సుగతిప్రదః"

తనంతట తానుగా ప్రకాశించేవాడు. ఇది వ్యూహాలలో ఒక వ్యూహనామం కూడా! పురుషోత్తముడని అర్థం. సర్వప్రపంచాన్ని స్వయంగా ప్రకాశింపచేయువాడని అర్థం. మూలసంహితలో ఈ అర్థమున్నది.

"ననిరుద్ధ్యతే పరైరితి–అనిరుద్ధః" పరులచే నడ్డగింపబడనివాడు. అనిరుద్ధ శబ్దానికి విష్ణువనే అర్థం కూడా ఉన్నది.

"జనార్దనాఖ్యయాదేవస్త్వ నిరుద్ధోజగత్ప్రభుః" అనిరుద్ధ–ప్రద్యుమ్న–సంకర్షణాది మూర్తులు వేంచేసియుండు విధము నిది తెలుపుతుంది. అనిరుద్ధుడనే వ్యూహస్వామి జనార్దనుడనే పేరుతో వాసుభాండమనే క్షేత్రంలో వేంచేసియున్నాడు. ఆ విషయం "జనార్దనాఖ్యయా సన్నిహితః స్థితః" అనే శ్లోకం తెలియజేస్తున్నది.

"ఏవం నిర్ధూత నిరోధనిరవధిక జీవలోక జీవాతు దివ్య చేష్టితః" అనిరుద్ధః – "అపరిమిత చేష్టో భగవాననిరుద్ధః" ఇతి హిమౌలాః.

ఏ ఆటంకమూ లేకుండా అనంతమైన జీవలోకానికి ఉజ్జీవన కారణాలైన తన దివ్యచేష్టలను ప్రదర్శించువాడే అనిరుద్ధుడు. మౌలసంహితలో "అపరిమిత చేష్టో భగవాననిరుద్ధః" అనే వాక్యమే పైని నేను చెప్పిన దానికి ప్రమాణం.

**ఆచమనం చేసేటప్పుడు తూర్పు లేక ఉత్తరంగా కూర్చొనే చేయాలా? ఈశాన్య ఆగ్నేయ ముఖంగా కూర్చుని ఆచమనం చేయవచ్చునా? దక్షిణ-ఆగ్నేయ-ఈశాన్య ముఖమై అనుష్ఠాన పారాయణాలు చేయవచ్చునా?** **– వాసుదేవనాయుడు, కడప.**

☛ తూర్పు అన్నది తొలిదిక్కు. సూర్యుడుదయించే దిక్కు. కనుక అదియే అభివృద్ధికి మూలమైన దిక్కని పెద్దలనిర్ణయం. ధర్మసింధులో శిరస్సు, కంఠనందు వస్త్రంలేకుండ, తూర్పునకు గాని ఉత్తరదిశకు గాని అభిముఖుడైయుండి, అంగుష్ఠమును కనిష్ఠికయును జూపి తక్కునంగులులు వంచిన హస్తంతో నురగ మొదలగునవి లేని శుద్ధజలాన్ని మూడుసార్లు ఆచమనం చేయవలయును. ఓం కేశవాయనమః, ఓం నారాయణాయ నమః, ఓం మాధవాయ నమః అనే మంత్రాలనుచ్చరిస్తూ మూడుసార్లు ఆచమనం చేయాలి. నదీతీరంలో ఐతే దిక్కులను గూర్చి ఆలోచింపనవసరం లేదు. నది కభిముఖంగా నిలిచి ఆచమించవచ్చు.

ధర్మశాస్త్రమింతవరకే చెప్పింది. మిగిలిన దిక్కులను గూర్చి ప్రత్యేకంగా చెప్పలేదు. కొన్ని క్రొత్త ప్రదేశాలకెళ్ళినపుడు దిక్కులు తెలియవు. కొన్నిచోట్ల ఆ రెండు దిక్కులకు తిరిగి కూర్చుండి చేయునవకాశముండదు. అలాంటిచోట ఆపద్ధర్మంగా ఎటుకూర్చుండి ఐనను చేయవచ్చు. ఈ విషయం పారాయణాదులకు గూడ అన్వయిస్తుంది. ఆ దిక్కునకు వీలు గాదని పారాయణాదులను (అనుష్ఠానం) విడచుటకన్న – అవకాశం ఉన్న చోట కూర్చుండి చేయుట ముఖ్యం. కొందరు బస్సుల్లో, రైళ్ళల్లో ప్రయాణిస్తూ అనుష్ఠాన జపాలు సాగిస్తారు. వారికి దిక్కెలా కుదురుతుంది?

**భర్త చనిపోయి అతని సాంవత్సరికాలు జరిగేరోజే భార్య మరణిస్తే భర్త సాంవత్సరీకాలతో నిర్వహించటానికి వీలు**

**కానపుడు ఉభయులకు ఒకేసారి భార్య సాంవత్సరికాల ప్పడు చేయవచ్చా? దానికి కాలపరిమితేమైనా ఉందా? ఈ కార్యక్రమాలు ఎవరెవరిది ఎప్పుడు ఎలా నిర్వహించాలి? భార్య సాంవత్సరికాలతో పాటు భర్తది కలిపి ఒకేసారి ఉభయుల పేరుతో ఒకటిగా దానధర్మాలు చేయొచ్చా? దాన ధర్మాలు రెండేసి చొప్పన చేయాలా? వివరించగలరు.**

**- హయగ్రీవ, గుంటూరు.**

☛

భర్త సాంవత్సరీక సమయంలో భార్య మరణిస్తే ఎలా చేయాలి అంటే, "యల్లాజీయం" అనే గ్రంథం దీనికిలా సమాధానం చెప్పింది.

**మాతాపిత్రోరేకదినే - సంసృష్టం పాతయత్నతః,**
**ప్రథమం పితృకర్మాణి - ద్వితీయం మాతృకం తథా.**

**అగ్నౌకరణ మేకంస్యాత్ - అర్ఘ్యం చైవపృథక్ పృథక్,**
**త్రయస్త్రయస్తు పిండాస్యుః - పితుర్మాతుర్విథీయతే.**

భర్త సాంవత్సరీకం నాడు భార్య మరణిస్తే మైల వస్తుంది. మైలలో శ్రాద్ధ కార్యక్రమం తగదు. కనుక, ఆమె చనిపోయిన తర్వాత 11వ రోజున ఆమెకు దినకర్మచేయాలి కదా! అదే రోజు ముందు తండ్రికి తదుపరి తల్లికి శ్రాద్ధకర్మ నిర్వర్తించాలి. వంటలు వేరువేరుగా చేయవలసిన పని లేదు. అలాగే అగ్నికార్యం కూడా ఇద్దరికీ ఒక్కటే. కాని అర్ఘ్యం మాత్రం ఎవరికి వారికి వేరు వేరుగా ఇవ్వాలి. పిండములు మూడు మూడుగా – వేరువేరుగా ఎవరికి వారికే ఉండవలె.

ఇలాగే ప్రతి సంవత్సరం, అదేరోజు పైని చెప్పిన విధంగా ముందు తండ్రికి తదుపరి తల్లికి ఆబ్దికం పెట్టాలి. దానధర్మాలు ఎవరిపేరిట వారికే వేరు వేరుగా ఇవ్వాలి. అంతేగాని ఒక్కటిగా ఇవ్వకూడదు.

**శ్రీమహాలక్ష్మి క్షీరసముద్రరాజ తనయ కదా! మరి తల్లి ఎవరు? అసలు క్షీరసముద్రముందా? ఉంటే ఎక్కడుంది?**

**- ఎం.హరినాథగుప్త, పాపనాయుడుపేట.**

☛

ఇంద్రుని సంపత్స్వరూప లక్ష్మీదేవి. ఒకనాడు దుర్వాసముని దేవేంద్ర దర్శనానికి వచ్చాడు. అలా వచ్చినపుడు దివ్యపారిజాత పుష్పమాలను తెచ్చాడు. ఆ సమయంలో ఇంద్రుడు ఐరావతం పై నున్నాడు. దుర్వాసు డా మాలను ఇంద్రునకందించాడు. అతడు దానిని ఐరావతం యొక్క కుంభస్థలంపైనుంచాడు. ఆ పూవులలోని మకరందం కొరకు తుమ్మెదలు ఝుంకారరవంతో వచ్చి ఆ ఏనుగు చెక్కిళ్ళను కుట్టగా; చికాకుతో ఐరావతం మాలను తొండంతో లాగి క్రిందపడవేసి కాలితో తొక్కసాగింది. దానిని గాంచిన మహర్షి తననవమానించినట్లు భావించి "ఇంద్రా! నీ స్వర్గ సంపదలతో కన్నుగానని గర్వమున మమ్మవ మానించావు. నీ సమస్తసంపదలు సముద్రమునందు కలియు గాక" యని శపించాడు. ఇంద్రుడు దిగి నమస్కరించి శాపాంత మనుగ్రహింపుమని వేడగా క్షీరసముద్రమున మంథరపర్వతాన్ని చిలికినపుడు నీ సంపదలు వచ్చునని శాపవిమోచనాన్ని తెల్పి వెడలిపోయాడు. ఆ విధంగా సముద్రమున కలిసిపోయిన లక్ష్మీ దేవదానవులు క్షీరాబ్ధి చిలికినపుడు సముద్రం నుండి ఉద్భవిం చారు. అందువల్ల సముద్రపుత్రి అన్న పేరే తప్ప తల్లి వేరుగా లేదు. క్షీరసాగరం పౌరాణికోక్తి.

**ఈ రోజుల్లో చాలామంది గురువులు, ప్రముఖులు భగవాన్ అని తమ పేర్ల ముందు రాసుకుంటున్నారు. భగవాన్ అన్న పదానికి నిజమైన అర్థమేమిటి?**

**- కె. కృష్ణమూర్తి, గుంటూరు.**

☛

*మాహాత్మ్యశ్చసమగ్రశ్చ ధైర్యశ్చ యశసః శ్రియః జ్ఞాన వైరాగ్య యోశ్చైవషణ్ణాంభగ. భగోస్యాస్తీఉ తి భగవన్* అనేది భగవచ్ఛబ్దానికి వ్యుత్పత్తి.

1) అతిలోకోత్తరమైన మాహాత్మ్యము 2) సమగ్రత్వము 3) అతులితమైన ధైర్యము 4) యశస్సుతో కూడిన సంపద 5) అనంతజ్ఞానము 6) వైరాగ్యములను ఆరు లక్షణాలను కలిపి భగ అంటారు. అది కలవాడు భగవానుడు.

మాహాత్మ్యమంటే మానవమాత్రులు చేయలేని గొప్పకార్యాలు చేయుట. సమగ్రత్వ మంటే ఏకకాలంలో ప్రపంచమంతటా నిండియుండుట వంటి ఈ ఆరు లక్షణాలు మానవులకుండవు. కనుక ఈ శబ్దాన్ని పేర్ల ముందుంచడం తగింది కాదు.

# హయగ్రీవ తత్త్వం

- ఆచార్య గల్లా చలపతి

ఋగ్వేదం మొదటి మండలంలో కనిపించే 'దధిక్రావన్' అనే మాట తెల్లని, వేగవంతమైన, కాంతి వంతమైన గుర్రం అనే అర్థంలో గ్రహించబడింది. ఈ మాట గరుడుని, సూర్యుని కూడా సూచిస్తున్నది. అదే వేదం నాల్గవ మండలంలో ఉషోదయవేళ అగ్నిని జ్వలింపజేసే సమయాన 'దధిక్రావన్' దివ్యత్వమున్న గుర్రంగా స్తుతించబడింది (4-39). అశ్వనీ దేవతలు మానవ శరీరం గుర్రపు తల కలిగిన ఒక గురువు వద్ద మధువిద్యను అభ్యసించినట్లు శతపథ బ్రాహ్మణం పేర్కొంటున్నది. వైదిక యజ్ఞాల్లో - ముఖ్యంగా అశ్వమేథ యజ్ఞంలో బలి అయ్యే అశ్వం గొప్పగా స్తుతింపబడింది. కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ సంహిత ఆ అశ్వం తలను ఉషస్సు గాను, కంటిని సూర్యుడు గాను, ఊర్పును గాలిగాను, అది ప్రభవించిన స్థానం సముద్రంగాను కీర్తించింది. గుర్రానికి, గుర్రపుతల గల మానవ శరీరానికి సంబంధించి వైదిక వాఙ్మయంలో గల విషయమిది. విష్ణువు యజ్ఞ స్వరూపుడు కాబట్టి ఆయన హయగ్రీవుడయినాడని చెప్పే కథలు ఏర్పడడానికి మొదటి దశ ఇది.

పురాణాలలో విష్ణువు హయగ్రీవుడుగా పూజలందు కొన్న అంశం అనేక రకాలుగా చెప్పబడి కనిపిస్తున్నది. విష్ణువే స్వయంగా హయగ్రీవుడయినాడని చెప్పడం ఒక అంశమైతే ఇతర కారణాల వల్ల ఆయనకు హయశీర్షం తగిలించినట్లు చెప్పడం మరొక అంశం. రజస్సు, తమస్సులే రూపాలుగా పుట్టినవారు మధుకైటభులనే రాక్షసులు. వేదాల నుండి పుడుతున్న నాదానికి ఆకర్షితులై వీళ్లు వేదాలను అపహరించి రసాతలానికి తీసుకొని వెళ్ళి దాచారు. వేదాలు లేకపోవడం వల్ల బ్రహ్మకు జ్ఞాననేత్రం చీకటైంది. బ్రహ్మ ప్రార్థనతో విష్ణువు హయగ్రీవావతారంతో రసాతలానికి వెళ్ళి మధుకైటభులను వధించి ఆ వేదాలను తెచ్చి బ్రహ్మకిచ్చాడు. అప్పటినుండి విష్ణువు హయగ్రీవుడుగా కీర్తింప బడినాడు. ఆయన అవతారాలలో హయగ్రీవావతారం మొదటి అవతారమైంది. అయితే పురాణాలు ప్రముఖంగా పేర్కొన్న మత్స్యకచ్ఛపాది దశావతారాల్లో హయగ్రీవావతారం లేదు. కొన్ని పురాణాలు దీన్ని ప్రథమావతారంగా, మత్స్యంకంటే ముందుదిగా చెప్పాయి. భాగవతపురాణం ప్రకారం బ్రహ్మచేసిన యజ్ఞంలో హయగ్రీవుడే యజ్ఞపురుషుడు. బంగారు రంగుతో ఉన్న ఆయన ఆత్మే దేవతలు. ఆయన శ్వాస నుండి శబ్ద ప్రపంచమంతా ఉద్భవించింది. ఈ కారణం వల్ల, వేదాలు తెచ్చి బ్రహ్మకిచ్చిన కారణం వల్ల హయగ్రీవుడు విద్యాధిదేవతగా పూజింపబడినాడు. వేదాలు బ్రహ్మకిచ్చినప్పటి నుండి 'హయశిరో మహితయగు నమ్మూర్తి దక్కిన మూర్తుల కంటె నెక్కుడయ్యె. నా జగత్కర్తను వేదంబులు నాశ్రయించి యుండు'నని మహాభారతం పేర్కొన్నది (శాంతిపర్వం). వేదాల్లో సర్వవిద్యలు ఉండడం వల్ల హయగ్రీవుడే విద్యలకు ఆధారభూతుడైనట్లుంది.

మృగం తల, మానవశరీరం గల మూర్తులు సృష్టి ప్రాథమిక దశకు చెందిన రూపాలు. మృగం శక్తికి సంకేతం. మనిషి నాయకత్వ లక్షణానికి సంకేతం. శక్తి ఉన్న నాయకత్వం ప్రయోజనకారి అవుతుంది. హయగ్రీవుడు వేదాలను తెస్తే



గరుడుడు అమృతం తెచ్చాడు. ఈ రూపాలతో ఈ మూర్తులు పురాణకాలంలో దేవతలుగా స్తుతింపబడినాయి. పురాణాల్లో విష్ణువు హయశిరం ధరించవలసి రావడానికి గల కారణాలు ఆసక్తికరమైన కథలుగా కనిపిస్తున్నాయి. వేదవాఙ్మయంలో విష్ణువు యజ్ఞవిష్ణువుగా స్తుతింపబడినాడు. 'యజ్ఞోవైవిష్ణుః' అని శ్రుతవాక్యం. దేవతలు యజ్ఞం చేసి, ఆ యజ్ఞఫలాన్నివ్వడానికి ఆయనను వెతుక్కొంటూ వచ్చారు. రాక్షసులతో పోరాడి అలసిన విష్ణువు ధనుస్సు మీద తలపెట్టుకొని నిద్రపోతూ కనిపించాడు. లేపడానికి అందరూ సందేహించారు. ధనుస్సు నారి తెంపితే తల కదిలి ఆయన మేలుకొంటాడని శివుడు ఉపాయం చెప్పాడు. బ్రహ్మ వమ్రి అనే కీటకాన్ని ప్రయోగించాడు. అది వెళ్ళి వింటినారిని కొరికింది. నారి తెగి తలకు తగలడం వల్ల విష్ణువు శిరస్సు ఊడిపోయింది. గుర్రం తల అతికించమని లక్ష్మి చెప్పింది. విశ్వకర్మ హయగ్రీవం తయారు చేశాడు. దేవతలు అతికించారు. ఈ కథ దేవీ భాగవతంలో ఉంది.

**లక్ష్మిశాపం :**

లక్ష్మీ విష్ణువులు ఏకాంతంగా ఉండిన సమయంలో విష్ణువు లక్ష్మిని చూచి నవ్వాడు. దాన్ని అవమానంగా భావించిన లక్ష్మి, కోపంతో విష్ణువు తల ఊడిపోవుగాక అని శపించింది. ఆ శాపం కారణంగానే ఆయన తల ఊడిపోయింది.

**హయగ్రీవుడనే రాక్షసుడు :**

ఇతడు దేవిని గురించి రెండువేల సంవత్సరాలు తపస్సు చేశాడు. దేవి ప్రత్యక్షమై వరం కోరమన్నది. రాక్షసుల వల్ల గానీ, దేవతల వల్ల గానీ మరణం లేని వరమివ్వమన్నాడు హయగ్రీవ దానవుడు. అలా ఇవ్వడం సృష్టికి విరుద్ధమన్నది దేవి. గుర్రపు తల ఉన్నవాని చేతిలో తప్ప మరొకరి చేతిలో మరణం లేని విధంగా వరం పొందాడతడు. ఈ రాక్షస హయగ్రీవుని విష్ణుహయగ్రీవుడు సంహరించి ఆ దానవుని బారి నుండి దేవతలను కాపాడాడు. పై రెండు కథలూ దేవీ భాగవతం లోనివే.

శైవులకు దక్షిణామూర్తివలే వైష్ణవులకు హయగ్రీవుడు విద్యాదేవత, జ్ఞానప్రదాత. వేదవాఙ్మయంలో యజ్ఞవిష్ణువుగా, హయగ్రీవుడుగా రూపొందిన విష్ణువు అనంతర కాలంలో ఒక అవతారమూర్తిగా పూజింపబడినాడు. ఈ మూర్తిని గురించి పురాణాలు విస్తృతంగా చర్చించాయి. విష్ణువు హయగ్రీవుడుగా రూపొందుతున్న దశలో హయగ్రీవ తత్త్వం అనేక రూపాలుగా ప్రస్తుతింపబడింది. వైదిక వాఙ్మయంలో ఈ మూర్తి అంశలుగా భావింపబడిన హంస, ఆదిత్య, గరుడ, వాచస్పతి, గంధర్వ మొదలైన పదాలను వైష్ణవులు హయగ్రీవ విష్ణువుగానే అర్థం చేసుకొని ఆరాధించారు.

చారిత్రకంగా పరిశీలిస్తే క్రీ.శ. నాల్గవ శతాబ్దం (గుప్తుల కాలం) నుండి హయగ్రీవోపాసన కనిపిస్తున్నది. శిల్ప శాస్త్రం కుడిచెయ్యి వ్యాఖ్యానముద్ర కలిగి విద్యాబోధ చేస్తున్న ట్లుండే హయగ్రీవ శిల్పాలను వివరించింది. పురాణకాలంలో దశావతారాలు ఏర్పడినప్పటి విష్ణువు నాలుగుచేతులతో కనిపించి నట్లు హయగ్రీవమూర్తి కూడా నాలుగుచేతులతో ఉండిన శిల్పాలు అనేక ప్రాంతాల్లో చెక్కబడి కనిపిస్తున్నాయి. మూడు చేతులలో శంఖచక్ర గదలు, నాల్గవ చేతిలో ఒక పుస్తకం కనిపి స్తాయి. అద్వైత ద్వైత విశిష్టాద్వైత సంప్రదాయాల్లో ఈ మూర్తి ఆరాధన ఉంది. ఇప్పటికీ వైష్ణవులు హయగ్రీవమూర్తిని విద్యా ప్రదాతగా పూజిస్తున్నారు. దక్షిణ భారతదేశంలోని వైష్ణవా లయాల్లో హయగ్రీవమూర్తులు ప్రతిష్ఠింపబడి పూజలందు కోవడం కొనసాగుతూ ఉంది. దశావతారాల్లో నృసింహావతారం కూడా ఒక కారణం (దానవ సంహారం) కోసం విష్ణువు ధరించిన రూపమే. హయగ్రీవుడి వలే నృసింహరూపానికి సింహం తల, మానవశరీరం కనిపిస్తాయి. వేదాలు వెదకి తెచ్చిన చెయ్యి హయగ్రీవుడిదయితే, కనక కశిపుని చించిన చెయ్యి నృసింహు డిది. మృగం తలలు, మానవ రూపాలు గల ఈ రెండు అవ తారాలు అర్చారూపాలుగా అశేషభక్తులచేత కొలువబడు తున్నాయి. లక్ష్మీనృసింహుని విగ్రహాలున్నట్లే లక్ష్మీహయగ్రీవ విగ్రహాలు కూడా ఉన్నాయి. హయగ్రీవోపాసనకు ప్రాధాన్య మున్న దేవాలయాల్లో లక్ష్మీ హయగ్రీవ విగ్రహాలు అర్చా మూర్తులుగా కనిపిస్తున్నాయి.

**హయగ్రీవ మంత్రాలు :**

వైష్ణవంలో ఆళ్వార్లు, ఆచార్యులు హయగ్రీవ స్తుతులు చేశారు. ఆచార్య పురుషులలో ప్రముఖులైన వేదాంతదేశికుల వారు హయగ్రీవ మంత్రోపాసకులు.

**ఓం నమో భగవతే హయగ్రీవాయ - ద్వాదశాక్షర మంత్రం.**

**విశ్వోత్తీర్ణ స్వరూపాయ చిన్మయానంద రూపిణే,**
**తుభ్యం నమో హయగ్రీవాయ విద్యారాజాయ విష్ణవే**
***- హయగ్రీవ మంత్రం.***

**హయగ్రీవాయ విద్మహే విద్యానాథాయ ధీమహి,**
**తన్నోహంసః ప్రచోదయాత్**
***- కపింజల సంహితలోని హయగ్రీవ గాయత్రి***

ఈ మంత్రాలను జపించిన ఉపాసకులు హయగ్రీవుల అనుగ్రహం పొందుతున్నారు.

వేదాంతదేశికులవారు తిరువెండిపురం (ఇది తమిళ నాడు దక్షిణ ఆర్కాటుజిల్లాలోని కడలూరు సమీపంలో ఉంది)లో గల హయగ్రీవ దేవాలయంలో కొన్ని సంవత్సరాలు వైష్ణవ సంప్రదాయ కార్యక్రమాల్లో గడిపారు. ఇక్కడ హయగ్రీవ స్వామి పద్మాసనస్థితిలో యోగముద్రతో దర్శనమిస్తున్నాడు. వేదాంత దేశికులు అక్కడే గరుడమంత్రాన్ని భక్తితో జపించి గరుడుని ప్రత్యక్షం చేసుకొన్నారు. గరుడుని నుండి హయగ్రీవ మంత్రాన్ని ఉపదేశంగా పొందారు. ఆ మంత్రంతో హయగ్రీవుని ఆరాధిం చారు. హయగ్రీవస్వామి ప్రత్యక్షమై తన అర్చా విగ్రహాన్ని వీరికి అనుగ్రహించారు. ఈ కారణం వల్లే వేదాంత దేశికుల సన్నిధి ఉన్న ప్రతి వైష్ణవ దేవాలయంలో హయగ్రీవుని అర్చామూర్తి కని పిస్తున్నది.

హయగ్రీవ అర్చామూర్తిని ప్రతిరోజూ అర్చించి నైవేద్య సమర్పణ చేయడం దేశికులవారికి ఒక వ్రతంగా ఉండేది. ఒక రోజు నైవేద్య సమర్పణానంతరం భిక్ష గ్రహించడానికి పొరుగూరు వెళ్ళారు. కావేరీనది పొంగడం వల్ల వారు ఆ రోజు తిరిగిరాలేక ఆ రాత్రి అక్కడే గడపవలసి వచ్చింది. మరుసటి రోజు అర్చా సమయానికి దేశికులవారు రాలేకపోయారు. నైవేద్యం పెట్టక పోవడం వల్ల హయగ్రీవ విగ్రహం శ్వేతాశ్వంగా మారి బయటకు వెళ్ళి ఇతరుల పొలాల్లో మేయసాగింది. వారా ఆశ్వాన్ని బంధించారు. కావేరి నది ప్రవాహం తగ్గిన తర్వాత దేశికుల వారు ఇంటికి వచ్చి చూస్తే అర్చావిగ్రహం కనిపించ లేదు. ఎంతో బాధ కలిగింది.

**హయవదన భగవతో మయి యది కరుణాస్యాత్ అనర్గలం సపది,**
**అత్ర సమేత్య శుచమ్ మే నిరాకరిష్యత్య సంశయం క్షిప్రమ్.**

– అని స్వామిని స్తుతించారు దేశికులు. "హయగ్రీవ స్వామికి నాయందు దయ ఉంటే వెంటనే వచ్చి నా బాధను తొలగిస్తాడని" శ్రీమద్వేదాంత దేశిక దివ్యచరితంలోగల పై శ్లోకా నికి అర్థం. వెంటనే స్వామి పూజామందిరంలో ప్రత్యక్షమ య్యాడు.

వేదాంత దేశికులు ముప్పైరెండు శ్లోకాలు గల హయగ్రీవ స్తోత్రం రచించారు. అందులో ఒక శ్లోకమిది –

**స్వతస్సిద్ధమ్ శుద్ధ స్ఫటికమణి భూభృత్ ప్రతిభటం**
**సుధాసధ్రీచిభిః ద్యుతిభిః ఖదాత త్రిభువనమ్,**
**అనంతైశ్వర్యం తైరనువిహిత హేషాహలహలం**
**హతాశేషావద్యం హయవదన మీడేమహి మహః.**

ఈ శ్లోకంలో 'హేషా హలహలం' అనే సమాసం ముఖ్యమైంది. గుర్రం చేసే ధ్వనికి హేష అని పేరు. హయ వదనం నుండి ఉత్పన్నమయ్యే ధ్వని 'హలహల' అన్నట్లున్నది. ఈ శబ్దాన్ని విడదీస్తే హల్+అహల్=అవుతుంది. హల్‌ను హల్లులను తెలిపేదిగా, అహల్‌ను హల్లులు కాని వర్ణాలైన అచ్చు లను తెలిపేదిగా గ్రహించవచ్చు. అలా గ్రహిస్తే హయవదనం నుండి ఉత్పన్నమైన ధ్వనిలో అచ్చులు, హల్లులతో కూడిన వర్ణమాల ఉద్భవించినట్లు అర్థమవుతుంది. అంటే హయవదనం నుండి సమస్త శబ్ద ప్రపంచం లేదా ధ్వని ప్రపంచం వ్యక్తదశలో అవగతమవుతున్నదని భావం.

ఈ కారణం వల్లే హయగ్రీవ స్వామి స్వచ్ఛమైన స్ఫటిక కాంతితో సర్వవిద్యలకు ఆధారమైన జ్ఞానస్వరూపుడుగా కనిపిస్తున్నాడు. అందువల్ల విద్యారంభకాలంలో జ్ఞానం కోసం

**జ్ఞానానందమయందేవం నిర్మల స్ఫటికాకృతిమ్,**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే.**

– అని ప్రార్థించడం ఎప్పటి నుండో కొనసాగుతూ ఉంది.

## డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 03-06-2011

## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమం ద్వారా భక్తులు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధ ప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాం.)*

**వర్షాకాలంలో సహస్రదీపాలంకరణసేవను వైభవమండపంలో జరుపుతారు. అయితే అక్కడ సేవకు తగినట్లుగా దీపాలు,ఉయ్యాలలుండవు. గతంలో కూడా ఈ విషయంగానే మీతో మాట్లాడాను. ఐనా ఎటువంటి చర్య తీసుకోలేదు. దీపాలు, ఉయ్యాలేకుండా జరుపడం బాగాలేదు.** *- రమేష్.*

**కార్యనిర్వహణాధికారి :** త్వరలో దీపాలు ఏర్పాటు చేస్తాం.

**ముసలివాళ్ళను గుడి ముందు ప్రత్యేకంగా వదలిన తర్వాత గుడిలోపల క్యూలైన్‌లలో అందరిని కలపడం చేత చాలా కష్టంగా ఉంది. ప్రత్యేకంగా పంపిస్తే బాగుంటుంది.**

*- చలమయ్య, నెల్లూరు.*

**కార్యనిర్వహణాధికారి :** రద్దీ ఎక్కువగా ఉన్నప్పుడు ప్రత్యేకంగా పంపలేకపోతున్నాము. రద్దీ లేనప్పుడు ప్రత్యేకంగా పంపిస్తున్నాము. అయినా ప్రత్యేకంగా పంపే ఏర్పాట్లు చేయుటకు ప్రయత్నిస్తాము.

**మా నాన్నగారి పేరుమీద లక్ష రూపాయలు అన్నదాన సేవకై పంపాలనుకొంటున్నాము. ఎవరికి, ఎలా పంపాలి?**

*- సంధ్య, బెంగుళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** డి.డి. రూపంలో **"కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి"** వారి పేరుమీద అన్నదానం కొరకు అని పేర్కొంటూ పంపించండి.

**వైకుంఠం కాంప్లెక్స్‌లలో భక్తులను పంపించినప్పుడు అక్కడ ఆడవాళ్ళకు తగిన సదుపాయములు లేవు. కావున వారి కోసం తగు ఏర్పాట్లు చేస్తే బాగుంటుంది.**

*- బంగారు సుదర్శన ఆళ్వార్, చెన్నై.*

**కార్యనిర్వహణాధికారి :** సత్వరమే ఈ ఏర్పాట్లు చేస్తాం.

**శ్రీవారిసేవకు వచ్చిన వాళ్ళకు దర్శనం మరియు ప్రసాదాల ఏర్పాటు తీసేశారని విన్నాం. అన్నీ వదలి ఆ దేవుడి సేవకులుగా వచ్చిన శ్రీవారిసేవకులకు సేవచేసి తిరిగి వెళ్ళేటప్పుడు ఆ దేవుడి దర్శనం మరియు ప్రసాదాలు తి.తి.దే. వారు ఇవ్వకుండా పంపడం బాగోలేదు. కనీసం ఆఖరిరోజు దర్శన, ప్రసాదభాగ్యం కల్పించండి.**

*- బాలాజీ, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** ఈ విధానం– సేవాభావన నుండి దర్శనానికే పరిమితమవుతున్నది. కాబట్టి ఈ విషయంలో వేరే మార్పు లేదు.

**కాలినడకన వచ్చే భక్తులకు భక్తిభావం కలిగేటట్లుగా దారి పొడవున శ్రీనివాస సంకీర్తనలు, భక్తి గీతాలు వినిపిస్తే బాగుంటుంది. అలాగే మాధవం, అన్నదానంలో కూడా ఏర్పాటు చేయండి.** *- దుర్గాప్రసాద్, మండపేట.*

**కార్యనిర్వహణాధికారి:** ప్రస్తుతం కాలినడకన వచ్చే భక్తులకు భక్తిగీతాలు వేస్తున్నాము. అలాగే మీరు చెప్పినట్లు మాధవం, అన్నదానంలో కూడా ఏర్పాటు చేస్తాం.

**స్థానికాలయాల దర్శన బస్సులో డిసెంబరులో వెళ్ళాం.వారు చూపించవలసిన కొన్ని ఆలయములను చూపించకపోగా బలవంతంగా తొండవాడ దగ్గర ఒక హోటల్ దగ్గర అనవసరంగా ఆపి భక్తుల కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. వీటిపై తగిన చర్యలు తీసుకోండి.** *- వెంకటేశ్, బళ్ళారి.*

**కార్యనిర్వహణాధికారి :** ఈ విషయంగా ఇదివరకే బస్సు వాళ్ళకు తెలపడమైంది. ఇకముందు ఇటువంటివి జరగకుండా చూస్తాము.

**కాలినడకలో వచ్చే భక్తులను అంగడివాళ్ళు ప్రతి వస్తువుపై రేట్లుపెంచి అమ్ముతున్నారు. ఒక విధంగా భక్తులను దోచుకొంటున్నారు. తి.తి.దే. వాళ్ళే అంగళ్ళను నడపవచ్చు కదా!**

*- వెంకట సుబ్బారావు, బెంగుళూరు.*

**కార్యనిర్వహణాధికారి :** ఆలోచిద్దాం.

# జగజ్జనని లక్ష్మీదేవి

- ఎం. గంగిరెడ్డి

**పద్మాలయాం పద్మకరాం**
**పద్మపత్ర నిభేక్షణామ్,**
**వందే పద్మముఖీం దేవీం**
**పద్మనాభప్రియామహమ్.**

దేవికి గల శక్తులన్నీ మహాలక్ష్మీదేవికి మూలమైనవి. ఈమే సర్వోన్నత పరాశక్తి. సమస్త వికృతులకు ప్రధాన ప్రకృతి. సర్వప్రపంచమూ లక్ష్మీదేవి వల్లే వెలసింది.

ఒక పర్యాయం ఆమె భృగుమహర్షికి పుత్రికగా కూడా అవతరించినందున భార్గవియనే పేరొచ్చింది. సముద్రమథన సమయంలో ఈమె క్షీరసాగరం నుంచి ఉద్భవించినందున క్షీరసాగరతనయ అనే పేరొచ్చింది. విష్ణు భగవానుడెపుడవతరిస్తాడో అపుడామె కూడా వారిని సేవించుటకై తదనుగుణరూప ధారణ గావిస్తూంటుంది.

భృగుమహర్షి పత్ని ఖ్యాతి. ఖ్యాతి గర్భంనుండి భువన మోహిని, త్రిలోకసుందరియైన కన్య జన్మించింది. సర్వశుభలక్షణాలతో నలరారుతూన్న ఆమెకు లక్ష్మీదేవియని పేరు పెట్టారు. ఆమె పెద్దయైన తర్వాత భగవన్నారాయణుని గుణగుణాలు విని ఆమె హృదయం భగవానుని యందనురక్త కాగా; ఆయననే పతిగా చేసుకోవాలని సముద్రతీరానికెళ్ళి తపస్సు గావించింది. అలా వేయి సంవత్సరాల కాలం గడిచింది.

ఆ తర్వాత ఇంద్రుడు విష్ణుభగవానుని రూపంలో వచ్చి లక్ష్మీదేవికి ప్రత్యక్షమై వరం కోరుకొమ్మన్నాడు. అందుకామె మీరు మీ విశ్వరూపదర్శనం గావించినచో నేను వరాన్ని కోరుతానన్నది. ఇంద్రుడు విశ్వరూపం చూపటానికసమర్థుడు కాబట్టి లజ్జితుడై వచ్చినదారినే వెనుదిరిగిపోయాడు. ఆ తర్వాత కూడా అనేకమంది దేవతలు వచ్చి లక్ష్మీదేవికి విశ్వరూపం చూపలేక తిరిగి వెళ్ళిపోయారు.




చివరికి, సాక్షాత్ శ్రీమన్నారాయణుడే లక్ష్మీదేవికి దర్శనమిచ్చి, ఆమెను కృతార్థురాల్ని చేయుటకై వరాన్ని వేడుకొమ్మనగా; లక్ష్మీదేవి "దేవదేవా! మీరు సాక్షాత్ భగవన్నారాయణుడే ఐతే మీ విశ్వరూపదర్శనం గావించి నా సందేహాన్ని తొలగించుమని కోరింది."

అప్పుడు విష్ణుభగవానుడు తన విశ్వరూపాన్ని చూపించి లక్ష్మీదేవి కోరికపై ఆమెను తన పత్నిగా స్వీకరించాడు. అప్పుడు నారాయణుడు. దేవీ! బ్రహ్మచర్యం అన్ని ధర్మాలకు మూలం మరియు సర్వోత్తమమైంది తపస్సు. నీవు బ్రహ్మచర్యంతో కఠిన తపం గావించావు. కాబట్టి నేనిచ్చటనే మూలశ్రీపతి పేరుతో; నీవు బ్రహ్మచారిణి రూపంలో 'మూలశ్రీ' పేరుతో ఇచ్చటనే యుందుమని, శ్రీ, శ్రీపతి పేర్లతో విరాజిల్లారు.



అలాగే మరొక ఇతిహాసమిలా ఉంది – శంకరాంశ సంభూతుడైన దుర్వాసమహర్షి భూతలాన సంచరిస్తూ ఒక మనోహరమైన వనాన్ని చేరుకున్నాడు. అక్కడ ఒక విద్యాధర సుందరాంగన చేతియందు దివ్యపారిజాతపుష్పమాలను చూశాడు. ఆ సుమమాల దివ్యగంధంచే సమస్త వనప్రదేశ మంతా సువాసనలు వెదజల్లుచుండెను. దుర్వాసు డా విద్యాధర కన్యతో ఆ పుష్పమాలనిమ్మనడిగాడు. ఆమె ఆ పుష్పమాల నివ్వగా; దానిని తీసికొని దుర్వాస మహాముని తన మస్తక మందుంచుకొని సంచరిస్తూండగా; ఆ సమయంలో దేవరాజైన ఇంద్రుడు ఐరావతమనే ఏనుగు మీద స్వారీ చేస్తూ కనిపించాడు. ఆయనతో బాటు అనేకమంది దేవతలు కూడా ఉన్నారు.

అప్పుడా ముని ఆ పారిజాత సుగంధ సుమమాలను దేవేంద్రున కిచ్చాడు. దేవేంద్రు డా పూలమాలనుగైకొని ఏనుగు మీద వేశాడు. ఆ ఏనుగు అసహనంతో ఆ మాలను కిందపడవేసి తొక్కసాగింది. అందులకు దుర్వాసుడు కోపించి "ఇంద్రా! ఐశ్వర్యగర్వంతో నేనిచ్చిన మాలను అనాదరం చేశావు. అది మాల కాదు లక్ష్మీధామం. కాబట్టి నీ లక్ష్మి అంతయూ నిన్నొదిలి పోవుగాకయని శపించాడు. అప్పుడింద్రుడు భయపడి ఏనుగు నుండి దిగి ముని పాదాలపై ప్రణమిల్లి ప్రాధేయపడ్డా కూడా; ఆ ముని వినక అచ్చటినుండి వెళ్లిపోయాడు.

అలా లక్ష్మీచ్యుతుడైనందుననూ, బలహీనుడైనందు ననూ దానవులు దేవతలపై దండెత్తివచ్చి వారు విజయుల య్యారు. అప్పుడు దేవతలంతా బ్రహ్మ వద్దకెళ్లి మొరపెట్టుకోగా; బ్రహ్మ వారిని విష్ణుమూర్తిని శరణు వేడుమని తెల్పాడు. బ్రహ్మతో బాటు దేవతలందరు భక్తితో విష్ణువును వేడుకున్నారు. భగవానుడు ప్రసన్నుడై వారికి క్షీరసాగరమథనాన్ని గావించుమని ఆజ్ఞాపించాడు. క్షీరసాగరమథనం వల్ల అమృతముద్భవిస్తుంది. అమృతపానం చేయటం వల్ల మీరు అజరామరులౌతారు. ఈ కార్యం చాలా దుష్కరమైనది. కాబట్టి మీరు దైత్యుల సహాయం తీసికొని మథనం చేయాలని తెలిపాడు. అప్పుడు నేను మీకు సాయం చేస్తానన్నాడు.

భగవానుని ఆజ్ఞానుసారం దేవతలు వెళ్ళి రాక్షసులతో సంధి గావించుకొని అమృతప్రాప్తికై ప్రయత్నం చేయసాగారు. వివిధరకాలైన వనమూలికలు తెచ్చి క్షీరసాగరమందు వేసి మంథరాచలాన్ని కవ్వంగా చేసికొని; వాసుకిని తాడుగా చేసుకొని క్షీరసాగరమథనం చేయసాగారు.

విష్ణుభగవానుడు వాసుకి తోకవైపు దేవతలను, వాసుకి ముఖం వైపు రాక్షసులుండునట్లు నియమించి; క్షీరసాగరాన్ని మథించునపుడు తాను తాబేలు రూపంలో నుండి మంథర పర్వతాన్ని మోసాడు. సాగరమథనం సమయంలో వాసుకి నిశ్వాసాగ్ని జ్వాలలకు దైత్యులు నిస్తేజులౌతున్నారు. ఆ నిశ్వాస వాయువులు నిక్షిప్తమై, మేఘాలు వాసుకి తోకవైపు వర్షించగా; దేవతల శక్తి వృద్ధియగుచుండెను. భక్త వత్సలుడైన విష్ణు భగవానుడు కచ్ఛపరూపం ధరించి క్షీరసాగర మందు తిరుగుతూ; ఒక రూపంలో దేవతలందు, వేరొక రూపంలో దైత్యులయం దుండి వాసుకిని త్రిప్పుట యందు సాయపడ్డాడు. దేవ దానవులకు కనుపడని రూపంలో మంథరపర్వతాన్ని తాను మోస్తూ, వాసుకికి బలం కలిగిస్తూ దేవతలకు శక్తినభివృద్ధి గావించాడు.

ఈ విధంగా క్షీరసాగరాన్ని మథించగా; కామధేనువు, వారుణీదేవి, కల్పవృక్షం, అప్సరసలుదయించారు. వీరి తర్వాత చంద్రుడుదయించాడు. శంకరుడు చంద్రుని తన మస్తక మందుంచుకున్నాడు. తర్వాత విషం ఉద్భవించింది. విషాన్ని నాగులు తీసుకొన్నారు. శివుడు కూడా లోకసంరక్షణార్థం గర ళాన్ని మింగి లోపలకి పోనీక అచ్చటనే ఉండునట్లుగా చేసికొని గరళకంఠుడయ్యాడు. లక్ష్మీదేవి ఉదయించగా ఆమెను విష్ణు భగవానుడు పత్నిగా స్వీకరించాడు. తర్వాత అమృత కలశంతో ధన్వంతరి ప్రాదుర్భవించగా దేవదానవులానంద పడ్డారు.

శ్రీహరి విష్ణురూప ఆదిత్యులుగా నున్నపుడు లక్ష్మీ దేవి 'పద్మా' పేరుతో విఖ్యాతినొందింది. ఈమే శ్రీరాముడితో సీతగా, శ్రీకృష్ణుడుగ నున్నపుడు రుక్మిణీదేవిగా అవతరించి విష్ణువును సేవించి తరించింది. మాఘమాసమందు లక్ష్మీ నారా యణులనారాధించి, అర్చించిన యెడల భక్తులు సుఖసౌఖ్యముల నొందుతారు. కావున, భక్తులు లక్ష్మీనారాయణులనారాధించి తరింతురు గాక!

**వేంకటాద్రి సమం స్థానం**
**బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశ సమో దేవో**
**న భూతో న భవిష్యతి.**

బ్రహ్మాండంలో వేంకటాద్రికి సమానమైన పుణ్యక్షేత్రం లేదు. అలాగే శ్రీ వేంకటేశ్వరునకు సాటి రాగల దేవుడు ఇటు భూతకాలంలోనూ లేదు, అటు భవిష్యత్తులోనూ ఉండబోదని అర్థం.




**- ఎ.వి.శ్రీవైష్ణవి,**
**6వ తరగతి,**
**D/o ఎ.వి.ఎస్.శ్రీనివాస్,**
**2-2-23/49,**
**ఎస్.బి.హెచ్. కాలనీ,**
**బాగ్ అంబర్‌పేట్,**
**హైదరాబాదు-500 013,**


అటువంటి శ్రీనివాసుని దర్శించడానికి ముందుగా తిరుపతి వెళ్ళి, అక్కడి నుండి అలిపిరికి, అక్కడి నుండి తిరుమలకు చేరుకోవాలి. అలిపిరివద్ద పెద్ద గరుత్మంతుని విగ్రహం, ఆ విగ్రహం నడుముకు పెద్ద నాగేంద్రుడు చుట్టుకుని ఉంటాడు. గరుత్మంతుడు సదా స్వామికి నమస్కరిస్తూ, స్వామి వారి ఆజ్ఞకొరకై ఎదురుచూస్తూ ఉంటాడు. వారి నడుముకు ఉన్న నాగరాజు చిరునవ్వులు చిందిస్తూ భక్తులను తిరుమలకు పంపిస్తూ ఉంటాడు. ఇదేమిటి! గరుత్మంతునకు సర్పాలు ఆహారం గదా! నాగరాజు గరుత్మంతుని చుట్టుకొని ఎలా ఆనందంగా ఉన్నాడు? ఈ విషయమై మహాభారతంలో వ్యాస భగవానుడు ఉద్యోగ పర్వంలో వివరించాడు.



త్రిలోకనాథుడైన ఇంద్రుని సారథి 'మాతలి'కి ఒకే కూతురు 'గుణకేశి' యుండేది. ఆమె సాటిలేని రూప సౌందర్యాలు కల్గి యుండేది. గుణకేశికి వివాహ వయస్సు రాగా; మాతలి చింతిస్తూ తన పత్నియైన సుధర్మను సంప్రదిస్తూ నామెతో ఇట్లన్నాడు. "నేను దేవ-మనుష్య లోకాల్లో మన గుణకేశికి మంచి రూప వరుని కొరకు అంతటా వెదికాను. కాని, ఏ వరుడు కూడా ఆమెకు సరికాడు. కాబట్టి ఇపుడు నాగలోకానికి పోయి వరుని వెదకివస్తా" నని చెప్పి నాగలోకానికి బయలు దేరాడు.

మాతలి మార్గమధ్యమందు లోకకల్యాణ కారకుడైన నారదమహర్షిని కలిసి, ఆ తర్వాత వారిరువురూ నాగలోకానికెళ్ళారు. నాగలోకమందు



మాతలి స్థిరంగా ఒక నాగకుమారునేకాగ్రతతో పరీక్షించి, ప్రసన్నుడై నారదునితో నిట్లన్నాడు.

"దేవర్షీ! ఇక్కడ 'కౌరవ్య-ఆర్యక' నాగుల ముందు భాగమందు కాంతివంతుడుగా నిలిచియున్న ఈ నాగకుమారుడు సుందరంగా నున్నాడు. ఇతడే నా కూతురు 'గుణకేశి'కి పతియగుటకు యోగ్యుడుగా నున్నాడు. ఇతని కులగోత్రాలు తెలుపవలసిందిగా ప్రార్థించాడు."

అంతట నారదుడు, ఆ నాగకుమారుని గురించి ఇలా చెప్పాడు. "మాతలీ! ఇతడు 'ఐరావతుడు'డనే నాగరాజు కులమందు జన్మించినవాడు. ఇతని పేరు 'సుముఖుడు'. ఇతడు 'ఆర్యకుడ'నే నాగరాజునకు పౌత్రుడు. ఇతని తండ్రి పేరు 'చికురుడు'. చికురుని ఈ మధ్యనే 'గరుడుడు' సంహరించి భుజించేశాడన్నాడు.

అంతట నారదమహర్షి ఆర్యకునితో, "ఆర్యకా! ఈతడు మాతలి. ఇతని కుమార్తె గుణకేశికి, నీ పౌత్రుడు సుముఖుణ్ణి తగిన వరునిగా నిశ్చయించాడు. కావున, వారి వివాహం చేయుమని కోరుచున్నాడు."

అపుడు ఆర్యకుడు నారదునితో; "మహర్షీ! గుణకేశిని సుముఖునకు భార్యగా చేసికొనజాలకుండుటకు కారణం అతి దుర్భరంగా నున్నది. సుముఖుని తండ్రి నాకు కొడుకు. అతనిని గరుడుడు ఈ మధ్యనే చంపి తినేశాడు. ఈ దుఃఖంతో మేము బాధపడుతూండగా, గరుడుడు ఈ మార్గాన పోతూ; 'రెండవ నెలలో నేను ఈ సుముఖుని కూడ భక్షిస్తా'నని చెప్పివెళ్లాడని చెప్పాడు.

అదివిని "నేనీ విషయంలో చాలా ఆలోచించి; నీ పౌత్రునినే నా అల్లునిగా చేసికోవటానికి నిశ్చయించాను. కనుక, సుముఖుని నాతో పాటు ఇంద్రుని దగ్గరకు పంపుమ"ని మాతలి అన్నాడు.

అలా ముగ్గురూ కలసి ఇంద్రుని దగ్గరికెళ్ళారు. అదృష్ట వశాత్తు అప్పుడు దేవేంద్రునితో కూడి విష్ణుభగవానుడు కూడ స్వర్గమందున్నాడు. వీరిని చూచి విష్ణువు ప్రసన్నుడై ఇంద్రునితో "ఇంద్రా! నీవు ఈ సుముఖునకు పరిపూర్ణమైన ఆయుస్సునివ్వు" మన్నాడు. అలా దేవరాజు వద్ద వరం పొంది, మాతలి తన కుమార్తెను సుముఖునికిచ్చి వివాహం జరిపించాడు.

మహాబలవంతుడైన గరుడుడు ఈ సమాచారం విని, అత్యంత క్రుద్ధుడై తన రెక్కల ప్రచండ వాయువు చేత మూడు లోకాలను కంపింపజేస్తూ, ఇంద్రుని సమీపానికి పరుగెత్తుకుంటూ వచ్చి; అతనితో "భగవాన్! నన్ను అవమానపరచి, నా జీవికకు ఏల భంగం కలిగించావు? సృష్టికర్త నన్ను పుట్టించినపుడే నాకు నాగులను ప్రియమైన ఆహారంగా వరమిచ్చాడు గదా! నేడు ఏల భంగం కలిగించావు? మరియు భగవంతుడైన విష్ణువుయొక్క భారాన్ని మోయుటకు నేను తప్ప మరెవరున్నారు? నీవు నన్ను అవమానపరచి నా భోజనాన్ని అపహరించావు. దీనికంతటికి కారణం నీవు, శ్రీహరియే!" నన్నాడు.

ఆ మాటలకు విష్ణువు "గరుత్మంతా! నీవు అతి దుర్బలుడవు. మూడులోకాలేకమైనా నా శరీరభారాన్ని మోయలేవు. నీవు ఇప్పుడు నా కుడిచేతి భారాన్ని మాత్రం మోయుము చాల"ని గరుత్మంతుని భుజంపై దక్షిణబాహువునుంచాడు. దాని బరువుచేత గరుత్మంతుడు క్రిందపడి మూర్ఛిల్లాడు. గిరికానన సహితమైన సమస్త భూమండలానికున్నంత బరువు, శ్రీ మహావిష్ణువు యొక్క బాహువునకేయుండెను. అప్పుడు గరుడుడు మూర్ఛనుంచి తేరుకొని, "పరమాత్మా! ప్రపంచంలోని బలమంతా మూర్తివంతమైనట్లున్న నీ భుజాన్ని అలవోకగా నాపై నుంచావు. ఆ మాత్రం చేతనే నేను పిండి పిండియై భూతలమందు పడిపోయాను. నా అపరాధాన్ని క్షమింపుమ"ని ప్రార్థించాడు.

తర్వాత శ్రీహరి సుముఖుడై సుముఖుని రావించి, తన కాలిబొటనవ్రేలిచేత సుముఖునెత్తి గరుత్మంతుని వక్షస్థల మందుంచాడు. అప్పటినుండీ గరుత్మంతుడు సర్వదా సుముఖుని (సర్పమును) తనతోపాటు నిలుపుకొన్నాడు. ఈ విధంగా గరుడుడు విష్ణుబలంచేత ఆక్రమింపబడిన తన అహంకారాన్ని విడిచిపెట్టేశాడు.

# తరిగొండ వెంగమాంబ

**– ఆచార్య కె.జె. కృష్ణమూర్తి**

సకల జీవుల హృదయసీమల్లో అధివసించియుండే భగవంతుని 'దివ్యజ్యోతి'ని దర్శించి, తాదాత్మ్యాన్ని పొంది తరించిన మహనీయుల్లో అగ్రగణ్యమయిన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. ఈ 'సకల తత్త్వార్థ వివేకిని' తాను జన్మించిన ప్రాంతానికీ, జీవించిన కాలానికీ అతీతమైన గొప్ప జన్మాంతర సంస్కారం గల పరమభాగవత శిరోమణి!

చిత్తూరు జిల్లా వాయల్పాడు సమీపంలోని తరిగొండలో వెలసియున్న లక్ష్మీనృసింహస్వామి ఈమె యిలవేల్పు. భక్తవత్స లుడైన తరిగొండ లక్ష్మీ నృసింహుని పరిపూర్ణమైన అనుగ్రహానికి పాత్రురాలు కావటం చేత బాల్యం నుండే వెంగమాంబ 'దివ్య జ్యోతి'గా భాసించింది! చదువుల తల్లి శారద ఒకనాటి మధ్యాహ్నవేళ ఆకాశంనుండి దిగివచ్చి నేరుగా ఆమె ముఖంలో ప్రవేశించింది! అసలే స్ఫురద్రూపిణియైన వెంగమాంబ ఆ క్షణంనుండే వింతతేజస్సుతో విలసిల్ల సాగింది!

ఆంధ్రవాఙ్మయచరిత్రలోనే అపూర్వమైన ఈ "అక్షర సరస్వతీ సాక్షాత్కార" సన్నివేశాన్ని ఈ కవయిత్రి తాను తద నంతర కాలంలో తిరుమలలో రచించిన శ్రీ వేంకటాచల మాహాత్మ్య కావ్యం యొక్క అవతారికలో రెండు పద్యాల్లో వర్ణించింది:

**శా. అక్షీణాక్షర పంక్తి రీతి మును మధ్యాహ్నంబునన్ నాకుఁ బ్ర**
**త్యక్షంబై, గురు నాది పూరుషునిఁ బ్రత్యక్షంబుగావించి, చి**
**త్సాక్షే బ్రహ్మమటంచుఁ జూపుచుఁ దదర్థంబుం కృపం జెప్పి, నన్**
**రక్షింపం బనిఁ బూను భారతిని గీర్వాణిన్ బ్రశంసించెదన్.**

**చ. అలఘునభంబునుండి విమలాక్షర పంక్తులరీతి వచ్చి, నే**
**నలసతఁ జెందియున్న తఱి నాననమందు వసించి, జ్ఞానముం**
**గలుగఁగఁ జేసి, మానస వికారములం తొలఁగించి, జిహ్వపై**
**నిలిచి నటించు శారదను నిత్యము సన్నుతిసేయుచుండెదన్.**

**అక్షరామృతం [34]**

వెంగమాంబ చిన్నప్పుడు ఓనమాలు సైతం గురువుల వద్ద నేర్చుకోలేదు. అయినా, విశిష్టమైన జన్మాంతర సంస్కారం చేత ఆమె బాల్యంలోనే 'పరమయోగిని' కాగలిగింది. తరిగొండ లోని పూర్వాచారపరాయణులు పుష్పగిరిపీఠానికి వెంగమాంబచే బలవంతంగా నమస్కారం చేయించిన సందర్భంలో ఆ పీఠం ఆకస్మికంగా తగులబడిపోయినప్పుడు వెంగమాంబ అపూర్వ జ్యోతిస్స్వరూపిణి – అనే అంశం స్పష్టంగా ఆవిష్కృతమయింది.

---

**ఆగష్టు 7వ తేది తరిగొండ వెంగమాంబ వర్ధంతి సందర్భంగా ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

---

వెంగమాంబ రచించిన తొలికృతి తరిగొండ నృసింహ శతకం. ఆ తర్వాత నృసింహ విలాస కథ, శివనాటకము, బాలకృష్ణనాటకము– అనే మూడు యక్షగానాలను, రాజ యోగామృతసారము – అనే ద్విపద కావ్యాన్ని– మొత్తం ఐదు గ్రంథాలను ఈ కవయిత్రి తరిగొండలో ఉండగా రచించింది. తిరుమల చేరిన తరువాత వెంగమాంబ పగటిపూట తులసీ సుమమాలికలను, రాత్రివేళ కర్పూరహారతి కైంకర్యాన్ని క్రమం తప్పక శ్రీవారి ఆలయానికి వెళ్ళి భక్తి ప్రపత్తులతో సమ ర్పిస్తూ ఉండేది. ఆ సమయంలో ఈ మహాకవయిత్రి సందర్శిం చిన వేంకటరమణుని దరహాస దివ్యకాంతులే ఆమె తిరుమలపై సృజించిన 13 రచనలలో ప్రతిఫలించి, ప్రతి అక్షరమూ ఒక్కొక్క దివ్యజ్యోతిగా భాసిస్తూ ఉన్నాయి.

తన తపోభూమియైన తుంబురుకోన మొదలుకొని వెంగమాంబ తిలకింపని తీర్థం లేదు; ప్రదేశమూ లేదు. అందలి ప్రత్యణువులోనూ ఆ పరాత్పరుని తత్త్వాన్నీ, మహత్త్వాన్నీ దర్శించి పరవశించింది; అలాగే, తాను నెలకొల్పిన నిత్యముత్యాల హారతి కైంకర్యపు వెలుగుల్లో ఆధ్యాత్మికమైన తన దివ్యజ్యోతిని సంలీనం కావించి, కలియుగ ప్రత్యక్ష దైవమైన ఆ తిరుమల నాథుని సన్నిధిలో 'దివ్యజ్యోతి'గా ఆచంద్రతారార్కం అభివంద నాలను అందుకొంటూ ఉంది!

# దీనుని కావుమురా! పరాత్పరా!

ఫణిశైలాధిపు డీతడే కలియుగ ప్రత్యక్ష దైవంబు; మా
కును మా పూర్వజు లెల్లవారలకు నీగోవిందుడే ప్రాణమై,
ధనమై, దిక్కయి యున్నవాడు జగదాధారుండు శ్రీ శ్రీనివా
సుని నిర్వ్యాజ కృపామృతార్ద్ర శుభదృష్టుల్ మమ్ము రక్షించుతన్.

సకల జగమ్ములందు వృషశైల నివాసుని వంటి దైవతం
బొకరుడు లేడు లే డనుచు నుల్లము నందున విశ్వసించి తా
వక చరణాంబుజాతముల బాల్యమునుండి భజించు చుంటిరా!
తికమక పెట్టకుండ నను దీనుని గావుమురా! పరాత్పరా!.

ఒకదేశాధిపు నాశ్రయించిన నతం డూళ్ళిచ్చు, డబ్బిచ్చు; ఐ
హిక సౌఖ్యంబుల నెల్ల నీయగలడే? యిల్లాలికిన్ గొడ్డురా
లికి బిడ్డన్ దయసేయగా గలడె? తండ్రీ! శేషశైలేశ! మా
నక భక్తి న్నుతియింతు నిన్నిహపరానందైక సంధాయకున్.

నీ కంఠధ్వని యెట్టిదో తెలియగా, నీమాట లెట్లుండునో
ఆకర్ణింపగ కోర్కియౌ; జపతపో ధ్యానాది సత్కర్మలన్
గా కెట్లయ్యది చేకుఱున్? జడుడ, నజ్ఞానిన్, భవద్దాసుడన్
నాకీ జన్మజరాది దుఃఖములు మాన్పన్ నిన్ను కొండాడెదన్.

కలలన్ ఘాతుక జంతు సంతతులు దక్కన్ గోవులున్, గోవృష
మ్ములు భద్రేభములున్ కనంబడవు; మత్పూర్వాఘ మేపాటిదో!
ఇల దుస్స్వప్న ఫలంబు లొక్కటియు మాకీకుంటకై నిన్నె శ్రీ
లలనాచిత్తచకోరచంద్రముని వాలాయంబు ప్రార్థించెదన్.

స్వామీ! తిర్మల వీథులందు గరుడ స్కంధాధి రూఢుండవై
వ్యోమంబంటగ వేదవాద్య నినదం; బూరేగు నా దృశ్యముల్
క్షేమ స్థైర్య జయాయు రున్నత యశశ్శ్రీ లెల్ల సంధిల్లగా
మా మోమందున వ్రేలు నట్టివరమున్ మాకున్ ప్రసాదింపవే!

తిరుమల మాడవీథులను దివ్యరథస్థుడవై సురాంగనా
సురుచిరనాట్యముల్ సెలగ; చొప్పడ కిన్నరగానవైఖరుల్
పరువడి సంచరించెడి శుభంకరదృశ్యము మా మనమ్ములన్
మెఱయు వరమ్మొసంగవె అమేయకృపాకర! వేంకటేశ్వరా!

తను భేదమ్ముల శయ్యగా, గొడుగుగా, ధామమ్ముగా, దిండుగా,
ఘనపీఠమ్ముగ, పాదుకా ద్వయముగా, కౌశేయవస్త్రమ్ముగా
నిను సేవించెడు శేషభోగిపయి నెంతే వేడ్క నూరేగు నీ
కనయంబున్ జయమంగళం బగుత దేవా! వేంకటాద్రీశ్వరా!

అంజన నిన్ను గొల్చి కనినట్టి మహాత్ముడు నీకు భృత్యుడై
ప్రాంజలి యొొచు నీదుగుడివాకిలి ముందర కాచుకొన్న మృ
త్యుంజయుడైన యా హనుమ దోర్యుగ పీఠముపై వెలుంగు నీ
కంజలి చేసి కప్పురపు టారతి నిత్తు త్రిలోకనాయకా!

నీ తనయుండు బ్రహ్మ పయనించెడి వాహనమైన హంసపై
ప్రీతి దలిర్ప నెక్కి విహరింపగ తిర్మలవీథులన్ నినున్
భూతలమందు మానవులు వ్యోమతలంబున దేవ సంఘముల్
చేతము లుల్లసిల్ల గని శేషగిరీంద్ర! నుతింతు రెంతయున్.

చెరియొక వంక భూసతియు శ్రీసతి యొప్ప ననర్ఘభూషణాం
బరధరుఁడై జగద్విభుఁడు బంగరుటుయ్యెల లోన నూఁగుచున్
సరసత చౌకళింప మలిసంజల నాశ్రిత భక్తకోటికిన్
వరము లొసంగు దృశ్య మెడబాయక మ మ్మలరించుఁ గావుతన్.

సమదైరావణ దిగ్గజంబు పయి నక్షత్రాళి సందీప్త నీ
లమహాకాశ నిభుండు రత్నఖచితాలంకార సంశోభియై
తమి నూరేగుచు తిర్మలన్ విభుఁడు భక్తవ్రాతముం బ్రోచు దృ
శ్యము మచ్చిత్తము నందు హత్తి కొని హర్షాంభోధి నోలార్చుతన్.

సర్వ దారిద్ర్య రోగ విషాదములకు
శాంతి సమకూర్ప జాలు ప్రశస్త మైన
ఓన్నమో వేంకటేశాయ యన్న నీదు
మంత్ర జపముండ భయమేల మాకు స్వామి!

– ముదివర్తి కొండమాచార్యులు

# శ్రీ గాయత్రీ మాహాత్మ్యం

– చావలి సుబ్రహ్మణ్య రామకృష్ణ

ooooooooooooooooooooooooooooooo

త్రికాలాల్లోనూ గాయత్రీమంత్రాన్ననుష్టించడం వల్ల ఎంతో మేలు జరుగుతుంది. ఆరోగ్యం, సంకల్ప బలం, ఏకాగ్రత, ఇంద్రియాలపై అదుపు సాధించ టానికి ఈ మంత్రముపయోగపడుతుందని మన ప్రాచీన ఋషులు చెబుతున్నారు.

హిందువుల మూలమంత్రం గాయత్రి. గాయత్రీ మంత్రాన్ని మించిన మంత్రం; గాయత్రీదేవిని మించిన దైవం మరెవరూ లేరన్న మాట అక్షర సత్యం. హిందూ ధర్మశాస్త్రాల్లో ఆత్మశక్తిని ప్రసాదించే మంత్రా లెన్నో ఉన్నా వాటన్నింటిలో గాయత్రీమంత్రం సర్వశ్రేష్ఠమైనది. నాలుగు వేదాల్లో గాయత్రీతో సమానమైన మంత్రమేదీ లేదని విశ్వామిత్రుడు చెప్పాడు.

రోజూ నియమనిష్ఠలతో గాయత్రీని చేయలేనివారు గాయత్రీమంత్రాన్ని త్రికాలాల్లోనూ పదిసార్లు చొప్పున జపిస్తే మంచిది. ఏ పనిలో నున్నా ఆ పనిని ఒక్క నిముషం పాటు పక్కనబెట్టి, ఈ మంత్ర జపం చేయండి. అలాగే స్త్రీలు గాయత్రీ మంత్రం జపించకూడదనే నియమమెక్కడా లేదు. నిరభ్యంత రంగా వీరు ఈ మంత్రాన్ని పఠించొచ్చు. గాయత్రీ చేస్తే మనసుకు ప్రశాంతత చేకూరుతుంది. గాయత్రీమంత్రంతో పాటు ప్రతి ఒక్కరూ ఓం నమో గాయత్రీ మాత్రే అని జపించండి. తప్పక సత్ఫలితాలు పొందుతారు. గాయత్రీ మాత అనుగ్రహం కూడా లభిస్తుంది.

సృష్టికి ప్రతిసృష్టి చేసిన అపూర్వ తపోబలసంపన్నుడు విశ్వామిత్ర మహర్షి. ఆయన తపశ్శక్తిలోంచి వెలువడిన మంత్రమే గాయత్రీమంత్రం.

## గాయత్రీ అంటే...

ఇదే సందేహం ఒకసారి వసిష్ఠ మహర్షికి కూడా కల్గింది. వెంటనే విధాత వద్దకెళ్ళి గాయత్రీతత్త్వాన్ని తెలుపుమని వేడుకొనగా బ్రహ్మ "నా స్ఫురణమాత్రంగా ఏ చైతన్య శక్తి ఉత్పన్నమయిందో దాన్నే జ్ఞానం లేక వేదంగా చెప్పుకోవచ్చు. దీన్నే గాయత్రీనామంతో వ్యవహరిస్తారు. నా నుండి అగ్ని, అగ్ని నుండి వాయువు, వాయువు నుండి ఓంకారం, ఓంకారంతో హృతి, హృతితో వ్యాహృతి, వ్యాహృతితో గాయత్రీ, గాయత్రీతో సావిత్రి, సావిత్రితో సరస్వతి, సరస్వతితో వేదాలు, వేదాలతో సమస్తక్రియలు ప్రవర్తితమౌతున్నాయ"ని తెలియజేశాడు.

అన్ని వేదాలసారం – శ్రీ గాయత్రీమంత్రం

**సహస్ర పరమాం దేవీం శతమధ్యాం దశవరామ్,**
**సహస్ర నేత్రాం గాయత్రీం శరణ మహం ప్రపద్యే.**

శ్రీ గాయత్రీమంత్రం అన్య మంత్రాల్లో శ్రేష్టమైన మంత్రం.

**న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదైవతమ్**

తల్లిని మించిన దైవం లేదు. మరి గాయత్రీని మించిన దైవం కూడా లేదు.

**గయాన్ త్రాయతే ఇతి గాయత్రీ**

– శంకరుని భాష్యం ప్రకారం ప్రాణాన్ని రక్షించేదే గాయత్రీ.

పరమశివుడు బ్రహ్మానందంతో తన ఢమరుకంతో చేసిన ఇరవైనాలుగు ధ్వనులే శ్రీ గాయత్రీమంత్రంలోని ఇరవై నాలుగక్షరాలు. ఈ ఇరవైనాలుగక్షరాలు ఇరవైనాలుగు దైవిక శక్తులకు ప్రతీకలు. వీటిలో ఇరవైనాలుగు పేర్లున్నాయి. వీటిలో పన్నెండు వైదికమార్గాలు కాగా, మిగిలిన పన్నెండు తాంత్రిక మార్గాలు. ఈ ఇరవై నాలుగక్షరాలు నివాసముండే ఇరవై నాలుగు దైవశక్తులు ఆయా పేర్లతో పూజింపబడుతాయి.

## శ్రీ గాయత్రీమంత్రం :

**ఓం భూర్భువ స్సువః ఓం తత్స వితుర్వరేణ్యం**
**భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్**

**భావం :**

ప్రాణస్వరూపం, దుఃఖనాశకం, సుఖస్వరూపం, శ్రేష్ఠం, తేజస్సు గల పాపనాశకమైన, దేవస్వరూపమైన పరమాత్మను మేము అంతరాత్మలో ధరించెదము గాక! ఆ పరమాత్మ మా బుద్ధిని సన్మార్గంవైపు ప్రేరేపించు గాక! సమస్త బ్రహ్మాండం యొక్క అంతరాళమంతా సంవ్యాప్తమై యున్న చేతనాశక్తియే గాయత్రీ.

## మానవదేహం - గాయత్రీశక్తి

శరీరమనే వీణలోని నాలుగుతంత్రులంటే ఇరవై నాలుగు గ్రంథులపై గాయత్రీమంత్రంలోని ఇరవైనాలుగక్షరాల ఉచ్చారణ వల్ల పుట్టిన తరంగాలు స్వరలహరిని పలికిస్తాయి. ఆ స్వర ప్రకంపనం వల్ల ఆత్మ అదృశ్య ప్రపంచంలోని అమృ తత్త్వాన్ని దర్శిస్తుంది. గాయత్రీమంత్రంలోని అద్భుతశక్తి ప్రవాహం శరీరాన్నంతటిని విద్యుత్ తరంగాల్లో చుదుతుంది.

## గాయత్రీస్వరూపం :

గాయత్రీమాత ఉదయకాలంలో ఎర్రని రంగుతో, దండ కమండములతో, ఎర్రని కుండలములు, అక్షమాల ధరించి హంస వాహనాన్నధిరోహిస్తుంది. నాలుగు ముఖాలు కలిగి ఋగ్వేదసంహితయై ఆకాశంలో విహరిస్తుంది. మధ్యాహ్న కాలంలో తెల్లనివర్ణం కలిగిన యువతిగా త్రిశూలాన్ని ధరించి త్రినేత్రాలతో వృషభవాహనయై, యజుర్వేదసంహితయై, రుద్ర దేవతయై, ఆదిత్యపథగామినియై యుంటుంది. సాయంకాలంలో నల్లనివర్ణం కలిగి వృద్ధమాతగా పీతవస్త్రం ధరించి నాలుగు చేతుల్లో శంఖ, చక్ర, గదా, పద్మాలను ధరించి గరుడ వాహ నయై, సత్త్వగుణసంపన్నయై, సామవేదసహితయై దక్షిణాగ్ని స్వరూపిణిగానుంటుంది. ఈ విధంగా త్రిశక్తి, త్రిగుణ, త్రిమూర్తి స్వరూపిణి అయిన గాయత్రీని త్రికాలాల్లోనూ ముద్రాసహితంగా అనుష్ఠించాలి. ఇంకా గాయత్రీ మాతనిలా ప్రార్థించాలి.

"తల్లీ! ఓ మాతా! నీకు నమస్కారములు. నీవు శక్తి స్వరూపిణివి. నీవే సరస్వతివి, కాళివి, దుర్గవు, కుండలినివి, మహాలక్ష్మివి, పరాశక్తివి. మానవ మాత్రులమైన మేమందరం నీ ముందు అల్పులమే. నీ శరణాగతి మాకు అవసరం. మమ్ములను నీవే కాపాడాలి. ప్రపంచమంతా నీ అధీనం లోనే ఉంది. మేము నిన్నెలా కాపాడగలము? నీ ప్రభనెలా వర్ణించగలము? తల్లీ! వేదమాతా! మేమందరం అజ్ఞానులం. నీ కటాక్షం లేనిదే మేము జీవించలేం. శాస్త్రాలకు మూలం నీవే! మమ్ములను, మా కుటుంబ సభ్యులను, ఈ సమస్త సృష్టిని కాపాడుము తల్లీ!"

## గకార పంచకం :

గంగ, గాయత్రీ, గీత, గోవు, గోవిందుడు ఈ అయి దింటిని భారతీయ ఆత్మలుగా చెప్పొచ్చు. కనుకనే ఋష్యశృంగ మహర్షి గాయత్రీమాహాత్మ్యాన్ని వర్ణిస్తూ "సర్వాత్మాహి సా దేవి సర్వ భూతేషు సంస్థితా గాయత్రీ మోక్ష హేతుశ్చ మోక్షస్థాన మలక్షణమ్" అన్నారు. అంటే, సమస్త ప్రాణుల్లో ఆత్మరూపంగా నున్నది. గాయత్రీమోక్షానికి మూలకారణమైన సారూప్యమూర్తికి స్థానం. అందుకని ప్రతివారూ గాయత్రీదేవిని ఆరాధించి ఆ దేవి అనుగ్రహం పొందుదాం.

# అతిథి దేవో భవ

- రావి-ఎన్-అవధాని

అతిథిసత్కారం చేయక అతిథి కంటె ముందు గృహస్థు భుజిస్తే కలిగే అనర్థాలు కూడ విపులంగా అథర్వవేదంలో వివరించబడ్డాయి.

**ఇష్టం చ వా ఏష పూర్తం చ**
**ప్రజాం చ వా ఏష పశూం శ్చ**
**గృహాణా మశ్నాతి యః పూర్వోతిథే రశ్నాతి**
**అశితావ త్యతిథా వశ్నీయాత్ ॥**

ఇంటికొచ్చిన అతిథికి అన్నం పెట్టక గృహస్థు భుజిస్తే అతని ఐష్టము, పూర్తము, పజా, పశుసంపద నశిస్తాయి. అందువల్ల అతిథి భుజించిన తర్వాతే యజమాని భుజించాలి. అతిథిసత్కారవ్రతం చేసిన మహాపురుషుల జీవిత కథలెన్నో మన పురాణాల్లోనున్నాయి -

పూర్వం సక్తుప్రస్థుడనే బ్రాహ్మణు డుండేవాడు. అతను చాల పేద వాడు. ధర్మపరుడు. అతిథి సత్కారవ్రత పరాయణుడు.



'అతిథి దేవోభవ!' - అతిథి దేవుడితో సమానమన్నారు.

**'అతిథయశ్చ సాధ్యాయ ప్రవచనేచ'**

- అతిథులనాదరించి సత్కరించాలి. ఆతిథ్యమివ్వడం వల్ల గృహస్థుకు ఎంతో ఆత్మసంతృప్తి కల్గుతుంది. అతిథి సత్కారాన్ని గురించి తెలిపే అనేక విషయాలు అథర్వవేదంలో ఎంతో మనోజ్ఞంగా అభివర్ణించబడ్డాయి.

**ఏషవా అతిథిర్యచ్ఛ్రోత్రియ,**
**స్తస్మాత్ పూర్వో నాశ్నీయాత్**

అతిథి శ్రోత్రియుడు. అందువల్ల అతని కంటె ముందు గృహస్థు భుజించకూడదు. అతిథి భుజించిన తర్వాతే గృహస్థు భుజించాలి.

**ఏతేవై ప్రియాః చ అప్రియాః చ ఋత్విజః**
**స్వర్గం లోకం గమయన్తి య దతిథయః**

అతిథులుగా వచ్చినవారు యజమానికి ప్రియమైన వారుకాని, అప్రియమైనవారు కాని అతిథియజ్ఞంలో వారు ఋత్విక్కులు. వారు ఆతిథ్యం స్వీకరించి గృహస్థుకు శాశ్వత స్వర్గలోక ప్రాప్తి కల్గిస్తారు. అతిథిసేవావ్రతం ఎంతో ఉత్తమ మైంది. ఆ వచ్చిన అతిథి అర్హత గలవాడైతే గృహస్థు దాని ఫలితం ఇంకా హెచ్చుగా పొందగల్గుతాడు. అతిథి అధముడు, అనర్హుడైతే ఫలితం హీనంగా ఉంటుంది. అందువల్లే 'అపాత్ర దానం' చేయకూడదని పెద్దల శాస్త్రవచనం.

**నిధనం భూత్యాః ప్రజాయాః**
**పశూనాం భవతి య ఏవం వేద**

అతిథిసేవావ్రతం చేయడం వల్ల గృహస్థుకు సిరి సంపదలు, మంచి సంతానం, పశుసంపద కల్గుతాయి. అంతే కాకుండా -

**బృహస్పతి రూర్జయోద్గాయతి**
**త్వష్టా పుష్ట్యా ప్రతిహరతి విశ్వే దేవా నిధనమ్**

అతిథిసత్కారం చేసిన వాని గుణగణాలు బృహస్పతి గానం చేస్తాడు. త్వష్ట అతనికి పుష్టినిస్తాడు. విశ్వేదేవతలు ఆశ్రయం కల్గిస్తారు.

ఆహారం దొరకనందువల్ల ఉంఛవృత్తితో జీవనం సాగిస్తూండే వాడు. సక్తుప్రస్థుడొకనాడు కుంచెడు పేలపిండి సంపాదించి తెచ్చి; ఆ పేలపిండిని నాలుగు సమభాగాలు చేసి తాను, భార్య, కొడుకు, కోడలు పంచుకొని తినబోతూండగా; సక్తుప్రస్థుడిని పరీక్షించదలచి ధర్మదేవత ఆతని ఇంటికి అతిథిరూపంలో వచ్చాడు. సక్తుప్రస్థుడు అతిథిని సగౌరవంగా ఆహ్వానించి తన భాగం పేలపిండి నిచ్చాడు. అతిథి దాన్ని భుజించి "ఆకలి తీర లేదు" అన్నాడు. సక్తుప్రస్థుడి భార్య వెంటనే తన భాగం పేల పిండినిచ్చింది. అతిథి దాన్ని కూడ తిని "తన ఆకలి ఇంకా తీర లేదు" అన్నాడు. సక్తుప్రస్థుని కొడుకు, కోడలు కూడ తమ తమ పేలపిండి భాగాలను అతిథికి సమర్పించి అతని ఆకలి తీర్చారు.

దాంతో ధర్మదేవత సంతుష్టినొంది తన నిజరూపాన్ని ధరించి వారికి మోక్షాన్నిచ్చాడు. ఆ సమయాన సక్తుప్రస్థుడి ఇంటిముందు సంచరిస్తున్న ముంగిసపై పేలపిండి నలుసు కొంతపడగా; ఆ భాగం బంగారమైపోయింది.

ఆ తర్వాత ధర్మరాజు అశ్వమేధయాగం ఎంతో ఘనంగా చేసి విరివిగా దానాలు చేస్తుండడాన్ని తెల్సుకొని ఆ ముంగిస అక్కడికొచ్చి ధర్మరాజును చూసి– ఇది సక్తుప్రస్థుని అతిథివ్రతానికి ఏ మాత్రం సరిపోనిది. సక్తుప్రస్థుని ఇంటికి వచ్చిన అతిథి పాద్యజలక్షేపంబు వల్ల నా తల ఒక పార్శ్వం బంగారమైంది. అప్పటినుండీ నేను ఎన్ని చోట్లకు పోయినా నా ఈ మిగిలిన శరీరభాగం బంగారం కాలేదు" అన్నది.

అశ్వమేధయాగానికి వచ్చిన విప్రులకు సక్తుప్రస్థుని అతిథి యజ్ఞకథ చెప్పి "పితృశాపం వల్ల తనకు ముంగిస జన్మ వచ్చిందని, నేటితో తన శాపం తీరిందని, తాను గతజన్మలో జమదగ్నినని" చెప్పింది.

యమధర్మరాజంతటి వాడు తన గృహానికతిథిగా వచ్చిన నచికేతుని సత్కరించలేకపోయినందుకెంతో విచారించి ఆ పాపపరిహారార్థం నచికేతునికి మూడు వరాలిచ్చి సంతృప్తుని చేశాడు.

రంతిదేవుడు గొప్పదాత. తన సంపదనంతా దానం చేసేశాడు. చివరికి తినడానికి అన్నం కూడా లేక నలభైరోజులు పస్తులున్నాడు. అలాంటి సమయంలో అతనికి కొంత అన్నం లభించింది. ఆ అన్నం తినబోతూండగా ఒక అతిథొచ్చాడు. రంతిదేవుడు అతిథికి సగభాగమన్నమిచ్చాడు. అతిథి భుజించి వెళ్ళిన తర్వాత ఒక శూద్రుడు; వాని వెనుక ఒక చండాలుడు, ఆ తర్వాత ఒక కుక్క ఆకలితో రాగా తన దగ్గర నున్న అన్నాన్నంతా వారికి పంచిపెట్టేశాడు.

అలా రంతిదేవుడింటికి అతిథులుగా వచ్చినవారు బ్రహ్మాది దేవతలు. వారు రంతిదేవుడికి తమ నిజరూపాలు చూపి "అతని అతిథిసత్కార వ్రతానికి, భూతదయకు మెచ్చా" మంటూ; ముక్తిని ప్రసాదించారు.

## శ్రీపదకేళి - 25 (జూన్ - 2011)
## విజేతలు

1) **ఆరవీటి రామకృష్ణయ్య,**
రిటైర్డ్ వి.డి.ఓ. గ్రేడ్-1, ఇంటి నెం.4-919,
గీతాశ్రమం రోడ్డు, ప్రొద్దుటూరు (పోస్ట్),
వై.యస్.ఆర్. కడపజిల్లా - 516 360.

2) **ఎం.వి.శ్రీవాణి,**
D/o ఎం.కృష్ణమూర్తి,
ఫ్లాట్ నెం.204, శ్రీకర్ అపార్టుమెంట్సు,
ఇంటి నెం.18-1-28/5, సన్మార్గ్,
శాంతి నగర్, కె.టి.రోడ్డు, తిరుపతి - 517 507.

3) **బి.వి.ఆర్.జి.యస్.సుబ్రహ్మణ్యం,**
S/o బి.వి.ఎస్.ఎన్.మూర్తి,
అనసూయ నివాస్, విమలా రెసిడెన్సీ,
బీడి కంపెనీ లేన్, ప్రసాదరావుపేట, జైపూర్,
కోరపుట్, (జిల్లా), ఒడిస్సా - 764 003.

**సరైన సమాధానాలు రాసినవారు :**

టి.ఆర్.బాలకృష్ణారావు (రాజమండ్రి); వేదాంతం గీతాస్వప్న (తెనాలి); ఎ.సుబ్బారావు (గుంటూరు); ఎన్.భార్గవి (సంగం జాగర్లమూడి); దీవి లక్ష్మీనరసమ్మ (తెనాలి); వల్లభ జోస్యుల జలజ (గుంటూరు); కె.శివనాగేంద్రమ్మ (ఒంగోలు); కోవూరు తేజస్మిత (ఒంగోలు); దీవి సీతారామాచార్యులు (తెనాలి); ముక్కామల దీప్తి (ఒంగోలు); గుర్రం రంగయ్య (ప్రొద్దుటూరు); సావిత్రిశర్మ (అనంతపురం); కే.రామసుబ్బయ్య (ప్రొద్దుటూరు); అక్షింతల సంజీవశర్మ (అనంతపురం); ఎస్.వి.జగన్నాధరావు (శ్రీకాకుళం); తిన్నవెళ్ళి నరసింహసాయినాథ్ (మార్కాపురం); చెన్నా వెంకటేశ్వర్లు (ప్రొద్దుటూరు); జె.సామ్రాజ్యలక్ష్మి(తిరుపతి); ఎస్.నాగభూషణ శర్మ (అనంతపురం); వి.వి.మునిదుర్జయ్ రెడ్డి (ప్రొద్దుటూరు); ఎగ్గోని శ్యామసుందర్ (హైదరాబాద్); కె.వి. రమణమూర్తి (విజయవాడ); ముక్కామల లక్ష్మీమారుతీ ప్రసన్న (పాతగుంటూరు); ఎ.టి.శ్రీనివాసన్ (అనంతపురం); పి.ఆర్. నాయుడు (తిరుపతి); వంగవేటి వేంకటేశ్వర్లు (బేతవోలు); బి.వి.భారతి (చోడవరం); ఆలమూరి కళ్యాణి (జట్నీ, ఒరిస్సా); ఊటుకూరి రామయ్య (మార్కాపురం); భీమవరపు శ్రీహరిరావు (గుంటూరు); జె.ఎస్.ఎస్.కె. ఆదిత్య (విజయవాడ); పసుపర్తి మౌక్తిక (నెల్లూరు); పి.ఎస్.ఎన్.వాసు (విజయనగరం); నల్లపాటి రామకృష్ణ (గుంటూరు).




**నిబంధనలు :**

1) అందరూ శ్రీపదకేళిని పూరించవచ్చు. ఒక్కొక్కరు ఒక్కొక్కటి మాత్రమే పూరించి పంపాలి.

2) సప్తగిరి పత్రికలోని కూపన్‌ను మాత్రమే కత్తరించి పంపాలి, విడిగా రాసి పంపకూడదు.

3) బాల్‌పెన్‌తోనే పూరించాలి.

4) గడులలో దిద్దుబాట్లు, కొట్టివేతలు ఉండకూడదు.

5) బహుమతి విషయంలో ఎలాంటి సిఫారసులు అంగీకరించబడవు.

6) ప్రతినెలా 25వ తేదీ లోపుగా పూరించిన శ్రీపదకేళిని మా కార్యాలయానికి పంపాలి.

7) ఈ పదకేళిలో పాల్గొనేవారు సప్తగిరి పత్రికకు చందాదారులై ఉంటే మీ చందానెంబరుతోపాటు మీ తరపున తెలుగు సప్తగిరి పత్రికను ఎవరికి పంపాల్సిందీ పూర్తి చిరునామాను తెలియజేయాలి.

8) సప్తగిరి చందాదారులు కానివారు కూడా ఈ శీర్షికలో పాల్గొనవచ్చు.

**బహుమతి వివరాలు :**

సరిగా పూరించిన వారికి తెలుగు సప్తగిరి పత్రికను ఒక సంవత్సరంపాటు ఉచితంగా అందజేస్తాం. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది సరిగా పూరిస్తే లాటరీ ద్వారా ముగ్గురిని ఎంపిక చేసి, వారికి ఒక సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపుతాము. మిగిలినవారి పేర్లను సప్తగిరి మాసపత్రికలో ప్రచురిస్తాం.

**పూరించిన శ్రీపదకేళిని పంపవలసిన చిరునామా :**

**ప్రధాన సంపాదకుడు,**
**సప్తగిరి కార్యాలయం,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు,**
**తి.తి.దే. ముద్రణాలయ ప్రాంగణం,**
**కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083.**

ఈ కూపను కత్తరించండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | ■ | 2 | 3 | | |
| | ■ | ■ | ■ | 4 | ■ | | ■ | ■ |
| 5 | | ■ | 6 | | | ■ | 7 | 8 |
| | ■ | 9 | ■ | | ■ | 10 | ■ | |
| ■ | 11 | | | ■ | 12 | | | ■ |
| 13 | ■ | | ■ | 14 | ■ | | ■ | 15 |
| 16 | | ■ | 17 | | | ■ | 18 | |
| ■ | ■ | 19 | ■ | | ■ | 20 | ■ | ■ |
| 21 | | | | ■ | 22 | | | ■ |

# శ్రీపదకేళి - 27

**నిర్వహణ : ఆచార్య శ్రీవత్స**

**1) పూరించిన వారి పూర్తి చిరునామా :**

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

**2)** మీరు సప్తగిరి చందాదారులైతే?

అ) చందా నెంబరు : ......................................

ఆ) మీ బదులు మరెవరికైనా పత్రిక పంపగోరితే వారి పూర్తి చిరునామా : ......................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

..................................................................

## ఆధారాలు

### అడ్డం

**1)** కణ్వమహర్షి పెంపుడు కూతురు (4)

**2)** సుబాహువను కాశీరాజు కూతురు (4)

**5)** అడవి (2)

**6)** స్వయంవరంలో ఇందుమతికి రాజులను పరిచయం చేసిన చెలికత్తె (3)

**7)** కర్ణుడు ఈ రాజ్యానికి అధిపతి (2)

**11)** ద్వాపరయుగంలో విష్ణువు ధరించిన అవతారం (3)

**12)** నందికేశ్వరుని భార్య (3)

**16)** రుక్మిణి సోదరుడు (2)

**17)** రఘుమహారాజు కొడుకు (3)

**18)** కురువంశానికి అధిపతి (2)

**21)** అర్జునుని శంఖం (4)

**22)** వసిష్ఠుని హోమధేనువు (3)

### నిలువు

**1)** సుగ్రీవసేనలో ఒకనాయకుడు. సీతను వెదకుటకై ఉత్తర దిశగా వెళ్లినవాడు (4)

**3)** ఒక పక్షికొరకు తన తొడయందు కొంతభాగాన్ని కోసి ఇచ్చిన రాజు (2)

**4)** పురూరుని కుమారుడగు జనమేజయుని భార్య (3)

**8)** కర్దమ ప్రజాపతి కూతురు. పులహుని భార్య (2)

**9)** లక్ష్మీదేవి భర్త (3)

**10)** మేరువు కూతురు. విధాత భార్య (3)

**13)** యుద్ధము (2)

**14)** అంగారకునికి గల మరో పేరు (3)

**15)** ఈ దేశాధిపతి శల్యుడు (2)

**19)** భీముని ఆయుధం (2)

**20)** శిశుపాలుడు పాలించిన దేశం (2)

### —:: *శ్రీపదకేళి-25* (జూన్, 2011) సమాధానాలు ::—

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 అం | గా | ర | 2 ప | ర్ణ | డు | ■ | 3 ధ | 4 ర |
| బు | ■ | ■ | చ్ఛ | ■ | ■ | 5 అ | ■ | త్నా |
| జ | ■ | ■ | ■ | ■ | 6 అ | ని | ■ | చ |
| 7 నా | రి | 8 కే | ళ | ము | ■ | 9 శం | కు | ల |
| భు | ■ | త | ■ | ■ | 10 ఇం | ■ | ■ | ము |
| డు | ■ | 11 నం | 12 ది | ■ | ద్ర | ■ | 13 తే | ■ |
| ■ | 14 రు | ■ | తి | ■ | 15 కి | చ | కు | డు |
| 16 క | ద్రు | వ | ■ | ■ | లా | ■ | వ | ■ |
| ■ | డు | ■ | ■ | 17 మా | ద్రి | ■ | ■ | ■ |




– జె. చంద్రశేఖరశర్మ



## మేష రాశి

ఈ రాశివారికి ఆశించిన ఫలితాలు పొందటానికి మిత్రుల సహకారమవసరమౌతుంది. విద్యార్థులకు, మహిళలకనుకూల మాసం. నాగపంచమినాడు నాగదేవతారాధనల వల్ల సంతాన హీనులకు సంతానయోగం, అవివాహితులకు వివాహమయ్యే అవకాశాలున్నాయి. దీర్ఘకాలిక వ్యాధులు ఉపశమనం కల్గిస్తాయి. మొదటివారం దైవచింతన, రెండోవారం శుభవార్తా శ్రవణం, మూడోవారం బంధుమిత్రుల కలయిక, నాలుగోవారం ధనాదాయం.



## వృషభ రాశి

ఈ రాశివారికి మనస్సుస్థిరంగా లేకపోవటం, వృథా ఖర్చులు, ఆందోళనలు కల్గించే వార్తలు వినాల్సొస్తుంది. ధనాదాయం బాగున్నా నూతన వస్తుసేకరణకై కొంత అప్పు చేయవలసి వస్తుంది. మహిళా ఉద్యోగులకు అదృష్టకాలం. దైవ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటారు. మొదటివారం ఆనందం, రెండోవారం ధనప్రాప్తి, మూడోవారం ప్రయత్నజయం, నాలుగో వారం దైవారాధన.



## మిథున రాశి

ఈ రాశివారికి అన్నివిధాల ప్రతికూల కాలం. వృత్తి, ఉద్యోగాల్లో కష్టనష్టాలు. చేయు వ్యవహారాల్లో చిక్కులు. అధిక ధనవ్యయం, అనారోగ్యం తదితర సమస్యలు ఇబ్బందులకు గురిచేస్తాయి. కంటిసమస్యలు, థైరాయిడ్ సమస్యలు శస్త్రచికిత్స లకు కారణమౌతాయి. శనిదృష్టి నివారణకు శనిత్రయోదశి పూజలు ఉపశాంతినిస్తాయి. మొదటివారం ఆందోళనలు, రెండోవారం అనారోగ్యం, మూడోవారం శస్త్ర చికిత్సలు, నాలుగో వారం అశాంతి, వివాదాలు.



## కర్కాటక రాశి

ఈ రాశివారికి వివాహ, ఉద్యోగ ప్రయత్నాల కోసం సుదూర ప్రయాణాలు చేయాల్సొస్తుంది. విద్యార్థులు శ్రమకు తగిన ఫలితాల్ని పొందుతారు. విదేశీ ప్రయత్నాలనుకూలం. రాజకీయరంగంలోని వారికి గుర్తింపు, గౌరవం బాగా పెరుగు తాయి. సకాలంలో వర్షాలు పడటంతో రైతన్నలో హర్షం వ్యక్త మౌతుంది. వెండి, బంగారు వర్తకులకు; బ్యాంకు, రెవెన్యూ ఉద్యోగులకు అదృష్టకాలం. మొదటివారం ప్రయత్నజయం, రెండోవారం శుభవార్త, మూడోవారం ఆనందం, నాలుగోవారం క్షేత్రదర్శనం.



## సింహ రాశి

ఈ రాశివారికి చేయు వృత్తి వ్యాపారాల్లో పలు ఆటంకాలు ఏర్పడి ఇబ్బందులకు గురిచేస్తాయి. బంధుమిత్రులతో అభిప్రాయభేదాలు ఏర్పడుతాయి. ఒంటరి ప్రయాణం పలు ప్రమాదాలకు దారితీస్తుంది. జాగ్రత్త వహించగలరు. విలువైన వస్తువులు అపహరణకు గురయ్యే అవకాశముంది. ఉద్యోస్థులకు అధికార్ల ఒత్తిడి. మొదటివారం కార్యవిఘ్నం, రెండోవారం ఆనందం, మూడోవారం అధికార్ల ఒత్తిడి, నాలుగోవారం వస్తువ పహరణ.



## కన్యా రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో శారీరక, మానసిక బాధలతో పాటు సోదరీసోదరులతో మనస్పర్థలు. శరీరారోగ్య విషయాల్లో జాగ్రత్త అవసరం. రైతులకు, బ్యాంకు ఉద్యోగులకు, గృహిణులకు అదృష్టకాలం. వరలక్ష్మీ పూజలు ఎంతో మేలు చేస్తాయి. సన్నిహితులతో మాట్లాడేటపుడు జాగ్రత్త వహించ వలెను. అవివాహితులకు వివాహప్రయత్నాలు నెరవేరుతాయి. మొదటివారం అనారోగ్యం, రెండోవారం మనస్పర్థలు, మూడో వారం సన్మానాలు, నాలుగోవారం దైవపూజలు.



## తులా రాశి

ఈ రాశివారికి ఆర్థికబాధలు, భార్య అనారోగ్యం తదితర సమస్యలేర్పడతాయి. గతంలోని అప్పులు, తప్పులు గ్రహపాటుగా ఏర్పడుతాయి. ధనాదాయానికై వాహనం, భూమి, విలువైన వస్తువులను అమ్మవలసిన పరిస్థితి కల్గుతుంది. వృథాఖర్చులు మనోవేదనకు గురిచేస్తాయి. మొదటివారం ధననష్టం, రెండోవారం అమ్మకాలు, మూడోవారం వృథాశ్రమ, నాలుగోవారం స్వల్పఆనందం.



## వృశ్చిక రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో ఆకస్మిక ప్రమాదాలు, ఉద్యోగంలో మార్పు, చోరాగ్ని, అనారోగ్యం తదితర సమస్యలు ఇబ్బంది పెడతాయి. వెండి, బంగారు వర్తకులకు అదృష్టకాలం. మహిళలకు, విద్యార్థులకు, చిన్న పిల్లలకు అనారోగ్య సమస్యలు, కంటిబాధలు కల్గుతాయి. ఆలయ అర్చకులకు, ప్రభుత్వాధి కారులకు విభేదాలు. మొదటివారం ప్రమాదాలు, రెండోవారం విభేదాలు, మూడోవారం దైవచింతన, నాలుగోవారం ఆనందం.





## ధనూ రాశి

ఈ రాశివారికి ఈ మాసమంతా అదృష్టకాలమే! చేయు వృత్తివ్యాపారాల్లో రాణిస్తారు. మహిళలు శుభవార్తలు వింటారు. నిరుద్యోగులకు, అవివాహితులకు కార్యజయం. గతంలో విక్రయాలు జరిపిన భూములు, ఆభరణాలకు రెట్టింపు ధరలు వస్తాయి. ఉద్యోగుల బదిలీలు, ప్రమోషన్లు, పెన్షన్‌దారులకు ప్రభుత్వ శుభవార్తలు. మహిళా నాయకులకు రాజకీయ ఉన్నతి. మొదటివారం శుభవార్త, రెండోవారం ఆనందం, మూడోవారం దైవారాధన, నాలుగోవారం జయం.



## మకర రాశి

ఈ రాశివారికి సుదూర ప్రయాణాలు, నమ్మిన వ్యక్తుల వల్ల మోసం తదితర సమస్యలు ఆందోళనకు గురి చేస్తాయి. వ్యాపారంలో భాగస్వాముల వల్ల కష్టనష్టాలు. విలువైన డాక్యు మెంట్స్, ఆభరణాలు అపహరణకు గురౌతాయి. స్త్రీలకు రాజ కీయ ఎదుగుదల. మొదటివారం ఆందోళన, రెండోవారం క్షేత్ర దర్శనం, మూడోవారం సన్మానాలు, నాలుగోవారం శుభవార్తలు.



## కుంభ రాశి

ఈ రాశివారికి వ్యవహారజయం, పుణ్యక్షేత్ర దర్శనం తదితర శుభఫలితాలు కల్గుతాయి. అవివాహితుల వివాహ ప్రయత్నాలు, పెండింగ్‌లోనున్న కోర్టు వ్యవహారాలు ఓ కొలిక్కి వస్తాయి. దీర్ఘకాలిక వ్యాధులు సైతం ఉపశమనం కల్గిస్తాయి. భూముల క్రయవిక్రయాల వల్ల స్వల్ప ధనాదాయం కల్గుతుంది. మొదటివారం ప్రయత్నఫలం, రెండోవారం ఆనందం, మూడో వారం ధనవృద్ధి, నాలుగోవారం ఆలయదర్శనం.



## మీన రాశి

ఈ రాశివారికి తొందరపాటు నిర్ణయాలతో కష్టనష్టా లొస్తాయి. మాట అదుపులో ఉంటేనే పనులు చక్కబడతాయి. శనిత్రయోదశినాడు శనిగ్రహపూజలు చేస్తే పెండింగ్ వ్యవ హారాలు ఓ కొలిక్కి వస్తాయి. ధనాదాయం కల్గుతుంది. ఆశిం చిన ఫలితాన్ని పొందుతారు. మొదటివారం ధనాదాయం, రెండో వారం ఆందోళన, మూడోవారం విభేదాలు, నాలుగోవారం సంతోషం.

# ఉద్యోగ ప్రదాత

– దాసరి రామచంద్రప్ప

**మా** ఇలవేల్పైన ఆ వేంకటేశ్వరస్వామిని తలచుకోనిదే మా ఇంటిల్లిపాది ఏ పనీ చేయం. మా నిత్య దైనందిత కార్యక్రమాల్లో ప్రతి పనికీ ఆ శ్రీనివాసుని తలచుకుంటూనే ఉంటాం. ఆ స్వామి మా కుటుంబాన్ని ఎంతో ఆదుకున్నారు. కాపాడారు. మా ఇంటికి సంబంధించిన ప్రతి విషయంలోనూ స్వామి తన ఉనికిని కాపాడుకుంటూనే ఉన్నారనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు.

అది 1964వ సంవత్సరపు కడపటి త్రైమాసిక సమయము. 1962లో నేను రెండవశ్రేణిలో ఎం.ఎ. ఉత్తీర్ణుడయ్యాను. ఉద్యోగం లేదు. ఇలాంటి సమయంలో మంచి ఉద్యోగమిప్పిస్తామని చెప్పి ఓ పెద్ద మనిషి బిడ్డనిచ్చి పెళ్ళి చేస్తానన్నారు. నా కన్నా మూడు సంవత్సరాలు పెద్దవాడైన మా అన్నగారే మా ఇంటికి పెద్ద. అనుభవం లేదు. పైగా వచ్చిన సంబంధం కాదనలేక, ఆ దేవుడే వారిని పంపించాడనుకుని, అంతా ఆ దేవుడే చూస్తాడని విశ్వసించి మా అన్నయ్య దగ్గరుండి పెళ్లి చేయించాడు. పెళ్లి తర్వాత తెలిసింది వాళ్ల బిడ్డకు పెళ్లి చేయడం కోసం మాయమాటలు చెప్పి ఉద్యోగమిప్పిస్తానన్నారని.




ఎ.పి.పి.యస్.సి. గ్రూపు 1, గ్రూపు 2 పరీక్షలు రాశాను. గ్రూపు 2 పరీక్ష ఇంటర్వ్యూ వచ్చింది. ఇంటర్వ్యూలో ప్రథముడుగా వచ్చినట్లు తెలుసుకున్నాను. ఆ వేంకటేశ్వర స్వామి దయవల్ల తప్పక ఏదో ఒక ఉద్యోగము వస్తుందని అనుకున్నాను. కాని, ఇంటర్వ్యూ జరిగి నాలుగు మాసాలైనా ఉత్తర్వులు రాలేదు. నిరాశనిస్పృహలతో కొట్టుమిట్టాడుతున్న సమయమది. ఆ రోజు 1964, నవంబరు 4వ తేది. ఆ రాత్రి శ్రీ వేంకటేశ్వరునికి నమస్కరిస్తూ 'స్వామి ఉద్యోగం వచ్చేటట్లు అనుగ్రహిస్తే భార్యతో సహా నీ కొండకు నడచివచ్చి తలనీలాలు సమర్పించుకుంటాను' అని మొక్కుకున్నాను. ఆ మరుసటి రోజు ఉ॥ 11.30 గంటల సమయంలో బయటకు వెళ్ళిన మా మామగారు వచ్చి లోకల్ ఫండు ఆడిట్ డిపార్టుమెంటులో 'డిస్ట్రిక్ట్ ఇన్‌స్పెక్టరు' ఉద్యోగానికి సెలక్టయినందువల్ల, నా గుణగణాలు విచారించేందుకు ఓ స్పెషల్ పోలీసు కానిస్టేబుల్‌కు సమాచారం వచ్చిందని చెప్పారు.

నా మనసు చాలా ఆనందపడింది. నా యొక్క సంతోషానికి అవధులు కనబడలేదు. ఇదంతా ఆ వేంకటేశ్వరస్వామి దయవల్లే జరిగింది. ఎందుకంటే నేను ముందురోజు అనుకోవడం, మరుసటిరోజు ఇలా జరగడం అంతా ఆ స్వామి దయే!

దాంతో ఆలస్యం చేయక నవంబరు 7వ తేదీనే మా ఊరు నుండి బయలుదేరి తిరుపతికి చేరాము. తర్వాత కాలినడకన తిరుమలకు చేరి నా మొక్కు చెల్లించుకున్నాను. అప్పటి నుంచి ఈ రోజు వరకు ప్రతి సంవత్సరం క్రమం తప్పక స్వామిని దర్శించుకొంటున్నాను.

ఆ స్వామివారు మరోసారి నా పై దయ చూపి 1983 నుంచి 1987 వరకు మూడున్నర సంవత్సరాలు తిరుమల తిరుపతి దేవస్థానంలో అసిస్టెంటు ఆడిట్ ఆఫీసరుగా పని చేసే అదృష్టాన్ని నాకు కల్పించారు. నన్ను ఆ స్వామి తన సేవకు వినియోగించుకోవడం నాకు చాలా అనంద మేసింది.

నాకు ఉద్యోగం ఇచ్చి, నాకు నా కుటుంబానికి అన్నం పెట్టిన ఆ వేంకటేశ్వరస్వామివారికి ఉడుతాభక్తిగా 2003 సంవత్సరం మే నెలలో స్వామివారి హుండీలో కానుకలు సమర్పించుకున్నాను. ఇది కేవలం నా సంతృప్తి కొరకు మాత్రమే. స్వామివారు చేసిందిదానికి ఋణం తీర్చుకోలేనిది.

స్వామి దయవల్ల నా పిల్లలు పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. ఇలా నాకు, నా కుటుంబానికి ఉద్యోగాలిచ్చి, మమ్ములను స్థిరపడేటట్లు చేసిన ఆ దేవదేవుడైన శ్రీనివాసునికి అనంత కోటి నమస్కారాలు.




ధారావాహిక - 103

**(ఆలయ ప్రసాదాలను అంటే స్వామికి నివేదించిన పదార్థాలను ఆర్థికంగా వెలగట్టి, ఉత్తమ ప్రతిఫలం పొందుతూ, చెట్టు నీరును చెఱువుకు చెల్లి వరము పొందిన రీతిగా ఆర్థికా భివృద్ధి ఇతోధికంగా కావటానికి ఆలయాలు కూడ దోహదం చేయడాన్ని తిరుమల శాసనాలు సవివరంగా చిత్రీకరించిన వైనాన్ని ఇక్కడ చూడవచ్చు.)**

ఆధారద్రవ్యదానంగా ఇచ్చిన ధనాన్ని పెట్టుబడిగా పెట్టినపుడు లభించే వడ్డీశాతానికీ, ఈ దానం చేసినందుకు ప్రతిఫలంగా లభించే నాల్గవవంతు ప్రసాదభాగరూపంలో లభించిన దాని విలువను గణించి తేల్చిన వడ్డీశాతానికీ మధ్య గల సంబంధాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయవలసియున్నది. దేవాలయ కార్యనిర్వాహకులు తాము పెట్టిన పెట్టుబడిమీద లభించిన వడ్డీ సంతృప్తికరంగా ఉండడంచేత మరింత ప్రోత్సా హాన్ని పొందిన వారై దైవానికి వారిదగ్గర ఉన్నటువంటి ధనాన్ని మరల ఆధార ద్రవ్యదానం చేయడానికి ఉత్సాహం చూపారు. అందువలన వీరు రెండు విధాలుగా లాభపడ్డారు. పుణ్యలాభంతో బాటు ధనలాభాన్ని పొందగలిగారన్న విషయం గుర్తించాలి.

మరొక విషయం ఏమిటంటే దేవాలయ ఆదాయ వ్యయాల నిర్వహణభారం సమతూకంలో ఉండే అవకాశం లభిస్తున్నందున ఈ విధంగా ఆధారద్రవ్యదానం చేసే ప్రక్రియ దేవాలయ అధికారులనుండి మరింత ఎక్కువ ప్రోత్సాహం లభించింది. నాల్గవవంతు ప్రసాద భాగాన్ని పొందటంవల్లా దీనితో లాభసాటి వ్యాపారం చేయడానికి అనువుగా ఉన్నందునా దేవాలయ కార్యనిర్వాకులు ఆధారద్రవ్యదానంలో పెట్టుబడి పెట్టేందుకు ఉత్సహించారు. ఇంకనూ మరింత నిశితంగా పరిశీలించినట్లయితే ఈ ధనం రాకపోకల పట్టికను తయారు చేయవచ్చును.

ఇదే విధంగా గ్రామమందలి దేవాలయ కార్యనిర్వా హకులు కూడ దైవానికి ఆధారద్రవ్యదానంచేసి లబ్ధిని పొంద వచ్చును. గ్రామానికి రావలసిన ఫలసాయం ఉభయానికి ఉప యోగపడుతుంది. కాబట్టే దాత ఇందులోని దైవానికి సమ ర్పించిన ప్రసాదంలో నాల్గవవంతు భాగాన్ని తన **విట్టవన్ విఝుక్కదు**గా గ్రహిస్తున్నాడు.

## 11. తిరుమల దేవాలయ పెట్టుబడులవల్ల జరిగిన వ్యవసాయ అభివృద్ధి :

వ్యవసాయాభివృద్ధికోసం మూలధనాన్ని పెట్టుబడిగా పెట్టే పద్ధతి ఒక్క తిరుమల దేవాలయానికే పరిమితం కాదు. దక్షిణభారతదేశమునందలి చాలదేవాలయాలకు ఇది వర్తిస్తుంది. మరి తిరుమల దేవాలయ విషయంలో అద్వితీయంగా భాసించే ప్రత్యేకత ఏమిటంటే దేవాలయం పెట్టే పెట్టుబడులవలన జరిగిన వ్యవసాయాభివృద్ధి విషయంలో సరియైన నిర్ణయం చేయడానికి వివరాణాత్మకంగా ఉన్న శాసన ఆధారాలు లభి స్తుండడమే! ఇతర ఆలయాల విషయంలో కూడ ఇటువంటి పరిశీలన చేయవచ్చును.

పైన తెలిపిన విధంగా, తిరుమలదేవాలయ విషయం లో చేసిన సూక్ష్మపరిశీలన ఉదాహరణగా గైకొని ఈ ప్రాంత జనుల సాంఘీక, ఆర్థిక పరిస్థితులనుగురించి కూడ ఆ పద్ధతిలో తెలిసికొనేందుకు అవకాశమున్నది.

తిరుమలదేవాలయ శాసనాలలో ఉన్న వివరాలను క్షుణ్ణంగా పరిశీలించి, తిరుమల ఆలయ ఆర్థికాభ్యున్నతి మరియు ఆర్థిక కార్యకలాపాల వివరాలను ఆ పద్ధతులతో సూక్ష్మపరిశీలన చేయవచ్చును.

ఈ విధమైన పరిశీలన ఆలయనిర్వహణాపరమైన మార్పులు తద్ద్వారా దేవాలయ ఆదాయాభివృద్ధి గురించి కూడ అధ్యయనం చేయవచ్చును

ప్రసాదాలరూపాన దేవాలయనిర్వాహకులకు ఇచ్చేట టువంటి జీతాలచెల్లింపు పద్ధతిలోని విధానాన్ని గుర్తించవచ్చు ను. దీనిని ధనరూపవిలువలను లెక్కించి తెలుసుకొనుటకు గాను భక్తునకువచ్చే నాల్గవవంతు ప్రసాదభాగంయొక్క అమ్మకపు విలు వను తెలుసుకోవచ్చును. పై చెప్పిన విధానాన్ని అనుసరించి 15,000 నర్పణాల పెట్టుబడిధనం మీదవచ్చే ఆదాయం 300 అప్పపడులను స్వామివారికి నైవేద్యం పెట్టేందుకు సరిపోతుంది. భక్తుని **విళుక్కడు** లేక నాల్గవవంతు ప్రసాదభాగానికి 75 అప్ప పడులు వస్తాయి. ఒక అప్పపడి తయారుచేయడానికి 6 పణాలు దేవస్థానానికి ఖర్చు అవుతుంది. ప్రసాదాన్ని అమ్మే గుత్తేదారు లేక **ప్రసాదక్కారర్**చే చెల్లించే ధర ఎక్కువగానే ఉంటుంది. అతడు ఒక అప్పపడికి 10 పణాలను చెల్లిస్తాడు(దాతకు వచ్చే ప్రసాదా నికి). ఈ విధంగా750 పణం రాబడి అవుతుంది. ఇది సాధార ణ వడ్డీరేటు 5% అవుతోంది. ఇది, కొద్ది సంవత్సరాలవరకు అమలులో ఉన్నటువంటి బ్యాంకు ఇచ్చేటటువంటి క్షేమకరమైన వడ్డీరేటుతో పోలిస్తే, ఇది అనుకూలంగాను, ఉపయుక్తంగాను ఉన్నది.

ఈ విధంగా దేవాలయకార్యనిర్వాహకులు చేసిన ఆధారద్రవ్యదానాలు 5% వడ్డీనిచ్చే పెట్టుబడులరూపాన సార్థ కతను పొందింది. ఈ ధనం(ఆధారద్రవ్యదాన ధనం) దేవాల యం వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలలో పెట్టుబడి పెట్టేందుకు వినియోగించబడింది. ఇందువలన వ్యవసాయంమీద రాబడి అధికమయింది. వీరికి లభించే **కుడివరం** వంతుకూడ అధిక మయింది; మరియు దేవాలయంయొక్క **మేల్‌వరం** రాబడి కూడ పెరిగింది. దేవాలయానికి వివిధ ఉత్సవాలు ఇంకా ఎక్కువగా, వైభవోన్నతంగా జరిపేందుకు వీలుకలిగింది, ఆర్థికాభివృద్ధికి దోహదకారి అయ్యింది. అంతేకాకుండా దేవాలయ కార్యనిర్వా హకులు పెట్టిన పెట్టుబడులమీద 5% వడ్డీరేటు లభించింది. ఈ చక్రనేమి క్రమవిధానం తన్నుతానే పోషించుకుంటూ, తన్ను తానే అభివృద్ధి చేసుకుంటూ అధికరాబడిని ఇస్తూ దేవాలయ వైభవోన్నతికి దోహదపడ్తూ కర్షకుల జీవనప్రమాణ అభివృద్ధికి కారణభూతమైంది.

ఇదొక అద్వితీయమైన ఆర్థిక మరియు ద్రవ్యసంబంధ మైన నిర్వాహకరీతి. ఇటువంటి విధానం ఎక్కడాలేదు. నిశ్చయంగా ఈ ఆధునికకాలంలో కూడ ఇటువంటి విధానం అమలులో ఉన్న వైనంకానీ, అమలు పరచడానికి యత్నించి నట్లుగానీ లేదు.

తిరుమల ఆలయ శాసనాలు అపారమైన విషయ సంపత్తికి కాణాచి. తరచిచూచి లోతుగా పరిశీలించినట్లయితే నూతనవిషయాలు బహిర్గతం కాగలవు. నాలుగైదు శతాబ్దాల కాలంనాటి సమాజం యొక్క సాంఘిక, ఆర్థిక పరిస్థితుల గురించిన ఒక సమగ్రమైన వివరణను ఇవ్వవచ్చును.

## 12. ఇతర సాంఘిక, ఆర్థికాంశాలు :

వివిధ ఇతర సాంఘిక, ఆర్థికవివరాలతోకూడిన విశే షాంశాలను దేవాలయ శాసనాల నుండి కూడదీసి రాబట్ట వచ్చు. వీటిని సమగ్రంగా విశ్లేషించి తదుపరి క్రీ.శ.16వ శతాబ్ద కాలంనాటి ఆర్థికపరిధిలో ఇముడ్చుకోవచ్చు. లభించి నంతవరకు ఇటువంటి వాటికి సంబంధించిన కొన్ని అంశాలు కింద ఇవ్వబడినాయి.

**(1)** తిరుమలదేవాలయం మూడవప్రాకారమందలి దక్షిణ గోడపైఉన్న శాసనసంఖ్య417-టి.టి.లో దేవాలయ ధర్మ కర్తలు, కుమారతాతయ్యంగారి శిష్యుడైన హనుమయ్యన్‌తో కుదుర్చుకున్న ఒప్పందం ఇందులో పొందుపరచబడియున్నది. క్రీ.శ.20-10-1545 సంవత్సరంలో ప్రకటించిన ఈ శాస నంలో విలువైన సమాచారం లభ్యమౌతోంది. రెండురకాల ఉభయాన్ని నిర్వహించేందుకు 200 రేఖైపొన్నులు(బంగారు నాణేలు) మరియు 175 రేఖైపొన్నుల ధనం ఆవశ్యకమని

ధారావాహిక 08

# మందార మకరందాలు

కమనీయభూమిభాగములు లేకున్నవే?
పడియుండుటకు దూదిపరుపు లేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే?
భోజనభాజనపుంజ మేల?
వల్కలాజినకుశావళులు లేకున్నవే?
కట్ట దుకూలసంఘాత మేల?
గొనకొని వసియింప గుహలు లేకున్నవే?
ప్రాసాదసౌధాదిపటల మేల?

ఫలరసాదులు గురియవే? పాదపములు
స్వాదుజలముల నుండవే? సకలనదులుఁ
బొసఁగ భిక్షయుఁ బెట్టరే? పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల? తాపసులకు.

ప్రాయోపవేశంలో ఉన్న పరీక్షితునికి శుకయోగి భక్తి జ్ఞాన మార్గాలను ఉపదేశిస్తున్నాడు. సంసారం మనం తెచ్చి పెట్టుకున్నది. కృత్రిమమైనది; ప్రకృతి స్వతస్సిద్ధమైనది. సహజ సౌఖ్యదాయకమైనది. నిలువడానికి నేలనిస్తుంది. కట్టుకోవడానికి నారచీరలిస్తుంది. నివసించడానికి గుహలను చూపుతుంది. తిని, త్రాగి, జీవించడానికి ఫలాలను, జలాలనూ అందిస్తుంది.

మరి సంసారవలయం ఏం చేస్తుంది? దూదిపరుపులను, పసిడి పాత్రలను, జిలుగు వలువలను, తళుకు మేడలను ఎరచూపుతుంది. రెంటికీ ఎంత వ్యత్యాసముంది?

తాపసి-అంటే యోగి. ఈ వ్యత్యాసాన్ని అవగతం చేసుకుంటాడు. సంసారవలయంలో బుసకొట్టే సంపన్నుల కొలువు తనకెందుకని నిర్ణయంచుకుంటాడు. పుణ్యసతులు పెట్టే భిక్షానుభవంతోనే ధన్యతను గణించుకుంటాడు. యోగుల అంతఃకరణానికి ప్రతిబింబం ఈ పద్యం.

నిరాడంబరజీవితానికి పోతన్న ప్రతినిధి అని తెలుగునాట తరతరాలుగా ప్రచారంలో ఉన్న అభిప్రాయానికి ఈ పద్యం ఒకరకంగా అంతస్సాక్ష్యం కూడా.

- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి

తెలియజేయబడి ఉన్నది. ఈ శాసనంలో - "ఇప్పటికే హనుమయ్యన్ ఈ రెండు పద్దులకుగాను దేవాలయ శ్రీ భండారానికి 3750 నర్పణాలను చెల్లించి యుండి నందున", అని అనడంచేత ఈ రెండు ఉభయాల నిర్వహణకు 375 రేఖైపొన్‌లు ఆవశ్యకమవుతోందనీ, ఈ ధనానికి తుల్యంగా 3750 నర్పణాలను చెల్లించియుండినట్లునూ విశదమౌతోంది. అంటే, ఒక రేఖైపొన్ విలువ 10 నర్పణాలకు సమానమనే విషయమవగతమౌతోంది. చాలా శాసనాలలో లావాదేవీల ప్రసక్తి వచ్చినపుడు రేఖైపొన్‌లలో తెలుపుతుండడం వల్ల, సులభగ్రాహ్య మవడం కోసం వాటిని **పణం** నాణెముల విలువలోకి మార్చడానికి పై సమీకరణం వల్ల సాధ్యమౌతోంది.

**(2)** గోవిందరాజస్వామి దేవాలయం రెండవప్రాకారం మీద ఉన్న శాసనం సంఖ్య 415-జి.టి.లో తిరుమల ఆచార్య పురుషులలో ఒకరైన శ్రీనివాసయ్యంగారితో కుదుర్చుకున్న ఒప్పంద వివరాలు నమోదు చేయబడి ఉన్నాయి. క్రీ.శ.3-6-1547 సంవత్సరంలో వేయబడిన ఈ శాసనంలో దాతయైన సదాశివరాయలు తనకు 2000 చక్రంపొన్ (బంగారు నాణాలు) వార్షికాదాయాన్ని ఇచ్చే **పెరియ ఎక్కలూరు గ్రామాన్ని** బహూకరించిన విషయాన్ని తెలుపుతూ, అలంకరణ, దధ్యోదనం ఇత్యాది అనేక ఉభయాలతో కూడిన వివరాలను కలిగియున్న కొండవీటిచేంతాడంత పెద్దజాబితా ఇవ్వబడియున్నది. దేవాలయ శాసనాల

లో మిక్కిలి పెద్దదైన, పొడవైన శాసనాలలో ఇదొకటి. ఇందులో 3000 మామిడి పండ్ల వెల 1 రేఖై; ఒక పనసపండు వెల 5 పణాలు;300 కొబ్బరికాయల ధర 5 పణాలు; 3,700; తమల పాకుల ధర 7 పణాలు–ఇత్యాదిగా అనేక వస్తువుల వెలలు ఇవ్వటం జరిగింది. లభ్యమవుతున్న అన్నిరకాల ఫలాలు, పదార్థాల తయారీకి అవసరమైన పచారీ వస్తుసామగ్రి గురించి ఇవ్వబడింది. అన్ని వస్తువుల విలువ 2,000 చక్రపొన్‌నకు మించరాదు. ఆనుషంగికంగా **రేఖై పొన్**‌నకు **చక్రపొన్**‌నకు గల సమీకరణాన్ని స్థిరపరచవచ్చును. ఈ విధంగా విజయనగర రాజ్యమందు వ్యవహారంలో ఉన్నటువంటి ధనవ్యవస్థకు సంబంధించిన వివరాలు కండ్లకు కట్టినట్లు గుర్తించవచ్చును.

**3)** పై శాసనంలో అత్యంత అపురూపమైన తిరుమల శాసనాలలో ఒకటిగా గుర్తించతగ్గది. ఇందులో గ్రామ ఆదాయం ఇవ్వడం జరిగింది.ప్రసాదాల తయారీలో ఆవశ్యకమైన ప్రధాన ముడిసరకుగా వరి(బియ్యం) అవడం చేత దీని ఖరీదును లెక్క కట్టవచ్చు. ఒక గ్రామంలో పండించిన ధాన్యపు విలువను పణంలోనికి తద్వారా చక్రపణంలోనికి గణించి తెలుసుకోవచ్చును. ఈ గ్రామం జగదభిగుత్తిసీమలో ఉన్నదని తెలుపబడింది. ఉనికిని గుర్తించగలం, కనుక సదాశివరాయల కాలంలో ఒక గ్రామం నుండి లభించే ఫలసాయం, ఆధునిక కాలంలో లభించే ఫలసాయం తారతమ్యంగా పోల్చి, పరిశోధించి తెలుసుకోవచ్చు. ఇటువంటి పరిశీలన వలన విజయనగర కాలంనాటి జనసామాన్యంయొక్క సాంఘిక, ఆర్థిక జీవన పరిస్థితులను తెలుసుకోవడంలో పెద్దమెట్టు కాగలదు. వ్యవసాయదారునికి వచ్చే **కుడివరం** వంతును గణించి నిర్ణయించవచ్చు. అంతేకాదు, ఈ ప్రయత్నం కార్యరూపం దాల్చినట్లయితే విజయనగర కాలంలో గ్రామంలోని వారు ఎంతటి ధనవంతులో ఖచ్చితంగా లిఖితపూర్వకమైన వివరాలు మనకు లభ్యం కాగలవు.

### 13) దేవాలయంలో ప్రసాద పంపకం :

గత మే నెల సంచికలో దేవాలయకార్యనిర్వాహకులు ఇచ్చిన ఆధారద్రవ్యదానాలపట్టికను ఇవ్వడం జరిగింది. ఆ

## యాత్రికులకు సూచనలు

**1)** తిరుమలకు వచ్చే యాత్రికులు ఎలాంటి మత్తుపదార్థాలు, మద్యం, మాంసము, సిగరెట్లు వంటి చెడుపదార్థాలు తీసుకోకూడదు. ఇవి పూర్తిగా నిషేధం.

**2)** యాత్రికులు దర్శన టిక్కెట్లు మరియు వసతి సదుపాయాల్ని తి.తి.దే. నియమనిబంధనల ప్రకారమే తీసుకోవాలి. దళారీలను కానీ, మధ్యవర్తులను కానీ ఆశ్రయించకూడదు.

**3)** యాత్రికులు ఉద్యోగులకు ఎలాంటి బహుమతులు, పారితోషికాలు ఇవ్వకూడదు. ఇందువల్ల ఉద్యోగుల నైతిక విలువలకు భంగం కలుగుతుంది మరియు ఉద్యోగులు తమ ఉద్యోగాలను కోల్పోవుటకు సహకరించినవారౌతారు.

**4)** యాత్రికులు గది తీసుకున్న 24 గం॥ల లోపు ఖాళీ చేయాలి.

**5)** తిరుమలకు వచ్చే యాత్రికులు స్వామి దర్శనానికై సరియైన వస్త్రధారణ కలిగి ఉండాలి, ముఖ్యంగా సుప్రభాతం, తోమాల, కల్యాణోత్సవం మొదలైన ఆర్జిత సేవలకు సంప్రదాయ దుస్తులలో రావాలి. స్త్రీలు చీర మరియు సల్వార్ కమీజ్‌లలో పురుషులు ధోవతి, పైజామాలలో మాత్రమే రావాలి.

**6)** తిరుమలకు వచ్చే యాత్రికులు ముఖ్యంగా ఆర్జిత సేవలు, వి.ఐ.పి. దర్శనానికి వచ్చువారు తప్పనిసరిగా ఐ.డి. ప్రూఫ్ తీసుకురావాలి లేనిచో వారిని ఆయా సేవలకు అనుమతించరు.

**7)** భక్తులు తమ కానుకలను శ్రీవారి హుండీలోనే సమర్పించాలి.

**8)** స్వామివారి దర్శనానికి వచ్చే యాత్రికులు మొబైల్ ఫోన్లు, కెమెరాలు వంటి ఎలక్ట్రానిక్ పరికరాలను తీసుకొని ఆలయంలోకి రాకూడదు. వాటిని లగేజికౌంటర్లలోనే వదలి రావాలి.

**9)** యాత్రికులు మరిన్ని వివరాలకు, సలహాలకు, సూచనలకు, ఫిర్యాదులకు తి.తి.దే. విచారణ కార్యాలయంలో సంప్రదించగలరు.

**తి.తి.దే. కాల్ సెంటర్ : 0877- 2277777**

**టోల్ ఫ్రీ నెం. : 18004254141**

పట్టికను పరిశీలించినట్లయితే ఇంత పెద్దమొత్తంలో వారు 16వ శతాబ్దంలో ఈ విధంగా పెట్టుబడి పెట్టడానికి వలసిన ధనం ఏ విధంగా సమకూర్చగలిగారనే ప్రశ్న ఉత్పన్నమౌతోంది. దీనికి జవాబు – స్వామికి నైవేద్యం పెట్టిన తరువాత ఆ ప్రసాదాన్ని దేవాలయం (అధికారులు) ఏ విధంగా పంపకం చేస్తున్నదీ అనే విషయం మీదనూ, దేవాలయంలో యాత్రికునకు ఎంత విలువలో ఆ ప్రసాదం వితరణ జరుగుతోందనే వాటిపై ఆధారపడి ఉంటుంది.

దేవాలయంలో దైవానికి నివేదన జరిగిన తరువాత దైవప్రసాదాన్ని రెండు తరగతులవారికి పంచుతారు. ఇంతకు మునుపు చెప్పిన ఆలయ కార్యనిర్వహణలో పాల్గొన్న వ్యక్తులకు ముప్పాతికవంతు భాగాన్నీ, నాల్గవవంతుభాగం దాతకు ఇస్తారు. ఈ ప్రసాదాన్ని తన కోరికమేరకు దాత వినియోగించుకోవచ్చు. (దైవానికి నివేదన జరిగిన తరువాత ప్రసాదం నాల్గవ వంతు భాగం **విట్టవన్ విళుక్కడు** కింద వస్తుంది. ఈ పద్ధతి దక్షిణ భారతదేశంలో పరిపాటిగా వస్తున్న ఆచారం. కాని ఇది ఇటీవలి కాలంలో ఏర్పడిన నూతన మార్పుగా తోస్తోంది.) తిరుమలలో మొట్టమొదటిసారిగా 1354 సంవత్సరంలో శాసన సంఖ్య 102–టి.టి.లో కనిపిస్తుంది.

దైవానికి నివేదన చేసిన ఆహార పదార్థం కాబట్టే యాత్రికులలో ప్రసాదానికి మంచి డిమాండు ఏర్పడింది. క్రమేపీ ఇది ఒక వ్యాపార సరకుగా పరిణతి చెందింది. పదహైదవ, పదహారవ శతాబ్దాల కాలంలో ఆధార ద్రవ్య దానాలు సామ్రాజ్యపాలకుల ప్రాపును పొంది అధికమయ్యాయి. మత సంబంధిత కార్యకలాపాలు కూడ మిక్కిలి వైభవోపేతంగా జరగడంతో వీటి సందర్శనార్థం భక్తులుకూడ అధికసంఖ్యలో రాసాగారు. (ఆచార్యపురుషులు, మతప్రచారకులు వేంకటేశ్వరుని మాహాత్మ్యాన్ని ప్రజానీకంలో ప్రచారం చేయడానికి ఆలయం నియమించింది. వారు దక్షిణదేశంలో తిరిగి తిరుమల యాత్ర చేయమని ప్రోత్సహిస్తుంటారు.) దైవదర్శనార్థమై వచ్చుభక్తులు పుణ్యప్రదమైన ప్రసాదాన్ని తిని, మరికొంత భాగాన్ని తమ తోటివారిని తరింపజేయడానికి తమతో తీసుకు వెళ్ళేవారు. ఈ విధంగా యాత్రికులసంఖ్య రానురాను అధికమవుతూ వచ్చింది. అలాగే ప్రసాదం కోసం వేడుక కూడ పెరుగుతూ వచ్చింది.

పుణ్యప్రదమైన ఈ దైవప్రసాదం, ఒక వ్యాపార వస్తువుగా పరిగణించబడినట్లు తిరుమల దేవాలయ శాసనాలు స్పష్టంగా తెలుపుతున్నాయి. దేవాలయ కార్యనిర్వాహకుల నుండి, దాతల నుండి ప్రసాద భాగాలను సంపాదించి, వెలకు అమ్ముకొనే హక్కును పొందిన 11 మంది వ్యాపారస్తుల గురించి క్రీ.శ.1547వ సంవత్సరానికి చెందిన ఒక శాసనం తెలుపుతోంది. ఈ హక్కును వీరు కార్యనిర్వాహకులు మరియు దాతల నుండి కౌలుకు సంపాదించారు.

ప్రసాదాన్ని అమ్మకం చేసేవారిని ప్రసాదగుత్తదారులు (ప్రసాదకారర్) అనేవారు. (శాసనం సంఖ్య 409–జి.టి. ఆధారం). ఆలయ నిర్వాకులకు కొంతసొమ్మును ముట్టజెపుతూ, ఆ ప్రసాదాన్ని యాత్రికులకు అమ్ముకొనే హక్కును గుత్త వ్యాపారార్థం ప్రసాదకారర్ కొనుక్కొంటున్నాడు. కానీ ఇది న్యాయవిరుద్ధమైన కార్యంగా పరిగణించలేం. దాత తనవంతునకు వచ్చే నాల్గవవంతు ప్రసాదభాగాన్ని అమ్ముకొనడానికి గాని, మరొక వ్యక్తి అధీనం చేయడానికి గాని పూర్తి అధికారాన్ని పొందియున్నాడనే విషయం కొన్ని తిరుమల శాసనాల వలన తెలుస్తోంది. మరియు ధనికులైన ప్రసాదకారర్‌లు ఉండియున్నవైనం విశదమవడం వల్ల, ఆ కాలంలో ఈ పద్ధతి సర్వసమ్మతంగా ఉండేదని తెలుస్తోంది. (ఇందులకు ఆధారం– శాసన సంఖ్య 278–టి.టి., 270–టి.టి.,102–జి.టి.).

ఆధారద్రవ్య దానంగా ధనాన్ని దానం చేయడంలోగల ఒక ముఖ్యమైన ప్రమేయం, దైవప్రసాదానికి ఉన్న ఆర్థికమైన విలువ. ఈ ఆహారపదార్థాన్ని ధనవిలువలోకి మార్చుకోవడానికి వీలు అవడంవలన, ఆనాడు అంటే క్రీ.శ.1509–1568 ఈ మధ్య కాలంలో, ఆధారద్రవ్యదానరూపంలో దానం చేసిన ధనవిలువలో సుమారు $^1/_4$ భాగం ధనాన్ని ప్రసాదరూపాన తిరిగి దాతకు ఇచ్చేందుకు దేవాలయ కార్యనిర్వాకులు ఉత్సహించారు. దాతలు ఈ దైవప్రసాదాన్ని మహద్భాగ్యంగా గ్రహించారు. ***(ఇంకా ఉంది)***



# వరలక్ష్మి వ్రతం

- కె. మల్లికార్జున

స్త్రీలకు ప్రత్యేకించి వారి ఐదవ తనానికీ, ఐశ్వర్యానికీ, సంతానానికీ, సంబంధించిన వ్రతాల్లో వరలక్ష్మీవ్రతం ఒకటి. ఈ వ్రతం శ్రావణపూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం నాడు జరుపుకోవడం ఆచారం. వీలు లేకుంటే శ్రావణమాసంలోని మరే శుక్రవారం గానీ ఈ వ్రతాన్ని ఆచరించవచ్చు. ఈ వ్రతం యొక్క విశిష్టతను స్వయంగా పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పినట్లుగా, స్కాంద, భవిష్యోత్తర పురాణాలు చెబుతున్నాయి.

శ్రావణ శుక్రవారం నాడు స్త్రీలు ఉదయాన్నే లేచి, ఇల్లు శుభ్రం చేసుకొని, మంగళస్నానం చేసి, నూతన వస్త్రాలు కట్టుకొని పూజగదిలో గానీ, ఇంటిలో ప్రత్యేకమైన ప్రదేశంలో గానీ ఒక మండపం ఏర్పాటు చేసుకొని, దాని మధ్యలో ఒక కలశం నెలకొల్పి, లక్ష్మీదేవి ముఖాన్ని ఒక కొబ్బరికాయకు తీర్చిదిద్ది. దాన్ని కలశం మీద ఉంచుతారు. ముందు ముందు విఘ్నాలు రాకుండా, వినాయకుని ఆశీర్వాదం కోసం వినాయకుని పూజించాలి. శ్రీమహాదేవి, మహాసరస్వతీ స్వరూపిణియై ఉన్న మహాలక్ష్మి దేవిని ఈ క్రింది శ్లోకంతో పూజించి ధ్యానించాలి.

**లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం**
**శ్రీరంగధామేశ్వరీం**
**దాసీభూత సమస్త దేవవనితాం**
**లోకైక దీపాంకురామ్,**
**శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవ**
**బ్రహ్మేంద్ర గంగాధరాం**
**త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం**
**వందే ముకుంద ప్రియామ్.**

ఆ తర్వాత షోడశోపచారాలతో అమ్మవారిని పూజిస్తారు. తర్వాత పిండివంటలతో నైవేద్యం పెడతారు. పూజానంతరం తొమ్మిది ముడులతో తోరాన్ని తయారు చేసుకుని, పూజించి,

**బధ్నామి దక్షిణే హస్తే నవసూత్రం శుభప్రదమ్,**
**పుత్ర పౌత్రాభివృద్ధించ సౌభాగ్యం దేహి మే రమే.**

అనే శ్లోకాన్ని పఠిస్తూ తోరాన్ని కుడిచేతికి కట్టుకుంటారు. ఈ సందర్భంగా కుండిన నగరంలో ఉన్న 'చారుమతి' అనే సాధ్వీమతల్లి ఈ వ్రతాన్ని చేసిన సంగతి కథగా చెప్పుకొని కథ చదువుతున్నంత సేపు అక్షతలు చేతిలో ఉంచుకొని, కథ పూర్తి అయిన తర్వాత అక్షతలను శ్రీలక్ష్మీదేవి పై వేసి, కొన్ని అక్షతలను అమ్మవారి ప్రసాదంగా శిరస్సు మీద వేసుకుంటారు.

సాయంకాలం ఇంటికి ముత్తైదువులను ఆహ్వానించి, చాపవేసి, కూర్చోబెట్టి, కాళ్ళకు పసుపు రాసి, బొట్టుపెట్టి, వారికి పూలు, పళ్ళు, తాంబూలాలు వాళ్ళ చేతికి అక్షతలు ఇచ్చి, వారికాళ్ళకు నమస్కరించి, వారి ఆశీస్సులను పొందుతారు. మరునాడు ఉదయాన్నే స్నానమాచరించి పూజచేసి వ్రతాన్ని ముగించాలి. ఈ వ్రతాన్ని ఆచరించి పార్వతీదేవి షణ్ముఖుణ్ణి కన్నదని, విక్రమాదిత్యుడు రాజ్యాన్ని పొందినట్లు చెబుతారు.

ధనం, ధాన్యం, యశం, కీర్తి, జ్ఞానం, ఇళ్లు వాకిళ్లు కలిగి వర్ధిల్లాలంటే శ్రీ మహాలక్ష్మి అనుగ్రహం కావాలి. భూనభోంతరాళాల్లో ఆవరించి ఉన్న ఐశ్వర్య శక్తి ఆ తల్లి. సకల సంపదలకూ మూలమైన శక్తులు ఆ చల్లనితల్లి కనుసైగలు చేస్తే చాలు, అనుగ్రహించబడతాయి. ఆమే పరాశక్తి, పరమశక్తి సుఖభిక్షను ప్రసాదించే శాంతిప్రదాయని. ఆమె చంద్రసహోదరి. సర్వసంగ పరిత్యాగియై ఆదిశంకర భగవత్పాదులు, బ్రాహ్మణుని ఇంట భిక్షకు వెళ్లినప్పుడు, ఆ బ్రాహ్మణ గృహిణి ఇంట ఏదీలేక, ఇంటిలో ఉన్న ఉసిరికాయనే భిక్షగా వేసింది. భగవత్పాదులు మనస్సు చలించిపోయింది. వెంటనే వరమహాలక్ష్మిని ప్రార్థిస్తూ కనకధారాస్తోత్రం చదువగానే, ఆ ఇల్లు కనకరాశులతో నిండిపోయింది. ఆ బ్రాహ్మణుని దారిద్ర్యం తీరిపోయింది. మనం కూడా ఈ 'ఖర' వత్సరంలో ఎలాంటి దుర్ఘటనలు సంభవించకుండా చూడమని ఆ శ్రీమహాలక్ష్మీదేవిని వేడుకొందాం.

# తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలు

| క్ర.సంఖ్య | పుస్తకం | రచయిత | ధర |
|---|---|---|---|
| 1. | బ్రహ్మజిజ్ఞాస – సంపుటం–2 | మర్రిబోయన రామసుబ్బయ్య | 40.00 |
| 2. | బ్రహ్మజిజ్ఞాస – సంపుటం–4 | మర్రిబోయన రామసుబ్బయ్య | 45.00 |
| 3. | భక్తిసారము – సంపుటం–2 | తిరువాయిపాటి రాఘవయ్య | 25.00 |
| 4. | భాగవత సుధాలహరి – సంపుటం–3(1) | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 95.00 |
| 5. | భాగవత సుధాలహరి – సంపుటం–3(2) | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 90.00 |
| 6. | భాగవత సుధాలహరి – సంపుటం–3(3) | డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు | 85.00 |
| 7. | భాసుని భారత నాటకం | చిలకమర్తి లక్ష్మీనరసింహం | 25.00 |
| 8. | బాలకృష్ణనాటకము | తరిగొండ వెంగమాంబ | 15.00 |
| 9. | బాపు బొమ్మల రామాయణం | ముళ్ళపూడి వెంకటరమణ | 25.00 |
| 10. | బ్రహ్మ గాంధర్వము | ముదివర్తి కొండమాచార్యులు | 62.00 |
| 11. | భక్త కవయిత్రి తరిగొండ వెంగమాంబ (బుర్రకథ) | తరిగొండ వెంగమాంబ ప్రాజెక్టు వారి ప్రచురణ | 27.00 |
| 12. | ధర్మమంజరి | జటావల్లభుల పురుషోత్తం | 12.00 |
| 13. | ధర్మ దీపికలు | కాట్రపాటి సుబ్బారావు | 15.00 |
| 14. | దయావీరులు | చల్లా రాధాకృష్ణ శర్మ | 10.00 |
| 15. | ద్వాదశ సూరిచరిత్ర | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 30.00 |
| 16. | గీత గోవింద కావ్యము | డా॥ సి.మురళీకృష్ణారావు | 50.00 |
| 17. | గీతామృతము | డా॥ ఇ.పాండురంగారావు | 30.00 |
| 18. | యజ్ఞోపవీత తత్త్వ దర్శనం | అవ్వరి శ్రీరామమూర్తి శాస్త్రి | 10.00 |
| 19. | జలక్రీడా విలాసము | తరిగొండ వెంగమాంబ | 45.00 |
| 20. | కృష్ణవేణి తరంగాలు | కృష్ణాపుష్కరాల ప్రత్యేక సంచిక | 150.00 |
| 21. | కృష్ణయజుర్వేదం – సంపుటం–3 | తెలుగుసేత – రామవరపు కృష్ణమూర్తి శాస్త్రి | 75.00 |
| 22. | ముకుందమాల | ముదివర్తి కొండమాచార్యులు | 35.00 |
| 23. | కవితా శారద | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 5.00 |
| 24. | మహారాజా స్వాతి తిరునాళ్ | కె.టి.ఎల్.నరసింహాచార్యులు | 15.00 |
| 25. | మన సమస్యలకు భగవద్గీత పరిష్కారాలు | ఆచార్య ఎస్.బి.రఘునాథాచార్య | 7.00 |

# ఉత్తాండేశ్వరస్వామి ఆలయం,

## తిరుమంజసై (చెన్నై)

- పి.కృష్ణమూర్తి

చెన్నై - తిరుత్తణి జాతీయ రహదారిలో ఉన్న తిరు మంజసై క్షేత్రంలోని ప్రముఖ ఆలయాల్లో ఉత్తాండే శ్వర స్వామి ఆలయం అతి ప్రాచీనమైంది. ఈ క్షేత్రాన్ని అగస్త్యే శ్వరం అని కూడా వ్యవహరిస్తారు.

**స్థలపురాణం :** ఒకప్పుడు తంజావూరును రాజధానిగా, తొండై నాడు ప్రాంతాన్ని పాలించే చోళ ప్రభువు మూడో కుళోత్తుంగుడు ఈ ప్రాంతమందు తన పరివారంతో ప్రయాణిస్తూ ఓ ముళ్ళ పొదను దాటుతూ ఉండగా చక్రవర్తి ఆసీనుడై ఉన్న ఏనుగుకు ఆ ప్రాంతంలోని తీగలు కాళ్ళకు చుట్టుకున్నాయి. గజరాజుకు తన కాళ్ళను విడిపించుకోవడానికి వీలుపడలేదు. ఇది గమ నించిన రాజు కత్తితో తీగలను నరికి ఏనుగు కాలు బయటకు వచ్చేలా చేశాడు. అయితే రాజు కత్తి దూసినప్పుడు ఆ కత్తి రాయికి తగిలినట్లు శబ్దం వచ్చింది. రాజు ఆ ప్రదేశంలోని పొదలను, తీగలను పూర్తిగా తొలగించగా వాటి క్రింద ఒక శివలింగం పై భాగాన రాజు విసిరిన కత్తి తగిలిన ప్రదేశం నుండి ధారగా రక్తం ప్రవహిస్తూ ఉంది. కుళోత్తంగ చక్రవర్తి ఆశ్చర్యచకితుడైనాడు. తన ఇష్టదైవమైన స్వామివారి పట్ల తీరని అపరాదం చేశానని కృంగిపోయాడు. తను చేసిన తప్పును క్షమించమని స్వామిని వేడుకుంటూ ఆ ఘోర అపరాధానికి శిక్షగా తన కుడిచేతిని తెగనరుక్కున్నాడు. రాజు ప్రదర్శించిన ఈ త్యాగానికి స్వామి ముగ్ధుడై సతీసమేతంగా, రాజుకు ప్రత్యక్షమై అతడి భక్తికి, త్యాగానికి మెచ్చి, తన శిరస్సును కత్తితో గాయపరచుటలో అతడి తప్పుకానీ, ప్రమేయంగానీ లేదనీ, ఆ సంఘటన యాధృచ్ఛికంగా జరిగిందని తెలిపి రాజును ఆశీర్వ దించి, అతడి చేతిని యథాస్థానంలో ఉంచి పార్వతీ పరమేశ్వ రులు అదృశ్యమయ్యారు. అందుకే చక్రవర్తి ఇచ్చట వెలసిన సదాశివుని "కైతంత పెరుమాన్" అనగా చేతిని తిరిగి ప్రసాదిం చిన దేవుడు అని కీర్తించి, ఆ ప్రదేశంలో అపురూపమైన ఆలయం నిర్మించాడు.

**ఆలయ నిర్మాణం :** తిరుమంజసై పట్టణం నడిబొడ్డున ప్రధాన రహదారిని ఆనుకొని ఉన్న ఈ ఆలయం చుట్టూ ఎత్తైన ప్రహరీ ఉంది. ప్రహరీమూలల్లో ఆశీన నంది ప్రతిమలు ఉన్నాయి. ప్రహరీ దక్షిణ దిశలో 5 అంతస్తుల రాజగోపురం ఉంది. గోపుర నిర్మాణంలో, ప్రతి అంతస్తు ద్వారాలకు ఇరువైపులా ద్వార పాలకులు ఉన్నారు. గోపురం పైభాగాన కలశాలు ప్రతిష్ఠించారు. రాజగోపురం క్రింద అధిష్టానం వరకూ ఆలయ ప్రవేశద్వారం, ద్వారానికి ఇరువైపులా బలిష్ఠమైన తలుపులు ఏర్పాటు చేశారు. ప్రధానాలయం ప్రహరీ లోపల వైపు మధ్య భాగంలో నిర్మించారు. ప్రధానాలయం తూర్పు దిక్కు చూస్తూ ఉంది. రాజగోపురం దాటగానే ప్రధానాలయం దక్షిణదిశలో ఆలయ ప్రవేశానికి సన్నటి ద్వారం ఏర్పాటు చేశారు.

ఈ ద్వారం గుండా ఆలయప్రవేశం చేయగానే తూర్పు దిశగా ముఖాన్ని కలిగిన గర్భగృహం, అంతరాళం ముఖ మండపం, మహామండపాలున్నాయి. గర్భగృహం, అంతరాళం ఒకే నమూనాలో ఉన్నాయి. గర్భాలయంలో ఎత్తైన పానవట్టము పైన పరమశివుడు లింగ రూపం దాల్చి కొలువైయున్నాడు. ఈ స్వామే ఉత్తాండేశ్వర లేదా అగస్త్యేశ్వర పేరున పూజలందుకుంటు న్నాడు. స్వామి శిరస్సు చోళరాజు కత్తి వేటు పడి గాయమైన చోట గందలేపనంతో కప్పి ఉంచారు. స్వామికి గాయమైనందున శిరస్సునుండీ కాక లింగం మధ్యభాగం నుండే అభిషేకం చేస్తారు. స్వామి వెనుకభాగంలో లోహపు నాగరాజు, ప్రభావళి ఉన్నాయి. స్వామివారి ముంగిట ఉత్సవర్లు కొలువై ఉన్నారు. గర్భాలయం చుట్టూ రెండు వరసలు, గుండ్రటి రాతి స్తంభా లతో ఏర్పాటు చేసిన ప్రదక్షిణ ఉంది. ఈ ప్రదక్షణయందు

గర్భాలయం వెలుపలి గోడలయందు దక్షణ దిశలో వినాయక, దక్షిణామూర్తి పశ్చిమాన విష్ణు, ఉత్తరాన బ్రహ్మ, దేవీ ప్రతిమలు గూళ్ళయందు కొలువై ఉన్నాయి. ప్రదక్షిణం లోపల వెలుపలి గోడనానుకొని దక్షణదిశలో శైవనాయనార్లు, పశ్చిమాన శైవాచార్యులు వినాయక, వళ్ళి, దేవయాని సమేత సుబ్రహ్మణ్య స్వామి, ఉత్తరాన, కొంతమంది నాయనార్లు కొలువై ఉన్నారు.

గర్భాలయంపైభాగంలో అత్యంత ఆకర్షణీయంగా గజపృష్ఠ విమాన గోపురం నిర్మింపబడింది. ఈ గోపురం నాలుగువైపులా నాలుగు ఆశీన నందీశ్వరులు ఉన్నారు. విమానం పై భాగాన ఐదు కలశాలు ఉన్నాయి. గర్భాలయం ముంగిట ముఖమండపం వెలుపల, ఇరువైపులా ఇద్దరు ద్వార పాలకులు ఉన్నారు. ముఖమండపం మధ్యన స్వామిని చూస్తూ ఉన్నట్లు ఆశీన నందీశ్వరుడు కొలువై ఉన్నాడు. ముఖమండపం ఉత్తరదిశలో, ఒక అరలో నటరాజ పంచలోహ విగ్రహం ఉంది.

ముఖమండపం ముందు భాగాన విశాలమైన 40 స్తంభాల సాయంతో నిర్మించిన మహామండపం ఉంది. మండప స్తంభాలన్నీ చోళ (గుండ్రని) శైలిలో చెక్కబడిఉన్నాయి. ఈ మండపం లోపల భాగాన అనేక శిల్పాలు ప్రతిష్ఠించారు. మహామండపం వెలుపల తూర్పు దిక్కున చిన్న మండపం, అందులో స్వామిని చూస్తూ ఉన్నట్లు ప్రతిష్ఠించిన ఆశీన నందీశ్వరుడు, వెనుక వైపున ధ్వజస్తంభం, బలిపీఠం ఉన్నాయి.

మహామండపం ఉత్తర దిక్కున, దక్షణ ముఖాన్ని కలిగిన దేవి మందిరం కలదు. ఈ మందిరంలో గర్భగృహం, అంత రాళం, ముఖమండపాలతో పాటు, స్వామి, దేవి మందిరాలను కలిపి ఏర్పాటు చేసిన మహామండపం ఉన్నాయి. గర్భగృహ మందలి పార్వతీదేవి విగ్రహం దాదాపు 4 అడుగుల ఎత్తున ఉంది. తలపై కిరీటం, మెడలో హారాలు, రెండు చేతులకు కంకణాలు కలిగి దివ్యమనోహరంగా దర్శనమిస్తూ ఉంది. దేవి కుడి చేతిని అభయ, ఎడమ చేతిని వరద ముద్రలలో ఉంచి ఉంది. దేవి ముంగిట ఆమె ఉత్సవమూర్తులు, కొలువై ఉన్నారు. అంతరాళం ముంగిట దేవి వాహనం, సింహం ఆసీనముద్రలో కొలువై దేవిని కొలుస్తూ ఉండగా ముఖమండపం వెలుపల ద్వారానికి ఇరువైపులా ద్వార పాలకులు ఉన్నారు. దేవి గర్భా లయంపై ద్రవిడ విమానంపైన శిఖరం, కలశం ఉన్నాయి. దేవి విమానం చుట్టూ ఉన్న గూళ్లలో అనేక శిల్పాలు ఉన్నాయి.

ప్రధానాలయం వెలుపల, ఆలయ ప్రహరీకి ప్రధానా లయానికి మధ్యన ఉన్న ప్రదక్షిణలో ఉత్తర దిక్కున కుమార స్వామి మందిరం ఉంది. ఈ మందిర ముఖద్వారం కూడా తూర్పు దిశగా ఉంది. గర్భాలయం ముంగిటే స్వామి వాహనం మయూరం చిన్న వేదికపై ప్రతిష్ఠింపబడి ఉంది. కుమారస్వామి మండపానికి ప్రక్కనే వినాయక మందిరమున్నది. మండపం గర్భగృహమందు ఆసీన వినాయకుడు, కొలువైయున్నాడు. ప్రధానాలయం ఈశాన్య దిశలో శనీశ్వర మండపం కలదు. మండపంలోపల శనీశ్వరుడు నల్లటి శరీర కాంతితో నిలబడి ఉన్నాడు. ఆయనకు ముందు అతడి వాహనం వాయసం ప్రతిష్ఠింపబడి ఉంది. ప్రధానాలయం దక్షిణదిశలో రాజగోపు రానికి సమీపంలో నవగ్రహమండపముంది.

ఆలయం వెలుపల, రాజగోపురానికి తూర్పున ఆలయ కోనేరు నిర్మింపబడింది. స్వామి, అమ్మవార్ల అభిషేకానికి, ఈ పుష్కరిణి నీటినే వాడుతారు. ఉత్సవాలన్నీ ఈ కోనేటిలోనే రంగరంగ వైభవంగా జరుగుతాయి. ఆలయం మొత్తం గోడల పైన అనేక తమిళ, తెలుగు శాసనాలు కనిపిస్తాయి. ఇవి చోళుల కాలం నుండి విజయనగర రాజుల కాలం వరకు ఆయా రాజవంశీకులు (రాజులు) ఆలయ అభివృద్ధికి, చేసిన సేవలు, సమర్పించిన దానధర్మాలు, ఏర్పాటు చేసిన ఉత్సవాలు, ఆలయప్రశస్తి మొదలగు అంశాలను తెలియజేస్తూ ఉన్నాయి.

ఉత్తాండేశ్వర స్వామి ఆలయంలో ఏటా ఫిబ్రవరి, మార్చి మాసాలలో 10 రోజుల పాటు ఉత్సవాలు వైభవంగా జరుపుతారు. స్వామి, అమ్మవారు వివిధ వాహనాల్లో పగలు, రాత్రి ఊరేగుతారు. ఈ పుణ్యదినాల్లో ఆలయప్రహరీ, రాజగోపురం, దేవీ, దేవేరుల ఆలయాలు, ముఖ్యంగా పుష్కరిణిని రంగు, రంగుల దీపాలతో అలంకరిస్తారు. స్త్రీలు ఈ పుష్కరిణిలో వేల సంఖ్యలో నేతి దీపాలు స్వామికి సమర్పించి, తమ కోర్కెలు విన్నవించుకుంటారు.

# సువర్ణవృష్టి

**- అప్పాజీ వేంకట సుబ్రహ్మణ్యం**

శ్రీ వేంకటాచల యాత్రకు వెళ్ళి భగవంతుని దర్శించి, ఆయన గుణాలను వర్ణించి, శ్రీవారి స్తోత్రాలను చేస్తే స్వామి తన భక్తుల యందు ప్రీతి గలవాడై సర్వాభీష్టాలను నెరవేర్చుతాడు. తిరుమల యాత్ర వేడుక కోసం చేసేదిగాదు. భగవంతునిపై భక్తిలేని వారికి ఆయన అనుగ్రహం కలుగదు. నిరంతరం శ్రీ వేంకటాచలపతినే భక్తితో ఆరాధిస్తూ సర్వస్వమాయనే అని భావించి నమ్మి సేవించి పునీతుడైన దేవశర్మ వృత్తాంతమిందుకుదాహరణ.

దేవశర్మ శ్రీమహావిష్ణువుపై భక్తిగల వైష్ణవ బ్రాహ్మణుడు. అతడు లేనివాడైనా బాధపడకుండా భగవత్ చింతనతోనే కాలం గడుపుతూ ఉండేవాడు. అతని భార్య ఉత్తమ ఇల్లాలు. పలువురు పిల్లలున్న వారి కుటుంబపోషణ ఆమెను కలత పరచగా తమ దారిద్ర్య పరిస్థితిని భర్తకు తెలియజెప్పింది. పిల్లలు ఆకలి బాధకు ఓర్చుకోలేక కటకటబడుతున్నారని, ఈ సంసార సాగరం నుండి దరిజేర్చడానికి తమ కులదైవమైన శ్రీనివాసుని దర్శించి తమను కష్టాల కడలి నుండి దరి జేర్చ ప్రార్థింపుమని భర్తను ప్రాధేయపడింది. భార్య మాటలు దేవశర్మను మిక్కిలి కలవర పరచినా, తన తపస్సుకు విఘాతము కలుగుతుందనే భావంతో అన్ని విషయాల్ని సర్వేశ్వరునికే వదలి మిన్నకున్నాడు.

అంతలో ఒకనాడు దేవశర్మ గురువైన వాయుదేవుడు దేవశర్మ సంసారం గురించి విచారించాలని అతని నివాసానికి వచ్చాడు. ఆయనకు దేవశర్మ కుటుంబసభ్యులంతా మిక్కిలి వినయవిధేయతలతో నిలబడి నమస్కరించారు. వాయుభగవానుడు ప్రసన్నుడై దైవశర్మనుద్దేశించి ఈ విధంగా హితవు పలికాడు. "దేవశర్మా! నిన్ను ఈ దారిద్ర్యం నుండి దరిజేర్చు దైవం శ్రీవేంకటాద్రి నిలయుడైన శ్రీనివాస ప్రభువే. ఆయన దర్శనం నీకు ఐహిక ఆముష్మికాలను సిద్ధింపజేస్తుంది. నీవెంతటి యోగ జ్ఞాన సంపన్నుడవైనా వేంకటాచల పతిని దర్శించక కృత కృత్యుడవు కాలేవు. ఆయన దయాసాగరుడు. ముక్కోటి దేవతలకు వరప్రదాత. తిరుమల యాత్ర వల్ల తప్పక ఆయన కరుణాకటాక్షాలు నీకు లభిస్తాయి." గురుదేవుని ఆజ్ఞకు బద్ధుడై దేవశర్మ తిరుమల నాయకుని దర్శింప బయలు దేరాడు.




శ్రీ వేంకటగిరినాథుడు సామాన్యమైన దైవము కాదు. ఆయన నామస్మరణ, సర్వానంద సర్వార్థసిద్ధిదాయకం. ఆనంద నిలయుణ్ణి దివ్య విమాన మధ్యమున దేవశర్మ దర్శించాడు. భక్తి పారవశ్యంతో ఆ దేవదేవుని స్తోత్రం చేయసాగాడు.

"శ్రీ వేంకటేశ్వరా! నీవు పురుషోత్తముడవు. మహాత్ముడవు. మహానుభావుడవు. నీకు శతకోటి నమస్కారాలు. నాకు నీవే సర్వస్వం. నీ దర్శనం వల్లే నాకు సర్వసంసార తాపత్రయ బంధవిముక్తి కలగాలి. దీన శరణ్యా! కరుణించి కాపాడు"మని వేడుకొన్న దేవశర్మయందు తిరుమలేశుడు దయార్ద్ర హృదయుడై మేఘ గంభీర వాక్కులతో ఇలా వరప్రదానం చేశాడు.

"ఓ ద్విజోత్తమా! నన్నుపాసించి చేసిన పుణ్యవిశేషాలు మిక్కిలి ప్రశస్తములు. నీవు చేసిన స్తోత్రాలన్నీ మహిమాన్వితాలు. అవే నీకు ఇహపరభయహరములైనవి. నా ఆత్మయగు వాయుదేవునకు నీవు శిష్యుడవడం నీ అదృష్టం.

నా భక్తుడవైన నీ ఇంట ప్రతి దినం స్వర్ణవృష్టి కురుస్తుంది. నీ సంసార బాధలన్నీ తీరిపోతాయి. నీవు పదివేల సంవత్సరాలు సుఖించి, నీ వంశపారంపర్యంగా నీ బిడ్డలు, పాపలు సమస్త భోగభాగ్యాలను అనుభవింతురుగాక. ఇట్లు నూరు తరాలు సుఖమునిడి తర్వాత నా పరమపదాన్ని పొందగలవు" అని వరమిచ్చి అంతర్ధానమయ్యాడు. దేవశర్మ ఇంటిలో నిత్యం సంభవించిన సువర్ణవృష్టిని భగవత్ ప్రసాదంగా భావించి దాన్ని శ్రీవారి నిత్యసందర్శన భాగ్యంగా తలస్తూ పునీతుడయ్యాడు. దేవశర్మ సువర్ణవృష్టి వృత్తాంతం భక్తులందరికీ ఆదర్శవంతమై శ్రీవారి కరుణాకటాక్ష వీక్షణాలను పొంది సుఖింతురుగాక.

గ్రంథసమీక్ష

## గోమహాలక్ష్మి

**(రచన :** డా॥ పగడాల నారాయణ; **పుటలు:** 264 పేజీలు; **వెల :** 100/–; **సైజు :** 1/8 డెమ్మీ; **ప్రాప్తిస్థానం :** పి.సంధ్య, ఇ.నెం.18–4–150, రైల్వేకాలనీ ఎక్స్‌టెన్షన్, తిరుపతి)

భారత జాతీయ సంస్కృతిలో గోవునకు విశిష్ట స్థానమున్నది. ఋషులు యజ్ఞకర్మలలో గోవును ప్రత్యేకముగా పూజించేవారు. రాజులు మొదలు సామాన్యులదాకా తమ ఇండ్లలో తొలుత గోపూజ కావించేవారు. దానికి కారణం మన జాతికి భోజన తృప్తికి పాలు, పెరుగు, మజ్జిగ, నెయ్యి ఇత్యాదులు చాల ముఖ్యం. "వినా గోరసం కోరసో భోజనానాం" అను ఆర్యోక్తిని మనం నెమరు వేసుకోవలసియున్నది. గోవును తల్లిగా ఆరాధించింది. అటువంటి మాతృ భావంతోనే 'గావో విశ్వస్యమాతరః' ఇత్యాది వాక్యాలు ఏర్పడ్డాయి. యజ్ఞయాగాదులకు ప్రాముఖ్యతను కల్గించిన ఆర్యులు అర్ఘ్యప్రదానానికి పనికి వచ్చే గోవులను గొప్పగా భావించడంలో తప్పేమున్నది? అందుచేత నేటికీ గోపూజ సంప్రదాయం హిందువులలో నిలచి ఉన్నదంటే అందుకు ముఖ్యకారణం వేద – శాస్త్ర – ఇతిహాసాది వాఙ్మయంలో గోవుల ప్రశంస అధికంగా ఉండటమేనని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఈ గ్రంథమునందు వేదములలో ఉపనిషత్తులలో వర్ణితమైన గోమాహాత్మ్యమును రచయిత సమీచీనముగా వివరించియున్నారు. గోగణములవల్ల పొందు సామాజిక జీవన లాభములనూ వివరించియున్నారు. ఆరోగ్య సంబంధమగు పంచగవ్యప్రశస్తి మన నిత్యజీవనమునగల ప్రాముఖ్యమును వివరించియున్నారు. వేదాల్లో గోతత్త్వ విశేషాలను అందరికీ అర్థమయ్యే రీతిని రచయిత వివరించారు. స్కందపురాణాదుల నుండి ఇతిహాసమగు భారతాదులయందు వివృత్తమై గోమాహాత్మ్యమును పాఠకులకు ప్రబోదాత్మకముగా కావించిన రచన ఈ 'గోలక్ష్మి'గాథ. రచయితకు గల సంస్కృతాంధ్ర గ్రంథపరిశీలన చదువరులకు గోమాహాత్మ్యమునే కాక మన దేశీయాచారములయందలి వైశిష్ట్యమును తెల్పుతున్న ఈ 'గోమహాలక్ష్మి' ఒక చక్కని పరిశోధన.

**– డా॥ ఎ.సంధ్య.**

## హరివిల్లు

**(రచయిత :** చిలకమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి; **పుటలు :** 86; **వెల :** రూ.60/–; **సైజు :** 1/8 డెమ్మీ; **ప్రాప్తిస్థానం :** చిలకమర్తి రాజ్యలక్ష్మి, ఆంధ్రాబ్యాంకు వీధి, అప్సర బిల్డింగ్, నర్సాపురం – 534 275, పశ్చిమగోదావరి జిల్లా.)

ఇది ఒక చక్కని పద్యకావ్యం. వివిధ సమకాలీన సామాజికాంశాలను తీసుకుని ఇతివృత్తంగా మలచి అతి సుందరంగా పద్యాలల్లాడీ కవి. వృత్తిరీత్యా తెలుగు పండితుడు కావడంవల్ల ఇతనికి భాషపై గట్టిపట్టుందనిపిస్తుంది. వేంకటేశ్వరా, నవచంపకం, మతం–మనో గతం, అందాల చందమామ, మానవుడు–మాయ, కలికాలం వంటి శీర్షికలతో హరివిల్లులో రంగులు వెదజల్లారు.

ఇవన్నీ చక్కని పద్య ఖండికలు. వీటిలో భక్తి, రక్తి, సామాజికాసక్తి ముప్పేటగా కనిపిస్తున్నాయి. ఇందులోని ప్రతి పద్యం అది కందమైనా, గీతమైనా, సీసమైనా గజ్జలగుర్రంలాగా నడిచింది. అదే ఈ కవికున్న గొప్ప కవితాశిల్పం.

వీరిది శుభ్రమైన తెలుగు పద్యసోయగం. వృత్తాల నడకలో, ప్రాసవెయ్యడంలో వీరి శబ్ద సంవిధానం ఆధునికుల్ని కూడా ఆకట్టుకుంటుంది. రూపం పాతదే ఐనా వస్తువు సమకాలీనం కావడం వల్ల ఈ ఖండకావ్యం సార్వజనీనమౌతుంది. ఈ కవిలో సమయస్ఫూర్తి, హాస్యస్ఫూర్తియున్న శతకలక్షణకవి దాగున్నాడు.

ఇటువంటి సంపుటాలను పిల్లలచేత చదివించాలి. సమకాలీన భావాలతో పద్యం రాయటం, తేటయైన పదాలతో ప్రజాశైలికి ప్రాధాన్యమివ్వడం, పతనమౌతున్న విలువల పట్ల అసహనంతో, ఆవేదనను పలికించడం, పద్యాన్ని కూడా సామాజిక ప్రయోజనవంతంగా తీర్చిదిద్దిన రచయిత చాలా అభినందనీయుడు. ఈ కవితాఖండిక ప్రతి ఒక్కరూ చదువదగినది. చదివినవారిలో సామాజిక స్పృహ పెరుగుతుందనుటలో సందేహమక్కర్లేదు.

**– ఎ. విశ్వనాథం.**

# వార్తాలహరి

### తిరుచానూరులో నూతన ధ్వజస్తంభం

**శ్రీ** పద్మావతీ అమ్మవారి ఆలయం ఎదురుగా ఉన్న 150 సంవత్సరాల ధ్వజస్తంభం మరమ్మతులకు గురైనందున దాని స్థానంలో నూతన ధ్వజస్తంభాన్ని ఏర్పాటుచేశారు. ఈ ప్రతిష్ఠాపనకు జూన్ 21న అంకురార్పణ, 24న సంప్రోక్షణ చేసి ధ్వజస్తంభ ప్రతిష్ఠాపన కార్యక్రమాన్ని నిర్వహించారు. సుమారుగా 35 అడుగుల టేకు కొయ్యను తి.తి.దే. అటవీశాఖ సమకూర్చింది. వేప నూనె మొదలైన వాటిని కొయ్యకు అద్దారు. చీమలు, తదితర చీడలు పట్టకుండా సాంకేతిక చర్యలు చేశారు. ధ్వజస్తంభంపై తాపడం రేకులకు 13 కిలోల బంగారాన్ని ఉపయోగించారు.

### వైభవంగా జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు

**తి**రుమల తిరుపతి దేవస్థానం ప్రతి సంవత్సరం తిరుమలలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు అత్యంత వైభవంగా నిర్వహిస్తోంది. ఈ సంవత్సరం కూడా జూన్ 13 నుండి 15వ తేది వరకు జ్యేష్ఠాభిషేక మహోత్సవాలు జరిగాయి.

ఇందులో భాగంగా మొదటిరోజు వజ్రకవచధారియై శ్రీ మలయప్ప స్వామి ఉభయదేవేరులతో తిరుమల పురవీథుల్లో విహరించారు. అలాగే, రెండవ రోజు ముత్తంగి కవచం, మూడో రోజు సువర్ణకవచధారియైన శ్రీవారు, శ్రీ భూదేవులతో తిరువీథులలో ఊరేగుతూ భక్తులను అనుగ్రహించారు.

ఈ మహోత్సవాల్లో ప్రతి రోజు వేదపండితులు శ్రీసూక్తం, భూసూక్తం, పురుషసూక్తం వంటి పంచసూక్తాలను



పఠిస్తూ పాలు, పెరుగు, తేనె మొదలైన ద్రవ్యాలతో ఉత్సవ మూర్తులను అభిషేకించారు. ఈ ఉత్సవాలలో భక్తులు విశేష సంఖ్యలో పాల్గొన్నారు.

### కనులవిందుగా శ్రీ గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవాలు

**జూ**న్ 5 నుండి 14 వరకు తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవాలు కనువిందుగా ప్రతి సంవత్సరం లాగే ఈ సంవత్సరం కూడా జరిగాయి.

ఇందులో భాగంగా జూన్ 5వ తేది ఆదివారం సుగంధ పరిమళాలతో ఆలయ ప్రాంగణాన్ని శుద్ధి చేసి తిరుమంజనం నిర్వహించి తర్వాత అంకురార్పణ చేశారు. 6వ తేదీన ఉదయం వేదపండితుల వేదఘోష మధ్య ధ్వజారోహణం జరిగింది. అదే రోజు సాయంత్రం పెద్దశేషవాహనంతో వాహన సేవలు ప్రారంభమయ్యాయి. 10వ తేదీన గోవిందరాజస్వామివారు గరుడ వాహనంపై శోభాయమానంగా గుడి మాడవీథుల్లో విహరించారు. 13న జరిగిన రథోత్సవంలో విశేషసంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. గోవిందనామాల మధ్య రథాన్నిలాగారు. 14న చక్రస్నానంతో బ్రహ్మోత్సవాలు ముగిశాయి. ఈ సందర్భంగా ఆలయప్రాంగణం విద్యుద్దీపాలతో పుష్పాలంకరణతో శోభాయమానంగా వెలుగుతూ భక్తులను ఆకర్షించింది.

### కొత్తగా... వేద పాఠశాలలు

**తి**రుమల తిరుపతి దేవస్థానం వేద అధ్యయనానికి పెద్ద పీట వేస్తోంది. ప్రస్తుతం తిరుమలలోని ధర్మగిరి, రంగారెడ్డి జిల్లాలోని కీసరగుట్ట పాఠశాలలకు తోడు కొత్తగా అయిదు చోట పాఠశాలలను నెలకొల్పింది. ఈ విద్యాసంవత్సరం నుంచే విద్యార్థులను చేర్చుకోవడానికి ప్రకటనను జారీ చేసింది. పశ్చిమ గోదావరి జిల్లా ఐ.భీమవరం, అనంతపురం జిల్లా తాడిపత్రి, కరీంనగర్ జిల్లా మంథని, హైదరాబాదు సమీపంలోని చిలుకూరు, విజయనగరాలలో కొత్తగా ఈ పాఠశాలలను తి.తి.దే. ఏర్పాటు చేసింది. ఈ విద్యా సంవత్సరం నుంచే తరగతులు నిర్వహించేందుకు చర్యలు చేపట్టింది. ఒక్కో చోట కొన్ని ప్రాధాన్యత అంశాలను నిర్దేశించుకుంది. ఇలా చేయడం ద్వారా ఎవరికి ఏ అంశాలను నేర్చుకోవాలనుకుంటారో, వారు ఆ యా పాఠశాలకు వెళ్ళి నేర్చుకోవాల్సి ఉంటుంది.

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
   (విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి మరియు పిన్‌కోడ్ తప్పక వ్రాయండి)
   
   (పిన్‌కోడ్ తప్పని సరి)

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
   (అ) చందా నెంబరు :
   (ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
   డి.డి.నెం. : తేది :
   (చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి !

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో కొందరు వ్యక్తులు అనధికారికంగా **సప్తగిరి మాసపత్రికకు** చందాల రూపంలో అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని, తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తామని, నమ్మిస్తున్నారని తెలిసింది. అలాంటి వారి మాటలకు మోసపోకండి. సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి మరియు ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు. చందా మీరు నేరుగా "ప్రధాన సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దేవస్థానం, తిరుపతి" వారికి పంపించాలి. (లేదా) తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల వసతి సముదాయంలో కూడా చందా కట్టవచ్చు. సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు దేవస్థానం బయటి వ్యక్తులను ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
0877 - 2264359
0877 - 2264543

- సప్తగిరి సంవత్సర చందా రూ.60/-, జీవిత చందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.
- సప్తగిరి చందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమ చందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపవచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**
- మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరములు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపవలయును.
- మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.



ఇతనికంటే మరి దైవముఁ గానము యెక్కడ వెదకిన నితఁడే

అతిశయమగు మహిమలతో వెలసెను అన్నిటి కాధారము దానె

మది జలధుల నొకదైవము వెదకిన మత్స్యావతారం బితఁడు

అదివో పాతాళమందు వెదకితే నాదికూర్మ మీవిష్ణుఁడు

పొదిగొని యడవుల వెదకి చూచితే భూవరాహ మని కంటిమి

చెదఱక కొండల గుహల వెదకితే శ్రీ నరసింహం బున్నాఁడు

తెలిసి భూనభోంతరమున వెదకిన త్రివిక్రమాకృతి నిలిచినది

బలువీరులలో వెదకి చూచితే పరశురాముఁ డొకఁ డైనాఁడు

తలఁపున శివుఁడునుఁ బార్వతి వెదకిన తారక బ్రహ్మము రాఘవుఁడు

కెలఁకుల నావులమందల వెదకిన కృష్ణుఁడు రాముఁడు నైనారు

పొంచి యసురకాంతలలో వెదకిన బుద్ధావతారం బైనాఁడు

మించినకాలము కడపట వెదకిన మీఁదటి కల్క్యవతారము

అంచెల జీవులలోపల వెదకిన నంతర్యామై మెరసెను

యెంచుక ఇహమునఁ బరమున వెదకిన యీతఁడే శ్రీవేంకటవిభుఁడు

(3-370)



**ఈ** సంకీర్తనలో అన్నమయ్య ఆదిమధ్యాంతరహితుడైన

శ్రీ మహావిష్ణువు యొక్క దశావతారాల్ని హృద్యంగా అభివర్ణించాడు.

**అక్టోబరు నెల ముఖ్య పండుగలు**

**03 - సరస్వతీపూజ**
**04 - దుర్గాష్టమి**
**05 - మహానవమి**
**06 - విజయదశమి**
**25 - నరకచతుర్దశి**
**26 - దీపావళి**
**30 - నాగులచవితి**

## ధన్యవాదాలు

జూలై నెల సప్తగిరిపత్రిక ముఖచిత్రం శ్రీ మలయప్ప స్వామి, చివరిపుటలో ఉన్న శ్రీ పద్మావతీఅమ్మవారి ఛాయా చిత్రాలు మాకు చూచుటకు కనులవిందుగా ఉన్నాయి. జి.అమృత గారి "తులసి మహిమ", డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారి "శ్రీకృష్ణ దేవ రాయలవారి నాణెములు", ఎ.సూర్యకుమారి "రామా యణంలో స్త్రీపాత్రలు" మాకు ఎంతో బాగా నచ్చాయి. అలాగే మధ్యపుటలోని శ్రీదర్శనర్-తిరుముగుర్ ఛాయా చిత్రం, శ్రీసుదర్శనఅష్టోత్తరము ఎంతగానో నచ్చాయి. సప్తగిరి ప్రతిమాసం అత్యంతమనోహరంగా తీర్చిదిద్దు తున్నందుకు మీకు మా గ్రామప్రజల తరపున నేను అభి వందనాలు తెలియజేస్తున్నాను.

**- పూల మనోహర్, కామినాయన పల్లె, చిత్తూరు జిల్లా.**

# మీ మాట

## కనీస ధర్మం

శ్రీవారి భక్తులకు ఆహ్లాదాన్ని కలిగించి, భక్తిని పెంచే 'సప్తగిరి' పత్రిక, ఎంతో హృద్యమంగా ఉంటూంది. శ్రీమన్నా రాయణుడు అయిన శ్రీవేంకటేశ్వరస్వామివారి వైభవాన్ని తెలిపి, ఆళ్వార్లు, ఆచార్యుల భక్తి, ప్రపత్తులను తెలిపే విషయాలను ఎక్కువగా అందించండి. శ్రీ వేంకటేశ్వర స్వామిని ఈ లోకానికి వైభవంగా అందించి కృషి చేసిన, భగవద్రామానుజుల వైభవాన్ని మరువకుండా, ప్రతి సంచికలో కొంత విషయాన్ని అందించ ప్రార్థన. కనీసం ఒక స్త్రోత్రమైనా, గేయమైనా, కథ (లీల) అయినా, చిత్ర మైనా మన అభిమాన పత్రికలో కనిపించేటట్లు చూడండి. ఆలోచించండి. ఆ ఆచార్యులనుకూడా కొలుచుట ధర్మం.

**- ఎస్.జగన్నాథరావు, ఫరీద్ పేట, శ్రీకాకుళం.**

## గమనిక!

ఈ నెల శ్రీవారిబ్రహోత్సవాల సంచికగా సప్తగిరి పత్రికను పాఠకులకు అందిస్తున్నాం గనుక ఈ నెలలో శ్రీవారివ్యాసాలను పత్రికలో ఎక్కువగా ముద్రించడం జరిగింది.

దీంతో స్థలాభావంవల్ల 'వేదం తెలుసుకుందాం' ధారావాహిక, శ్రీపదకేళిశీర్షిక ఈ నెల ప్రచురించ లేక పోతున్నాం. పాఠకులు గమనించగలరు.

**- ప్రధాన సంపాదకుడు.**

## చక్రస్నానం

**శ్రీవారి బ్రహ్మోత్సవాలలో చివరిదైన చక్రస్నానం, యజ్ఞాం తంలో ఆచరింపబడే అవభృథస్నానం. తొమ్మిది రోజులు ఒక యజ్ఞంగా బ్రహ్మోత్సవాలు నిర్వహింపబడతాయి. లక్షలాది జనం పాల్గొనే నవాహ్నిక యజ్ఞమిది. చక్రస్నాన సమయంలో అర్చకులు, అధికారులు, భక్తులు, అందరూ పుష్కరిణిలో స్నానం ఆచరిస్తారు. యజ్ఞ ఫల స్వీకారానికి అధికారులవుతారు. దీనికి సంబంధించిన చిత్రాన్ని పాఠకులు ఈ పత్రిక చివరిపుటలో చూడవచ్చు.**

ధర్మవరం,
19-07-11.

శ్రీమాన్ సప్తగిరి ప్రధాన సంపాదకుల గారికి నమస్కరిస్తూ వ్రాయునది ఏమనగా?

జూలై నెల సప్తగిరి మమ్మెంతగానో ఆకట్టుకుంది. ముఖ్యంగా ప్రతి నెలా ప్రచురితమయ్యే "బాల వాకిట", "గృహ లక్ష్మి", "వేదం-తెలుసుకుందాం" "శ్రీ వేంకటేశ్వర లీలలు" చాలా బాగున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే! ఆదిమధ్యాంతం అనే భేదం లేకుండా సప్తగిరి ఆపాదమస్తకాంతం వైభోగమే. ప్రతి అక్షరం లోనూ శ్రీ వారి సాక్షాత్కారం కలుగుతోంది మరి ఎంతోమందికి నచ్చిన మన సప్తగిరి ఇకముందు కూడా హైందవ సుసంస్కృతికి కృషి చేస్తుందని ఆశిస్తూ....

ఇట్లు
మామిళ్ళ. పవన్ కుమార్
ధర్మవరం,
అనంతపురం జిల్లా.

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి.

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 42 సెప్టెంబరు, 2011 సంచిక : 04



అందరికీ దిక్కు
ఆశ్రితకల్పవత్సలుడే!

ప్రత్యేక వ్యాసాలు



ధారావాహికలు



గృహలక్ష్మి



బాలవాక్కు



అక్షరామృతం



శ్రీ వేంకటేశ్వర లీలలు



మన దేవాలయాలు



బాలప్రబోధం



గౌరవ సంపాదకుడు
ఎల్.వి. సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు
డా॥ సి. శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె. రాధారమణ

ఉప-సంపాదకుడు
డా॥ కె. రవిచంద్రన్

ముద్రాపకుడు : ఎం.కార్తీక్, ఎం.ఏ.,ఎల్.పి.టి.,
మేనేజరు, ముద్రణాలయం, తి.తి.దే.

డి.టి.పి.: ప్రధాన సంపాదకుల వారి
కార్యాలయం, తి.తి.దే., తిరుపతి

వర్ణచిత్రాల లే-అవుట్ : పి. శివప్రసాద్

ముఖ చిత్రం :
**ఉభయదేవేరులతో శ్రీవారు**

చివరి పుట :
**శ్రీవారి చక్రస్నానం**



*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 083.
ఫోను : 0877-2264543
0877-2264359

విడి ప్రతి -- రూ. 5-00
సం॥ చందా -- రూ. 60-00
జీవిత చందా -- రూ.500-00

విదేశాలకు
సం॥ చందా -- రూ. 850-00

సంపాదకీయం

# పరిశుభ్రత ప్రధానం

పారేఏరూ, అరమాగిన పండు, పచ్చనిఆకు, విరిసినమొగ్గలను చూస్తే మనిషి కరిగిపోతాడు. ఏదో తెలీని దగ్గరి సంబంధం ఉన్నట్లు, ఆ అనుబంధం తనను పిలుస్తున్నట్లు అనుభూతి పొందుతాడు. అంతవరకూ కత్తులు దూసే మనిషిమనస్సుకూడా కావరాన్ని మరచి హాయిని పొందుతుంది. కారణం ఆ వస్తువులన్నీ ఆర్ద్రమైనవి. స్వచ్ఛమైనవి, స్వార్థరహితమైనవి, పరహితార్థమైనవీ కావటం. అందుకే కాస్త వీలుదొరికితే చాలు మనిషి తన మలిన వాతావరణం నుంచీ బయటపడి ఒకనాడు తనదైన ప్రకృతితో కాస్త సమయం గడిపేందుకు పరుగెత్తుతుంటాడు. మనిషిలో ఈ మరుగుతున్న మథన గమనించిన మనీషులు, ప్రశాంతతతో పాటు పవిత్రత కూడా కల్గించేందుకు కీకారణ్యాలలోనో, కొండకొమ్మునో, కోనేరు లేదా జలజల పారే ఏరుల దరులలోనో ఆరాధనాలయాలు ఏర్పాటు చేసి మనిషికి మనలోకంలోనూ, ఇతర లోకాల్లోనూ మంచి గలిగే మార్గం చూపించారు.

పరిశుభ్రత వాతావరణస్వచ్ఛతకు మూలం. ఈ పరిశ్రుభత అనేది ముందు వ్యక్తినుండీ, కుటుంబం నుండీ, పట్టణంనుండీ నగరాలవరకూ క్రమక్రమంగా ఎవరికివారు శ్రద్ధ తీసుకోవాల్సిన విషయం. అందుకే 'వస్త్రేణ వపుషా వాచా' అంటే శుభ్రమైన వస్త్రాలు ధరించడం, స్నానాలు చేయడంవల్ల శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవడం, మనసులో మాటలో శుభ్రత ఉండడం, వ్యక్తిజీవితానికి విలువనిస్తుంది. వాతావరణం పరిశుభ్రంగా ఉంటే మానవజీవితం సుఖంగా ఉంటుంది.

ముఖ్యంగా మన తిరుమలకు వచ్చే యాత్రికులు అనేకప్రదేశాల నుంచీ వస్తూ ఉంటారు. భిన్నభిన్న వాతావరణాలతో, ఆచారవ్యవహారాలతో ఇక్కడికి వస్తారు. జన సమ్మర్ద ముండే చోట వాతావరణకాలుష్యం ఏర్పడడానికి అవకాశ ముంటుంది. కనుక మనం బ్రహ్మోత్సవాలు మొదలగు జనసమ్మర్దం ఎక్కువగా ఏర్పడే సందర్భాల్లో ఈ వాతావరణం పరిశుభ్రంగా ఉంచుకోవడం చాలా అవసరం. లేకపోతే అనేక వ్యాధులు ప్రబలు తాయి. తిరుమల కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధి చెందింది. సరాసరి సగటున రోజుకు ఎనభైనుంచీ తొంభైవేల వరకూ యాత్రికుల రాకపోకలు జరుగుతున్నాయి. ఇందువల్ల తిరుమలను విశేషించి ప్రతిక్షణమూ, ప్రతి ప్రదేశమూ శుభ్రంగా ఉంచుకోవాల్సిన అవసరం ఉంది. యాత్రికులు తిరుపతిలో దిగినప్పటినుండీ పాద యాత్రతోగానీ, వాహనాల్లోగానీ తిరుమలకు చేరి, తిరిగి వచ్చేవరకూ పవిత్ర ఆహ్లాదకరవాతావరణం కలిగించ డానికి మన మందరం సాయశక్తులా సేవాకృషి చేయడానికి సిద్ధపడాలి. ఇక్కడి వాతావరణాన్ని చూచిన తర్వాత యాత్రికులు వారి వారి స్వస్థలాలకు వెళ్ళినప్పుడు అక్కడి దేవాలయ పరిసరాలను పరిశుభ్రంగా ఉంచు కోవడానికి తిరుమల పరిసరపరిశుభ్రత ఓ స్ఫూర్తిదాయకం కావాలి.

భగవత్ కైంకర్యంతో పాటు క్షేత్రకైంకర్యం చేయడంకూడా భక్తుల బాధ్యత. కాళ్ళతో నడిస్తేనే మెట్లకు దుమ్మవుతుం దని రామానుజాచార్యులు, వ్యాసరాయలు తదితర ఆచార్యపురుషులు మోకాళ్ళతో శేషాచలాన్ని అధిరోహించా రని ఐతిహ్యం. కనుక ఉత్సవసమయాల్లోనేగాక, నిత్యకల్యాణం పచ్చతోరణంగా విరాజిల్లే తిరుమల క్షేత్రాన్ని నిత్యం పరిశుభ్రంగా ఉంచడం మనందరి బాధ్యత!

# ఆముక్త మాల్యద - శ్రీవేంకటేశ్వర వైభవం

ఆచార్య భమిడిపాటి విశ్వనాథ్

శ్రీకృష్ణదేవరాయలు గొప్పచక్రవర్తేగాక గొప్పవైష్ణవ భక్తుడు. భక్తు డగుటయే గాక వైష్ణవనియమాలను బాగుగా నెరిగి అను సరించేవాడు. అతడు రచించిన 'ఆముక్తమాల్యద' ఇందుకు పరమనిదర్శనం. ఆముక్తమాల్యదలోనే శ్రీవేంకటేశ్వరునిపై రాయలు ప్రదర్శించినభక్తి నిరుపమానం.

ఆముక్తమాల్యదలోని మొట్టమొదటి పద్యంలోనే శ్రీవేంక టేశ్వరుని రాయలు స్తుతించుట, ఆ తర్వాతి పద్యాలలో శ్రీవేంక టేశ్వరుని సర్వాలంకారాలను పోతలు పోసిన విధంగా రాయలు ఆవిష్కరించుట గమనార్హం. శ్రీలక్ష్మీ, శ్రీవేంకటేశ్వరులను రాయలు స్తుతించిన మొట్టమొదటి పద్యమిది.

**ఉ॥ శ్రీకమనీయహారమణి జెన్నుగ దానును, గౌస్తుభంబునం**
**దా కమలావధూటియు నుదారతఁ దోప, పరస్పరాత్మలం**
**దాకలితంబులైన తమయాకృతు లచ్ఛత బైకిఁదోఁచియ**
**స్తోకత నందుఁ దోఁచె నన శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్**

కావ్యమును ప్రారంభించుటకు "ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్" అను నియమము ననుసరించి నమ స్క్రియతో రాయలు ఆముక్తమాల్యద గ్రంథారంభము గావిం చాడు. మరియు 'శ్రీ'తో కావ్యమారంభించినాడు. ఎందుకనగా-

**వేదములకెల్ల నోంకార మాదియైనకరణి, కృతులకునెల్ల శ్రీకార మాది**
**గాన కవివరు లెల్లరు, దానిదక్క నితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల**

- అని శాస్త్రవచన ముంది గనుక.

సాధారణంగా శార్దూలవిక్రీడితాలతో కావ్యాలు ప్రారం భించుట పరిపాటియై యుండగా, ఈ కావ్యం ఉత్పలమాలతో ప్రారంభమైంది. రాయలు శ్రీవేంకటేశ్వరునకు భక్తితో నుడు గరలు ఘటించింది ఉత్పలమాలలతోనే. మహాలక్ష్మీ, శ్రీ వేంకటే శ్వరులు, ఇరువురి వక్షఃస్థలములందు పరస్పరము రూపములు ప్రతిఫలించుటద్వారా, కావ్యకథలోని ఆముక్తమాల్యద, రంగ నాయకుల పరిణయ వృత్తాంతాన్ని సూచించుట ద్వారా రాయలు వస్తునిర్దేశం గావించాడు.

తదుపరివర్ణన విష్ణుమూర్తి శయనించే శేషునివర్ణన. శ్రీదేవిని కనుమరుగుపరచి, శ్రీవేంకటేశ్వరునికి భూదేవితో క్రీడించుట కవకాశం కల్పించిన శేషుని రాయలు స్తుతించాడు. ఆముక్తమాల్యదలో తరువాతి పద్యాలలో చాలాభాగం తిరుమల నంతా సాక్షాత్కరింపజేశాడు రాయలు. గరుత్మంతునిరెక్కలవల్ల, పాపాలు దూది పింజలవలే ఎగిరిపోవు నని రాయలవర్ణన.

తిరుమలలో, బ్రహ్మోత్సవసందర్భంలో గానీ, ఇతర పూజా సందర్భాలలో గానీ, ధ్వజారోహణ గావించి శుభారంభం గావించే సందర్భాలలో విష్వక్సేనుని పూజించుట నేటికీ పరి పాటి. అనుస్యూతంగా వస్తున్న ఈ ఆచారాన్ని రాయలు ఆముక్తమాల్యదలో ఇలా వర్ణించాడు.

**ఉ॥ పూని ముకుందునాజ్ఞ గనుబొమ్మనె కాంచి, యజాండభాండముల్**
**వానను మీదబోవ నడువ న్గొనెఁ దన్నన నగ్రనిశ్చల**
**త్వానచలత్వనిష్ఠలె సమస్త జగంబుల జాడ్యచేతనల్**
**గా నుతికెక్కు సైన్యపతి కాంచనవేత్రము నాశ్రయించెదన్**

విష్వక్సేనుని బంగారు వేత్రం (దండం) కదలనిదే లోక వ్యవహారమే జరుగదుగదా!

విష్ణుచక్రమైన సుదర్శనదేవుని రాయలు స్తుతించిన తీరు ఒక సంఘటనతో కూడి, తార్క్షణమై అమృతరక్షణభారాన్ని వహించిన తీరు కనులకు కట్టినట్లుగా నున్నది.

పాంచజన్యమును హరి పూరించినంతనే ఆ ధ్వనిమాత్రం చేతనే రాక్షసుల ప్రాణాలు హరీయన్నవట.

**మ॥ హరి పూరింపఁ దదాస్యమారుతసుగంధాకృష్టమై నాభిపం**
**కరుహక్రోడమిళింద బృంద మెదు రెక్కం దుష్క్రియాపంక సం**
**కరదైత్యాసుపరంపరం గముచురేఖం బొల్చు రాకానిశా**
**కరగౌరద్యుతి పాంచజన్య మొసగుం గల్యాణ సాకల్యమున్.**

పాంచజన్య ధ్వనిచే రాక్షసులు మరణించుటే కాదు, రాకా పూర్ణిమనాటి చంద్రుని తెల్లని కాంతిగల హరిశంఖం వెలుగు లీనుతూ, కల్యాణసమృద్ధినికూడా ఒనగూర్చు నని రాయల శుభాశంసనం!

శంఖచక్ర గదాధరు డనికదా శ్రీవేంకటేశ్వరునిస్తుతి. కానీ రాయలు ఆముక్తమాల్యదలో చక్రానికే పెద్దపీటవేసి తరువాత గదాశంఖములను వర్ణించాడు. సుదర్శనచక్రవిశిష్టత అట్టిది!

'సర్వశత్రునిరాసకంబైన ఆ కౌమోదకీగద మదీయశత్రు నిరాసకం బొనరించుగాత!' అని రాయలు వర్ణించెను. శార్ఙ్గ ధనువు అను విల్లుకూడా చాల ప్రశస్తి గాంచింది. పాపముల నియెడు తీగల యొక్క శ్రేణిని పటాపంచలు చేయగల సామర్థ్యం కలది నందకఖడ్గం.

**మ॥ ప్రతతోర్ధ్వాధరభాగపీఠయుగళీభాస్వత్త్సరుస్తంభ సం**
**స్థితిఁ దీండ్రించెడు జాళువా మొసలివా దీప్తార్చిగాఁ గజ్జలా**
**న్విత ధూమాసిత రేఖపై యలుఁగుగా విజ్ఞానదీపాంకురా**
**కృతి నందంబగు నందకం బఘలతా శ్రేణిచ్ఛిదం జేయుతన్ ॥**

శ్రీవేంకటేశ్వరునకు, ఆతనికి సంబంధించిన శంఖచక్ర గదాదుల నెంతగా పైరీతి రాయలు స్తుతించుటయే గాక శ్రీవైష్ణవమతానుయాయి గనుక, తన్మతప్రతిష్ఠామ్ మూల కారకులైన పన్నిద్దరాళ్వారుల నిట్లు స్తుతించాడు.

**మ॥ అలపన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁగాపున్న వె**
**గ్గలపుం దాపముఁ బాప నా, నిజమనః కంజాత సంజాత పు**
**ష్కల మాధ్వీక ఝరి స్మురారి సాగియంగాఁ జొక్కి ధన్యాత్ములౌ**
**నిల పన్నిద్దఱు సూరులం దలతు, మోక్షేచ్ఛామతిం దివ్యులన్**

స్వామి కంటే అతని భక్తులకే పెద్దపీట వేయించడం శ్రీవేంకటేశ్వరుని విశిష్టత. అన్నమయ్యకు అదే విధంగా స్వామి నేటికీ ప్రశంసలు కురిపిస్తున్నాడుకదా. ఇక్కడ పన్నిద్దరు ఆళ్వారులగురించి వివరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ద్రావిడ దేశంలో క్రీ.శ. 10వ శతాబ్దికి పూర్వం, ద్వాదశాదిత్యుల వలే, మహా వైభవంతో ద్వాదశదివ్యసూరులు పన్నిద్దరాళ్వారులు అవతరించి తమదివ్యగానప్రబంధంచేత, పరమపవిత్రచరిత్ర చేత దేశాన్ని భక్తిరససాగరంలో ముంచెత్తారు. వీరు ద్రావిడ భాషలో గానంచేసిన భగవన్మహిమను వివరించే గ్రంథరాజములే దివ్యప్రబంధాలు. దక్షిణదేశానికి చెందిన వైష్ణవాలయాలు వీరిప్రబంధాలను గానం చేయనిదే, వీరి శిలావిగ్రహాలను ప్రతిష్ఠించి పూజించనిదే దివ్యస్థల మనే మహారాజగౌరవం పొందేవికావు. దివ్యప్రబంధాలకు దాక్షిణాత్యశ్రీవైష్ణవులు వేదప్రామాణ్యాన్ని ఒసంగారు. దివ్యప్రబంధాలు 24. వీనిలోని పాశురాలు అంటే ద్రావిడపద్యాల సంఖ్య 4000. నేటికీ తిరుమలలో ఈ పాశురాలను అనునిత్యం గానం చేస్తూనే ఉంటారు.

ఆముక్తమాల్యదను శ్రీవేంకటేశ్వరున కంకితమీయ కోరినవాడు శ్రీకాకుళాంధ్రదేవుడు. ఈ దైవనిర్ణయం అద్భుతం. లోకకల్యాణకారకం శ్రీకాకుళాంధ్రదేవుడే రాయల కిట్లుసెలవొసంగినాడు.

**క॥ అంకితమో యన నీ కల**
**వేంకటపతి యిష్టమైన వే ల్పగుటఁ దదీ**
**యాంకితముసేయు మొక్కొక**
**సంకేతము కా కతడె రసన్ నే గానే**

సాధారణంగా షష్ట్యంత పద్యాలలో కావ్యాలను అంకితమిచ్చునపుడు, వారిపై, వారి గొప్పదనాలను వివరిస్తూ వారికి కృతిని సమర్పించుట సాహితీలోకంలో పరిపాటి, సంప్రదాయం. అనేక ప్రబంధాలకు కృతిభర్త శ్రీకృష్ణదేవరాయలు. అతనికే కాక సమస్త భువనాలకు చక్రవర్తియైన లోకైకనాథుడు శ్రీ వేంకటేశ్వరుడు. ఇంద్రాది దేవతలకే దిక్కైన, నరసింహాకృతి దాల్చిన శ్రీ వేంకటేశ్వరునికి ఈ క్రింది విధంగా ఆముక్తమాల్యదను సమర్పించాడు. ఆ పద్యమిది.

**క॥ అంబోధికన్యకాకుచ**
**కుంభోంభిత ఘుసృణ మసృణ గురువక్షునకున్;**
**జంభారిముఖాధ్యక్షున**
**కంభోజాక్షునకు సామి హర్యక్షునకున్**

స్వామి హర్యక్షునకున్ అనేపదంలో ఒక చమత్కారముంది. సామి = అంటే అర్ధభాగం. హర్యక్షునకున్= సింహమగు వానికి అనికదా అర్థం. అంటే నరసింహాకృతి దాల్చిన వానికి అని అర్థం. చమత్కార మేమంటే నరులలో సింహం శ్రీకృష్ణదేవరాయలైతే, ఆ నరసింహునకే నరసింహుడు శ్రీవేంకటేశ్వరుడు. శ్రీ వేంకటేశ్వరునిపై రాయలకు ఎంతో భక్తి. ఆముక్తమాల్యదలో శ్రీవేంకటేశ్వరునిపై రాయలు రచించిన భావాలలో అవకాశం, సందర్భం అల్పమే అయినా, అతడు భక్తితో ఉడుగరలు ఘటించినది అనల్పం. అతడు వర్ణించని, శ్రీనివాసుని



# శ్రీచరణ శరణాగతి

నీసరివేల్పు లే దను మనీష శిరమ్మును వంచి మ్రొక్కగా
వాసుకిభూషి, తత్క్షణవిభాసితవజ్రముచేత ముక్కలై
కోసిన ధార జిట్లిపడు కోమలగాంగమరందబిందులే
పోసిన రత్నకాంతిచయపోతములై చెలగున్ త్వదంఘ్రులన్ **49**

సరి నీ కెయ్యది పాదమా! విపులవిశ్వాధారభూతంబవై
సిరి సంవాహనసేయ నిత్యము సురజ్యేష్ఠాదిదేవుల్ మునుల్
వరయోగుల్ సుకవుల్ నుతింపగ త్రయీవాసంబు త్రయ్యంత భా
సురహాసంబు విలాసమై వెలుగు విస్ఫూర్తిన్ బ్రశంసించెదన్ **50**

పాయక పంచకంటకవిభాసితబృందను నందనమ్ముగా
నేయడుగుల్ పొనర్చె భవదీయకటాక్ష వసంతలక్ష్మి నం
దాయడుగుల్ మదీయవిధి నంతము సేసి సువర్ణరేఖలన్
గీయవె ఫాలభిత్తికను కేశవ! నీకృప సుంతగల్గినన్ **51**

అడుగున మీదుక్రిందులుగ నాగముగాన బతీంద్రుజేసితే
యొడుపున నట్టి పొట్టితన మొప్పగ మత్కృతపాపరాశి దం
డడిబడి నిప్పురవ్వవయి దాహమొనర్చి త్రివిక్రమప్రతిన్
కడువడి మన్మనఃకుహరకాంతిదమూర్తిఁ జెలంగవే దయన్ **52**

ఎగ్గులులేని చిత్తమున నింతుల వల్వలు దోచి దాచి, బల్
సిగ్గులు వీడజేసి, భవశేఖరసాగరమగ్నవృత్తి పె
న్నిగ్గులు దూకుటల్ విడిచి నీదియె భారమనంగ నేర్పగన్
నిగ్గులుదేరు నీపశిఖి నెక్కు భవత్పది వేదవేద్యమై **53**

కాలు దలన్ పొసంగ విషకాళియ సర్పము వీడె క్రౌర్యమున్
కాలు ఫణిన్ గనంబడుట ఖాదనపద్ధతి మానె తార్క్ష్యుడున్
మేలుగ దివ్యధామమును మేకొనుటెంతలొ భక్తపుంగవుల్
లీలగ నీపదమ్ములను లీనమనస్సుల సంచరించినన్ **54**

\- ఆచార్య రావికంటి వసునందన్

ప్రత్యంగదేవతలు గానీ, ప్రదేశాలు గానీ లేవు. శ్రీవేంకటేశ్వరుని, శ్రీదేవి, భూదేవులను, తిరుపతి మరియు తిరుమల లోని అన్ని ప్రదేశాలను మనముం దుంచాడు రాయలు.

ఈ షష్ఠ్యంతపద్యా లన్నింటిలోను సామాన్యమైన ఒక విశేషం గోచరిస్తుంది. అదేమిటంటే రాయలు శ్రీవేంకటేశ్వరుని శత్రుసంహారకునిగా అధికభాగం వర్ణించడం. ఎన్నోయుద్ధాలు చేసిన రాయలు శ్రీ వేంకటేశ్వరుని, అనేకసందర్భాలలో మానసికంగా పరిపూర్ణంగా కొలుచుకున్నాడు. దానిఫలితమే రాయలు సర్వరాజన్య సార్వభౌముడై, సర్వ కవికుల సార్వభౌముడై, ప్రశాంతజీవనం గడపగలిగాడు. ఆ కృతజ్ఞతను ఈ షష్ఠ్యంతపద్యాలలో ఆముక్తమాల్యదలో కనపరచాడు.

తెలుగుసాహిత్యంలోనే అత్యంత వర్ణన ప్రియుడైన రాయలు ఈ ఆముక్తమాల్యదలో ఆ షష్ఠ్యంతాలను తెలుగులోనే చాలా చిన్నవైన కందపద్యాలలో వర్ణించడం విశేషం. ఈ చిన్నపద్యాలలోనే అనంతమైన ఆ అనంతునివైభవాన్ని ఇంకా ఇలా వర్ణించాడు.

**క॥ మర్దితకాళియఫణికిఁగ,**
**పర్ద భృదజబింబితాచ్ఛపదనఖఘృణికిన్**
**దోర్దండ శార్ఙ్గకిణి కఘ**
**కర్దమ దినమణికి దనుజకరివరసృణికిన్**

అన్నమయ్యచే తరువాత బ్రహ్మ కడిగిన పాదం సంకీర్తన ప్రసిద్ధిగాంచింది.

ఈ షష్ఠ్యంతాలను చివరగా రాయలు మరల సుదర్శన చక్రవిశిష్టతను వర్ణించుటతో ముగించాడు.

## తిరుపతిలో దర్శనీయ ఆలయాలు



### శ్రీ గోవిందరాజస్వామి ఆలయం

ఇతిహాసం ప్రకారం ఈ క్షేత్రాన్ని శ్రీవైష్ణవాచార్యులైన శ్రీరామానుజులు ప్రతిష్ఠించారని ప్రతీతి. శ్రీ గోవిందరాజస్వామి ఆదిశేషునిపై శయనించిన భంగిమలో దర్శనమిస్తున్నారు. శ్రీ ఆండాళ్, శ్రీ పార్థసారథి మరియు శ్రీ వేంకటేశ్వరస్వామి గుడులు శ్రీగోవిందరాజస్వామి ఆలయం ప్రాంగణంలో ఉన్నాయి. విజయనగర రాజుల శిల్పకళాచాతుర్యానికి ప్రసిద్ధి చెందిం దీఆలయం. **ఫోన్ నెం.:0877-2264592.**

### శ్రీ కోదండరామస్వామి ఆలయం

తిరుపతి రైల్వేస్టేషన్‌కు ఒక కిలోమీటరు దూరంలో ఉన్న ఈ ఆలయంలో శ్రీ కోదండరామస్వామి వెలసి ఉన్నాడు. రావణ వధానంతరం సీతా లక్ష్మణులతో శ్రీరాముడు ఈ స్థలంలో కొంతసేపు ఉన్నందుకు గుర్తుగా ఈ ఆలయం నిర్మింపబడింది. **ఫోన్ నెం.: 0877-2264584.**

### శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం

తిరుపతి పట్టణానికి 3 కి.మీ.దూరంలో ఈ ఆలయం వెలసి ఉంది. కపిలమహర్షి పూజించిన శివలింగం కనుక కపిలేశ్వరు డని, ఇచటి తీర్థం కపిలతీర్థం అని పిలువబడు తున్నాయి. **ఫోన్ నెం. : 0877-2264587.**

### అలమేలు మంగాపురం (తిరుచానూరు)

తిరుపతికి 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న పుణ్యక్షేత్రం తిరుచానూరు. దీన్నే అలమేలుమంగాపురం అని కూడా అంటారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారిదేవేరి శ్రీ పద్మావతి అమ్మవారు ఇచట పూజలందుకొంటున్నది. తిరుమల యాత్రికులు తిరుచానూరు అమ్మవారిని దర్శించినట్లయితే తమ యాత్ర ఫలవంత మవుతుం దని ప్రసిద్ధి. అందువల్లే తిరుమల యాత్రికులు, తిరుచానూరుకు వెళ్లి శ్రీ పద్మావతి అమ్మవారిని పూజిస్తారు. తిరుచానూరులో ఉన్న పవిత్ర పుష్కరిణి "పద్మ సరోవరం"లో శ్రీ పద్మావతి అమ్మవారు ఆవిర్భవించా రని పురాణ ప్రసిద్ధి. **ఫోన్ నెం. : 0877-2264586.**

ఆ సుదర్శనచక్రాన్ని, ఆ సుదర్శనధారి శ్రీ వేంకటాచలపతిని ఇట్లు నుతించాడు.

క॥ **బంధురరథాంగ ధారా**
**గంధవహోప్తజ్వలచ్ఛిఖా పటలపున**
**స్సంధుక్షణ ఘృతరాహుప**
**లాంధో౽ సృక్పృతికి వేంకటాచలపతికిన్**

ఇదే విధంగా ఆశ్వాసాంత, ఆశ్వాసాది పద్యాలలో శ్రీ వేంకటరమణుని స్తుతించాడురాయలు. ఆ సందర్భంలో కూడ కాకాసురుని శిక్షించినవానిగా, మరియు హిరణ్యాక్షుని వంటి అనేకదనుజుల శిక్షించినవానిగా, నరసింహావతార విశేషరూపునిగా రాయలు శ్రీవేంకటేశ్వరుని వైభవాన్ని నుతించాడు.

అనితరసాధ్యమైన విష్ణుసాక్షాత్కారం విష్ణుచిత్తునకు లభించినట్లు, ఆముక్తమాల్యదలోని వర్ణన ఈ ఘట్టంలోనే రాయలు విష్ణుచిత్తునిచే దశావతారవర్ణనను గావించాడు. ఈ క్రింది కందపద్యంలో రాయలు దశావతారవర్ణనను ఎంత అద్భుతంగా వర్ణించాడో గమనించండి.

క॥ **జలచర కిటి హరి వటు భృగు**
**కుల రఘుకుల సీరి బుద్ధ ఘోటి ప్రముఖో**
**జ్జ్వల జనికృత జనరక్షా**
**యలమేల్మంగాభిధేందిరాలయవక్షా!**

ఈ దశావతారాలతో శ్రీ వేంకటేశ్వరుడు తన వైభవంతో జనరక్ష సదా చేస్తూనే ఉన్నాడు. ప్రాచీనాంధ్రవాఙ్మయంలో నాయికానామంతో వెలసిన ప్రబంధం ఆముక్తమాల్యద. రాయలు మహావిష్ణుభక్తుడు, తాతాచార్యులవారి శిష్యుడు. శ్రీ వేంకటేశ్వరునకు పరమభక్తుడైన రాయలు తన శిలావిగ్ర హాన్ని, దేవేరులైన తిరుమలదేవి, చిన్నాదేవులయొక్క శిలావిగ్ర హాలను నిర్మింపజేసి, తిరుమలలోని దేవాలయ ప్రాంగణంలో స్వామికభి ముఖంగా ప్రతిష్ఠింపజేశాడు.

ఆముక్తమాల్యద కేవలం ఆంధ్రులు గర్వింపదగ్గ గ్రంథ రాజమే గాక, యావద్భారతీయవిజ్ఞానసంస్కృతులకు గని. శ్రీవేంకటేశ్వరునివైభవాన్ని చాటి చెప్పే సుదర్శన చక్రం. స్వామి మెడలోని కౌస్తుభమణిహారసదృశం.

# కావ్యాలలో...
# కల్యాణచక్రవర్తి

డా॥ కంపల్లె రవిచంద్రన్

పరమాత్ముడు పరమపురుషుడు
పరికింపగ కృపాళుడు
తిరువేంకటవిభుడు కాక
మరి దేవుడు కలడా ?

అంటే లేదు, లేదు, లేనే లే దని ఘంటాపథంగా చెప్ప వచ్చు. ఎందుచేతనంటే ఈ కోనేటిరాయడు, ఆశ్రితుల పాలి పారిజాతం! కాచి రక్షించే చింతామణి! కోరికలు తీర్చే కామ ధేనువు! చెడనీక బ్రతికించే సిద్ధమంత్రం! పాయక వెంట దిరిగే ప్రాణబంధువు!

భక్తి కొలది వాడే పరమాత్ముడు అన్నట్లు భక్తులందరి కోరికలను తీరుస్తూ అందరినీ ఆనందింప జేస్తూ 'కలౌ వేంకట నాయకః' అనే ప్రసిద్ధి పొందిన దేవదేవుడు ఈ కల్యాణచక్రవర్తి.

శ్రీవేంకటేశ్వరస్వామి అవతరణకు సంబంధించిన వృత్తాంతాన్ని వరాహ, భవిష్యోత్తర, బ్రహ్మాండ, బ్రహ్మ, స్కాంద, వామనాదిపురాణాలు, విపులంగా వివరించాయి. తమిళ కన్నడ సాహిత్యాల్లోనూ స్వామిని గురించిన వృత్తాంతాలు గోచరి స్తాయి.

ఆంధ్రవాఙ్మయం నన్నయభట్టు భారతానువాదంతో ఆరంభమయింది. అతని కాలం నుండి ఎఱ్ఱాప్రెగ్గడ కాలం వరకు (14వ శతాబ్దం) ఉప్పతిల్లిన సారస్వతంలో శ్రీ వేంకటేశ్వ రుని విషయం కన్పించదు.

శ్రీనివాసునిగూర్చిన ప్రసక్తి **"శ్రీవేంకటాచలస్థాయి గొలిచె** (1-11) అని తన నృసింహ పురాణంలో తొలుదొల్తగా తెచ్చిన మొదటి తెలుగు కవి ఎఱ్ఱాప్రెగ్గడ. కవిసార్వభౌముడైన శ్రీనాథుడు కాశీఖండంలో **"శ్రీశైలవేంకటాహోబలశోణా ద్రిసాల గ్రామాది పర్వతంబులు మహానుభావంబున మీ యిద్దఱ కంటె నధికంబులు"** అని వచించాడు.

వేంకటేశ్వరుని అవతారగాథ ప్రజాబాహుళ్యంలో వ్యాపించి ఉన్న దానికి, భాగవతంలో ఉన్నదానికి ఎంతో తేడా ఉంది. సహజపాండిత్యుడు బమ్మెరపోతనామాత్యుని శ్రీమదాంధ్ర మహాభాగవతంలో బాలాజీ అవతార గాథ ఈ క్రింది విధంగా ఉంది.

సరస్వతీనది చెంత మహర్షులు లోకకల్యాణార్థం యజ్ఞం నిర్వహిస్తూ, యజ్ఞఫలం త్రిమూర్తులలో ఎవరి కివ్వాలో? యని తర్కించే సమయంలో నారదప్రేరితుడై, త్రిమూర్తులలో ఎవ్వడు ఉన్నతుడో నిర్ణయించటానికి భృగుమహర్షి ప్రయాణం కడతాడు. సత్త్వ రజ స్తమోగుణాలలో సర్వోత్తమమైనది సత్త్వ గుణం. కనుక త్రిమూర్తులలో సత్త్వగుణ ప్రధాను డెవరో తెలుసుకోవా లని భృగుమహర్షి మొదట బ్రహ్మలోకానికి వెళ్ళి, బ్రహ్మను స్తుతించకుండా నిల్చున్నాడు.

తన లోకానికి వచ్చి, తనను నుతించకుండా, తన ముందు నిల్చొన్న భృగువుపై బ్రహ్మకు కోపం వచ్చింది. కానీ భృగువు తన కుమారుడే గనుక, బ్రహ్మ తనకోపాన్ని నెమ్మదిగా దిగమింగుకున్నాడు.

పిదప భృగుమహర్షి కైలాసం చేరాడు. భృగువును చూడగానే అతడు సోదరునివలె వచ్చి తనను కౌగిలించుకొంటా డని ఈశ్వరుడు భావించాడు. అంతేగాక స్వయంగా భృగు మహర్షికి ఎదురు వచ్చాడు. కానీ భృగుమహర్షి మౌనం వహిం చాడు. **'తన్ను గైకొనక యూరకుండిన'** భృగువుపై ఈశ్వరునకు విపరీతమైన కోపం వచ్చింది. శూలం తీసుకుని భృగువును చంపబోయాడు. పార్వతీదేవి అడ్డం వచ్చి, ఈశ్వరుని పాదాలను పట్టుకొని, ఆయన కోపాన్ని మాన్పింది. బ్రహ్మలో కేవలం రజోగుణమే ఉంది. ఈశ్వరుడు తనను త్రిశూలంతో చంప బోయాడు గనుక ఇతనిలో తమోగుణం కూడా ఉం దని, సత్త్వ గుణం లే దని భృగుమహర్షి భావించి, మెల్లగా కైలాసం వదలి వెళ్లిపోయాడు.

ఇక చివరగా భృగుమహర్షి వైకుంఠం చేరాడు. నారా యణుని స్తుతించక, అతడి ముందు నిల్చున్నాడు. నారా

యణుడుకూడా తనను గౌరవించకపోవటంతో భృగుమహర్షి అతని వక్షఃస్థలంపై తన్నాడు. వెంటనే విష్ణువు తన అజ్ఞానాన్ని క్షమించు మని, ఆ మహర్షిని ఎంతో గౌరవించి పూజించాడు. తాను విప్రులను సదా పూజిస్తా నని చెప్పాడు. వెంటనే భృగువు మహానందభరితుడై సరస్వతీనదివద్దకు వచ్చి, మహర్షులతో త్రిమూర్తులలో విష్ణువే సత్త్వగుణ ప్రధాను డని, అతడే యజ్ఞఫల స్వీకారానికి అర్హు డని చెబుతాడు.

ఈ విధంగా త్రిమూర్తులలో విష్ణుభగవానుడే సత్త్వగుణ పూర్ణు డని, సర్వోత్తము డని భాగవతంలో నిరూపించబడింది. (ఈ కథలో ఎక్కడా భృగుమహర్షికి అరికాలిలో కన్ను ఉన్నట్లు గాని, నారాయణుడు పాదసేవచేయుచూ దానిని చిదిమినట్లు గాని లేనేలేదు) తర్వాత లక్ష్మి అలిగి వెళ్ళిపోవటం, శ్రీహరి భువిపై శ్రీవేంకటేశ్వరుడుగా అవతరించటం మామూలు కథే!

### తాళ్లపాక కవులు

శ్రీ వేంకటేశ్వరస్వామినిగూర్చి ఆంధ్రసారస్వతంలో అధికంగా ప్రచారం చేసిన కవులు తాళ్లపాకవారు. వైష్ణవ మతతత్త్వం, శ్రీ వేంకటేశ్వర వైభవం- వీరి రచనల్లో పరవళ్లు తొక్కుతూ ఉంటాయి. ద్విపదలు, వచనములు, సంకీర్తనలు, పద్యాలు మొదలైన వివిధసాహిత్యప్రక్రియలలో ఈ కవులు స్వామిని కీర్తించారు. సంకీర్తనాచార్యుడు, పదకవితాపితా మహుడు అయిన అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యులు, తిమ్మక్క, చిన్నన్న, తిరువెంగళప్ప మొదలైన ఈ వంశస్థు లందరూ కవితావిశారదులే. శ్రీ వేంకటేశ్వరస్వామి పాద పద్మ భృంగాలే. ఒక్క మాటలో చెప్పాలంటే తాళ్లపాకవంశంలో జన్మించిన ఈ కవులందరూ స్వామికీర్తిని తెలుగు సార స్వతంలో శాశ్వతంగా నిలిపి తరించిన మహనీయులు. వీరిలో అన్నమయ్య శ్రీనివాసుని యశఃకిరీటంలో కలికితురాయి. 1.శృంగార, అధ్యాత్మ్య సంకీర్తనలు ముప్పైరెండు వేలూ, 2.శృంగార మంజరి, 3.శ్రీ వేంకటేశ్వర శతకం, 4.వేంకటాచల మాహాత్మ్యం-సంస్కృతం (అలభ్యం) వగైరా అన్నమయ్య రచన ల్లోనూ, ఆయన కుమారుడు పెదతిరుమలాచార్యులవారి 1.శృంగార అధ్మాత్మ సంకీర్తనలు, 2.వేంకటేశ్వర వచనములు, 3.శ్రీవేంకటేశ్వరోదాహరణం, 4.శ్రీవేంకటేశ్వరప్రభాత స్తవము-వగైరా గ్రంథాల్లోనూ, పెద్ద తిరుమలయ్య కుమారుడు చిన్నతిరుమలయ్య 1.శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలు, 2.అష్ట భాషా దండకాదులలోనూ, పెద్ద తిరుమలయ్య నాల్గవ కుమా రుడు తాళ్లపాక చిన్నన్న 1.పరమయోగివిలాస, అష్టమహిషీ కల్యాణ, ఉషా పరిణయాది కావ్యాల్లోనూ స్వామి చాలా గొప్పగా స్తుతింపబడ్డాడు.

"వాణి నారాణి"-అని రొమ్ము విరుచుకొని పల్కిన పిల్లలమర్రి పినవీరభద్రుడు (15వ శతాబ్ది) తన జైమినీ భారతంలో కృతిపతియైన సాళువ నరసింహరాయల్ని ప్రశం సిస్తూ వేంకటేశ్వరుణ్ణి**(5-1)** ప్రస్తావించాడు.

శ్రీకృష్ణదేవరాయల తండ్రి తుళువ నరసరాజు. శ్రీని వాసుని భక్తుడైన అతనికి ఘంటసింగన-నందిమల్లయ లనే జంటకవులు తమ వరాహపురాణాన్ని అంకితమిచ్చారు. దానిలో ఆదివరాహస్వామిని క్రిందివిధంగా కొనియాడారు.

**శ్రీ లీలాస్పదమైన కొమ్మున**
**ధరిత్రీ కాంత కారుణ్యల**
**క్ష్మీలోలాత్మక నెత్తి లీల**
**జలదాశ్లేషైక శృంగోన్నమ**
**త్కైలాసంబును బోలె నున్న**
**జగదేకస్వామి వారాహదే**
**హాలంకారుడు ప్రోచునీశ్వర**
**నృసింహక్ష్మావధూ వల్లభున్** **(1-1)**

విష్ణుదేవుడు వరాహావతార మెత్తి హిరణ్యాక్షు డనే రాక్షసుణ్ణి చంపి భూదేవిని ఉద్ధరించినగాథ పురాణ ప్రసిద్ధం.

విష్ణుని అంశావతారం భూవరాహస్వామి. సాక్షాత్ విష్ణువు శ్రీవేంకటేశ్వరుడు. కాబట్టి వీరిద్దరికీ అభేదం. అందు కనే ఈ జంటకవులు వేంకటరమణుని స్థానంలో వరాహ స్వామిని స్తుతించడం జరిగింది. తిరుమలకు వెళ్లిన ప్రతి భక్తుడూ మొదట వరాహస్వామిని సేవించి ఆపై శ్రీవేంకటేశ్వ రుణ్ణి దర్శిస్తాడు.

విజయనగరసామ్రాజ్యాన్ని (1509 - 1530) పరి పాలించిన శ్రీకృష్ణదేవరాయలకాలంలో ఆంధ్రవాఙ్మయం

మూడు పూవులారు కాయలుగా వర్ధిల్లింది. తిరుమలేశుని భక్తుడైన రాయలు సకుటుంబంగా తనపాలన కాలంలో 7 సార్లు తిరుమలను దర్శించి స్వామిని సేవించాడు. ఆయన రచించిన ఆముక్త మాల్యదను (విష్ణుచిత్తీయం) సైతం స్వామికే అంకిత మివ్వడం జరిగింది. గ్రంథంలోని ఇష్టదేవతా ప్రార్థన ఇలా వేంకటేశ్వరప్రస్తుతితో ప్రారంభమైంది.

**శ్రీ కమనీయ హారమణి**
**చెన్నుగ తానును, కౌస్తుభంబు నం**
**దా కమలా వధూటియు**
**నుదారత తోప, పరస్పరాత్మలం**
**దాకలితంబులైన తమ**
**యాకృతు లచ్ఛత పైకిఁ దోచి, య**
**స్తోకత నందు తోచె నన,**
**శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్** (1-1)

వ్యాసప్రణీతమైన హరివంశాంతర్గత పారిజాతాప హరణ వృత్తాంతాన్ని కావ్యంగా మలచిన కవి నందితిమ్మన. గ్రంథం శ్రీకృష్ణదేవరాయలకే అంకితమివ్వబడింది. తిరుమల కొండపై భక్తానుగ్రహార్థం దివ్యమంగళవిగ్రహుడై వెలసిన శ్రీవేంకటేశ్వరుడు రాయలకు ఇష్టదైవం కాబట్టి కింది రీతిగా కవి, స్వామికి విన్నవించడం సమంజసంగా ఉంది.

**శ్రీమదికిం బ్రియం బెసగ చేర్చిన**
**ఉయ్యెల లీల వైజయం**
**తీమిళితాచ్ఛ కౌస్తుభము**
**నిద్దపు కాంతి దనర్చి, యాత్మ వ**
**క్షోమణివేది పాల్పెసగ**
**చూడ్కుల పండువు సేయు వేంకట**
**స్వామి కృతార్థు చేయు**
**నరసక్షితినాథుని కృష్ణరాయనిన్** (1-1)

## కళాపూర్ణోదయం - తిరుమల వర్ణన

పింగళి సూరన కళాపూర్ణోదయ కావ్యంలో వేంకటేశ్వర స్వామి ప్రస్తావన సవిస్తరంగా సాగింది. మణికంధరుడు తీర్థయాత్ర చేసే సందర్భంలో ఈ ప్రస్తావన వచ్చింది.

మణికంధరుడు పూరీజగన్నాథుని, సింహాచలాధీశుని అహోబల నరసింహుణ్ణి సేవించాడు. అక్కడ నుంచి తిరుమలకు విచ్చేశాడు. స్వామిపుష్కరిణిని సేవించాడు. పింగళి సూరన పుష్కరిణిని వర్ణించిన తీరు మనోహరం. **'ఘన ప్రమద ప్రేమ విశేష సంభృత పరీరంభ క్రియా సంభ్రమ భ్రమకారాభిముఖప్రసార లహరీబాహాసమూహాసమానమనోజ్ఞం'**గా ఉందట పుష్కరిణి. అందులో స్నానం చేయడంవల్ల గంధర్వుని తనువు, అతని దేహస్పర్శవల్ల పుష్కరిణి పునీతమయ్యాయి.

ఇక్కడ కవి ఒక సీస పద్యంలో తిరుమల పావనత్వాన్ని గూర్చి తెలిపాడు. పృథివ్యాపస్తేజోవాయురాకాశాది పంచ భూతాలు ఏ విధంగా పావనమయ్యాయో సూరన వివరించాడు.

ఎదురుగా రత్నమకుటధారియైన వేంకటేశ్వరుడు ఎలా ఉన్నాడో సీసంలో కవి ప్రత్యక్షం చేశాడు.

**మృదుపదాంబుజములు మెఱుఁగు టందెలు పైడి**
**దుప్పటియును, మొల ముప్పిడియును**
**మణిమేఖలయు, బొడ్డు మానికంబును, వై జ**
**యంతియు, నురమున నలరు సిరియు**
**వరదహస్తము కటి వర్తిలు కేలు, శం**
**ఖముఁ జక్రమును దాల్చు కర యుగంబుఁ,**
**దారహారంబులు చారుకంఠంబు, ని**
**ద్దపుఁ జెక్కులును నవ్వు దళుకు పసలు**
**మకరకుండలములును తామరలఁ దెగడు**
**కన్నులు, మనోజ్ఞ నాసయుఁ గలికి బొమలు**
**ముత్తియపు నామమును రత్న ముకుట వరము**
**నెసఁగఁగనుపట్టు శ్రీవేంకటేశుఁ జూచె** (ద్వితీ.132)

స్వామివారి మహోన్నతమూర్తిని దర్శించి ఆ మణి కంధరుడు కంచికి ప్రయాణమయ్యాడు.

**తెనాలి రామకృష్ణుడు ఘటికాచలమాహాత్మ్యం**లో సప్తర్షులు ఘటికాచలానికి వెళ్లే సందర్భంలో మధ్యలో తిరుపతిని దర్శించినట్లు వర్ణించాడు. స్వామి కైంకర్యా లన్నింటినీ రామ కృష్ణుడు వివరించాడు. **సిద్ధిరాజు తిమ్మరాజు** (16 శతాబ్దం) కూడా తన **పరమయోగివిలాసం**లో స్వామిని స్తుతించాడు.

**తరిగొప్పుల మల్లన** రచించిన **చంద్రభానుచరిత్ర** కావ్యంలో వేంకటేశ్వరస్వామి ప్రస్తావన సవిస్తరంగా ఉంది. ఇతడు తనకావ్యాన్ని దత్తాత్రేయయోగీంద్రునకు అంకిత మిచ్చాడు. ఇతనిరచనాకాలాన్నిబట్టి ఇతడు వేంకటపతిరాయల ఆస్థానంలో ఉండినట్లు తెలుస్తోంది. అందుచేత ఈ గ్రంథము చంద్రగిరిలో క్రీ.శ.1600 సంవత్సరం ప్రాంతంలో రచింపబడి ఉండవచ్చు నని ఊహింపవచ్చు.

స్వామి పుష్కరిణిని తరిగొప్పులమల్లన వర్ణించిన తీరు హృద్యం.

**కమలాకరతఁ దామ యమరు నింతియకాని**
**క్రుంకువారికి సిరు ల్గూర్పఁ గలవె**
**కువలయోద్ధతిఁ దామ కొఱలు నింతియకాని**
**చేరువారికి ధరఁ జేర్పఁ గలవె**
**యుత్కళికలఁ దామ యొప్పు నింతియకాని**
**కనువారికి ముదంబు లునుపఁ గలవె**
**యమృతసంగతిఁ దామ యలరు నింతియకాని**
**తలఁచువారికి ముక్తిఁ దార్పఁగలవె**

**యితర తీర్థంబు లెందైన నీసరంబు**
**పగిది నవి విశ్వభూజను ల్పొగడ నన్న**
**గమునఁ జెన్నొందు స్వామి పుష్కరిణి యచటఁ**
**దాన మొనరించి యుచిత కృత్యములఁ దీర్చి** **(5- 53)**

కమలాకరములు తాము లక్ష్మీదేవికి నివాసములు అని పించుకొనగలిగినవే కానీ సంపదలను ఈయగలవా? కువల యోద్ధతిచేత (కలువల అతిశయంచేత, భూమియందు అతి శయంచేత) ఒప్పును కానీ తమ్ము ఆశ్రయించేవారికి భూమిని ప్రసాదింపగలవా? ఉత్కళికల (కెరటాల మిక్కిలి వేడుకల)తో తామే అలరునుకాని దర్శించువారికి ఆనందా న్నీయగలవా? అమృతసంగతితో (అమృతముతో కలిసియుండుటతో, జలముతో కలిసియుండుటతో) తామే అలరునుగాని స్మరించు వారికి ముక్తి నొసగగలవా ? అని ఇతర తీర్థాలను పరిగణింపక లోకు లందరు తన్నే కొనియాడుచుండగా, స్వామిపుష్కరిణి ప్రకా

# తిరుమలరాయా!

**చిరునగవొలికే - తిరుమల రాయా!**
**కరువుతీర నిను - గాంచితి నయ్యా!**
**పేదలు మే మని - పెద్దలు వారని**
**వాదము వేయక - వేడితి నయ్యా!**

**ముడులను వేసే - వాడవు నీవు**
**ముడులను తీసే - వాడవు నీవు**
**నీ మాయలు - నీ మహిమలు ఎరుగని**
**అమాయకుండను - నే నయ్యా!**

**నా హృది తెలిసిన - వాడవు నీవు**
**నా మది నెరిగిన - వాడవు నీవు**
**నీ శక్తులు - నీ యుక్తులు తెలియని**
**అశక్తుండను - నే నయ్యా!**

**మంత్రము తంత్రము - నేర్వనివాడను**
**పుణ్యము పాపము - తెలియని వాడను**
**సర్వము నీ వని - శరణము నీ వని**
**వేంకటేశ యని - కొలిచితి నయ్యా!**

**కొంగు పట్టి - నీ కొండకు నడచి**
**కోరలేదు - ఏ కోర్కెను తలచి**
**గుండెలోని - నా వెతలను బాపుమని**
**గోవిందా యని - పిలిచితి నయ్యా!**

– గొల్లాపిన్ని సుబ్రహ్మణ్య శర్మ

శించుచుండును అని వర్ణించాడు. ఇక స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని మరొక సీసంలో కవి ఇలా వర్ణించాడు.

**ఇలఁ జూపు వలచేయి వెలిదమ్మి కనుదోయిఁ**
**జెలఁగువానిఁ బయోధి మెలఁగువాని**
**దట్టిఁ జేరిన వంకిగట్టు మీఁదటి టెంకిఁ**
**దనరువానిఁ బురారి నెనరువాని**
**నెడమ పెందొడఁ గేలు నెడఁ జేరిచిన యాలు**
**నెసఁగు వాని శుభంబు లొసఁగువాని**

**నిండు బంగరు పట్టు కొండ వంచిన మెట్టు**
**వెలయువాని శుకాత్మ నొలయువాని**

**చికిలి జిగి చుట్టుకత్తి జేజేలు బత్తి**
**నెఱపువాని సురారులఁ బఱపువాని**
**వేంకటస్వామిఁ గనుగొని వినయ వినమి**
**తాంగవైఖరి మెఱయ సాష్టాంగ మెఱగి' (5-57)**

**గురుభాస్కరాచార్యులు**(16 శతాబ్దం) **వైశ్యపురాణం**లో స్వామిని వర్ణించాడు. **కాందూరి వెంకట దాసు** (18 శతాబ్దం) **భార్గవపురాణం**లో, **తక్కెళ్ళపాటి లింగన** (19 శతాబ్దం) **మదన మోహినీ విలాసం**లో, **నారపరాజు కాంత కవి** (19వ శతాబ్దం) **కవిజన చకోర చంద్రోదయం**లో స్వామిని స్తుతించారు.

చాలామంది కవులు తమకృతుల్ని శ్రీ వేంకటేశ్వరునికి అంకితం గావించారు. ఇందులో అగ్రపీఠం సాహితీసమ రాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలది. ఆముక్త మాల్యదను రాయలు స్వామికి అంకితమిచ్చాడు.

16 వ శతాబ్దపు కవులైన **మారేపల్లి వేంకటయోగి తత్త్వదీపిక** (ద్విపదకృతి), **కూచిరాజు ఎర్రన సకలకథా నిధానమును, వెలగపూడి వెంకనార్యుడు లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతాన్ని** తెలుగుచేసి దాన్ని, **రాయసం వెంకటపతి లక్ష్మీ విలాసమును, గుళ్ళికల్లు వేంకటరమణకవి కనకరంజిత శిఖామణిపరిణయాన్ని, కాకమాని మూర్తికవి రాజవాహన విజయాన్ని** స్వామివారికి అంకితమిచ్చారు.

ముఖ్యంగా రాజవాహన విజయం ప్రథమాశ్వాసంలో రమారమి 20 పద్యాలలో మూర్తికవి శ్రీవేంకటాద్రిప్రకృతి రామణీయకమును, శ్రీవేంకటేశ్వరవైభవాన్ని అత్యద్భుతంగా వర్ణించాడు.

మహత్తరమైన తిరుమలలో ఏ చెట్టును చూచినా సువాసనలను వెదజల్లేవే! ఏ రాయిని చూచినా అవి ఇంద్ర నీలమణులకు నమూనాలే! ఏ జంతువును కనుగొన్నా సింహ సదృశాలే. ఏ దొనను తిలకించినా గంగోదకమే. ఏ తీర్థాన్ని వీక్షించినా వృజినద్రుమ కుఠారమే. ఏ కొండ చరియను వీక్షించినా మణిమయమే. ఏ ఋషిని దర్శించినా భృగు మహర్షితో సమానులే, అని చెబుతూ –

**భోగముల కొండ అలవేల్పు పువ్వుదండ**
**పతితులకు బొండ పేదల పైడికుండ**
**తమము రేయెండ విబుధామృతపు టుండ**
**కొండమాత్రమె తిమ్మప్పడుండు కొండ (1-31)**

అని కవి వర్ణించడంలో తిరుమలకొండ ఎంతటి వైశిష్ట్యాన్ని పొందిందో తెలుస్తుంది.

17వ శతాబ్దపు కవులైన **టేకుమళ్ళ రంగశాయి వాణీ విలాస వనమాలికను, ఎఱ్ఱగుడిపాటి వెంకటకవి విష్ణుమాయా విలాసమును, గణపవరపు వేంకటకవి ప్రబంధరాజవిజయ వేంకటేశ్వరవిలాసమును, చిత్రకవి రమణకవి సాంబవిలా సమును,** 18వ శతాబ్దపు కవులైన **చల్లపల్లి వేంకనార్యుడు శ్రీకృష్ణవిలాసాన్ని, సిరిప్రెగ్గడ ధర్మనామాత్యుడు నలచరిత్ర మును, చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీవిలాసమును. కృష్ణకవి శకుంతలాపరిణయమును** స్వామి కంకితం చేశారు.

మరి కొందరుకవులు తమ కృతులకు స్వామినే నాయ కుని గావించారు. 16వ శతాబ్దానికి చెందిన **లింగమగుంట రామకవి వేంకటమాహాత్మ్యము** 18వ శతాబ్దానికి చెందిన **శ్రేష్ఠలూరి వేంకటార్యుడు శ్రీనివాసవిలాససేవధిని, వద్దిపర్తి కోనమరాజకవి వేంకటేశ్వరోపాఖ్యానము, దామెర చిన వెంకట కవి వేంకటాచలమాహాత్మ్యమును,** 19 వ శతాబ్దానికి చెందిన **తరిగొండ వెంగమాంబ 'వేంకటాచలమాహాత్మ్యము', చెళ్లపిళ్ల నరసకవి వేంకటేశ్వరవిలాసాన్ని** రచించారు.

శ్రీవేంకటేశ్వరస్వామివారిపై వెలువడిన ఉదాహరణ ములలో తాళ్లపాక పెదతిరుమలాచార్యుల 'వేంకటేశ్వ రోదాహరణము'. **కరుణశ్రీ** రచించిన **'శ్రీనివాసోదాహరణము'**, ప్రశంసింపదగిన ప్రశస్తరచనలు.

ఇంకా శ్రీవేంకటేశ్వరస్వామిని కావ్యాల్లోనే గాక యక్షగాన, నాటకాది సమస్త వాఙ్మయ ప్రక్రియల్లోనూ స్తుతించి, తరించిన మహనీయు లెందరో ఉన్నారు. ఆశ్రయించినవారిని ఆప్యాయంగా కొలచినవారికి కొంగుబంగారమై నిత్యశ్రీలకూ, నిత్యమంగళములకూ, ఆస్పదుడై శ్రీనివాసుడు విలసిల్లుతు న్నాడు.




కైలాసంలో పార్వతీదేవి, ఈశ్వరుని రాకను దేవాదులవల్ల విని సంతోషంతో అభ్యంగన స్నానమాచరిద్దా మని నలుగుపిండితో ఒక బాలుని చేసి, ప్రాణం పోసి ద్వారం దగ్గర కాపలాగా ఉంచింది. అంతలో పరమేశ్వరుడు వచ్చి లోపలికి పోతుండగా, ద్వారం దగ్గరున్న బాలుడు అడ్డగించాడు. తన తల్లి ఎవ్వరినీ లోపలికి రానీకుండా చూసుకోమన్న దని చెప్పాడు.

అప్పుడు శివుడు తాను పార్వతీదేవీపతి నని చెప్పి, తాను లోపలికి పోవుటకు అనుమతి నివ్వవలసిందిగా ఆదేశించాడు. అయినా ఆ బాలుడు తనతల్లిమాట జవదాట నని చెప్పాడు. అంత శివుడు కోపించి త్రిశూలంతో బాలునికంఠం నరికి లోని కెళ్ళాడు. పార్వతీదేవి బయటకు వచ్చి మరణించిన బాలుణ్ణి చూచి దుఃఖించింది. ఆ బాలుడిని బ్రతికించమని శివుడిని కోరింది. అప్పుడు శివుడు తన అనుచరులను పంపి ఉత్తరదిక్కున తల ఉంచి మరణించి ఉన్న ప్రాణియొక్క తలను తీసుకుర మ్మని ఆజ్ఞాపించాడు. శివునిఆజ్ఞానుసారం అనుచరులు ముల్లోకాలు వెతుకగా ఒక ఏనుగు ఉత్తరందిక్కుగా తలపెట్టుకొని మరణించి ఉంది. వారు ఆ ఏనుగు తలను తీసుకొనిపోయారు. అంతట శివుడు ఏనుగుయొక్క శిరస్సును బాలునికి అతికించి ప్రాణం పోశాడు. ఆ బాలునికి గజాననుడు అని నామకరణం చేశాడు.

పార్వతీ పరమేశ్వరులు ఆ బాలుణ్ణి ప్రేమతో పెంచుకోసాగారు. వినాయకుడు తల్లిదండ్రులను పరమభక్తితో సేవించేవాడు. అతని వాహనం అనింద్యుడు అనే ఎలుక. కొంత కాలానికి పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామి ఉదయించాడు. అతని వాహనం నెమలి.

ఒకరోజు దేవతలు, ఋషులు ఈశ్వరుని దగ్గరకు వచ్చి విఘ్నాధిపతిగా ఒకరిని నియమించమని కోరారు. అప్పుడు గజాననుడు తాను పెద్దవాడిని గనుక తనకే విఘ్నాధిపత్యం ఇవ్వమని కోరాడు. అప్పుడు కుమారస్వామికూడా విఘ్నాధిపత్యాన్ని తన కివ్వమని కోరాడు.

అప్పుడు శివుడు, ఇద్దరుకుమారులతో మీలో ఎవరు ముల్లోకాలలో గల పుణ్యనదుల్లో స్నానమాచరించి ముందుగా తన వద్దకు వస్తారో–వారికి విఘ్నాధిపత్యాన్ని ఇస్తా నని శివుడు చెప్పాడు. అందుకు కుమారస్వామి సమ్మతించి నెమలి ఎక్కి మూడులోకాల్ని ప్రదక్షిణచేయుటకు బయలుదేరాడు. అప్పుడు గజాననుడు శివునికి నమస్కరించి నా యొక్క అసమర్థతను ఎరిగి ఈ విధంగా ప్రయాణం చేయమని చెప్పడం తగునా? అని వేడుకొన్నాడు. ఆ సమయంలోనే కైలాసంకు వచ్చిన నారదుడు గజాననునితో "నాయనా! తల్లిదండ్రులకు నమస్కరించి, మూడుమార్లు ప్రదక్షిణం చేస్తే ముల్లోకాలు చుట్టివచ్చి నట్లవుతుం"దని ఉపాయం చెప్పాడు.



– వి.జగదీశ్వరి,
8వ తరగతి, D/o వి.శ్రీనివాస రెడ్డి,
ఫ్లాట్ నెం.403, బాసరా అపార్టుమెంట్స్,
చాణక్యపురి, 'ఏ' క్యాంప్, కర్నూలు.

వెంటనే గణేశుడు తల్లిదండ్రులకు నమస్కరించి, ప్రదక్షిణం చేయడం మొదలు పెట్టాడు ఆ పుణ్యకార్యంవల్ల గంగానదిలో స్నానం చేయడానికి వెళ్ళిన కుమారస్వామి అప్పటికే వినాయకుడు స్నానం ఆచరించి వెళ్ళడం కనిపించింది. అదే విధంగా ప్రతినదిలో స్నానమాచరించడానికి వెళ్ళినప్పుడు అంతకుముందే వినాయకుడు స్నానమాచరించి ఉండడం చూచి కుమారస్వామి ఆశ్చర్యపడ్డాడు.

కుమారస్వామి తనతల్లిదండ్రులవద్దకు రాగా అప్పటికే తల్లిదండ్రుల పాదాలచెంత వినాయకుడిని చూచి, తన ఓటమిని ఒప్పుకొని, వినాయకుడే గణాధిపత్యానికి అర్హు డని చెప్పాడు. అప్పటినుంచి గణపతినే విఘ్నాధిపతిగా సకలదేవతలు, మానవకోటి పూజిస్తున్నారు.

# సందేహాలు? సమాధానాలు!! - 'సాహితీ వాచస్పతి' మొవ్వ వృషాద్రిపతి

**అ) స్వామివారికి తోమాలసేవ అనగా నేమి? దాని ప్రాము ఖ్యత, ఎలా చేస్తారో వివరించండి?**

**ఆ) 'అష్టదళ పాదపద్మారాధన' అనగా నేమి? దాని విశిష్టత తెలపండి?** -ఎ. రమాదేవి, నిర్మల్.

☛అ) తో అంటే భుజం. తోమాల అంటే భుజాలయం దలం కరించే మాల యని అర్థం. తోమాలను, వివిధపుష్పాలతో వివిధవర్ణాలసమ్మేళనంగా చాలలావుగా కడతారు. ఏనుగు తొండంవలే పైని లావుగా, క్రిందకు పోయినకొద్దీ సన్నగా ఉండి, చాలా బరువుగా ఉంటుంది. దీనిని కంఠంలో వేయరు. రెండు భుజాలకు రెండు వైపుల వ్రేలాడునట్లు వేస్తారు. "అలం కారప్రియో విష్ణుః" విష్ణు వలంకారప్రియుడు కనుక ఇది స్వామివారి అలంకారప్రియత్వానికి నిదర్శనం.

**ఆ)** అష్టదళపాదపద్మారాధన స్వామివారికి ప్రతిమంగళ వారం చేయబడుతుంది. రెండవ అర్చనానంతరం దీనిని స్వామి కర్పిస్తారు. 1884వ సంవత్సరం తిరుపతి - తిరుమల దేవస్థానం గోల్డెన్‌జూబ్లీ ఉత్సవాలు నిర్వహించినప్పటినుండి ఈ పూజను ప్రారంభించారు. 108 బంగారు పద్మాలతో స్వామి వారిని అర్చిస్తారు. దీనికి మూలం; పూర్వం తొండమాన్ చక్రవర్తి స్వామివారిని ఎనిమిదిరేకులు గల బంగారుతామరపూలతో అనునిత్యం పూజించేవాడు. అన్నమాచార్యులవారికీర్తనలోని కుమ్మరదాసుడైన కురువరతినంబి, ప్రతినిత్యం కొన్ని కుండలు చేసి మిగిలిన మట్టితో పద్మాలు తయారుచేసి స్వామి పాదపద్మా రాధన చేసేవాడు. తొండమాన్ చక్రవర్తి చేసిన పూజయందలి బంగారుపద్మాలు జారిపోయి నంబిపూజాపుష్పాలు పైన నుండేవి. స్వామికి తా నర్పించే స్వర్ణపద్మాలకన్నా మట్టి తామర లెక్కువయ్యాయా? యని తొండమాన్ చక్రవర్తి కనుమానం వచ్చి చూడగా; కుమ్మరదాసుడు సమర్పించిన పద్మాలు వజ్రఖచిత దివ్యపద్మాలుగా గోచరించాయట! శ్రీనివాసుడు భక్తసులభు డన టాని కింతకన్న వేరు సాక్ష్య మింకేం కావాలి? ఇదియే ఈ పూజావిధాన మేర్పడటానికి కారణమై యుంటుంది.

**సనత్సుజాతుడు, యువనాశ్వుడు, వృషాదర్భి, ప్రసేనజిత్తు లను గురించి వివరించండి?** - మల్లిఖార్జున, గుత్తి.

☛ సనత్సుజాతుడు బ్రహ్మమానసపుత్రులలో ఒకడు. సృష్టి చేయుటకు బ్రహ్మతపస్సు చేసి "సన" అని పలికెనట. అందుండి సనకుడు-సనందనుడు- సనత్సుజాతుడు- సనత్కుమారుడు పుట్టారు. వీ రెల్లప్పుడు కౌమారమునందే యుంటారు.

యువనాశ్వుడు ప్రసేనజిత్తు కుమారుడు. చాలాకాలం పుత్రులు లేక భృగుమహర్షితో పుత్రకామేష్టిని చేయించాడు. భృగుమహర్షి సంతానప్రదంగా జలము నభిమంత్రించి, ఒక పాత్రయందు భద్రపరచి, దాన్ని యువనాశ్వునిభార్యచే త్రాగింపవలె నని తలంచాడు. అర్ధరాత్రిసమయంలో యువ నాశ్వునకు దాహమైంది. అందరూ నిద్రిస్తుండగా, ఒక పాత్రలో జలం కన్పించగా, అతడు ఆ జలం త్రాగేశాడు. ఉదయ కాలమున భృగువు ఆజలపాత్రకై వెదకుచుండగా ఆ నీటిని నేనే త్రాగా నని రాజు చెప్పగా; దైవేచ్ఛ యిట్లున్నది. నీ భార్యకు బదులు నీవు పానంచేసితివి గనుక, నీవే గర్భమును దాల్చెద వని భృగువు చెప్పాడు. యువనాశ్వుడు గర్భం ధరించాడు. ఆతనిపొట్ట చీల్చుకొని శిశువు బయటకు వచ్చాడు. అతడే మాంధాత. వెంటనే ఇంద్రుడువచ్చి ఆ శిశువుకు తన కుడిచేయి బొటనవ్రేలు నోట పెట్టి పానం చేయించాడు.

వృషాదర్భి ఒక రాజు. ఒకసారి కరవుకాటకాలొచ్చాయి. ఎవ్వరికీ ఆహారం లభించటం లేదు. సప్తర్షులు - అరుంధతి కూడా ఆహారంకోసం అలమటిస్తున్నారు. ఆజ్యుని కుమారుడు నీలు డనువాని శవాన్ని కాల్చుతుండగా; ఆ కాలుతున్న శవాన్ని భక్షింపవలె నని సప్తర్షులు, అనసూయ వచ్చారు. వృషాదర్భి మీకు కావలసినంత ఆహారమిస్తా నని వారి నాహ్వానించాడు. రాజులనుండి ఆహారాన్ని మేము స్వీకరింప మని వారు బదులిచ్చారు. రాజు కొన్నిపండ్లు కృత్రిమంగా తయారు చేయించి, వానిని బంగారుతో నింపి, మంత్రిద్వారా వారికి పంపించాడు. వారు వాటినికూడా తిరస్కరించారు. ఆతడు కోపంతో ఋత్విక్కులను పిలిపించి అభిచారికయజ్ఞం చేయిం చాడు. అందుండి ఒక కృత్తి జన్మించింది. ఆ కృత్తి వారి దగ్గరకు పోవుసరికి వారు శునస్సఖుడనే వానితో కలిసి తామరతూడు లేరుకొనుచుండగా; ఆ కృత్తికను శునస్సఖుడు చంపేశాడు. ఈ

గందరగోళంలో తామరతూడులు కన్పించలేదు. ఏమైనవాయని వెదకుచుండగా శునస్సఖుడు తా నింద్రుడ నని చెప్పి వారిని తనతో పాటు ఇంద్రలోకానికి తీసుకుపోయాడు.

ప్రసేనజిత్తులు ముగ్గు రున్నారు. 1)కృతాశ్వునికొడుకు. ఇతనికొడుకే యువనాశ్వుడు 2) రేణుకాదేవిజనకుడు. జమదగ్ని మహర్షికి మామగారు. 3) సత్రాజిత్తు తమ్ముడు. ఈతడు శ్యమంతకరత్నా న్నలంకరించుకొని వేటకుపోయాడు. అదేదో మాంసఖండ మని భ్రమించి ఒకసింహ మాతనిని చంపి ఆ రత్నా న్నెత్తుకొని పోవుచుండగా; జాంబవంతుడు ఆ సింహాన్ని చంపి, ఆ రత్నాన్ని తీసుకుపోయి కుమార్తెయగు జాంబవతి కిచ్చాడు.

**అ) విష్ణువు ఈశ్వరుడు ఒకరే నన్నపుడు ఇద్దరు దేవతా రూపా లెందుకు?**

**ఆ) నారద జన్మవృత్తాంతం తెలియజేయండి?**

**-వాస్తు రామచంద్ర, నెల్లూరు.**

☛ **అ)** శివవిష్ణువు లొకరే! శివునిహృదయం విష్ణువు. విష్ణువు యొక్కభావం శివుడు. **"శ్రీ యన గౌరినా బరగు చెల్వకు చిత్తము పల్లవింప"** అనే పద్యంలో తిక్కన హరిహరు లిద్దరూ ఒక్కరే నన్నాడు.

**కి మస్తిమాలాం-కిము కౌస్తు భంవా, పరిష్క్రియాయాం బహుమన్యసే త్వం**
**కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యం తవ స్వాదు వద ప్రభో మే ॥**

"స్వామీ! నీకు ఎముకల దండ ధరించట మిష్టమా? కౌస్తుభ రత్నం ధరించటమిష్టమా? కాలకూటం త్రాగటమిష్టమా? లేక యశోద చనుబాలు త్రాగటమిష్టమా?" అంటే రెండూ నొక్కటేనని దీని అర్థం. దీనినే శ్రుతి **"ఏకంసత్ విప్రాః బహుధావదంతి"** అని చెప్పింది. పరమాత్మ ఒక్కటే. దానిని వేదవిదులైనవారు భిన్నంగా చెబుతున్నారు. ఇది రుచిభేదంవల్ల భిన్నంగా చెప్ప బడింది. హరిహరనాథతత్త్వం చాల ప్రసిద్ధం కదా!

**ఆ)** ఇక మీరడిగిన నారదవృత్తాంతం, వరాహపురాణం–భాగవతం– భారతం–మార్కండేయపురాణం–దేవీభాగవతం – లింగపురాణాలలో నున్నది. ఆయన జన్మవృత్తాంతంలో స్వల్ప భేదా లున్నాయి. భాగవతంప్రకారం నారదుడు పూర్వమహా కల్పంలో ఉపబర్హణు డను గంధర్వుడు. బ్రహ్మ, 'దేవసత్ర' మనే యజ్ఞం చేస్తుండగా; అప్సరసలు, గంధర్వులు నారాయణ కథాగానం చేస్తూండగా; నారదుడు వారితో కలిసి నారాయణ గానం చేయక, కామినీస్త్రీలతో కలిసి తిరుగుతుండగా విశ్వ స్రష్టలు అది చూచి నీవు శూద్రయోనియందు పుట్టుదువుకాక యని శపించారు. ఆ తర్వాతి జన్మలో వేదవిదుల ఇంటిలో పని చేయుచున్న దాసికి నారదుడు జన్మించాడు. ఆ వేదవిదుల ఇంటిలో మహర్షులు చాతుర్మాస్యవ్రతదీక్ష చేస్తుండగా; బాలుడుగా నున్న నారదుడు వారి ననేకరీతుల సేవించాడు. వారివల్లనే ఆతనికి కొంత బ్రహ్మజ్ఞానం కలిగింది.

**అ) ఏడుకొండలస్వామికి సప్త (ఏడు)ర్షులకు ఏదైన సంబంధ మున్నదా? ఏడుకొండలపేర్లను తెలపండి?**

**ఆ) భృగుమహర్షి అకారణంగా విష్ణుమూర్తిని ఎందుకు తన్నాడు? అందుకు శిక్ష నేమైనా అనుభవించాడా?**

**-స్వామిరమానందస్వామి, పొదలకొండపల్లె.**

☛ **అ)** సప్తర్షులు ఏ తత్త్వాన్ని తమ మనస్సులలో నిక్షేపించి, ఎవనిఅనుగ్రహంకోసం తపస్సు చేస్తున్నారో ఆ తత్త్వమే ఏడు కొండలస్వామి. సాధకులకు పరమాత్మతో నున్న సంబంధమే వారిమధ్య నున్నది. 1) అంజనాద్రి 2) వృషాద్రి 3) వృషభాద్రి 4) గరుడాద్రి 5)వేంకటాద్రి 6) నారాయణాద్రి 7) శేషాద్రి.

**ఆ)** నైమిశారణ్యంలో తపస్సు చేసే మహర్షులకు, ఈ యజ్ఞ కర్త– ఫలప్రదాత ఎవ్వ రనే అనుమానాన్ని రగిల్చినాడు నారదుడు. ఆ విషయాన్ని నిర్ణయించటానికి భృగుమహర్షిని ప్రార్థించారు. ఆయన సత్యలోకానికి పోయి సరస్వతీ పరిష్వంగంలో ఆనందిస్తున్న బ్రహ్మను నీకు లోకంలో పూజలే కుండుగాక. నీవు రజోగుణప్రధానుడ వని కైలాసాని కెళ్ళాడు. అక్కడ తాండవక్రియామగ్నుడైన శంకరుని చూచి, "నీవు తమోగుణభూయిష్ఠుడవు గాన నీకు ఆకారపూజ లేకుండుగాక! లింగపూజను పొందు"మని శపించాడు. శివుడు ఫాలనేత్రం తెరిచాడు. భృగువు తన అరికాలిలో ఉన్న కంటిని దాని కెదురుంచాడు. శివఫాలాగ్ని ఆయన నేమీ చేయలేకపోయింది. ఆ కోపంతో వైకుంఠాని కెళ్ళాడు. లక్ష్మిని వక్షస్థలమునం దుంచు కొని వినోదిస్తున్న విష్ణువును చూచి కోపంపట్టలేక వక్షస్థలంలో కఠినంగా తన్నాడు. వెంటనే విష్ణువు ఆయన్ను అనేకవిధాల గౌరవమర్యాదలతో ఆదరించి, ఆయన పాదసంవాహనం చేస్తూ అరికాలిలోని కంటిని చిదిమివైచాడు. అదియే శిక్ష. విష్ణువే సత్త్వస్వరూపు డని, ఆయనయే యజ్ఞకర్త – యజ్ఞఫలప్రదాత యని మునులకు చెప్పాడు.

# వరాహపురాణం -
# శ్రీ వేంకటాచల మాహాత్మ్యం

డా॥ డి. భారతి

శ్రీ వేంకటాచలం వేదకాలంనుంచి పరమపావన క్షేత్రంగా ప్రఖ్యాతిగాంచిన దివ్యస్థలం. కలియుగం ప్రారంభం కాకముందే పరమాత్ముడు జీవకోటి నుద్ధరించడానికై ఈ కొండమీద నెలకొన్నట్లు పురాణాలు ఘోషిస్తున్నాయి. కలియుగంలో వేంకటాచలం పరమప్రశస్తమైన పుణ్యక్షేత్రం. దానిమహిమ వింటే చాలు – సకలశుభాలు సమకూరుతాయి. అసలు వేంకటాద్రి అనే పదానికి అర్థం 'వేం' అంటే పాపము లను, 'కటము' దహింపచేయునది అని కదా!

శ్రీ వేంకటాచలమాహాత్మ్యము అనేకపురాణాలనుండి సంగ్రహింపబడినప్పటికీ వరాహపురాణం దాన్ని విస్తరంగా అభివర్ణించినట్లు తెలుస్తున్నది. వరాహపురాణం వేంకటాచల మాహాత్మ్యమును పేర్కొన్న తీరు అనన్యసాధారణం.

వరాహపురాణం మహాపురాణాలలోనిది. ఈ పురాణంలో 40 అధ్యాయాలలో శ్రీ వేంకటాచలమాహాత్మ్యం ఎంతో చక్కగా వర్ణించబడినది. ఈ పురాణమునందు 218 అధ్యాయాలు, 24,000 శ్లోకా లున్నట్లు తెలుస్తున్నది. వేంకటాచలమాహా త్మ్యమును ఎక్కువ అధ్యాయాలలో వర్ణించిన పురాణం వరాహ పురాణం మాత్రమే.

## శ్వేతవరాహ వృత్తాంతం

సృష్టి, స్థితి, లయకారకుడైన శ్రీమన్నారాయణుడు భూమి నుద్ధరింపగోరి శ్వేతవరాహరూపంతో పాతాళమును ప్రవేశించి హిరణ్యాక్షునితో యుద్ధం చేసి, అతనిని సంహరించాడు. కొంత కాలము భూమిపై నివసింపగోరినవాడై వైకుంఠమునుండి గరుడునిద్వారా క్రీడాద్రిని భూమికి తెప్పించాడు. ఈ క్రీడాద్రికే "వేంకటాద్రి" అని పేరు. ఈ క్రీడాద్రియందలి "క్రీడావాపి"యే స్వామిపుష్కరిణిగా ప్రసిద్ధి చెందింది. వేంకటాద్రిపైన భగ వంతుడు నివసించుటచే దానికి అనల్పమగు మహిమ కలి గింది.

వేంకటాచలం గోమతీనదికి దక్షిణాన అరవైయోజనాల దూరంలో, తూర్పుసముద్రానికి పశ్చిమాన ఐదుయోజనాల దూరంలో, సువర్ణముఖీనదికి ఉత్తరభాగంలో గరుడునిచే స్థాపించబడినట్లు వరాహపురాణం పేర్కొంటున్నది.

వరాహపురాణంలో ఈ పర్వతం ఇలా ప్రసిద్ధమైనట్లు చెప్పబడింది.

కృతయుగంలో అంజనాద్రి అనీ, త్రేతాయుగంలో నారా యణాద్రి అనీ, ద్వాపరయుగంలో సింహాద్రి అని, కలియుగ మున శ్రీవేంకటాచల మని ప్రసిద్ధినొందింది.

పరమపవిత్రమైన వేంకటాచలంలో అనేక తీర్థాలు ఏర్పడి నవి. అవి ఎంతో ప్రభావ సంపన్నములై మానవులయొక్క అనేక జన్మల పాపాలను పోగొట్టుటకు సమర్థమైనవిగా కీర్తింపబడినవి. ప్రతి తీర్థమునకు ఏదో ఒక ఇతిహాససంబంధంకూడ ఉన్నట్లు వేంకటాచలమాహాత్మ్యం వివరిస్తున్నది.

వరాహపురాణంలోని ప్రథమభాగంలో 33వ అధ్యాయం నుండి 63వ అధ్యాయం వరకు గల 30 అధ్యాయాలు వేంకటా చలాన్ని, దాని వైభవాన్ని, శ్రీనివాసునివృత్తాంతాన్ని వివరిస్తున్నవి. వరాహపురాణంలోని ద్వితీయభాగంలో మొదటి అధ్యాయం నుండీ 10వ అధ్యాయంవరకూ గల 10 అధ్యాయాలలో కూడా వేంకటాచలమాహాత్మ్యము వర్ణింపబడింది.

### ఎందుకు తలనీలాలు సమర్పించడం?

**తీర్థోపవాసః కర్తవ్యః శిరసో ముండనం తథా ।**
**శిరోగతాని పాపాని యాన్తి ముండనతో యతః ॥**

**(పద్మపురాణం 237.45)**

తీర్థక్షేత్రంలో ఉపవాసం చెయ్యాలి. తల నీలాలు తీయించుకోవాలి. అలా తలనీలాలు తీయించుకుంటే శిరస్సులో ఉన్న పాపాలు నశించి పోతాయి. అహంకారం తగ్గిపోయి, అశాశ్వతమైన శరీరంపైన మమకారం తగ్గిపోతుంది.

## వికలాంగులకు
### ప్రత్యేక ప్రవేశం

- మానసిక లేదా శారీరక లోపం గల వికలాంగులు అయిన భక్తులను మహాద్వారం వద్ద గల ప్రత్యేక ద్వారం ద్వారా శ్రీవారి దర్శనానికి అనుమతిస్తారు.
- తమ వెంట ఉన్న సహాయకులలో ఒకరిని వీరితో పాటు అనుమతిస్తారు.
- వీరికి లడ్డూ కూపనుకూడా మహాద్వారంవద్దే ఇస్తారు.
- వీరి కోసం ప్రత్యేకంగా నిర్మించిన హాల్లో ఉండాలి. అక్కడ తెలిపిన దర్శనం వేళల్లోనే లోనికి అను మతిస్తారు.
- రాంబగీచా అతిథిగృహాల నుంచి శ్రీవారిఆలయం వరకు **ఉచితంగా** వీరిని చేరవేసేందుకు తిరుమల తిరుపతి దేవస్థానం బ్యాటరీకారుసౌకర్యం ఏర్పాటు చేసింది.

### స్వామిపుష్కరిణి

వేంకటాచలమందున్న స్వామిపుష్కరిణి మానవనిర్మితం కాదు. అది స్వయంవ్యక్త క్షేత్రం గనుక అచ్చటి పుష్కరిణి కూడా స్వయంవ్యక్తమైనది.

స్వామిపుష్కరిణి అనే ప్రసిద్ధి ఈ ఒక్క పుష్కరిణికే ఏర్పడింది. ఈ పుష్కరిణిని వరాహ-పద్మ-మార్కండేయ-వామన-స్కాంద-బ్రహ్మ-భవిష్యోత్తరపురాణాలు అభివర్ణించు చున్నవి. వేంకటాద్రియందున్న మూడుకోట్లతీర్థాలకు స్వామి పుష్కరిణి అవతారస్థాన మని ప్రసిద్ధికలదు. స్వామిపుష్కరిణి ఆవిర్భావంగూర్చి వరాహపురాణ మిట్లు చెప్పుచున్నది.

శ్వేతవరాహరూపంలో భూమిని ఉద్ధరించిన విష్ణువు ఆదే శానుసారం వైకుంఠంనుండీ క్రీడావాపిని గరుడుడు భూలోకా నికి తీసికొనివచ్చెను. ఇది గంగాదిసర్వతీర్థాలకు ఉత్పత్తిస్థాన మని శ్రీనివాసుడు వేంకటాద్రిపై అవతరించక ముందే స్వామి పుష్కరిణి అచ్చట ఆవిర్భవించిం దని వరాహపురాణం ప్రతిపాది స్తున్నది. ఇతర పురాణాల్లో స్వామిపుష్కరిణి మాహాత్మ్యము వర్ణింపబడిందేకానీ వేంకటాచలమున పుష్కరిణి ఎట్లు ఎప్పు డావిర్భవించిందీ చెప్పలేదు.

గంగాదిసర్వతీర్థాలకు నిలయమైన స్వామిపుష్కరిణిలో స్నానం చేయుటవల్ల శంఖణుడు అనేరాజు పోయిన రాజ్యాన్ని తిరిగిపొందినట్లు, దశరథుడు వసిష్ఠుని ఆజ్ఞానుసారం వేంకటా చలమున స్వామిపుష్కరిణిలో స్నానమొనర్చి శ్రీరామాదులను పుత్రులుగా పొందినట్లును, శ్రీరామచంద్రుడు రావణుడు ఎత్తుకు పోయిన సీతను - స్వామిపుష్కరిణిలో స్నానమొనర్చి తిరిగిపొంది నట్లు, వరాహపురాణం నిరూపిస్తున్నది.

### శ్రీవేంకటేశ్వరబ్రహ్మోత్సవవైభవం

ఒకానొకప్పుడు వేంకటాచలమందు అర్చామూర్తి శ్రీని వాసుని దర్శించుటకు బ్రహ్మదేవుడు సపరివారంగా వచ్చెను. ఆయన కొంతకాలం భగవంతుని సేవిస్తూ అచ్చటే ఉండెను. తరువాత శ్రీనివాసుని అనుజ్ఞను తీసికొని బ్రహ్మ, వేంకటాద్రి యందు బ్రహ్మోత్సవం చేయ నారంభించెను.

సౌరమానా న్ననుసరించి సూర్యుడు కన్యారాశిలో ప్రవే శించినకాలం కన్యామాసమందురు. ఆ కన్యామాసంలో ధ్వజా రోహణం చేస్తారు.

ఈ బ్రహ్మోత్సవానికి దేవలోకంనుండీ దేవతలను, కాశ్మీ రాదిదేశాధీశులను ఆహ్వానించి, బ్రహ్మోత్సవమును చాలా విశిష్టంగా నిర్వహించెను. శ్రీవేంకటేశ్వరుని సన్నిధికి పోవు మార్గమంతా అలంకరించబడింది. బ్రహ్మఆజ్ఞ ననుసరించి విశ్వకర్మ వేంకటాచలమున అన్నశాలలను, నివాసభవనాలను, వేంకటాచలమునకు చుట్టుప్రక్కల మనోజ్ఞములైన పురాలను, ఆ పురాలల్లో పుణ్యవీథులను ఏర్పాటు చేసెను. భక్తులందరకు అన్నవస్త్రపానీయాదులను ఎందరో ధార్మికులు ఇచ్చారు. గంధర్వ, అప్సరసగణాలు - వాద్యములు మ్రోగగా, సంగీతం నిర్వహించారు. శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవము "నభూతో

నభవిష్యతి”గా బ్రహ్మదేవుడు నిర్వహించాడు. ఉత్సవసమయాల్లో అన్నప్రసాదాలు, పూలు, వివిధఫలాలు భగవంతునికి నివే దించారు.

ఉత్సవసమయమందు శ్రీ, భూదేవులు వెంటరాగా శ్రీ వేంకటేశ్వరుడు సమస్త వాద్యఘోషములతో, ఛత్రచామరాలు, నృత్యగీతవాద్యాలతో, కవులు, గాయకులు, వేదపండితులు వెంటరాగా గుఱ్ఱాలను, ఏనుగులను అధిష్ఠించి రాజవీథుల్లో ఊరేగింపుగా వెళ్ళెను. ప్రతిదినం వైఖానస ఆగమశాస్త్రవిధి నను సరించి యాగశాలలో హోమం, బలిహరణం మొదలైన వైదిక క్రియ లన్నీ జరుగును. బ్రహ్మోత్సవమైనతర్వాత వేంకటేశ్వరుడు బ్రహ్మను పిలిచి “నీవు భక్తితో నిర్వహించిన ఈ బ్రహ్మోత్సవము నా కెంతో తృప్తిని కల్గించింది. ప్రతిసంవత్సరము కన్యా మాసంలో బ్రహ్మోత్సవాన్ని ఇట్లు నిర్వహించినవారు బ్రహ్మ లోకాన్ని పొందుదురు” అని వరమిచ్చెను.

బ్రహ్మోత్సవం మొట్టమొదట కల్పారంభంలో బ్రహ్మ, దేవునిచే ఆచరింపబడి, ఇప్పటికీ ప్రతిసంవత్సరం బ్రహ్మోత్సవం జరుగుతున్నది.

## వరాహపురాణమునందలి స్తోత్రములు

వరాహపురాణమందలి ప్రథమ, ద్వితీయభాగాలలో ప్రధానమైన స్తోత్రములు పది కనపడుతున్నాయి. అందు ముఖ్యంగా బ్రహ్మాదులు, అగస్త్యాదిమహర్షులు, ఇంద్రాదులు సనకాదిమహర్షులు, అనేక సందర్భములలో భగవంతునిగూర్చి చేసినస్తోత్రములు దొరుకుతున్నవి. అలాగే ఈ రోజుకి శ్రీ వేంకటేశ్వరుని ఆరాధనయందు భక్తులచే ఉపయోగింపబడు అష్టోత్తరశతనామస్తోత్రం, ధరణీకృతవరాహస్తుతి, లక్ష్మీస్తుతి ఉన్నవి.

## పద్మావతిజననం

ఆకాశరాజు నారాయణపురాన్ని రాజధానిగా చేసికొని రాజ్యాన్ని బాగా విస్తరింపజేసి సార్వభౌము డని ప్రసిద్ధిగాంచెను. ఒకప్పుడు ఆకాశరాజు యజ్ఞము నాచరింపదలచి ఆరణీనదీ తీరంలో బంగారునాగలితో కర్షణము చేయిస్తూ తాను

## తిరుమలలో చూడవలసిన ప్రదేశాలు

### స్వామి పుష్కరిణి

ఈ కోనేరు తిరుమల గుడికి ప్రక్కనే ఉంది. భక్తులు గుడిలో ప్రవేశించే ముందుగా పవిత్రమైన పుష్కరిణిలో స్నానం చేస్తారు. ఇందులో స్నానం చేస్తే శరీరంతో పాటు మనస్సు కూడా పరిశుద్ధమౌవుతుంది.

### ఆకాశగంగ

ఈ జలపాతం ఆలయానికి ఉత్తరదిశగా 5 కి.మీ. దూరంలో ఉంది.

### పాపవినాశనం

ఈ తీర్థం గుడికి ఉత్తర దిశగా 5 కి.మీ.దూరంలో ఉంది.

### వైకుంఠతీర్థం

ఈ తీర్థం గుడికి ఉత్తర దిశగా 5 కి.మీ.దూరంలో ఉంది.

### తుంబురుతీర్థం

ఇది గుడికి ఉత్తరంగా 16 కి.మీ. దూరంలో ఉంది.

### శిలాతోరణం

భౌగోళిక పరిణామంతో సహజ సిద్ధంగా ఏర్పడిన శిలా తోరణం, గుడికి ఉత్తరంగా ఒక కిలోమీటరు దూరంలో ఉంది.

### తి.తి.దే ఉద్యానవనాలు

దేవస్థానం వారు తిరుమలకు శోభాయమానమైన ఉద్యాన వనాలను పెంచుతున్నారు. ఇందులో అపురూపమైన మొక్కలు, వృక్షాలు అభివృద్ధి చెందుతున్నాయి.

### ఆస్థానమండపం

హిందూ ధర్మప్రచార పరిషత్తువారి ఆధ్వర్యంలో నిర్వ హింపబడే ధార్మిక ఉపన్యాసాలకు, హరికథ, సంగీత భజన కార్యక్రమాలకు వేదికగా ఉపయోగపడుతున్న సభామండపం.

### శ్రీ వేంకటేశ్వర ధ్యాన జ్ఞానమందిరం (ఎస్.వి. మ్యూజియం)

అపురూపమైన పురావస్తు ప్రదర్శనతోపాటు– చిత్ర, శిల్ప కళారూపాలకు, ధ్యానానికి కేంద్రంగా భక్తులను ఆకట్టుకుంటు న్నది. తిరుమల ఎస్.వి. మ్యూజియంవద్ద ధ్యాన కేంద్రాలలో భక్తులు భగవంతుడిని ధ్యానిస్తూ, మానసిక ఒత్తిడులను తగ్గించుకోవచ్చు.

## సరియైన గుర్తింపు!

తిరుమల శ్రీవారిభక్తులు ముందుగా వసతి సౌకర్యాలను మరియు సేవలను రిజర్వేషన్ చేసుకో దలచినవారు మనియార్డర్‌ల ద్వారా నగదును పంపు తున్నారు. అయితే, సరియైన గుర్తింపు లేనికారణంగా ఎ.ఇ.ఓ.(ఆర్.ఓ.-1, ఆర్.ఓ.-2) మరియు పేష్కార్ వారు మనియార్డర్లను తిరస్కరిస్తున్నారు.

అందువల్ల భక్తులు తమవసతికోసం ఇండి యన్ పోస్టలార్డరును మరియు సరియైన గుర్తింపుతో ఒక విన్నపాన్ని స్పీడ్‌పోస్టు ద్వారా పంపినట్లైతే వసతిని రిజర్వు చేయడానికి సులభంగా ఉంటుంది.

ఇండియన్ పోస్టలార్డరు రూ.100/-లకు కేవలం రూ.10/-ల కమీషన్‌తో సులభంగా పొందవచ్చు. ఈ సౌకర్యాన్ని భక్తులు విరివిగా ఉపయోగించుకో గల రని పోస్టుమాస్టరు, గ్రేడ్-1, తిరుమలవారు తెలియజేస్తున్నారు.

నవధాన్యములు చల్లుచుండెను. ఇంతలో ఆశ్చర్యంగా పద్మ శయ్యపై పరుండి బంగారు బొమ్మవలే ఉన్న బాలిక ఆ భూమిపై కనపడెను. అంతలో అశరీరవాణి ఇలా పలికింది - "ఈ బిడ్డ నీది, ఈమెను నీవు పెంచుము"-అని. ఆకాశరాజు సంతోషపడి తన భార్య అయిన ధరణీదేవి కిచ్చి ఆకాశవాణిమాటలు చెప్పి జాగ్రత్తగా పెంచు మని చెప్పెను.

ఆకాశరాజు పుత్రికయగు పద్మావతి పెరిగిపెద్దదై వింత శోభతో ప్రకాశించుచుండెను. పద్మావతి చెలికత్తెలతో కలసి ఉద్యానవనమునకు పూలుకోయుటకు వెళ్ళింది. అంతలో అచ్చటికి ఒక మదపుటేనుగు వచ్చింది. దానిని చూచి భయంతో అందరూ ఒక చెట్టుచాటున దాగిరి. ఆ సమయంలో స్వచ్ఛమైన అశ్వము నధిరోహించి పద్మదళాలవంటి కన్నులు కలిగి, పట్టు వస్త్రాన్ని ధరించి, బంగారుబాణాన్ని ధరించి, దివ్యసుందర విగ్రహుడైన శ్రీనివాసుడు అచ్చటికి వచ్చెను. ఆ మదపుటేనుగు శ్రీనివాసునికి నమస్కరించి, అడవిలోనికి వెళ్ళిపోయెను.

అప్పుడు శ్రీనివాసుడు పద్మావతిని చూచి "ఈమె ఎవరు? సమాధానము చెప్పినచో నేను వెళ్ళుదును" అనెను. అంతట చెలికత్తెలు "ఈమె ఆకాశరాజు, ధరణీదేవి పుత్రిక అని చెప్పు దురు. నిన్ను ఆకాశరాజుచూచినచో కారాగారమున బంధిం చును. కనుక ఇచ్చటనుండి త్వరగా వెళ్ళుము" అనిరి. శ్రీని వాసుడు వేంకటాద్రికి వెళ్ళిపోయాడు.

వేంకటగిరికి వెళ్ళిన శ్రీనివాసుడు ముక్తాగృహాన్ని చేరి నవరత్నాలతో చేసిన ఊయలయందు శయనించి పద్మావతిని స్మరించుచు మోహమునందెను. శ్రీనివాసుని అవస్థకు కారణం తెలియని వకుళమాలిక మధ్యాహ్న సమయంలో రుచికరములైన వివిధాన్నాలను, మధురములగు భక్ష్యములను తీసికొని ఆయన మందిరానికి వెళ్ళెను. అప్పుడు వకుళమాలిక శ్రీనివాసుని అవస్థకు కారణమేమి? అని అడిగెను. శ్రీనివాసుడు పద్మావతిని చూచి మోహపీడితుడైన విషయం వకుళమాలికతో చెప్పెను. పద్మావతితో వివాహం జరిపించ మని వకుళమాలికను అడుగు తాడు. అప్పుడు వకుళమాలిక శ్రీనివాసునిద్వారా నారాయణ పురానికి మార్గము తెలిసికొని, ఆకాశరాజు రాజధానియగు నారాయణపురమునకు వెళ్ళెను. పద్మావతి చెలికత్తెలలో అంతః పురంలోగల ధరణీదేవిని దర్శించెను. ధరణీదేవి వకుళమాలికను "మీ రెచ్చటనుండి ఏపనిమీద వచ్చితిరి?" అని అడిగెను. వకుళమాలిక తనను తాను పరిచయం చేసుకొని ఉద్యాన వనంలో మృగయావిహారంలో జరిగిన పద్మావతీ శ్రీనివాసుల కలయికగూర్చి వివరంగా చెప్పింది.

### పద్మావతీశ్రీనివాసుల వివాహం

ఇది విన్న ఆకాశరాజు తాను "ధన్యుడ నైతి"నని భావించి బృహస్పతిని రప్పించి వధూవరుల జన్మనక్షత్రాలు చెప్పి, నక్షత్రమునకు తగిన వివాహముహూర్తం నిర్ణయించ మని కోరెను. బృహస్పతి-ఇద్దరికి ఉత్తరఫల్గునీనక్షత్రం మంచి దని, వైశాఖమాసంలో వివాహం జరిపించ మని చెప్పెను. తరువాత బృహస్పతిని దేవలోకానికి పంపి వైశాఖమాసంలో ఉత్తరఫల్గునీ

నక్షత్రంలో వివాహ మని పద్మావతి పెంపుడు చిలుకను వకుళమాలికతోకూడా శ్రీనివాసుని దగ్గరకు పంపెను.

వకుళమాలిక నారాయణపురాన్ని చేరకముందే అచ్చటికి ఒక పురంధ్రి వచ్చెను. ఆమె ధరణీదేవితో నీ కూతురునకు ఒక దివ్యపురుషునితో వివాహం జరుగుతుం దని చెప్పెను. శ్రీని వాసుడు తన అంగీకారాన్ని, పుష్పమాలను శుకునిద్వారా పద్మావతికి పంపెను. ఆ శుభవార్తను పద్మావతికి చెప్పి, ఆ పూలమాలను ఆమెకు సమర్పించెను. ఆకాశరాజు విశ్వకర్మను ఆహ్వానించి పురముయొక్క అలంకారము అప్పగించెను. ఇంద్రుడు పుష్పవృష్టిని గురిపించెను. అప్సరసలు నృత్యాలు చేసిరి. కుబేరుడు కోశాగారము నింపెను. ఆకాశరాజు సపరివారంగా వచ్చి శ్రీనివాసునకు స్వాగతమొనర్చి వివాహ మండపానికి తీసికొనిపోయి కన్యాదానము, మాంగల్యధారణ, హోమాదులను చేయించి, మంగళవాద్యములతో చతురంగ బలంతో వృషభాద్రికి తనకూతురిని అల్లునితో పంపెను. ఆకాశరాజు ప్రేమాదరాలకు మెచ్చిన శ్రీనివాసుడు ఒక వరము కోరుకొ మ్మని చెప్పెను. అంతట ఆకాశరాజు "నీయందు భక్తిని, ఎల్లప్పుడు నీ సేవచేసుకొను అదృష్టము నా కనుగ్రహించు"మని కోరుకొనెను. శ్రీనివాసుడు అట్లే ఆకాశరాజు ననుగ్రహించెను.

### తొండమానుచక్రవర్తి వృత్తాంతం

శ్రీవేంకటేశ్వరుని ఆజ్ఞచే 100 సంవత్సరాలు అనన్య భక్తితో ఆయనను సేవించిన రంగదాసు తిరిగి చంద్రవంశంలో సువీరు డనే మహారాజుకు నందినికి తొండమానుడుగా జన్మిం చెను. ఇతడు విష్ణుభక్తిపరాయణుడు. పాండ్యరాజపుత్రిక అగు పద్మను వివాహం చేసికొనెను. ఒకనాడు తొండమానుడు తండ్రి అనుమతి తీసికొని, వేంకటాద్రికి దగ్గరప్రదేశానికి వేటకు వెళ్ళెను. ఆ అడవిలో ఒక మదపుటేనుగును చూచి, దానిని పట్టుకొనుటకు ప్రయత్నముచేయుచు, సువర్ణముఖరీనదిని దాటి చాలాదూరము వెళ్ళెను. అచ్చట వల్మీకాకారమున నున్న రేణుకాదేవిని దర్శించెను. తిరిగి వెళ్ళేటప్పుడు పంచవర్ణముగల చిలుకను చూచి, దానివెంటపడగా ఆ చిలుక "శ్రీనివాసా!" అంటూ వేగముగా వేంకటాద్రిని చేరెను. దానివెనుకే తొండ మానుడుకూడా వేంకటాద్రికి వెళ్ళెను. ఆ చిలుక కనపడలేదు. అచ్చటనున్న వనపాలుని ఆ చిలుకగూర్చి అడిగెను. అంతట అతను "అది శ్రీనివాసునకు ఇష్టమైనది అని, అది స్వామి పుష్కరిణీ తీరంలో ఉండు నని, దాన్ని ఎవ్వరూ పట్టుకోలే రని చెప్పి నేను స్వామి దర్శనంకోసం వెళ్ళుచున్నాను" అని చెప్పెను.

తొండమానుడు ఆ బోయవానితో స్వామిపుష్కరిణీ సమీ పమునందున్న శ్రీనివాసుని సేవించుటకు వెళ్ళెను. తరువాత కొంతకాలమునకు రేణుకాదేవిని పూజింపగా ఆమె "నీరాజ్యము స్థిరముగా నుండగలదు. నీపేరుతో ఒక రాజధాని ఏర్పడును, నీకు దేవుని అనుగ్రహము లభించగలదు" అని అతనికి వర మిచ్చెను.

## తిరుమల కాలిబాటలో సౌకర్యాలు...

★ అలిపిరి నుంచి తిరుమలకు నడచి వచ్చే యాత్రికులు తిరుపతి ఆర్.టి.సి. బస్టాండు ఎదురుగా ఉన్న శ్రీనివాసం కాంప్లెక్స్‌లో, రైల్వేస్టేషన్‌వద్ద ఉన్న రెండవ సత్రంలో, అలిపిరి బస్టాండువద్ద ఉన్న భూదేవి కాంప్లెక్స్‌లో తిరుమల తిరుపతి దేవస్థానం ఉచితంగా ఏర్పాటు చేసిన వసతి, స్నానం వగైరా సౌకర్యాలను పొందవచ్చు.

★ తి.తి.దేవస్థానం తిరుపతి బస్టాండు నుంచి అలిపిరివరకు ఉచిత బస్సులను నడుపుతున్నది.

★ భద్రంగా తాళాలు వేసిన తమ సామానులను అలిపిరి లగేజి సెంటర్లో అప్పజెప్పి, తిరిగి వాటి రశీదును చూపించి తిరుమల లగేజి సెంటర్లో పొందవచ్చు. **సామానులకు రవాణా పూర్తి ఉచితం.**

★ దారి పొడవునా త్రాగునీటి సౌకర్యం, టాయిలెట్ల సౌకర్యం ఉంది.

★ నడచివెళ్ళే యాత్రికులు గుంపులు గుంపులుగా తెల్లవారు జామున 4 గంటల నుంచి రాత్రి 10 గంటల వరకు మాత్రమే వెళ్లాలని సూచించడమైనది.

### ముందు జాగ్రత్త చర్యలు

బి.పి., ఊపిరితిత్తుల జబ్బులు, గుండె జబ్బులు ఉన్న యాత్రికులు నడచి కొండకు వెళ్లడం మంచిది కాదని సూచన. అలిపిరి నుంచి తిరుమల కొండకు నడక మార్గం సుమారు 9 కి.మీ. దూరం ఉండడమే గాక 3550 మెట్లు ఉన్నాయి.

శ్రీనివాసుడు తొండమాను చక్రవర్తికి కలలో దర్శనమిచ్చి "ద్వారగోపురప్రాకారాలను నీవు కట్టించుము. నీ వంశములో పుట్టబోవు నారాయణుడు అనువాడు విమానము నిర్మించ గలడు. దానిని స్వర్ణంతో అలంకరించగలడు" అని చెప్పెను. శ్రీనివాసుని ఆజ్ఞప్రకారం తొండమాను డట్లే ప్రాకారమును నిర్మించి, వైఖానస ఆగమశాస్త్ర ప్రకారము పూజలు చేయించు చుండెను.

### భీమవృత్తాంతము

తొండమానుడు శ్రీనివాసునకు స్వర్ణపద్మములతో పూజలు చేయుచుండగా ఒకనాడు ఆ స్వర్ణపద్మములపై మట్టితో చేసిన పుష్పము లుండుట చూచి "ఇది ఏమిటి?" అని శ్రీనివాసుని అడిగెను. అప్పుడు స్వామి తనభక్తునిగూర్చి ఇట్లు చెప్పెను. "కుర్వగ్రామంలో భీముడు అను కులాలుడు కలడు. అతడు నాకు పరమభక్తుడు. తన ఇంటనే నన్ను నిత్యము పూజ చేయుచుండును. అతని భక్తికి మెచ్చి ఆ ఆరాధనను నే నంగీక రింతును" - అని శ్రీనివాసుని మాటలు విన్న తొండమానుడు ఆ భక్తుని చూచుటకే కుర్వగ్రామమునకు వెళ్ళెను. భీముడు తొండమానుని చూచి భక్తితో లేచి నిలబడెను. అప్పుడు రాజు భీముని ప్రశ్నించెను. "నీవు స్వామిని ఎలా పూజిస్తావు?" భీముడు దానికి సమాధానముగా "నేను పూజ చేస్తున్నట్లు ఎవరు చెప్పారు" అని అడుగగా, "శ్రీనివాసుడే నీవు పూజ చేస్తున్నట్లు చెప్పె"ననగా, అతనికి వెనుకటివరం గుర్తుకు వచ్చింది. నీపూజ అందరికీ ఎప్పుడు తెలియునో, తొండమానుడు నీ దగ్గఱకు వచ్చి ఎప్పుడు సంభాషించునో అప్పుడు నీకు మోక్షం కల్గును అని ఇంతకు పూర్వమే అతనికి స్వామి వరమొసంగెను. దీనిని బట్టి స్వామికి భక్తిప్రధానమైనదిగాని స్వర్ణపుష్పాలకి, మట్టితో చేసిన పుష్పాలకి భేదంలేదు - స్వామి దృష్టిలో. భగవంతునికి భక్తునిహృదయమే ముఖ్యంకానీ అత డిచ్చు పదార్థములు ముఖ్యం కానేకా దను నిజము ఈ భీముని వృత్తాంతం తెలియ జేయుచున్నది.

ఇలా వరాహపురాణం శ్రీవేంకటేశ్వరుని అవతార తత్త్వాన్ని, శ్రీవేంకటాచలంలోని అనేకతీర్థాల ప్రాముఖ్యాన్ని, వేంకటేశ్వరుని వైభవాన్ని, వరాహావిర్భావము, పద్మావతీ శ్రీని వాసుల వివాహం, బ్రహ్మోత్సవం- ఇంకా ఎన్నో విషయాలను మన కందిస్తోంది.

# చిత్రరేఖ

**- అవసరాల లక్ష్మీపతిరావు**

బలిచక్రవర్తికి నూరుగురు పుత్రులు జన్మించారు. వారిలో జ్యేష్ఠ పుత్రుడు బాణాసురుడు. బాణుడికి "ఉష" అనే కుమార్తె ఉంది. ఒకనాడు ఆమెకు స్వప్నంలో ఒక రాజకుమారుడితో సంగమం జరిగింది. ఆ కలలో కనబడిన రాకుమారుడి ప్రతిమను హృదయంలో ముద్రించుకొని తన్మయంలో తేలియాడింది. అతనినే భర్తగా నిర్ణయించుకొని ఆతనికోసం తహతహలాడింది.

బాణాసురుడికి కుంభాండు డనే మంత్రి రాజ్య పరిపాలనలో సహాయసహకారా లందించేవాడు. అతని కుమార్తె చిత్రరేఖ. ఆమె ఉషకు ఇష్టసఖి. అత్యంత సన్నిహితలు. వారిద్దరి మధ్యా రహస్యాలు లేవు.

ఒకరోజు చిత్రరేఖతో ఉష సిగ్గువిడిచి రాత్రి తన స్వప్న వృత్తాంతము ఆమూలంగా ఆమెకు చెప్పి, తన ప్రేమికుడ్ని దగ్గరకు తెప్పించుకునే ఉపాయం చెప్ప మని కోరింది. తన నాథుని తనవద్దకు తీసుకురమ్మని అర్థించింది. అప్పుడు చిత్రరేఖ, ఉష చెప్పిన ఆనవాళ్ళనుబట్టి చిత్రరేఖ వంశం గోత్రం పేరుతో సహా ముల్లోకాలలో ఉన్న సౌందర్యపురుషుల చిత్రాలను రూపొందించింది. వారందరూ కా దని ఉష నిరాకరించింది.

చిత్రరేఖ యదువంశవీరుల చిత్రాలు గీసి చూపించింది. వాటినికూడా ఉష నిరాకరించింది. చివరకు చిత్రరేఖ 'అని రుద్ధుని' బొమ్మ గీసి "ఈతడే నీ ప్రియుడు. ఈతడే నీ హృద యాన్ని కొల్లగొట్టిన వీరుడు. ఈతడు ఎవరోకాదు. శ్రీకృష్ణుని మనుమడు 'అనిరుద్ధుడు'. నీ ప్రియుడు నీ మందిరంలోకి వచ్చేటట్లు చేస్తాను" అని చిత్రరేఖ గగనమార్గంలో బయలు దేరింది. ద్వారక చేరిన చిత్రరేఖ అనిరుద్ధుని మందిరంలో ప్రవే శించింది. నిదురిస్తున్న అనిరుద్ధుణ్ణి తన యోగవిద్యా మహ త్త్వంతో ఎత్తుకుని అదృశ్యగమనంలో శోణపురానికి చేరి, ఉషాకన్యతల్పంమీద పడుకోబెట్టింది.




కలలో కనిపించిన ప్రియుణ్ణి గుర్తించడమే కాకుండా తీసుకు వచ్చిన చెలి మనస్సులోనే కృతజ్ఞతలు తెలియచేసింది ఉష. కొన్నినెలలు రాత్రీ, పగలు తెలియకుండా మన్మథ సుఖాలు అనుభవించారు. ఈ విషయాన్ని పసిగట్టిన సైనికులు ఆ విషయం రాజుకు చెప్పారు. బాణుడు ఉషశయ్యాగారంలో ప్రవేశించి అనిరుద్ధుణ్ణి బంధించి; కారాగృహంలో పడేశాడు. నారదుడిద్వారా ఇది తెలుసుకున్న యాదవులు శోణితపురాన్ని ముట్టడించగానే కలత చెందిన బాణుడు ఐదువందల భుజాలతో ఐదువందలచాపాలను పట్టుకుని, ఒక్కొక్క చాపం నుండి రెండేసి బాణాలు ప్రయోగించాడు. కృష్ణుడు ఒక్క నిమిషంలో వాటిని నుగ్గునుగ్గు చేశాడు. బాణునితల్లి 'కోటర' తన తనయుడికి పట్టిన దుర్గతి చూచి సిగ్గువిడచి దిసమొలతో యుద్ధభూమికి వచ్చింది. కృష్ణుడు ఆ దృశ్యము చూడలేక కళ్లు మూసుకొన్నాడు. ఇంతలో బాణుడు యుద్ధరంగంనుండి తప్పించుకుని పారి పోయాడు.

శ్రీకృష్ణుడు శంకరునివచనాలకు, స్తోత్రాలకు మెచ్చి ప్రహ్లాదుని వంశీయులను ఇరువది ఒక్క వంశంవారిని తాను వధించ నని కనికరించి, బాణాసురుని వదిలివేశాడు. కృష్ణుడు బాణాసురుడి బాహువులను తొమ్మిదివందల తొంభైఆరు ఖండించి నాల్గుబాహువులు మిగిల్చాడు.

యాదవులందరూ బాణునితోనూ, ఆతనిపరివారం తోనూ, బంధుజనులతోనూ, ద్వారక చేరుకొన్నారు. అచ్చట ఉషా అనిరుద్ధుల వివాహం అతివైభవంగా జరిగింది. ఇంత వివాదంతో కూడిన 'ఉషాపరిణయగాథ'ను ఎవరు ప్రాతః కాలంలో స్మరిస్తారో ఆతనికి పరాభవం లేదు, సుఖం ప్రాప్తి స్తుంది.

# డయల్ యువర్ ఈ.ఓ. కార్యక్రమం - 01-07-2011
## భక్తుల సమస్యలు - సూచనలు - ఈ.ఓ. గారి ప్రతిస్పందన - కార్యప్రణాళిక

*(ప్రతినెల మొదటి శుక్రవారం తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారితో* ***'డయల్ యువర్ ఈ.ఓ.'*** *కార్యక్రమం ద్వారా భక్తులు ఫోనులో మాట్లాడే అవకాశం ఏర్పాటు చేసింది. వివిధప్రాంతాల భక్తులు కార్యనిర్వహణాధికారిగారికి చేసిన సూచనలు, వివరాలు కొన్ని ఇక్కడ ఇస్తున్నాం.)*

**పిల్లలు తెలుగుభాషను, పురాణేతిహాసాలను, పద్యాలను పూర్తిగా మర్చిపోతున్నారు. వీరికి సి.డి.ల ద్వారా పద్యాలు, పురాణప్రవచనాలను అందిస్తే బాగుంటుంది.**

*- కులశేఖర్, చంద్రగిరి.*

**కార్యనిర్వహణాధికారి :** ఇప్పటికే హిందూధర్మప్రచార పరిషత్ మరియు శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్‌లో పురాణేతిహాసాల ప్రవచనాలు, ధర్మసందేహాలు అందిస్తున్నాం. మున్ముందు-సి.డి.ల రూపంలో ఇవ్వడానికి ప్రయత్నిస్తాం.

**ఎస్.వి.బి.సి.లో ప్రత్యక్షంగా ప్రసారం చేసే శ్రీనివాస కల్యాణం - సహస్ర దీపాలంకరణలలో హారతిని భక్తులకు సరిగ్గా చూపించడం లేదు. హారతి చేసేటప్పుడు భక్తులను చూపిస్తారు- లేకపోతే హారతి జరుగుతుండగానే ప్రసారం ఆపేస్తారు.** *- కె.ఎస్.రావ్, కాకినాడ.*

**కార్యనిర్వహణాధికారి :** సూచనలు నమోదు చేసుకొన్నాం. సరిదిద్దే ఏర్పాటు చేస్తాం.

**ఆర్జిత సేవలను ఎస్.వి.బి.సి. ద్వారా ప్రత్యక్ష ప్రసారం చేసేటప్పుడు క్రింద స్క్రోలింగ్ లేకుండా ప్రసారం చెయ్యగలిగితే బాగుంటుంది.** *- మహేంద్ర, తాడేపల్లి.*

**కార్యనిర్వహణాధికారి :** స్క్రోలింగ్ వల్ల చాలా విషయాలు తెలుస్తాయి. స్క్రోలింగ్‌లో భక్తులకు ఉపయోగపడే విషయాలే ఉంటాయి. మీ సలహాను ఒకమారు పరిశీలించి స్క్రోల్‌సైజు తక్కువచేస్తే బాగుంటుందేమో చూద్దాం.

**దర్శనానికి భక్తులు క్యూలైన్‌లలో వెళ్లునప్పుడు కొన్ని పాయింట్లలో మైక్ ద్వారా ఓం నమో వేంకటేశాయ, ఓం నమో శ్రీనివాసాయ ఇలా కొన్ని వాక్యాలను పలికిస్తే బాగుంటుంది.** *- లోకేష్, తిరునగరం.*

**కార్యనిర్వహణాధికారి :** మంచి సలహా. తప్పకుండా ఏర్పాటు చేస్తాం.

**1. కొండకెళ్ళే ప్రైవేటు వాహనదారులకు డ్రస్‌కోడ్, నుదుట తిలకం ఏర్పాటు చెయ్యండి. తమవాహనాలలో సినిమా పాటలు వేసి, ఆధ్యాత్మికవాతావరణాన్ని కలుషితం చేస్తున్నారు.**

**2. తి.తి.దే.వారు ఏర్పాటు చేసిన ఆలయ దర్శన డ్రైవర్లకు కూడా డ్రస్‌కోడ్, నుదుట తిలకం పెట్టుకొనేటట్లు ఏర్పాటు చెయ్యండి. వీరిని చూస్తే యాత్రికులకు ఆధ్యాత్మికభావన ఇనుమడింపచేసే విధంగా ఉండాలి.**

*- రమేష్, హైదరాబాదు.*

**కార్యనిర్వహణాధికారి :** 1) & 2) తప్పకుండా చూస్తాను.

**ఇండియన్ బ్యాంకు, తిరుమలలో మార్చి లో 218 రిసిప్ట్ ప్రకారం రూ.10,000/-లు అన్నదానానికి డొనేషన్ ఇచ్చాం. ఇంతవరకు తి.తి.దేవస్థానం నుండి ఇన్‌కమ్‌టాక్స్ మినహాయింపుకు సంబంధించిన పేపర్లు కానీ, ముట్టినట్లు ఉత్తరం కాని రాలేదు.** *- రామచంద్రరావు, నర్సీపట్నం.*

**కార్యనిర్వహణాధికారి :** పంపించే ఏర్పాటు చేస్తాం.

**సర్వదర్శనానికి వెళ్ళేవాళ్ళకు కంపార్ట్‌మెంట్‌లలో తి.తి. దేవస్థానంవారు ఉచితంగా ప్రసాదాలను ఇస్తున్నారు. అలాగే రూ.300/-లు ప్రత్యేకదర్శనంవాళ్ళకు రద్దీ ఎక్కువగా ఉన్నప్పుడు బయట వీరు ఐదారు గంటలు నిలబడి నప్పుడు తి.తి.దే. వారు ఎటువంటి సదుపాయం చేయడం లేదు.**

*- అభీష్ట, మదనపల్లి.*

**కార్యనిర్వహణాధికారి :** చర్యలు తీసుకుంటాను.

**మేము 29-09-2011 వ తేదికి రూములకు గాను జూన్‌లో డబ్బు పంపించాం. ఇంతవరకు ఎటువంటి ఉత్తరం రాలేదు.** *- దొరైస్వామి, సేలం.*

**కార్యనిర్వహణాధికారి :** శ్రీవారివార్షికబ్రహ్మోత్సవాలలో రూములకు అడ్వాన్స్‌బుకింగ్ క్రింద రిజర్వేషన్ ఉండదు.

# పద్మావతీ శ్రీనివాసంలో శ్రీ వేంకటేశ్వరుడు

- డా॥ ఎ.కె. వేణుగోపాల్ రెడ్డి

కూచిపూడి నృత్యరూపకాల్లో, శ్రీ వేంకటేశ్వరుడు ఇతివృత్తంగాగల రచనలు ఒకటి అరా ఉన్నా వాటన్నిటికంటే భుజంగరాయశర్మ రచించిన పద్మావతీ శ్రీనివాసం మేలైనది, హృద్యమైనది.

శర్మగారి నృత్యనాటికల్లో ఐదవది పద్మావతీశ్రీనివాసం. తిరుమలకొండపై వెలసిన శ్రీవేంకటేశ్వరుడు పద్మావతీ దేవిని వివాహం చేసుకోవడం ఇందులోని ఇతివృత్తం. కథ పౌరాణికమూ, ప్రఖ్యాతమూ అయినా రచయిత దీనికి చేసిన రూపకల్పన, నాట్యాచార్యు లిచ్చిన నృత్యవిజృంభణం ఎనలేని ఖ్యాతిని గడించాయి.

నైమిశారణ్యంలో లోకకల్యాణం కోసం యాగం చేస్తున్న సప్తర్షుల వద్దకు నారదు డొచ్చి యజ్ఞభోక్త, యజ్ఞఫల దాత ఎవ దని ప్రశ్నిస్తాడు. ఈ విషయాన్నే దృశ్యరూపకంగా చిత్రీ కరిస్తూ...

**కలియుగమ్ము వచ్చె కపటవర్తన హెచ్చె**
**జనులయందు భక్తి సడల బొచ్చె**
**పుడమి తల్లి బెగడువడి తల్లడిలి నొచ్చె**
**హరియె అవతరించు అదను వచ్చె**
**కలియుగమునందు ప్రభువు స**
**కల జన సులభుడయి వడ్డికాసుల వాడై**
**యిల శేషశైల శిఖరిని**

వెలిసెడుకథ సంఘటింతు విశ్రుతమతినై.. అని పాడుకుంటూ వచ్చిన నారదుడు.

భృగుమహర్షిని త్రిమూర్తులలో ఎవరుగొప్పో పరీక్షించి రమ్మని పంపిస్తాడు. భృగుమహర్షి మొదట బ్రహ్మలోకం, పిదప కైలాసం వెళ్ళి తిరస్కరింపబడి వారిరువురిని శపిస్తాడు. ఆ తర్వాత వైకుంఠానికి ప్రయాణమై వెళ్తాడు. వైకుంఠంలో లక్ష్మీదేవితో మధుర శృంగారపరాయణుడై ఉన్న విష్ణుదేవుని చూచి సహింప లేక అతనివక్షస్థలంపై తన్నుతాడు. అది చూచి బాధపడిన లక్ష్మీదేవిని ఓదారుస్తూ విష్ణువు ఏమని బుజ్జగించాడో శర్మగారి మాటల్లో...

**అక్షరామృతం [35]**

**చిన్నిపాపడు కాళ్ళతో తన్నినంత**
**చిలిపి చరణాల ముద్దు లుంచెదరు గాని**
**ఆగ్రహింతురె తల్లిదండ్రు లంబుజాక్షి!**
**ఇంత యెరుగవె బేలవై తేల నేడు...**

అని బుజ్జగించినా లక్ష్మీదేవిమాత్రం విసురుగా విష్ణువును వదలి భూలోకానికి వెళ్ళిపోతుంది.

ఆ విధంగా లక్ష్మీదేవి భూలోకానికి వచ్చి, కరవీర పురంలో ఘోరతపస్సుకు పూనుకుంటుంది. ఆమెను అన్వేషిస్తూ శ్రీమహావిష్ణువు భూలోకంలోని శేషశైలప్రదేశంలో శ్రీనివాసు డనే పేరుతో నిద్రాహారాలు మాని' లక్ష్మీదేవిని స్మరిస్తుండగా బ్రహ్మ-శివ-నారదాదులు బయలుదేరి లక్ష్మీదేవిని ప్రార్థించి ప్రసన్నురాలిని చేస్తారు.

ప్రసన్నురాలైన లక్ష్మి బ్రహ్మదేవుణ్ణి-ఆవుగాను, శివుణ్ణి-దూడగాను చేసి వాటిని చోళరాజుకు అమ్మదలచి గొల్లభామ వేషంలో ఆవునూ, దూడనూ తోలుకుంటూ, పాటలు పాడుకుండూ రాజనగరుకు బయలుదేరింది. ఆ చోళరాజు "నీ పేరేమిటి? నీ ఊరేమిటి?" అని అడుగగా గొల్లభామ వేషంలోని లక్ష్మి

**పేరుమటుకు లచ్చేనయ్యా**
**నాఊ రెపుడో వదిలానయ్యా**
**ఆవు నచ్చితే కొనవయ్యా - మహా**
**లావు పుటక గలదయ్యా...**

- అని గడుసరి జవాబిస్తుంది. చోళరాజు వెల ఎంతని అడుగ్గా

**మంచుకొండ విలు వెంత**

**మంచిమనసు వెల యెంత**

**తోచిం దేదో ఇవ్వండి - సం**

**తోషంగా వెళతానండీ!**

**ఆవు వచ్చు వే ఉంటారు**

**అలివచ్చు వే ఉంటారు**

**శుభవేళను వచ్చిందండి!**

**శుభములు మీ కిస్తుందండి!**

అని చోళరాజులో ఆశలు రేకెత్తించి ఆవును, దూడను కొనేటట్లు చేస్తుంది–గొల్లభామరూపంలో ఉన్న లక్ష్మీదేవి.

అప్పటి నుండి ఆవు–దూడలుగా ఉన్న బ్రహ్మ–శివుడు, గోపాలుడు గమనించకుండా ప్రతిరోజు శ్రీనివాసుడున్న పుట్టలో పాలుపోసి వస్తున్నాయి. అది గ్రహించిన చోళరాజు–గోపాలుడు రహస్యంగా ఆవును అనుసరించి వెళ్ళి, ఆవును వధించబోగా శ్రీనివాసునిచే శపించబడి తిరిగి అనుగ్రహింపబడ్డాడు. శ్రీని వాసుడు అక్కడనుండి బయలుదేరి ద్వాపరయుగంలో తన తల్లియైన యశోద కలియుగంలో వకుళమాతగా జన్మించి తనకు కల్యాణం చేయా లని ఎదురు చూస్తున్న దని తెలుసుకొని ఆమె వద్దకు వెళ్తాడు. తన చిన్ని కృష్ణునికోసం ఎదురు తెన్నులు చూస్తూన్న వకుళమాత

**ఎన్ని యుగా లని నీకొరకై యిటు**

**లెదురు చూతురా తండ్రీ!**

**ఎన్ని దారు లని కాచియందు**

**నాకన్నులు కాయగ తండ్రీ!**

**ఆడి ఆడి నా ఒడిలో ఒదిగి**

**ఆదమరచు టెపుడో**

**జోల పాటలో తేలి తేలి చిరు**

**గాలి సోలు టెపుడో**

....................

– అని విలపిస్తూంటుంది. అపుడు శ్రీనివాసుడు వచ్చి ఆమె ఒడిలో చేరుతాడు. కొంతకాలమైన తర్వాత నారాయణ పురాన్ని ఏలుతున్న ఆకాశరాజుకుమార్తె పద్మావతి ఒక వసంతోత్సవంలో శ్రీనివాసుణ్ణి చూచి ప్రేమిస్తుంది. శ్రీని వాసుడుకూడా ఆమెను తనదానిగా భావిస్తాడు. విరహవేదనతో పద్మావతిని తలచుకొంటూ ఉక్కిరి బిక్కిరౌతాడు. నారదుడు వచ్చి..

**ఎరుకసాని కావయ్యా**

**నీ వెరుక చెప్పి రావయ్యా**

అని ఉపాయం చెప్తాడు. శ్రీని వాసుడు ఎరుకసానివేషం వేసుకొని

**ఎరుకో యమ్మ యెరుక**

**ఎరుకో యమ్మ యెరుక**

అని పాడుకుండూ రాచనగరులోకి ప్రవేశించాడు. ధరణీ దేవికోరికమేరకు పద్మావతికి సోదె చెబుతూ

**సిలక మనసున ఒక సిన్నవా డున్నాడు**

**కవ్వించి ఊరించి కలత పెడుతున్నాడు**

**కాదటే సిలకమ్మ కాదటే సెప్ప**

**సిగ్గేల పడతవు సెప్పవే సిలకా!**



ఆలయాలను దర్శించండి !

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# ప్యాకేజి టూర్

దివ్యానుభూతిని పొందండి..!!

**1. స్థానిక ఆలయాలు (ప్రతి దినం):**

| | |
|---|---|
| టిక్కెట్టు | : పెద్దవారికి - 30/- రూపాయలు<br>చిన్నవారికి- 15/- రూపాయలు |
| బయలుదేరు స్థలం | : శ్రీనివాసం కాంప్లెక్సు, తిరుపతి నుండి |
| సమయం | : ఉ॥ 6.00,7.00,10.00,11.00 గం॥లకు; మ॥ 2.00, 3.00 గం॥లకు బయలుదేరును; |
| బయలుదేరు స్థలం | : 2వ సత్రం నుండి |
| సమయం | : ఉ॥6.00; 10.00; మ॥2.00 గం॥లకు; |

చూపబడు ఆలయములు:

1) తిరుచానూరు, శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం,
2) కపిలతీర్థం, శ్రీ కపిలేశ్వరస్వామి ఆలయం,
3) శ్రీనివాసమంగాపురం,శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం,
4) తొండవాడ, శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం,
5) తిరుపతి, శ్రీ కోదండరామస్వామి ఆలయం,
6) తిరుపతి, శ్రీ గోవింద రాజస్వామి ఆలయం.



**2. సమీప ఆలయాలు (ప్రతి దినం):**

| | |
|---|---|
| టిక్కెట్టు | : పెద్దవారికి - 80/- రూపాయలు<br>చిన్నవారికి- 40/- రూపాయలు |
| బయలుదేరు స్థలం | : అలిపిరి నుంచి |
| సమయం | : ఉ॥ 8గం॥ |
| బయలుదేరు స్థలం | : శ్రీనివాసం కాంప్లెక్స్ నుండి |
| సమయం | : ఉ॥ 8.10 గం॥ |
| బయలుదేరు స్థలం | : 2వ సత్రము నుండి |
| సమయం | : ఉ॥ 8.30గం॥లకు బయలుదేరును. |

చూపబడు ఆలయములు:

1) అప్పలాయగుంట, శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం,
2) కార్వేటి నగరం, శ్రీవేణుగోపాలస్వామి ఆలయం,
3) నారాయణవనం, శ్రీ కల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయం,
4) నగరి, శ్రీ కరియమాణిక్యస్వామి ఆలయం,
5) బుగ్గ, శ్రీ అన్నపూర్ణాసమేత కాశీ విశ్వేశ్వరస్వామి ఆలయం,
6) నాగులాపురము, శ్రీ వేదనారాయణస్వామి ఆలయం,
7) సురుటుపల్లి, శ్రీ పల్లికొండేశ్వర స్వామి ఆలయం.

యాత్రికులు పై ప్రదేశములలో ఎక్కడ నుండైనా బస్సు ఎక్కవచ్చును

వివరాలకు సి.ఆర్.ఓ. - తిరుపతి, ఫోన్ నెం. 0877-2264503

అని పలుకగా ఆ మాటలకు ఆకాశరాజుభార్య ధారుణీదేవి ఒప్పుకోదు. అప్పుడు ఎరుకలసాని –

**కస్సు బుస్సంటేను కాకుండ బోదు**
**కాగల కార్యాలు గంధర్వులకు దెలుసు**
**నాబిడ్డ నా బిడ్డ నాబిడ్డ యనియేవు**
**నాగేటి సాలులో దొరికింది కాద?**
**ఎనక జల్మములోన యే మాలచ్చియో**
**మీ కడుపు సల్లంగ మీ యింట వెలసింది**

అని పద్మావతి జన్మరహస్యం వెల్లడిస్తుంది. పిదప వకుళమాత పిల్ల నడగటానికి ఆకాశరాజువద్దకు రావడం, ఆకాశరాజుదంపతులు పద్మావతీశ్రీనివాసుల కల్యాణానికి ఇష్టపడడం, సాక్షాత్తు శుకయోగీంద్రుడు శుభమూహూర్తం నిశ్చయించడం జరుగుతుంది.

సకలదేవతలసమక్షంలో పద్మావతీశ్రీనివాసుల కల్యాణం మంగళకరంగా, దేదీప్యమానంగా, మహోవైభవంగా జరుగుతుంది. కల్యాణమైన పిమ్మట గరుడ, గంధర్వ, కిన్నెర, అప్సర గణాలు నృత్యవిన్యాసాలతో అందరినీ అలరిస్తారు.

ఇలా భుజంగరాయశర్మగారి పద్మావతీశ్రీనివాసం ముగుస్తుంది. కూచిపూడి నృత్యరూపకాల్లోకెల్లా శ్రీ వేంకటేశ్వరుని ఇతివృత్తం గల 'శ్రీపద్మావతీ శ్రీనివాసం' ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొని విశ్వవిఖ్యాతిని ఆర్జించింది.

  

# తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలు

## 2011

## సెప్టెంబరు 28 నుండి అక్టోబరు 7 వరకు

| తేదీలు | వారం | పగలు ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 28-9-11 | బుధవారం | -- | అంకురార్పణం |
| 29-9-11 | గురువారం | ధ్వజారోహణం | పెద్దశేషవాహనం |
| 30-9-11 | శుక్రవారం | చిన్నశేషవాహనం | హంసవాహనం |
| 1-10-11 | శనివారం | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం |
| 2-10-11 | ఆదివారం | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం |
| 3-10-11 | సోమవారం | మోహినీ అవతారం | గరుడ వాహనం |
| 4-10-11 | మంగళవారం | హనుమద్వాహనం | గజవాహనం |
| 5-10-11 | బుధవారం | సూర్యప్రభవాహనం | చంద్రప్రభ వాహనం |
| 6-10-11 | గురువారం | రథోత్సవం | అశ్వవాహనం |
| 7-10-11 | శుక్రవారం | చక్రస్నానం | ధ్వజావరోహణం |

# శ్రీ వేంకటాచల విహారశతకం

డా॥ మొవ్వా లలితకుమారి

శ్లో॥ శ్రీదం శ్రీశం శ్రీనివాసం శ్రీపతిం శుభలక్షణం ।
శేషాద్రినిలయం దేవం వేంకటేశ మహం భజే ॥

సుప్రసిద్ధ వాఙ్మయ పరిశోధకులైన వేటూరి ప్రభాకర శాస్త్రి శ్రీవేంకటాచల విహారశతకాన్ని ఏర్చి- కూర్చినవారు.

శ్రీ వేంకటాచల విహార శతకానికి కర్త ఎవరో తెలీదు. ఇందులో 98 పద్యాలుమాత్రమే దొరికాయి - శాస్త్రిగారికి. లోపించిన రెండుపద్యాలలో రచయిత పేరుండవచ్చు నని శాస్త్రిగారి అభిప్రాయం. ఈ శతకం క్రీ.శ.17వ శతాబ్దంలో, ఉత్తరార్ధంలో, తిరుపతి ప్రాంతంలో, మహమ్మదీయుల దాడి జరుగుతుండగా, రాయబడింది. అన్యమతస్థుల ఆగడాల్ని ఉపేక్షించిన శ్రీవారిని నిందిస్తూ రాసిన శతకమిది. ధర్మరక్షణ శక్తిని అధిక్షేపిస్తూ ఆర్తత్రాణపరాయణుడు అన్న బిరుదు నీ కెందుకయ్యా? అని స్వామిని - నిలదీసి, అడుగుతాడు కవి పుంగవుడు.

విశృంఖలంగా విజృంభించిన శత్రువులను చూస్తూ ఏమీ అనక-మిన్నకుండిన స్వామిమీదకు ఒంటి కాలిపై లేస్తాడు- కవీశ్వరుడు కొన్నిపద్యాల్లో. స్వామియొక్క అసమ ర్థతను దెప్పిపొడుస్తాడు - ఆక్రోశిస్తాడు - ఉక్రోషం పట్టలేక చూస్తున్న నిజాన్ని కక్కుతాడు. నిజానికి ఇది నింద కాదు. దూషణ అసలే కాదు. ఆనాటి మహమ్మదీయుల సాయుధ పోరాటాన్ని- దృష్టిలో పెట్టుకొని- కవి పడ్డ ఆరాటమే మనకు శతకపద్యాల్లో కనిపిస్తుంది. నాటి దౌష్ట్యాన్ని-పాషండ శక్తిని- ఎదిరించే శక్తిలేక- పిరికితనం సంతరించుకొన్న జాతిని- జాగృతం చేయటానికి ఈ రచయిత ఉపయోగించిన అక్షరా యుధమే ఈ శతకం.

## కవిత్వపటుత్వం

"శత్రుసంహార వేంకటాచలవిహార" అన్న మకుటంతో మకుటాయమానంగా తీర్చిదిద్దబడిం దీశతకం. ఇందులోని సీసపద్యా లన్నీ శ్రీనాథుని సీసపద్యాలవలె భాసిస్తున్నాయి. ఈ శతకంలోని ప్రతిపద్యంలో ఘాటెక్కిన భావగంధకం విశ్వరూపం దాల్చింది. ప్రౌఢమైన శైలితో, కళ్ళు తెరిపించే వ్యంగ్యం కవాతు చేసింది. శబ్దసౌందర్యం కదను తొక్కింది. తెలుగు శతకాల్లో మామూలుగా ఉపయోగించే తెలుగు పలుకుబళ్ళతో గుబాళించింది. మొత్తంమీద శతకమంతా నారికేళపాకమై కూర్చుంది. ప్రౌఢమైన శైలి కుదాహరణంగా :

సీ॥ అవిగో నిరంతరోద్యద్దాన ధారాళ
　　ధారాళ కోద్దంత దంతిఘటలు
అవిగో యసంఖ్యాత పవమాన జవమాన
　　ధాటికా ఘోటి కోద్ధతరజంబు
లవిగో నిరాఘట హాటక ధ్వజపట్ట
　　పట పటత్కార ఝుంపామరుత్తు
లవిగో భటోద్భటాత్యంత భీకర కరా
　　ఆ కృపాణకర్షస్ఫులింగపంక్తు

తే॥ లనుచు సురతానియబ్బుల గననె మోడె
గుంట, కావలి, జలదంకి, కొడవలూరు,
గండవరములు మునుమున్నె కలవరించె
శత్రుసంహార వేంకటాచలవిహార ॥

అలాగే ఇంకో పద్యంలో అన్యమతస్థుల ఆగడాలని ఉపేక్షించిన శ్రీవారిని నిందిస్తూ చెప్పిన పద్యం - చూడండి -

సీ॥ జవరాలి నిడువాలు జడ వ్రేటుగాదుగా
　　జులుకుట్టు గుల్లా పుతఅటుపెట్టు
రాకేందు ముఖి ముద్దు రాకొట్టు గాదుగా
　　దాసి కంపు తుటారి దగిడి తిట్టు
కులుకు గుబ్బెత గుబ్బ కొనపోటు గాదుగా
　　మొక్కలపు గరీబు ముష్టిఘాత
యలివేణి రతికూజితార్భటి గాదుగా
　　భర్జించు చాకిరి గర్జితంబు

తే॥ వలదు మాయయ్య ప్రాణంబు గలిగెనేని
బలుసుటా కేటి తినవచ్చు బాటి పొమ్ము

## పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు మహాపరాధం

**అన్యక్షేత్రే కృతం పాపం**
**పుణ్యక్షేత్రే వినశ్యతి**
**పుణ్యక్షేత్రే కృతం పాపం**
**బ్రహ్మలోకే న నశ్యతి**

**ఇతర క్షేత్రాల్లో చేసిన పాపం పుణ్యక్షేత్రంలో నశిస్తుంది. కానీ పుణ్యక్షేత్రంలో చేసిన పాపం బ్రహ్మలోకానికి వెళ్ళినా నశించదు. కావున, పుణ్యక్షేత్రంలో ఆత్మహత్యాది పాపాలు చేయరాదు.**

**ఆత్మహత్య అనేదే మహాపాప మని మన పురాణాలు చెపుతున్నాయి. అలాంటి ఆత్మహత్యలు పుణ్య క్షేత్రాల్లో చేసుకుంటే ఆ పాపం తమకే కాకుండా - తమ వంశానికంతా చుట్టుకుంటుం దని ఋషులు ఘోషించారు. కాబట్టి భగవంతుని సన్నిధిలో సత్కార్యాలు చేస్తే వాటి ఫలితం శతాధికంగా ఉన్నట్లే - ఆత్మహత్యల్లాంటివి చేసుకుంటే స్వర్గప్రాప్తి సిద్ధించకపోగా, ఆ పాప ఫలం తరతరాలు పట్టి పీడిస్తుంది. కాబట్టి పుణ్యక్షేత్రాల్లో ఆత్మహత్యలు మాని భగవద్దర్శనంతో ఆత్మానందాన్ని, మనోధైర్యాన్ని పొందండి.**

**దొడ్డ కొంచెంబు లెరుగ రీతురక లవని**
**శత్రుసంహార వేంకటాచలవిహార ॥**

బతికి ఉంటే బలుసాకు తినవచ్చు. పారిపో మ్మని శ్రీవారిని నిందిస్తూ చెప్పిన పద్యమిది. చక్కనైన నానుడిని వాడి, వాడిగ, వేడిగ గుండెల్లో సూటిగా గునపాన్ని దింపినట్లుగా రాసినా డీకవీశ్వరుడు. అలాగే అధిక్షేపణగా ఇంకోచోట కవి ఆక్రోశం పట్టలేక - ఇలా ప్రస్తావించాడు.

**తిరుపతిని జూడు మిటువంటి తరిని నిదుర,**
**పోవుచున్నాడు మీ యన్న లేవ లేక.**

దిగువతిరుపతి లోని గోవిందరాజస్వామిని ఈసడిస్తూ, శ్రీవార్ని చూస్తూ, చెప్పిన పద్యమిది. ఆగడాలను అరికట్ట లేక నీ అన్నగారు ఏ రకంగా నిద్రపోతున్నాడో చూడు అని - నిల దీస్తున్నాడు స్వామిని కవి. ఇంకో సందర్భంలో ఈ క్రింది విధంగా అంటున్నాడు - తనకలాన్ని ఝుళిపిస్తూ కవి -

**బిరుదు లటువెట్టి కోమటి పిరికి వగుచు**

"కోమటిపిరికి-కొడితే ఉరికి" అని లోకంలో సామెత. సామెతను అడ్డంపెట్టు కొని సంచరిస్తున్నావు అని అంటూ - బిరుదులు నీకు చాలా ఉన్నాయి. సంతోషం. వాటిని కాస్త పక్కన పెట్టి-కోమటితత్త్వాన్ని చూపించక-కత్తి పట్టి-దుర్మా ర్గులైన తురకసైన్యం మీదకు దండెత్తి రావేమయ్యా? అని దుయ్య పడుతున్నాడు కవి పై పద్యంలో. ఇదే విధంగా ఇంకో చోట "రాచబిడ్డవు గావొ విక్రమము లేదొ" అని అధిక్షేపిస్తాడు. నీవు రాచబిడ్డవు కావా? నీలో పరాక్రమం లేదా? నీలో రాజఠీవి లేదా? లేక నశించిందా? అంటూ వాపోతాడు కవి - స్వామిని చూస్తూ.

ఉత్తమ కావ్యాలు ధ్వని ప్రధానా లనీ, మధ్యమకావ్యాలు లక్ష్యార్థప్రధానా లనీ, వాచ్యార్థ ప్రధానాలైనవి క్షుద్రకావ్యా లనీ సంస్కృతాలంకారికులు పేర్కొంటూ ఉంటారు. భక్తిశతకాల్లో సాధారణంగా కవులు తమ హృదయగత భావాలను చనువుగా దేవునికి వాచ్యంగా వెల్లడిస్తూంటారు గనుక శతకాలను క్షుద్ర కావ్యాల్లోకి చేర్చారు. ఈ శతకం అక్కడక్కడా ధ్వనిప్రధానం. ఇతరమతాలపీడనుండి రక్షణ చేయమని-నిన్ను నీవు రక్షిం చుకో- అని కోరడంలో-లోకోపకారం ఉంది కనుక, ఈ శతకం ఉత్తమకావ్యాలకోవకు చెందుతుంది. సాహిత్యానికి చెప్పిన అసలు-సిసలైన ప్రయోజనాలు, ఈ శతకంవల్ల సిద్ధిస్తాయి.

# వినాయక చవితి

– డా॥ పి.బి.రెడ్డి

**శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణమ్ చతుర్భుజమ్,**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥**

పై ప్రార్థనా శ్లోకం ప్రతివారూ ప్రతిపనికీ ముందుగా చేసే గణేశప్రార్థన. భిన్నత్వంలో ఏకత్వాన్ని గోచరింపజేసే వాడు గణేశుడొక్కడే. ఏ పనిని ప్రారంభించేటప్పుడైనా ఏ వర్గం వారైనా అందరూ చేసేది విఘ్నహరుడైన విఘ్నేశ్వరుని పూజ. పార్వతీదేవి నలుగుపిండితో బొమ్మను చేసి, దానికి ప్రాణం పోయగా అది ముద్దులు మూటగట్టు బాలునిగా రూపు దాల్చింది. పార్వతీదేవి పరు లెవ్వరూ తన మందిరంలోకి రాకుండా ఆ బాలుని కాపలా ఉంచింది. లోపలికి రానున్న పరమేశ్వరుని ఉమాసుతుడు అడ్డగింపగా విషయం తెలీని పరమేశ్వరుడు ఆ బాలునిశిరస్సు ఖండించాడు. ఈ సంగతి తెలిసి పార్వతి బాధపడుతుంటే గజముఖాన్ని ఆ బాలుని శరీరానికి అతికించి, తిరిగి ప్రాణం పోయగా అతడు పునర్జీవి తుడయ్యాడు. ఆనాటినుండీ ఆ బాలుడు గజముఖుడు, గజా ననుడు అని పేరు గాంచాడు.

తల్లిదండ్రులే ప్రత్యక్షదైవా లని, వారి సేవే పరమార్థ మని వారిని సేవించి, మెప్పించి సర్వగణాధిపత్యాన్ని పొంది గణపతి అని ప్రసిద్ధి పొందాడు. గణపతి అనగా సర్వగణాలకు అధిపతి. కానీ, ఆయన సర్వగుణాలకుకూడా అధిపతియే. మన బుద్ధిని, సిద్ధసంకల్పంతో క్రమబద్ధం గావించి చేసిన సాధన, తలచిన లక్ష్యం సిద్ధి పొంది, తద్వారా లాభ, క్షేమా లనే వాటిని తనభక్తులకు ప్రసాదిస్తాడు – సిద్ధిగణపతి. ఆయన ప్రణవస్వరూపుడు, ప్రథమపూజ్యుడు, ఆదిదేవుడు. ఇక ఆయన రూపం కూడా వింతగానే ఉంటుంది.

కానీ, ఆయన ప్రతి అవయవమూ, ప్రతికదలికా లోకా నికి పరమార్థాన్ని బోధిస్తూ ఉంటుంది. ఏనుగు జంతువుల లోకెల్లా పెద్దది. ఎంతటి దట్టమైన అడవి మధ్యలోనైనా అది దారి చేసుకుని వెళ్ళగలదు. ఎంత లోతున్న నదిలోనైనా సునాయాసంగా ఈదగలదు. ఎంతటి బరువైన వస్తువునైనా అవలీలగా మోయగలదు. అనగా గజాననుడు తన భక్తులను జీవితారణ్యంనుండీ సునాయాసంగా నడిపించగల డని అర్థం. ఇక వినాయకుడివి చేటచెవులు. చేటలు పనికిరాని పొట్టును దూరంగా చెరిగి సారవంతమైన ధాన్యాన్ని తనలో ఉంచు కొంటాయి. అలాగే, వినాయకుడు తన భక్తులలోని దుష్ట సంకల్పాల్ని దూరంచేసి వారిలో పారమార్థిక చింతనను కల్గిస్తాడు. కన్నులు చిన్నవి! కానీ, దృష్టి తీక్షణం, క్రిందనున్న ఎంత చిన్న వస్తువైనా ఏనుగుదృష్టినుండీ తప్పించుకొని పోలేదు. సదా, కదులుతున్న తొండం తన భక్తులు ఎల్లప్పుడు జాగరూ కులై చైతన్యస్వరూపులై ఉండా లన్నదానికి సంకేతం. ఏనుగు తనశరీరంకన్నా తనయొక్క దంతానికే ఎక్కువ ప్రాముఖ్యత నిస్తుంది. అది దానికి అలంకారంకూడా. కానీ, అంబికా పుత్రుడు తన ప్రాణప్రదమైన దంతాన్ని పెరికి మహాభారత రచనకు ఘంటంగా ఉపయోగించాడు. మహాత్ములు లోకోపకా రానికై ఎంతటి త్యాగానికైనా వెను దీయరని నిరూపించాడు. అప్పటి నుండీ ఏక దంతుడై ప్రసిద్ధి పొందాడు.



**సెప్టెంబరు 1న**
**వినాయకచవితి సందర్భంగా**
**ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం**

## శ్రీపదకేళి - 26 (జూలై - 2011) విజేతలు

**1) నల్లపాటి రామకృష్ణ,**
ఇంటి నెం.5-62-195, 1వ లైను,
పండరీపురం, గుంటూరు - 522 002.

**2) విజాపురపు నరసింహారావు,**
ఇంటి నెం.1-18-38, అన్నపూర్ణ నిలయం,
ఎం.ఇ.ఎస్.కాలనీ, సికిందరాబాద్ - 500 015.

**3) వి.గరటయ్య,**
గాండ్లవీథి, పాపానాయుడు పేట,
చిత్తూరు జిల్లా - 517 526.

**సరైన సమాధానాలు రాసినవారు :**

ఆర్.సత్యకృష్ణకుమార్ (శ్రీకాకుళం); ఈమని గృహలక్ష్మి (తెనాలి); దీవి కృష్ణప్రసాద్ (విజయవాడ); తిన్నవెళ్ళి కృష్ణయ్య (మార్కాపురం); గుర్రం రంగయ్య (ప్రొద్దుటూరు); ఎం.శ్రీసుధ (కోయిలకొండ, కర్నూలు జిల్లా); బలిరెడ్డ బ్రహ్మలింగస్వామి (గోవాడ, విశాఖ జిల్లా); చెన్నా వెంకటేశ్వర్లు (ప్రొద్దుటూరు); అనుముల బదరీనారాయణ (జమ్మలమడుగు); ముత్తారెడ్డి వెంగళ రెడ్డి (మార్కాపురం); నారాయిణం వైదేహి (తిరుమల); సి.వి.కే.వై.శర్మ (గుంటూరు); వేదాంత గీతాకృష్ణ (తెనాలి); వి.నాగరత్నం (నెల్లూరు); యల్లకర నీళావతి (హైదరాబాద్); మైనంపాటి వరప్రసాదరావు(ఒంగోలు); పి.ఆర్.నాయుడు (తిరుపతి); ఎన్.అప్పాజి (డి.వి.పల్లె, కడపజిల్లా); తిన్నవెళ్ళి నరసింహారావు (మర్కాపురం); డి.ముక్తేశ్వర్ (మోపిదేవి); గుండాల సత్యనారాయణ (పేట సన్నెగండ్ల, గుంటూరు జిల్లా); వల్లభ జోస్యుల జలజ (గుంటూరు); పులివర్తి భానులక్ష్మీ కుమారి (తెనాలి).

**:: *శ్రీపదకేళి-26 (జూలై, 2011) సమాధానాలు* ::**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 రా | | 2 పా | | 3 ఘో | ష | 4 యా | త్ర | |
| 5 క్ష | ప | కు | డు | | | మి | | 6 అ |
| సు | | డు | | 7 స | | నీ | | శ్వ |
| లు | | | | తీ | | పూ | | మే |
| | 8 చం | | | సా | | ర్ణ | | ధ |
| 9 రు | ద్ర | మ | దే | వి | | తి | | ద |
| | గు | | | త్రి | | ల | | త్తు |
| | ప్తు | | 10 దృ | | 11 శం | క | రు | డు |
| | డు | | హి | | ప | | | |

ఇక పెద్దబొజ్జ! సమస్తవిశ్వాన్ని తన కుక్షిలో ధరించి విశ్వంభరుడైనాడు. బొజ్జపెద్దదైనా ఆహారం సాత్త్వికం, బుద్ధి కుశలం. కుడుములు, ఉండ్రాళ్ళు, టెంకాయ, పానకం, వడపప్పు ఆయనకు నివేదనచేసేవి. రకరకాల పత్రితో ఆయనను పూజిస్తాం. ఇరవై ఒక్క రకాలైన ఆకులతో పూజిస్తాం. అందులోని ఒక్కొక్క ఆకు ఒక్కొక్క వైద్యగుణం కలిగి ఉంది. పూజా సమయంలో వాటి మీద నుండీ వచ్చే గాలి పీల్చి మనం కొంత ఆరోగ్యాన్ని పొందవచ్చు. వినాయకునికి నివేదించిన ప్రసాదం కూడా పిండి, పప్పు, పండ్లు, తేనె, బెల్లం, టెంకాయ ఇవన్నీ కూడా బలవర్ధకమైన ఆహారాలే. వినాయకుడు చతుర్భుజాలు గలవాడు. ఒక చేతిలో పాశం, మరొక చేతిలో అంకుశం, వేరొక చేతిలో మోదకం, ఇంకొక చేతిలో అభయముద్ర కలిగి ఉంటాడు. మొదటిదైన పాశంతో భక్తులనాకర్షించి బంధిస్తాడు. అంకుశం భక్తులలోని దుర్గుణాలను, దుశ్చింతనలను, అజ్ఞానాన్ని పోగొట్టుతుంది. మోదకానికి గుర్తు కోరినవన్నీ ఇస్తా నని. నాలుగవచేతిలోని అభయముద్ర మనలోని సర్వభయాల్ని పారద్రోలి అభయదానం చేసేదానికి సంకేతం. భాద్ర పదశుద్ధచవితి వినాయకుడు పుట్టినరోజు. ఆ రోజు సర్వవిఘ్న హరుడైన విఘ్నేశ్వరుని 21 రకాల పత్రితో, భక్తి శ్రద్ధలతో పూజించి నైవేద్యాలు నివేదించాలి. సత్సంకల్పంతో, మంచిమనస్సుతో మనం చేసే పనులన్నీ నిర్విఘ్నంగా జరగవలెనని ఏకదంతుని ప్రార్థించాలి. గణపతిపూజకు అందరూ అర్హులే. భాషాభేదాలు లేవు. ప్రతిమనిషిలోనూ స్వార్థ చింతన పెరిగిన ఈ రోజుల్లో దాన్ని పోగొట్టి ప్రతివారికి సిద్ధిని బుద్ధినిచ్చి, లాభక్షేమాలనివ్వమని సిద్ధిగణపతిని కోరుకుందాం.

వినాయకచతుర్థిరోజు శ్రీమహాసరస్వతిని కూడా పూజిస్తారు. ఆమె కళల కాణాచి. మన మాటా, పాటా కూడా ఆమె అనుగ్రహంవల్ల కల్గినవే. ముఖ్యంగా విద్యార్థులు ఈ పండుగను బాగా జరుపుకుంటారు. వినాయకుని ప్రక్కన విద్యార్థులు పాఠ్యపుస్తకాలను, గృహస్థులు పురాణ గ్రంథాలను, వ్యాపారస్థులు తమలెక్కల పుస్తకాలను పెట్టి పుస్తకరూపంలో సర్వకళామతల్లి అయిన వాగ్దేవిని పూజిస్తారు. శ్రీ మహాగణాధిపతి, శ్రీమహాసరస్వతి ఇరువురూ మనకు సద్బుద్ధిని, సద్విద్యను ప్రసాదించువారే. కాబట్టి త్రికరణశుద్ధిగా వారిని పూజించి, సేవించి సకల కార్యసిద్ధిని పొందుదాం.



# సెప్టెంబరు, 2011
# రాశి ఫలాలు



**- జె. చంద్రశేఖరశర్మ**



## మేష రాశి

ఈ మాసంలో ఈ రాశివారు సుదీర్ఘప్రయాణాలకు, విందువినోదాలకు విపరీతంగా ధనం ఖర్చు చేస్తారు. ఫలితంగా పలు ఆర్థిక ఇబ్బందులు ఏర్పడుతాయి. శనిత్రయోదశి నాడు తైలాభిషేకం చేయటంవల్ల రుణబాధలు, మానసిక ఆందో ళనలు తీరుతాయి. సోదరులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. మొదటివారం దైవారాధనలు, రెండోవారం ఆందోళనలు, మూడోవారం సంతోషం, నాలుగోవారం కార్యజయం.



## వృషభ రాశి

ఈ రాశివారికి ఈమాసంలో అన్నివిధాలా అను కూలమైన కాలం. క్రయవిక్రయాలవల్ల ఆశించిన దానికంటే రెట్టింపు ధనాదాయాన్ని పొందుతారు. ప్రతి పనిలో విజయం వరిస్తుంది. విదేశీ ప్రయాణం అనుకూలం. విలువైన ఆభరణాలు కొనుగోలు చేస్తారు. పిత్రార్జిత ఆస్తి కలిసివస్తుంది. పెండింగు వ్యవహారాలు పూర్తి కావటానికి గణపతి నవరాత్రి ఆరాధనలు, అమావాస్యనాడు పెద్దలకు తర్పణాలు ఆచరించండి. మొదటి వారం శుభవార్త, రెండోవారం విజయం, మూడోవారం ధనా దాయం, నాలుగోవారం ఆనందం.



## మిథున రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో అనారోగ్య సమస్యలు ఏర్పడుతాయి. వెండి, బంగారు వర్తకులకు, మహిళలకు అదృష్టకాలం. మొదటివారం ఆందోళన, రెండోవారం అనా రోగ్యం, మూడోవారం రాజకీయ ఎదుగుదల, నాలుగోవారం పితృతర్పణాలు.



## కర్కాటక రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో పనులలో ఆటంకాలు, ఆకస్మిక ప్రమాదాలు అందోళన కల్గిస్తాయి. గణపతిపూజల వల్ల కొంత ఉపశాంతి కల్గుతుంది. శనిత్రయోదశి పూజలవల్ల గృహదోషాలు తొలుగుతాయి. ఎంతోకాలంగా ఎదురు చూస్తున్న వ్యవహారాలు చేజారిపోయే అవకాశం ఉంది. మహిళలకు అనారోగ్య సమస్యలు శస్త్రచికిత్సకు దారితీస్తాయి. మొదటివారం విగ్రహారాధన, రెండోవారం ధనప్రాప్తి, మూడోవారం స్వల్ప అనారోగ్యం, నాలుగోవారం విజయం.



## సింహ రాశి

ఈ మాసంలో ఈ రాశివారికి మానసిక ఆందోళనలు, సుదూర ప్రయాణాలు, వృథా ఖర్చు, శ్రమ, తదితర సమస్యలు ఇబ్బంది పెడతాయి. ప్రతిపనిలో ఆటంకాలు, ప్రతిమాట వివాదస్పదమౌతుంది. తక్కువ మాట్లాడుట మంచిది. ఉద్యో గుల బదిలీ ప్రయత్నాలు నెరవేరుతాయి. మొదటివారం ప్రయా ణాలు, రెండోవారం ఆటంకాలు, మూడోవారం దైవారాధనలు, నాలుగోవారం అనారోగ్యం.



## కన్యా రాశి

ఈ నెలలో వీరికి శత్రుబాధలు అధికంగా ఉంటాయి. చేయు వృత్తి, వ్యాపారాల్లో పలు ఆందోళనలు కల్గుతాయి. గణేశ విగ్రహారాధనపూజలు, శనిత్రయోదశి జపపూజలు మేలు చేస్తాయి. ధనాదాయం బాగుంటుంది. నరదృష్టివల్ల కడుపు, కాళ్ల నొప్పులు కల్గుతాయి. మొదటివారం దైవారాధనలు, రెండో వారం ఆందోళన, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ఉన్నత పదవిప్రాప్తి.



## తులా రాశి

ఈ మాసంలో వీరికి సంతానంకోసం చేయు ప్రయ త్నాలు విజయం చేకూరుస్తాయి. చిన్నపిల్లలకు పలు వైద్య పరీ క్షలు చేయవలసివస్తుంది. ఆర్థిక ఇబ్బందులు ఆందోళన కల్గిస్తాయి. మొదటివారం అనారోగ్యం, రెండోవారం క్షేత్ర దర్శనం, మూడోవారం ఆనందం, నాలుగోవారం శుభవార్తలు.

## సంప్రదాయ దుస్తులను ధరించండి!

1. తిరుమల శ్రీవారి దర్శనానికి విచ్చేయు భక్తులు తప్పని సరిగా సరియైన వస్త్రధారణతో రావలెను.
2. సరియైన వస్త్రధారణ అనగా **పురుషులు ఫ్యాంటు, షర్టుగాని, లాల్చీ పైజామాకాని, పంచ, కండువ గాని** ధరించవలెను. **స్త్రీలు చీర గాని, సల్వార్ కమీజ్** గాని **ధరించి** రావలెను.
3. **అలాకాక ఎవరైనా నిక్కర్లతోగాని, టీ షర్టులతోగాని, బర్ముడాలతో గాని దర్శనానికై వచ్చినయెడల అను మతించబడరు. వీరిని 'క్యూ కాంప్లెక్స్' మొదటిలోనే దుస్తులు మార్చుకొనిరావల్సిందిగా కోరడం జరుగు తుంది.**
4. **ఈ నియమం 2010, జూన్ 7వ తేదీ నుండి అమల్లోకి వచ్చింది.**
5. భక్తులు దేవస్థానం అధికారులతో సహకరించ వలసిందిగా కోరుతున్నాము.

**– కార్యనిర్వహణాధికారి**



### వృశ్చిక రాశి

ఈ రాశివారికి ఈ నెలలో వృత్తి వ్యాపారాల్లో నమ్మిన వ్యక్తులవల్ల మోసం ఫలితంగా కష్టనష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది. ప్రతిపనిలో పలుఆటంకాలు ఎదురౌతాయి. వినాయక వ్రత కల్పం, పూజలు మేలు చేస్తాయి. వ్యవసాయదారులు పంటమీద దృష్టి పెడితే ఫలితం రెట్టింపు ఉంటుంది. మొదటి వారం ఆటంకాలు, రెండోవారం కార్యజయం, మూడోవారం అనారోగ్యం, నాలుగోవారం ఆందోళనలు.



### ధనూ రాశి

ఈ రాశివారికి ఈ నెలలో అన్నీ శుభపరిణామాలే. క్రయవిక్రయాలవల్ల అధికధనలాభం. ఒప్పుకున్న పనులు, అనుకున్న సమయానికి పూర్తి చేస్తారు. బంధుమిత్రుల సహకారం పరిపూర్ణంగా వినియోగించుకుంటారు. మహిళలకు కాళ్ల నొప్పులు, పలు అనారోగ్యాలు కల్గుతాయి. మొదటివారం ధన లాభం, రెండోవారం ఆనందం, మూడోవారం శుభవార్తలు, నాలుగోవారం స్వల్ప అనారోగ్యం.



### మకర రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో వృత్తి ఉద్యోగాల్లో బాగా రాణిస్తారు. విదేశీప్రయాణాలు అనుకూలం. ఇంట్లో దైవా రాధనలు జరగటంవల్ల మానసికానందం. వెండి, బంగారు వర్తకులు నమ్మినవ్యక్తులవల్ల మోసపోతారు. విలువైన వస్తువులు అపహరణకు గురయ్యే అవకాశం ఉంది. జాగ్రత్త వహించగలరు. ధార్మికసేవా కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొ నటం వల్ల మానసికానందం. మొదటివారం సంతోషం, రెండో వారం కార్యజయం, మూడోవారం ప్రశాంతత, నాలుగోవారం విజయం.



### కుంభ రాశి

వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా బాగా ఉన్నా, ఇంటి సమస్యలు, గతంలోని పొరపాట్లు మానసికవేదనకు గురి చేస్తాయి. వెండి, బంగారు, పసుపు, నూనె వ్యాపారులకు అదృష్టకాలం. ప్రభుత్వఉద్యోగులకు ప్రభుత్వశుభవార్త ఆనం దాన్నిస్తుంది. అకాలవర్షాలు అనారోగ్యాలకు కారణమౌ తాయి. మొదటివారం ఆందోళన, రెండోవారం వినాయక పూజలు, మూడోవారం ధనాదాయం, నాలుగోవారం శుభ కార్యాలు, దైవచింతన.



### మీన రాశి

ఈ రాశివారికి ఈ మాసంలో దీర్ఘకాలికంగా పెండింగ్‌లో ఉన్న కోర్టు వ్యవహారాల్లో విజయం సాధిస్తారు. వివాహ ప్రయత్నాలు అనుకూలం. చేయు వృత్తి వ్యాపారాల్లో కలిగే ఆటంకాలు నివారణకై గణపతి పూజలు, శని త్రయోదశి పూజలతో పాటు కుటుంబ సౌఖ్యంకోసం చనిపోయిన పెద్దలకు తర్పణాలు చేయటం మంచిది. రైతులకు అకాలవర్షాలు, తెగుళ్ళు పంట రాబడిని తగ్గిస్తాయి. మొదటివారం కార్యజయం, రెండోవారం దైవచింతన, మూడోవారం ఆనందం, నాలుగో వారం పదవీయోగం.

# అండగా ఉండే స్వామి!!

**సి.ఎ.వి.నరసింహబాబు**

**మా** కులదైవమైన వేంకటేశ్వరస్వామిని దర్శించుకొనుటకు ఎప్పటిలా ఈ సంవత్సరం కూడా మార్చిలో తిరుపతికి వచ్చాను. నేను ఎప్పటినుండో ఇలా వస్తున్నాను. నాకిప్పుడు అరవైఏడుసంవత్సరాల వయస్సు. కొండకు కాలినడకన అలిపిరి మీదుగా పోవా లనిపించింది. ఎందుకో ఇప్పుడు పోలేక పోతే మరెప్పుడూ పోలేనేమోన నిపించింది. అంతకు ముందో సారి పాదాలమండపంనుండి తిరుమలకు వెళ్ళి స్వామివారిని దర్శించుకున్నాను. అలిపిరినుండి తిరుమల పోవడం ఓ మంచి అనుభూతి. మా అమ్మాయి ఇల్లు తిరుపతిలో కపిల తీర్థానికి దగ్గరగా ఉంది. ఉచితబస్సులయినా, సిటీ బస్సులయినా కపిలతీర్థంవద్దకు వస్తాయి. ఆ రోజు ఇంటర్మీడియేట్ పరీక్షలని ఒక బస్సూ రాలేదు. సరే ఎలాగూ నడిచిపోతున్నాం గదా అని, ఇది కూడా భగవంతుని పరీక్షే అని నడక ప్రారంభించాను. ఉదయం ఎనిమిది గంటలకు మొదలెట్టి నిదానంగా సాయంత్రం మూడుగంటలకు తిరుమల ఎట్లాగో చేరుకున్నాను. దేవుని దర్శనం రాత్రి పదిగంటలకు చేసికొన్నాను. అది సీనియర్ సిటి జన్స్ క్యూ అయినా అందర్నీ ఒకేసారి వదిలారు.




అప్పుడే తిరుపతిలోనే సుప్రభాతం దర్శనం రిజర్వు చేసుకున్నాను. 'మే' నెల అయిదవతారీఖున సుప్రభాతం సేవ టిక్కెట్టు ఇచ్చారు. విచిత్రంగా మార్చి 25వ తారీఖున మా బెడ్ రూములో క్రిందపడి నా ఎడమకాలుతుంటిఎముక విరిగింది. ఇరవై ఏడవ తారీఖున ఆపరేషన్ జరిగింది. ఒక స్టీలు బాలు కాలులో అమర్చారు. మా సుప్రభాత దర్శనం మే 5వ తారీఖు. డాక్టరును అడిగితే ఎలా పోతా రన్నాడు. అయినా అపూర్వ అవకాశాన్ని ఎలా వదలుకుంటాం.

అందుకే, నేను మా ఆవిడ రాత్రి ఏడుగంటలకు కొండమీదకు చేరుకున్నాము. కాలువిరిగిన వారికి అని సౌక ర్యాలు ఉన్న రూము కావా లని సి.ఆర్.ఓ. ఆఫీసులో పదే పదే అడిగాము. రాంబగీచాలో కొన్ని ఉన్నాయి. అక్కడకు వెళ్లి కనుక్కోండి అన్నాడు. నేనసలే కర్ర పెట్టుకొని నడవాలి. పైగా వర్షం వస్తోంది. ఎలాగోలా ఇబ్బంది పడుతూ రాంబగీచాకు వచ్చాము. అక్కడ విచారిస్తే అన్నీ ఇచ్చేసాం అన్నారు. తర్వాత ఆ భగవంతుడు ఏమి బుద్ధి పుట్టించాడో కాని ఒకటుంది అని రూము నెంబరు చెప్పాడు. ఆ పాటికి సమయం రాత్రి ఎనిమిదిన్నర అయ్యింది. సరే ఉచితబస్సు ఉంది కదా అనుకుంటే ఒక్కటి రాలేదు.

మళ్లీ మెల్లగా నడిచి సి.ఆర్.ఓ. ఆఫీసుకు పోయాము. రూము మార్చుకోవాలంటే మేడ మీదకు వెళ్ళి మార్చుకోవా లన్నారు. ఇది ఇంకో పరీక్ష. మేడమీదకు పోవడం అనేది అపరేషన్ తర్వాత అదే మొదలు. అయినా తప్పదు కదా. ఎలాగో రూము మార్చుకొని మళ్ళీ ఉచితబస్సుకోసం నిలబడ్డాను. బస్సు ఎప్పటికీ రాలేదు. అప్పటికి సమయం తొమ్మిదిన్నర దాటింది. ఒకబస్సు వచ్చింది. కానీ విపరీతమైన జనంవల్ల ఎక్కలేక ఇంకో బస్సు కోసం ఎదురు చూశాను. బ్రతుకు జీవుడా అనిపించింది. లేపాక్షి దగ్గర దిగి పొమ్మన్నాడు. దాంతో మళ్లీ నడక.

ప్రొద్దున్నే మూడుగంటలకు సుప్రభాతం. క్యూలో రాత్రి ఒకటిన్నరకే నిలబడ్డాము. కాళ్లు లాగుతున్నాయి. చివరకు ఆ భగవంతుని దయవల్ల సుప్రభాత దర్శనం చేసుకున్నాము. భగవంతుని దయ ఉంటే ఎన్ని కష్టాలయినా భరించే శక్తి ఆ దేవుడే ఇస్తా డన్న దానికి ఇదో ఉదాహరణ. ఇలాంటి కష్టా లొస్తాయనే ఏమో ఆ స్వామి ముందు గానే నాచే కాలినడకన రప్పించుకున్నా డనిపిస్తుంది. ఎప్పుడు కొండకు రావాలన్నా, ఎలా రావాలన్నా అంతా ఆ వేంకటేశ్వరస్వామి అనుమతి లేనిదే మనం ఎంత ప్రయత్నించినా కాదేమో!

అందుకే ఎంత చిన్న ప్రయాణమైనా మేము ఆ శ్రీనివాసుని తలవనిదే బయటకు బయలుదేరము- స్వామివారిని తలచుకొని బయలుదేరితే స్వామివారే మనకు అండగా ఉండి ఏ కష్టాలు రాకుండా చూస్తా రనే భావనతో.




**(తిరుమల ఆలయానికి సంబంధించిన వ్యవస్థీకృత మార్పులను ఈ సంచికలో చదవవచ్చు.)**

**ధారావాహిక - 104**

### 14) దేవాలయవ్యవస్థీకృతమార్పులు :

15, 16 శతాబ్దాల కాలంలో పుంఖానుపుంఖంగా ఆధారద్రవ్యదానాలరూపంలో దేవాలయానికి భూ, ధన రూపంలో దానం చేయడంవల్ల దేవాలయ కార్యనిర్వహణ విధానంలో క్రమేపీ పలు వ్యవస్థీకృత మార్పులు చోటు చేసుకున్నాయి. 15వ శతాబ్దం ద్వితీయార్ధానికి-16వశతాబ్ద ద్వితీయార్ధానికీ మధ్యకాలంలో అనేకమంది భక్తులు దేవాలయానికి షరతులతోకూడిన ఆధారద్రవ్యదానాలుగా ధనాన్ని, భూములను దానంచేసినందున మొదట సుమారు 15 గ్రామాలను కలిగియుండిన దేవాలయం (ఈ 15 అనే సంఖ్య సత్యశోధనకుగాను తాత్కాలికంగా గ్రహించబడినది. బహుశః దేవాలయ గ్రామాలు ఇంతకన్నా అధికంగానే ఉండి ఉండవచ్చు. 15వ శతాబ్దానికి పూర్వం తిరుమలదేవాలయం నిర్మాణ, పునర్నిర్మాణాలు జరుపబడిన సందర్భాలలో అనేక శాసనాలు చెడి పోయి ఉండవచ్చని భావించడానికి అవకాశం ఉంది.) గ్రామాల సంఖ్య 100 వరకు పెరిగింది. ఈ ధనం ఉత్పాదకరంగాలలో పెట్టుబడిపెట్టి వార్షికాదాయాన్ని పొందుతూ ఆ ధనాన్ని షరతుల ప్రకారం భక్తుల కోరికలను నెరవేర్చవలసిన బాధ్యత దేవాలయ అధికారులపై పడింది. కార్యభారానికి తగ్గట్టు వీరి నిర్వహణ శైలి యందును, విధివిధానాలలో సహజంగానే మార్పులు చోటు చేసుకున్నాయి.

త్వరితగతిలో అభివృద్ధిపథంలో పయనిస్తున్న ఈ సుమారు వందసంవత్సరాలకాలంలో దేవాలయ ప్రధాన లౌకిక వ్యవహార విధానసరళిలో ఎటువంటి మార్పులేక సాగిపోయింది. కార్యనిర్వహణఅంతా కూడ 12 మంది సభ్యులు కల ధర్మకర్తల మండలి (స్థానత్తారులు) పరిపాలనాధికారంలో ఉండింది. ఈ ధర్మకర్తల మండలిలోని 7మంది సభ్యులు తిరుమలకు చెందియుండి లౌకికులైన సాధారణజనులు. మిగతా 5 గురుసభ్యులు దేవాలయానికి చెందిన కార్యనిర్వహణాధికారులు. దేవస్థాన కార్యనిర్వాహణదక్షులైన అధికారులు, వారిక్రింద దేవస్థాన సిబ్బంది అయిన కార్యనిర్వాహకులు మరియు దేవాలయ గణాంకకులు ఉంటారు.

**ఆశను వైరాగ్య మనే ఖడ్గంతో తెగనరుకు;**
**ఓర్పు కలిగి ఉండు;**
**మదాన్ని మట్టుపెట్టు;**
**పాపకార్యాలపై ప్రీతి చూపకు;**
**నిజం చెప్పు;**
**సాధుమార్గం అనుసరించు;**
**పండితులను సేవించు;**
**పూజ్యులను పూజించు;**
**పగవాళ్ళనుసైతం ఆదరించు;**
**వినయం ప్రదర్శించు;**
**కీర్తిని కాపాడుకో;**
**దుఃఖించే దీనులపట్ల దయజూపు.**
**(ఇది సత్పురుషుల నడవడి)**

14వ శతాబ్దంచివర్లో ఉత్స వాలు, ఆహారనైవేద్యాలు పరిమితసంఖ్యలో జరుగుచుండినకాలంలో దేవాలయానికి సంబంధించిన లౌకికవ్యవహారాల నిర్వ హణ స్థానత్తారువ్యవస్థ కొత్తగా తేబడింది. విజయనగరరాజుల ప్రాప కంలో ఈ దేవాలయానికి భూదాన రూపంలో, ధనరూపంలో ఆస్తులు పెరు గుతూ వచ్చాయి. ఆలయం కూడా విస్తరిం చింది. చిన్నచిన్న గుడులు వెలిశాయి. తండోపతండాలుగా వచ్చే యాత్రికుల కోసం అన్నసత్రాలు, విశ్రాంతిశాలలు నెల కొల్పబడినాయి. ఆగమోక్తవిధానాన్ని అనుసరించి నిర్వహిస్తున్న దేవాలయ పరిసరాలలో ఇటువంటి చిన్నచిన్న సంస్థలు వెలుస్తుండడం దేవాలయం యొక్క మరియు దక్షిణభారతదేశంలోని ఇతర ప్రఖ్యాత దేవాలయాల విషయంలో కూడ సహజసిద్ధమైన అభివృద్ధిద్యోతక చిహ్నాలుగా భావించవచ్చు.

క్రీ.శ.1456 సంవత్సరం నుండి 1570 సంవత్సరం వరకు గల మధ్య కాలంలో తిరుపతిలో స్థాపించబడిన అనేక చిన్న మరియు సహాయకసంస్థల పరిపాలన తీరు, క్రీ.శ.1456 సంవ త్సరానికి ముందు స్థాపించిన సంస్థల పాలన విధానంకంటే భిన్నంగా ఉంది. ఈ నూతనసంస్థలు స్వయంపరిపాలన మరియు స్వయంఆర్థికతతో ప్రాము ఖ్యాన్ని సంతరించుకొన్నవి. కార్యనిర్వ హణకు మేనేజరు(కర్తర్), స్వంతభాండా గారం, గిడ్డంగి కలిగియుండేవి. ఈ కొత్త సంస్థలకు శాశ్వతంగా ఉండు నట్టి ఆధార

# శ్రీ వేంకటేశ్వర స్తుతి

శ్రీసరసీరుహ ప్రసవ సేవిత కోమల విగ్రహా! భవ
ద్వాసము, భానుమండలమొ? స్వాదుగభీరపయస్సముద్రమో?
దాసమొ? భక్తచిత్తమొ? పురందర శంకర పద్మసంభవుల్
వీస మెఱుంగ లేరు, ప్రజ పేర్కొననేర్చునె? వేంకటేశ్వరా!

శ్రీవరణీయనూత్నమణి జృంభితచారుకిరీటమౌళి! స
ద్భావనికస్వర ప్రచురపద్మసరోవర రాజహంస! నా
నావనమాలికాభరణ! నందన చందన గంధబంధురా!
దైవత సార్వభౌమ! బహుధార్మిక సుందర! వేంకటేశ్వరా!

తూరుపు తెల్లవారె, విబుధుల్ శ్రుతిపాదము లింపుగా, నినుం
జేరగఁ బల్కుచుండి, రభిషేక మొనర్పగ, వేళయయ్యె, బృం
దారక సుప్రభాత సముదంచిత మంగళగీతికాస్తుతుల్,
ద్వారము చెంత, విన్పడగ, వైళమ మేల్కొను, వేంకటేశ్వరా!

ఆలయఘంటికారవము లంతట మ్రోగుచు, నోంకృతి స్వరం
బై, లలితోక్తమంత్రపదనార్చనరీతికిఁ బుష్టిగూర్ప, రా
గాల, స్వరాల, ఊల్గరుగ, గాయకబృందము ప్రస్తుతింపగా,
వ్రాలిన పక్షు లందముగఁ బాడగ, మేల్కొను, వేంకటేశ్వరా!

స్వామి! పరాకు! భక్తజనపాల! పరాకు! వికుంఠతిర్మలా
రామవసంతకోకిల! పరాకు! రమాదరహాసచంద్రికా
ధామ! పరాకు! హేమమణి దామ! పరాకు! సమస్తనాస్తిక
స్తోమవివాదదుర్ణయవిదూర! పరాకులు! వేంకటేశ్వరా!

వేదవిదుల్, ప్రశాంతముగ, వేకువ వేళనె, వేచి, స్నాతువై,
మూదల నిల్చి, వెన్నయును, బొంగలి, భక్ష్యము, మోదకమ్ము, ద
ధ్యోదనమున్, వడల్ పెరుగు లొప్పగ, బంగరు గిన్నెలం దిడన్
మోదముతోఁ గనుం గొనవె? మోక్ష మొసంగవె? వేంకటేశ్వరా!

– డా॥ వారణాసి శివరామకృష్ణ

| ధారావాహిక 09 | # మందార మకరందాలు |
|---|---|

**చేతులారంగ శివునిఁ బూజింపఁడేని**
**నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని**
**దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ**
**గలుగ నేటికిఁ దల్లులకడుపు చేటు.**

శివుని పూజించడం, హరిని కీర్తించడం, దయనూ, సత్యాన్నీ ధర్మాలుగా భావించడం జన్మసాఫల్యానికి సాధనా లని పోతన్న విశ్వాసం. ఇవి లేనివానిజీవితం వ్యర్థం. వ్యర్థుణ్ణి ఈసడించడానికి "వాడు తల్లికడుపున చెడబుట్టినా"డని నేటికీ వాడుతుంటాం. ఇది నాటివాడుకకూడా. "కడుపుచేటు" అన్న నుడికారం పాఠకుల గుండెల్లో సూటిగా దూసుకుపోయే రామబాణం.

శివకేశవుల అద్వైతాన్ని వ్యంగ్యంగా ప్రతిపాదించడం ఈ పద్యంలోని మరొకవిశేషం.

**- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా॥ సి. నారాయణ రెడ్డి**

ద్రవ్యదానాలను (permanent endowments) కలిగియుండేవి. వాటిద్వారా లభించే ఆదాయం ఆ సంస్థలదే కానీ, దేవాలయ రాబడిలోనిది కాదు. అందుచేత ఈ నూతన సంస్థల అభివృద్ధి దేవాలయం యొక్క ప్రధాన మూలవ్యవస్థను ప్రభావితం చేయనప్పటికీ, దేవాలయ కార్యనిర్వహణ విధానంలో కొన్ని ప్రధానమార్పులకు లోనైంది. స్థానత్తారువద్ద కేంద్రీకృతమై ఉన్న అధికారపు బిగువుయొక్క పట్టు కొంతసడలినప్పటికీని, మొత్తంమీద పర్యవేక్షణాధికారం స్థానత్తారుచేతిలోనే ఉండినట్లు విశదమౌతోంది.

పరిపాలనకు సంబధించిన వికేంద్రీకరణవల్ల, లౌకిక వ్యవహారనిర్వహణ విషయంలో రెండు ప్రధానమార్పులు చోటు చేసుకొన్నాయి. మొదటిది ఆధారద్రవ్యదానరూపంలో దానం చేసిన ధనాన్ని దేవాలయగ్రామాల్లో పెట్టుబడిపెట్టడానికి ప్రత్యేకనైపుణ్యం ఆవశ్యకమైనందున దేవాలయకార్యనిర్వాహకులే ఈ కార్యాన్ని చేపట్టారు. అంతే కాదు, ఇంతకు పూర్వం కన్నా అధిక సంఖ్యలో భక్తజనులకు దైవప్రసాదం లభ్యమయ్యేట్లు చర్యలు గైకొన్నారు. చాలా మంది భక్తజనులు షరతులతో కూడిన ఆధారద్రవ్యదానాలను చేయడానికి ఉత్సాహం చూపడంవలననూ, ఆ కారణాన దైవానికి సమర్పించిన నైవేద్యం అంటే ప్రసాదనైవేద్యాలు కూడ అదే విధంగా అధికమవడంతో ఈ విధమైన పెట్టుబడి పెట్టడం ఆలయాధికారులు చేసి ఉంటారు. రెండది ఏమంటే, ఈ నూతనసంస్థల దైనందిన నిర్వహణ అంతా మేనేజరు (కర్తరు)కు మరియు ఈ సంస్థలకు సంబంధించిన కార్యనిర్వాహకులకు అప్పజెప్పబడింది. దేవాలయ ప్రధాన నిర్వహణాధికారులైన స్థానత్తారులు ప్రధాన దేవాలయాలైన శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం, శ్రీ గోవిందరాజస్వామి దేవాలయాల వ్యవహారాల పర్యవేక్షకులుగా ఉంటూ ఈ నూతనసంస్థలపై సాధారణపర్యవేక్షణ చేస్తూ ఉంటారు.

ఈ కార్యనిర్వహణాధికార వికేంద్రీకరణ నిస్సందేహంగా మేనేజరులు అధిక శ్రద్ధతోను, సామర్థ్యంతోను పని చేయడానికి దోహదకారి అయింది. తమ సంస్థల కార్యకలాపాలలోను, అందునా ముఖ్యంగా ఆర్థికవ్యవహార లావాదేవీలలోను, తమ సంస్థల వ్యవహారాలలోను శ్రద్ధవహించువారికి అధికారం ఇవ్వడంవలన దేవాలయ కార్యనిర్వాహకులకు పెట్టుబడుల కార్యక్రమాలపైన, ప్రధాన దేవాలయాలపైనను తగినంత శ్రద్ధ వహించే అవకాశం వచ్చింది.

15, 16వ శతాబ్దాల మధ్యకాలంలో దేవాలయానికి లౌకికవ్యవహార నిర్వహణ విషయమై అవలంబించిన విధానం వలన దేవాలయానికిచెందిన ధన, భూవనరుల ఉత్పాదనలను అభివృద్ధిపరచి పెంపొందించడ మనేది సాధించిన ఘనకార్యంగా

చెప్పవచ్చును. పెద్ద మొత్తాలలో సమర్పించిన షరతులతో కూడిన ఆధార ద్రవ్యదాన నిధులను ఎక్కువకాలం సుస్థిరంగా, తగినంత ఆదాయం ఇచ్చేటటువంటి సురక్షితమైన పెట్టుబడులలో పెట్టుబడి పెట్టడం అంత తేలికైనకార్యం కాదు. మిక్కిలి బాధ్యతతో కూడిన కార్యమవడంవల్ల జాగరూకత, ముందుచూపు అవసరం. ఆధారద్రవ్యదాననిధులను దేవాలయ గ్రామాలలో పెట్టుబడిగా పెట్టినట్లయితే వార్షికాదాయంగా, అందువలన ఎంత లభించగలదన్న విషయమై దేవాలయ కార్యనిర్వాహకులు ఒకస్పష్టమైన అవగాహన ముందుగానే కలిగి యుండడం అవశ్యం. అప్పుడే, వారు దాతపేరుమీద వార్షికాదాయంగా దైవానికి నివేదించే ప్రసాదంయొక్క ధన విలువను **ఇంత** అని నిర్ణయపూర్వకంగా నిర్ధారించగలరు. పంటలను పండించినందుకు ఫలితంగా లభించే వార్షికాదాయంలో **చిన్నభాగం** పొందు హక్కును కలిగియున్న కారణాన ఆ దేవాలయ గ్రామభూముల నుండి లభించే అధికఫలసాయంలో ఏ నిష్పత్తిలో ఆ రైతులతో పంచుకొనవలసియున్నదనే విషయమై అవగాహనను కలిగియుండవలసిన ఆవశ్యకతకూడ ఆలయ అధికారులపైనే ఉన్నది. అంతేకాదు, పొలాలలో పంటల అధికదిగుబడిని సాధించడానికి ఆలయంలోని పనులశాఖవారి సహకారంతో కొత్తగా చెఱువులను, పంట కాలువలను ఏర్పరచడం వారిబాధ్యత.

చివరిగా, దాతలవంతుకు రాగల ప్రసాదభాగాలను దాతలకు లేదా వారిచే నిర్దేశింపబడినవారికే అందజేయాల్సిన బాధ్యత ఉన్నది. షరతులతో కూడిన ఆధారద్రవ్యదానాలుగా పెద్ద మొత్తాలలో వచ్చిన వాటిని జమాఖర్చుల పద్దులో జమ చేయాల్సి ఉంటుంది. నిజానికి షరతులతో కూడిన ఆధార ద్రవ్యదానాలు ఎక్కువగ వచ్చినప్పటికి వారి వారి బాధ్యతలను సక్రమంగానే నిర్వర్తించారు. నిజంగానే దేవాలయ లౌకిక కార్యనిర్వహణ విధానం హర్షించదగింది.

**(ఇంకా ఉంది)**

## మోసగాళ్ళు ఉన్నారు జాగ్రత్త

**రాష్ట్రంలోను, రాష్ట్రేతర ప్రాంతాల్లోను కొందరు వ్యక్తులు తాము తి.తి. దేవస్థానం ఏజెంట్ల మని, తిరుమల నుంచి శ్రీవారి ప్రసాదాలను, క్యాలండర్లను, ఆర్జితసేవ టిక్కెట్లను తెప్పించి ఇస్తా మని నమ్మించి అధిక మొత్తంలో ప్రజల నుంచి సొమ్ము వసూలు చేసి మోసం చేస్తున్నట్లు మా దృష్టికి వచ్చింది. ఇది పచ్చి మోసం తప్ప మరేం కాదు. తిరుమల శ్రీవారి భక్తులందరూ ఈ విషయా లను గమనించి మోసపోరా దని తెలియజేస్తున్నాము.**

- శ్రీవారి ప్రసాదాలు తిరుమలలో తప్ప మ రెక్కడా అమ్మబడవు.
- శ్రీవారి ప్రసాదాలను పోస్టులోగాని మరోవిధంగా గాని పంపడం జరగదు.
- శ్రీవారి ప్రసాదాలను అమ్మటానికి ఏజంట్లు ఎవ్వరూ లేరు.
- ఎవరైనా మీ వద్ద నుంచి శ్రీవారి ప్రసాదాలను తెప్పిస్తా మని డబ్బు వసూలు చేసి ఉంటే – వారినుంచి డబ్బు వాపసుతీసుకోండి. లేదా పోలీసులకు ఫిర్యాదు చేయండి. ఈ విషయం మీ స్నేహితులకు బంధువులకు తెలియ జేయండి.
- శ్రీవారి ఆర్జితసేవల టిక్కెట్లు తిరుమలలో ఆర్జితం ఆఫీసులో లభిస్తాయి. అలాకాక ముందుగా కూడా ఆ యా సేవకు తగినంత రుసుమును డి.డి. ద్వారా పంపి మీరే ఖరారు చేసుకోవచ్చు. (అయితే కనీసం రెండు నెలల ముందుగా మీరు తేదీ ఖరారు చేసుకొని డి.డి. పంపవలసి ఉంటుంది.)
- దళారీలను నమ్మకండి.
- తిరుమల తిరుపతులలో ఉన్నప్పుడు మీకు ఏదైనా ఇబ్బంది కలిగితే సమీపంలోని సంబంధిత తి.తి.దే. అధికారులను సంప్రదించండి.
- దూరప్రాంతాలవారు ఆ ప్రాంత సమీపంలోని తి.తి.దేవస్థానం సమాచార కేంద్రాన్నో, కల్యాణమండపాల్లోని అధికారులనో కలిసి అన్ని వివరాలు తెలుసుకోవచ్చు.

– ప్రధాన సంపాదకుడు

# అనంతపద్మనాభవ్రతం

డి.వి.రామచంద్రరావు

శ్రీ కృష్ణపరమాత్మ ప్రేరణతో పాండవులు వనవాసం చేయు నపుడు అనంతపద్మనాభ వ్రత మాచరించారు.

సృష్టి స్థితి లయకారకులలో స్థితికారకుడైన శ్రీమహా విష్ణువు పాలకడలిలో శేషశయ్యపై శయనించాడు. శ్రీ మహా విష్ణువు శయనించిన ఆదిశేషునికి అనంతుడు అని పేరు.





సమస్త భూభారాన్ని ఆదిశేషుడు మోస్తుంటా డని పురాణాలు చెప్పడం వల్ల, ప్రతి సంవత్సరం భాద్ర పద మాసంలో శుక్లపక్షచతుర్దశిరోజున, అనంత పద్మనాభవ్రతం ఆచరించడం హిందువుల ఆచారం.

కృతయుగంలో సుమంతుడు, దీక్ష అనే పుణ్యదంప తులు ఉండేవారు. వారిరువురికి పుట్టిన స్త్రీ సంతానమే శీల. కొంతకాలం తర్వాత దీక్ష చనిపోగానే, సవతితల్లిగా వచ్చిన కర్కశ అను ఆమె–శీలను కష్టపెట్ట నారంభించింది. ఒక రోజు సుమంతుని ఇంటికి వచ్చిన కౌండిన్య మహర్షి, శీలను చూచి సుమంతుని అంగీకారంతో వివాహం చేసుకొన్నాడు. భర్త వెంట వెళ్తున్న శీల, నదీతీరంలో అనంతపద్మనాభవ్రతమాచరించి, కంకణం కట్టుకొన్నది. దాని ఫలితంగా అష్టైశ్వర్యాలు సిద్ధిం చాయి. భర్త కోరిన తర్వాత వ్రతం గురించి వివరించగా, కోపో ద్రిక్తుడైన కౌండిన్య మహర్షి ఆ కంకణాన్ని తెంపిమంటలో పడేశాడు. ఫలితంగా ఆ రోజు నుండి దారిద్ర్యం అనుభవించ వలసి వచ్చింది. దీనికి కారణం భార్యచేతి కంకణం తెంపి వేయుటే అని గ్రహించి కౌండిన్యమహర్షి పశ్చాత్తాపపడసాగెను. అనంతునికోసం చుట్టుపక్కల వెదకుచుండగా ఒక వృద్ధ బ్రాహ్మణుడు కనపడి, కౌండిన్య మహర్షిని ఒక కొండ గుహలోకి తీసికొని వెళ్ళగా దివ్యసింహాసనంపై శంఖచక్రగదాధరుడై అనంతపద్మనాభుడు దర్శనమిచ్చాడు. క్షమించ మని ప్రాధేయ పడగా, ఇంటికి చేరిన తర్వాత 14 సంవత్సరాలు భాద్రపదశుద్ధ చతుర్దశి రోజున అనంతపద్మనాభవ్రతం ఆచరిస్తే కష్టాలన్నీ తొలగిపోతా యని కౌండిన్యునికి పరిహారంగా తెలియచేశాడు. అంతేకాదు తానే వృద్ధబ్రాహ్మణుని రూపంలో వచ్చా నని అంటాడు.

తెల్లవారుజామున నిద్రలేచి శుచిగా స్నానం చేసి పదునాలుగు పడగలు కల ఆదిశేషుని ప్రతిష్ఠించి, దగ్గరగా నున్న బావినుండీగానీ, చెరువునుండీ గానీ, నీరు తెచ్చి అనంతపద్మనాభస్వామికి షోడశోపచారాలు సలిపి, అష్టోత్తర పూజచేసి, ధూపదీప నైవేద్యాలు సమర్పించుట ఆచారం. ఇట్లు చేసిన సకల సంపదలు అష్టైశ్వర్యాలు, ఇహమందు సుఖం, పరమందు వైకుంఠప్రాప్తి లభిస్తాయి.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# ఆర్జిత సేవా టిక్కెట్లను అడ్వాన్స్ బుకింగ్, కరెంట్ బుకింగ్, ఇంటర్నెట్ బుకింగ్, ఈ-దర్శన్ బుకింగ్ ద్వారా భక్తులు పొందవచ్చు.

## అడ్వాన్స్ బుకింగ్

అడ్వాన్స్ బుకింగ్ మూడు నెలల కాలపరిమితి వరకే స్వీకరించబడుతుంది

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం | రోజు |
|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 | ప్రతి రోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 2 | ప్రతి రోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 | ప్రతి రోజు |
| ఊంజల్ సేవ | 200/- | 1 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 300/- | 1 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకార సేవ | 200/- | 1 | ప్రతి రోజు |
| విశేషపూజ | 600/- | 1 | సోమవారం |
| నిజపాదదర్శనం | 200/- | 1 | శుక్రవారం |

వ్యక్తిగతంగా డి.డి.లు స్వీకరించబడవు. పోస్టు/కొరియర్ ద్వారా పంపినవి మాత్రమే స్వీకరించబడతాయి. డి.డి.లు. "కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు" పేరుమీద తిరుమల/ తిరుపతిలలో చెల్లుబాటయ్యే విధంగా తీసి, 'సహాయ కార్యనిర్వహణాధికారి, ఆర్జితం ఆఫీసు, శ్రీ తిరుమల ఆలయం, తిరుమల-517504' చిరునామాకు పంపాలి.

పోస్టు/ కొరియర్ సేవల ద్వారా పంపే డి.డిలతో పాటు దరఖాస్తుకు భక్తుల గుర్తింపు వివరాలు తప్పనిసరి. పాన్‌కార్డు, రేషన్ కార్డు, ఓటరు గుర్తింపు కార్డు, పాస్‌పోర్టు, డ్రైవింగ్ లైసెన్స్ తదితరాలలో ఏ ఒక్కదానినైనా జతపరచి అడ్వాన్స్ బుకింగ్ ద్వారా ఆర్జిత సేవా టిక్కెట్లు

## ఇంటర్నెట్ బుకింగ్

దీనికి సంబంధించిన వివరాలను www.ttdsevaonline.com ద్వారా పొందవచ్చు

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం | రోజు |
|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 | ప్రతి రోజు |
| తోమాల | 220/- | 1 | మంగళ,బుధ,గురు |
| అర్చన | 220/- | 1 | మంగళ,బుధ,గురు |
| కల్యాణోత్సవం | 1000/- | 2 | ప్రతి రోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 300/- | 1 | ప్రతి రోజు |
| నిజపాదదర్శనం | 200/- | 1 | శుక్రవారం |
| విశేషపూజ | 600/- | 1 | సోమవారం |
| అష్టదళ పాదపద్మారాధన | 1250/- | 1 | మంగళవారం |

## కరెంట్ బుకింగ్

ఈ సేవల టిక్కెట్లను తిరుమల విజయాబాంక్‌లో బయోమెట్రిక్ విధానం ఒకరోజు ముందస్తుగా బుక్ చేసుకోవచ్చు

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం |
|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 |
| కల్యాణోత్సవం | 1000/- | 2 |
| నిజపాద దర్శనం | 200/- | 1 |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 |
| వసంతోత్సవం | 300/- | 1 |
| సహస్ర దీపాలంకార సేవ | 200/- | 1 |
| విశేషపూజ | 600/- | 1 |
| సహస్ర కలశాభిషేకం | 850/- | 1 |
| తిరుప్పావడ | 850/- | 1 |
| పూరాభిషేకం | 750/- | 1 |
| మేల్‌చాట్ వస్త్రం | 12250/- | 2 |
| అర్చన (మంగళ, బుధ, గురు) | 220/- | 1 |
| తోమాల (మంగళ, బుధ, గురు) | 220/- | 1 |

## ఈ-దర్శన్ బుకింగ్

ద్వారా లభించే ఆర్జితసేవలు

| సేవ/ ఉత్సవం పేరు | రుసుం | ప్రవేశం | రోజు |
|---|---|---|---|
| సుప్రభాతం | 120/- | 1 | ప్రతి రోజు |
| కల్యాణోత్సవం | 1000/- | 2 | ప్రతి రోజు |
| ఆర్జిత బ్రహ్మోత్సవం | 200/- | 1 | ప్రతి రోజు |
| ఊంజల్‌సేవ | 200/- | 1 | ప్రతి రోజు |
| వసంతోత్సవం | 300/- | 1 | ప్రతి రోజు |
| సహస్ర దీపాలంకారసేవ | 200/- | 1 | ప్రతి రోజు |
| నిజపాదదర్శనం | 200/- | 1 | శుక్రవారం |
| విశేషపూజ | 600/- | 1 | సోమవారం |
| అష్టదళ పాదపద్మారాధన | 1250/- | 1 | మంగళవారం |

**వివరాలకు-0877-2263589, 2263679**

## గ్రంథసమీక్ష

**శ్రీ వాగ్వైభవము:** నమ్మాళ్వార్ తిరువాయ్‌మొళికి ఆంధ్ర పద్యానువాదం; **అనువాదకురాలు: డా॥ పి.ఉమ; సైజు:** 1/8 డెమ్మీ; **పుటలు:** 22+770=792; **వెల:** రూ.300/-; **ప్రతులకు:** డా॥ పి.ఉమ, 9/16, 4వ వీథి, లక్ష్మీనగర్, నంగనల్లూరు-, చెన్నై-61.ఫోన్ - 044-22243616.

భగవదనుభవంకోసమే అవతరించిన మహాత్ములు ఆళ్వార్లు. వీళ్ళు భక్తిప్రపూర్ణులు, ప్రపన్నులు. ఆ ప్రపన్ను లందరికీ కూటస్థులు- శ్రీనమ్మాళ్వార్లు. నమ్మాళ్వార్లు 'నాలా యిర దివ్యప్రబంధ మనే పేరుతో ఆళ్వార్ల పాశురాల్ని నాల్గు వేలు సంకలనం చేశారు. ఇవి చతుర్వేదసారాలు. వీటిల్ని నాల్గుశీర్షికలుగా 1) తిరువిత్తమ్-100 పాశురాలు-ఋగ్వేదసారం 2) తిరువాశిరి యం-7 పాశురాలు- యజుర్వేదసారం 3) పెరియతిరువందాది-87 పాశురాలు- అధర్వణవేదసారం 4) తిరువాయ్‌మొళి 1102 పాశు రాలు- సామవేదసారం.

ప్రస్తుత శ్రీవాగ్వైభవం - శ్రీనమ్మాళ్వార్లు సాయిం చిన 'తిరువాయ్‌మొళికి' తెలుగు పద్యానువాదం. పాశురాన్ని భావవిస్తరణదృష్ట్యా సీసపద్యంలోకి అనువదించారు. తిరు వాయ్‌మొళిలో పదిశతకా లున్నాయి. ఒకశతకసంకలనా నికి 'పత్తు' అని పేరు. ప్రతి 'పత్తు'లో పదిదశకా లుం టాయి. ఒక్కొక్క దశకంలో 10 పాశురాలూ, ఫలశ్రుతిగా ఒక పాశురం - మొత్తం 11 ఉంటాయి. కాగా మొత్తం 1102 పాశురాలు 'తిరువాయ్‌మొళి'లో ఉన్నాయి.

నాలాయిరదివ్యప్రబంధంలో తిరువాయ్‌మొళికి విశిష్టస్థానం ఉంది. ఇందులో 1) స్వస్వరూపం 2) పర స్వరూపం 3) పురుషార్థ స్వరూపం 4) ఉపాయస్వరూపం 5) విరోధిస్వరూపం - అనే దివ్యోపదేశాత్మకమైన అర్థ పంచకం చక్కగా వివరించబడింది. భగవద్రామానుజుల అనంతరం 'తిరువాయ్‌మొళి'కి ఎన్నో వ్యాఖ్యానాలు వెలువ డ్డాయి. వాటిల్లో వైష్ణవశాఖాభేదం లేకుండా అందరూ అనుసరించే వివరణ 'ముప్ఫత్తి ఆరాయిరప్పటి' అనే వ్యాఖ్య. రచయిత తిరువదిపిళ్లై. దీనికే 'ఈటు' అని పేరు.

ఉత్కృష్టభావం, విలక్షణశైలి, శబ్దాలంకారఛందస్సు, ముక్తపదగ్రస్తరచనావిధానం - ఇలా వైవిధ్యభరితమైన పాశురాల్ని తమిళంనుంచీ - ఏ భాషలోకి అనువదించినా- మూలంలో ఉండే సొంపులు తేవడం అంతసులువు కాదు.

పాశురాల్లోని ఔన్నత్యాన్ని తెలుగువాళ్లకు అంద జేయా లనే సంకల్పంతో డా॥ఉమ- పద్యానువాదం-పద్యానికి భావం, ఒక్కొక్కదశకం కాగానే 'సూక్తిసారాంశం' అనే శీర్షికతో-ఆ దశకంలోని ప్రధానాంశాల్ని సంగ్రహంగా, సర ళంగా వచనరూపంలో అందించారు. ఈ విధానంవల్ల పద్యం చదివి అర్థంచేసుకోలేనివాళ్లు-భావాన్నీ, సూక్తిసారాం శాన్నీ భక్తిప్రపత్తుల్తో పఠించినా- 'తిరు వాయ్‌మొళి' విశిష్టత అనుభవానికి వచ్చే అవ కాశ ముంది. ఇప్పటికే గోదాదేవి సాయిం చిన 'నాచ్చియార్ తిరుమొళి'ని 'గోదాదేవి గీతమాలిక'గా తెలుగులోకి అనువదించి, అంతర్జాతీయ తమిళసంస్థద్వారా ముద్రించారు-ఉమ. అనువాదం దేశి చ్ఛందస్సులో జరిగింది.

పాశురాన్ని సీసంలోకి అనువదించడంలో పద్య విస్తృతిరీత్యా మూలభావాన్ని తగినరీతిలో విస్తరించాల్సి వచ్చిం దని ముందే రచయిత్రి విన్నవించారు. 'తిరువాయ్ మొళి'కి 'శ్రీవాగ్వైభవం' అనే అనువాదనామం- చాలా వైభవంగా ఉంది.

భావం, సూక్తిసారాంశం - సరళగ్రాంథికంలో ఉన్నాయి. అధ్యాపకవృత్తి - ఆధ్యాత్మిక ప్రవృత్తి రైలు పట్టా ల్లాగా సమంగా సాగినజీవితం కనుక ఉమగారు అను వాదంలోనూ, భావవివరణలోనూ - క్లిష్టతను పరిహరించి, సరళతకు ప్రాముఖ్య మిచ్చారు. ఏకధాటిగా 1102 పాశు రాల్ని తెలుగులో-సీసపద్యాల్లో-భావ, సూక్తిసారాంశాల్తో- మూలాతిక్రమణం లేకుండా కొంతవివరణాత్మకం గానూ- అనువాదం సాగింది.

తెలుగు పాఠకలోకానికి "శ్రీవాగ్వైభవం" నిజంగా శ్రీవాగ్వైభవమే! ఈమె లేఖిని ఇంకా ఇలాంటి పారమార్థిక గ్రంథసేవ కావించి, ధన్యమూ, కృతకృత్యమూ కావా లని - ఆకాంక్షిస్తాం. **డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య.**

# శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం, నారాయణవనం

మన దేవాలయాలు

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

శ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామివారు, శ్రీ పద్మావతీ అమ్మవారు నెలకొని ఉన్న దివ్యక్షేత్రం నారాయణవనం. ఆకాశరాజు కుమార్తె శ్రీపద్మావతీదేవిని శ్రీనివాసుడు పరిణయ మాడిన పరమపవిత్రస్థలం ఇది.

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీనివాసుని దివ్యక్షేత్రానికి 34 కి.మీ దూరంలో తిరుపతి-మద్రాసు మార్గంలో పుత్తూరుకు 5 కి.మీ. దూరంలో వెలసిన దివ్యక్షేత్రం నారాయణవనం. దీని అసలు పేరు నారాయణపురం. శ్రీనివాసుడు వేటకై వచ్చి నారాయణవనోద్యానంలో చెలికత్తెలతో విహరించుచున్న పద్మావతిని చూచి, మోహించి వివాహం చేసుకున్నాడు. కాబట్టి దీనికి నారాయణపురమని పేరొచ్చింది. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు పద్మావతిని వివాహమాడుటకై వరునిగా ఆవిర్భవించినందు వల్ల ఈ క్షేత్రం నారాయణవనంగా నేటికీ పిలువబడుచున్నది.

ఈ ఆలయప్రాభవ, ప్రాశస్త్యాలగురించి శ్రీ వేంకటాచలమాహాత్మ్యంలో వివరించబడింది. ఇక్కడి ఆలయాన్ని ఆకాశ రాజు కట్టించినట్లు భక్తుల విశ్వాసం. శిథిలమైన ఆలయాన్ని క్రీ.శ. 1245వ సంవత్సరములో అప్పుడు ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న శ్రీ వీరనరసింగ దేవయాదవరాయలు (1205-1245) జీర్ణోద్ధరణ చేశారు. పెనుగొండ వీరప్పన్న నారాయణ వరంలో శ్రీ కల్యాణవేంకటేశ్వర స్వామివారి ఆలయంను క్రీ.శ. 1541-42 సం॥ల కాలంలో పునఃనిర్మించినట్లు పేర్కొనబడినది. 25-3-1943లో ఆల్వార్(రాజస్థాన్) రాజావారి కార్య నిర్వాహకుడు సూరజమల్ కరవాచే జీర్ణోద్ధారం చేయబడింది.

1967వ సం॥ ఏప్రిల్ నెల 29వ తేదీన ఈ ఆలయం తిరుమల తిరుపతి దేవస్థానముల ఆధీనంలోనికి వచ్చింది.

**శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి -** ఇక్కడ అర్చామూర్తి శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామివారు. ఆయన సకలాభీష్టఫలప్రదుడు. స్వామివారు తూర్పు ముఖంగా ఉన్నారు. వక్షఃస్థలంలో లక్ష్మీదేవి విరాజిల్లుతున్నది. స్వామివారు నడుముకు దశావతారవడ్డాణం ధరించి ఉన్నారు. భుజంపై సాలగ్రామమాల ధరించి- చక్రం, ఖడ్గం ధరించి ఉన్నారు. చేతిలో వేటఖడ్గం ఉన్నది.

**శ్రీ పద్మావతీ అమ్మవారు -** ఆకాశరాజు యజ్ఞంకొరకు భూమి దున్నుచుండగా ఒకపేటికయందు పద్మములో దొరికింది కాబట్టి ఈమెకు పద్మిని, పద్మావతి అని పేర్లు. స్కాందపురాణం నందు ఈమెపేరు పద్మినిగాను, భవిష్యోత్తరపురాణంలో పద్మావతిగాను చెప్పబడినది. ఈమెను 'పద్మవల్లి' అనికూడ పిలుస్తారు. ఇక్కడ అమ్మవారు మరొకప్రత్యేక ఆలయంలో నెలకొని ఉన్నారు. అమ్మవారిఆలయవిమానమును విష్ణుశ్చంద్ర విమానం అంటారు. ప్రధాన ఆలయానికి నైఋతి దిశయందు అమ్మవారి సన్నిధి ఉన్నది. అమ్మవారి ఆలయ ముఖద్వారంవద్ద కుడివైపున సరస్వతీదేవి, ఎడమవైపున కల్పవృక్షం, కామధేనువులు దర్శనమిస్తాయి.

శ్రీ పద్మావతీఅమ్మవారు తూర్పుముఖంగా పద్మపీఠంపై ఆసీనురాలై చతుర్భుజంగా దర్శనమిస్తుంది. పూర్వం వేదవతియే పద్మావతిగా జన్మించినట్లు శ్రీ వేంకటాచలమాహాత్మ్యం పేర్కొన్నది. ఆలయంచుట్టూ ప్రదక్షిణమార్గం ఉన్నది. దానిచుట్టూ మరొక ప్రాకారం కలదు. బయట మహాప్రదక్షిణమార్గం ఉన్నది.

ఆలయవాయవ్యదిశలో మనకు ఆండాళమ్మ (గోదాదేవి) ఆలయం దర్శనమిస్తుంది. ఆలయఉత్తరద్వారం ప్రతి సంవత్సరం వైకుంఠద్వాదశినాడు తెరుస్తారు.

**కోదండరామస్వామి, రంగనాథస్వామి -** ఈశాన్యంవైపు ఉన్న మందిరంలో శ్రీరంగనాథస్వామివారు, శ్రీకోదండరామస్వామివారు వేంచేసి ఉన్నారు. ప్రక్కనే ఉన్నమండపంలో విష్వక్సేనులు, తిరుక్కచ్చినంబి, తిరుమంగై ఆళ్వారు, మళవాళముని విగ్రహాలున్నాయి.

శ్రీ కల్యాణ వేంకటేశ్వర స్వామివారి ఆలయం తూర్పు ముఖంగా ఉంది. రెండు పెద్దరాతిగడపలు దాటి లోపలకు వెళ్ళితే మనకు రెండువైపుల వాహనమండపాలు దర్శన మిస్తాయి. ఆగ్నేయదిశలో వంటశాల కలదు. అటునుండి దక్షిణ దిశగా వెళ్ళితే ఒక పెద్దమండపంలో పన్నిద్దరాళ్వారులు కొలువు దీరి ఉండడం చూడవచ్చు.

ప్రధానాలయానికి ముందు భాగాన పెద్ద ధ్వజస్తంభం కన బడుతుంది. దానికి పూర్తిగా రాగితొడుగు ఉన్నది. దాని ముందు బలిపీఠం ఉంది. ధ్వజస్తంభమునకు ఆనుకొని ఉన్న గరుడ మండపమందు గరుడఆళ్వారు స్వామికి అభిముఖంగా సన్నిధి చేసిఉన్నారు.

**ఆలయగోపురాలు -** ఆలయ ప్రధానరాజగోపురాన్ని శ్రీకృష్ణ దేవరాయలు కట్టించారు. ఇది ఏడుఅంతస్తులతో 150 అడు గుల ఎత్తున శోభాయమానంగా కనబడుతుంది. రెండవ గోపు రాన్ని వీరనరసింగ దేవయాదవరాయలు కట్టించారు. ఇది మూడుఅంతస్తులలో ఐదుకలశాలతో విరాజిల్లుతున్నది. ఆల యం నాలుగుమూలలా బలిపీఠాలున్నాయి.

**పంచబేరాలు -** బేర మనగా మూర్తి, విగ్రహం అని అర్థం. స్వామివారిఆలయంలో పంచబేరాలు కలవు. ఇంకను అండా ళమ్మ విగ్రహం, శ్రీభక్తాంజనేయస్వామివిగ్రహం బహుసుం దరంగా దర్శనమిస్తాయి.

**ఉత్సవాలు -** ఈ దేవాలయంలో వైఖానసాగమోక్త ప్రకారముగ నిత్యోత్సవ, వారోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలు జరుగు తున్నాయి. ఈ ఉత్సవాలన్నీ సౌరమానంప్రకారం జరుగు తాయి. సంకల్పంకూడ సౌరమానం ప్రకారమే చెబుతారు. స్వామివారికి ప్రతినిత్యం సుప్రభాత సేవ జరుగుతుంది. అలాగే అర్చన, నైవేద్యం, ఏకాంతసేవ ప్రతిరోజు జరుగుతాయి. శుక్ర వారం అభిషేకం నడుస్తుంది. కల్యాణోత్సవం (ఆర్జితం) తెప్పో త్సవం, బ్రహ్మోత్సవం, పవిత్రోత్సవాలు ఘనంగా జరుగుతాయి.

ప్రధానాలయానికి ఎదురుగా ఆంజనేయస్వామివారి ఆలయం ఉన్నది. దానికి దక్షిణంగా పరాశరేశ్వరస్వామివారి ఆలయం ఉన్నది. చిత్రాంగి కోటకు వెళ్ళేదారిలో మొట్టమొదట శ్రీవీరభద్రస్వామివారిఆలయం దర్శనమిస్తుంది. చిత్రాంగి కోట ముఖద్వారంలో మనకు శక్తివినాయకస్వామివారి ఆలయం దర్శనమిస్తుంది.

**శ్రీ అగస్త్యేశ్వరస్వామివారి ఆలయం -** ఇది పురాణప్రసిద్ధి కల దేవాలయం. ఉద్యానవనంలో శ్రీనివాసుని దర్శించిన పద్మావతి మోహవివశురాలౌతుంది. ఆమెతల్లిదండ్రులు దైవజ్ఞులను ప్రశ్నించగా వారు అగస్త్యేశ్వరస్వామివారికి అభిషేకం చేయించ మని, అంతా శుభమే జరుగుతుం దని చెబుతారు. అప్పుడు ఆకాశరాజు ఈ ఆలయంలో అగస్త్యేశ్వరస్వామివారికి అభిషేకం, పూజలు చేయిస్తాడు. ఈ విషయం స్కాందపురాణంలోని శ్రీ వేంకటాచలమాహాత్మ్యంలో పేర్కొనబడింది. ఈ అగస్త్యేశ్వర స్వామి ఆకాశరాజు ఇలువేలు పని చెబుతారు. అరుణానది దక్షిణ తీరంలో వెలసిన మరొక ముఖ్యమైన ఆలయం అవనాక్షమ్మ దేవాలయం. ఈమె గ్రామదేవత. ఆదిపరాశక్తి అవనాక్షమ్మ రూపంలో ఇక్కడ వెలసింది. అష్టభుజములతో ఈమె అతి మనోహరంగా దర్శనమిస్తుంది. ఈమె శక్తిస్వరూపిణి.

**స్థలపురాణం -** బ్రహ్మదేవుని ఆజ్ఞమేరకు కాళికాదేవి ఆకాశరాజు కోటలో స్వయంభువుగా వెలసింది. అది చిన్న విగ్రహం. అగస్త్య మునీంద్రులు అమ్మవారికి “ఆమ్నాయాక్షి” అని నామకరణం చేశారు. ‘ఆమ్నాయ’ మనగా ‘వేదం’ అని అర్థం. ‘అక్షి’ అనగా నేత్రం. ఆమ్నాయాక్షి అంటే వేదములే నేత్రములుగా కల దని అర్థం. ఈమెకు అవినాశినీదేవి అనికూడా మరొక పేరు ఉన్నది. ‘ఆమ్నాయాక్షి’ అనే పేరు కాలక్రమంలో ‘అవనాక్షి’గా మారింది. అమ్మవారి నిలువెత్తు విగ్రహం అతిమనోహరంగా, అత్యంతాకర్ష ణీయంగా దర్శనమిస్తుంది. శిరస్సుపై అగ్నిజ్వాల మకుటం, మకుటంమధ్య ఓ రాక్షసకపాలం, మకుటానికి ఇరు వైపుల సూర్యచంద్రులు ఉన్నారు. అమ్మవారు అష్టభుజాలతో శోభిల్లుతు న్నారు. అత్యంతాకర్షణీయమైన ఈ ఆలయమును దర్శించిన ఆదిశంకరాచార్యులవారు ఇక్కడ తామ్రపత్రంపై శ్రీచక్రాన్ని ప్రతి ష్ఠించారు.

**ఇతర ఆలయాలు –** నారాయణవనంలో ఆలయ మెదురుగా ఆంజనేయస్వామి ఆలయ మున్నది. వీరభద్రస్వామి, శక్తివినా యకుడు, అగస్త్యేశ్వరస్వామి, అవనాక్షమ్మ (కాళికాదేవి) ఆల యాలున్నాయి.

బాలప్రబోధం



# సత్యకాముడు

డా॥ చించాపట్టణం శ్రీరంగాచార్యులు

**ఛాం**దోగ్యోపనిషత్తులో సత్యకామునికథ ఉన్నది. సత్యకాముడు సత్యానికి ప్రతీక. ఆయన ఒకనాటి ప్రాతఃకాలమున తనతల్లివద్దకు వెళ్ళి "అమ్మా! నేను గురువువద్దకు వెళ్ళి, బ్రహ్మచర్యా న్ననుసరించి, శుశ్రూష చేయా లని భావిస్తున్నాను. నా గోత్ర వంశ వృత్తాంతము లేవో తెలియజేయి?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్న తనతల్లి నెంత కలవరపెట్టునో అతనికి తెలీదు. అయినప్పటికీ ఆమె తనను తాను సంభాళించుకొన్నది. తన కుమారుని జ్ఞానసముపార్జనాసక్తిని గ్రహించింది. అందువల్ల, ఆమె "నాయనా! వాస్తవంగా నీ గోత్ర మేదో నాకు తెలీదు. ప్రాయమున ఉన్నప్పుడు, ఆచ్చటచ్చట యజమానుల ఇండ్లలో పరిచారికనై మెలగి, నిన్ను కన్నాను. అందువల్ల నా కెలా తెలుస్తుంది? కానీ, ఒక్క విషయంమాత్రం నిజం. నీ పేరు సత్యకాముడు. నీ తల్లినైన నాపేరు జాబాల. ఆ కారణంగా నీ గురువుతో నీపేరు 'సత్యకామజాబాల' అని చెప్పమని సలహా ఇచ్చింది. అందుకు సమ్మతించిన సత్యకాముడు, గురువును వెదకుతూవెళ్ళి, హారిద్రుమతగౌతము డనే మహాముని జ్ఞాన సంపదనుగురించి విని, అతని దగ్గరకు వెళ్ళాడు.

సాష్టాంగపడి మ్రొక్కినిలిచిన సత్యకాముడు గురువుతో తను వచ్చినపనిని విన్నవించాడు. వాడుక ననుసరించి గౌతమముని "వత్సా! నీ గోత్ర మేమి?"అని ప్రశ్నించాడు. అందుకు సత్యకాముడు "మహాత్మా! నే నిక్కడికి బయలుదేరి వచ్చే ముందు నా తల్లిని ఈ విషయమడిగితిని" అని తన తల్లితో జరిగిన సంభాషణాదివివరాలను విశదీకరించి చెప్పాడు. చివరకు "అయ్యా! అందువల్ల నేను 'సత్యకామజాబాల' అనువాడను" అని పలికాడు. అతని సత్యసంధతకు అబ్బురపడిన గౌతముడు అతణ్ణి మెచ్చు కొని, వెంటనే సమిధలు తెప్పించి, అగ్నిని వ్రేల్చి, బ్రహ్మచర్యవ్రతదీక్ష నిచ్చి, తన ఆశ్రమంలో చేర్చుకొన్నాడు.

ఇ ట్లుండగా, ఒకరోజు గౌతముడు సత్యకాముని పిలిచి, ఆహారంలేక బక్కచిక్కి బలహీనమైన నాలుగువందల ఆవుల నప్పగించి, అడవికి తోలుకొని వెళ్ళి కాపాడమని చెప్పాడు. అంతేకాక, అవి వేయిసంఖ్యగల గోవుల మందగా అభివృద్ధి చెందేవరకు తన వద్దకు తిరిగిరావ ద్దని ఆజ్ఞాపించాడు. సత్యకాముడు గురుదేవునిఆజ్ఞను శిరసావహించి, ఆవులను అడవికి తోలుకొని వెళ్ళెను. అడవిలో ఆవులమందను కాపాడుతూ నివసించి ఉన్నప్పటికీ, అతని హృదయంలో సత్యాన్వేషణ భావాలు క్రమ క్రమంగా పెంపొందసాగాయి. అడవిలోని ప్రతి వస్తువుతో అతనికి చెలిమి ఏర్పడింది.

ప్రకృతిమాత ఒడిలో పరవశించి స్వేచ్ఛగా విహరించే పక్షులపాటలలో, కాలచక్రభ్రమణా న్ననుసరించి, ఒకదాని తర్వాత మరొకటి అనుసరించి వచ్చే ఆరుఋతువుల పరిక్రమణలో, తనచుట్టూ ఆవరించి ఉన్న జీవితసత్యములోని "పుట్టుట, పెరుగుట, చచ్చుట' అనువానిలో పరబ్రహ్మమును గూర్చి అతడు తెలుసుకొన్నాడు. అతనిమనస్సు నెమ్మదిగా తాకిడిలో, వినికిడిలో, మాటలలో, చూపులో, రుచిలో, గుండె కొట్టుకోవడం, జాగ్రదవస్థలో, స్వప్నావస్థలో పరబ్రహ్మాన్ని తెలుసుకొన్నాడు.

ఆ తర్వాత, కొంతకాలానికి, ఒక రోజు మందలోని పెద్దగో వొకటి సత్యకామునివద్దకు చేరి "ఇప్పుడు మేము సహస్రాధికసంఖ్యలో అభివృద్ధి చెందాము. మమ్ము ఆశ్రమానికి తోలుకొని పోవలసింది" అని విన్నవించింది. వెంటనే అంచెలంచెలుగా ఆవులమందలు ఆశ్రమానికి చేరుకున్నాయి.

సత్యకాముడు గురువుచెంత కరిగి, సగౌరవంగా సాష్టాంగపడి మ్రొక్కి నిలిచాడు. బహుకాలానికి విధినిర్వహణ

## ఆర్జితసేవా గృహస్థులకు సూచనలు

- ★ సేవ ఉత్సవంలో పాల్గొనే గృహస్థు తప్పనిసరిగా ధోవతి, ఉత్తరీయం ధరించాలి. వారు వైకుంఠం క్యూ ద్వారా మాత్రమే చాలాముందుగా ప్రవేశించాలి.
- ★ గృహస్థులు తమకు వచ్చే దధ్యోదనం, పులిహోర మున్నగు అన్న ప్రసాదాలను పరిమితిగా తీసుకోవచ్చు. మిగిలిన ప్రసాదాలు వారి కోరిక మేరకు ఉచితంగా యాత్రికులకు పంచుతారు.
- ★ ఆణివార ఆస్థానం,పుష్పయాగం,వార్షిక వసంతోత్సవం, వార్షిక బ్రహ్మోత్సవం, ఉగాది ఆస్థానం, మకర సంక్రాంతి మున్నగు విశేష ఉత్సవాలు జరిగే రోజుల్లో కొన్ని సేవలు రద్దు చేస్తారు. ఆయా తేదీలు తి.తి.దేవస్థానం క్యాలెండరు, పంచాంగం ద్వారా తెలుసుకోవచ్చు. ఆ యా ఉత్సవాల రోజుల్లో ఆర్జిత సేవా టికెట్లు అమ్మరు.
- ★ సేవా టికెట్టులో వివరాలు గృహస్థు క్షుణ్ణంగా చదివి తెలుసుకోవాలి. ఏవైన ఇబ్బందులు ఉంటే **"ఆర్జితం ఆఫీసు లేదా విచారణ కేంద్రం"** సహకారంకోసం సంప్రదించవచ్చు.
- ★ శ్రీవారిదర్శనంలో గృహస్థులు సంప్రదాయ దుస్తులు ధరించాలి. ఆలయ ఉత్సవాలకోసం వైకుంఠం క్యూలో ప్రవేశించే సమయాలను మారుస్తూ కొన్నివేళల్లో దేవస్థానం చేస్తున్న ప్రకటనలను గృహస్థులు జాగ్రత్తగా వినాలి.

**ఆర్జితసేవ కౌంటరు –** ఫోన్ : 0877 – 2263277 మరియు 0877 – 2263679

సమర్థుడై తిరిగి వచ్చిన తనప్రియశిష్యుని చూచి మహర్షి మిక్కిలి సంతోషించాడు.

సంతోషతరంగితాశ్చర్యంతో గౌతముడు సత్యకాముని జ్ఞానవిలసితమైన ముఖాన్ని తదేకదృష్టితో వీక్షించి, "ప్రియ శిష్యా! సత్యకామా! నీవు పరబ్రహ్మను తెలుసుకొన్నవాడిగా కనపడుతున్నావు. నీకు పరబ్రహ్మన్నిగూర్చి ప్రబోధించిన వాళ్లెవరు? భయంకరమైన అడవిలో కర్ణకఠోరమైన కీచురాళ్ళ ధ్వని, మూగజీవులు తప్ప మ రెవ్వరూ నీ వెంట లేరే? మానవేతరమైన ప్రతినిధుల ద్వారా నీ కీజ్ఞాన ప్రబోధ మెట్లు జరిగింది?" అని ప్రశ్నించాడు.

అందుకు వినయవినమిత గాత్రుడై, మిక్కిలి అణకువతో సత్యకాము డీవిధంగా ప్రత్యుత్తరమిచ్చాడు. "అయ్యా! తమబోటి జ్ఞానసంపన్నులైన మహామహుల ద్వారానే నేనీమిక్కిలి రహస్య మైన జ్ఞానమును బడయదలచియున్నాను. యథార్థమైన జ్ఞానసంపద తమవంటి తపోధనులైన సదాచారవర్యులచెంతనే పొందవలసినట్టి దని నేను వినియున్నాను. అందుచేత, తమ దయవల్ల ప్రకృతిద్వారా సూచ్యమానంగా అందజేయబడిన జ్ఞానసంపదను పరిపూర్ణంగా ప్రబోధించి, నన్నాశీర్వదించి, అనుగ్రహించవలసిందిగా ప్రార్థిస్తున్నాను" అని సాగిలబడిమొక్కాడు. అప్పటి కిక తన ప్రియశిష్యుడైన సత్యకాముడు తత్త్వజ్ఞానాన్ని బడయుటకు పరిణతవయస్కుడై సంసిద్ధంగా ఉన్నా డని మహర్షి గ్రహించాడు.

మరికొంతకాలం సత్యకాముడు ఋష్యాశ్రమంలో నివసించాడు. అప్పటికే సత్యకాము డెంతో నేర్చుకొని ఉన్నందున, మహర్షి తన అనుభవపూర్వకమైన ప్రబోధంద్వారా అతణ్ణి జ్ఞానప్రపూర్ణుణ్ణి చేశాడు. ఈ విధంగా సత్యకాముడు తన చిరవాంఛితమైన పరబ్రహ్మపరిపూర్ణజ్ఞానము నందుటలో కృతకృత్యు డయ్యాడు.

# వార్తాలహరి

## తిరుచ్చిలో శ్రీనివాసకల్యాణం

**2**011, జూన్ 26వ తేది ఆదివారంనాడు తమిళ నాడులోని తిరుచ్చిలో శ్రీనివాసకల్యాణం అత్యంతవైభవంగా జరిగింది. భక్తుల గోవిందనామస్మరణలమధ్య తిరుచ్చిలోని నేషనల్ కాలేజ్ గ్రౌండ్స్‌లో తిరుమల తిరుపతిదేవస్థానం ఆధ్వర్యంలో నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో తి.తి.దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్., పాల్గొని ప్రసంగిస్తూ సనాతనహైందవధర్మాన్ని, దైవభక్తిని పెంపొందించడానికి తి.తి.దే. శ్రీనివాసకల్యాణోత్సవాలను దేశంలోని వివిధప్రాంతాల్లో లక్షలాదిమంది భక్తులమధ్య నిర్వహిస్తోం దన్నారు. ఇప్పటికే ఈ కార్యక్రమాన్ని దేశవ్యాప్తంగా 80 ప్రాంతాల్లో నిర్వహించడం జరిగిం దన్నారు. ఈ కార్యక్రమంలో భక్తులు విరివిగా పాల్గొని శ్రీనివాసునికల్యాణం తిలకించారు.

## కల్యాణ వెంకన్నకు లక్ష్మీహారం

**తి**రుమల తిరుపతి దేవస్థానం అనుబంధ ఆలయమైన శ్రీనివాసమంగాపురంలోని కల్యాణవేంకటేశ్వరస్వామివారికి కడప జిల్లా రైల్వేకోడూరుకు చెందిన ఒక భక్తుడు 25 లక్షల రూపాయలతో సుమారుగా 42 కేజీలబరువుకలిగియున్న వెండితో చేసిన లక్ష్మీహారాన్ని విరాళంగా అందించాడు. ఈ హారంలో మొత్తం 18 లక్ష్మీడాలర్లతో పాటు అతిపెద్ద గజలక్ష్మి డాలరును హారంకిందిభాగంలో అమర్చడం జరిగింది.

## వైభవంగా జరిగిన శ్రీవారి ఆణివర ఆస్థానం

**తి**రుమల శ్రీవారి ఆలయంలో 2011, జూలై 15వ తేదిన సాలకట్ల ఆణివరఆస్థానాన్ని శాస్త్రోక్తంగా నిర్వహించారు. తమిళుల కాలమాన ప్రకారం ఆణిమాసం చివరిరోజున ఈ ఉత్సవం నిర్వహించడం ఆనవాయితీగా వస్తోంది.

ఆణివరఆస్థానంలో భాగంగా ఆలయ పెద్దజియ్యరు, చిన్నజియ్యరు, తి.తి.దే. కార్యనిర్వహణాధికారిగారికి 'లచ్చన' అను తాళపు చెవిగుత్తిని వరుసక్రమంలో అందించి హారతి, చందన, తాంబూల తీర్థ శఠారి మర్యాదలు చేశారు. తర్వాత ఆ తాళపు చెవిని శ్రీవారి పాదాల చెంత ఉంచారు. ఈ సంద ర్భంగా భక్తులవద్దనుంచి రూపాయి చొప్పున వసూలు చేసి 'రూపాయి హారతి' ఇప్పించారు. ఆ నగదును తి.తి.దే. ఖజానాలో జమ చేశారు. ఈ సందర్భంగా ఉదయం ఉత్సవ మూర్తులను తిరుమాడవీథుల్లో ఊరేగించారు.

అదేరోజు సాయంత్రం ఆణివరఆస్థానాన్ని పురస్క రించుకొని పుష్పపల్లకిలో శ్రీ, భూ సమేత మలయప్పస్వామి వారిని తిరుమాడవీథుల్లో ఊరేగించారు. ఈ కార్యక్రమాల్లో పుష్పపల్లకిముందు భజనబృందాలు పాల్గొని భక్తులను విశేషంగా ఆకర్షించాయి.

## భక్తుల సేవకు కొత్త అన్నదాన భవన సముదాయం

**మా**తృశ్రీ తరిగొండ వెంగమాంబ నిత్యాన్న దాన నూతన భవన సముదాయాన్ని 07-07-2011న భారత రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభాదేవిసింగ్‌పాటిల్‌గారు ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రగవర్నర్ శ్రీ నరసింహన్, ముఖ్యమంత్రి శ్రీ నల్లారి కిరణ్ కుమార్‌రెడ్డి, ఇతర మంత్రులు, తి.తి.దే. సాధికారికమండలి అధ్యక్షులు శ్రీ జె. సత్యనారాయణ, తి.తి.దే. కార్యనిర్వహణాధికారి శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, తదితర ఉన్నతాధికారులు పాల్గొన్నారు.

రాజూ వేగేశ్న ఫౌండేషన్ సంస్థ అధినేత అనంత కోటి రాజు రూ.20 కోట్లు, పెన్నా సిమెంట్ అధినేత ప్రతాప్ రెడ్డి రూ.5 కోట్లతో పాటు తి.తి.దే. కలిపి రూ.35 కోట్లతో ఈ కొత్త అన్నదానం భవన సముదాయాన్ని సువిశాలంగా, అత్యాధు నిక సౌకర్యాలతో నిర్మించారు. ఈ నిత్యాన్నదాన నూతన భవన సముదాయం ఆసియా స్థాయిలో అరుదైన రికార్డు సాధించింది.

1985, ఏప్రిల్ 6న శ్రీవారి నిత్యాన్న దాన ట్రస్టును నెలకొల్పారు. రోజుకు 2,000 మందికి అన్నదానంతో ప్రారంభమైన ఈ ట్రస్టు 26 ఏండ్ల పాటు మహాయజ్ఞంలా కొనసాగుతూ ప్రస్తుతం 70,000 మందికి పెరిగింది.

పెరుగుతున్న భక్తులసంఖ్య దృష్ట్యా రోజుకు లక్షమందికి భోజనమందించే విధంగా ఏర్పాట్లు చేశారు. శ్రీవారిసేవలో తరించిన వెంగమాంబ సేవలకు గుర్తుగా ఈ అన్నదాన సము దాయానికి 'మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ నిత్యాన్నదాన భవన సముదాయం, తి.తి.దే.'గా పేరుపెట్టారు.

ఈ కూపను కత్తరించండి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి



# సప్తగిరి

(ఆధ్యాత్మిక మాసపత్రిక)

## చందా నమోదు పత్రము

1. పేరు మరియు చిరునామా :
(విడి విడి అక్షరాలలో అర్థమయ్యేలా వ్రాయండి )
______________________
______________________
______________________
______________________
(పిన్‌కోడ్ తప్పని సరి) ☐☐☐☐☐☐

2. కావలసిన భాష : ☐ తెలుగు ☐ తమిళం ☐ కన్నడం ☐ హిందీ ☐ ఇంగ్లీషు

3. సంవత్సర/జీవిత చందా : ☐ రూ. 60/- ☐ రూ. 500/-

4. చందా పునరుద్ధరణ :
(అ) చందా నెంబరు :
(ఆ) భాష :

5. చెల్లించిన మొత్తం :
డి.డి.నెం. : తేది :
(చెక్కులు స్వీకరించబడవు)

ప్రదేశము :

తేది : చందాదారుని సంతకము

## మోసపోకండి!

మన రాష్ట్రంలోని కొన్ని నగరాలలో
కొందరు వ్యక్తులు అనధికారికంగా
**సప్తగిరి మాసపత్రికకు**
చందాల రూపంలో
అధిక మొత్తాలు వసూలు చేస్తున్నారని,
తద్వారా శ్రీవారి దర్శనం చేయిస్తా మని,
నమ్మిస్తున్నారని తెలిసింది.
అలాంటి వారిమాటలకు మోసపోకండి.
సప్తగిరి చందాకు, శ్రీవారి దర్శనానికి
మరియు
ప్రసాదాలకు ఎటువంటి సంబంధం లేదు.
చందా మీరు నేరుగా
"ప్రధాన సంపాదకుడు, సప్తగిరి,
తి.తి.దేవస్థానం, తిరుపతి"
వారికి పంపించాలి. (లేదా)
తిరుపతిలోని శ్రీనివాసం యాత్రికుల
వసతి సముదాయంలో
కూడా చందా కట్టవచ్చు.
సప్తగిరికి చందాలు వసూలు చేయుటకు
దేవస్థానం బయటి వ్యక్తులను
ఎవరినీ నియమించలేదు.

**అధిక మొత్తాలు చెల్లించకండి!**
**వారి మాటలకు మోసపోకండి!!**

సంప్రదించండి...!
సప్తగిరి చందాల విచారణకు
**0877 - 2264359**
**0877 - 2264543**

☛ సప్తగిరి సంవత్సరచందా రూ.60/-, జీవితచందా రూ.500/-లు; డి.డి.ని **'చీఫ్ ఎడిటర్, 'సప్తగిరి', తి.తి.దే., తిరుపతి'** వారి పేరున తీయాలి.

☛ సప్తగిరిచందాదారులుగా చేరదలచుకొన్నవారు/ తమచందాను పునరుద్ధరించుకోదలచినవారు ఈ కూపనులో గాని లేక తెల్లకాగితములోగాని పైన పేర్కొన్న విధముగా వివరములు వ్రాసి పంపవచ్చును. క్రింద ప్రచురించిన చిరునామాను మాత్రమే సంప్రదించండి. **తి.తి.దే సంపాదక కార్యాలయం, తిరుపతికి తప్ప మీరు ఎవరి దగ్గర డబ్బులు కట్టి మోసపోకండి.**

☛ మనిఆర్డరు పంపువారు అందులోనే మీ యొక్క చందావివరాలు వ్రాసి ఈ క్రింది చిరునామాకు పంపించాలి.

☛ మా చిరునామా "**ప్రధాన సంపాదకుడు, సప్తగిరి కార్యాలయం, టి.టి.డి.ప్రెస్ కాంపౌండ్, కె.టి.రోడ్డు, తిరుపతి- 517 083**".

Edited and published on behalf of T.T. Devasthanams by **C. Saila Kumar,** M.A., Chief Editor, T.T.D. and printed at T.T.D. Press by **M. Kartik,** M.A., L.P.T., Manager, T.T.D. Press, Tirupati - 517 083.